# చిన్న మనవి

నవగ్రహాల ప్రభావం వలన విశాల ప్రపంచంలోని జీవుల జీవన గమనం ఉంటుందని, ఆయా సంఘటనలు జరుగుతుంటాయని మనకు తెలుసు. గ్రహాల స్థానాలను బట్టి ప్రపంచ వ్యాప్తంగా జరిగే సంఘటనలను ముందుగానే తెలిపిన జ్యోతిష శాస్త్రజ్ఞులు మనకు తెలుసు. జ్యోతిష శాస్త్రంలో అనుభవం కలిగి ఉంటే మన జాతక చక్రం వేసి, దానిని పరిశీలించుటద్వారా ఆయా సమయాలలో మనకు జరిగే లాభనష్టాలను, శుభా శుభములను తెలునుకోవచ్చును, అయితే మనకు అశుభం కలగబోతున్నదని తెలిసి, మిన్నకుండటం ఎంతవరకు సబబు? జాతక చక్రం చూసి "రాబోయే కాలంలో మీకు ఫలానా అశుభం జరగ బోతున్నదని" చెప్పేస్తే సరిపోతుందా? దానివలన ఉపయోగమేమిటి?

మనకు జరిగే అశుభం ఫలితాల తీవ్రత తగ్గటానికి తగిన పరిహార క్రియ జరుపుకుంటే మన బాధలు తగ్గుతాయి. **జాతకచక్రం ద్వారా ఏ గ్రహం దోషపూరితంగా ఉన్నదో గ్రహించి, ఆదోషనివారణ చేసుకుంటే మనకు శుభం కలుగుతుంది.**

గ్రహదోషనివారణకు గ్రహజపం, హోమం, స్తోత్రం వంటి అనేక పరిహార మార్గాలతో బాటు సులభతరమైన పరిహార మార్గాలు కూడ ఈయబడ్డాయి. ప్రతిగ్రహముకు వేరువేరుగా అనేక మార్గాలు సూచించ బడ్డాయి. మంత్రోచ్చారణ స్పష్టంగా చేయగలిగితే, ఎవరికి వారు స్వయంగా నవగ్రహహోమం, జపం చేసుకొనుటకు వాటిని విధి, విధానాలతో వివరంగా ఇవ్వడం జరిగింది.

ఈ పరిహారక్రియలు అన్నీ కేవలం నా అనుభవములు మాత్రమే కావు. అనేకమంది జ్యోతిష్కులు తమ అనుభవపూర్వకంగా తెలిపినవి సేకరించి ఈ పుస్తకంలో పొందుపరిచాను. ఆ మహానుభావులకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

మీరూ జ్యోతిష్యం నేర్చుకోండి. అను గ్రంథంలో ఎవరికి వారు స్వయంగా జాతకచక్రం వేసుకొని, తమ భవిష్యత్తును తెలుసుకొనే విధానాన్ని తెలిపాను. ఈ పుస్తకంలో గ్రహదోష నివారణకు తగిన మార్గాలను తెలిపాను.

ఈ గ్రంథం లోని విషయాలను అర్థం చేసుకొని, ఆచరించి, మీ జీవన గమనాన్ని సుఖవంతం చేసుకోగలరని ఆశిస్తూ ...

మీ
సుధాకర్

# విషయసూచిక

# విశ్వము

## 1. విశ్వము

మనం నివసించే భూమి, భూమి చుట్టూ ఆవరించిన ప్రదేశం, భూమిపై నుండి మనకు కనపడుతున్న నక్షత్రాలు, సూర్యుడు, చంద్రుడు సూర్యుని చుట్టూ తిరుగుతున్న గ్రహాలు, నక్షత్రమండలాలు, ఇంకా మనకు కనిపించని చరాచర జగత్తునంతటిని విశ్వం అంటారు. దీనినే మరొక విధంగా చెప్పాలంటే భూమి, సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నక్షత్ర మండలాలు, నక్షత్రములతో కూడి, అర్ధగోళాకారంగా కనిపించే అనంతమైన ఆకాశమునే విశ్వం అనవచ్చును.

ఆకాశంలో మినుకు మినుకుమంటూ కనిపించే కోటానుకోట్ల నక్షత్రాలలో మనకు దగ్గరగా అంటే 149 కోట్ల 80 లక్షల కిలోమీటర్ల దూరంలో ఉండే నక్షత్రం సూర్యుడు. ఆకాశంలోని నక్షత్రాల సముదాయాన్ని గెలాక్సీ అంటారు. సూర్యుడు పాలపుంత అనే గెలాక్సీకి చెందిన నక్షత్రము.

భూమి చుట్టూ సూర్యుడు తిరుగుతున్నట్లు కనిపించినా, నిజానికి సూర్యుని చుట్టూ భూమి తిరుగుతున్నది. భూమితోపాటు ఇతరగ్రహాలు కూడ సూర్యుని చుట్టూ దీర్ఘవృత్తాకార కక్ష్యలో తిరుగుతున్నవి.

## సూర్య కుటుంబం

సూర్యుడు, సూర్యునిచుట్టు తిరిగే గ్రహాలు, గ్రహాల చుట్టు తిరిగే ఉపగ్రహాలు, ఆస్టరాయిడ్స్, తోక చుక్కలను కలిపి సౌరకుటుంబము అంటారు.

సూర్యుని చుట్టూ బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అనే గ్రహాలు తిరుగుతున్నాయి.

## గ్రహాలంటే

ఆకాశంలో స్థిరంగా ప్రకాశవంతంగా కనిపించే వాటినే గ్రహాలు అంటాము. ఇవి నక్షత్రాల కంటె ఎక్కువ ప్రకాశవంతంగా కనిపిస్తున్నా, కాంతిని విడుదల చేయవు. ఎందుకంటె ఇవి నక్షత్రాల వలె స్వయంప్రకాశకాలు కావు. కేవలం తమపై పడిన కాంతిని, ఉష్ణాన్ని పరావర్తనం చెందిస్తాయి.

సౌరకుటుంబంలోని గ్రహాలలో గురుగ్రహం పెద్దది. బుధగ్రహం అన్నింటికంటె చిన్నది. అదేవిధంగా సూర్యునికి దగ్గరగా ఉన్నగ్రహం బుధుడు సూర్యుని నుండి దూరంగా ఉన్నగ్రహం ప్లూటో.

## ఉపగ్రహం

గ్రహాల చుట్టు తిరిగే గ్రహాలను ఉపగ్రహాలు అంటారు. చంద్రుడు భూమికి ఉపగ్రహం. ఇదేవిధంగా శనికి అత్యధికంగా 21 ఉపగ్రహాలున్నాయి. బుధుడు, శుక్రులకు ఉపగ్రహాలు లేవు.

ప్రస్తుతం భూమి చుట్టు వందల కొలదీ కృత్రిమ ఉపగ్రహాలున్నాయి.

## గ్రహాల చలనాలు

ప్రతిగ్రహము రెండు విధాలుగా చలిస్తుంది.

సూర్యునిచుట్టు తిరుగుటను పరిభ్రమణము అంటారు.

భూమి సూర్యుని చుట్టు తిరుగుటకు 365 1/4 రోజులు పడుతుంది.

గ్రహము తనచుట్టు తాను తిరుగుటను ఆత్మ భ్రమణము అంటారు. భూమి తన చుట్టు తాను తిరుగుటకు 24 గంటలు పడుతుంది.

భూమియొక్క పరిభ్రమణము వలన ఋతువులు, భూమియొక్క ఆత్మభ్రమణము వలన రాత్రి, పగలు ఏర్పడుతున్నాయి.

## నక్షత్ర మండలాలు

నక్షత్ర సముదాయాలను నక్షత్రమండలాలు అంటారు. నక్షత్రాలను సముదాయాలుగా విభజించి వాటి ఆకారాన్ని లేదా అమరికను బట్టి వాటికి పేర్లు పెట్టారు.

## రాశిచక్రము

ఒక సంవత్సరంలో నక్షత్రాల మధ్యగా గమించే సూర్యుని గమనమార్గానికి దగ్గరగా ఉండే పట్టీవంటి భాగాన్ని రాశిచక్రము అంటారు.

## రాశులు

రాశిచక్రంలోని 12 నక్షత్రమండలాలకు వాటి ఆకారాన్ని బట్టి 12 పేర్లు పెట్టారు. వీటినే రాశిగుర్తులు అంటారు. అవి 1.మేషము 2. వృషభము 3. మిథునము 4. కర్కాటకం 5. సింహం 6. కన్య 7. తుల 8. వృశ్చికం 9. ధనస్సు 10. మకరం 11. కుంభం 12. మీనము.

సంవత్సరంలో ఒకనెలలో ప్రతిదినము సూర్యోదయము ఒకేరాశి వద్ద జరుగుతుంది.

ఉదా :- జనవరి 14 నుండి ఫిబ్రవరి 14 వరకు ప్రతిరోజు సూర్యోదయం మకరం వద్ద జరుగుతుంది.

## నవగ్రహాలు

మానవుని జీవనవిధానము, అతని ఆలోచనలు, మాటతీరు, లక్షణాలు అతను పుట్టిన ప్రదేశముపైన, అతను పెరిగిన వాతావరణంపైనా, అతని చుట్టూ ఉన్న పరిసరాలపైన ఆధారపడి ఉంటుంది. అందువలన ప్రాచీనకాలంలోనే భారతీయ విజ్ఞానులు పుట్టిన శిశువు యొక్క, జీవనవిధానంపై అతను జీవిస్తున్న భూమి, భూమికి దగ్గరగా ఉన్న సూర్యుడు, సూర్యుని చుట్టు తిరుగుతున్న బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతువులు, భూమి చుట్టు తిరిగే చంద్రుని ప్రభావం ఉంటుందని కనుగొన్నారు.

మానవునిపై ప్రభావం చూపే సూర్యుడు, చంద్రుడు, కుజుడు, రాహువు, గురువు, శని, బుధ, కేతువులను నవగ్రహాలుగా భావించారు.

వీటిలో రాహువు, కేతువులు ఛాయాగ్రహములు, నిజానికి యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోలు కూడ సూర్యునిచుట్టు తిరిగే గ్రహాలయినా, ఆనాడు పరిగణనలోకి తీసుకొనలేదు.

అనుక్షణం మనపై ప్రభావాన్ని చూపే ఈ నవగ్రహాల గురించి, వీటి ఆధిపత్యంలో ఉండే రాశులు, నక్షత్రాల గురించి తెలుసుకుంటే, రాశిచక్రంలో నవగ్రహాల స్థానాలను బట్టి మన జాతకాన్ని మనమే తెలుసుకొనవచ్చును.

# 2. రాశులు - రాశిచక్రం

సూర్యుడు సంచరించే మార్గమును క్రాంతి వృత్తం అంటారు. ఈ కాంతి వృత్తమున కిరువైపులా 7 1/2 డిగ్రీల వెడల్పులో అనగా మొత్తం 15 డిగ్రీల వెడల్పులో వ్యాపించియున్న చక్రమునే రాశి చక్రము అంటారు.

సూర్యుడు చలిస్తున్న కారణంగా ఈ రాశిచక్రం కూడ చలిస్తూ ఉంటుంది.

## రాశులు

రాశి చక్రంలోని ఉత్తరవిషువము, దక్షిణాయనము, దక్షిణ విషువము, ఉత్తరాయనము అనే నాలుగు విభాగాలు ఒకదాని నుండి మరొకటి $90^0$ దూరంలో ఉంటాయి. వీటిని ఒక్కొక్కదానిని మూడుభాగాలుగా విభజించిన మొత్తం 12 భాగాలు ఏర్పడుతాయి. ఇవియే రాశులు. ఒక్కొక్క రాశికి $360^0/12=30^0$ ఉండును.

| రాశులు | రాశిచక్రము నందు స్థానములు |
|---|---|
| మేషము | $0^0$ నుండి $30^0$ వరకు |
| వృషభము | $30^0$ నుండి $60^0$ వరకు |
| మిధునము | $60^0$ నుండి $90^0$ వరకు |
| కర్కాటకము | $90^0$ నుండి $120^0$ వరకు |
| సింహము | $120^0$ నుండి $150^0$ వరకు |
| కన్య | $150^0$ నుండి $180^0$ వరకు |
| తుల | $180^0$ నుండి $210^0$ వరకు |
| వృశ్చికము | $210^0$ నుండి $240^0$ వరకు |
| ధనస్సు | $240^0$ నుండి $270^0$ వరకు |
| మకరము | $270^0$ నుండి $300^0$ వరకు |
| కుంభము | 300 నుండి $330^0$ వరకు |
| మీనము | $330^0$ నుండి $360^0$ వరకు |

ప్రతిరాశిలో సూర్యుడు 30 రోజులు ఉంటాడు.

## రాశిచక్రము

విభిన్న ప్రాంతాలలో విభిన్న జ్యోతిష్య పండితులు విభిన్న రకాల రాశి చక్రములను ఉపయోగిస్తుంటారు. ప్రస్తుతం మనం భారత దేశములో ఎక్కువగా ఉపయోగించే రాశిచక్రమును గురించి తెలుసుకుందాము.

| మీనం | మేషం | వృషభం | మిథునం |
|---|---|---|---|
| కుంభం | | | కర్కాటకం |
| మకరం | | | సింహం |
| ధనస్సు | వృశ్చికం | తుల | కన్య |

ఇది సవ్యచక్రము. లగ్నము ఏరాశి అయితే ఆ రాశిలో లగ్నాన్ని సూచిస్తారు.

రాశులగురించి క్లుప్తంగా పట్టికరూపంలో ఇవ్వడం జరిగింది. ఈ పట్టికను పరిశీలించి రాశుల స్వభావం, తత్త్వము, శబ్దములు, అధిపతులు, రాశులు సూచించు మానవ శరీర భాగములు మొదలగు అనేక విషయాలను తెలుసుకొనవచ్చును.



| గుర్తు | మేషం ♈ | వృషభం ♉ | మిధునం ♊ | కర్కాటక ♋ | సింహం ♌ | కన్య ♍ | తుల ♎ | వృశ్చికం ♏ | ధనుస్సు ♐ | మకరం ♑ | కుంభం ♒ | మీనం ♓ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| లింగభేదం | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ |
| స్వభావం | చర | స్థిర | ద్విస్వభావ | చర | స్థిర | ద్విస్వభావ | చర | స్థిర | ద్విస్వభావ | చర | స్థిర | ద్విస్వభావ |
| తత్త్వములు | అగ్ని | భూ | వాయు | జల | అగ్ని | భూ | వాయు | జల | అగ్ని | భూ | వాయు | జల |
| శబ్దములు | అధిక | అధిక | అధిక | నిశ్శబ్ద | అధిక | అర్థ | నిశ్శబ్ద | నిశ్శబ్ద | అధిక | అర్థ | అర్థ | నిశ్శబ్ద |
| సమయములు | రాత్రి | రాత్రి | రాత్రి | రాత్రి | దిన | దిన | దిన | దిన | రాత్రి | రాత్రి | దిన | దిన |
| ఉదయాలు | పృష్ఠ | పృష్ఠ | శీర్ష | పృష్ఠ | శీర్ష | శీర్ష | శీర్ష | శీర్ష | పృష్ఠ | పృష్ఠ | శీర్ష | ఉభయ |
| జల/నిర్జల | పాద | అర్థ | నిర్జల | పూర్ణ | నిర్జల | నిర్జల | పాద | పాద | అర్థ | పూర్ణ | అర్థ | పూర్ణ |
| జీవులు | పశు | పశు | మనుష్య | జల | పశు | మనుష్య | మనుష్య | కీటక | మనుష్య పశు | పశు జలచర | మనుష్య | జల |
| వర్ణములు | రక్త | శ్వేత | ఆకుపచ్చ | పాటల | ధూమ్ర పాండు | చిత్ర | నీలం | బంగారు | కపిల | శుక్లకపిల | బభ్రు | స్వచ్ఛ |
| పరిమాణం | హ్రస్వ | హ్రస్వ | సమ | సమ | దీర్ఘ | దీర్ఘ | దీర్ఘ | దీర్ఘ | సమ | సమ | హ్రస్వ | హ్రస్వ |
| జాతులు | క్షత్రియ | బ్రాహ్మణ | వైశ్య | శూద్ర | క్షత్రియ | శూద్ర | వైశ్య | బ్రాహ్మణ | క్షత్రియ | శూద్ర | వైశ్య | బ్రాహ్మణ |
| దిశలు | తూర్పు | దక్షిణ | పడమర | ఉత్తర | తూర్పు | దక్షిణ | పడమర | ఉత్తర | తూర్పు | దక్షిణ | పడమర | ఉత్తర |
| అధిపతులు | కుజ | శుక్ర | బుధ | చంద్ర | రవి | బుధ | శుక్ర | కుజ | గురు | శని | శని | గురు |
| సంతానం | అల్ప | సమ | సమ | అధిక | అల్ప | అల్ప | అల్ప | అధిక | అల్ప | అల్ప | సమ | అధిక |
| ప్రకృతి | పిత్త | వాత | వాత | కఫ | పిత్త | వాత | వాత | కఫ | ఉష్ణపైత్య | వాత | వాతపిత్త కఫ | కఫ |
| కాలపురుషుని అంగములు | శిరస్సు | ముఖము | బాహువులు | వక్షము | గుండె | పొట్ట | పొత్తి కడుపు | మర్మ స్థానం | తొడలు | మోకాళ్ళు | పిక్కలు | పాదాలు |
| సమ/విషమ | విషమ | సమ | విషమ | సమ | విషమ | సమ | విషమ | సమ | విషమ | సమ | విషమ | సమ |

## రాశిబలమును గుర్తించుట

ఒక గ్రహము తానున్న రాశిలో, దానికి 7వరాశిలో సంపూర్ణ ప్రభావము కలిగియుండును. 5,9 రాశులయందు 1/2 దృష్టి కలిగి యుండును. 4,8 రాశులయందు 3/4 దృష్టి కలిగియుండును. 3,10 రాశులయందు 1/4 దృష్టి కలిగియుండును. మిగిలిన రాశులపై ఏ గ్రహము ప్రభావమును చూపలేదు. ఇది సామాన్యదృష్టి. ఇదికాక కొన్ని గ్రహములకు విశేషదృష్టి కూడ ఉన్నది.

1. శనికి 3,10 రాశులలో సంపూర్ణదృష్టి
2. కుజునకు 4,8 రాశులలో సంపూర్ణ దృష్టి
3. గురునకు 5,9 రాశులలో సంపూర్ణ దృష్టి ఉంటుంది.

పైనున్న విలువలను బట్టి ప్రతిరాశికి దృష్టులు కట్టి బలము నిర్ణయించాలి.

# 3. ద్వాదశరాశులు - కారకత్వములు

## 1.మేషము

ఈ రాశి 0 డిగ్రీల నుండి 30 డిగ్రీల వరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో మొదటిరాశి. బేసిరాశి. పురుషరాశి. ఇది అగ్నితత్త్వము కలరాశి. ఇది తూర్పుదిశను సూచిస్తుంది. హ్రస్వపరిమాణము కలది. పృష్ఠోదయరాశి. ఇది క్షత్రియ జాతికి చెందినరాశి. అల్ప సంతానం కలది. శరీరభాగాలలో శిరస్సును సూచిస్తుంది. రక్తవర్ణం కలది. పిత్తప్రధానమైనది. చతుష్పాదరాశి. చరరాశి క్రూరస్వభావం కలది.

మేషరాశికి అధిపతి కుజుడు. ఈ రాశిలో రవి 10వ డిగ్రీలో పరమోచ్ఛను పొందుతుంది. రవి 20వ డిగ్రీలో పరమనీచను పొందుతుంది. జాతకపారిజాతము ననుసరించి మేషంలో 1వ డిగ్రీ మృత్యుభాగ, 21వ డిగ్రీ పుష్కరాంశ అవుతుంది. ఫలదీపికననుసరించి మేషరాశిలో 26వ డిగ్రీలో చంద్రుడు ఉంటే మృత్యుభాగ అవుతుంది. హోరమకరందం అనుసరించి 8వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది. ఇది కుజుని మూల త్రికోణరాశి.

సాధారణంగా నిరయనరవి ఈ రాశిలో ఏప్రిల్ 14వ తేదీన ప్రవేశిస్తాడు. ఈరాశి భూమి, రత్నములు, ధాతువులను సూచిస్తుంది. ఇది పొట్టి, పొడుగు కాని వారిని సూచిస్తుంది. ధైర్యము, నిర్భయము, తొందరపాటు, గాంభీర్యమును సూచిస్తుంది.

మేషరాశిలో జన్మించినవాడు పరోపకారి, కార్యసిద్ధి కలవాడు. అధికారుల అభిమానం పొందువాడు. చపల స్వభావం కలవాడు. తగాదాలకు దూరంగా ఉండేవాడు. అందరినీ ప్రేమగా చూచుకొనే వాడు. ఒకరికంటె ఎక్కువమంది స్త్రీలతో సంబంధం కలవాడు. అపరిశుభ్రమైన గోళ్ళు కలిగి ఉంటాడు. ఇతని మోకాళ్ళు బలహీనంగా ఉంటాయి. విదేశ ప్రయాణం చేస్తాడు.

మేషరాశిలో జన్మించిన వానికి 1,3,7,12,13,16,32 సంవత్సరాలలో అశుభము కలుగుతుంది.

ఇండియాలోని గుజరాత్‌లోని రాజకోట, రాజస్థాన్‌లోని కొంత ప్రాంతమును మేషరాశి సూచించును. అంతేకాక స్విట్జర్లాండ్, సిరియా, డెన్మార్క్, డిమాస్కస్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్, లెబనాన్, కేపువా, ఇంగ్లాండ్, ఈజిప్ట్, నేపుల్స్, పర్షియా, పోలెండ్, పాలెస్తీనా వంటి దేశాలను మేషరాశి సూచించును.

## 2. వృషభము

ఈ రాశి 30 డిగ్రీలనుండి 60 డిగ్రీలవరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశి చక్రంలో రెండవరాశి. సరిరాశి. స్త్రీరాశి. ఇది భూతత్త్వము కలరాశి. ఇది దక్షిణదిశను సూచిస్తుంది. హ్రస్వపరిమాణం కలది. పృష్ఠోదయరాశి. ఇది బ్రాహ్మణ జాతికి చెందినరాశి. ఇది మధ్యమ సంతానం కలది. శరీర భాగాలలో ముఖమును సూచిస్తుంది. ఇది శ్వేత వర్ణం కలది. వాతప్రధానమైనది. చతుష్పాద రాశి. స్థిరమైన స్వభావం కలది. సౌమ్య స్వభావం కలది.

వృషభరాశికి అధిపతి శుక్రుడు. ఈ రాశిలో చంద్రుడు 3వ డిగ్రీలో పరమోచ్చను పొందుతుంది. జాతకపారిజాతముననుసరించి వృషభంలో 5వ డిగ్రీ మృత్యుభాగ. 14వ డిగ్రీ పుష్కరాంశ అవుతుంది. ఫలదీపిక ననుసరించి 12వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

సాధారణంగా నిరయనరవి ఈ రాశిని మే నెల 15వ తేదీలో ప్రవేశిస్తాడు.

ఈ రాశి పురోహితులను, పూజారులను, వక్తలను, ఆవులు, ఎద్దులు వంటి పశువులను సూచిస్తుంది. పొట్టి వారిని సూచిస్తుంది. మూర్ఖత్వము, స్థిరత్వము, బద్ధకమును సూచిస్తుంది.

వృషభరాశిలో జన్మించినవాడు పెద్దలను గౌరవించువాడు. పరోపకారి అధికారుల అభిమానమును పొందువాడు. లౌక్యము తెలిసినవాడు. అల్పసంతోషి. భార్యమాట వినువాడు. శాంతంగా ఉండేవాడు అవుతాడు.

వృషభరాశిలో జన్మించినవానికి 3,7,10,12,16,19,25,30,32 సం॥లలో అశుభము కలుగును. అనారోగ్యము లేదా ప్రమాదము జరుగుతుంది.

భారతదేశంలో గుజరాత్‌లోని అహమ్మదాబాద్, అమ్రేలి, గాంధీనగర్, ఖేడా, సూరత్, జేట్‌పూర్, భావనగర్, సురేంద్రనగర్, మహోవా, మహేసన ప్రాంతములను, రాజస్థాన్‌లోని ఒర్మీర్, జైసల్మీర్, షేర్‌సుర్, జలో, శివానా, శిరోహి, లోద్ర, పొకరాన్ ప్రదేశములను, మహారాష్ట్రలోని బొంబాయి మొదలగు ప్రదేశములను వృషభరాశి సూచిస్తుంది.

అరేబియా, అర్చిపలాగో, ఆసియామైనర్, పర్షియా, మాలెండ్, జార్జియా, సింధియా, గ్రేటర్‌పోలెండ్, గ్రేట్ బ్రిటన్, రష్యాలో కొంతభాగంలను వృషభరాశి సూచిస్తుంది.

## 3. మిధునం

మిధునరాశి 60 డిగ్రీల నుండి 90 డిగ్రీలవరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో మూడవరాశి. బేసిరాశి పురుషరాశి. వాయుతత్త్వం కలరాశి. ఇది పడమరదిశను సూచిస్తుంది. సమపరిమాణం కలది. శీర్షోదయరాశి. ఇది వైశ్యజాతికి చెందినరాశి. సమసంతానం కలది. శరీర భాగాలలో చేతులను సూచిస్తుంది. ఆకుపచ్చనిరంగు కలది. వాతప్రధానమైనది. మనుష్యరాశి. ద్విస్వభావరాశి. క్రూరరాశి.

ఈ రాశిలో ఏ గ్రహము ఉచ్ఛనుకాని, నీచనుకాని పొందదు.

మిధునరాశికి అధిపతి బుధుడు. జాతకపారిజాతము ననుసరించి 12వ డిగ్రీ మృత్యుభాగమని, ఫలదీపికననుసరించి 13వ డిగ్రీ మృత్యుభాగమని తెలుస్తున్నది.

సాధారణంగా నిరయనరవి ఈ రాశిని దాదాపుగా జూన్‌నెల 15వ తేదీ ప్రవేశిస్తాడు.

ఈ రాశి రైల్వే, రైల్వేలోని రవాణా విభాగములు, వాణిజ్య విభాగములు, విమానములు, విమానాశ్రయములు, వాతావరణ కేంద్రములు, టెలిఫోన్లు, టెలిఫోన్‌కేంద్రాలు, రేడియో, రేడియో కేంద్రాలు, టెలివిజన్లు, టి.వి.కేంద్రాలను సూచిస్తుంది. పుస్తక సంపాదకులను, ప్రచురణాధిపతులను, వార్తలను, వార్తాపత్రికలను సూచిస్తుంది. పొడగరులను సూచిస్తుంది.

ఈ రాశికి అటవీసంపద ద్రవ్యములు.

మిధునరాశిలో జన్మించినవారు ఉత్తమస్నేహితులు, నమ్మదగినవారు, విద్వాంసులు, ధనార్జనచేయువారు, కుటుంబంపట్ల బాధ్యత కలవారు. రతిక్రీడాసక్తి కలవారు. ద్వికళత్రం కలవారు. సంగీతప్రియులు. నృత్యాభిమాని. భోగి.

మిధునరాశిలో జన్మించినవారికి 5, 16, 18, 38, సం॥లలో అనారోగ్యం కలుగుతుంది.

భారతదేశంలో అహమ్మద్‌నగర్, అజ్మీర్, అమృత, బారాముాలా, బద్గాం, బికనీర్, బీవార్, బన్స్‌వారా, బిడ్, చిక్‌మగళూర్, చిత్తోర్‌ఘర్, ధార్వార్, ధులే, దుంగర్‌పూర్, ఫరీద్‌కోట్, ఫిరోజ్‌పూర్, గంగానగర్, గోధ్రా, హిమత్‌గనర్, ఝాబువా, జోధ్‌పూర్ కర్వత్, కుడల్, కోల్హాపూర్, కుప్‌వరా, మార్గోవా, నాగౌర్, పుంగ్, పాలి, పుణే, పాణాజీ, రత్నగిరి, రత్లాం, రాజ్‌సామంద్, రజౌరీ, శికర్, సాంగ్లీ, సతారా, ఉదయపూర్, వదోదర మొదలగు ప్రదేశములను మిధునరాశి సూచిస్తుంది.

అమెరికా, ఆఫ్రికా, బెల్జియం, బ్రాబెట్, ఫ్లాండర్స్, లండన్, మార్సెల్లీ, ఈజిప్ట్ క్రిందిభాగం, ఇంగ్లండ్ దక్షిణభాగంలను వృషభరాశి సూచిస్తుంది.

## 4. కర్కాటకం

కర్కాటకరాశి 90 డిగ్రీలనుండి 120 డిగ్రీలవరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో నాల్గవరాశి. సరిరాశి. స్త్రీరాశి. జలతత్త్వం కలరాశి. ఇది ఉత్తర దిశను సూచిస్తుంది. సమపరిమాణం కలది. పృష్ఠోదయరాశి. ఇది శూద్రజాతికి చెందినరాశి. అధిక సంతానం కలది. శరీరభాగాలలో వక్షమును సూచిస్తుంది. గులాబీరంగు కలది. కఫప్రధానమైనది. జలరాశి. చరరాశి. సౌమ్యరాశి.

కర్కాటకమునకు అధిపతి చంద్రుడు. ఈ రాశిలో 5వడిగ్రీలో గురుడు ఉచ్చను పొందుతాడు. 28వ డిగ్రీలో కుజుడు నీచను పొందును. జాతక పారిజాతమునను‌సరించి 5వ డిగ్రీ మృత్యుభాగమని, ఫలదీపిక ననుసరించి 25వ డిగ్రీ మృత్యుభాగమని తెలుస్తుంది.

ఈ రాశిలోకి నిరయనరవి జూన్ 22 వ తేదీన ప్రవేశిస్తాడు. ఈ రోజుకు ఒక ప్రత్యేకత ఉన్నది. సంవత్సరంలో ఈ రోజు అనగా జూన్ 22 దీర్ఘదినము అవుతుంది.

ఈ రాశి నీటితో కూడిన ప్రాంతములు అనగా చెరువులు, బావులు, నదులు, సముద్రము, జలపాతములు, కాలువలు, నీరు నిలువయుండుగోతులు మొదలైనవాటిని సూచించును. పొట్టివారిని సూచించును. రసము నిచ్చు ఫలములు అనగా బత్తాయి, కమలాపండు, నారింజ, నిమ్మ, దబ్బ, కొబ్బరి, చెఱకు, వంటివాటిని సూచిస్తుంది.

ఈ రాశికి అరటిమొక్కలు ద్రవ్యము. నీరుగల ప్రాంతములు ఈ రాశి స్థానములు.

కర్కాటక రాశిలో జన్మించినవారు గుణవంతులు. పరోపకారులు, బంధుప్రేమ కలవారు. స్టాంపులు, నాణెములు లేదా పురాతన వస్తుసామగ్రిని సేకరించువారు. పుట్టుకతో పేదవారయినా పట్టుదలతో కృషిచేసి ధనవంతులు అవుతారు.

కర్కాటకరాశిలో జన్మించినవారికి 3,31,32 సం॥లలో అనారోగ్య సమస్యలు ఏర్పడును.

భారతదేశంలో అలప్పువా, అకోలా, అమరావతి, ఆధోని, ఆల్వా, అంబోలా, అహంత్‌నాగ్, బియాస్‌పూర్, భవానీ, భరత్‌పూర్, బరన్, భోపాల్, బుల్దానా, బీదర్, బళ్ళారి, బీజాపూర్, బెంగుళూరు, కొట్టాయం, కోయంబత్తూరు, చిత్రదుర్గ, కులూ, ధర్మశాల, ఢిల్లీ, దేవాస్, ధార్, ద్రోణాచలం, దిండిగల్, గుంతకల్, గుల్బర్గా, గుర్గాం, ఘజియాబాద్, ఎర్నాకుళం, హాసన్, హోషంగాబాద్, హోషియార్‌పూర్, ఇండోర్, షిమ్లా, జమ్ము, జలంధర్, జైపూర్, జల్‌గాం, కొల్లం, కోజుక్కోడ్, ఖర్‌గ్రాం, ఖండ్వా, కోటా, క్వేలాంగ్, కురుక్షేత్ర, లేహ్, లూధియానా, లాతూర్, నాగర్‌కోయిల్, మాలపురం, మైసూరు, నాందేడ్, మాధవ్‌పూర్, పానిపట్, పాటియాలా, పాలక్కోడ్, షిమోగా, రాయచూర్, షోలాపూర్, రోహతక్ సోనిపట్, సాంగ్రూ, రూప్‌నగర్, శ్రీనగర్, ఉధాంపూర్, తల్‌వార్, ఉజ్జయిని, ఔరంగాబాద్, ఉస్మానాబాద్, తుమ్‌కూర్, తిరువనంతపురం మొదలగు ప్రదేశములను కర్కాటకరాశి సూచిస్తుంది.

ఇతోపియా, జీలాండ్, హాలెండ్, కాన్‌స్టెంట్‌నోపుల్, మారిషస్, న్యూయార్క్, పారాగువా, స్కాట్‌లాండ్, బర్గండీ మొదలగు దేశాలను కర్కాటకరాశి సూచిస్తుంది.

## 5. సింహం

ఈ రాశి 120 డిగ్రీల నుండి 150 డిగ్రీలవరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో అయిదవరాశి. బేసిరాశి. పురుషరాశి. ఇది అగ్నితత్త్వము కలరాశి.

ఇది తూర్పుదిశను సూచిస్తుంది. దీర్ఘపరిమాణం కలది. శీర్షోదయరాశి. ఇది క్షత్రియజాతికి చెందినరాశి. ఇది అల్పసంతానం కలది. శరీరభాగాలలో గుండెను సూచిస్తుంది. ఇది బూడిదరంగు కలది. పిత్తప్రధానమైనది. పశురాశి. స్థిరరాశి క్రూరరాశి.

సింహరాశికి అధిపతి రవి. ఈ రాశిలో ఏ గ్రహము ఉచ్చస్థితిని పొందదు. నీచస్థితిని కూడ పొందదు. జాతక పారిజాతము ననుసరించి సింహంలో 6వ డిగ్రీ మృత్యుభాగ 19వ డిగ్రీ పుష్కరాంశ అవుతుంది. ఫలదీపిక ననుసరించి 24వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

సాధారణంగా నిరయనరవి ఈ రాశిని ఆగష్టు 15వ తేదీన ప్రవేశిస్తాడు.

ఈ రాశి ఉష్ణప్రాంతములను, నీరుదొరకని ప్రాంతములు అనగా ఎడారులను సూచిస్తుంది. నీటివసతిలేని అడవులును సూచిస్తుంది. పొడుగువారిని సూచిస్తుంది.

ఈ రాశికి ఆహారధాన్యములు ద్రవ్యములు, దట్టమైన అడవులు, కొండలు ఈ రాశి స్థానములు.

సింహరాశిలో జన్మించినవారు ఆస్తిపరులు, కళాప్రియులు, విదేశ ప్రయాణాలంటే ఇష్టం కలవారు, పట్టుదల కలవారు, విచక్షణ కలవారు, గుణవంతులు అవుతారు.

సింహరాశిలో జన్మించినవారికి 1,5,7,20,28, 32 సం॥లలో అశుభములు కలుగును. ఇతనికి జలగండం ఉంటుంది.

అంబ సముద్రం, ధనుష్కోడి, దిండిగల్, చిదంబరం, ధర్మపురి, దిండివనం, ఆరోవిల్లి, చిత్తూరు, చింతామణి, చంద్రగిరి, ధర్మవరం, బద్వేలు, అహోబిలం, అనంతపురం, బంగనపల్లె, అద్దంకి, అలంపూర్, చిలకలూరిపేట, అచ్చంపేట, అమరావతి, సికిందరాబాద్, హైదరాబాద్, అదిలాబాద్, చంద్రపూర్, దార్వా, ఉదయగిరి, దామో, బ్రహ్మపురి, భండారా, బేతూర్, బింద్వారా, బినా, భిండ్, ధౌల్‌పూర్, అంబా, ఆగ్రా, ఆలీఘర్, బరేలీ, బజ్నోర్, అల్మోరా, ఈరోడ్, డోన్, దేవరకొండ, దేవప్రయోగ, డెడూన్, డూన్, ఎత్తిపోతల, ఇటావా, ఫిరోజ్‌బాద్, గుత్తి, గుంటూరు, గోల్కొండ, గద్వాలు, గ్వాలియర్, గంగోత్రి, హిందూపురం, హీరాపూర్, ఫిరోపూర్, ఫిరోజాబాద్, హరిద్వార్, జమ్మలమడుగు, జడ్చెర్ల, జగిత్యాల, జబల్‌పూర్, జహీరాబాద్, కారైకల్, కడలూర్, కాంచీపురం, కోల, కడప, కావలి, కోడూరు, కందుకూరు, కనిగిరి, కర్నూలు, కామారెడ్డి, కరీంనగర్, కోరట్ల, కల్ప, మదురై, మదనపల్లి, మహానంది, మహబూబ్‌నగర్, మహదేవపూర్, మంచిర్యాల, మధోల్, మావు, మొరినా, మధురా, మెరదాబాద్, ముజఫర్‌నగర్, నాగపట్టణం,

నమక్కల్, నాయుడుపేట, నందలూరు, నోవు, నందికొట్టూరు, నరసరావుపేట, నల్గొండ, నిర్మల్, నాగపూర్, నరసింహపూర్, నైనితాల్, నరేంద్రనగర్, తిరుచెందూరు, టూటికొరిన్, తిరుమంగళం, శివగంగ, పుడుక్కోటై, తిరుచ్చిరాపల్లి, తంజావూర్, తిరువాయూర్, సేలం, పెరంబులూర్, సత్తనూర్, తిరువణ్ణామలై, తిరుపతి, పుత్తూరు, రేణిగుంట, పుట్టపర్తి, పులివెందుల, శ్రీకాళహస్తి, ప్రొద్దుటూరు, సంగమేశ్వరం, పిడుగురాళ్ళ, శ్రీశైలం, సూర్యాపేట, పోచంపల్లి, సంగారెడ్డి, సిరిపూర్, పుల్గాం, రామ్‌టెక్, తుమ్‌సర్, రాయ్‌సెన్, సాగర్, ఫిర్‌పూర్, ఫతేపూర్‌సిక్రీ, ఫిరోజాబాద్, ఫతేఘర్, రాంపూర్, పంత్‌నగర్, సహరానూర్, ఉత్తరకాశి, ఉదయగిరి, ఉట్నూరు, యవత్‌మాల్, వరంగల్, వికారాబాద్, వెంకటగిరి, విల్లుపురం, వృద్ధాచలం, విక్రమ్‌సింగపురం, యమునోత్రి మొదలగు ప్రదేశాలను సింహరాశి సూచిస్తుంది.

బ్రిస్టల్, బొహేమియా, సిసిలీ, ఇటలీ, ఫ్రాన్స్, ఫిలడెల్ఫియా, జెకోస్లొవేకియా, లంకాషైర్, మేసిడోనియా, రోమ్, రుమేనియా మొదలగు దేశాలను సింహరాశి సూచిస్తుంది.

## 6. కన్య

ఈ రాశి 150 డిగ్రీల నుండి 180 డిగ్రీల వరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో ఆరవరాశి. ఇది సరిరాశి. స్త్రీరాశి. ద్విస్వభావం కలది. భూతత్త్వం కలరాశి. అర్ధశబ్దము కలది. పగటివేళ బలము కలది. శీర్షోదయరాశి. నిర్జలరాశి. మనుష్యరాశి. దీర్ఘపరిమాణం కలది. శూద్రజాతికి చెందినది. ఇది దక్షిణదిక్కును సూచిస్తుంది. అల్పసంతానం కలది. వాత ప్రధానమైనది. శరీరభాగాలలో పొట్టను సూచిస్తుంది. ఇది చిత్రమైన రంగు కలది. ఇది క్రూరరాశి.

ఈ రాశికి అధిపతి బుధుడు. ఈ రాశిలో 15వ డిగ్రీలో బుధుడు పరమ ఉచ్ఛను పొందుతాడు. 27 వ డిగ్రీలో శుక్రుడు పరమనీచను పొందుతాడు. జాతకపారిజాతము ననుసరించి ఈ రాశిలో 9వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది. ఫలదీపిక అనుసరించి 11వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

నిరయన రవి సాధారణంగా ఈరాశిలో సెప్టెంబర్ 16న ప్రవేశిస్తాడు.

ఈ రాశి వైద్యులను, రోగులను, మందులు తయారు చేయు కంపెనీలు, మందులను అమ్ముదుకాణాలు, ఆసుపత్రులు, ఔషధమూలికలును సూచించును. ధాన్యము, తోటలును సూచించును. మధ్యమ ఎత్తు కలవారిని సూచిస్తుంది.

పచ్చిక భూములు ఈ రాశికి స్థానములు.

కన్యరాశిలో జన్మించినవారు ధనవంతులు, బంధుప్రేమకలవారు, పెద్దలను గౌరవిస్తారు. ధర్మకార్యములను చేయుదురు. సమాజంలో గుర్తింపు కలవారు.

కన్యరాశిలో జన్మించినవారికి 3,5,9,13,15,21,30 సం॥లలో ప్రమాదము కలదు.

భారతదేశంలో అమలాపురం, అలహాబాద్, బహ్రాయిచ్, బండా, బిలాస్‌పూర్, బోలాఘాట్, బిస్తర్, భద్రాచలం, భీమవరం, బాపట్ల, చీరాల, చోడవరం, దుర్గ్, గుడివాడ, గోండా, జగదల్‌పూర్, కాన్‌పూర్ కొత్తగూడెం, కొంట, కాకినాడ, మచిలీపట్నం, మంగళగిరి, మాండ్లా, మిర్జాపూర్, లక్నో, నర్సాపురం, నిడదవోలు, నందిగామ, మాచ్‌ఖండ్, పాలకొల్లు, పెద్దాపురం, పన్నా, ప్రతాప్‌ఘర్, పైజాబాద్, రేపల్లె, రామచంద్రపురం, రాజమండ్రి, రాజ్‌నంద్‌గాం, రాయపూర్, రాయబరేలీ, తణుకు, తెనాలి, తాడేపల్లిగూడెం, సీతాపూర్, శ్రావస్తి, అడ్డతీగెల, సీలేరు, సుల్తాన్‌పూర్ మొదలగు ప్రదేశాలను కన్యారాశి సూచిస్తుంది.

అస్సీరియా, బ్రెజిల్, స్విట్జర్లాండ్, గ్రీస్, జెరూసలేం, క్రీటీ, మెసపటోమియా, పారిస్, టిబెట్, వర్జీనియా, వెస్టిండీస్ మొదలగు దేశాలను కన్యరాశి సూచిస్తుంది.

## 7. తుల

ఈ రాశి 180 డిగ్రీలనుండి 210 డిగ్రీలవరకు వ్యాపించి ఉంటుంది. రాశిచక్రంలో ఇది ఏడవరాశి. ఇది బేసిరాశి. పురుషరాశి. చరరాశి. వాయుతత్త్వము కలది. నిశ్శబ్దస్వరము కలది. పగటివేళ బలము కలది. శీర్షోదయరాశి. పాదజలం కలది. మనుష్యరాశికి చెందినది. దీర్ఘపరిమాణం కలది. వైశ్యజాతికి చెందినరాశి. ఇది పడమర దిక్కును సూచిస్తుంది. అల్పసంతానం కలది. వాతప్రధానమైనది. శరీరభాగాలలో పొత్తికడుపును సూచిస్తుంది. ఇది నీలం రంగును కలిగి ఉంటుంది.

ఈ రాశికి అధిపతి శుక్రుడు. ఈ రాశిలో 20వ డిగ్రీలో శని పరమోచ్చను పొందును. 10వ డిగ్రీలో రవి పరమ నీచను పొందును. జాతక పారిజాతము ననుసరించి 23వ డిగ్రీ మృత్యుభాగ, 24వ డిగ్రీ పుష్కరాంశ అవుతుంది. ఫలదీపిక అనుసరించి 26వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

సాధారణంగా నిరయనరవి ఈ రాశిలో అక్టోబర్ 15న ప్రవేశిస్తాడు.

ఈ రాశి వ్యాపారులను, వ్యాపారమును, న్యాయస్థానములను, భోజన శాలలను సూచించును.

పట్టణములు, దుకాణములు ఈ రాశి స్థానములు.

తులరాశిలో జన్మించినవారు సమాజంలో గుర్తింపు కలవారు. సుఖములను అనుభవించుతారు. పండితులు, కళాప్రియులు. ద్వికళత్రం కలవారు. వ్యాపారం ద్వారా ధనమును సంపాదిస్తారు. పెద్దలను గౌరవిస్తారు. భార్యపై అభిమానం కలవారు. దానధర్మములు చేయుదురు.

తులరాశిలో జన్మించిన వారికి 7,8,12, 20 సం॥లలో అనారోగ్యము, ఆపద కలుగుతాయి.

భారతదేశంలో అన్నవరం, అరకు, అస్కా, అంబికాపూర్, అజంఘర్, బొబ్బిలి, భవానీపాట్నా, బొలంగీర్, చీపురుపల్లె, ధోల్‌పూర్, ఘాజీపూర్, గోపాల్‌గంజ్, గోరఖ్‌పూర్, ఇచ్ఛాపురం, కోరాపుట్, నర్సీపట్నం, నరసరావుపేట, పిఠాపురం, పాడేరు, పార్వతీపురం, పాతపట్నం, పర్లాకిమిడి, పులాబానీ, పదంపూర్, రూర్సేగూడ, రాయఘర్, శృంగవరపు కోట, సాలూరు, సోంపేట, సుందరఘర్, సంబల్‌పూర్, తుని, విశాఖపట్నం, విజయనగరం, వారణాశి, మొదలగు ప్రదేశాలను తులరాశి సూచిస్తుంది.

ఆస్ట్రియా, అర్జెంటినా, బర్మా, చైనా, ఫ్రాంక్‌ఫెర్ట్, లిబియా, వియెన్నా, పోర్చుగల్, విసోనియా, సవోయ్ మొదలగు దేశాలను తులరాశి సూచిస్తుంది.

## 8. వృశ్చికం

ఈ రాశి 210 డిగ్రీల నుండి 240 డిగ్రీల వరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశి చక్రంలో ఎనిమిదవరాశి. ఇది సరిరాశి. స్త్రీరాశి. స్థిరస్వభావం కలది. జలతత్త్వం కలరాశి. ఇది నిశ్శబ్దరాశి. రాత్రివేళ బలముకలది. పృష్టోదయరాశి. అర్థజలరాశి. కీటకరాశి. దీర్ఘ పరిమాణం కలది. బ్రాహ్మణ జాతికి చెందినది. ఇది ఉత్తర దిక్కును సూచిస్తుంది. అధిక సంతానం కలది. కఫప్రధానమైనది. శరీరభాగాలలో మర్మ స్థానంను సూచిస్తుంది. ఇది బంగారు రంగును కలది. ఇది సౌమ్యరాశి.

ఈ రాశికి అధిపతి కుజుడు. ఇచట ఏగ్రహము ఉచ్చనుపొందదు. కాని 3వ డిగ్రీలో చంద్రుడు నీచను పొందును.

నిరయనరవి ఈ రాశిలో సాధారణంగా నవంబర్ 15వ తేదీన ప్రవేశిస్తాడు.

ఈ రాశి జలవిద్యుత్ కేంద్రములు, శ్మశానములు, ఇంటిలోని ఖాళీ ప్రాంతమును సూచించును. విషమును, విషంతో కూడిన మందులును, పాములను పట్టువారిని సూచిస్తుంది. దుంపలు, వేరుశెనగ పంటలను సూచిస్తుంది.

పుట్టలు, పాములు, విషకీటకములు, రాళ్ళు వీటిస్థానములు.

వృశ్చికరాశిలో జన్మించినవారు తగాదాలకు సిద్ధంగా ఉంటారు. కోపము ఎక్కువ కలవారు. ఇతరులను ద్వేషించు స్వభావం కలవారు. కఠినంగా మాట్లాడుతారు. రహస్య కార్యములు చేయుదురు. ధైర్యం కలవారు. వీరిని సంతోషింపచేయుట కష్టము. ఇతరుల పనులకు ఆటంకములు కల్పిస్తుంటారు. పరస్త్రీలతో సంబంధం కలిగి ఉంటారు.

వృశ్చికరాశిలో జన్మించినవారికి 3,5,15,25 సం॥లలో ప్రమాదములు కలుగుతాయి.

భారతదేశంలో భువనేశ్వర్, బంకురా, చల్‌బాస, చక్రధర్‌పూర్, ధనబాద్, దేవ్‌ఘర్, హజారిబా, జహనాబాద్, గయ, జంషెడ్‌పూర్, కటక్, కోణార్క, ఖాగల్‌పూర్, ఖగారియా మేదినీపూర్, ముజఫర్‌పూర్, మహజానీ, నవాడ్, పాట్నా, పురోలియా, పూరి, రూర్కెలా, రాంచీ మొదలగు ప్రదేశాలను వృశ్చికరాశి సూచిస్తుంది.

అల్జీరియా, బార్బరీ, బ్రెజిల్, దక్షిణాఫ్రికా, జుడేయా, కేటలోనియా, లిబియా, క్వీన్స్‌లాండ్, మారిటానియా, మొరాకో, మెస్సినా, నార్వే, సార్డీనియా మొదలగు దేశాలను వృశ్చికరాశి సూచిస్తుంది.

## 9. ధనుస్సు

ఈ రాశి 240 డిగ్రీల నుండి $270^0$ డిగ్రీల వరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో తొమ్మిదవరాశి. ఇది బేసిరాశి. పురుషరాశి. ద్విస్వభావరాశి. అగ్నితత్త్వము కలది. అధిక శబ్దము కలది. రాత్రివేళ బలము కలది. పృష్ఠోదయరాశి. అర్థజలరాశి. మనుష్యరాశి. సమపరిమాణం కలది. క్షత్రియజాతికి చెందినది. ఇది ఉత్తరదిక్కును సూచిస్తుంది. అల్పసంతానం కలది. ఉష్ణపైత్య ప్రకృతి కలది. శరీరభాగాలలో తొడలను సూచిస్తుంది. ఇది కపిలరంగును కలది. క్రూరరాశి.

ఈ రాశికి అధిపతి గురుడు. ఈ రాశిలో ఏ గ్రహము ఉచ్చ,నీచలు పొందదు. జాతకపారిజాతమునుసరించి ఈ రాశిలో 20వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది. ఫలదీపిక అనుసరించి 13వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

నిరయనరవి ఈ రాశిలో సాధారణంగా డిశంబర్ 15వ తేదీన ప్రవేశిస్తాడు.

ఈ రాశి విద్యాలయములు, న్యాయస్థానాలు, దేవాలయములు, చర్చి, మసీదులు, శరణాలయములు, ధర్మస్థానములు, సత్రములును సూచిస్తుంది. ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు, న్యాయమూర్తులు, మతబోధకులును సూచిస్తుంది. మంచిపొడగరులను సూచిస్తుంది.

అశ్వములు, ఏనుగులు, రథములు వీటి స్థానములు.

ధనస్సురాశిలో జన్మించినవారు అధికారులచే గౌరవం పొందుతారు. దైవభక్తి కలవారు. పెద్దలను గౌరవించువారు. ఉపన్యాసకులు. మంచిస్నేహితులు. సంఘంలో కీర్తి ప్రతిష్టలు కలవారు. వినయం కలవారు. కాని తొందరగా కోపం తెచ్చుకొంటారు.

ధనస్సురాశిలో జన్మించినవారికి 13వ సం॥ కష్టములు కలుగును.

భారతదేశంలో కలకత్తా, గాంగ్‌టక్, జోటార్‌ఘాట్, డార్జిలింగ్, ఆలిపూర్, కిషన్‌గంజ్, కృష్ణనగర్, సాహిబ్‌గాం, సిల్లిగురి, చుంచూర్ వంటి ప్రదేశాలను ధనస్సురాశి సూచిస్తుంది.

ఆస్ట్రేలియా, అరేబియా, అవిగ్నాస్, ఫిలిక్స్, హంగేరీ, ఇటలీ, కొలొగ్న్ మడగాస్కర్, మెరాలియా, లిగూరియా, ఫ్రాన్స్ మొదలగు దేశాలను ధనస్సురాశి సూచిస్తుంది.

## 10. మకరం

మకరరాశి 270 డిగ్రీలనుండి 300 డిగ్రీలవరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశి చక్రంలో పదవరాశి. ఇది సరిరాశి. స్త్రీ రాశి. చరరాశి. భూతత్త్వం కలది. అర్ధశబ్దం కలది. రాత్రివేళ బలము కలది. పృష్ఠోదయ రాశి. పూర్ణజలరాశి. పశురాశి. సమపరిమాణం కలవది. శూద్రజాతికి చెందినది. ఇది దక్షిణదిక్కును సూచిస్తుంది. అల్పసంతానం కలది. వాత ప్రధానమైనది. శరీరభాగాలలో మోకాళ్ళను సూచిస్తుంది. ఇది శుక్ల, కపిల వర్ణం కలది. ఇది సౌమ్యరాశి.

ఈ రాశికి అధిపతి శని, ఈ రాశిలో 28వ డిగ్రీలో కుజుడు పరమ ఉచ్ఛను పొందుతాడు. 5వ డిగ్రీలో గురుడు పరమ నీచను పొందుతాడు. జాతకపారిజాతం ననుసరించి 20వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది. ఫలదీపిక అనుసరించి 25వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

నిరయనరవి ఈ రాశిలో జనవరి 14 లేదా 15వ తేదీన ప్రవేశిస్తాడు. నిరయనరవి మకరరాశిని ప్రవేశించురోజునే మకర సంక్రాంతి పండుగ జరుపుకుంటారు.

ఈ రాశి వ్యవసాయదారులను, పరిపాలనాధికారులను, పాలకులను, నాస్తికులను, చెరువులు, నదులను సూచిస్తుంది. పొట్టివారిని సూచిస్తుంది.

నదులు, వన ప్రాంతములు దీనిస్థానములు.

మకరరాశిలో జన్మించినవారు అధికారుల అభిమానం పొందుతారు. అందమైనవారు. ధైర్యవంతులు, ఆలోచనాపరులు, దానం చేయువారు.

మకరరాశిలో జన్మించినవారికి 5,7,12,20,25,32 సం॥లలో అనారోగ్యం ఏర్పడుతుంది. నీటివలన ప్రమాదం కలదు.

భారతదేశంలో అగర్తలా, బర్‌పేట, ధుబురీ, ఢాకా, కో‌క్రాఫుర్, గోల్‌పారా, గౌహతి, తవాంగ్, త్రిపుర, ఉదయపూర్ మొదలగు ప్రదేశాలను మకరరాశి సూచిస్తుంది.

ఆఫ్ఘనిస్తాన్, అలేబనియా, ఆక్స్‌ఫర్డ్, బ్రాండెన్‌బర్గ్, ఇండియా, గ్రీస్, మెక్సికో, మెసిడోనియా మొదలగు దేశాలను మకరరాశి సూచిస్తుంది.

## 11. కుంభం

కుంభరాశి 300 డిగ్రీల నుండి 330 డిగ్రీల వరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశిచక్రంలో పదకొండవరాశి. ఇది బేసిరాశి. పురుషరాశి. స్థిరరాశి. వాయుతత్త్వం కలది. అర్ధశబ్దం కలది. పగటివేళ బలము కలది. శీర్షోదయ రాశి. అర్ధజలరాశి. మనుష్యరాశి. హ్రస్వపరిమాణం కలది. వైశ్యజాతికి చెందినది. ఇది పడమరదిక్కును సూచిస్తుంది. సమసంతానం కలది. వాత, పిత్త, కఫ ప్రకృతి కలది. శరీర భాగాలలో పిక్కలును సూచిస్తుంది. ఇది భభ్రు రంగు కలది.

ఈ రాశికి అధిపతి శని. జాతకపారిజాతము ననుసరించి కుంభంలో 10వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది. ఫలదీపిక అనుసరించి 5వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది. కొంతమంది ప్రాచీన జ్యోతిషులు కుంభరాశిని రాహువుకు స్వక్షేత్రంగా భావించారు.

సాధారణంగా నిరయనరవి ఈరాశిలో ఫిబ్రవరి 15న ప్రవేశిస్తాడు.

ఈ రాశి గూఢచారులు, వ్యాపారులను సూచిస్తుంది. పొడుగు వారిని సూచిస్తుంది.

బంగారం వంటి అమూల్యవస్తువులు దీని ద్రవ్యములు. నీటికుండ, ఇంటిలో నీరుండే స్థలములు దీని స్థానములు.

కుంభరాశిలో జన్మించినవారు భోజనప్రియులు, లౌక్యము తెలిసినవారు, ఎవరినీ నొప్పించని విధంగా మాట్లాడువారు. అల్పసంతోషి. దానధర్మములు

చేయువారు. కాని ధనవంతులు కారు. కామక్రీడలపై ఆసక్తి కలవారు. సన్నగా ఉంటారు.

కుంభరాశిలో జన్మించినవారికి 5,12,28 సం॥లలో ఆపదలు కలుగుతాయి.

భారతదేశంలో అలాంగ్, బిష్ణుపూర్, డిబ్రూఘర్, ఇంఫాల్, ఈటానగర్, గోలాఘాట్, జోర్‌హట, లఖింపూర్, కోహిమా, నాగాలాండ్, తమింగలాంగ్, తేజ్‌పూర్, శిబ్‌సాగర్ మొదలగు ప్రదేశాలను కుంభరాశి సూచిస్తుంది.

అరేబియా, డెన్మార్క్, హేంబర్గ్, సిలీషియా, స్వీడెన్, పోలెండ్, టాటరీ మొదలగు దేశాలను కుంభరాశి సూచిస్తుంది.

## 12.మీనం

మీనరాశి 330 డిగ్రీలనుండి 360 డిగ్రీల వరకు వ్యాపించి ఉంటుంది. ఇది రాశి చక్రంలో పన్నెండవ రాశి. ఇది సరిరాశి. స్త్రీరాశి. ద్విస్వభావరాశి. జలతత్త్వం కలది. నిశ్శబ్దరాశి. పగటివేళ బలము కలది. ఉభయోదయరాశి. పూర్ణజలరాశి. హ్రస్వపరిమాణం కలది. బ్రాహ్మణ జాతికి చెందినది. ఇది ఉత్తర దిక్కును సూచిస్తుంది. అధిక సంతానం కలది. కఫప్రధానమైనది. శరీర భాగాలలో పాదాలను సూచిస్తుంది. ఇది స్వచ్ఛమైన రంగు కలది. ఇది సౌమ్యరాశి.

ఈ రాశి అధిపతి గురువు, ఈ రాశిలో 27వ డిగ్రీలో శుక్రుడు ఉచ్ఛను పొందుతాడు. 15వ డిగ్రీలో బుధుడు నీచను పొందుతాడు. జాతకపారిజాతము ననుసరించి మీనంలో 1వ డిగ్రీ మృత్యుభాగ, 9వ డిగ్రీ పుష్కరాంశ అవుతుంది. ఫలదీపికననుసరించి 12వ డిగ్రీ మృత్యుభాగ అవుతుంది.

సాధారణంగా నిరయనరవి ఈ రాశిని మార్చి 17న ప్రవేశిస్తాడు.

ఈ రాశి వైద్యశాలలను, మధ్యవర్తిత్వం జరుపు సంస్థలను సూచిస్తుంది. చేపలకు సంబంధించిన వాణిజ్య వివరాలు అనగా చేపలు పట్టుట, చేపలతో చేయు వ్యాపారాలు, చేపల పెంపకం మొదలగు విషయాలు, జాలరులను, ఓడలను, ఓడల స్వంతదారులను సూచించును. సన్యాసులను, యోగులను, దానధర్మములు, కర్మలును సూచిస్తుంది. ముత్యములు, రత్నములు, నూనె, సాగరమునందలి అన్ని రకాల పదార్థములును సూచిస్తుంది.

ముత్యములు, పగడములు వంటి సాగర గర్భాన లభించు వస్తువులు దీని ద్రవ్యములు. నదులు, సముద్రములు దీనిస్థానములు.

మీనరాశిలో జన్మించినవారు ధనవంతులు. సుఖమును పొందుతారు. తల్లితండ్రులపై భక్తిగలవారు. అందమైనవారు. గర్వంలేనివారు. మనశ్శాంతి కలవారు. ఉదార స్వభావం కలవారు.

మీనరాశిలో జన్మించినవారికి 5,8,22,24 సం॥లలో ఆపదలు కలుగుతాయి.

భారతదేశంలో ఆరిని, చాంగ్‌లాంగ్, డుమ్‌డుమా, కొన్నా, ముర్కాంగ్ సిల్లక్, పరశురాం కుండ్, పాశీఘాట్, తవాయ్, తీన్‌సుకియా, తేజు, విజయనగర్ వంటి ప్రదేశాలను మీనరాశి సూచిస్తుంది.

ఈజిప్ట్, గెలీసియా, కెలాబ్రియా, నార్మండీ, పోర్చుగల్, రాటిస్‌బన్, శ్రీలంక, స్పెయిన్ దేశాలను మీనరాశి సూచిస్తుంది.

# 4. నక్షత్రములు

మనకు ఆకాశంలో అనేక నక్షత్రాలు కనిపిస్తూ ఉంటాయి. అంతర్జాతీయ ఖగోళశాస్త్ర పరిశోధకుల సంఘము 88 నక్షత్రములను గుర్తించారు. కాని మన జ్యోతిష్యశాస్త్రవేత్తలు 27 నక్షత్రాలను స్వీకరించారు. భూమిపైనున్న మానవులపై ఈ 27నక్షత్రాల ప్రభావం ఉంటుందని మన ప్రాచీన జ్యోతిష్య శాస్త్రవేత్తలు గుర్తించారు. అందుకని ఈ 27నక్షత్రాలనే పరిగణనలోకి తీసుకున్నారు.

ప్రాచీన జ్యోతిష్యులు పరిగణనలోకి తీసుకున్న నక్షత్రాలు

1. అశ్విని 2. భరణి 3.కృత్తిక 4. రోహిణి 5. మృగశిర 6. ఆరుద్ర 7. పునర్వసు 8. పుష్యమి 9. ఆశ్లేష 10. మఖ 11. పుబ్బ 12. ఉత్తర 13. హస్త 14. చిత్త 15. స్వాతి 16. విశాఖ 17. అనూరాధ 18. జ్యేష్ఠ 19. మూల 20. పూర్వాషాఢ 21. ఉత్తరాషాఢ 22. శ్రవణం 23. ధనిష్ఠ 24. శతభిషం 25. పూర్వాభాద్ర 26. ఉత్తరాభాద్ర 27. రేవతి.

నక్షత్రాలు గ్రహాలకంటె కొన్నిరెట్ల పరిమాణం కలవి. కాని భూమికి చాలా దూరంలో ఉండటం వలన చిన్నవిగా కనిపిస్తాయి.

2,3 నక్షత్రాల సమూహము వలన రాశులు ఏర్పడినవి. కావున రాశిలు ఉన్న గ్రహముపై ఆయా నక్షత్రాల ప్రభావం ఉంటుంది.

27 నక్షత్రములను 9 గ్రహాలకు పంచారు.

| నక్షత్రములు | | | నక్షత్రనాధుడు (గ్రహము) |
|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | రవి |
| రోహిణి | హస్త | శ్రవణం | చంద్రుడు |
| మృగశిర | చిత్త | ధనిష్ట | కుజుడు |
| ఆరుద్ర | స్వాతి | శతభిషం | రాహువు |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురుడు |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | శని |
| ఆశ్లేష | మఖ | మూల | కేతువు |
| భరణి | పుబ్బ | పూర్వాషాఢ | శుక్రుడు |

ప్రతి నక్షత్రానికి ఒకగ్రహం అధిపతిగా ఉంటాడు.

## నక్షత్రములు - రాశులు

2,3 నక్షత్రములు కలసి ఒక రాశిగా ఏర్పడినవని మనకు తెలుసు. ఏఏ నక్షత్రాలకు ఏ రాశులతో సంబంధం ఉన్నదో తెలుసుకుందాం.

ప్రతి నక్షత్రముకు 4 పాదములు ఉన్నవి. 27 నక్షత్రములకు 27×4=108 పాదములు ఉన్నవి.

ఒక్కొక్కరాశికి 9 పాదముల చొప్పున 12 రాశులకు 108 పాదములను పంచినారు.

| నక్షత్రములు | రాశి | నక్షత్రములు | రాశి |
|---|---|---|---|
| అశ్విని 4 పాదములు<br>భరణి 4 పాదములు<br>కృత్తిక 1 పాదము | మేషము | చిత్త 3,4 పాదములు<br>స్వాతి 4 పాదములు<br>విశాఖ 1,2,3 పాదములు | తుల |
| కృత్తిక 2,3,4 పాదములు<br>రోహిణి 4 పాదములు<br>మృగశిర 1,2 పాదములు | వృషభము | విశాఖ 4 వ పాదము<br>అనూరాధ 4 పాదములు<br>జ్యేష్ట 4 పాదములు | వృశ్చికం |

| నక్షత్రములు | రాశి | నక్షత్రములు | రాశి |
|---|---|---|---|
| మృగశిర 3,4 పాదములు<br>ఆరుద్ర 4 పాదములు<br>పునర్వసు 1,2,3 పాదములు | మిధునం | మూల 4 పాదములు<br>పూర్వాషాఢ 4 పాదములు<br>ఉత్తరాషాఢ 1వపాదము | ధనుస్సు |
| పునర్వసు 4 వ పాదము<br>పుష్యమి 4 పాదములు<br>ఆశ్లేష 4 పాదములు | కర్కాటకం | ఉత్తరాషాఢ 2,3,4 పాదములు<br>శ్రవణం 4 పాదములు<br>ధనిష్ట 1,2 పాదములు | మకరం, |
| మఖ 4 పాదములు<br>పుబ్బ 4 పాదములు<br>ఉత్తర 1 పాదము | సింహం | ధనిష్ట 3,4 పాదములు<br>శతభిషం 4 పాదములు<br>పూర్వాభాద్ర 1,2,3 పాదములు | కుంభం |
| ఉత్తర 2,3,4 పాదములు<br>హస్త 4 పాదములు<br>చిత్త 1,2 పాదములు | కన్య | పూర్వాభాద్ర 4వ పాదము<br>ఉత్తరాభాద్ర 4 పాదములు<br>రేవతి 4 పాదములు | మీనం |

**నక్షత్ర ప్రమాణం**

కాంతి వృత్త పరిధి = $360^0$

దానిని 27 నక్షత్రములకు సమానంగా విభజించారు.

ఒక్కొక్క నక్షత్రపరిమాణం= $\frac{360^0}{27} = 13^0\ 20'$

$1^0=60'$

ఒక్కొక్క నక్షత్రము యొక్క ప్రమాణము = 13 డిగ్రీల 20 నిమిషాలు.

ప్రతి నక్షత్రమును 4 పాదములుగా విభజించారు.

కావున ఒక్కొక్క నక్షత్రపాదము ప్రమాణము= $\frac{13^0 20'}{4}$

$=3^0 20'$

**నక్షత్రముల స్వభావాదులు**

నక్షత్రముల గణములు, స్వభావములు, అధిదేవతలు మొదలగు విషయములు పట్టికరూపంలో ఇవ్వబడినవి. గమనించండి.

| సంఖ్య | నక్షత్ర ములు | నక్షత్ర పాదములు నామాక్షరాలు | | | | అధిదేవతలు | స్త్రీ./పు. భేదము | గణము | స్వభా వము | ముఖము | నాడి | యోని | రజ్జు | నక్షత్రాలు | గ్రహ దశా కాలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | | | | | | | | | | (సం॥) |
| 1. | అశ్విని | చు | చె | చొ | లా | అశ్వనీ | పురుష | దేవ | శీఘ్ర | తిర్య | ప్ర॥పా॥ | గుఱ్ఱం | పాదం | కేతు | 7 |
| 2. | భరణి | లి | లు | లె | లొ | యముడు | స్త్రీ | మనుష్య | ఉగ్ర | అధో | మద్యేక | గజము | తొడ | శుక్ర | 20 |
| 3. | కృత్తిక | అ | ఇ | ఉ | ఎ | అగ్ని | స్త్రీ | రాక్షస | మిశ్ర | అధో | ద్వి॥పా॥ | మేషము | నాభి | రవి | 6 |
| 4. | రోహిణి | ఒ | వ | వి | వు | పరబహ్మ | పురుష | మనుష్య | స్థిర | ఊర్ధ్వ | ద్వి॥పా॥ | సర్పము | కంఠం | చంద్ర | 10 |
| 5. | మృగశిర | వే | వొ | క | కి | చంద్రుడు | నపుం | దేవ | మృదు | తిర్య | మద్యేక | సర్పము | శిరస్సు | కుజ | 7 |
| 6. | ఆర్ద్ర | కు | కం | జ | ఛ | శివుడు | స్త్రీ | మనుష్య | దారు॥ | ఊర్ధ్వ | ప్ర॥పా॥ | కుక్క | కంఠం | రాహు | 18 |
| 7. | పునర్వసు | కె | కొ | హ | హి | అదితి | స్త్రీ | దేవ | చర | తిర్య | ప్ర॥పా॥ | మార్జాల | నాభి | గురు | 16 |
| 8. | పుష్యమి | హు | హె | హో | డ | గురుడు | పు | దేవ | శీఘ్ర | ఊర్ధ్వ | మద్యేక | మేషము | తొడ | శని | 19 |
| 9. | ఆశ్రేష | డి | డు | డె | డొ | ఆదిశేషుడు | స్త్రీ | రాక్షస | దారు | అధో | ద్వి॥పా॥ | మార్జాల | పాదం | బుధ | 17 |
| 10. | మఖ | మ | మి | ము | మె | పితృదేవతలు | స్త్రీ | రాక్షస | ఉగ్ర | అధో | ద్వి॥పా॥ | మూషక | పాదం | కేతు | 7 |
| 11. | పుబ్బ | మొ | ట | టి | టు | భగుడు | స్త్రీ | మనుష్య | ఉగ్ర | అధో | మద్యేక | మూషక | తొడ | శుక్ర | 20 |
| 12. | ఉత్తర | టె | టొ | ప | పి | అర్యముడు | స్త్రీ | మనుష్య | స్థిర | ఊర్ధ్వ | ప్ర॥పా॥ | గోవు | నాభి | రవి | 6 |

| సంఖ్య | నక్షత్రములు | నక్షత్ర పాదములు నామాక్షరాలు | | | | అధిదేవతలు | స్త్రీ పుషు భేదము | గణము | స్వభావము | ముఖము | నాడి | యోని | రజ్జు | నక్షత్రాలు | గ్రహ దశా కాలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | | | | | | | | | | (సం॥) |
| 13 | హస్త | పు | షం | ణ | ఠ | సూర్యుడు | స్త్రీ | దేవ | శీఘ్ర | తిర్య | ప్ర॥పా॥ | మహిషం | కంఠం | చంద్ర | 10 |
| 14 | చిత్త | పె | పొ | ర | రి | విశ్వకర్మ | స్త్రీ | రాక్షస | మృదు | తిర్య | మద్యేక | వ్యాఘ్రం | శిరస్సు | కుజ | 7 |
| 15 | స్వాతి | రు | రె | రో | త | వాయువు | స్త్రీ | దేవ | చర | తిర్య | ద్వి॥పా॥ | మహిషం | కంఠం | రాహు | 18 |
| 16. | విశాఖ | తి | తు | తె | తొ | ఇంద్రాగ్నులు | స్త్రీ | రాక్షస | మిశ్ర | అధో | ద్వి॥పా॥ | వ్యాఘ్రం | నాభి | గురు | 16 |
| 17. | అనూరాధ | నా | ని | ను | నె | మిత్రుడు | పురుష | దేవ | మృదు | తిర్య | మద్యేక | మృగ | తొడ | శని | 19 |
| 18 | జ్యేష్ట | నొ | య | యి | యు | ఇంద్రుడు | స్త్రీ | రాక్షస | దారు॥ | తిర్య | ప్ర॥పా | మృగ | పాదం | బుధ | 17 |
| 19 | మూల | యె | యొ | బ | బి | రాక్షసుడు | నపుం | రాక్షస | దారు॥ | అధో | ప్ర॥ పా॥ | కుక్క | పాదం | కేతు | 7 |
| 20 | పూ.షాఢ | బు | ధ | భ | ఢ | గంగాదేవి | స్త్రీ | మనుష్య | ఉగ్ర | అధో | మద్యేక | మర్కటం | తొడ | శుక్ర | 20 |
| 21 | ఉ.షాఢ | బె | బొ | జ | జి | విశ్వేదేవతలు | స్త్రీ | మనుష్య | స్థిర | ఊర్ధ్వ | ద్వి॥పా॥ | ముంగిస | నాభి | రవి | 6 |
| 22 | శ్రవణం | ఖి | ఖు | ఖె | ఖో | విష్ణు | స్త్రీ | దేవ | చర | ఊర్ధ్వ | ద్వి॥పా॥ | మర్కటం | కంఠం | చంద్ర | 10 |
| 23 | ధనిష్ట | గ | గి | గు | గె | వసువులు | పురుష | రాక్షస | చర | ఊర్ధ్వ | మద్యేక | సింహము | కంఠం | కుజ | 7 |
| 24 | శతభిషం | గొ | స | సి | సు | వరుణుడు | నపుం | రాక్షస | చర | ఊర్ధ్వ | ప్ర॥పా॥ | గుఱ్ఱం | కంఠం | రాహు | 18 |
| 25 | పూ.భాద్ర | సె | సొ | ద | ది | అజైకపాదుడు | స్త్రీ | మనుష్య | ఉగ్ర | అధో | ప్ర॥పా॥ | సింహం | నాభి | గురు | 16 |
| 26 | ఉ.భాద్ర | దు | శ్యం | ఝ | థ | అహిర్బుధ్న్య | స్త్రీ | మనుష్య | స్థిర | ఊర్ధ్వ | మద్యేక | గోవు | తొడ | శని | 19 |
| 27 | రేవతి | దె | దొ | చ | చి | పూష | స్త్రీ | దేవ | మృదు | తిర్య | ద్వి॥పా॥ | గజము | పాదం | బుధ | 17 |

# 5. నక్షత్రములు - కారకత్వములు

ఆకాశంలో అనేక నక్షత్రాలు ఉన్నా, మన ప్రాచీన జ్యోతిష్యశాస్త్రవేత్తలు మానవునిపై ప్రభావితం చూపే 27 నక్షత్రాలను పరిగణనలోకి తీసుకున్నారు. ఆయా నక్షత్రాల ప్రభావం వలన జాతకుడు ఎంచుకొనే లేదా వృద్ధి చెందు వృత్తి వ్యాపారాలు, స్వభావాల విషయంలో జ్యోతిష్య శాస్త్ర ప్రవీణులకు విభిన్న అభిప్రాయాలున్నాయి. వాటినన్నింటిని పరిగణించి, పరిశీలించి ఉత్తమమైనవి, అనుభవంలోకి వచ్చిన వాటిని ఇచట ప్రస్తావించడం జరిగింది.

## 1. అశ్వని

ఇది 1వ నక్షత్రం. మేషములో $0^0$-0'-0" నుండి $13^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు కేతువు. సవ్యనక్షత్రం. పురుష నక్షత్రం. శరీర భాగాలలో తలను సూచిస్తుంది. చూ, చే, చో, లా అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గల వారి జన్మనక్షత్రంగా అశ్వనిని సూచిస్తారు. ఇది దీర్ఘాయువుగల నక్షత్రం.

అశ్వని నక్షత్రంలోకి నిరయనరవి ఏప్రియల్ 14న ప్రవేశిస్తాడు. ఇదియే "అశ్వనికార్తె" ప్రారంభమయేరోజు. ఈ నక్షత్రంలో $11^0$-6'-13" నుండి $11^0$-59'-33" వరకు విషభాగలు.

అశ్వని నక్షత్రంలో జన్మించిన వారు బుద్ధిమంతులు, పండితులు, సంఘంలో గౌరవం కలవారు. స్వధర్మపరాయణులు, ధనవంతులు అవుతారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు మిలటరీ, పోలీసు వ్యవస్థ, విద్యుచ్ఛక్తి, శస్త్రచికిత్స, క్రీడా సంస్థలలో రాణిస్తారు.

## 2. భరణి

ఇది 2వ నక్షత్రము. మేషములో $13^0$-20'0" నుండి $260^0$-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈనక్షత్రనాధుడు శుక్రుడు. సవ్యనక్షత్రం. స్త్రీ నక్షత్రం. శరీరభాగాలలో తలను, కళ్ళను సూచిస్తుంది. లీ,లూ,లే,లో అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మనక్షత్రంగా భరణిని సూచిస్తారు. ఇది అల్పాయుర్దాయ నక్షత్రం.

భరణి నక్షత్రంలోకి నిరయనరవి ఏప్రియల్ 3 లేదా ఏప్రియల్ 4 తారీకులలో ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $18^0$-40'-0" ల నుండి $19^0$-33'-20" వరకు విషభాగలు.

ఈ నక్షత్రంలో 4వ పాదమును దినమృత్యువు అంటారు. జాతక చక్రంలో లగ్న, చంద్రులపై గురుని బలమైన దృష్టి పడకపోతే దీనిలోజన్మించిన శిశువు జీవించడము అనుమానమే.

భరణి నక్షత్రంలో జన్మించినవారు స్నేహశీలి, గర్వము కలవారు, పరస్త్రీల అభిమానము పొందువారు, క్రూరుడు, కృతఘ్నుడు, కవి, సంభోగముపై ఆసక్తి కలవాడు, ధనికుడు అయి ఉంటాడు.

భరణి నక్షత్రంలో జన్మించినవారు పశుపోషణ, పాల వ్యాపారంలలో రాణిస్తారు.

## 3. కృత్తిక

ఇది 3వ నక్షత్రము. మేషములో $26^0$-40'-0" నుండి $30^0$-0'-0" వరకు వృషభంలో $30^0$-0'-0" నుండి $40^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్ర నాధుడు రవి. సవ్యనక్షత్రం. స్త్రీనక్షత్రం శరీరభాగాలలో మెదడు, ముఖము, మెడను సూచిస్తుంది. అ,ఈ,ఊ, ఏ నక్షత్రములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మనక్షత్రంగా కృత్తికను సూచిస్తారు. ఇది దీర్ఘాయునక్షత్రం.

కృత్తిక నక్షత్రంలోకి నిరయన రవి మే11 లేదా మే 12 తారీకులలో ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $33^0$-20-0' నుండి $34^0$-13'-20" వరకు విషభాగలు.

కృత్తిక నక్షత్రంలో జన్మించిన వారు విద్యావంతులు. మూర్ఖులు. ఇతరులను ఆకర్షించువారు, గ్రహణ శక్తి కలవారు, అందమైనవారు, అధికారులు అయి ఉంటారు.

కృత్తిక నక్షత్రంలో జన్మించినవారు, బిల్ కలెక్టరుగా, వైద్యుడుగా, టికెట్లు అమ్మకట, ఇండ్ల నిర్మాణము, కమీషన్ వ్యాపారములలో రాణిస్తారు.

## 4. రోహిణి

ఇది 4వ నక్షత్రం. ఇది వృషభంలో $40^0$-0'-0" నుండి $53^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు చంద్రుడు. అపసవ్యనక్షత్రం. స్త్రీ నక్షత్రం. శరీరభాగాలలో ముఖమునందలి నోరు, ముక్కులను సూచిస్తుంది. వో, వా, వీ, వూ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మ నక్షత్రంగా రోహిణిని సూచిస్తారు. ఇది అధమ దీర్ఘాయునక్షత్రం.

రోహిణి నక్షత్రంలోకి నిరయనరవి మే 24 లేదా మే 25 తారీకులలో ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $48^0$-53'-0" నుండి $49^0$-46'-20" వరకు వరకు విషభాగలు.

రోహిణి నక్షత్రంలో జన్మించినవారు కళాకారులు, కవులు, మాటకారులు, న్యాయవర్తనులు అయి ఉంటారు. వీరి కాళ్ళపైన అధికంగా వెంట్రుకలు ఉంటాయి. సాధారణంగా వీరికి శ్వాససంబంధమైన వ్యాధులు వస్తుంటాయి.

ఈ నక్షత్రంలో పుట్టినవారు పంచదార, సబ్బుల పరిశ్రమలలో, మధ్యవర్తులుగా, కమిషన్‌దారులుగా, లేపనములను తయారుచేయువారిగా రాణిస్తారు.

## 5. మృగశిర

ఇది 5వ నక్షత్రము. ఇది $53^0$-20'-0" నుండి $66^0$-40'-00" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా వృషభంలో $53^0$-20'-0" నుండి $60^0$-0'-0" వరకు, మిధునంలో $60^0$-0'-0" నుండి $66^0$-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు కుజుడు. అపసవ్య నక్షత్రము. నపుంసక నక్షత్రము. శరీరభాగాలలో గొంతు, గొంతులోని స్వరపేటిక, ధ్వనికి సంబంధించిన నరములు, మెడ,గెడ్డము, చెవులు, భుజములు, మోచేతులు, వాటి ఎముకలను సూచిస్తుంది. లే,లో,కా,కీ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మ నక్షత్రంగా మృగశిరను సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయునక్షత్రం.

మృగశిర నక్షత్రంలోకి నిరయనరవి జూన్ 8లేదా జూన్ 9 తారీకులలో ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $56^0$-26'-13" నుండి $57^0$-19'-33" వరకు విషభాగలు.

మృగశిర నక్షత్రంలో జన్మించిన వారు నీచకార్యములందాసక్తి కలవారు, పరస్త్రీ వ్యామోహులు, మాటకారులు, కార్యనిర్వహణలో నేర్పులు, కష్టించి పనిచేయువారు, ఆవేశపరులు అయి ఉంటారు.

## 6. ఆరుద్ర

ఇది 6వ నక్షత్రము. ఇది మిధునంలో $66^0$-40'-0" నుండి $80^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు రాహువు. ఇది అపసవ్య నక్షత్రము. స్త్రీ నక్షత్రం. శరీరభాగాలలో సూచస్తుంది. కూ,ఘ,ఞ,ఛ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగల వారి జన్మనక్షత్రంగా ఆరుద్రను సూచిస్తారు. ఇది అల్పాయు నక్షత్రము.

ఆరుద్ర నక్షత్రంలోకి నిరయనరవి జూన్ 21 లేదా జూన్ 22 తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $71^0$-20'-0" నుండి $72^0$-13'-20" వరకు విషభాగలు.

ఆరుద్ర నక్షత్రంలో జన్మించినవారు క్రూరులు, మంత్రములు తెలిసినవారు, అసత్యము పలుకువారు, దేశద్రిమ్మరులు అవుతారు.

## 7. పునర్వసు

ఇది 7వ నక్షత్రము. ఇది $80^0$-0'-0" నుండి $93^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా మిధునంలో $80^0$-0'-0" నుండి $90^0$-0'-0" వరకు కర్కాటకంలో $90^0$-0'-0" నుండి $93^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు గురుడు. ఇది సవ్యనక్షత్రము. పురుషనక్షత్రము. శరీరభాగాలలో ఊపిరితిత్తులు, వక్షము, స్థనములు, పొట్టను సూచిస్తుంది. కే,కొ,హ,హి అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గల వారి జన్మనక్షత్రంగా పునర్వసును సూచిస్తారు. ఇది మధ్యమాయు నక్షత్రము.

పునర్వసు నక్షత్రంలోకి నిరయనరవి జూలై3 లేదా జూలై 4 తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $86^0$-40'-0" నుండి $87^0$-33'-20" వరకు విషభాగలు.

పునర్వసు నక్షత్రంలో జన్మించినవారు దయకలవారు, దాతలు, కవి, న్యాయమూర్తులు, లౌకికజ్ఞానం కలవారు, వక్తలు అయి ఉంటారు. అందమైనవారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు పుస్తకప్రచురణకర్తలు, మధ్యవర్తులు, స్టెనోగ్రాఫర్లు, నర్సులు, మతాధికారులు, పురోహితులు, ట్రస్టీలు, ప్రిన్సిపాలు, ప్రొఫెసరు, ప్రధానోపాధ్యాయులు, నావికాసిబ్బంది, రవాణాసంస్థలలో ఉద్యోగిగా రాణిస్తారు.

## 8. పుష్యమి

ఇది 8వ నక్షత్రము. ఇది కర్కాటకంలో $93^0$-20' నుండి $106^0$-40' వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు శని. ఇది సవ్యనక్షత్రం, పురుషనక్షత్రం, శరీరభాగాలలో ప్రక్కటెముకలు, ఊపిరితిత్తులు, పొట్టను సూచిస్తుంది. హు,హె,హూ, డ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గల వారి జన్మనక్షత్రముగా పుష్యమిని సూచిస్తారు. ఇది అధమ దీర్ఘాయునక్షత్రము.

పుష్యమి నక్షత్రంలోకి నిరయనరవి జూలై 18లేదా జూలై 19వ తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $97^0$-40'-0" నుండి $98^0$-40'-0" వరకు విషభాగలు.

పుష్యమి నక్షత్రంలో పుట్టినవారు సహనశీలురు, తెలివైన వారు, లోభి, పిరికివాడు, ధనార్జనాపరులు అయి ఉంటారు.

ఈ నక్షత్రంల1ో పుట్టినవారు ఖనిజాలు, ఇన్స్యూరెన్సు కంపెనీలు, జలాంతర్గాములు, ఇండ్ల నిర్మాణము, వికలాంగుల పాఠశాలలో పనిచేసిన రాణిస్తారు. వీరు పరిశోధకులుగా కూడా రాణిస్తారు.

## 9. ఆశ్రేష

ఇది 9వ నక్షత్రము. ఇది కర్కాటకంలో $106^0$-40'-0" నుండి $120^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు బుధుడు. ఇది సవ్యనక్షత్రం. స్త్రీ నక్షత్రం. శరీర భాగాలలో ఊపిరితిత్తులు, పొట్ట, కాలేయములను సూచిస్తుంది. డి,డూ,డే,డో అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మ నక్షత్రంగా ఆశ్రేషను సూచిస్తారు. ఇది దీర్ఘాయు నక్షత్రము.

ఆశ్రేష నక్షత్రంలోకి నిరయనరవి సాధారణంగా జూలై 31వ తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $113^0$-46'-40" నుండి $114^0$-46'-0" వరకు విషభాగలు.

ఆశ్రేష నక్షత్రంలో జన్మించినవారు తెలివైనవారు, ఓర్పు కలవారు, ధనార్జనా పరులు అవుతారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు వైద్యశాలలు, నీటిపారుదలశాఖ, ప్లానింగ్ శాఖలలో పనిచేసిన రాణిస్తారు. మధ్యవర్తులుగా, కమీషన్‌దారులుగా, సలహాదారులుగా, భూమి శిస్తు వసూలుచేయువారుగా రాణిస్తారు. కాగితములు, పెన్నిళ్ళు, కలములు తయారు చేయు పరిశ్రమలలో పనిచేయుట ఉపయోగకరమే.

## 10. మఖ

ఇది 10వ నక్షత్రము. సింహంలో $120^0$-0'-0" నుండి $133^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు కేతువు. ఇది అపసవ్య నక్షత్రము. స్త్రీ నక్షత్రము. శరీరభాగాలలో హృదయమును సూచిస్తుంది. మా, మీ, మూ, మే అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగల వారి జన్మ నక్షత్రంగా మఖను సూచిస్తారు. ఇది దీర్ఘాయునక్షత్రము.

మఖనక్షత్రంలోకి నిరయనరవి సాధారణంగా ఆగష్టు 18వ తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $126^0$-40'-0" నుండి $127^0$-33'-20" వరకు విషభాగలు.

మఖ నక్షత్రంలో పుట్టినవారు ధనవంతుడు, భార్యపై ఎనలేని అభిమానం కలవాడు, పుణ్యకార్యములు చేయువాడు, సంఘంలో గౌరవం కలవాడు, సేవకులు కలవాడు, కష్టజీవి అవుతాడు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు వ్యవసాయము, నగలవ్యాపారము, పాలవ్యాపారం, స్టేడియం నిర్మాణము వంటి పనులు చేసిన లాభిస్తారు.

## 11. పుబ్బ

ఇది 11వ నక్షత్రము. ఇది సింహంలో $133^0$-20'-0" నుండి $146^0$-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్ర నాధుడు శుక్రుడు. ఇది సవ్య నక్షత్రము.

శరీరభాగాలలో గుండె, అందలి భాగాలను సూచిస్తుంది. మో,ట, టీ,టు అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మనక్షత్రంగా పుబ్బను సూచిస్తారు. ఇది దీర్ఘాయునక్షత్రం.

పుబ్బ నక్షత్రం లోకి నిరయనరవి సాధారణంగా ఆగష్టు 27వ తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $137^0$-46'-40" నుండి $138^0$-40'-0" వరకు విషభాగలు.

పుబ్బ నక్షత్రంలో జన్మించినవారు శాంతి స్వభావం కలవారు, ఊహాజీవులు, కవిత్వంపై ఆసక్తి కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు పుస్తక విక్రేతలుగా, రచయితలుగా, దస్తావేజు లేఖకులుగా, పబ్లిషరుగా రాణిస్తారు. బొమ్మల తయారీ, పుస్తకముల తయారీ సంస్థలలో ఉద్యోగిగా పేరు పొందుతారు.

## 12. ఉత్తర

ఇది 12వ నక్షత్రము. ఇది $146^0$-40'-0" నుండి $160^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా సింహంలో $146^0$-40'-0" నుండి $150^0$-0'-0" వరకు, కన్యలో $150^0$-0'-0" నుండి $160^0$-0'-0"వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు రవి.

శరీర భాగాలలో వెన్నెముక, వెన్నుపూస, జీర్ణాశయంలో జీర్ణక్రియకు తోడ్పడే అవయవములను సూచిస్తుంది. చ, టీ, టో,పా అను అక్షరములతో ప్రారంభమయే పేర్లుగలవారి జన్మనక్షత్రంగా ఉత్తరను సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయు నక్షత్రం.

ఉత్తర నక్షత్రంలోకి నిరయనరవి సెప్టెంబరు 11లేదా సెప్టెంబర్ 12 తారీకులలో ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో 150°-40'-0" నుండి 151°-33'-20" వరకు విషభాగలు.

ఉత్తర నక్షత్రంలో జన్మించినవారు సంఘంలో గౌరవం కలవారు, క్రీడాసక్తి కలవారు, నటులు, ఆరోగ్యవంతులు, శారీరక ధారుఢ్యము కలవారు, ధృఢమైన సంకల్పము కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు ఖగోళశాస్త్రజ్ఞులుగా, ఎకౌంటెంటుగా, కెమిస్టుగా, ఫార్మసిస్టుగా రాణిస్తారు.

## 13. హస్త

ఇది 13వ నక్షత్రము. ఇది కన్యలో 160°-0'-0" నుండి 173°-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు చంద్రుడు. ఇది సవ్య నక్షత్రము. పురుష నక్షత్రము. శరీర భాగాలలో జీర్ణక్రియకు తోడ్పడే ఎంజైములు, వాటిని ఉత్పత్తిచేసే గ్రంథులను సూచిస్తుంది. పు,ష,ణ,ఢ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మనక్షత్రంగా హస్తను సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయు నక్షత్రము.

హస్త నక్షత్రంలోకి నిరయనరవి సెప్టెంబర్ 25 తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో 166°-40'-0" నుండి 167°-33'20" వరకు విషభాగలు. హస్త 1వ పాదమును దినమృత్యువు అంటారు. అయితే చంద్రునికి గురుదృష్టి ఉంటే బాలారిష్టదోషం లేనట్లే. అనగా "దినమృత్యువు" ఫలితం ఉండదు.

హస్త నక్షత్రంలో జన్మించినవారు తెలివైనవారు, కవులు, ఊహించు శక్తి కలవారు, స్త్రీ సౌందర్యారాధకులు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు వ్యాపారస్తులు. మధ్యవర్తులు, ఏజంట్లు, సేల్స్‌గరల్స్, ప్లానులు గీయువారుగా రాణిస్తారు. సిరా తయారు చేయు కంపెనీలు, ఆనకట్టలు కట్టు కంపెనీలు, షిప్పింగ్ కంపెనీ, ఫైనాన్స్ కంపెనీలలో ఉద్యోగస్తులు అయిన అభివృద్ధి పొందుతారు.

## 14. చిత్త

ఇది 14వ నక్షత్రము. ఇది 173°-20'-0" 186°-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా కన్యలో 173°-20'-0" నుండి 180°-0'0" వరకు, తులలో

$180^0$-0'-0" నుండి $186^0$-40'-00" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు కుజుడు. ఇది సవ్యనక్షత్రము. స్త్రీ నక్షత్రము. శరీర భాగాలలో పొత్తి కడుపు, అపెండిక్స్, పేగుల ప్రారంభస్థానమును సూచిస్తుంది. పే,పో,రా,రీ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మనక్షత్రంగా చిత్తను సూచిస్తారు. ఇది అధమ దీర్ఘాయు నక్షత్రము.

చిత్త నక్షత్రంలోకి నిరయనరవి అక్టోబర్ 9వ తారీకు లోపల ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $177^0$-46'-40" నుండి $178^0$-40'0" వరకు విషభాగలు.

చిత్తనక్షత్రంలో జన్మించినవారు ధైర్యవంతులు, వక్తలు, వాదనా పటిమ కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు ఇంజనీరు, దస్తావేజులు వ్రాయువారు, క్రీడాకారులు, ఫ్యాషన్ డిజైనరు, గైనకాలజిష్టులుగా రాణిస్తారు. అకౌంట్సు, పోలీసు, మిలటరీ, ఇన్సూరెన్సు కంపెనీలలో, మరియు కాస్మెటిక్సు, మోటారు వాహనాల విడిభాగాలు తయారు చేయు లేదా అమ్మే సంస్థలలో ఉద్యోగం చేసిన వృద్ధి పొందుతారు.

## 15. స్వాతి

ఇది 15వ నక్షత్రము. ఇది తులారాశిలో $186^0$-40'-0" నుండి $200^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్ర నాధుడు రాహువు. ఇది సవ్య నక్షత్రం. స్త్రీ నక్షత్రం. శరీర భాగాలలో మూత్రపిండములు, మూత్రకోశము, మూత్రనాళము, జననేంద్రియములను సూచిస్తుంది. రూ,రే,రో,తా అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మనక్షత్రంగా స్వాతిని సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయు నక్షత్రం.

స్వాతి నక్షత్రంలోకి నిరయనరవి సాధారణంగా అక్టోబర్ 23వ తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $189^0$-46'-40" నుండి $190^0$-40'-0" వరకు విషభాగలు.

స్వాతి నక్షత్రంలో పుట్టినవారు ఆలోచనాశక్తిపరులు, ఏకాగ్రత కలవారు, దయ, క్రోధము కలవారు అవుతారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు, సినిమా, పెట్రోలు, ఆయుర్వేదవైద్యం, రసాయనాలు, రోల్డ్‌గోల్డ్‌కు చెందిన సంస్థలలో ఉద్యోగులుగా రాణిస్తారు. కళాకారులుగా పేరుపొందుతారు.

## 16. విశాఖ

ఇది 16వ నక్షత్రము. ఇది $200^0$-0'-0" నుండి $213^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా ఇది తులలో $200^0$-0'-0" నుండి $210^0$-0'0" వరకు, వృశ్చికంలో $210^0$-0'-0" నుండి $213^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు గురుడు. ఇది అపసవ్య నక్షత్రం. స్త్రీనక్షత్రం. శరీరభాగాలలో పొత్తికడుపు లోపలి భాగాలు, పేంక్రియాస్‌ను సూచిస్తుంది. తీ,తూ,తే,తో అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మనక్షత్రముగా విశాఖను సూచిస్తారు. ఇది అధమ దీర్ఘాయు నక్షత్రం.

విశాఖ నక్షత్రంలోకి నిరయన రవి నవంబర్ 5 లేదా నవంబర్ 6 తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $203^0$-6'-40" నుండి $204^0$-0'-0" వరకు విషభాగలు.

విశాఖ నక్షత్రంలో పుట్టినవారు దైవభక్తి, క్రమశిక్షణ, దయ కలిగినవారు అవుతారు. వీరు విశాల హృదయులు, సత్ప్రవర్తన కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు వ్యాపార సంస్థలు, కోర్టులు, ప్రచురణ సంస్థలు, వస్త్రపరిశ్రమ, విమానసంస్థలలో పనిచేసిన రాణిస్తారు. కేటరింగ్, సినీ డిస్ట్రిబ్యూషన్ కంపెనీలలో రాణిస్తారు. బ్యాంకులు, ఓడరేవులు, ఇన్సూరెన్సు కంపెనీలలో ఉద్యోగస్తులుగా, సర్జన్‌గా, ఆసుపత్రిమేనేజర్‌గా లాభపడతారు.

## 17. అనూరాధ

ఇది 17వ నక్షత్రము. ఇది వృశ్చికంలో $213^0$-20'-0" నుండి $226^0$-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు శని. ఇది అపసవ్య నక్షత్రము. పురుషనక్షత్రము. శరీరభాగాలలో గుదము, తుంటి, మర్మావయవములు, వృషణములును సూచిస్తుంది. నా, నీ, నూ, నె అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగల వారి జన్మ నక్షత్రంగా అనూరాధను సూచిస్తారు. ఇది ఉత్తమ దీర్ఘాయు నక్షత్రం.

అనూరాధ నక్షత్రంలోకి నిరయనరవి నవంబర్ 19న ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $215^0$-33'-20" నుండి $216^0$-26'-40" వరకు విషభాగలు.

అనూరాధ నక్షత్రంలో జన్మించినవారు మూర్ఖులు, ఎవరిని నమ్మనివారు, కోపస్వభావం కలవారు అయిఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు ఇంజనీరుగా, మద్యవిక్రేతలుగా రాణిస్తారు. గనులు, పెట్రోలు, డీజిల్ మొ॥నవి అమ్ముసంస్థలు, పోలీసు, మిలటరీ వ్యవస్థ, స్టీలు కర్మాగారములలో ఉద్యోగాలు చేసిన లాభపడతారు.

## 18. జ్యేష్ఠ

ఇది 18వ నక్షత్రము. ఇది వృశ్చికరాశిలో $226^0$-40'-0" నుండి 240'-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు బుధుడు. ఇది అపసవ్యనక్షత్రము. స్త్రీనక్షత్రము. శరీరభాగాలలో గుదము, అండాశయము, అండములను సూచిస్తుంది. వో, యా, యి, యూ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగలవారి జన్మనక్షత్రంగా జ్యేష్ఠను సూచిస్తారు. ఇది అల్పాయు నక్షత్రము.

జ్యేష్ఠ నక్షత్రంలోకి నిరయన రవి.

ఈ నక్షత్రంలో $229^0$-46'-40" నుండి $230^0$-40'-0" వరకు విషభాగలు.

జ్యేష్ఠ నక్షత్రంలో జన్మించినవారు మాటకారులు, హాస్యప్రియులు, నిర్మొహమాటంగా మాట్లాడువారు, వాదనాపటిమ కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు ఇంజనీర్లుగా, సర్జనులుగా, విద్యుత్ సంస్థలలో ఉద్యోగస్తులుగా, ప్లానులు గీయువారిగా, మధ్యవర్తులుగా రాణిస్తారు.

## 19. మూల

ఇది 19వ నక్షత్రము. ఇది ధనుస్సులో $240^0$-0'-0" నుండి $253^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాథుడు కేతువు. ఇది సవ్య నక్షత్రము. నపుంసకనక్షత్రం. శరీరభాగాలలో పిక్కలు, తొంటి, కీళ్ళును సూచిస్తుంది. యే, యో, బా, బీ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మనక్షత్రంగా మూలను సూచిస్తారు. ఇది దీర్ఘాయు నక్షత్రం.

మూలనక్షత్రంలోకి నిరయునరవి ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $252^0$-26-40" నుండి $253^0$-20'-0" వరకు విషభాగలు.

మూల నక్షత్రంలో జన్మించినవారు సత్ప్రవర్తన కలవారు, దైవభక్తులు, వేదాంతులు, మూఢనమ్మకాలు కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు బోధకులుగా, లెక్చరర్‌గా, ఉపాధ్యాయులుగా, విద్యాసంస్థలలో పనిచేయువారిగా, న్యాయమూర్తిగా, రాయబారిగా, భవన నిర్మాణ కాంట్రాక్టరుగా, పాస్‌పోర్ట్ ఆఫీసులో ఉద్యోగిగా రాణిస్తారు.

## 20. పూర్వాషాఢ

ఇది 20వ నక్షత్రము. ఇది ధనుస్సులో $253^0$-20'-0" నుండి $266^0$-40-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు శుక్రుడు. ఇది సవ్యనక్షత్రం. స్త్రీనక్షత్రం. శరీరభాగాలలో తొడలు, తుంటి, మోకాళ్ళు, మూత్రనాళములు, నరములను సూచిస్తుంది. ఇది మధ్యమదీర్ఘాయు నక్షత్రం.

పూర్వాషాఢ నక్షత్రంలోకి నిరయనరవి డిశెంబర్ 28లేదా డిశంబర్ 29 తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $258^0$-40'-0" నుండి $259^0$-33'-20" వరకు విషభాగలు.

పూర్వాషాఢ నక్షత్రంలో జన్మించినవారు ధర్మాచారపరాయణులు, దయ కలవారు, ఆకర్షించు స్వభావము కలవారు, పుణ్యక్షేత్రములను దర్శించువారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు ఉపాధ్యాయులు, లెక్చరరు, ప్రొఫెసరు, లాయరు, జడ్జి, కార్యనిర్వహణాధికారిగా రాణిస్తారు. యూనివర్సిటి, రైల్వే, వస్త్రపరిశ్రమ, రబ్బరు పరిశ్రమ, ఆయుర్వేద వైద్యము, పరిశోధన, విద్యాసంస్థలు, బ్యాంకులు, ఉద్యానవన శాఖలలో ఉద్యోగస్తులుగా రాణిస్తారు.

## 21. ఉత్తరాషాఢ

ఇది 21 వ నక్షత్రము. ఇది $266^0$-40'-0" నుండి $280^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా ఇది ధనస్సులో $266^0$-40'-0" నుండి $270^0$-0'-0" వరకు, మకరంలో $270^0$-0'-0" నుండి $280^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు రవి. ఇది సవ్యనక్షత్రం. స్త్రీ నక్షత్రం. శరీరభాగాలలో తొడలు, చర్మము, మోకాళ్ళను సూచిస్తుంది. బే,బో,జా,జీ అను అక్షరములతో ప్రారంభ మయ్యే పేర్లుగలవారి జన్మ నక్షత్రంగా ఉత్తరాషాడను సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయు నక్షత్రం.

ఉత్తరాషాడ నక్షత్రంలోకి నిరయనరవి జనవరి 10న ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $271^0$-6"-40" నుండి $272^0$-0'-0" వరకు విషభాగలు.

ఉత్తరాషాఢ నక్షత్రంలో జన్మించినవారు, సంస్కరణాభిలాషులు, చట్టములను గౌరవించువారు, నమ్మకమైనవారు, ఏ పని అయినా ఆలస్యముగా చేయు స్వభావము కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో జన్మించినవారు ప్రొఫెసరు, మంత్రులు, రాయబారి, దస్తావేజులు వ్రాయువారు, టైపిస్టు, ఎడిటరు, చెప్పులు కుట్టువారు, శిల్పులు, చిత్రకారులు, యూనియన్ లీడరుగా రాణిస్తారు. విద్యాసంస్థలు, ఆర్థికసంస్థలు, పురాతన వస్తుశాఖ, ఎండోమెంట్సు, సహజవాయుసంస్థలలో ఉద్యోగులుగా లాభపడతారు.

## 22. శ్రవణం

ఇది 22వ నక్షత్రం. ఇది మకరరాశిలో $280^0$-0'-0" నుండి $293^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు చంద్రుడు. ఇది అపసవ్య నక్షత్రము. పురుషనక్షత్రము. శరీరభాగాలలో మోకాళ్ళు, చర్మము, లింపు గ్రంధులును సూచిస్తుంది. జూ,జే,జో,ఖా అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గల వారి జన్మ నక్షత్రంగా శ్రవణం ను సూచిస్తారు. ఇది అధమ దీర్ఘాయు నక్షత్రము.

శ్రవణం నక్షత్రంలోకి నిరయన రవి జనవరి 24న ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $282^0$-13'-20" నుండి $283^0$-6'-40" వరకు విషభాగలు.

శ్రవణం నక్షత్రంలో పుట్టినవారు సహనము కలవారు, ఆలోచనాపరులు, నిరాశావాదులు, అవసరమైనపుడు అబద్ధము లాడువారు. అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు బావులు త్రవ్వుట, సముద్ర గర్భంలో నూనెలను వెలికితీయుట, గనులు, సొరంగములు త్రవ్వుట కూలర్, ఫ్రిజ్‌లను తయారు చేయుట, వ్యవసాయము మొదలగు పనులు చేసిన వృద్ధి చెందుతారు.

## 23. ధనిష్ట

ఇది 23వ నక్షత్రము. ఇది $293^0$-20'-0" నుండి $306^0$-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా మకరంలో $293^0$-20'-0" నుండి $300^0$-0'-0" వరకు, కుంభంలో $300^0$-0'-0" నుండి $306^0$-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు కుజుడు. ఇది అపసవ్య నక్షత్రము. స్త్రీ నక్షత్రము. శరీరభాగాలలో గా,గీ,గూ,గే అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మ నక్షత్రంగా ధనిష్టను సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయు నక్షత్రం.

ధనిష్ట నక్షత్రంలోకి నిరయన రవి ఫిబ్రవరి 7న ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $295^0$-33'-20" నుండి $296^0$-26'-40" వరకు విషభాగలు.

ధనిష్ట నక్షత్రంలో జన్మించినవారు తెలివైనవారు, నేర్పరులు, చురుకుతనము కలవారు, అనుకున్న పనులు నెరవేర్చుకొనువారు, అప్రమత్తత కలవారు, ధైర్యవంతులు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు చర్మ పరిశ్రమ, గనులు, రైల్వే, రోడ్లు, రవాణా సంస్థలలో పని చేస్తారు. కాటరింగ్, భోజనశాలల నిర్వహణ, ప్రింటింగ్, చెప్పుల పరిశ్రమలలో రాణిస్తారు.

## 24. శతభిషం

ఇది 24వ నక్షత్రం ఇది కుంభంలో $306^0$-40'-0" నుండి $320^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు రాహువు. ఇది అపసవ్యనక్షత్రము. నపుంసకనక్షత్రము. శరీరభాగాలలో మోకాలి చిప్పలను సూచిస్తుంది. గో,సా,సీ,సు అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మనక్షత్రంగా శతభిషంను సూచిస్తారు. ఇది దీర్ఘాయు నక్షత్రం.

శతభిషం నక్షత్రంలోకి నిరయనరవి ఫిబ్రవరి 20న ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $310^0$-40'-0" నుండి $311^0$-32'-20" వరకు విషభాగలు.

శతభిషం నక్షత్రంలో జన్మించిన వారు కార్యసాధకులు, కృతఘ్నులు, లోభి, పరస్త్రీవ్యామోహం కలవారు, స్వతంత్రులు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు మధ్యవర్తులు, అనువాదకులు, విషము తీయువారు, విషవైద్యము చేయువారు, పరిశోధకులు, కారాగారంలో ఉద్యోగులు, సారా తయారు చేయువారు, ఆసుపత్రులలో ఆయాలుగా ఉంటారు.

## 25. పూర్వాభాద్ర

ఇది 25వ నక్షత్రము. ఇది $320^0$-0'-0" నుండి $333^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. అనగా కుంభంలో $320^0$-0'-0"నుండి $330^0$-0'-0" వరకు, మీనంలో నుండి $333^0$-20'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు గురుడు. ఇది సవ్యనక్షత్రము. పురుషనక్షత్రము శరీరభాగాలలో మోకాలిచిప్పలు, పాదముల పైభాగములను సూచిస్తుంది.

సే,పో,దా,దీ అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగల వారి జన్మనక్షత్రంగా పూర్వాభాద్రను సూచిస్తారు. ఇది మధ్యమ దీర్ఘాయునక్షత్రం.

పూర్వాభాద్ర నక్షత్రంలోకి నిరయనరవి మార్చి 5 లేదా మార్చి 6 తారీకున ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $323^0$-13'-20" నుండి $324^0$-6'-40" వరకు విషభాగలు.

పూర్వాభాద్ర నక్షత్రంలో జన్మించినవారు పతనాసక్తి కలవారు, పిరికివారు, సంగీతప్రియులు, ధనమును వ్యయము చేయువారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు లేబరు ఆఫీసులు, దేవాలయములు, ఫారిన్ బ్యాంకులు, బ్యాంకులు, జీవితభీమా, హాస్పిటల్స్‌లలో ఉద్యోగం చేస్తారు. యోగాచార్యులు, రాజకీయవేత్తలు, ప్రభుత్వ అధికారులు, జైలరు, సాధువులుగా రాణిస్తారు.

## 26. ఉత్తరాభాద్ర

ఇది 26 వ నక్షత్రము. ఇది మీనంలో $333^0$-20'-0" నుండి 346'-40'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్రనాధుడు శని. ఇది సవ్యనక్షత్రం. పురుషనక్షత్రం. శరీరభాగాలలో పాదముల వేళ్ళను సూచిస్తుంది. దు,ఖ,ఝ,ధు అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లు గలవారి జన్మనక్షత్రంగా ఉత్తరాభాద్రను సూచిస్తారు. ఇది అధమ దీర్ఘాయు నక్షత్రము.

ఉత్తరాభాద్ర నక్షత్రంలోకి నిరయనరవి మార్చి 19 తేదీన ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $336^0$-26'-40" నుండి $337^0$-20'-0" వరకు విషభాగలు.

ఉత్తరాభాద్ర నక్షత్రంలో జన్మించినవారు పరోపకారులు, వేదాంతులు, సాహసవంతులు, ధర్మప్రవర్తన కలవారు అయి ఉంటారు.

ఈ నక్షత్రంలో పుట్టినవారు ఆసుపత్రులు, జైళ్ళు, నీటిపారుదల సంస్థ, సముద్రముపై ఆధారపడి చేయు పనులలో రాణిస్తారు.

## 27. రేవతి

ఇది 27వ నక్షత్రం. ఇది మీనంలో $346^0$-40'-0" నుండి $360^0$-0'-0" వరకు వ్యాపించి ఉంటుంది. ఈ నక్షత్ర నాధుడు బుధుడు. ఇది సవ్య నక్షత్రం. స్త్రీ నక్షత్రం. శరీర భాగాలలో పాదములను, చెవిలోపలి భాగాలను సూచిస్తుంది. దే,దో,చ,చి అను అక్షరములతో ప్రారంభమయ్యే పేర్లుగల వారి జన్మ నక్షత్రంగా రేవతిని సూచిస్తారు. ఇది అల్పాయు నక్షత్రం.

రేవతి నక్షత్రంలోకి నిరయన రవి ఏప్రియల్ 1న ప్రవేశిస్తాడు. ఈ నక్షత్రంలో $353^0$-20'-0" నుండి $354^0$-13'-20" వరకు విషభాగలు.

రేవతి నక్షత్రంలో జన్మించినవారు అందము, తెలివి, ధైర్యము కలవారు, నేర్పరులు, జ్ఞానవంతులు అయి ఉంటారు.

రేవతి నక్షత్రంలో పుట్టినవారు ఉపాధ్యాయులు, లెక్చరర్, లాయరు, రాయబారులు, న్యూస్ ఏజంటు, రియల్ ఎస్టేటు ఏజంటు, సలహాదారు, కంట్రాక్టరులు అయి ఉంటారు. ఫారిన్‌లో చదువు, జ్యోతిష్యం, రేవులు, యూనివర్సిటీలు, పుస్తక ప్రచురణలలో రాణిస్తారు.

ఈ విషయములను గమనించండి.

* ఏదైనా నక్షత్రంలో జన్మించుట అనగా జాతకుడు పుట్టిన సమయంలో ఆ నక్షత్రంలో చంద్రుడు ఉండు సమయమున జన్మించుట అని అర్థము. జాతకుడు జన్మించు సమయాన చంద్రుడు ఏ నక్షత్రంలో ఉంటే ఆ నక్షత్రమునే జన్మనక్షత్రం అంటారు.
* నక్షత్రంలో విషభాగలు ఉన్న సమయంలో జాతకునికి అనారోగ్యము, ఆపద అని గ్రహించాలి.
* అల్పాయు నక్షత్రంలో జన్మించిన వారు అల్పాయుష్కులుగా భావించ నవసరం లేదు. జాతకుని ఆయుస్సును నిర్ణయించుటకు జాతకచక్రములోని అనేక విషయాలను పరిశీలించవలసి ఉంటుంది.

# 6. గ్రహాలు

సూర్యుడు, సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలు, ఉపగ్రహాలను సౌర కుటుంబం అంటారు. గ్రహాలు సూర్యునిచుట్టూ దీర్ఘవృత్తాకార కక్ష్యలలో తిరుగుతాయి. సూర్యుడు ఒక నక్షత్రం అని, చంద్రుడు ఉపగ్రహమని తెలుసు.

కాని జ్యోతిష్యపరంగా మానవ జీవితాన్ని ప్రభావితం చేయగల గ్రహాలుగా సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువులను తీసుకొన్నారు. ఇవి కాక కొంతమంది జ్యోతిష్య శాస్త్రజ్ఞులు నెప్ట్యూన్ (ఇంద్రుడు) యురేనస్ (వరుణుడు) అనే గ్రహాలను పరిగణనలోకి తీసుకొంటున్నారు.

వీటిలో రవి, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని ప్రత్యక్ష గ్రహాలు.

రాహువు, కేతువులు ఛాయాగ్రహములు. నెప్ట్యూన్, యురేనస్, ప్లూటో ఆధునిక కాలంలో కనుగొనబడిన గ్రహములు.

| గ్రహము | వర్ణము | గ్రహము | వర్ణము | గ్రహము | వర్ణము |
|---|---|---|---|---|---|
| రవి | ఎరుపు | రాహు | నలుపు | బుధ | చిలకాకుపచ్చ |
| | | | | కేతు | చామనచాయ (చిత్రమైన రంగు |
| చంద్ర | పాండువర్ణము | గురు | పసుపు | | |
| కుజ | రక్తవర్ణము | శని | నీలము | శుక్ర | ఆకాశనీలం |

## గ్రహములు - లింగ భేదం

**పురుష గ్రహములు** : రవి, కుజుడు, గురుడు

**స్త్రీ గ్రహములు** : చంద్రుడు, శుక్రుడు

**నపుంసక లింగములు** : శని, బుధుడు, కేతువు, రాహువు.

కొందరు రాహుకేతువులను స్త్రీ గ్రహములుగా భావిస్తున్నారు.

## గ్రహములు - గుణములు

గుణములు బట్టి గ్రహాలను 3 వర్గాలుగా విభజించారు. అవి

1) **సత్వగుణము గల గ్రహాలు** : రవి, చంద్ర, గురు

2) **రజోగుణముగల గ్రహాలు** : బుధుడు, శుక్రుడు

3) **తమోగుణము గల గ్రహాలు** : శని, కుజ, రాహు, కేతువు

## గ్రహములు - వాని కాచ్ఛాదన

- పూర్ణచంద్రుడు, శని, కేతువులు తామున్న రాశికి ద్వితీయ, ద్వాదశములను (2,12 రాశులను) ఆచ్ఛాదింతురు.
- గురుడు తానున్న రాశికి తృతీయ, ఏకాదశములను (3, 11, రాశులను) ఆచ్ఛాదించును.

## గ్రహములు - వాని స్వభావములు

| | |
|---|---|
| రవి - స్థిరగ్రహం | బుధుడు - మిశ్రమ గ్రహం |
| చంద్రుడు - చరగ్రహం | గురుడు - మృదుగ్రహం |
| కుజుడు - ఉగ్రగ్రహం | శుక్రుడు - లఘుగ్రహం |
| | శని - తీక్షణగ్రహం |

## గ్రహములు -తత్త్వములు

| తత్త్వములు | గ్రహములు |
|---|---|
| అగ్నితత్త్వము | రవి, కుజులు |
| జలతత్త్వము | చంద్రుడు, శుక్రుడు |
| భూతత్త్వము | బుధుడు |
| వాయుతత్త్వము | శని |
| ఆకాశతత్త్వము | గురుడు |

## గ్రహములు - దిక్కులు

| దిక్కులు | అధిపతులు |
|---|---|
| తూర్పు | రవి |
| ఆగ్నేయం | శుక్రుడు |
| దక్షిణం | కుజుడు |
| నైరుతి | రాహువు |

| దిక్కులు | అధిపతులు |
|---|---|
| పడమర | శని |
| వాయవ్యం | చంద్రుడు |
| ఉత్తరం | బుధుడు |
| ఈశాన్యం | గురుడు |

## గ్రహములకు దిగ్బలములు

- గురు, బుధులు లగ్నమందు వుంటే తూర్పున బలవంతులు.
- రవి, కుజులు దశమమందున్న దక్షిణమున బలవంతులు
- చంద్ర, శుక్రులు చతుర్థమందున వుంటే ఉత్తరమున బలవంతులు.
- శని సప్తమమున యుంటే పడమర బలవంతులు.

గ్రహముల దిగ్బలములు ప్రశ్నశాస్త్రమున బాగుగా ఉపయోగపడును.

## గ్రహములు - శరీరధాతువులు

| గ్రహము | శరీరధాతువు |
|---|---|
| రవి | ఎముకలు |
| చంద్రుడు | రక్తము |
| కుజుడు | మెదడు |
| బుధుడు | చర్మము |

| గ్రహము | శరీరధాతువు |
|---|---|
| గురుడు | క్రొవ్వు |
| శుక్రుడు | వీర్యము |
| శని | నరములు |

## గ్రహములు - జీవులు

- రవి, బుధులు పక్షుల వలె రెక్కలు గలవారు.
- చంద్రుడు పురుగుల వలె అనేక పాదములు కలవాడు.
- గురు, శుక్రులు రెండు పాదములు కలవారు.
- కుజ శనులు చతుష్పాదులు.

## శుభగ్రహములు

పూర్ణచంద్రుడు, గురుడు, శుక్రుడు, శుభగ్రహములతో కూడిన బుధుడు.

## అశుభగ్రహములు

రవి, క్షీణచంద్రుడు, శని, రాహువు, కేతువు, కుజుడు, పాపులతో కలసియున్న బుధుడు.

బహుళపక్షములో అష్టమి నుండి శుక్లపక్షములో అష్టమివరకు క్షీణచంద్రుడు అనబడును. శుక్లపక్షంలో అష్టమినుండి బహుళపక్షంలో అష్టమి వరకు పూర్ణచంద్రుడు అనబడును.

శుభాశుభగ్రహముల గురించి మరికొంత విపులంగా తెలుసుకొందాం.

1) పూర్ణచంద్రుడు గురు సముడు. గురుడు పూర్ణశుభుడు కావున పూర్ణచంద్రుడు శుభుడు.

2) త్రిపాదచంద్రుడు శుక్రతుల్యుడు, శుక్రుడు త్రిపాద శుభుడు. కావున త్రిపాద చంద్రుడు మూడువంతుల శుభాన్ని, ఒక వంతు అశుభాన్ని కలుగజేస్తుంది.

3) అర్ధచంద్రుడు బుధసముడు. అనగా బుధునివలెనే అర్ధచంద్రుడు శుభగ్రహాలతో కలసియుంటే శుభగ్రహంగా, పాపగ్రహాలతో కలసియుంటే పాపగ్రహంగా వ్యవహరిస్తాడు.

4) క్షీణచంద్రుడు పాదశుభుడు అనగా త్రిపాదపాపి.

5) శనికేతువులు పూర్ణపాపులు.

6) కుజుడు త్రిపాదపాపి

7) రవి అర్ధపాపి

8) పాపయుతబుధుడు పూర్ణపాపి.

గ్రహముల గురించి మరికొన్ని విషయాలు పట్టికరూపంలో ఈయబడ్డాయి. గమనించండి.

| గుర్తు | రవి ☉ | చంద్ర ☽ | కుజ ♂ | బుధ ☿ | గురు ♃ | శుక్ర ♀ | శని ♄ | రాహు ☊ | కేతు ☋ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| స్వభావం | పాప | శుభ/పాప | పాప | శుభ/పాప | శుభ | శుభ | పాప | పాప | పాప |
| స్వభావం2 | స్థిర | చర | క్రూర | మిశ్రమ | మృదు | లఘు | తీక్షణ | క్రూర | క్రూర |
| గుణం | రజో | సత్వ | తమో | రజో | సత్వ | సత్వ | తమో | తమో | తమో |
| లింగభేదం | పురుష | స్త్రీ | పురుష | నపుం | పురుష | స్త్రీ | నపుం | స్త్రీ/నపుం | స్త్రీ / నపుంస |
| జాతులు | క్షత్రియ | వైశ్య | క్షత్రియ | వైశ్య | బ్రాహ్మణ | బ్రాహ్మణ | శూద్ర | మ్లేచ్ఛ | మ్లేచ్ఛ |
| రంగులు | ఎరుపు | తెలుపు | రక్తం | ఆకుపచ్చ | పసుపు | ఆకాశనీలం | నీలం | నలుపు | చిత్రమైనరంగు |
| తత్త్వములు | అగ్ని | జల | అగ్ని | భూ | ఆకాశ | జల | వాయు | ....... | ....... |
| ఆధిపత్యదిక్కులు | తూర్పు | వాయవ్యం | దక్షిణం | ఉత్తరం | ఈశాన్యం | ఆగ్నేయం | పడమర | నైరుతి | వాయవ్యం |
| ఆధిపత్యఋతువు | ..... | వర్ష | గ్రీష్మ | శరత్ | హేమంత | వసంత | శిశిర | .... | ....... |
| స్థానములు | దేవ | జల | వహ్ని | క్రీడా | ధన | శయన | దిబ్బ | పాములు... | పాములుతిరిగే ప్రాంతం |
| రుచులు | కారము | ఉప్పు | చేదు | మిశ్రమ | తీపి | పులుపు | వగరు | ...... | ...... |
| ఉదయాలు | పృష్ఠ | శీర్ష | పృష్ఠ | శీర్ష | ఉభయ | శీర్ష | పృష్ఠ | పృష్ఠ | పృష్ఠ |
| జీవులు | పక్షి | బహుపాది | చతుష్పాది | పక్షి | ద్విపాది | ద్విపాది | చతుష్పాది | ...... | ...... |
| జల/నిర్జల | నిర్జల | జల | నిర్జల | జల | జల | జల | నిర్జల | ..... | ....... |
| ఆత్మాదికారకత్వం | ఆత్మ | మనస్సు | బలము | వాక్కు | జ్ఞానము | కామము | దుఃఖము | .... | ..... |
| పాలనశక్తులు | రాజు | రాజు | నాయకుడు | కుమారుడు | మంత్రి | మంత్రి | సేవకుడు | భటుడు | భటుడు |
| శరీరధాతువు | ఎముక | రక్తము | మెదడు | చర్మము | క్రొవ్వు | వీర్యము | నరములు | ..... | .... |
| లోహధాతువు | రాగి,స్వర్ణం | రజతం | రాగి | కాంస్యం | స్వర్ణం | రజతం | లోహం | సీసం | ఇనుము |
| చెందబడిన నక్షత్రాలు | కృత్తిక | రోహిణి | మృగశిర | ఆశ్లేష | పునర్వసు | భరణి | పుష్యమి | ఆరుద్ర | అశ్వని |
| | ఉత్తర | హస్త | చిత్త | జ్యేష్ఠ | విశాఖ | పుబ్బ | అనూరాధ | స్వాతి | మఖ |
| | ఉ.షాఢ | శ్రవణం | ధనిష్ట | రేవతి | పూ.భాద్ర | పూ.షాఢ | ఉ.భాద్ర | శతభిషం | మూల |
| చెందినరాశులు | సింహం | కర్కాటకం | మేషం | మిధునం | ధనుస్సు | వృషభం | మకరం | .... | ..... |
| | | | వృశ్చికం | కన్య | మీనం | తుల | కుంభం | .... | ..... |
| దశావర్షములు | 6 | 10 | 7 | 17 | 16 | 20 | 19 | 18 | 7 |
| చెందిన రత్నం | కెంపు | ముత్యము | పగడం | పచ్చ | పుష్యరాగం | వజ్రం | నీలం | గోమేధికం | వైఢూర్యం |

# గ్రహశక్తులు

గ్రహములయొక్క శక్తి వలననే మానవుని ఆకారం, స్వభావము మొదలైనవి ఏర్పడుతున్నవి. అతని బుద్ధిబలముచేత, ప్రవర్తనచేత అతను కీర్తింపబడుట లేదా దూషింపబడుట జరుగుతుంది.

ఇదేవిధంగా గ్రహముల శక్తివలననే కుటుంబసభ్యులు, బంధువులు, వారి మధ్య సంబంధ బాంధవ్యాలు ఏర్పడుతున్నవి. సంఘ నిర్మాణాదులందు కూడ ఈ శక్తులే పనిచేస్తుంటాయి. మన వృత్తి వ్యాపారములయందు కూడ ఈ గ్రహశక్తుల ప్రభావం వున్నది.

జాతకం చెప్పినపుడు ఈవిషయాలు మనకు చాలా ఉపయోగపడతాయి. కావున గ్రహశక్తుల గురించి తెలుసుకుందాం.

| గ్రహము | కుటుంబ సంబంధం | సంఘనిర్మాణం | ప్రభుత్వం |
|---|---|---|---|
| రవి | తండ్రి లేక యజమాని | పరిపాలనాకేంద్రం | శాసకుడు |
| చంద్రుడు | తల్లి లేక యజమానురాలు | నీటివసతి, తోటలు | ప్రజాకార్యశాఖ |
| కుజుడు | తమ్ముళ్లు | రక్షణశాఖ | రక్షణశాఖ |
| బుధుడు | మేనత్త, మేనమామ | రెవిన్యూ, వాణిజ్యం | తంతి తపాలా, ప్రసారం, రాయబారం |
| గురుడు | పెద్దలు | కోర్టు, ట్రెజరీ, దేవాలయం, లైబ్రరీ | ఆర్థికం, ఆహారం. |
| శుక్రుడు | యువతులు | వినోదం, క్రీడలు, ప్రదర్శనలు | వ్యవసాయం, సాంస్కృతిక కార్యక్రమాలు |
| శని | వృద్ధులు, సేవకులు, రోగులు | ఆరోగ్యం, స్మశానాలు కార్మిక కేంద్రాలు | శ్రామికులు, వెనుకబడినవారు. |

ఆయా గ్రహాలు శుభస్థానములలో వుంటే ఆ వ్యక్తులు లేదా సంస్థలకు అభివృద్ధి కలుగును. అశుభస్థానాలలో వుంటే ఆటంకం కలుగుతుంది.

ఇప్పటివరకు గ్రహాల స్వభావాదుల గురించి తెలుసుకొన్నాం. ఇపుడు జాతక ఫలితాలు చూడటానికి అవసరమైన విషయాలను తెలుసుకొందాం.

## గ్రహముల ఉచ్ఛనీచలు :-

ఒకగ్రహం ఉచ్ఛక్షేత్రమునకు ఎదురుగా వున్న ఏడవరాశి ఆ గ్రహానికి నీచ క్షేత్రమగును.

| గ్రహము | స్వక్షేత్రం | ఉచ్ఛరాశి | నీచరాశి |
|---|---|---|---|
| రవి | సింహం | మేషము | తుల |
| చంద్ర | కర్కాటకం | వృషభము | వృశ్చికము |
| కుజ | మేషం, వృశ్చికం | మకరము | కర్కాటకము |
| బుధ | కన్య, మిధునం | కన్య | మీనము |
| గురు | ధనుస్సు, మీనం | కర్కాటకము | మకరము |
| శుక్ర | వృషభం, తుల | మీనము | కన్య |
| శని | మకరం,కుంభం | తుల | మేషము |
| రాహువు | సింహం | వృషభము | వృశ్చికము |
| కేతువు | కుంభం | వృశ్చికము | వృషభము |

రాహు, కేతువులకు స్వక్షేత్రవిషయములో భిన్నాభిప్రాయాలు కలవు

మిధునం, సింహం, ధనుస్సు, కుంభంలు ఏ గ్రహములకు ఉచ్చరాశులుగా చెప్పబడలేదు. స్వక్షేత్ర నాధులే ఆ రాశులలో బలవంతులు.

గ్రహముల మిత్ర, సమ, విషమ క్షేత్రాలు

ఒక గ్రహం యొక్క స్వక్షేత్రమునకు ఎదురుగా వున్న ఏడవ రాశి ఆ గ్రహానికి శత్రుక్షేత్రాలలో ఒకటి అవుతుంది.

## గ్రహములు - మూలత్రికోణములు

| గ్రహము | మూల త్రికోణము |
|---|---|
| రవి | సింహము |
| చంద్రుడు | వృషభము |
| కుజుడు | మేషము |
| బుధుడు | కన్య |
| గురుడు | ధనుస్సు |
| శుక్రుడు | తుల |
| శని | కుంభము |

ఏదైనా గ్రహము యొక్క మూల త్రికోణరాశి లగాయితు 2, 5, 8, 9, 12 రాశుల అధిపతులయిన గ్రహములు, మరియు మనం తీసుకున్న గ్రహానికి ఉచ్ఛరాశి యొక్క అధిపతియు, ఆ గ్రహానికి మిత్రులవుతారు.

వీటిలో ఏ గ్రహమైనా రెండు రాశులకు అధిపతి అయితే ఆ గ్రహము మనం తీసుకున్న గ్రహానికి మిత్రుడు. అలాకాక ఈ రాశి అధిపతులగు గ్రహాలలో ఏ గ్రహమైనా ఒకే రాశికి అధిపతి అయితే ఆ గ్రహము మనం తీసుకున్న గ్రహానికి "సముడు" అవుతాడు.

## గ్రహముల శత్రు మిత్రత్వములు

| గ్రహము | మిత్రులు | శత్రువులు | సములు |
|---|---|---|---|
| రవి | చంద్ర, కుజ, గురు | శని, శుక్ర | బుధ |
| చంద్ర | రవి, బుధ | లేరు | కుజ, గురు, శని, శుక్ర |
| కుజ | రవి, చంద్ర, గురు | బుధ | శుక్ర, శని |
| బుధ | రవి, శుక్ర | చంద్ర | కుజ, గురు, శని |
| గురు | చంద్ర, కుజ | బుధ, శుక్ర | శని, రవి |
| శుక్ర | బుధ, శని | రవి, చంద్ర | కుజ, గురు |
| శని | బుధ, శుక్ర | రవి, చంద్ర, కుజ | గురు |
| రాహు | శుక్ర, శని | రవి, చంద్ర, కుజ | బుధ, గురు |
| కేతు | రవి, చంద్ర, కుజ | శని, శుక్ర | బుధ, గురు |

స్వభావసిద్ధంగా శుభులైన గ్రహాలు స్థానాధిపత్యం చేత పాపగ్రహాలుగాను, స్వభావ సిద్ధంగా పాపులైన గ్రహాలు, స్థానాధిపత్యంచేత శుభగ్రహాలుగాను వ్యవహరిస్తాయి.

నైసర్గిక శుభగ్రహాలు: పూర్ణచంద్రుడు, గురుడు, శుక్రుడు, శుభగ్రహయుతుడైన బుధుడు.

నైసర్గిక శుభగ్రహాలు జాతకచక్రంలో పాపస్థానములైన 3, 6, 8, 12 స్థానములకు అధిపతులైన అవి అశుభాన్ని కలుగజేస్తాయి.

**నైసర్గిక పాపగ్రహాలు :** రవి, కుజ, శని, రాహు, కేతువులు, క్షీణచంద్రుడు, పాపగ్రహయుతుడైన బుధుడు.

నైసర్గిక పాపగ్రహాలు జాతకచక్రములో 1, 2, 4, 5, 7, 9, 10, 11 స్థానములకు అధిపతులైన అవి శుభగ్రహములవలె వ్యవహరిస్తాయి.

## గ్రహము యొక్క తాత్కాలిక మిత్రులు, శత్రువులు

ప్రతి గ్రహమునకు తానున్న స్థానము నుండి 2, 3, 4, 10, 11, 12 స్థానములలో వున్న గ్రహములు తాత్కాలిక మిత్రులవుతారు. అలాగే ప్రతి గ్రహమునకు తానున్న స్థానము నుండి 1, 5, 6, 7, 8, 9 స్థానములలో ఉన్న గ్రహములు తాత్కాలిక శత్రువు లవుతారు.

నైసర్గిక మిత్రులు తాత్కాలిక మిత్రులయితే అధిమిత్రులు అవుతారు. అలాగే నైసర్గిక శత్రువులు, తాత్కాలిక శత్రువులయితే 'అధిశత్రువు'లవుతారు.

నైసర్గిక సములు తాత్కాలిక మిత్రులైతే మిత్రులవుతారు. నైసర్గిక సములు తాత్కాలిక శత్రువులైతే శత్రువులవుతారు.

**ఉదాహరణ :**

1) రవి, శనులు నైసర్గిక శత్రువులు. వారు జాతకచక్రంలో ఒకరికొకరు 2, 3, 4, 10, 11, 12 స్థానములలో వుంటే 'సములు' అవుతారు.
2) గురువు, శని నైసర్గిక సములు. వారు జాతకచక్రములో ఒకరికొకరు 1, 5, 6, 7, 8, 9 స్థానములలో వుంటే శత్రువులవుతారు.

## స్థానముల దృష్ట్యా గ్రహములిచ్చు ఫలము

1) స్వక్షేత్రములో, ఉచ్చరాశిలో వున్న గ్రహము పూర్ణఫలమును యిచ్చును.
2) మూలత్రికోణ రాశిలో వున్న గ్రహము 3/4 వంతు ఫలమును యిచ్చును.
3) స్వక్షేత్రంలో వున్న గ్రహము 1/2వంతు ఫలము యిచ్చును.
4) అధిమిత్ర క్షేత్రములో వున్న గ్రహము 3/8 వంతు ఫలమును యిచ్చును.
5) మిత్ర క్షేత్రములో ఉన్న గ్రహము 1/4 వంతు ఫలమును యిచ్చును.
6) సమక్షేత్రములో వున్న గ్రహము 1/8 వంతు ఫలమును యిచ్చును.
7) శత్రుక్షేత్రములో వున్నగ్రహము 1/16 వంతు ఫలమును యిచ్చును.
8) అధిశత్రుక్షేత్రములో వున్న గ్రహము 1/32 వంతు ఫలమును యిచ్చును.
9) నీచక్షేత్రములో వున్న గ్రహము శుభఫలము నీయదు.

## గ్రహదోషములు - వాటి పరిహారక గ్రహములు

రాహు, బుధ, శని, కుజ, శుక్ర, గురు, చంద్ర, రవిలలో క్రమముగా ఒక గ్రహానికి ముందున్న గ్రహాల దోషములన్నింటిని ఆ గ్రహమే పోగొట్టును. అనగా...

1) రాహువు దోషమును బుధుడు పోగొట్టును.

2) రాహువు, బుధుని దోషమును శనిపోగొట్టును.

3) రాహు, బుధ, శని దోషమును కుజుడు పోగొట్టును.

4) రాహు, బుధ, శని, కుజుల దోషమును శుక్రుడు పోగొట్టును.

5) రాహు, బుధ, శని, కుజ, శుక్రుల దోషమును గురుడు పోగొట్టును.

6) రాహు, బుధ, శని, కుజ, శుక్ర, గురుల దోషమును చంద్రుడు పోగొట్టును.

7) రాహు, బుధ, శని, శుక్ర, గురు, చంద్రుల దోషమును రవి పోగొట్టును.

## రాశులలో గ్రహములుండు కాలము

ఏదైనా ఒక రాశిలో

1) రవి 30 రోజులు వుండును.

2) చంద్రుడు 2 1/2 రోజులు వుండును.

3) కుజుడు 45 రోజులు వుండును.

4) బుధుడు 30 రోజులు వుండును.

5) రాహువు 18 నెలలు (11/2 సం॥) వుండును

6) గురుడు 12 నెలలు (1 సం॥) వుండును.

7) శుక్రుడు 30 రోజులు వుండును.

8) శని 30 నెలలు (21/2 రోజులు) వుండును.

9) కేతువు 18 నెలలు (11/2 సం॥) వుండును.

❖ బుధుడు సాధారణంగా రవియున్న రాశిలో లేదా ఆ రాశికి ముందు రాశిలో లేదా తరువాత రాశిలో వుంటాడు.

❖ శుక్రుడు, రవియున్న రాశిలో లేదా రవికి ముందున్న రెండు రాశులలో లేదా రవికి తరువాత వున్న రెండు రాశులలో వుంటాడు.

రాహువు, కేతువులు ఒకరికొకరు ఏడవ రాశిలో వుంటారు.

# గ్రహములు - వీక్షణములు

| అన్ని గ్రహములు తామున్న స్థానము నుండి 7వ రాశిని అందులోని గ్రహాలను చూస్తాయి. |
|---|

1) రవి — తానున్న స్థానము నుండి 7వ రాశిని అందులోని గ్రహాలను వీక్షించును.

2) చంద్రుడు — తానున్న స్థానమునుండి 7వ రాశిని అందులోని గ్రహాలను వీక్షించును.

3) కుజుడు — తానున్న స్థానము నుండి 4, 7, 8 రాశులను అందులోని గ్రహాలను వీక్షించును.

4) రాహువు — తానున్న స్థానమునుండి 7వ రాశిని, అందులోని గ్రహాలను వీక్షించును.

5) గురువు — తానున్న స్థానము నుండి 5, 7, 9 స్థానములను వాటిలోని గ్రహాలను వీక్షించును.

6) శని — తానున్న స్థానమునుండి 3, 7, 10 స్థానములను వాటిలోని గ్రహాలను వీక్షించును.

7) బుధుడు — తానున్న స్థానమునుండి7వ స్థానమును, దానిలోని గ్రహాలను వీక్షించును.

8) కేతువు — తానున్న స్థానమునుండి 7వ స్థానమును దానిలోని గ్రహాలను వీక్షించును.

9) శుక్రుడు — తానున్న స్థానమునుండి 7వ స్థానమును దానిలోని గ్రహాలను వీక్షించును.

| అన్ని గ్రహములు తామున్న స్థానం నుండి 7వ స్థానంను చూస్తాయి. శని తానున్న రాశినుండి 3, 10 స్థానములను, కుజుడు తానున్న రాశినుండి 4, 8 స్థానములను, గురుడు తానున్న రాశినుండి 5, 9 స్థానములను కూడ చూస్తాయి. |
|---|

పాదదృష్టి — 3, 10 స్థానములను చూచు దృష్టిని పాదదృష్టి అంటారు. పాదదృష్టిలో శని బలవంతుడు.

అర్ధదృష్టి — 5, 9 స్థానములను చూచు దృష్టిని అర్ధదృష్టి అంటారు. అర్ధదృష్టిలో గురుడు బలవంతుడు.

త్రిపాదదృష్టి 4, 8 స్థానములను చూచు దృష్టిని త్రిపాద దృష్టి అంటారు. త్రిపాద దృష్టిలో కుజుడు బలవంతుడు.

పరిపూర్ణదృష్టి 7వ స్థానమును చూచు దృష్టిని పరిపూర్ణ దృష్టి అంటారు. పరిపూర్ణదృష్టిలో అన్ని గ్రహములు బలవంతులే.

## జైమిని మతం ప్రకారం గ్రహదృష్టులు

- చరరాసులలో ఉండు గ్రహములు స్థిరరాసులలోని గ్రహములను చూచును.
- స్థిరరాసులలో ఉండుగ్రహములు చరరాసులలోని గ్రహములను చూచును.
- ద్విస్వభావరాసులలో ఉండు గ్రహములు చర, స్థిరరాసులలోని గ్రహములను చూచును.

## పరిశీలించదగిన మరికొన్ని దృష్టులు

**1. సమాగమ దృష్టి :-**

రెండు గ్రహములు ఒకే డిగ్రీలో లేదా $7^0$ ల తేడాతో ఉంటే సమాగమ దృష్టి ఏర్పడుతుంది.

రెండు శుభగ్రహముల మధ్య సమాగమ దృష్టి శుభము నిచ్చును. రెండు పాప గ్రహముల మధ్య ఈ దృష్టి అశుభము నిచ్చును.

**2. అర్థకోణ దృష్టి :-**

రెండు గ్రహముల మధ్య $60^0$ దూరముంటే అర్థకోణ దృష్టి ఏర్పడుతుంది. $55^0$ నుండి $65^0$ల దూరమువరకు ఈ దృష్టిని పరిగణింతురు.

ఏ రెండు గ్రహముల మధ్యనయినా అర్ధకోణదృష్టి శుభము నిచ్చును.

**3. కేంద్ర దృష్టి :-**

రెండు గ్రహముల మధ్య $90^0$ దూరముంటే కేంద్రదృష్టి ఏర్పడుతుంది. $85^0$ నుండి $95^0$ల దూరమువరకు ఈ దృష్టిని పరిగణింతురు.

శుభగ్రహముల మధ్య ఈ దృష్టి శుభఫలితాలను యిస్తుంది.

**4. కోణ దృష్టి :-**

రెండు గ్రహముల మధ్య $120^0$ దూరముంటే కోణదృష్టి ఏర్పడుతుంది. $115^0$ నుండి $125^0$ వరకు ఈ దృష్టి ఏర్పడుతుంది.

ఏ రెండు గ్రహముల మధ్యనైనా ఈ దృష్టి శుభము నిస్తుంది.

**5. సమసప్తక దృష్టి :-**

రెండు గ్రహముల మధ్య $180^0$ దూరముంటే సమసప్తక దృష్టి ఏర్పడుతుంది. $175^0$ నుండి $185^0$ వరకు ఈ దృష్టి ఏర్పడుతుంది.

రెండు శుభగ్రహముల మధ్య సమసప్తకదృష్టి శుభమునిస్తుంది.

**6. సమాంతర దృష్టి :-**

రెండు గ్రహములు ఉత్తర, దక్షిణములలో ఒకే డిగ్రీలో వుంటే సమాంతరదృష్టి ఏర్పడుతుంది.

రెండు శుభగ్రహముల మధ్య సమాంతరదృష్టి శుభమునిస్తుంది. రెండు పాప గ్రహముల మధ్య ఈ దృష్టి అశుభము నిస్తుంది.

(రాఫెల్ ఎఫిమెరిస్ వంటి కొన్ని ఎఫిమెరిస్‌లలో గ్రహముల మధ్య సమాంతరదృష్టి ఇవ్వబడింది).

## గ్రహములు - కారకత్వములు

**రవి** : రవి తనూకారకుడు, పితృకారకుడు. ఇవేకాక గురువు, రాజ్యము, ధైర్యము, నేత్రము, పిత్తములకు కారకుడు.

**చంద్రుడు** : చంద్రుడు మనఃకారకుడు, మాతృకారకుడు. ఇవేకాక బుద్ధి, అందము, జలము, బలము, వెండి, యాత్రలు, శ్లేష్మములకు కారకుడు.

**కుజుడు** : కుజుడు సోదరకారకుడు. ఇవేకాక భూమి, సాహసము, శస్త్రవిద్య, సేనాధిపత్యం, అక్కచెల్లెండ్రు, స్ఫోటకము, ఉష్ణములకు కారకుడు.

**రాహువు** : రాహువు మాతామహకారకుడు. ఇవేకాక తండ్రి, చెరువు, ఆరామము, నీచవిద్య, విషవైద్యంలకు కారకుడు.

**గురుడు** : గురుడు ధనకారకుడు, పుత్రకారకుడు. ఇవేకాక లాభం, జ్యోతిష్యం, వేదం, బంగారం, గృహసౌఖ్యం, కర్మ, బంధువులు, ధర్మము, వస్త్రము, బంగారములకు కారకుడు.

**శని** : శని ఆయుః కారకుడు, వ్యయకారకుడు. ఇవేకాక క్షుద్రదేవతోపాసన, దుఃఖము, మరణము, బంధనం, అందవిహీనత, పాపము, హూణవిద్య, దుష్ప్రవర్తనలకు కారకుడు.

బుధుడు : బుధుడు విద్యాకారకుడు. ఇవేకాక జ్యోతిష్యం, గణితం, వ్యాపారం, శిల్పవిద్య, వేదాంతం, పరిచారకులు, వైద్యములకు కారకుడు.

కేతువు : కేతువు మోక్షకారకుడు. ఇవేకాక జ్ఞానము, వైరాగ్యం, వేదాంతం, పితామహుడు, చింతకు కారకుడు.

శుక్రుడు : శుక్రుడు కళత్రకారకుడు. ఇవేకాక వివాహం, కళలు, స్త్రీ సౌఖ్యం, వాహనసౌఖ్యం, భోగం, వ్యభిచారం, ప్రభుత్వం, ముద్రాధికారం, మేహంలకు కారకుడు.

## గ్రహషడ్బలములు

**1) స్థానబలము :-**

ఏ గ్రహమైనను తన మిత్రక్షేత్రమునందు, స్వక్షేత్రమునందు, ఉచ్ఛయందు, హోర, మూల త్రికోణము, ద్రేక్కాణము, నవాంశ, ద్వాదశాంశ, త్రిశాంశలయందు వుంటే మరియు అష్టకవర్గులయందు అధిక బిందువులు కలిగియుంటే ఆ గ్రహము ఆ స్థానములో బలమైనది.

**2) దిగ్బలము :-**

తూర్పుదిక్కున (అనగా లగ్నమున) గురు, బుధులు, దక్షిణమున (అనగా 10వ స్థానమున) రవి, కుజులు, పశ్చిమమున (7వ స్థానమున) శని, ఉత్తరమున (4వ స్థానమున) చంద్ర శుక్రులు బలవంతులు.

**3) చేష్టాబలము :-**

రవిచంద్రులు ఉత్తరాయనమునందు బలవంతులు. మిగిలిన గ్రహములు దక్షిణాయనమున బలవంతులు.

**4) కాలబలము :-**

రవి, గురు, శుక్రులు పగలు బలవంతులు. చంద్ర, కుజ, శని రాత్రి బలవంతులు. బుధుడు రాత్రి, పగలు కూడ బలవంతుడు.

గ్రహములు తమవారములయందు, తమ హోరలయందు బలవంతులు.

శుభగ్రహములు శుక్లపక్షమున, పాపగ్రహములు కృష్ణపక్షమున బలవంతులు.

**5) దృష్టిబలము :-**

ఏ గ్రహమైనను తానున్న స్థానమునుండి 7వ స్థానమును సంపూర్ణదృష్టితో, 4, 8 స్థానములను 3/4 దృష్టితో, 5, 9 స్థానములను 1/2 దృష్టితో, 10, 3 స్థానములను 1/4 దృష్టితో చూచును.

**6) నైసర్గికబలము :-**

శని, కుజ, బుధ, గురు, శుక్ర, చంద్ర, రవి అను గ్రహములు వరుసగా ఒకరికన్న మరొకరు సహజమైనబలం కలిగినవారు.

సందర్భానుసారంగా గ్రహములు, రాశులు గురించి మరికొన్ని వివరాలు తెలుసుకుందాం.

## గ్రహగతులు

ప్రతి గ్రహము తమతమ చారయందు 8 రకముల గతులు కలిగియుండును. అవి 1) వక్రము 2) అనువక్రము 3) కుటిలము 4) మందము 5) అతిమందము 6) సమము 7) శీఘ్రము 8) అతిశీఘ్రము.

- రాహువు వక్రగతి కలిగియుండును
- రవిచంద్రులు శీఘ్రగతిని కలిగియుంటారు.
- మిగిలిన గ్రహములు పైన చెప్పిన 8 గతులను కలిగియుంటాయి.

గ్రహాలు మరికొన్ని విశేషగతులను కలిగియున్నవి. అవి

**1) గ్రహయుద్ధము :-**

ఒకే రాశిలో కుజునితో కలసి గురు, శుక్ర, శని, బుధులలో ఎవరైనా వుంటే దానిని గ్రహయుద్దము అంటారు.

**2) వక్రగతి :-**

గ్రహములు సూర్యుడున్న రాశికి ఒక నిర్ణయరాశిలో వుంటే, అది వక్రించును. అనగా తామున్న రాశినుండి వెనుకకు వెళ్ళుదురు.

రవిచంద్రులు తప్ప మిగిలిన గ్రహములు వక్రగతిని కలిగి యుండును. రాహు, కేతువులు ఎల్లప్పుడు వక్రగతినే కలిగి యుంటాయి.

**3) సమాగమము :-**

రవితప్ప ఏ గ్రహమైనను చంద్రునితో కలిసిన దానిని సమాగమము అంటారు.

ఉదా :- గురుడు చంద్రునితో కలసిన గజకేసరయోగము, శని చంద్రునితో కలసిన శనిచంద్ర యోగము కలుగును.

**4) అస్తంగత్వము (మూఢము) :-**

రవితో కలసిన గ్రహము తన శక్తిని కోల్పోతుంది. దానిని అస్తంగతము అంటారు.

ఉదా:- రవితో చంద్రుడు కలసిన రోజు అమావాస్య ఏర్పడును. ఆ రోజు చంద్రుడు వెలుగును కోల్పోవును.

**5) అతిచారము :-**

గ్రహములు ఒక్కొక్క రాశిలో నిర్దిష్టకాలము వరకు ఉంటాయి. అలాకాక నిర్దిష్ట కాలమునకు ముందే ఏదైనా గ్రహము తానున్న రాశిని వదలి వేరొకరాశిని చేరుటను అతిచారము అంటారు. రాహుకేతువులకు అతిచారము ఉండదు.

**6) గ్రహస్తంభన :-**

ఏదైనా ఒక గ్రహము తానున్న రాశిలో ఉండవలసిన నిర్ణీతకాలము కంటె ఎక్కువ కాలము ఉంటే, అది స్తంభన అనబడును. ఎక్కువగా కుజగ్రహం స్తంభన చెందుతూ వుంటుంది.

**7) ఆరోహణ గ్రహము :-**

ఏ గ్రహమైనను తన నీచరాశిని వదిలి, ఉచ్ఛరాశికి పోవునప్పుడు ఆ గ్రహము ఆరోహణగ్రహము అనబడును.

**8) అవరోహణ గ్రహము :-**

ఏ గ్రహమైనను తన ఉచ్ఛరాశిని వదిలి నీచరాశికి పోవునప్పుడు ఆ గ్రహము అవరోహణగ్రహము అనబడును.

**వర్గోత్తమాంశ :-**

ఏ గ్రహమైనను రాశిచక్రములో ఏరాశిలో ఉండునో నవాంశచక్రంలో కూడ అదే రాశిలో వుంటే అది వర్గోత్తమాంశ అనబడును.

**రాశ్యంత గ్రహము :-**

ఏ రాశిలోనైనా ఆ రాశియొక్క చివరి డిగ్రీలలో వుండే గ్రహమును రాశ్యంత గ్రహము అంటారు.

## గ్రహలక్షణములు

**జాతక పరిశీలనము :-** జాతకునిపై ఏ గ్రహ ప్రభావము ఎక్కువగా వుంటే ఆ గ్రహ లక్షణముల ననుసరించి ఆ జాతకుని ఆకారము, ఆలోచనలు, వృత్తి వ్యాపారములు అభిరుచులు మొదలైనవాటిని నిర్ణయించవచ్చును.

**1. రవి :-**

రవి ప్రభావితులకు ఆత్మాభిమానము, చురుకుదనము ఎక్కువ. ఇతరులను ఆకర్షించు గుణము కలిగి వుంటారు. సంఘంలో పలుకుబడి వుంటుంది. విశాల హృదయులు. ఆవేశం ఎక్కువ. పొగడ్తలకు లొంగిపోతారు. సంపాదిస్తారు కాని అశ్రద్ధ వలన ఎక్కువ ఖర్చు చేస్తారు. నడివయస్సులో కంటి జబ్బులు రావచ్చు. ఆపత్కాలమున సరియైన ఆలోచనలు వస్తాయి. గుండె జబ్బు, వడదెబ్బ వలన ప్రమాదం కలుగ వచ్చును.

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

Abnormal, Agitatiors, Altruism, Astronomy, Aliens, Advaced ideas, Alarm, Aeroplanes, Avant Gards, Airports, Aviation, Boycotts, Battery, Divorce, Earth Quake, Changes, Electric, Cranks, Dynamo Exile, Discorder, Eccentric, Homosexual, Gales, Experiments, Foreign, Helicopters, Lighting, Independence, Freedom, Liberation, Hurricanes, paradoxes, Metaphysics, Modern, Unconvenentionals, Radar, Invention, Strikes, Anarchy, Aviation, Divorce, Electronics, Flash, Runaways, Interruptions, Ratdio, Tv's, Scientists, Unconventionals, Antiques, X-Ray.

**2.చంద్రుడు :-**

చంద్రుని ప్రభావం కలిగినవారు చిన్నవయసులోనే శ్లేష్మవ్యాధులతో బాధపడతారు. వీరికి నీటిగండం వున్నది. వీరు కొంతకాలం ధైర్యముగా, సంతోషంగా, ఉత్సాహంగా వుంటారు. మరికొంతకాలము పిరికితనంతో, నిరాశతో నీరసంగా వుంటారు. స్నేహితులు, అభిప్రాయాలు తరచుగా మారుచుండును. వివాహం తరువాత పెద్దపొట్ట కలిగి వుంటారు. కొంతకాలం ధనవంతులుగా కొంతకాలం దరిద్రులుగా జీవిస్తారు. భోజన ప్రియులు. స్వతంత్రించి ఏ పనిని చేయలేరు. నీటిపారుదల, పబ్లిక్‌వర్క్స్, వస్త్రములు, బియ్యము వ్యాపారము పానీయాల వ్యాపారములో రాణించగలరు. పాండురోగము, మధుమేహము, శ్వాసకోశవ్యాధులు, క్షయ కలుగవచ్చును.

**పాశ్చాత్యుల దృష్టిలో చంద్రుడు :-**

Washing water, Soft, Abdomen, Cafes, Eggs, Banking, Dairies, Family, Gardens, Habbits, Mammals, plants, Residence, Oyster's pearls, poultry, Hydra, Indigestion, Habs, class, Fish, Digestion, Cheese, Cows, Female, Crops, patters, Hotels, cooking, both, cleaning, canals, aquatic, Bevarages, Children, Bottles, Drains, E,otions, Fickle, Taverns, wirfe women ,Tear Drops, Sunconscious, Sailings, sertiliy, plants, residence, Mushrooms.

**3. కుజుడు :-**

శారీరక ధారుఢ్యము కలిగియుండి పొట్టిగా వుంటారు. త్వరగా ధనాన్ని సంపాదించగలరు. అంతేవేగంగా ధనాన్ని ఖర్చుపెట్టగలరు. బంధుమిత్రులంటే అపారమైన ప్రేమ. వీరు తమ ఆవేశాన్ని అదుపులో వుంచుకోవాలి. పదవి, అధికారం, సేవకులు కలిగియుంటారు. కోరికలు అధికంగా వుంటాయి. దానధర్మాలు అధికంగా చేస్తారు. యంత్రములు, ఆయుధములు మొదలగు శాస్త్రములలో ప్రావీణ్యత పొందుతారు. పోలీసు, మిలటరీ వంటి శాఖలలో రాణిస్తారు.

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

Abrasive, Combustion, Masculine, Sows, Thugs, Combat, Fffort, hot instruments, Scars, Bites, camon, utensils, overs Mulers, Violence, Fevers, Actions, Temper, Rape, Explosives, Dagar, Cruelty, Anger, Battles, Wedlig, Cooking, utensils, Daring, Breakage, pioneers, Gymnastics, Milatary, Furnaces, Armed forces, Conflict, Boxing, Radiators. Emergencies, Accidents, Brawls, Torpedoes, Fighting, Ammunitio, Butchers, Advanture, Engineer, Assassins, Inflammation, Arsandals, Rebellions, Artilery, Surgeons,

**4.బుధుడు :-**

ఎల్లప్పుడు సంతోషంగా వుంటారు. వీరి పెదవులపై చిరునవ్వు మెదులుతూ వుంటుంది. పొట్టిగా వుంటారు. చురుకైనవారు. వృద్ధాప్యంలో కూడా యువకులవలె వుంటారు. నాటకరచయితలు, నటులు, విషయజ్ఞానం ఎక్కువగానే వుంటుంది. దీర్ఘాలోచనా పరులు. సందేహపరులు.

తలనొప్పి, నరముల వ్యాధులు, అలసరువంటి వ్యాధులు రావచ్చు.

రేడియో, టి.వి., పత్రికారంగం, ప్రచురణరంగం, టెలిఫోన్ రంగాలలో రాణిస్తారు.

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

Accounts, Clerks, Trade, Youth, Speed, Facts, Grammer, Clever, Scholors, Cabs, Hand writing, colourists, Learning, Essays, Pickpockets, speed, Novels, Fiction, Cables, Books, Proverb, study, Inquireies, Dairies knowledge, Editors, Borad castings, Bicycles, Business matters, Mouth News, Records, Billboards, Advertisement, Report, Deliveries, Arms, Biographer, pamphlets, Vehicles Vocubalary, waling, Restless Rumors, Agents, Catelogues, Ambassadors, Certificates, Education, Communication.

**5) గురుడు :-**

లావుకు తగ్గ పొడవును కలిగి మంచి ఆకారము కలిగినవారై వుంటారు. వీరికి ఆహారము, వస్త్రము, సౌఖ్యములకు కొదువ వుండదు. సంప్రదాయముల పట్ల నమ్మకము, దైవభక్తివుంటాయి. పండితులు. చట్టము, ధర్మము అంటే గౌరవము. విద్యా సంస్థలతో సంబంధము కలిగియుంటారు. కంఠధ్వని చక్కగా వుంటుంది. విశాలమైన కనులు, నుదురు కలిగి యుంటారు.

అజీర్ణవ్యాధులు, శరీరము బరువుపెరుగుట వంటి అనారోగ్యములు కలగవచ్చును.

దేవాలయములు, బ్యాంకు, L.I.C వంటి సంస్థలలో రాణిస్తారు. న్యాయశాస్త్రంలో ప్రవీణులు కాగలరు.

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

Affluence, Books, Church, Doctor, Anmals Education, Holy matters, Fat, Good Fortune, Colleges, Physicians, Charity, Prizes, Improvements, Happiness, Preachers, Corporate Law, Expansion, Extravengats, Finance, Courntires (Foreign) professional people, wealth, Truth, Worship, Race Horse, Summors, Regulations Sincerity, Theology, Refunds, Titles, Coustoms, Archery, Barristars, Banks, Bishops.

**6. శుక్రుడు :-**

అందమైనవారు. శరీరసౌష్టవం కలిగినవారు. సామాన్యంగా వీరికి బట్టతల యుండదు. సంగీతం అంటే ఆసక్తి ఎక్కువ. లలితకళలంటే ప్రీతి. జనాకర్షణ ఎక్కువ. వీరికి సౌకుమార్యంచేత జనాకర్షణ వుంటుంది. ధనము, ఆహారము,

గృహము, సుఖములకు లోటు వుండదు. స్త్రీలోలత్వమును అదుపులో వుంచుకోవాలి. వీరు నటులు, గాయకులు.

వస్త్రములు, అలంకార సామగ్రి, పూలు వంటి వాణిజ్యమున రాణిస్తారు. రక్తపోటు, రక్తసంబంధమైన వ్యాధులు సుఖవ్యాధులు కలుగవచ్చు.

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

Dress, Artist, Comforts, companions, Gifts, Hairstyles, Love, Sex Appeal, Woman, Romance, Fairs, Honey moon, Happiness, Entertainment, Holidays, Clothes, Sugur, Wings, Concerts, Music, Enjyoment, Glomour, ornaments pleasure, Fine Arts, Costmetics, Affection, Flowers, Jewellery, Luxury, Style, Engagements, Cabarets, Arbitration, profits, Friend shi[, Decorations, Culture, Beauticians, Attachments, Flattery, Donations, Interior Decorations, Dipalomacy, Confectioners, Emotions, Wedding.

**శని :-**

సన్నగా, పొడవుగా వుంటారు. కన్నులు గుంటలు పడి వుండవచ్చు. అనుమానం ఎక్కువ. ఎక్కువగా ఒంటరితనాన్ని కోరుకుంటారు. ఆకలి తక్కువగా వుంటుంది. మూఢాచారపరులు కష్టజీవులు. దీర్ఘకోపము. దీర్ఘాలోచన ఎక్కువ. నడక, ఆలోచన మందంగా వుంటాయి.

వాతము, అజీర్ణము, శ్వాసకోశవ్యాధులు ఉండవచ్చును.

కార్మికశాఖ, ఆరోగ్యశాఖ, పరిశోధనాశాఖ మారిటోరియంలలో రాణిస్తారు.

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

Bones, clay, Dibility, Delays, Formation, Economy, Late Orthodox, Patince, mourning, lonely, Grantic, Mand cafts, Archaclogy. Through, Stones, Snow Pttery, property, Quarries, Falls, Cowards, Delays Gloom, Tragic, Woe, Anxiety, Bridges, Dry, Hesitation, Inflxible, unlucky, Fances, Quarries Acoustics, Barries, Boundaries, Economy, Ceromics, Sad, Wrapping, Mediation, Obedience, Skin, Reservoiers, Slanery. Retirement, Humility, Freez, cowards, Dibility, ceramics.

**రాహువు :-**

పితామహుడు, వృద్ధాప్యము, శ్వాస, భాష, అసత్యము, భ్రమ, వాయువు, విచారము, మరకతము, జూదరి, కఫము, సంధ్యాసమయము, రాజ్యము, బయటప్రదేశం, గొడుగు, పల్లకి, అపరిశ్రుభత, నులిపురుగులు, గుల్మరోగము.

**కేతువు :-**

మాతామహుడు (తాత), స్నేహము, తపస్సు, మోక్షము, దేవతోపాసన, మంత్ర శాస్త్రము, వేదాంతము, వైద్యము, జ్వరము, వ్రణములు, మశూచి, మొదలగునవి.

(రాహువు, కేతువులను పాశ్చాత్యజ్యోతిష్యులు పరిగణించలేదు)

**యురేనస్ The Uranes :-**

**పాశ్చాత్యుల దృష్టిలో :-**

X-Rays, Advanced, Unexpcted Upsets, Ideas, Trespossing, Aeroplanes, TV.s Tonados, Anarchy, Strikes, Astrology stragers, Bohemian Brother, Shocks, Changes, Researon, Discovery, Radar, Earthquakes, paraxes, Eccentric electronics, Non conformists, Engineers. Metophysics, Exile, Genius, Homosexual, Foreign, Independnce.

**నెప్ట్యూన్ (The Neptune)**

**పాశ్యాత్యుల దృష్టిలో :-**

Bay, Cheat, Doal, Escape, Actors, Anesthetic, Alcohal, Artificial, Cigars, Asymso, Bogus, Cinema, Doubledealing, Coffee, Debauchary, Confusion, ESP, Gas, Ficitious, Germicides, Imagination, Hos[itals, Grapft, Floods, Yoga, Wine, Swimiing, Smuggling, Psychic matter, Rubber, Puzzles, Treacher, LSD {rediction, Telepathy, Spritualism, Secret, Sea, Intoxication, Magic, Liquor, Mystry, Petrol, Nightmare.

**ప్లూటో (The Pluto)**

**పాశ్యాత్యుల దృష్టిలో :**

Assassination, Calamities, Hell, Alomic, War Crime, Death, Evil, Creamation, Horror, Laser Beams, Pollution, Rape, Violence, Vermin, Trade Unions,Terrorists, underworld clubs, Ambushes, Bandits, Black magic, Gangsters, Calamities cesspols, computation, Organizedmass murder, Vermin wreckers.

# 7. ద్వాదశ లగ్నాలు - భావాలు

మనపై నవగ్రహాల ప్రభావం ఎలా ఉన్నదో తెలుసుకోవాలంటే, ముందుగా మన జాతక చక్రంను గమనించాలి. దానిలో లగ్నం గురించి, భావాల గురించి, అవి ఏ విషయాలను స్పృశిస్తాయో తెలుసుకొనవలసి ఉంటుంది. అందుకోసం క్లుప్తంగా లగ్నాలగురించి, భావాల గురించి తెలుసుకుందాం.

**లగ్నాలు - ఆధిపత్యాలు**

ద్వాదశరాశులవలె లగ్నములు కూడ 12. అవి మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము. లగ్నమును బట్టి గ్రహముల శుభా శుభములు మారుతూ ఉంటాయి. ధనస్థానాధిపతి, సోదరస్థానాధిపతి మొదలగు అధిపతులు మారుతూ ఉంటారు. వీటివలన జాతకుని శుభాశుభఫలితాలు మారుతూ ఉంటాయి. ఏ లగ్నముకు ఏ గ్రహములు శుభులవుతాయో, ఏ గ్రహములు అశుభులవుతాయో తెలుసుకుందాము.

**1. మేషలగ్నం**

మేషలగ్నముకు రవి 5వ స్థానాధిపతి అనగా కోణాధిపతి. కావున శుభుడు. కుజుడు 8వ స్థానాధిపతి అయినా లగ్నాధిపతి కూడ అగుటచే, కుజుడు శుభుడు. బుధుడు 3,6 స్థానాల కధిపతి కావున అశుభుడు. శుక్రుడు 2,7 స్థానముల కధిపతి కావున అశుభుడు. శుక్రుడు 2,7 స్థానముల కధిపతి అనగా ఉభయ మారకస్థానాధిపతి. కావున శుక్రుడు మారకుడు. శని 10వ స్థానాధిపతి అయినా 11వ స్థానాధిపతి కూడ అగుటచే అశుభుడు.

**2. వృషభలగ్నం**

వృషభలగ్నముకు రవి 4వస్థానాధిపతి అనగా కేంద్రాధిపతి కావున శుభుడు. చంద్రుడు 3వస్థానాధిపతి అగుటచే అశుభుడు. బుధుడు 5వస్థానాధిపతి అయినా 2వ స్థానాధిపతి కూడ అగుటచే శుభకారకుడు కాడు. శుక్రుడు 6వ స్థానాధిపతి అయినా లగ్నాధిపతికూడ అగుటచే అశుభఫలితములను తగ్గిస్తాడు. శని 9,10వ స్థానాధిపతి కావున శుభుడు. గురుడు 8,11 స్థానాలకధిపతి కావున అశుభుడు.

**3. మిధునలగ్నం**

మిధునలగ్నముకు రవి 3స్థానాధిపతి కావున అశుభుడు. చంద్రుడు 2వస్థానాధిపతి కావున మారకుడు అయినా ఇతర గ్రహాల ప్రభావం వలన చంద్రుని

ఫలితాలు మారతాయి. కుజుడు 6, 11 స్థానాలకధిపతి కావున అశుభుడు. గురుడు 7,10 స్థానాలకధిపతి. అనగా ఉభయకేంద్రాధిపతి. కావున అశుభుడు. శని 9వ స్థానాధిపతి అయినా 8వస్థానానికి అధిపతి అగుటచే పాపి. శుక్రుడు 12వ స్థానానికి అధిపతి అయినా 5వ స్థానానికి అధిపతి అనగా కోణాధిపతి అగుటచే యోగప్రదుడు.

**4. కర్కాటకలగ్నం**

కర్కాటక లగ్నముకు రవి 2వ స్థానాధిపతి అగుటచే ఇతర గ్రహముల ప్రభావము వలన ఫలితముల నిచ్చును. చంద్రుడు లగ్నాధిపతి అగుటచే శుభుడు. కుజుడు 5,10 స్థానాలకధిపతి అగుటచే విశిష్టశుభుడు. గురుడు 9వ స్థానాధిపతి అయినా 6వ స్థానాధిపతి అగుటచే పూర్ణయోగకారకుడు కాడు. బుధుడు 3,12 స్థానాలకధిపతి అగుటచే పూర్ణ అశుభుడు. శుక్రుడు 4,11 స్థానాల కధిపతి అగుటచే పాపి.

**5. సింహలగ్నం**

సింహలగ్నముకు రవి లగ్నాధిపతి అగుటచే శుభుడు. చంద్రుడు 12వ స్థానాధిపతి కావున - అశుభుడు కుజుడు 4వ స్థానం అనగా కేంద్రమునకధిపతి మరియు 9వ స్థానము అనగా కోణముకు అధిపతి కావున శుభుడు. గురుడు 5వస్థానము కధిపతి అయినా 8వ స్థానముకు అధిపతి అగుటచే అశుభుడు. శని 7వస్థానాధిపతి అగుటచే మారకుడు. బుధుడు 2,11 స్థానముల కధిపతి కావున అశుభుడు. శుక్రుడు 3,10 స్థానముల కధిపతి కావున అశుభుడు.

**6. కన్యాలగ్నము**

కన్యలగ్నముకు రవి 12వ స్థానాధిపతి కావున ఇతర గ్రహాల కలయిక వలన శుభాశుభఫలితములు ఇస్తాడు. చంద్రుడు 11వ స్థానాధిపతి కావున అశుభుడు. కుజుడు 3,8 స్థానాల కధిపతి కావున పూర్ణపాపి. గురుడు 4,7 స్థానాల కధిపతి కావున పాపి. శని 5వ స్థానాధిపతి అయినా 6వ స్థానాధిపతి అగుటచే పాపి. బుధుడు లగ్నాధిపతి మరియు 10వ స్థానాధిపతి కావున శుభుడు. శుక్రుడు 9వ స్థానాధిపతి కావున శుభుడు.

**7. తులా లగ్నము**

తుల లగ్నముకు రవి 11వ స్థానాధిపతి కావున అశుభుడు. చంద్రుడు 10 స్థానాధిపతి కావున శుభుడు. కుజుడు 2,7 స్థానాల కధిపతి అనగా ఉభయమారక స్థానాధిపతి కావున మారకుడు. గురుడు 3,6 స్థానాల కధిపతి కావున అశుభుడు.

శని 4,5 స్థానముల కధిపతి కావున శుభుడు. బుధుడు 12వ స్థానాధిపతి అయినా 9వ స్థానాధిపతి కావున శుభుడు. శుక్రుడు 8వస్థానాధిపతి అయినా లగ్నాధిపతి కావున శుభుడు.

**8. వృశ్చిక లగ్నము**

వృశ్చిక లగ్నముకు రవి 10వ స్థానాధిపతి కావున శుభుడు. చంద్రుడు 9వ స్థానాధిపతి కావున శుభుడు. కుజుడు 6వ స్థానాధిపతి అయినా లగ్నాధిపతి కావున శుభుడు. గురుడు 2,5 స్థానాలకధిపతి కావున శుభుడు. శని 3,4 స్థానాలకధిపతి కావున అశుభుడు. బుధుడు 8,11 స్థానాల కధిపతి కావున అశుభుడు. శుక్రుడు 7,12 స్థానాల కధిపతి కావున అశుభుడు.

**9. ధనుర్లగ్నము**

ధనుస్సు లగ్నముకు రవి 9వ స్థానాధిపతి కావున శుభుడు. చంద్రుడు 8వస్థానాధిపతి కావున అశుభుడు. కుజుడు 12వ స్థానాధిపతి అయినా 5వ స్థానాధిపతి కూడ అగుటచే శుభుడు. గురుడు 4వ స్థానాధిపతి అయినా, లగ్నాధిపతి కావున శుభుడు. శని 2,3 స్థానాధిపతి కావున అశుభుడు. బుధుడు 7,10 స్థానాల కధిపతి కావున శుభుడు.

**10. మకర లగ్నము**

మకర లగ్నముకు రవి 8వ స్థానాధిపతి కావున అశుభుడు. చంద్రుడు 7వస్థానాధిపతి కావున అశుభుడు. కుజుడు 4,11 స్థానాల కధిపతి కావున అశుభుడు. గురుడు 3,12 స్థానముల కధిపతి కావున అశుభుడు. శని 2వ స్థానాధిపతి అయినా లగ్నాధిపతి కావున శుభుడు. బుధుడు 6వస్థానాధిపతి అయినా 9వ స్థానాధిపతి కావున శుభుడు. శుక్రుడు 5,10 స్థానాలకధిపతి కావున శుభుడు.

**11. కుంభలగ్నము**

కుంభలగ్నముకు రవి 7వ స్థానాధిపతి కావున మారకుడు. చంద్రుడు 6వ స్థానాధిపతి కావున అశుభుడు. కుజుడు 3,10 స్థానాల కధిపతి కావున మధ్యముడు. గురుడు 2,9 స్థానముల కధిపతి కావున యోగకారకుడు కాడు. శని 12వ స్థానాధిపతి అయినా లగ్నాధిపతి కావున మధ్యముడు. బుధుడు 5వ స్థానాధిపతి అయి శుభుడయినా 8వ స్థానాధిపతి కూడ అగుటచే మధ్యముడు. శుక్రుడు 4,9 స్థానముల కధిపతి కావున శుభుడు.

**12. మీన లగ్నం**

మీన లగ్నముకు రవి 6వ స్థానాధిపతి కావున అశుభుడు. చంద్రుడు 5వ స్థానాధిపతి కావున శుభుడు. కుజుడు 2,9 స్థానముల కధిపతి కావున శుభుడు.

కుజుడు 2,9 స్థానముల కధిపతి కావున శుభుడు. గురుడు 10వ స్థానాధిపతి కావున అశుభుడు అయినా లగ్నాధిపతి కావున శుభుడు. శని 11,12 స్థానముల కధిపతి కావున అశుభుడు. బుధుడు 4,7 స్థానముల కధిపతి కావున అశుభుడు. శుక్రుడు 3,8 స్థానముల కధిపతి కావున అశుభుడు.

# ద్వాదశభావాలు

రాశులవలెనె భావాలు కూడా 12. అవి

**1) జన్మలగ్నము - తనుభావము**

లగ్నమును బట్టి ఆరోగ్యము, భౌతిక శరీర విషయములు, ప్రవర్తన మొదలగు శరీర సంబంధ విషయములన్నియు తెలుసుకోవచ్చును.

లగ్నము లేక మొదటి భావమును తనుభావము అంటారు. శరీరం, కీర్తి, పోలికలు, అవయవములు, యితరులను తక్కువ చేయు స్వభావము, సుఖాసుఖములు, పశుసంరక్షణ, వృద్ధాప్యము, నిద్ర, గౌరవము, జన్మస్థానము, వంశదూషణ, కలలు, అసంతృప్తి, బలము, నిపుణత్వము, ఠీవి, వారసులు, రాజనీతి, జ్ఞానము, మనశ్శాంతి, చర్మము, ఆయువు, ఆరోగ్యము గురించి తెలియజేయును.

**2) ద్వితీయ భావము - ధనభావము**

ద్వితీయ భావమును ధనభావము అంటారు. ముఖ్యంగా ఈ భావము ధనార్జన, ఆహార స్వీకరణ, శరీరభాగంలో కంఠనాళములను తెలియ జేస్తుంది. ఉపన్యాసము, విద్య, ఐశ్వర్యము, దుస్తులు, పూర్వాచారము, వ్యాపారము, పరోపకారము, నాలుక, గోళ్ళు, బంగారము, మానసిక స్థిరత్వము, జీవనోపాయము, భోగము, దాతృత్వము, ముఖము, స్నేహితులు, వజ్రము, మారకము, సత్యాసత్యములు, వాగ్ధాటి, వాక్కు, వినిమయ సుగంధద్రవ్యములు, భోజనము, నాసిక, వినయము, కోమలత్వము, కుటుంబము, పాండిత్యము, స్నేహము, స్నేహితులు, స్థిరస్వభావము, వజ్రము, మణులు, ధనధాన్యము, రాగి గురించి తెలియజేయును.

**3) తృతీయభావము - భాతృస్థానము**

తృతీయభావమునే భాతృభావము అని, విక్రమభావము అని అంటారు. ఇది ముఖ్యంగా తమ్ముళ్ళు, జాతకుని ధైర్యసాహసాలు, వాక్చాతుర్యములను తెలియ జేస్తుంది. ఇంకా పరాక్రమము, ఆస్తివిభజన, కార్యభారము వహించుట,

రౌద్రము, కనిష్టసోదర సోదరీలు, ఆభరణములు, సత్ప్రవర్తన, వర్ణాశ్రమ ధర్మము, పెద్దలు, యుద్ధము, గురువులు, చెవులు, వాహనసౌఖ్యములు, కాళ్ళు, శారీరక బలము, చిత్తచాంచల్యము, మృష్టాన్న భోజనము, సామర్ధ్యము, శారీరక పుష్టి, సర్వసౌఖ్యము, సంపన్నజన్మ, స్వల్ప ప్రయాణములు, సామర్ధ్యము, కోపము, లాభము, శాంతము, దాసదాసీలు, కార్యసంధానము గురించి తెలియజేయును.

**4) చతుర్థభావము - మాతృస్థానము :-**

చతుర్థభావమునే మాతృభావము అని అంటారు. ఇది ముఖ్యంగా తల్లి, వాహనము, సౌఖ్యము గురించి తెలియజేయును.

ఇంకా ఇది విద్య, గుప్తస్థాన పరిశోధన, రాజ్యము, విజయము, గ్రహము, ప్రయాణము, వేదశాస్త్ర అభివృద్ధి, కష్టార్జితము, పల్లకి, రిక్షా, భూమి, చిన్నఓడలు, గోవులు, అభ్యంగస్నానము, శీలము, తల్లిబంధువులు, గ్రంథము, దుస్తులు, భూమి, చెఱువులు, సాధన, నూతులు గురించి తెలియజేయును.

**5) పంచమభావము - (పుత్రభావం) :-**

పంచమభావమునే సంతానభావము అని కూడా అంటారు. పంచమ స్థానమును బుద్ధిస్థానము, కామస్థానము అని కూడా అంటారు. ఇది వ్యాపారము, సృజనాత్మకశక్తి, బుద్ధిబలము, వివేకము, విద్య, శిల్ప విద్య, సంతానము, పితృధనము, దుస్తులు, నత్కధావరనము, వినయము, గౌరవము, స్త్రీమూలకభాగ్యము, అన్న ప్రదానము, మంత్రోపాసన, గ్రంథ రచన, వార్తాలేఖనము, సరి అయిన ఆలోచన, మంత్రజపము, పాపపుణ్యములు, వంశపారంపర్య అధికారము, సంతృప్తి, తండ్రి చేసిన పుణ్యము, మనస్సు, గర్భము, ఛత్రము, శుభలేఖలు, కోరికలు సిద్ధింపచేసుకొనుట, దూరదృష్టి, వేశ్యాస్త్రీ సంభోగము, రహస్యము, క్షేమము, కార్యాచరణము, వైభవము, తారతమ్యములు, ప్రతిభ, సంగీతవాద్యములు, పాండిత్యము మొదలగువాటి గురించి తెలియ జేయును.

**6) షష్ఠభావము (శత్రుభావము) :-**

షష్ఠ భావమునే శత్రుభావము అని కూడా అంటారు. ఇది ముఖ్యంగా శత్రువులు, రోగములు, ఋణముల గురించి తెలియజేయును. ఇంకా తగాదాలు, క్రూరమైన పనులు, పిసినారితనము, అపవాదులు, యాచకత్వము, అకాల భోజనము, జైలు, అన్నదమ్ములతో వైషమ్యాలు, సేవకులు, దొంగతనము, ఆపదలు, మేనమామలు, ప్రేగులు, జీర్ణాశయముల గురించి తెలియజేయును.

**7) సప్తమభావము (కళత్రభావము) :-**

సప్తమ భావమునే కళత్ర భావము అంటారు. ఇది ముఖ్యంగా వివాహము, భార్య, వ్యాపారములోని భాగస్వాముల గురించి తెలియచేయును. ఇంకా ఇది వ్యభిచారము, ద్వికళత్రము, దాంపత్యసుఖము, దొంగతనము, బుద్ధిమాంద్యము, వస్త్రములు, అలంకారములు, సుగంధద్రవ్యాలు, పానీయాలు, విదేశీ ప్రయాణం, ధనార్జన, మూత్రము, మర్మస్థానముల గురించి తెలియచేయును.

**8) అష్టమ భావము (ఆయుర్భావము) :-**

అష్టమభావమునే ఆయుర్భావము అంటారు. ఇది ముఖ్యంగా మరణము, మరణకారణములు, వారసత్వముల గురించి తెలియచేయును. ఇంకా ఇది సుఖము, ఆపద, తగాదాలు, సోమరితనము, ధనవ్యయము, దురదృష్టము, మానసిక స్వభావము, అవమానము, పరధనము గురించి తెలియజేయును.

**9) నవమ భావము (భాగ్యభావము) :-**

నవమ భావమునే భాగ్యభావము అని అంటారు. ఇది ముఖ్యంగా పూర్వజన్మలో చేసిన పుణ్యం, దాని ఫలితంగా జాతకునికి కలుగు అదృష్టం, లాభనష్టములను తెలియజేయును. ఇది ఇంకా జాతకుని స్థితిగతులు, దూరప్రయాణాలు. ఆధ్యాత్మికస్థితి, మంత్రోపాసన, గురువులను గౌరవించుట విద్యార్జన, పిత్రార్జన, సంతానం, ఐశ్వర్యం, ఆచార సంప్రదాయాలు, దైవభక్తి, ఊరువులు గురించి తెలియజేయును.

**10) దశమ భావము (రాజ్యభావం) :-**

దశమభావమునే రాజ్యభావము అని అంటారు. ఇది ముఖ్యంగా ఉద్యోగం, వ్యాపారం, పేరుప్రఖ్యాతులు, అధికారం, వృత్తి గురించి తెలియజేయును. ఇంకా ఇది దయాగుణం, యంత్రము, మంత్రము, అభిమానము, మాతృదేవత, తన స్థానము, ఔషధము, బోధన, ముద్రాధికారము, సన్మానము, దేవతలు, పుణ్యము, దత్తపుత్రుడు గురించి తెలియజేయును.

**11) ఏకాదశభావము (లాభభావం) :-**

ఏకాదశభావమునే లాభభావము అంటారు. ఇది ముఖ్యంగా అన్నలు, స్నేహితులు గురించి తెలియజేస్తుంది. ఇంకా ఇది వివిధ ఆదాయాలు, వివిధ లాభములు, తండ్రి యొక్క సోదరులు, అలంకారములు, నగలు, కార్యసిద్ధి,

ఆశయసిద్ధి, చిత్రలేఖనం, లలిత కళలు, మంత్రోపాసన, విద్య, బంగారం గురించి తెలియజేయును.

**12) ద్వాదశభావము (వ్యయభావం) :-**

ద్వాదశభావమును వ్యయభావము అంటారు. ఇది ముఖ్యంగా ధనవ్యయం, సమయ నష్టం, పూర్వజన్మలు, రహస్య శత్రువులు గురించి తెలియజేయును. ఇంకా ఇది బంధనం, ఋణవిమోచన, స్త్రీలోలత్వం, కళత్రహాని, విదేశ ప్రయాణం, ఉద్యోగవిరమణ, అధికార పతనం, మనోచంచలం, అహంకారం, శరీర అనారోగ్యం, మారకం గురించి తెలియజేయును.

# గ్రహదోషములు

**1) లగ్నాష్టమదోషము :-**

జన్మలగ్నమునకు అష్టమస్థానములో చంద్రుడు వున్నను, (లేదా) లగ్నాధిపతి అష్టమస్థానములో వున్నను లేదా అష్టమ స్థానాధిపతి లగ్నములో వున్నను లగ్నాష్టమ దోషము కలుగుతుంది.

**2) షష్టాష్టక దోషము :-**

రెండు గ్రహములు ఒకదానికొకటి 6, 8 స్థానములలో వుంటే వాటికి షష్టాష్టక దోషం కలుగుతుంది. ఒకదాని మహాదశలో, రెండవ గ్రహం అంతర్దశా కాలంలో అశుభం కలుగుతుంది.

అయితే మేషం-కన్య, వృషభం-ధనుస్సు, తుల-మీనం, కుంభం-కర్కాటకం, సింహం-మకరం, మిథునం - వృశ్చికంలలో వున్న గ్రహములు ఒకదానికొకటి 6, 8 స్థానాలలో వున్నప్పటికి వాటికి షష్టాష్ట దోషము కలుగదు.

**3) కుజాష్టమదోషము :-**

లగ్నమునకు 8వ స్థానములో కుజుడు వుంటే కుజాష్టమ దోషం కలుగుతుంది.

**4) అష్టమచంద్రదోషం :-**

జన్మలగ్నమునకు 8వ స్థానంలో చంద్రుడు వుంటే అష్టమ చంద్రదోషం కలుగుతుంది. (ఇది లగ్నాష్టమదోషం కూడా అవుతుంది).

**5) షడరిష్ట చంద్రదోషము :-**

జన్మలగ్నమునకు 6 లేదా 12 స్థానములలో చంద్రుడు వుంటే షడరిష్ట చంద్ర దోషము కలుగుతుంది.

**6) భృగు షట్కము :-**

జన్మలగ్నమునకు 6వ స్థానంలో శుక్రుడు వుంటే భృగుషట్కము అను దోషము కలుగుతుంది.

**7) చంద్ర సగ్రహదోషము :-**

చంద్రుడు ఏ గ్రహముతో కలిసియున్నను చంద్ర సగ్రహదోషము కలుగుతుంది. చంద్రుడు శుభగ్రహములతో కలసియున్నను, చంద్ర నక్షత్రములో ఏ గ్రహమును వుండరాదు.

**8) కర్తరీ దోషము :-**

చంద్ర లగ్నమునకు ఇరువైపుల వున్న రాశులలో పాపగ్రహములున్నను, జన్మలగ్నం, చంద్రలగ్నములకు 2, 12, రాశులలో పాపగ్రహములుండి, 2వ స్థానంలో వున్న గ్రహం వక్రించి, 12వ రాశిలో వున్న గ్రహం వక్రించక పోయినను కర్తరీ దోషం కలుగుతుంది.

**9) లగ్నాస్త దోషము :-**

లగ్నాంశాధిపతిచేత కాని, ఆ అంశాధిపతికి మిత్రులైన గ్రహములచేతగాని, శుభగ్రహములచేతగాని లగ్నము చూడబడకపోతే లగ్నాస్తదోషము కలుగుతుంది. లగ్నము శుభగ్రహాలతో కూడియుంటే దోషము కలుగదు.

**10) కునవాంశ దోషము :-**

శుభగ్రహనవాంశము కానిచో కునవాంశ దోషము కలుగుతుంది.

# భావఫలం నిర్ణయించుట

**❖ శుభఫలమును యిచ్చునవి**

1) శుభగ్రహములు యున్న భావములు.
2) ఆయా భావాలలో వుండే గ్రహాలకు ఆ భావాలు స్వక్షేత్రంగాని, ఉచ్ఛ క్షేత్రంగాని అయితే ఆ భావములు.
3) శుభగ్రహముల శుభదృష్టి కలిగియున్న భావములు.

4) భావాధిపతి శుభదృష్టికలిగిన భావములు

* అశుభఫలమును యిచ్చునవి

1) పాపగ్రహములు యున్న భావములు
2) ఆయాభావాలలో వుండే గ్రహాలకు ఆ భావాలు శత్రుక్షేత్రంగాని, నీచక్షేత్రం గాని అయితే ఆ భావాలు.
3) పాపగ్రహముల పాపదృష్టి కలిగియున్న భావములు.
4) భావాధిపతి దృష్టిలేని భావములు.

## భావముల విభజన

**1) త్రికోణములు : 1, 5, 9 స్థానములు :-**

లగ్నము, 5వ స్థానము, 9వ స్థానమును కోణములు లేక త్రికోణములు అంటారు.

లగ్నము జాతకుని తరము గురించి, పంచమ స్థానం పిల్లల తరం గురించి, నవమస్థానం తండ్రితరం గురించి తెలియజేయును.

వీటిలో లగ్నము కంటె పంచమస్థానం, పంచమం కంటె నవమస్థానం బలమైనవి.

**2) కేంద్రములు : 1, 4, 7, 10 స్థానములు :-**

1, 4, 7, 10 స్థానములను కేంద్రములు అంటారు. కేంద్రములనే కంటకములు, చతుష్టయములు అంటారు.

కేంద్రములలో వున్న గ్రహములు ఎక్కువ ప్రభావమును చూపులాయి.

లగ్నమున వున్న గ్రహము కంటె 4వ స్థానములో వున్న గ్రహాలు బలంగా వుంటాయి. 4వ స్థానమున వున్న గ్రహము కంటె 7వ స్థానంలో ఉన్న గ్రహాలు బలంగా ఉంటాయి. 7వ స్థానములో వున్న గ్రహాల కంటె దశమములో వున్న గ్రహము బలమైనది. కేంద్రములలో దశమస్థానం బలమైనది.

రాశులను బట్టి కేంద్ర బలములు మారుతుంటాయి.

**3) ఫణపరములు : 2, 5, 8, 11 స్థానములు**

2, 5, 8, 11 స్థానములను ఫణపరములు అంటారు. ఇవి పూర్వజన్మలో చేసిన పుణ్యకార్యాలను తెలియజేయును. వీటిలో వున్న గ్రహములు జాతకునికి

వచ్చే అవకాశాలను, వాటిని ఉపయోగించుకొనుట, ధనం నిలువ చేయుట, స్థిరపడుటను తెలియజేయును.

**4) అపోక్లీమములు : 3, 6, 9, 12 స్థానములు**

3, 6, 9, 12 స్థానములను అపోక్లీమములు అంటారు. ఇవి ఫణపరములకు తరువాత వుండే స్థానములు.

ఇందులో వున్న గ్రహములు మంచి చెడుల విచక్షణ, అర్థం చేసుకొనుట, హేతు బుద్ధిని తెలియజేస్తాయి.

**5) ఉపచయములు : 3, 6, 10, 11**

3, 6, 10, 11 స్థానములను ఉపచయములు అంటారు. వీటిలోని గ్రహములు జాతకుని శ్రమను గూర్చి, దాని ఫలితములను గురించి తెలియజేస్తాయి. మిత్రుల వలన మేలు, కీడును తెలియజేసి, దానివలన కలుగు లాభనష్టములను తెలియజేయును.

**6) అపచయములు : 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానములు**

1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానములను అపచయములు అంటారు. వీటిలోని గ్రహములు జాతకుడు సంపాదించిన వాటిని అనుభవించుట, ధనవ్యయం, అనారోగ్యం, భోగములను తెలియజేయును.

**7) దుస్థానములు : 6, 8, 12 స్థానములు :-**

6, 8, 12 స్థానములను దుస్థానములు అంటారు. వీటినే త్రికములు అని కూడా అంటారు. ఈ స్థానముల యందుండు గ్రహములు అశుభాన్ని కలుగజేస్తాయి. ఈ స్థానాధిపతులు కూడా పాపగ్రహాలే అవుతాయి.

**8) త్రిషడాయములు 3, 6, 11**

3, 6, 11 స్థానములను త్రిషడాయములు అంటారు. ఈ స్థానాధిపతులు అశుభమునే కలిగించును. వీటి అధిపతులు శుభగ్రహములయినా పాపగ్రహముల వలె ప్రవర్తిస్తాయి.

**9) శుభస్థానములు : 1, 2, 4, 5, 7, 9, 10, 11 స్థానములు**

లగ్నము లగాయతు 1, 2, 4, 5, 7, 9, 10, 11 స్థానములు శుభస్థానములు. ఈ స్థానములలో వున్న గ్రహములు శుభ ఫలితాన్ని యిస్తాయి. ఈ స్థానాధిపతులు కూడా శుభఫలితాలనే యిస్తారు.

**10) మారకస్థానములు : 2, 7, 11 స్థానములు**

లగ్నము లగాయతు 2, 7, 11 స్థానములను మారకస్థానములు అంటారు. ఈ స్థానములలో వున్న గ్రహములు, ఈ స్థానాధిపతులు మారకము చేయు స్వభావమును కలిగియుంటారు.

**11) పాపస్థానములు 3, 6, 8, 12 స్థానములు :**

లగ్నము లగాయతు 3, 6, 8, 12 స్థానములను పాపస్థానములు అంటారు. ఈ స్థానములలో వున్న గ్రహములు, ఈ స్థానాధిపతులు అశుభఫలితమునే ఇస్తారు.

శుభగ్రహములు (గురు, బుధ, శుక్ర, పూర్ణచంద్రుడు)

కేంద్రములయందు, కోణములయందు 2,3,11 స్థానములందును వుంటే సహజసిద్ధంగా శుభఫలితాన్ని యిస్తారు.

అశుభగ్రహములు (శని, కుజ, రవి, క్షీణచంద్రుడు పాపగ్రహయుతుడగు బుధుడు, రాహు, కేతువులు) ఉపచయములందు వుంటే శుభఫలితాన్ని యిస్తారు.

# 8. మహాదశలు

మానవుని జీవితకాలంలో జరిగే సంఘటనలు, ఆ సంఘటనలు జరిగే కాలము తెలుసుకొనుటకు దశలు ఉపయోగపడతాయి. మానవుని జీవితకాలంలో ఏర్పడే దశలు, ఆదశానాథుని స్థితిగతులను బట్టి అతనికి కలిగే లాభనష్టములను, సుఖదుఃఖములను తెలుసుకొనవచ్చును.

దశలను అనేక పద్ధతులలో సూచిస్తున్నారు. గ్రహ, రాశి, నక్షత్ర మొదలగు పద్ధతులు కలవు.

చాలప్రాంతాలలో నక్షత్రదశ అయిన వింశోత్తరీదశను ఉపయోగిస్తున్నారు.

## వింశోత్తరీదశ

వింశోత్తరీదశ 120 సంవత్సరాల దశ. దీని ప్రకారం వరుసగా రవిదశ, చంద్ర దశ, కుజదశ, రాహుదశ, గురుదశ, శనిదశ, బుధదశ, కేతుదశ, శుక్రదశలు ఏర్పడతాయి. జన్మనక్షత్రం అనుసరించి జాతకునికి జన్మకాలముకు ఏ దశ ప్రారంభమైనదో తెలుసుకుంటారు. ఆ దశాకాలం పూర్తి అయిన తరువాత, ఆ దశ తరువాత దశ ప్రారంభమవుతుంది.

ఏ నక్షత్రంలో జన్మించినవారికి ఏ దశ ప్రారంభమవుతుందో క్రింది పట్టిక ద్వారా తెలుసుకొనవచ్చును.

| క్రమసంఖ్య | నక్షత్రముల పేర్లు | రాశులలో నక్షత్రపాదముల ఆరంభ స్థానములు | | | | రాశులలో నక్షత్రము పూర్తిఅగు స్థానము | దశానాథులు | దశా సంవత్సరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| | | మొదటి పాదము రా-డిగ్రీ-ని | రెండవ పాదము రా-డిగ్రీ-ని | మూడవ పాదము రా-డిగ్రీ-ని | నాల్గవ పాదము రా-డిగ్రీ-ని | రా-డిగ్రీ-ని | | |
| 1. | అశ్విని | 0-00-00 | 0-03-20 | 0-06-40 | 0-10-00 | 0-13-20 | కేతు | 7 |
| 2. | భరణి | 0-13-20 | 0-16-40 | 0-20-00 | 0-23-20 | 0-26-40 | శుక్ర | 20 |
| 3. | కృత్తిక | 0-26-40 | 1-00-00 | 1-03-20 | 1-06-40 | 1-10-00 | రవి | 6 |
| 4. | రోహిణి | 1-10-00 | 1-13-20 | 1-16-40 | 1-20-00 | 1-23-20 | చంద్ర | 10 |
| 5. | మృగశిర | 1-23-20 | 1-26-40 | 2-00-00 | 2-03-20 | 2-06-40 | కుజ | 7 |
| 6. | ఆరుద్ర | 2-06-40 | 2-10-00 | 2-13-20 | 2-16-40 | 2-20-00 | రాహు | 18 |
| 7. | పునర్వసు | 2-20-00 | 2-23-20 | 2-26-40 | 3-00-00 | 3-03-20 | గురు | 16 |
| 8. | పుష్యమి | 3-06-40 | 3-10-00 | 3-13-20 | 3-16-40 | 3-20-00 | శని | 19 |
| 9. | ఆశ్రేష | 3-20-00 | 3-23-20 | 3-26-40 | 4-00-00 | 4-03-20 | బుధ | 17 |
| 10. | మఖ | 4-06-40 | 4-10-00 | 4-13-20 | 4-16-40 | 4-20-00 | కేతు | 7 |
| 11. | పుబ్బ | 4-20-00 | 4-23-20 | 4-26-40 | 5-00-00 | 5-03-20 | శుక్ర | 20 |
| 12. | ఉత్తర | 5-03-20 | 5-06-40 | 5-10-00 | 5-13-20 | 5-16-40 | రవి | 6 |
| 13. | హస్త | 5-16-40 | 5-20-00 | 5-23-20 | 5-26-40 | 6-00-00 | చంద్ర | 10 |
| 14. | చిత్త | 6-00-00 | 6-03-20 | 6-06-40 | 6-10-00 | 6-13-20 | కుజ | 7 |
| 15. | స్వాతి | 6-13-20 | 6-16-40 | 6-20-00 | 6-23-20 | 6-26-40 | రాహు | 18 |
| 16. | విశాఖ | 6-26-40 | 7-00-00 | 7-03-20 | 7-06-40 | 7-10-00 | గురు | 16 |
| 17. | అనూరాధ | 7-10-00 | 7-13-20 | 7-16-40 | 7-20-00 | 7-23-20 | శని | 19 |
| 18. | జ్యేష్ఠ | 7-23-20 | 7-26-40 | 8-00-00 | 8-03-20 | 8-06-40 | బుధ | 17 |
| 19. | మూల | 8-10-00 | 8-13-20 | 8-16-40 | 8-20-00 | 8-23-20 | కేతు | 7 |
| 20. | పూ.షా | 8-13-20 | 8-16-40 | 8-20-00 | 8-23-20 | 8-26-40 | శుక్ర | 20 |
| 21. | ఉ.షా | 8-26-40 | 9-00-00 | 9-03-20 | 9-06-40 | 9-10-00 | రవి | 6 |
| 22. | శ్రవణ | 9-10-00 | 9-13-20 | 9-16-40 | 9-20-00 | 9-23-20 | చంద్ర | 10 |
| 23. | ధనిష్ఠ | 9-23-20 | 9-26-40 | 10-00-00 | 10-03-20 | 10-06-20 | కుజ | 7 |
| 24. | శతభిష | 10-06-20 | 10-10-00 | 10-13-20 | 10-16-40 | 10-20-00 | రాహు | 18 |
| 25. | పూ.భా | 10-20-00 | 10-23-20 | 10-26-40 | 11-00-00 | 11-03-20 | గురు | 16 |
| 26. | ఉ.భా | 11-03-20 | 11-06-40 | 11-10-00 | 11-13-20 | 11-16-40 | శని | 19 |
| 27. | రేవతి | 11-16-40 | 11-20-00 | 11-23-20 | 11-26-40 | 12-00-00 | బుధ | 17 |

# దశాకాలము

27 నక్షత్రములను కృత్తిక నుండి ప్రారంభించి 9 గ్రహములకు పంచారు. ప్రతి గ్రహమునకు మూడు నక్షత్రములు చొప్పున వచ్చినవి. ఆ నక్షత్రములకు ఆయాగ్రహాలు అధిపతులు అయ్యారు. ఆ గ్రహములను బట్టి, ఆయా నక్షత్రములలో జన్మించినవారికి ఎన్ని సంవత్సరాలు ఏఏ దశలుంటాయో క్రింద వివరింపబడినది. పట్టికను పరిశీలించండి.

| నక్షత్రములు | | | నక్షత్ర ప్రమాణం | నక్షత్ర నాథులు | దశా కాలం |
|---|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | $13^0$-$20^1$ | రవి | 6 సం॥ |
| రోహిణి | హస్త | శ్రవణం | $13^0$-$20^1$ | చంద్రుడు | 10 సం॥ |
| మృగశిర | చిత్త | ధనిష్ట | $13^0$-$20^1$ | కుజుడు | 7 సం॥ |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | $13^0$-$20^1$ | రాహువు | 18 సం॥ |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | $13^0$-$20^1$ | గురుడు | 16 సం॥ |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | $13^0$-$20^1$ | శని | 19 సం॥ |
| ఆశ్లేష | జ్యేష్ట | రేవతి | $13^0$-$20^1$ | బుధుడు | 17 సం |
| అశ్విని | మఖ | మూల | $13^0$-$20^1$ | కేతు | 7 సం॥ |
| భరణి | పుబ్బ | పూర్వాషాఢ | $13^0$-$20^1$ | శుక్రుడు | 20 సం॥ |
| | | | మొత్తము దశకాలం | | 120 సం॥ |

జన్మ సమయానికి ఏ దశయుండునో, ఆ దశాకాలము పూర్తయిన తరువాత, ఆ దశానాదుని తరువాత యున్న దశ ప్రారంభమవుతుంది. ఈ విధంగా ఒకదాని తరువాత ఒకటిగా వరుసగా వస్తాయి.

ఈ దశల వరుసను ఈ శ్లోకం ద్వారా గుర్తుంచుకోవచ్చు.

> ఇన, శశి, కుజ, రాహు, జీవ, మందాజ్ఞ కేతు భృగుజః

జాతకుడు జన్మించినపుడు ప్రారంభమయిన దశ ఎంతకాలం మిగిలి ఉంటుందో తెలుసుకుంటే, ఆ దశ పూర్తి అయ్యేకాలం, తరువాత దశ ప్రారంభమయ్యే రోజు తెలుస్తుంది. జననకాల దశాశేషాన్ని క్రింది సూత్రం ఉపయోగించి తెలుసుకుంటారు.

$$\text{జననకాల దశాశేషం} = \frac{\text{నక్షత్రశేషం} \times \text{దశానాథుని దశా సంవత్సరములు}}{\text{నక్షత్ర ప్రమాణము}}$$

# దశాఫలితములు

జాతకుని జీవన యానంలో - ఆయా కాలాలలో జరిగే శుభా శుభఫలితాలు దశాఫలితాల ననుసరించి ఉంటాయి. దశాఫలితాలు చెప్పుటకు అవసరమైన కొన్ని ప్రాథమిక సూత్రాలను తెలుసుకుందాం.

- జన్మ లగ్నం లగాయితు కేంద్రాధిపతుల యొక్క మరియు కోణాధిపతుల యొక్క మహాదశలు, అంతర్దశలు శుభఫలాన్ని ఇస్తాయి.
- జన్మలగ్నం లగాయితు రెండు, మూడు స్థానాధిపతుల యొక్క దశలు, అంతర్దశలు మిశ్రమ ఫలాన్ని ఇస్తాయి.
- జన్మలగ్నం లగాయతు ఆరు, ఎనిమిది, పన్నెండు స్థానాధిపతులయొక్క దశలు అంతర్దశలు అశుభ ఫలాన్నిస్తాయి.
- 6,8,12 స్థానాధిపతుల సంబంధం గాని, దృష్టిగాని కలిగిన గ్రహముల దశలు అశుభ ఫలాన్ని ఇస్తాయి.
- 6,8,12 స్థానాధిపతులు శత్రుక్షేత్రములో కాని, నీచలోకాని, అస్తంగతులై కాని వుంటే, 6, 8, 12 స్థానములలో వున్న గ్రహాలు మరియు ఆ స్థానాధిపతుల దశలు శుభఫలితాన్ని ఇస్తాయి.
- 6,8,12 స్థానములలో ఉన్న గ్రహము, ఆరూఢలగ్నము లగాయితు కేంద్రకోణము నందు ఉంటే ఆ గ్రహము యొక్క దశ మధ్య కాలములో యోగించును.
- లగ్నము లగాయితు కేంద్రకోణములలో ఉన్న గ్రహము, ఆరూఢ లగ్నము లగాయితు 6,8,12 స్థానములలో ఉంటే ఆ గ్రహము యొక్క దశ చివర భాగము యోగించును.

✤ **రవి మహాదశ**

రవి శుభుడు అయితే, రవి దశలో సంతానము, బుద్ధి, ఉద్యోగము, ధనము, కీర్తి, సుఖము వృద్ధి చెందుతాయి.

రవి పాపి అయితే రవి దశలో వృధాశ్రమ, ధననష్టం, అనారోగ్యం, అధికారుల వలన భయం, పితృ మరణం సంభవిస్తాయి.

✤ **చంద్రదశ**

చంద్రుడు శుభుడు అయితే చంద్రదశలో భూలాభం, ధనలాభము, సోదర లాభం కలుగుతాయి. మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. మాతృ సౌఖ్యము, గృహ సౌఖ్యము, వాహన సౌఖ్యము లభిస్తాయి.

చంద్రుడు పాపి అయితే చంద్ర దశలో ధన నష్టము, అనారోగ్యం, సంతాన నష్టము, కోపము, తల్లి వలన దుఃఖము కలుగుతాయి.

✤ **కుజదశ**

కుజుడు శుభుడు అయితే కుజదశలో భూలాభము, ధనలాభము, వస్తులాభము కలుగుతాయి. శతృవులను జయించి ప్రశాంతమైన మనస్సుతో సోదర సహాయముతో సుఖముగా జీవించును.

కుజుడు పాపి అయితే కుజ దశలో భూమి, ధనము నష్టమయి అగ్నివలన అధికారుల వలన బాధలు కలుగుతాయి. విరోధాల వలన అనేక చికాకులు కలుగుతాయి.

✤ **బుధదశ**

బుధుడు శుభుడు అయితే ధన ధాన్యాభివృద్ధి కలిగి సుఖంగా జీవిస్తాడు. నూతన వస్త్రాలు, నూతన గృహం లభిస్తాయి. కార్యసిద్ధి కలుగుతుంది.

బుధుడు పాపి అయితే బుధదశలో వ్యాపారం వలన నష్టము, కలహం, స్వస్థలము విడచుట సంభవించును.

✤ **గురుదశ**

గురుడు శుభుడు అయితే గురుదశలో అధికారము, వాహన సుఖము, సంతానము కలుగుతాయి. ధనవృద్ధి జరుగుతుంది.

గురుడు పాపి అయితే గురుదశలో అధికారుల వలన భయము, తండ్రితో విరోధము, పిరికితనము, ధన నష్టము జరుగులాయి.

* **శుక్రుని దశ**

శుక్రుడు శుభుడు అయితే శుక్రదశలో వాహన సుఖము, ధనవృద్ధి, సౌభాగ్యము కలుగుతాయి. సంగీత సాహిత్యములలో పేరు వస్తుంది. దేవాలయ నిర్మాణంలో పాల్గొంటారు.

శుక్రుడు పాపి అయితే శుక్రదశలో దొంగతనము జరుగుతుంది. ధన నష్టము కలుగుతుంది. కళత్ర నష్టం జరుగుతుంది.

* **శని దశ**

శని శుభుడు అయితే శని దశలో అధికారము, ధనము లభిస్తాయి. యజ్ఞం చేస్తారు. వ్యాపారంలో పేరు వస్తుంది.

శని పాపి అయితే శని దశలో అధికారుల వలన నష్టము, కార్యహాని, అనారోగ్యము కలుగుతాయి. విషాహారం వలన ప్రమాదం కలుగుతుంది.

* **రాహువు దశ**

రాహువు బలవంతుడై ఉన్నప్పుడు రాహుదశలో అధికారము, ధన లాభము కలుగుతాయి. దీర్ఘప్రయాణం చేస్తాడు.

రాహువు బలంగా లేనప్పుడు రాహు దశలో పాము వలన, విషము వలన, ఆయుధముల వలన, అగ్ని వలన, రోగముల వలన, వృక్షముల వలన, శత్రువుల వలన ఆపద కలుగును.

* **కేతుదశ**

కేతువు బలముగా ఉన్నప్పుడు కేతుదశలో నీచమైన కార్యముల వలన ధనలాభం కలుగుతుంది.

కేతువు బలహీనముగా ఉంటే, కేతు దశలో ఉద్యోగములో ఆటంకములు, వృధా శ్రమ, వ్యాపారములో నష్టములు కలుగుతుంటాయి.

# అంతర్దశా ఫలములు

- మహాదశానాథుడు మిక్కిలి బలవంతుడైతే ఆ దశలో వచ్చునట్టి అంతర్దశ, భుక్తులు అన్నియు శుభఫలము నిచ్చును.
- మహాదశానాథుడు మిక్కిలి బలహీనుడై ఉన్నప్పుడు ఆ దశలో శుభగ్రహం యొక్క అంతర్దశ వచ్చినను శుభ ఫలితాన్ని ఇవ్వదు.
- జన్మలగ్నం లగాయితు, దశానాథుని లగాయితు కూడా కేంద్ర, కోణము లందు ఉన్న గ్రహాలు యొక్క అంతర్దశలు శుభఫలాన్ని ఇస్తాయి.
- లగ్నమునకు, దశానాథునకు 6,8,12 వ స్థానములలో యున్న గ్రహముల అంతర్దశలు అశుభఫలితాలను ఇస్తాయి.
- దశానాథుని స్వభుక్తియందు కుటుంబంలో బాధలు, ఉద్యోగంలో ఆటంకం, వ్యవసాయంలో నష్టం, బంధునష్టం సంభవించును.
- దశానాథుడు ఉన్న రాశికి రెండవ స్థానంలో ఉన్న గ్రహము యొక్క అంతర్దశలో పరోపకారము, చేయుదురు. బంధువులపై ఆదరము చూపుదురు. సుఖమైన జీవనం గడుపుతారు.
- దశానాథుడు ఉన్న రాశికి మూడవ స్థానంలో ఉన్న గ్రహం యొక్క అంతర్దశలో అధికారులనుండి ధనము లభించును. ఉన్నతులతో స్నేహం, నూతన వస్త్రములు, అలంకారములు లభించును.
- దశానాథుడు ఉన్న రాశికి 4 వ స్థానంలో ఉన్న గ్రహం యొక్క అంతర్దశలో కుటుంబ సుఖం, గృహలాభం, వాహన సుఖం కలుగుతాయి. ఎట్టి ఆందోళనలు లేక ప్రశాంతంగా ఉంటారు.
- దశానాథుడు ఉన్నరాశికి 5 వస్థానంలో ఉన్న గ్రహం యొక్క అంతర్దశలో సంతాన ప్రాప్తి కలుగుతుంది
- దశానాథుడు ఉన్నరాశికి 6వ స్థానంలో ఉన్న గ్రహం యొక్క అంతర్దశలో సంతాన వృద్ధి, మిత్రుల కలయిక, దాంపత్య సుఖము కలుగుతాయి.

పాపగ్రహ భుక్తిలో అనారోగ్యము, శత్రువుల వలన భయము, అప్పులు పెరుగుట, స్థాన చలనం కలుగుతాయి.

- దశానాధుడు వున్న రాశికి 7వ స్థానంలో వున్న శుభగ్రహభుక్తిలో నూతన వస్త్రములు, అలంకారములు, సంతోషము లభించును. పాపగ్రహభుక్తిలో బంధు నాశనము, అధికారుల వలన భయం కలుగుతాయి.

- దశానాధుడు ఉన్న రాశికి 8 వ స్థానంలో ఉన్న శుభగ్రహ భుక్తిలో మొదట సుఖము తరువాత కష్టము కలుగుతుంది. పాపగ్రహభుక్తిలో చోరులు, అగ్ని, అధికారుల ఆపద, మరణ భయము, బాధలు కలుగుతాయి.

- దశానాధుడు ఉన్న రాశికి 9 వ స్థానంలో ఉన్న శుభగ్రహ భుక్తిలో వివాహము, యజ్ఞములు చేయుట వంటి శుభ కార్యములు చేయబడతాయి. పాపగ్రహభుక్తిలో అశుభకర్మలు చేయుదురు. స్థానచలనం జరుగుతుంది.

- దశానాధుడు ఉన్న రాశికి 10 వ స్థానంలో ఉన్న శుభగ్రహభుక్తిలో దైవకార్యములు చేస్తారు. మంచి కార్యాలు చేసి పేరు తెచ్చుకుంటారు. పాపగ్రహభుక్తిలో అపకీర్తి, దుఃఖము కలుగుతాయి.

- దశానాధుడు వున్న రాశికి 11వ స్థానంలో వున్న గ్రహభుక్తిలో సన్మానాలు పొందుట, భూధనం లభించుట, కళత్రసౌఖ్యం కలుగుతాయి.

- దశానాధుడు ఉన్నరాశికి 12 వ స్థానంలో ఉన్న శుభగ్రహభుక్తిలో వాహన సౌఖ్యము, నూతన వస్త్రములు అలంకారములు లభించును. పాపగ్రహభుక్తిలో అధికారులతో అభిప్రాయ భేదాలు, స్థాన చలనం, ధననష్టం, ఆందోళన కలుగుతాయి.

ఈ విధంగా దశానాధుడు, అంతర్దశా నాధుడు జన్మచక్రంలో ఏ రాశిలో, ఏ భావంలో ఉన్నారో, వాటి శుభాశుభములను పరిశీలించి ఆ దశలో అంతర్దశలలో జాతకుని దశాఫలితం చెప్పాలి.

పూర్తి వివరాలకు మహర్షుల గ్రంథాలను పరిశీలించండి.

వివిధ లగ్నములలో జన్మించిన వారికి శుభాశుభములు కలిగించే గ్రహదశలను తెలుసుకుందాం.

| లగ్నము | యోగించే గ్రహదశలు (శుభ గ్రహాలు) | యోగించని గ్రహదశలు (పాప గ్రహాలు) | మారకులు |
|---|---|---|---|
| మేషం | రవి, గురు | బుధ, శుక్ర, శని | శుక్ర |
| వృషభం | శని, బుధ, రవి | గురు, శుక్ర, చంద్ర | కుజ, గురు, శుక్ర, చంద్ర |
| మిధునం | శుక్ర | కుజ, గురు, రవి | |
| కర్కాటకం | కుజ, గురు, చంద్ర | ✦బుధ, శుక్ర, శని | శని |
| సింహం | కుజ, గురు, రవి | బుధ, శుక్ర, శని | శని |
| కన్య | శుక్రుడు, బుధుడు | చంద్ర, కుజ, గురు | కుజ |
| తుల | ✦చంద్ర, ✦బుధ,శని | రవి, కుజ, గురు | కుజ |
| వృశ్చికం | ✦రవి, ✦చంద్ర, గురు | శని, బుధ, శుక్ర | శుక్ర |
| ధనుస్సు | రవి, బుధ, కుజ | శుక్రుడు | శని |
| మకరం | ✦శుక్ర, బుధ | కుజ, గురు, చంద్ర | శని, కుజ |
| కుంభం | ✦శుక్రుడు | గురు, చంద్ర, కుజ | రవి, గురు |
| మీనం | ✦కుజుడు, చంద్రుడు, ✦గురు | శని, శుక్ర, బుధ, రవి | కుజ |

గమనిక : ✦ గుర్తుగల గ్రహాలు ఆయా లగ్నజాతకులకు విశేషయోగ కారకాలు

# 9. నేటి గ్రహస్థితి - మీ జాతక ఫలితం

ప్రస్తుతం గ్రహాల స్థితిని, జన్మకాలం నాటి గ్రహస్థితితో అనుసంధానం చేసి, ఆ నాటి ఫలితాలను కనుగొనుటనే గోచారం అంటున్నారు. గ్రహముల నడకనే గోచారం అంటారు.

గోచారంలో చంద్రుడు ఉన్న రాశినే లగ్నంగా భావిస్తారు.

చంద్రలగ్నం లగాయితు మిగిలిన స్థానాలను గణిస్తారు.

ఆకాశంలో గ్రహాలు నిరంతరంగా వేరువేరు వేగాలతో తిరుగుతూ ఉంటాయి. దానివలన అవి ఒక్కొక్కరాశిలో ఉండే కాలం వేరుగా ఉంటుంది.

క్రింది పట్టిక ద్వారా గ్రహసంచార కాలములు తెలుసుకోవచ్చును.

| గ్రహము | రాశిని ($30^\circ$) దాటుటకు పట్టు కాలం | ఒక రోజులో ప్రయాణించు దూరం |
|---|---|---|
| రవి | 1 నెల | 1 డిగ్రీ |
| చంద్రుడు | 2 1/4 రోజు | 13 నుండి 14 డిగ్రీలు |
| కుజుడు | 45 రోజులు | 40 నిమిషాలు |
| బుధుడు | 1 నెల | 1 డిగ్రీ |
| గురుడు | 1 సంవత్సరం | 4 నుండి 5 నిమిషాలు |
| శుక్రుడు | 1 నెల | 1 డిగ్రీ |
| శని | 2 1/2 సం॥లు | సుమారు 2 నిమిషాలు |
| రాహువు | 1.1/2 సం॥లు | సుమారు 3 నిమిషాల 18 సెకన్లు |
| కేతువు | 1 1/2 సం॥ | సుమారు 3 నిమిషాల 18 సెకన్లు |

పంచాంగమును పరిశీలిస్తే, ఏగ్రహము ఏరోజునుండి ఏరోజువరకు ఏరాశిలో ఉంటుందో తెలుసుకొనవచ్చును. ఆ రాశిచక్రము నందలి గ్రహముల స్థితిని బట్టి, జాతకుని జాతక ఫలితములు తెలుసుకొనవచ్చును.

జన్మచక్రంలో చంద్రుడున్న రాశినే గోచారంలో లగ్నంగా భావిస్తారు. దీనినే చంద్రలగ్నం అంటారు.

# గోచార ఫలితములు

## చంద్రలగ్నంలోనే

1. రవి ఉంటే జాతకుడు కుటుంబానికి దూరంగా ఉంటాడు. పనులకు ఆటంకాలు కలుగుతాయి. అనవసరశ్రమ, అనారోగ్యం కలుగుతుంది.
2. చంద్రుడు ఉంటే కుటుంబసౌఖ్యం, ఆరోగ్యం, గౌరవం కలుగుతుంది.
3. కుజుడు ఉంటే బంధువులతో తగాదాలు, ధననష్టం, కార్యహాని కలుగుతాయి.
4. బుధుడు ఉంటే నీచులతో స్నేహం, బంధువులతో విరోధం, ఆస్తినష్టం కలుగుతుంది.
5. గురువు ఉంటే ప్రయాణాలు, ధనవ్యయం, ఆందోళన, బంధువులతో విభేదాలు కలుగుతాయి.
6. శుక్రుడు ఉంటే కుటుంబసుఖం, విద్యాభివృద్ధి, ఉద్యోగం లభిస్తాయి.
7. శని ఉంటే దూరప్రయాణాలు, అనారోగ్యం, పనులకు ఆటంకాలు కలుగుతాయి.
8. రాహువు ఉంటే అనారోగ్యం, ప్రాణాపాయం కలుగుతాయి.
9. కేతువు ఉంటే కష్టములు కలుగుతాయి.

**చంద్రలగ్నం లగాయతు రెండవరాశిలో**

1. రవి ఉంటే అనవసరశ్రమ, అనారోగ్యం, అశాంతి కలుగుతాయి.
2. చంద్రుడు ఉంటే ధనవ్యయం, కార్యహాని, అపనిందలు, ఇతరులతో విభేదాలు కలుగుతాయి.
3. కుజుడు ఉంటే అధికారుల వలన భయం, అనవసరశ్రమ కలుగుతాయి.
4. రాహువు ఉంటే ధననష్టం కలుగుతుంది.
5. గురువు ఉంటే స్త్రీసౌఖ్యం, అధికారం లభిస్తాయి. ధనార్జన ఉంటుంది.
6. శని ఉంటే ఆర్థికంగా ఇబ్బందులు, అనారోగ్యం, అశాంతి కలుగుతాయి.
7. బుధుడు ఉంటే అనుకున్న పనులు నెరవేరుతాయి. ధనలాభం కలుగుతుంది. కాని అవమానం పొందుతారు.
8. కేతువు ఉంటే అనారోగ్యం కలుగుతుంది.
9. శుక్రుడు ఉంటే కుటుంబంలో ఆనందం, ధనలాభం.సుఖశాంతులు లభిస్తాయి.

చంద్రలగ్నం లగాయితు మూడవరాశిలో

1. రవి ఉంటే మిత్రుల సహకారం, ఉద్యోగంలో అభివృద్ధి, ధనలాభం, సుఖశాంతులు లభిస్తాయి.
2. చంద్రుడు ఉంటే నూతన పరిచయాలు, పనులు నెరవేరుట, ధనలాభం, కుటుంబసౌఖ్యం కలుగుతాయి.
3. కుజుడు ఉంటే అనుకున్నపనులు నెరవేరుతాయి. సంతానసుఖము, ఆరోగ్యం, ఉద్యోగంలో అభివృద్ధి కలుగుతాయి.
4. రాహువు ఉంటే సుఖశాంతులు కలుగుతాయి.
5. గురువు ఉంటే స్థానచలనము, పనులకు ఆటంకాలు ఏర్పడతాయి.
6. శని ఉంటే అనుకున్న పనులు నెరవేరుతాయి. ఇతరులవలన తన పనులు జరుగుతాయి. అనారోగ్యం కలుగుతుంది.
7. బుధుడు ఉంటే మిత్రుల సహకారం లభిస్తుంది. బంధువులతో, అధికారులతో విభేదాలు కలుగుతాయి. ధనవ్యయం జరుగుతుంది.
8. కేతువు ఉంటే అనారోగ్యము, ధనవ్యయము కలుగుతుంది.
9. శుక్రుడు ఉంటే నూతన పరిచయాలు, సంఘంలో గౌరవం కలుగుతాయి. అధికారం లభిస్తుంది.

చంద్రలగ్నం లగాయతు నాలుగవ రాశిలో

1. రవి ఉంటే కుటుంబంలో కలహాలు, ఋణబాధ కలుగుతాయి.
2. చంద్రుడు ఉంటే బంధువులతో విభేధాలు, కార్యహాని, ఆందోళన కలుగుతాయి.
3. కుజుడు ఉంటే ఇతరులను నమ్మిమోసపోతాడు. అనారోగ్యం కలుగుతుంది.
4. రాహువు ఉంటే కష్టములు కలుగుతాయి.
5. గురువు ఉంటే ఉద్యోగంలో ఇబ్బందులు, అధికారం కోల్పోవుట, ఆందోళన కలుగుతాయి.
6. శని ఉంటే పనులకు ఆటంకాలు ఏర్పడును. అనవసరంగా ధనవ్యయం జరుగును.
7. బుధుడు ఉంటే బంధు,మిత్రుల సహకారం, ధనము, సుఖము లభించును.
8. కేతువు ఉంటే ధనము, సుఖము లభించును.
9. శుక్రుడు ఉంటే మిత్రులతో వినోదయాత్రలు చేస్తారు. ధాన్యలాభం, సుఖశాంతులు పొందుతారు.

**చంద్రలగ్నం లగాయతు అయిదవరాశిలో**

1. రవి ఉంటే బంధువియోగం, దుఃఖము, అశాంతి కలుగును.
2. చంద్రుడు ఉంటే పనులు నెరవేరవు. అనారోగ్యము ఏర్పడుతుంది.
3. కుజుడు ఉంటే కుమారునివలన మనశ్శాంతి కోల్పోవుదురు. కోపము, బలహీనత కలుగును.
4. రాహువు ఉంటే ధననష్టము కలుగును.
5. గురువు ఉంటే మిత్రుల సహకారం, ధనము, అధికారము లభించును. శుభకార్యములు నెరవేర్చుదురు.
6. శని ఉంటే భార్యకు అనారోగ్యం కలుగుతుంది. అనవసరంగా ధనం వ్యయమవుతుంది.
7. బుధుడు ఉంటే కుటుంబంలో కలహాలు, అశాంతి ఏర్పడతాయి. సుఖసంతోషాలు లభిస్తాయి.
8. కేతువు ఉంటే కుటుంబసుఖము, ధనము, ఆరోగ్యము లభించును.
9. శుక్రుడు ఉంటే మిత్రులసహకారంతో అనుకున్న పనులు నెరవేరుతాయి.

**చంద్రలగ్నం లగాయతు ఆరవ రాశిలో**

1. రవి ఉంటే అనుకున్న పనులు నెరవేరుతాయి. ధనలాభం, కుటుంబంలో సుఖశాంతులు కలుగుతాయి. అనారోగ్యం కలుగుతుంది.
2. చంద్రుడు ఉంటే నూతన వస్తువులు సమకూర్చుకుంటారు. బంధుమిత్రులతో వినోద కాలక్షేపం చేస్తారు. స్త్రీసాంగత్యం కలుగుతుంది.
3. కుజుడు ఉంటే కార్యసిద్ధి కలుగుతుంది. నూతన వస్తువులను సేకరిస్తారు.
4. రాహువు ఉంటే కుటుంబ సుఖము, సంతోషము కలుగుతాయి.
5. గురువు ఉంటే శ్రమపడినా ఫలితం దక్కదు. దాంపత్యసుఖం లభించదు.
6. శని ఉంటే ఆరోగ్యం, ధనలాభం, కుటుంబసౌఖ్యం కలుగుతుంది.
7. బుధుడు ఉంటే నాయకుడు అవుతాడు. ధనవృద్ధి కలుగుతుంది. సుఖ సంతోషాలు లభిస్తాయి.
8. కేతువు ఉంటే ధనవ్యయం కలుగును.
9. శుక్రుడు ఉంటే ధనవ్యయము అవుతుంది. ఋణము చేస్తారు.

**చంద్రలగ్నం లగాయతు ఏడవరాశిలో**

1. రవి ఉంటే అధికప్రయాణాలు, అనారోగ్యం, దాంపత్యసుఖం లేకపోవుట, ఆందోళన కలుగుతుంది.
2. చంద్రుడు ఉంటే బంధువుల సమాగమం, విలాస యాత్రలు చేయుట, స్త్రీసౌఖ్యం కలుగుతుంది.

3. కుజుడు ఉంటే బంధుమిత్రులతో విభేదాలు, అశాంతి కలుగుతుంది.
4. రాహువు ఉంటే పనులు నెరవేరవు. ధననష్టం జరుగుతుంది.
5. గురువు ఉంటే సమాజంలో గౌరవం, కుటుంబ సుఖం, ధనలాభం కలుగుతాయి.
6. శని ఉంటే ప్రయాణాలు, అలసట, అనారోగ్యం కలుగుతాయి.
7. బుధుడు ఉంటే కార్యహాని, కలహాలు, ధనవ్యయం, అశాంతి కలుగుతాయి.
8. కేతువు ఉంటే అనారోగ్యం, ఆపద కలుగుతాయి.
9. శుక్రుడు ఉంటే స్త్రీల వలన సమస్యలు, ఇబ్బందులు ఏర్పడతాయి.

**చంద్రలగ్నం లగాయితు ఎనిమిదవరాశిలో**

1. రవిఉంటే కుటుంబకలహాలు, అనారోగ్యం, అశాంతి, ధననష్టం కలుగుతాయి.
2. చంద్రుడు ఉంటే మానసిక ఒత్తిడి, అనారోగ్యం కలుగుతాయి.
3. కుజుడు ఉంటే నిరాశ, అశాంతి, అనారోగ్యం కలుగుతాయి.
4. రాహువు ఉంటే అనారోగ్యం, ఆపద కలుగుతాయి.
5. గురువు ఉంటే ప్రయాణాలు, అనవసరశ్రమ, ధననష్టం కలుగుతాయి.
6. శని ఉంటే కుటుంబ సమస్యలు ఏర్పడతాయి.
7. బుధుడు ఉంటే అధికారుల అండ లభిస్తుంది. అనుకున్న పనులు నెరవేరును. ఆనందం పొందుతారు.
8. కేతువు ఉంటే ధననష్టం కలుగుతుంది.
9. శుక్రుడు ఉంటే మిత్రుల కలయిక, ధనము, స్త్రీసౌఖ్యం, ఆరోగ్యం లభిస్తాయి.

**చంద్రలగ్నం లగాయతు తొమ్మిదవరాశిలో**

1. రవి ఉంటే అనవసరకలహాలు, మనశ్శాంతిలేకపోవుట, ధనవ్యయం కలుగుతాయి.
2. చంద్రుడు ఉంటే మానసిక ఆందోళన, నిరాశ, బలహీనత ఏర్పడతాయి.
3. కుజుడు ఉంటే ప్రయాణాలు, ధననష్టం, అవమానము, ఆందోళన కలుగుతాయి.
4. రాహువు ఉంటే పనులు నెరవేరవు. ధననష్టం కలుగుతుంది.
5. గురువు ఉంటే అనుకున్న పనులు జరుగుతాయి. కుటుంబసుఖము, అధికారము లభిస్తాయి.

6. శని ఉంటే అధికారుల వలన బాధలు, అనవసర ప్రయాణాలు, అనారోగ్యం కలుగుతుంది.
7. బుధుడు ఉంటే బద్ధకం పెరుగుతుంది. నీచకార్యాలపై ఆసక్తి కలుగుతుంది.
8. కేతువు ఉంటే బంధుమిత్రుల సహకారం లభిస్తుంది.
9. శుక్రుడు ఉంటే మిత్రులు సహకరిస్తారు. అనుకున్న పనులు నెరవేరుతాయి. సుఖశాంతులు కలుగుతాయి.

**చంద్రలగ్నం లగాయితు పదవరాశిలో**

1. రవి ఉంటే అనుకున్న పనులు నెరవేరుతాయి. మిత్రులతో విందులు చేసుకుంటారు.
2. చంద్రుడు ఉంటే అధికారంలో అభివృద్ధి, కుటుంబంలో సుఖసంతోషాలు, ఆర్థికాభివృద్ధి కలుగుతాయి.
3. కుజుడు ఉంటే అధికశ్రమ, కార్యహాని, అనారోగ్యం కలుగుతాయి.
4. రాహువు ఉంటే కార్యసిద్ధి కలుగుతుంది. ధనము, సుఖము లభిస్తాయి.
5. గురువు ఉంటే వృత్తిపరంగా, కుటుంబపరంగా ఇబ్బందులు కలుగుతాయి.
6. శని ఉంటే ఉద్యోగం లభిస్తుంది. నీచకార్యాలపై ఆసక్తి కలుగుతుంది.
7. బుధుడు ఉంటే ఉద్యోగాభివృద్ధి, కీర్తి, ధనము లభిస్తాయి.
8. కేతువు ఉంటే ధనవ్యయం, బాధలు కలుగుతాయి.
9. శుక్రుడు ఉంటే మిత్రులు సహకరిస్తారు. ఉద్యోగరీత్యా శుభప్రదం. వ్యసనాల వలన అవమానాలు పొందుతారు.

**చంద్రలగ్నం లగాయతు పదకొండవ రాశిలో**

1. రవి ఉంటే వృత్తిలో అభివృద్ధి, కుటుంబంలో ఆనందం, ధనలాభం కలుగుతాయి.
2. చంద్రుడు ఉంటే నూతన వ్యక్తులతో పరిచయాలు. స్త్రీ సాంగత్యం, కుటుంబాభివృద్ధి కలుగుతాయి.
3. కుజుడు ఉంటే అనుకున్న పనులు జరుగుతాయి. భూ,ధనలాభం, స్త్రీసౌఖ్యం పొందుతారు.
4. రాహువు ఉంటే కుటుంబసుఖము, స్త్రీ సాంగత్యం లభిస్తుంది.

5. గురువు ఉంటే ఉద్యోగం, అధికారం, ధనము, సుఖము లభిస్తాయి.
6. శని ఉంటే కుటుంబసుఖము, గౌరవము ధనము లభిస్తాయి.
7. బుధుడు ఉంటే నూతన వ్యక్తుల పరిచయం, సంఘంలో గౌరవం ఏర్పడతాయి. అనుకున్న పనులు సాధిస్తారు.
8. కేతువు ఉంటే ఆర్థిక ఇబ్బందులు కలుగుతాయి.
9. శుక్రుడు ఉంటే మిత్రులు సహకరిస్తారు. స్త్రీ సౌఖ్యం లభిస్తుంది.

**చంద్రలగ్నం లగాయతు పన్నెండవ రాశిలో**

1. రవి ఉంటే మిత్రులకు దూరంగా ఉంటారు. ఆందోళన, ధననష్టం కలుగుతుంది.
2. చంద్రుడు ఉంటే మిత్రులతో విభేదిస్తారు. పనులు నెరవేరవు.
3. కుజుడు ఉంటే అధిక ధనవ్యయం, స్త్రీలతో వైరం కలుగుతాయి.
4. రాహువు ఉంటే పనులు నెరవేరవు. అనవసర శ్రమ, ధనవ్యయం కలుగుతాయి.
5. గురువు ఉంటే ప్రయాణాలు, ధననష్టం కలుగుతుంది. కుటుంబసుఖం ఉండదు.
6. శని ఉంటే అనవసరశ్రమ, అనారోగ్యం, ధననష్టం కలుగుతాయి.
7. బుధుడు ఉంటే కుటుంబంలో సమస్యలు, శత్రువుల వలన బాధలు, అపజయము కలుగుతాయి.
8. కేతువు ఉంటే కుటుంబసుఖము, ధనార్జన ఉంటుంది.
9. శుక్రుడు ఉంటే స్త్రీలతో పరిచయాలు, అధికవ్యయం కలుగుతుంది. అనుకున్న పనులు జరగవు.

జన్మచక్రంలో చంద్రుడు ఉన్నరాశి (చంద్రలగ్నం) లగాయతు ఆయా గ్రహములకు గోచారములో శుభస్థానములు, వాటికి వేధాస్థానములను తెలుసుకుందాము.

| గ్రహము | శుభ స్థానములు | వేధా స్థానములు |
|---|---|---|
| రవి | 3,6,10, 11 | 9,12,4,3 |
| చంద్రుడు | 1,3,6,7,10,11 | 5,9,12,2,4,8 |
| కుజుడు | 3,6,11 | 12,9,5 |
| బుధుడు | 2,4,6,8,10,11 | 5,3,9,1,7,12 |
| గురుడు | 2,5,7,9,11 | 12,4,3,10,8 |
| శుక్రుడు | 1,2,3,4,5,8,9,10,12 | 8,7,1,10,9,5,11 |
| శని | 3,6,11 | 12,9,5 |

శుభస్థానములలో ఉన్నగ్రహము, ఆగ్రహము యొక్క వేధా స్థానములలో ఏదైనా గ్రహము ఉంటే శుభఫలితాన్ని ఇవ్వలేదు.

# 10. గ్రహానుగ్రహం - ధనయోగం

జ్యోతిషపరంగా ఏగ్రహం ఏస్థానంలో ఉంటే మనకు ధనం ప్రాప్తిస్తుందో, ఏ గ్రహం ఏస్థానంలో ఉంటే ధనం వ్యయమౌతుందో తెలుసుకుందాం.

ధనలాభం :-

- లగ్నాధిపతి, దోషరహితమైన బుధుడు, శుభులతో కలసి 11వస్థానంలో ఉంటే ధనలాభం వుంటుంది.
- 11వ స్థానాధిపతి బుధుడై, బలవంతుడైన ఆ బుధుడు 11వ స్థానంలో ఉంటే వ్యాపారం చేసి లాభం పొందును.
- 11వ స్థానంలో లగ్నాధిపతి, బుధుడు ఉంటే విద్యాలాభం కలుగును.
- బలవంతులైన గురువు కాని, శుక్రుడు కాని 11వ స్థానాధిపతులై 11వ స్థానంలో ఉంటే ఆభరణాలు లభించును.
- 11వ స్థానాధిపతి, 2వ స్థానాధిపతి పరివర్తన చెందితే ధనలాభం వుంటుంది. 11వ స్థానంలో బలవంతుడైన గురువుంటే బోధవల వలన, కర్మలు చేయించుట వలన ధనం సంపాదించును.
- 11వ స్థానంలో బలవంతుడైన శుక్రుడుంటే కళల వలన ధనం సంపాదించును.

- 11వ స్థానంలో బలవంతుడైన శనియుంటే వ్యవసాయము, వ్యాపారముల వలన ధనం సంపాదించును.
- 11వ స్థానాధిపతి 9వ స్థానంలో, 9వ స్థానాధిపతి కేంద్రములో ఉంటే ధనలాభం కలుగును.

## ధనప్రాప్తి

- లగ్నాధిపతి 2వ స్థానంలో, ద్వితీయాధిపతి 11వ స్థానంలో, 11వ స్థావాధిపతి లగ్నంలో ఉంటే నిధి లభించును.
- ద్వితీయాధిపతి పంచమాధిపతితో కలసి శత్రు క్షేత్రంలో ఉండి రాహునితో చూడబడితే ధనప్రాప్తి కలుగును.
- ద్వితీయాధిపతి 11వ స్థానంలో లేదా కేంద్ర, కోణంలలో ఉంటే భోగవంతుడు.

## ఎవరి వలన ధనలాభం

- ద్వితీయాధిపతి రవితో కలసి ఉంటే పిత్రార్జితము ప్రాప్తించును.
- ద్వితీయాధిపతి చతుర్థాధిపతితో కలసివున్న, చూడబడిన మాతృధనం ప్రాప్తించును.
- ద్వితీయాధిపతి గురుడు, పంచమాధిపతులతో కలసివున్న, చూడబడిన పుత్రుని వలన ధనము ప్రాప్తించును.
- ద్వితీయాధిపతి తృతీయ స్థానాధిపతితో కూడిన, చూడబడిన సోదర ధనం ప్రాప్తించును.
- ద్వితీయాధిపతి సప్తమాధిపతితో కలసియున్న,చూడబడిన కళత్రధనం ప్రాప్తించును.

## ధననష్టం

- 11వ స్థానము చరరాశియై, 3వ స్థానంలో స్థిరగ్రహముంటే ధనవ్యయం అవుతుంది.

## సత్కార్యములకు ధనవ్యయం

- వ్యయాధిపతి శుభుడై శుభగ్రహసంబంధం కలిగియుంటే
- వ్యయాధిపతి 9వ స్థానంలో, చతుర్థస్థానాధిపతి 12వ స్థానంలో ఉంటే

- ❖ వ్యయాధిపతి దశమాధిపతి సంబంధమును కలిగియుండి, దశమాధిపతి శుభుడైతే
- ❖ లగ్న, వ్యయాధిపతులు పరివర్తనము పొంది శుభగ్రహములతో చూడబడిన
- ❖ వ్యయాధిపతి ఉచ్ఛ,త్రికోణ, వర్గోత్తమాంశలో యుంటే ధనం సత్కార్యములకు వ్యయమగును.

## దుబారా ఖర్చులు

- ❖ వ్యయాధిపతి పాపియై, పాపగ్రహ సంబంధం కలిగియుంటే
- ❖ వ్యయాధిపతి కేంద్రకోణ గతుడైనప్పటికి పాపుల దృష్టితో పాపాంశలలో పడితే
- ❖ 12వ స్థానంలో పాపులుంటే
- ❖ వ్యయాధిపతి, దశమాధిపతితో సంబంధం కలిగియుండి, దశమాధిపతి పాపి అయితే

అవసర వ్యయము అవుతుంది.

# 11. గ్రహములు - ఆరోగ్యము

" Health is Wealth" అని ఆంగ్లసూక్తి. "ఆరోగ్యమే మహాభాగ్యము". అని ఆర్యోక్తి. మన శరీరమందలి వివిధ అంగములు సక్రమంగా పనిచేసి, శ్వాసక్రియ, జీర్ణక్రియ, విసర్జనక్రియ మొదలైన క్రియలను సక్రమంగా నిర్వర్తించునంత వరకు మనం ఆరోగ్యంగా ఉంటాము. మన శరీరములో ఏ అంగము పనిచేయకపోయినా, దానికి సంబంధించిన పనికి ఆటంకం కలిగి, మనకు అనారోగ్యం కలుగుతుంది.

మన శరీరావయవములను గ్రహములు, రాశులు, నక్షత్రములు ప్రభావితం చేస్తూ ఉంటాయని ప్రాచీన ఆయుర్వేద పండితులు నిరూపించిన విషయం జగద్విదితమే.

రోగ నిర్ధారణ చేయుటకు జ్యోతిష్యశాస్త్రము ఎంతో ఉపయోగపడుతున్నది.

ప్రస్తుతం మనం రోగములు, అవి ఏ గ్రహముల ప్రభావం వలన కలుగుతున్నవో సంక్షిప్తంగా తెలుసుకుందాం.

| గ్రహములు | శరీరావయవములు | రోగములు |
|---|---|---|
| రవి | తల, గుండె, కుడికన్ను, రక్తము, జీర్ణక్రియ జఠరరసము. | నేత్రవ్యాధులు, గుండెనొప్పి, ఎసిడిటీ, తలనొప్పి వడదెబ్బ జ్వరము. |
| చంద్రుడు | ఎడమకన్ను, పొట్ట స్త్రీ గర్భాశయము, అండము స్తనములు, లింఫు గ్రంధులు | మానసిక రుగ్మతలు, మూర్ఛ స్త్రీ గర్భకోశమునకు చెందిన వ్యాధులు, ఋతు క్రమము లేకపోవుట, స్తనములకు సంబంధించిన వ్యాధులు. |
| కుజుడు | మర్మావయవములు, ఎఱ్ఱ రక్త కణములు, హిమోగ్లోబిన్ గ్లోబిన్, కండరములు | గాయములు, అగ్ని ప్రమాదము లేదా ప్రేలుడు వలన కలుగు దెబ్బలు |
| రాహువు | - - - | చర్మరోగము, క్షయ, వెక్కిళ్ళు, చిన్నప్రేగులు దెబ్బతినుట. |
| గురువు | కాలేయము, కొవ్వు, పిత్తరసము, గాల్ బ్లాడర్ | కాన్సర్, వ్రణములు, కామెర్లు, కాలేయముకు సంబంధించిన వ్యాధులు |
| శని | ఎముకలు, దంతములు, క్లోమము, విసర్జన, గుదము. | అజీర్ణము, అమీబియస్, పిచ్చి, దంతవ్యాధులు, ఎముకలు, చిట్లుట, జలుబు, దీర్ఘవ్యాధులు, పక్షవాతము, బోదకాలు |
| బుధుడు | నరములు, కేంద్రనాడులు మెదడు, చర్మము | నరముల బలహీనత, చెముడు, నత్తి, మెదడు వాపు, మెదడుకు సంబంధించిన వ్యాధులు. ఫిట్స్ ల్యూకోడెర్మా, నపుంసకత్వము, శ్వాసకోశవ్యాధులు |
| కేతువు | - - - | రక్తపోటు, నులిపురుగులు నత్తి, వింతవ్యాధులు. |
| శుక్రుడు | గొంతు, మూత్రపిండములు | షుగర్, సుఖవ్యాధులు, టాన్సిల్స్, మూత్రపిండాల వ్యాధి, కాటరాక్ట్, గవదబిళ్ళల వ్యాధి |

# గ్రహముల కలయిక - ఏర్పడు వ్యాధులు

| గ్రహముల కలయిక | సంభవించు వ్యాధులు |
|---|---|
| రవి + శుక్ర | ఆస్మా, శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు, క్షయ. |
| రవి + శని | కామెర్లు |
| చంద్ర + రాహు | న్యూమోనియా, పిచ్చి |
| కుజ + శని | రక్తహీనత, బరువు తగ్గుట, కుష్ఠు |
| రాహు + కేతు | పైల్స్ |
| గురు + రాహు (లేదా)<br>గురు + కేతు | ఉబ్బసము, ఆయాసము,<br>శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు, క్షయ |
| గురు + కుజ | కామెర్లు |
| బుధ + గురు | ఆస్మా, శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు, క్షయ. |
| శుక్ర + రాహు | నపుంసకత్వము |
| శుక్ర + కేతు | నిద్రలేమి, స్వప్నస్ఖలనము |

రాశులు, అవి సూచించు శరీరావయములును, రాశులు ప్రభావం వలన కలిగే వ్యాధులను గురించి తెలుసుకుందాం.

| రాశులు | శరీరావయవములు | రోగములు |
|---|---|---|
| మేషము | తల | తలనొప్పి, నిద్రలేమి, ఉష్ణము మశూచి, మూర్ఛ గాయములు |
| వృషభము | ముఖము, గొంతు, మెడ టాన్సిల్సు | టాన్సిల్స్ వాపు, గొంతునొప్పి, దంతవ్యాధులు కంటిజబ్బులు. |
| మిథునము | ఊపిరితిత్తులు, ఉర: కుహరము, కుడిభుజము కుడిచేయి, కుడిచెవి | ఉబ్బసము, క్షయ, దగ్గు, ఫ్లూ జ్వరము |

| రాశులు | శరీరావయవములు | రోగములు |
|---|---|---|
| కర్కాటకము | వక్షము, శ్వాసకోశము | పిత్తాశయంలో రాళ్ళు ఏర్పడుట, అజీర్ణవ్యాధి, ఎసిడిటి, పచ్చకామెర్లు, ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధులు. |
| సింహము | గుండె, వెన్నుపూస | గుండె నొప్పి, వడదెబ్బ మూర్ఛ, తలతిరుగు రోగములు. |
| కన్య | కడుపు, జీర్ణాశయము చిన్నప్రేవులు | కలరా, డయారియా, అజీర్ణము, టైఫాయిడ్ నులిపురుగులు, ఏలికపాములు |
| తుల | మూత్రపిండములు, అండాశయము,నడుము పొత్తికడుపు, నాభి | చర్మవ్యాధులు, హెర్నియా, వరిబీజము కీళ్ళవాతము, నడుమునొప్పి |
| వృశ్చికము | మర్మావయములు, మూత్రకోశము అండము, గుదము | సుఖరోగములు, పైల్స్ ఋతుక్రమం లేకపోవుట, మూత్రకోశంలో రాళ్ళు, విషప్రయోగము వలన కలుగు వ్యాధులు, తెల్లబట్ట. |
| ధనస్సు | నడుము, పిరుదులు, తొడలు తుంటి కాళ్ళు | కీళ్ళవాతము, నడుము నొప్పి, ఎముకలు చిట్లుట, వాతరోగము, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు |
| మకరం | మోకాళ్ళు, మోకాలి చిప్పలు, కీళ్ళు | బొల్లి, వాతరోగము, మానసిక రోగములు. |
| కుంభము | ఎడమచేయి, ఎడమచెవి, చీలమండలం | వైరస్ వలన వ్యాపించు వ్యాధులు, చర్మరోగములు కంటి వ్యాధులు |
| మీనము | పాదములు, మడమలు, ఎడమకన్ను | పాదములు పగులుట, కాళ్ళు, పాదములు వంకర పోవుట |

# 12. గ్రహములు - వివాహం

వివాహం అనేది మానవ జీవితంలో చాలా ముఖ్యమైన సంఘటన. వివాహం వలన మన కుటుంబంలోని ఒక నూతన వ్యక్తి ప్రవేశిస్తుంది లేదా ఒక నూతన కుటుంబంలోకి శాశ్వత సభ్యులుగా ప్రవేశిస్తాము. వివాహం ద్వారా యిద్దరు స్త్రీ పురుషులు చట్టబద్ధంగా ఏక కుటుంబీకులై తమ సుఖదుఃఖాలను పంచుకొంటూ, అన్యోన్యంగా, ఆనందంగా తమ జీవితం గడుపుతారు. లేదా నిత్య కలహాలతో బాధలతో తమ జీవితాలను వేదనకు గురిచేస్తారు. నిస్సారంగా కాలం గడుపుతారు.

కుటుంబమును 2వ స్థానం, భార్య లేదా భాగస్వామిని 7వ స్థానం, కోరిక, ప్రేమ మొదలైనవాటిని 11వ స్థానం తెలియజేస్తాయి. కాబట్టి వివాహానికి 2.7.11 స్థానాలను పరిశీలించాలి.

## సరియైన వయస్సులో వివాహం జరిగే సందర్భాలు

1. చంద్ర, శుక్రులు వృషభం, కర్కాటకం, వృశ్చికం, మీనం రాశులలో వున్నపుడు.
2. వృషభం, కర్కాటకము, వృశ్చికము, మీనము, ధనుస్సులలో ఒకటి సప్తమ భావము అయినపుడు
3. గురువు, చంద్రునితో కలసి 1,5,10 లేదా 11 స్థానములు ఒకదానిలో వున్నపుడు.
4. శుక్రుడు, చంద్రునితో కలసి 1,5,10,11 స్థానములలో ఒకదానిలో వున్నపుడు.
5. గురు, శుక్రులలో ఒకరు 2వ స్థానం లేదా 7వ స్థానం లేదా 11వ స్థానంలో వున్నపుడు.
6. లగ్నాధిపతి, సప్తమాధిపతి కలసి వారికి శుభస్థానంలో ఉన్నపుడు.
7. లగ్నాధిపతి, సప్తమాధిపతులు 3 మరియు 11 స్థానములలో ఉన్నపుడు.
8. లగ్నాధిపతి సప్తమాధిపతులు పరస్పరం 5,9 స్థానములలో ఉన్నపుడు.
9. లగ్నం నుండి 7వ స్థానంలో బుధుడు ఉండి, శుక్రుడు, సప్తమాధిపతి కలసి యున్నపుడు.
10. సప్తమాధిపతి 11వ స్థానంలో ఉండి శుక్రుడు 2వ స్థానంలో ఉన్నపుడు.
11. శుక్రుడు లగ్నంలో ఉండి లగ్నాధిపతి 7వ స్థానంలో ఉన్నపుడు.

12. 7వ స్థానంలో శుక్రుడు బలంగా ఉన్నపుడు.
13. సప్తమాధిపతి, శుక్రుడు కలిసి 2వ స్థానంలో ఉన్నపుడు.
14. లగ్నాధిపతి 10వ స్థానంలో, ద్వితీయాధిపతి 11వ స్థానంలో ఉన్నపుడు.
15. 2వ స్థానాధిపతి 11వ స్థానంలో, 11వ స్థానాధిపతి 2వ స్థానంలో ఉన్నపుడు.
16. 2వ స్థానాధిపతి, 7వ స్థానాధిపతి కలసి 11వ స్థానంలో ఉన్నపుడు.

## ఆలస్య వివాహ సందర్భాలు

1. లగ్నం లగాయితు లేదా చంద్రుడు ఉన్న స్థానం లగాయతు 1,3,5,7,10 స్థానములలో నీచలో శని ఉన్నపుడు.
2. 8వ స్థానంలో కుజుడు ఉన్నపుడు.
3. 1,2,7,11 స్థానములలో ఒకదానిలో చంద్రుడు, శని కలసి యున్నపుడు.
4. సప్తమాధిపతి మరియు శుక్రుడు శనితో చూడబడితే.
5. కుజ, శుక్రులు కలసి 5,7,9 స్థానములలో ఒక దానిలో కలసియుండి గురువు యొక్క నీచదృష్టిని కలిగియుంటే.

## వివాహం జరిగే సమయం

'పరాశరుడు' వివాహం జరిగే సమయాలను క్రింది విధంగా నిర్ణయించారు.

- ❖ శుక్రుడు, కళత్ర స్థానాధిపతి బలవంతులయితే వారి దశ, అంతర్దశలలో వివాహం జరుగుతుంది.
- ❖ జన్మలగ్నాధిపతి, సప్తమాధిపతి ఉన్న రాశులలో గోచార గురువు ఉండే కాలంలో వివాహం జరుగుతుంది.
- ❖ జన్మచక్రంలో చంద్రరాశ్యాధిపతి, అష్టమాధిపతి రాశ్యాదులను కూడగా వచ్చిన రాశ్యాదికి గోచారగురుడు ప్రవేశించినపుడు వివాహం జరుగుతుంది.
- ❖ లగ్నాధిపతియొక్క నవాంశాధిపతి జన్మలగ్నంలో ఉన్న రాశి లగాయితు రెండవ స్థానంలో గోచార చంద్రుడు, గురుడు ప్రవేశించినపుడు వివాహం జరుగుతుంది.

వివాహం విషయంలో నూతన విధానాన్ని కూడా వివరిస్తున్నాను. అయితే ఆ పద్ధతికి సబ్‌లార్డ్, సబ్‌సబ్ లార్డ్ గురించి తెలుసుకోవాలి. వాటిని గురించి మరొకసారి వివరించాను. ప్రస్తుతం స్థూలంగా, విషయాన్ని తెలుసుకుందాం.

## వివాహం ఎప్పుడు జరుగుతుంది?

వివాహం జరిగే సమయం నిర్ణయించుటకు పూజ్యులు కె.యస్.కృష్ణమూర్తి గారు శివల సుబ్రహ్మణ్యంగారలు ఎంతో పరిశోధన కావించి అనుభవ పూర్వకంగా కొన్ని సూత్రాలను తయారు చేసారు. వాటిని నేను కూడ అనుభవపూర్వకంగా పరిశీలించి అవి సత్యములని గ్రహించి యున్నాను. కావున వివాహ సమయం నిర్ణయించుటకు వారు చెప్పిన విధము తెలుసుకుందాం.

వివాహం=శుక్రుడు - కుజుడు + 7 భావం

## భార్య గుణగణాలు

- లగ్నంలో రాహువు లేదా కేతువు వున్నా భార్య అనుకూలవతి.
- సప్తమ స్థానాధిపతి శని అయితే శుభగ్రహాలచే చూడబడితే భార్య గుణవతి.
- 7 వ స్థానంలో గురువుండి శుక్రుడు చరరాశిలో ఉండి లగ్నాధిపతి బలవంతుడు అయితే భార్య పతివ్రత అవుతుంది.
- సప్తమ స్థానాధిపతి గురువు అయి పాపసంబంధం లేకపోతే భార్య రూపవతి, గుణవతి.
- ఉప పదం ఉండే 2వ స్థానంలో పూర్ణచంద్రుడు గాని, గురువుగాని శుక్రుడు గాని ఉంటే భార్య అందమైనది.
- సప్తమ స్థానాధిపతి శుభక్షేత్రంలో ఉండి శుభులచే చూడబడిన మంచి భార్య లభించును.
- సప్తమాధిపతి రవి అయి పాపసంబంధం కలిగిఉంటే భార్య చెడు స్వభావురాలు.
- సప్తమాధిపతి చంద్రుడై పాపసంభంధం కలిగిఉంటే భార్య చెడు స్వభావురాలు.
- సప్తమాధిపతి కుజుడై 6వ స్థానంలో ఉంటే దయలేనిది.
- సప్తమాధిపతి బుధుడై 12వ స్థానంలో ఉంటే భర్తను బాధించును.
- సప్తమస్థానాధిపతి శుక్రుడు నీచస్థానంలో ఉండి, శుభదృష్టి లేకపోతే భార్య దుష్టురాలు, భర్తను చంపుటకు కూడ వెనుకాడదు.
- సప్తమ స్థానాధిపతి 12వ స్థానంలో ఉండి, 7వ స్థానంలో శని ఉండి, శుక్రుడు బలహీనంగా ఉంటే భార్య అనుకూలవతి కాదు.

## ద్వికళత్ర యోగము

- ❖ సప్తమాధిపతి, శుక్రుడు కలసి పాపగ్రహాలను కూడిన
- ❖ సప్తమాధిపతి 8 లేక 12 వ స్థానంలో ఉంటే
- ❖ కుజుడు 7 లేక 8 లేక 12 స్థానంలో ఉండి ఆయా స్థానాధిపతులచే చూడబడకపోతే
- ❖ సప్తమ స్థానాధిపతి ఉన్న స్థానము లగాయితు 8 వ స్థానంలో కుజుడు ఉన్నా
- ❖ సప్తమాధిపతికి నీచ, అస్తంగత, పాప సంబంధ దోషములు కలిగితే
- ❖ సప్తమ స్థానాధిపతి, పంచమాధిపతి, గురువు కలసి ఉంటే
- ❖ శుక్రుడు ఉన్న స్థానము నుండి 8వ స్థానములో శని ఉంటే 7 వ స్థానంలో రాహువు ఉన్నా ద్వికళత్ర యోగం ఉంటుంది.

## బహుభార్య యోగం

- ❖ 7 వ స్థానంలో కుజుడు, లగ్నాధిపతి, 8వ స్థానంలో చంద్రుడు ఉంటే మూడు వివాహాలు జరుగును.
- ❖ 8 వ స్థానంలో లగ్నాధిపతి, 7వ స్థానంలో కుజుడు, చంద్రునితో కలసి ఉంటే మూడు వివాహాలు జరుగును.
- ❖ 7వ స్థానాధిపతి, శుక్రుడు, కుజుడు, రాహువు బలహీనుడైన గురువుతో కలసిన మూడు వివాహాలు జరుగును.
- ❖ లగ్నాధిపతి, 2లేదా 7వ స్థానాధిపతి బలహీనులై కలసి ఉంటే మూడు వివాహాలు జరుగును.
- ❖ 2 వ స్థానంలో గాని, 7వ స్థానంలో కాని అనేక పాపులుండి 2,7 స్థానాధిపతులు పాపవీక్షితులైన మూడు వివాహాలు జరుగును.
- ❖ 7 వ స్థానంలో గాని, 7వ స్థానాధిపతి కుజుడు, రాహువులతో కలసి ఉంటే మూడు వివాహాలు జరుగును.
- ❖ శుక్రుడు ద్విస్వభావరాశి యందుండి, కుజ, రాహువులతో కలసి ఉంటే మూడు వివాహాలు జరుగును.
- ❖ 2 లేదా 7వ స్థానాధిపతి, 6,8 స్థానాధిపతులు కలసి పాపసంబంధం కలిగి ఉంటే నాలుగు వివాహాలు జరుగును.

## పరస్త్రీ సంపర్కం

- ❖ సప్తమ స్థానంలో రవిచంద్రులు గాని బుధ, గురువులు గాని ఉంటే
- ❖ ద్వితీయాధిపతి, సప్తమాధిపతి, దశమాధిపతి కలసి 10 వ స్థానంలో ఉంటే

- ❖ సప్తమాధిపతి సప్తమంలో ఉంటే
- ❖ సప్తమాధిపతి పాపులతో కూడి ఉంటే
- ❖ 7 వ స్థానంలో బుధుడు గాని, శని గాని ఉంటే
- ❖ కుజ, శుక్రుడు పరివర్తన చెందితే
- ❖ సప్తమాధిపతి, శుభదృష్టిలేని రాహువుతో కలసి యుంటే
- ❖ సప్తమాధిపతి బుధునితో కలసి ఉంటే జాతకుడు పరస్త్రీలతో సంగమించును.

# 13. గ్రహములు - సంతానం

## సంతాన యోగములు

- ❖ శుక్రుడు, గురుడు, బుధుడు పంచమాధిపతితో కలసి పంచమస్థానంలో ఉంటే పుత్రప్రాప్తి.
- ❖ లగ్నాధిపతి బలవంతుడై, 5 లేదా 7వ స్థానంలో ఉండి, లగ్నము పాపగ్రహములచే చూడబడకపోతే పుత్రలాభం.
- ❖ పుత్రస్థానాధిపతి పరమోచ్చలో ఉండి పంచమస్థానము శుభగ్రహయుతమై ఉంటే పుత్రలాభం.
- ❖ లగ్నము లగాయితు 5వ ఇంటిలో రవి, 10వ ఇంటిలో గురుడు, నవమాధిపతి 11వ స్థానంలో ఉంటే పుత్రలాభం
- ❖ లగ్నంలో గురుడు, దశమాధిపతి 10వ స్థానంలో ఉండి, పుత్రస్థానాధిపతి బలవంతుడైతే పుత్రలాభం.
- ❖ లగ్నం లగాయతు 5వ స్థానంలో పంచమాధిపతి, నవమాధిపతి కలసియుంటే సంతానలాభం.
- ❖ లగ్నం లగాయతు 5వ స్థానంలో సప్తమాధిపతి, గురుడు కలసి యుండి, 9వ స్థానంలో శని ఉంటే పుత్రలాభం.
- ❖ 5వ స్థానాధిపతి 2వ స్థానంలో, ద్వితీయాధిపతి 9వ స్థానంలో, నవమాధిపతి 11వ స్థానంలో ఉంటే పుత్రలాభం.
- ❖ చంద్రుడు ఉన్న స్థానము లగాయతు 5వ స్థానంలో గురుడు, గురుడున్న స్థానం లగాయితు 5వ స్థానంలో శని, శని యున్న స్థానం లగాయితు 5వ స్థానంలో రాహువు ఉంటే పుత్రలాభం.

❖ లగ్నం లగాయితు 5వ స్థానమున గురుడు, గురునకు 5వ స్థానమున రవి, రవికి 7వ స్థానమున కుజుడు ఉంటే పుత్ర లాభం.

❖ లగ్నమునకు 5వ స్థానంలో చంద్రుడు, చంద్రుడున్న స్థానమునకు 5వ స్థానంలో శుక్రుడు, శుక్రుడున్న స్థానమునకు 5వ స్థానంలో బుధుడు ఉంటే సంతానయోగం.

❖ కళత్రస్థానాధిపతి శుక్రుడు కాని, బుధుడు కాని, చంద్రుడు కాని అయితే స్త్రీ సంతానయోగం.

## దత్తపుత్రయోగం

❖ లగ్నం లగాయతు 5వ స్థానంలో బలమైన శుభగ్రహం ఉండి, అది 5వ స్థానాధిపతిచే చూడబడకపోతే దత్తపుత్రులుంటారు.

❖ మకరములో గాని, మీనంలో గాని గురుడు ఉండి, కర్కాటకంలో బుధుడు ఉండి, 12వ స్థానంలో 5వ స్థానాధిపతి ఉంటే పుత్రనాశనం.

❖ మేషం లగ్నమునకు 5వ స్థానమున శని, 6, 8, 12 స్థానములలో దేనిలోనైనా రవి ఉండి, పుత్ర కారకుడు బలహీనుడైతే దత్తపుత్రయోగం.

❖ వృషభలగ్నమునకు 5వ స్థానములో బుధుడు, 7వ స్థానములో చంద్రుడు, 12వ స్థానములో గురుడు ఉండి నవమాధిపతి నీచుడై 12 స్థానంలో ఉంటే దత్తపుత్ర లాభం.

❖ మిథున లగ్నమునకు 5వ స్థానములో రవి, కన్యలో శుక్రుడు ఉండి, 5వ స్థానముపై గురుని దృష్టి లేకపోతే దత్తపుత్ర ప్రాప్తి.

❖ కర్కాటక లగ్నమునకు 5వ స్థానంలో చంద్రుడు, 6 లేక 8వ స్థానంలో కుజుడు ఉండి, గురుడు శుభస్థానాధిపతియై నీచుడై యున్న దత్తపుత్రయోగము కలుగుతుంది.

❖ మకరలగ్నమునందు రవి ఉండి, లగ్నం లగాయతు 5వ స్థానంలో శుక్రుడు, 7వ స్థానంలో రాహువు 12వ స్థానంలో పుత్రకారకుడు ఉంటే దత్తపుత్రలాభం.

❖ కన్యలగ్నమునకు 5వ స్థానమున బుధుడు, 7వ స్థానమున కుజుడు, పుత్రకారకుడు మేషములో ఉన్న యెడల దత్తపుత్రప్రాప్తి.

❖ తుల లగ్నమునకు 7వ స్థానమున గుళికుడు, 10వ స్థానమున గురుడు ఉండి, పుత్రస్థానాధిపతి స్వస్థానంలో లేకపోతే దత్తపుత్రయోగం.

- వృశ్చికలగ్నము లగాయితు 9వ రాశ్యాధిపతి 5వ స్థానములో, 12వ స్థానంలో గురుడు ఉండి పుత్ర స్థానములో కుజుడు ఉంటే జాతకునికి దత్తపుత్రుడు లభించును. తరువాత సంతానం కలుగుతుంది.
- ధనుర్లగ్నమునకు 6వ స్థానంలో కుజుడు ఉండి, సప్తమాధిపతి బుధుడు అయి, బుధుడు 12వ రాశిలో ఉండి 6, 8, 12 స్థానములలో ఒకదానిలో గురుడు ఉంటే దత్తపుత్రయోగం.
- మకరలగ్నమునకు 5వ స్థానంలో కుజ, శనులుండి, పుత్రయోగ కారకుడు బలహీనంగా ఉంటే దత్తపుత్రయోగం.
- కుంభలగ్నమునకు 5వ స్థానంలో రవి, 11వ స్థానంలో శని ఉండి, పుత్ర స్థానాధిపతి పాపగ్రహములతో కలసి ఉంటే దత్తపుత్రుడు లభించును.
- మీనలగ్నము లగాయితు 5వ స్థానాధిపతి 9వ స్థానంలో, 9వ స్థానాధిపతి 12వ స్థానంలో ఉండి పుత్రయోగకారకుడు శత్రుస్థానంలో ఉంటే దత్తపుత్రయోగం.
- లగ్నం లగాయితు 5వ స్థానాధిపతి శని లేదా బుధుడు అయి, 5వ స్థానంలో శని, మాంది ఉంటే దత్తపుత్రయోగం.

## నిస్సంతాన యోగం

- గురుడు, లగ్నాధిపతి, సప్తమాధిపతి, పంచమాధిపతి బలహీనులైతే సంతానం కలుగదు.
- లగ్నం లగాయితు 5వ స్థానంలో పాపగ్రహం ఉండి, 5వ స్థానాధిపతి నీచలో ఉండి, శుభగ్రహదృష్టి లేకపోతే సంతానం కలుగదు.
- లగ్నం లగాయితు 5,9 స్థానములలో పాపగ్రహములుండి, 5వ, 9వ స్థానాధిపతులు, పుత్రయోగ కారకుడు నీచలో ఉంటే సంతానం కలుగదు.
- మేషం, సింహం, వృశ్చికం, మకరంలలో ఒకటి 9వ స్థానమై, ఆ స్థానాధిపతి నపుంసక గ్రహంతో కలసియుంటే సంతానం కలుగదు.
- మకరం, కుంభంలలో ఒకటి లగ్నమై, లగ్నాధిపతి 12వ స్థానంలో, 7వ స్థానాధిపతి శత్రుక్షేత్రంలో గాని 8వ స్థానంలోగాని ఉంటే సంతానం ఉండదు.
- రవి పంచమాధిపతియై, నీచగ్రహంతో కలసిగాని, నీచగ్రహదృష్టి కలిగియుండి గాని 12వ స్థానంలో ఉండి, పుత్రయోగకారకుడు మూఢుడై ఉంటే సంతానం కలుగదు.

- చంద్రుడు పంచమాధిపతియై బుధునితో కలసి 12వ స్థానంలో ఉండి, పుత్రయోగ కారకుడు 8వ స్థానంలో ఉంటే సంతానం ఉండదు.
- కుజుడు పంచమాధిపతియై శనితో కలసి 7వ స్థానంలోను, 5, 7 స్థానములలో పుత్రకారకుడు, గురుడు ఉన్నయెడల సంతానం ఉండదు.
- బుధుడు పంచమాధిపతియై శత్రుగ్రహంతో కలసి మేషం లేదా వృశ్చికంలో ఉండి, 5 లేక 7 స్థానములలో శని ఉంటే సంతానం కలుగదు.
- గురుడు పంచమాధిపతియై, శుక్రునితో కలసి 12వ స్థానంలో ఉండి, లగ్నం పాపగ్రహదృష్టి కలిగి ఉంటే సంతానం కలుగదు.
- శుక్రుడు పంచమాధిపతియై నీచస్థానంలో ఉండి, పుత్రయోగకారకుడు మూఢుడుగా ఉంటే సంతానం కలుగదు.
- శని పంచమాధిపతియై రవితో కలసి మేషంలో ఉండి, 5వ స్థానం కుజునిచే చూడబడుతుంటే సంతానం కలుగదు.
- లగ్నం లగాయితు 7వ స్థానంలో కుజ, చంద్ర, శుక్రులు కలసియుంటే సంతానం కలుగదు.
- లగ్నాధిపతి, చంద్రుడున్న స్థానాధిపతి, గురుడు, 5, 7 స్థానములు బలహీనములై, 'యమకంటక' 6, 8, 12 స్థానములలో ఒక దానిలో ఉంటే సంతానం ఉండదు.
- లగ్నంలో రవి, దానికి 7వ స్థానంలో శని ఉంటే సంతానం కలుగదు.
- లగ్నం లగాయితు 7వ స్థానంలో శని, 10వ స్థానంలో చంద్రుడు ఉండి రవి, గురులు కలసి యుంటే సంతానం కలుగదు.
- లగ్నం లగాయితు 6వ స్థానంలో 6వ స్థానాధిపతి, రవి, శని కలసి యుండి బుధుని దృష్టి కలిగియుంటే సంతానం కలుగదు.
- 6వ స్థానంలో కుజుడు, 4వ స్థానంలో శని ఉంటే సంతానం ఉండదు.

## గర్భస్రావం జరిగే సందర్భాలు

- లగ్నాధిపతి యున్న స్థానాధిపతి రాహువుతో కలసియుంటే గర్భస్రావం.
- 5వ స్థానాధిపతి చంద్రునితో కలసి యున్నపుడు (లేదా) 6వ స్థానంలో ఉన్నపుడు, పుత్రయోగ కారకుడు 10వ స్థానంలో ఉంటే గర్భం పోవును.

- 9వ స్థానాధిపతి లగ్నంలో ఉండి, మకరంలో 12వ స్థానాధిపతి ఉండి శనితో చూడబడిన గర్భస్రావం జరుగును.
- 5వ స్థానాధిపతి 7వ స్థానంలోను, 7వ స్థానాధిపతి 12వ స్థానంలోను ఉండి, బుధుడు పాపగ్రహంతో చూడబడుతుంటే గర్భస్రావం కలుగును.
- 7వ స్థానాధిపతి ఉండే రాశియొక్క అధిపతి రవితో కలసియుండి అస్తంగతుడై నపుడు, పుత్రయోగకారకుడు నీచరాశిలో ఉంటే గర్భస్రావం అవుతుంది.
- చంద్రుడు 10వ స్థానంలో, గురుడు 7వ స్థానంలో ఉండి 5వ స్థానాధిపతి బలహీనంగా ఉంటే గర్భస్రావం కలుగుతుంది.
- మేషం లగ్నమై, 5వ స్థానాధిపతి 12వ స్థానంలోను, 5వ స్థానంలో చంద్రుడు, గుళికుడు ఉంటే గర్భస్రావం అవుతుంది.
- వృషభలగ్నమునకు 5వ స్థానమున శుక్రుడు, 5వ స్థానాధిపతి 6వ స్థానంలో ఉండి, పుత్రయోగకారకుడు 10వ స్థానంలో ఉంటే గర్భస్రావం జరిగే అవకాశం ఉన్నది. స్త్రీ గర్భం అంటితే స్రవించదు.
- మిథునలగ్నమునకు 5వ స్థానమున శుక్రుడు పాపగ్రహయుతుడై ఉండి పుత్రయోగ కారకునిచే చూడబడినా లేక కలసి యున్నా గర్భస్రావం కలుగును.
- కర్కాటక లగ్నమునకు 5వ స్థానంలో పుత్రయోగకారకుడు మూఢుడై ఉండి, చంద్రుడు, శని కలసియుంటే గర్భస్రావం అవుతుంది.
- సింహలగ్నమునకు 5వ స్థానములో శని, 10వ స్థానములో గురుడు, 12వ స్థానములో శుక్రుడు ఉంటే గర్భస్రావం కలుగును.
- కన్య లగ్నమునకు 5వ స్థానంలో గురుడు, 9వ స్థానంలో చంద్రుడు ఉండి, లగ్నంలో కుజుడు ఉంటే రక్తస్రావమగును.
- తుల లగ్నమునకు 7వ స్థానములో కుజుడు శనితో కాని, శుక్రునితో కాని కలసియుంటే గర్భస్రావం జరుగుతుంది.
- వృశ్చికలగ్నమునకు 5వ స్థానంలో చంద్రుడు, రాహువు కలసియుంటే గర్భస్రావమవుతుంది.
- ధనుర్లగ్నమునకు 5వ స్థానంలో చంద్రుడు, రాహువుతో కలసియుంటే గర్భస్రావమవుతుంది.

✤ మకరలగ్నమునకు 5వ స్థానంలో బుధుడు శత్రుగ్రహంతో కలసి యుండి, పుత్రయోగ కారకుడు 6 లేక 8 లేక 12వ స్థానంలో ఉంటే గర్భస్రావమగును.

✤ కుంభలగ్నమునకు 5వ స్థానంలో బుధుడు శత్రు గ్రహంతో కలసియుండి, పుత్రయోగకారకుడు 6 లేక 8 లేక 12వ స్థానంలో ఉంటే గర్భస్రావమగును.

✤ మీనలగ్నమునకు 5వ స్థానంలో రవి, 9వ స్థానంలో చంద్రుడు ఉండి సప్తమాధిపతి బలహీనంగా ఉంటే గర్భస్రావం అవుతుంది.

## సంతానప్రాప్తి జరుగు సమయం

✤ లగ్నాధిపతి, పుత్రస్థానాధిపతి యిద్దరిని శోధింపగా మిగిలిన రాశ్యంశ, కోణము లందు గురుడుప్రవేశించినపుడు సంతాన ప్రాప్తి కలుగుతుంది.

✤ లగ్నాధిపతి, 5వ స్థానాధిపతి స్ఫుటములను ఏకం చేయుగా వచ్చు రాశ్యంశలలో కాని, కోణస్థితిలోనికి కాని గురుడు వచ్చినపుడు సంతానప్రాప్తి.

✤ జన్మనక్షత్రాధిపతి స్ఫుటము, జన్మనక్షత్రం నుండి 5వ నక్షత్రం యొక్క అధిపతి స్ఫుటము రెంటినీ కలుపగా వచ్చు రాశిలోగాని, దాని త్రికోణమునందు గాని గురుడు ప్రవేశించు సమయానికి సంతానం లభించును.

✤ జన్మలగ్న స్ఫుటమును లిప్తలు (నిమిషాలు)లోకి మార్చి , దానిని 3చే గుణించి 50చే భాగించాలి. వచ్చిన భాగఫలము రాశులను, శేషము డిగ్రీలను తెలుపుతుంది. వీటిని లగ్నస్ఫుటమునకు కలిపిన వచ్చు రాశులు ప్రసవ సమయంలోని రవిని తెలుపు-ంది. ఈ రవి స్ఫుటమును 108చే హెచ్చవేస్తే వచ్చే రాశి ప్రసవకాలంలో చంద్రుడిని సూచిస్తుంది.

1) చంద్రస్ఫుటమును 108చే గుణించగా వచ్చు రాశినందు కాని లేదా దాని త్రికోణరాశిలో కాని చంద్రుడు ఉన్నప్పుడు ప్రసవం కలుగుతుంది.

(లేదా)

2) రవి, చంద్రుల స్ఫుటములను కలుపగా వచ్చు నక్షత్రంలోగాని, దాని త్రికోణ నక్షత్రములో గానిచంద్రుడు ఉన్నపుడు ప్రసవించుట జరుగుతుంది.

(లేదా)

3) లగ్నస్ఫుటంలోని డిగ్రీలు, చంద్రస్ఫుటంలోని డిగ్రీలు కలిపి, ఆ మొత్తమును 12చే గుణిస్తే వచ్చు నక్షత్రంలో గాని, దాని త్రికోణ నక్షత్రంలో గాని చంద్రుడు ఉన్నపుడు ప్రసవం జరుగుతుంది.

## అన్యబీజ సంపర్కం వలన సంతానం

- గురువు పంచమ స్థానంలో ఉండి, అది దానికి శత్రు స్థానమయి, రవి, కుజులు గురుని చూస్తూంటే
- 6 వ స్థానంలో గురుడు, 6వ స్థానాధిపతి 5వ స్థానంలో ఉండి పాప దృష్టిని పొందితే
- రవి, చంద్రులు కలసియుండి గురుదృష్టి పొందకపోతే
- పంచమ స్థానాధిపతి, రాహువు కలసి 5 వ స్థానంలో ఉండి, చంద్రునిపై గురు దృష్టి లేకపోతే
- సప్తమ స్థానాధిపతి, పాపులతో కలసి 2వ స్థానంలో యుండి కుజునిచే చూడబడిన
- లగ్నాధిపతి, చతుర్థాధిపతి పరివర్తన పొందిన
- అష్టమ స్థానంలో గురుడుండి పాపసంబంధం కలిగియుంటే అన్యబీజ సంపర్కం వలన సంతానం కలుగును.

## దత్తపుత్ర ప్రాప్తి

- మేషం లగ్నమై 5 వ స్థానంలో శని, 6,8,12 స్థానములలో రవి ఉండి, గురువు బలహీనుడైతే
- వృషభం లగ్నమై 5 వ స్థానంలో బుధుడు, 7 వ స్థానంలో చంద్రుడు, 12 వ స్థానంలో గురు, శనులుంటే,
- మిధునం లగ్నమై 5 వ స్థానంలో రవియుంటే గురుదృష్టి లేకపోతే, 4వ స్థానంలో శుక్రుడున్నను
- కర్కాటకం లగ్నమై 7 వ స్థానంలో రవి, రాహువులు, 11 స్థానంలో శుక్రుడు, 12 వ స్థానంలో గురుడు ఉంటే
- సింహం లగ్నమై 5 వ స్థానంలో శని, 2వ స్థానంలో శుక్రుడు, 9వ స్థానంలో బుధుడు ఉంటే
- కన్య లగ్నమై 5వ స్థానంలో బుధుడు, 7వ స్థానంలో కుజుడు, 8వ స్థానంలో గురుడు ఉంటే
- తుల లగ్నమై 7వ స్థానంలో పాపి, 10 వ స్థానంలో గురుడు ఉంటే
- వృశ్చికం లగ్నమై 2 వ స్థానంలో బుధుడు, 5 వ స్థానంలో కుజ, శనులుంటే
- ధనుస్సు లగ్నమై 6 స్థానంలో కుజుడు, 12 వ స్థానంలో బుధుడు, 6, 8, 12 స్థానములలో గురుడుంటే
- మకరం లగ్నమై 5 వ స్థానంలో కుజ, శనులుండి గురుడు బలహీనుడైతే

# 14. గ్రహములు - విద్య

"విద్య లేనివాడు వింత పశువు" అని నానుడి. ఈనాడు చదువు లేకపోతే ఎన్ని అనర్థాలు జరుగుతాయో, ఎంత నష్టం జరుగుతుందో గమనిస్తూనే ఉన్నాము. మనిషియొక్క జీవన విధానంపై విద్యయొక్క ప్రభావం ఉంటుంది. విద్యపై కూడ గ్రహప్రభావం ఉంటుంది. ఒక్కొక్కగ్రహం ఒక్కొక్క విషయంను తెలుసుకొనుటకు ఆసక్తిని కలిగిస్తుంది. అంటే ఒక విద్యార్థి యొక్క జాతక చక్రంలోని గ్రహముల స్థానం వలన, వాటి స్థితి, కలయిక, దృష్టి సంబంధం వలన ఆ విద్యార్థి ప్రాథమిక విద్య, ఉన్నత విద్య, స్పెషలైజేషన్, మెడిసిన్, ఇంజనీరింగ్, ఆర్ట్స్ లేదా ఇతర విభాగములపై దృష్టి పెట్టుట జరుగుతుంది.

ఉన్నతపాఠశాల, కళాశాల విద్యకు చతుర్థస్థానంను పరిశీలిస్తారు.

ఇంకా పైచదువులకు, Ph.D., ప్రత్యేక నైపుణ్యము పొందు చదువులకు 9వస్థానమును పరిశీలించాలి. విదేశములలో విద్యాభ్యాసంకు 3,4,9,12 స్థానములను పరిశీలించాలి.

ఏ గ్రహము ఏ ఏ విద్యలపై ఆసక్తి కలిగిస్తుందో తెలుసుకుందాము.

**రవి**

రవి భౌతికశాస్త్రము, వైద్యశాస్త్రము, మేనేజిమెంటు కోర్సులు, రాజకీయ శాస్త్రములను సూచించును. రవి శుక్రునితో కలసి కంటివైద్యము, బుధునితో కలసి నరములు, చెవికి సంబంధించిన వైద్యము, శనితో కలసి కార్డియాలజిస్టు, ఆర్థోపెడిక్స్, అనస్తీషియా వైద్యుడు, గురునితో కలసి ఆయుర్వేదము, కుజునితో కలసి సర్జన్‌ను సూచించును.

**చంద్రుడు**

చంద్రుడు చరిత్ర, మనస్తత్వశాస్త్రము, నీటిసరఫరా, నావికాశిక్షణ, కవిత్వమును సూచించును. చంద్రుడు శుక్రునితో కలసి పాలపరిశ్రమ, కుజ, శుక్రులతో కలసి పశువైద్యము, పౌరశాస్త్రము, మంత్రసానికి సంబంధించిన విషయములును సూచించును.

**కుజుడు**

కుజుడు అగ్రికల్చర్ డిగ్రీ, సివిల్ ఇంజనీరింగ్, మిలిటరీ ఇంజనీరింగ్, ఏరోనాటికల్ ఇంజనీరింగ్, రసాయనవిద్య ఆయుధముల తయారీ, అగ్ని మాపకములు, న్యాయవాదులు, విద్యుతుద్పాదన, బ్లాక్‌స్మిత్‌లను సూచించును.

**బుధుడు**

బుధుడు గణితము, ఎకౌంట్లు, డిజైన్లు, ప్లానులు గీయుట, చిత్రలేఖనము, పుస్తకప్రచురణ, పుస్తకముల వ్యాపారం, రచన, తర్కములను సూచించును. శుక్రునితో కలసి సినిమావ్యాపారం, జీవశాస్త్రం, రసాయనశాస్త్రం, వృక్షశాస్త్రం, ఖగోళశాస్త్రం, జ్యోతిష్యశాస్త్రం, జర్నలిజంలను సూచించును. గురునితో కలసి ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు, బోధకులను సూచించును.

**గురుడు**

గురుడు బోధించేవారిని అనగా ఉపాధ్యాయులనుండి ప్రొఫెసర్ల వరకు సూచించును. బ్యాంకులు, అర్థికశాస్త్రము, ధనము, బంగారము, సంస్కృతభాష పురాణాలు, నోట్లముద్రణ, వేదాంతములను సూచించును.

**శుక్రుడు**

శుక్రుడు లలితకళలు, కావ్యములు, రసాయనశాస్త్రము, ఫొటోగ్రఫీ, సెక్స్‌సైన్స్‌లను సూచించును. గురు బుధులతో కలసి రేడియో, ట్రాన్సిస్టర్, టేపురికార్డర్, వైర్‌లెస్‌లు, వాటికి సంబంధించిన కోర్సులు, టెక్స్‌టైల్స్, సుగంధద్రవ్యములు, అలంకార సామాగ్రి, వాటి తయారీకి సంబంధించిన నైపుణ్యము, టైలరింగ్, పెయింటింగ్‌లను సూచించును. శుక్రుడు, కుజుడు, బుధుడు, చంద్రుడు కలసి ఆటోమొబైల్ ఇంజనీరింగ్, గోల్డ్‌స్మిత్‌లను సూచించును.

**శని**

శని ఖనిజములు, బొగ్గుగనులు, పురాతనవస్తుసేకరణ, గనులు, భూగర్భ శాస్త్రము, జ్యోతిష్యము, ఇంగ్లీషుభాష, ఫ్రిజ్‌ల తయారీ, ఆర్థోపెడిక్స్‌లను సూచించును.

రాహువు, కేతువులు ఏ గ్రహంతో సంబంధం కలిగియుంటే, ఆగ్రహానికి సంబంధించిన విద్యలను సూచించును.

## 15. గ్రహానుగ్రహ సమయాలు

గ్రహాలను ప్రార్థించటానికి, వాటి అనుగ్రహం సంపాదించడానికి, దైవాను గ్రహానికి ఏ సమయమైనా సరియైనదే. ఎందుకంటే ఇవి ప్రతిక్షణం మనచుట్టు విశాల విశ్వంలో విహరిస్తూ వాటి కరుణాకటాక్ష వీక్షణాలను మనపై ప్రసరింప జేస్తూనే ఉంటాయి. వాటినుంచి వెలువడే కాంతి పుంజాలను కొన్నిసార్లు ప్రత్యక్షంగా చూడగలుగుతాం. కొన్ని సమయాలలో మనం చూడలేము.

అయితే ఆ గ్రహములకు ప్రీతికరమైన రోజున ఆ దైవాన్ని కొలిస్తే ఆయన మరింత ఆనందపడి, మనల్ని త్వరగా అనుగ్రహిస్తాడని పెద్దలమాట.

గ్రహానుగ్రహం పొందటానికి ఏ నక్షత్రము, ఏ వారము ఉత్తమమో తెలుసుకుందాము.

| గ్రహము | వారము | నక్షత్రము |
|---|---|---|
| రవి | ఆదివారము | కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ |
| చంద్ర | సోమవారము | రోహిణి, హస్త, శ్రవణం |
| కుజ | మంగళవారము | మృగశిర, చిత్త, ధనిష్ట |
| రాహు | గురువారం | ఆరుద్ర, స్వాతి, శతభిషం |
| గురు | గురువారం | పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర |
| శని | శనివారం | పుష్యమి అనూరాధ, ఉత్తరాభాద్ర |
| బుధ | బుధవారం | ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి |
| కేతు | ఆదివారం | అశ్విని, మఖ, మూల |
| శుక్ర | శుక్రవారం | భరణి, పుబ్బ, పూర్వాషాఢ |

## 16. నవగ్రహానుగ్రహముకు చేయవలసిన కార్యములు

జన్మరాశి చక్రంలో నవగ్రహాలు స్థితివలన, వీక్షణవలన అనుకూలంగానో, ప్రతికూలంగానో ఉంటాయి. అనుకూలం కాని గ్రహాల వలన పనులకు ఆటంకాలు కలుగుతాయి. ఆర్థిక సమస్యలు, అనారోగ్య సమస్యలు, కుటుంబంలో కలహాలు ఏర్పడతాయి. కుటుంబసభ్యులు వ్యాధిగ్రస్తులగుట, అభివృద్ధిలేకపోవుట జరుగుతుంది. నవగ్రహాల ఆగ్రహం వలన ఏర్పడిన విభిన్న సమస్యలు తొలగి పోవుటకు లేదా సమస్యయొక్క తీవ్రత తగ్గుటకు ఆయాగ్రహాల అనుగ్రహం పొందాలి. ఆయాగ్రహాల అనుగ్రహం పొందుటకు చేయవలసిన క్రియల గురించి పరాశరుడు, జైనమహర్షి మొదలగు మహర్షులు విభిన్న క్రియలను తెలిపారు. ఇవికాక లాల్‌కితాబ్ అను ప్రాచీన గ్రంథం పరిహార క్రియలను తెలుపుటకు పేరొందినది. ప్రస్తుతం మనం పురాతనగ్రంథాలు తెలిపిన పరిహారక్రియలు, మరియు అనుభవ పూర్వకంగా తెలుసుకున్న మరికొన్ని ప్రక్రియలను గూర్చి తెలుసుకుందాం.

## సూర్యుడు అనుగ్రహించాలంటే

- ఏ పని అయినా చేయబోయేముందు స్వీటు తిని, మంచినీరు త్రాగిన తరువాత ఆ పనిని ప్రారంభించండి.
- ఒక రాగి నాణెమును ఖాకీరంగు దారంతో కట్టి దానిని మెడలో వేసుకోండి.
- పేదవారికి గోధుమలు, బెల్లం దానంగా ఇవ్వండి.
- కోతులకు గోధుమలు, బెల్లం పెట్టండి.
- నల్ల ఆవును పెంచండి
- ఇంటిలో బోరింగ్ వేయించండి. లేదా బావిత్రవ్వించండి.
- ఇంటి చివరి భాగంలో ఎడమవైపు ఒక చీకటి గదిని నిర్మించండి.
- అంధులకు దానం చేయండి.
- తెల్లని వస్త్రాలను ధరించండి.
- పశువులకు ఆహారం పెట్టండి.
- మద్యపానం చేయవద్దు.
- మాంసాహారం తినవద్దు.
- వెండి, పాలు, బియ్యంలను ఎవరివద్ద ఉచితంగా తీసుకొనవద్దు.
- అమ్మ, అమ్మమ్మలను పూజించండి.
- నలుచదరంగా ఉండే రాగిరేకు ముక్కలను తొమ్మిదింటిని పాతిపెట్టండి.
- ప్రవహించే నదిలో రాగినాణెమును వేయండి.

## చంద్రుడు అనుగ్రహించాలంటే

- రాత్రిపూట నిద్రించునపుడు తలవైపు ఒక చెంబుతో నీరు ఉంచుకోండి. మరునాటి ఉదయాన్నే నిద్రలేవగానే, ఆ నీటిని మొక్కలకు పోయండి.
- అనాథలకు పాలు పంచండి
- పేదవారికి అన్నదానం చేయండి
- ప్రవహించే నీటిలో వెండినాణెం వేయండి.
- ప్రతిదినం తల్లికి నమస్కరించండి.
- కుందేళ్ళను పెంచండి.

- వెండిని ఇంటి పునాదిలో పాతిపెట్టండి
- శ్మశానంలో పంపును ఏర్పాటు చేయండి.
- ప్రతిదినం శివస్తోత్రం చేయండి.
- దుర్గ లేదా ఏదైనా అమ్మవారి గుడికి చక్రపొంగలి ప్రసాదంగా ఇవ్వండి.
- అనాథ పిల్లలకు క్షీరాన్నం పెట్టండి.
- పుణ్యక్షేత్రాలు దర్శించండి.
- రాత్రిపూట పాలు త్రాగవద్దు.
- బాలికలకు ఆకుపచ్చని దుస్తులు బహుమతిగా ఇవ్వండి.

## కుజుడు అనుగ్రహించాలంటే

- ప్రతిదినము వేపచెట్టుకు నీరుపోయండి
- ఇంటిలో ప్రాకే మొక్కను పెంచండి.
- కుటుంబ సభ్యులకు ఎక్కువగా స్వీటు ఇవ్వండి. ఎవరినైనా చూసేందుకు వెళ్ళినా వారికి స్వీట్లు తీసుకొని వెళ్ళండి.
- ఏ పనికైనా ముందు మీరు స్వీటు తిని, మంచినీరు త్రాగి ఆ పని ప్రారంభించండి.
- ఎరుపురంగు వస్త్రాలను ధరించండి. కనీసం ఎర్రరంగు రుమాలు అయినా మీవద్ద ఉండాలి.
- పిల్లలకు బెల్లం, గోధుమపిండి కలిపి చేసిన ఉండలను పంచండి.
- తగాదాలకు దూరంగా ఉండండి.
- ప్రతిరోజు హనుమాన్ చాలీసా చదవండి.
- ప్రతిరోజు సింధూరం బొట్టుగా పెట్టుకోండి.
- మీ ఇంటిలోగాని, వ్యాపారస్థలంలో గాని సుబ్రహ్మణ్యస్వామి ఫొటో పెట్టండి.
- ప్రతిదినం సుబ్రహ్మణ్యస్వామికి దీపారాధన చేయండి.
- సుబ్రహ్మణ్యస్తోత్రం చదవండి.

## బుధుడు అనుగ్రహించాలంటే

- మాంసాహారం తినవద్దు.
- శివాలయంలో పాలు, బియ్యం ఇవ్వండి.
- వెండి నాణెమును ప్రవహించే నదిలో వేయండి.

- పెసలతో గుగ్గిళ్ళుచేసి, ఆడపిల్లలకు పంచండి.
- గాగ్రైను దానం చేయండి.
- పుణ్యక్షేత్రాలను దర్శించండి.
- ప్రతిరోజు దుర్గా చాలీసా చదవండి.
- దుర్గ గుడికి ప్రసాదాన్ని సమర్పించండి.
- పటికతో పళ్ళను శుభ్రం చేసుకోండి.
- పుణ్యకార్యాలకు విరాళాలు ఇవ్వండి.
- గాజు సీసాను నదిజలంతో నింపి, దానిని పొలంలో పాతిపెట్టండి.
- మనీప్లాంటును గాని, వెడల్పాటి ఆకులుండే మొక్కలను గాని ఇంటిలో పెంచవద్దు.
- క్రొత్త కుండను మూతతో సహా ప్రవహించే నీటిలో వేయండి.
- వెండి ఉంగరం ధరించండి.

## శని అనుగ్రహించాలంటే

- మాంసాహారం తినవద్దు.
- మద్యపానం చేయవద్దు.
- చేపలకు, కోతులకు ఆహారం పెట్టండి.
- కాకులకు చపాతీ ముక్కలు వేయండి.
- పంచదార కలిపిన పాలను మర్రిచెట్టుమొదట్లో పోసి, అచటి తడిసిన మట్టిని నుదుటిపై బొట్టుగా పెట్టుకోండి
- ఇంటిలో చివరిగదిలో ఎప్పుడూ వెలుగు ఉండేలా చూడండి.
- చిన్న మట్టిపాత్రలో తేనెనుపోసి, ఆ పాత్రను ఊరిబయట నిర్జన ప్రదేశంలో వదిలేయండి.
- పవిత్రనదులలో స్నానం చేయండి.
- దక్షిణద్వారం వద్దు.
- నూతన తోలు వస్తువులు లేదా నూతన ఇనుప వస్తువులు కొనవద్దు.
- ఆకుపచ్చ, నలుపురంగు వస్త్రాలు ధరించవద్దు.
- శివాలయముకు నువ్వుల నూనెను ఇవ్వండి.
- పేదపిల్లలకు మినపసున్నుండలు పంచండి.

## గురుడు అనుగ్రహించాలంటే

- రావి చెట్టును పెంచండి.
- శనగ గుగ్గిళ్ళను పేదలకు పంచండి.
- ప్రతిదినం కుంకుమను ధరించండి.
- దుర్గుడికి పసుపు, కుంకుమలను సమర్పించండి.
- తరచు దేవాలయాలను దర్శించండి.
- పుణ్యక్షేత్రాలను దర్శించండి.
- పేదలకు అన్నదానం చేయండి.
- పెద్దలను గౌరవించండి.
- 12 గురువారాలు సాయిబాబా గుడికి వెళ్ళండి. నానబెట్టిన శనగలు లేదా మైసూరు పాకం నైవేద్యం పెట్టండి.
- వీరబ్రహ్మేంద్రస్వామికి లేదా రాఘవేంద్రస్వామికి పసుపు రంగు వస్త్రాలను సమర్పించండి.
- మీ గురువును సత్కరించండి.
- ఏదైనా దేవాలయముకు ఆవునెయ్యి, పెరుగు, కర్పూరం ఇవ్వండి.
- ధర్మకార్యాలలో పాల్గొనండి.
- పసుపును బొట్టుగా పెట్టండి.

## శుక్రుడు అనుగ్రహించాలంటే

- మీ భోజనంలో కొంతభాగం కాకులకు వేయండి.
- కుక్కలను పెంచండి.
- ఆవులకు ఆహారం పెట్టండి.
- పేదలకు దానం చేయండి.
- ఏదైనా దేవాలయముకు ఆవునెయ్యి, కర్పూరము ఇవ్వండి.
- లక్ష్మీదేవికి ముత్యాలదండను సమర్పించండి.
- విధవలకు సహాయపడండి.
- వెండి ఉంగరం లేదా వెండిగాజులు ధరించండి.
- వేపచెట్టు మొదట్లో వెండి బిళ్ళను పాతండి.
- లక్ష్మీదేవి రూపును వెండితో లేదా బంగారంతో చేయించి ధరించండి.

- ప్రవహిస్తున్న నీటిలో నీలిరంగు పూవును వేయండి. ఈ విధంగా రోజుకోపూవు చొప్పున 45 రోజులు వేయండి.
- ప్రతిదినం లక్ష్మీదేవికి ఆవునెయ్యితో దీపారాధన చేయండి.
- ప్రతి శనివారం శివాలయంకు నువ్వులనూనెను ఇవ్వండి.
- గోదానం చేయండి. లేదా పశుగ్రాసంను గోశాలకు దానం చేయండి.

## రాహువు అనుగ్రహించాలంటే

- ప్రవహించే నీటిలో బొగ్గును వేయండి.
- ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి.
- వెండి పాత్రను దానం చేయండి.
- బార్లీగింజలను పాలతో కడిగి, వాటిని నదిలో వేయండి.
- వాయవ్యదిశలో ఒక కుండను ఉంచి, దానిలో ప్రతిరోజు నీరు ఉండేలా చూడండి. అనగా ప్రతిదినం దానిలోని నీటిని పారబోసి, మరల దానిని నీటితో నింపండి.
- వెండితో చేసిన ఏనుగుబొమ్మను ఇంటిలో ఉంచండి.
- ఇంటి చివర ఉండే గది ఎప్పుడూ చీకటిగా ఉండేలా చూడండి లేదా ఇంటిచివర ఒక చీకటి గదిని నిర్మించండి.
- సాధ్యమైనంతవరకు నూలు బట్టలు ధరించండి.
- బడికి వెళ్ళే పిల్లలకు పుస్తకాలు పంచండి.
- పేదపిల్లల విద్యకు సహకరించండి.
- పవిత్ర నదీ స్నానం చేయండి.
- నల్లకుక్కను పెంచండి.
- నీలం రంగు వస్త్రాలను ధరించవద్దు. ఎవరైనా బహుమతిగా ఇచ్చినా తీసుకోవద్దు.
- కుటుంబ సభ్యులతో కలసిమెలసి ఉండండి.
- ప్రతిరోజు వెండిగ్లాసుతో పాలు త్రాగండి.
- సరస్వతీ పూజ చేయండి.

### కేతువు అనుగ్రహించాలంటే

- ప్రతిరోజు 4 నిమ్మకాయలను ప్రవహించే నీటిలో వేయండి ఈ విధంగా 4 రోజులు చేయండి.
- అనాథలకు నలుపు లేదా తెలుపు దుప్పటిని దానం చేయండి.
- నల్లకుక్కను పెంచండి. లేదా నల్లకుక్కకు ఆహారం పెట్టండి.
- వెండిఉంగరం ధరించండి.
- వినాయకుడి రూపును వెండితో లాకెట్‌గా చేయించి, దానిని సిల్కుదారంతో కట్టి మెడలో వేసుకోండి.
- పాలు, తేనెను కలిపి ఒక చిన్నపాత్రలో తీసుకొని, దానిని ఇంటిపువాదిలో పాతిపెట్టండి.
- ప్రతిదినం గణపతిని పూజించండి.
- మీ వద్ద ఎప్పుడు తెల్లజిల్లేడును ఉంచుకోండి.
- వెండిపాత్రలో తేనెను ఉంచి, ఆ పాత్రను ఇంటిలో ఉంచండి.

# 17. గ్రహానుగ్రహం - ఆరాధనం

## నవగ్రహములు - అనుబంధ అవతారముల, దేవతలు

| గ్రహము | అవతారము | అధిదేవత |
|---|---|---|
| రవి | శ్రీరామావతారం | గాయత్రీదేవి |
| చంద్రుడు | శ్రీకృష్ణావతారం | పార్వతీదేవి |
| కుజుడు | నరసింహావతారం | మంగళగౌరి |
| రాహువు | వరాహావతారం | సరస్వతీదేవి, లలిత |
| గురువు | వామనావతారం | ధనలక్ష్మి |
| శని | కూర్మావతారం | కాళికాదేవి |
| బుధుడు | బుద్ధావతారం | దుర్గాదేవి |
| కేతువు | మత్స్యావతారం | రాజరాజేశ్వరీదేవి |
| శుక్రుడు | పరశురామావతారం | మహాలక్ష్మీదేవి. |

## గ్రహపూజకు అనువైన తిథులు

| గ్రహము | మాసం | పక్షం | తిథి |
|---|---|---|---|
| రవి | జ్యేష్ఠ | శుక్ల | ద్వాదశి |
| | కార్తీకం | శుక్ల | సప్తమి |
| చంద్ర | శ్రావణం | శుక్ల | అష్టమి |
| | వైశాఖ | శుక్ల | త్రయోదశి |
| కుజ | వైశాఖ | కృష్ణ | దశమి |
| రాహు | చైత్రం | కృష్ణ | ద్వాదశి |
| గురు | ఆషాఢం | | పూర్ణిమ |
| | జ్యేష్ఠ | శుక్ల | ద్వాదశి |
| శని | మార్గశిర | శుక్ల | అష్టమి |
| బుధ | శ్రావణం | శుక్ల | పంచమి |
| | వైశాఖ | | పూర్ణిమ |
| కేతు | చైత్రం | శుక్ల | చవితి |
| శుక్ర | వైశాఖ | శుక్ల | తదియ |

## గ్రహారాధనకు ఉపయోగించవలసినవి

| గ్రహము | దీపారాధనకు నూనె | వెలిగించదగిన వత్తులు | వినియోగించ దగిన ప్రసాదం | పారాయణ చేయదగు పురాణం |
|---|---|---|---|---|
| రవి | పంచతైలమిశ్రమం (కొబ్బరినూనె, నువ్వులనూనె విప్పనూనె, ఆముదం, ఆవునెయ్యి) | ఎరుపు వస్త్రం | పాయసం గోధుమరవ్వతో కూడిన వంటకం | హరివంశపురాణం |
| చంద్ర | " | తెలుపు వస్త్రం | క్షీరాన్నం, వెన్న | శివపురాణం |
| కుజ | " | ఎరుపురంగు వస్త్రం | అప్పాలు గుగ్గిళ్ళు, కందులతో హవిష్యాన్నం | సుందరకాండ |

| గ్రహము | దీపారాధనకు నూనె | వెలిగించబడగిన వత్తులు | వినియోగించబడగిన ప్రసాదం | పారాయణ చేయదగు పురాణం |
|---|---|---|---|---|
| రాహు | " | తేనె రంగు వస్త్రం | గారెలు, మినప సున్నుండలు | వరాహపురాణం |
| గురు | " | పసుపు రంగు వస్త్రం | లడ్డు, దద్దోజనం మైసూరుపాకం పచ్చిశనగపప్పు, సుగ్గిళ్ళు | వీరబ్రహ్మేంద్ర స్వామి చరిత్రము గురుచరిత్ర |
| శని | " | నల్లని వస్త్రం | ద్రాక్షరసం, కట్టెపొంగలి చిమ్మిలి ఉండలు | కూర్మపురాణం |
| బుధ | " | ఆకుపచ్చని వస్త్రం | పులగం, వడపప్పు, పులిహోర, క్షీరాన్నం | దేవీ భాగవతం |
| కేతు | " | తెలుపు వస్త్రం | ఉలవలు, కుడుములు చిత్రాన్నం, సుగ్గిళ్ళు | శ్రీ గణేశపురాణం |
| శుక్ర | " | ఆకాశనీలం వస్త్రం | పటికబెల్లం అలచందల సుగ్గిళ్ళు నెయ్యి కలిపిన అన్నం | శ్రీనివాస కళ్యాణం |

వాస్తవానికి దైవశక్తిని ప్రార్థించటానికి ప్రశాంతమైన చిత్తము, నిష్కల్మషమైన భక్తి అవసరము. పరిశుద్ధమైన మనస్సుతో, ఏ నూనెతో దీపారాధన చేసినను, ఏ వత్తులను ఉపయోగించినా, మనశక్తిమేర ఎటువంటి ప్రసాదము వినియోగించి పూజించినా ఆ దైవము మనలను అనుగ్రహిస్తాడు.

## గ్రహానుగ్రహముకై చేయవలసిన వ్రతములు పండుగలు

| గ్రహము | ఆచరించవలసిన వ్రతము (లేదా) పండుగ |
|---|---|
| రవి | శ్రీరామనవమి, రథసప్తమి, ఆదివారవ్రతం |
| చంద్ర | మహాశివరాత్రి, కృష్ణాష్టమి, కేదారేశ్వరవ్రతము, సోమవారవ్రతం |
| కుజ | నాగులచవితి, కుమారషష్ఠి, హనుమద్వ్రతము, మంగళగౌరీవ్రతం |
| రాహు | సరస్వతీపూజ, గౌరీవ్రతం, దుర్గాష్టమి |
| గురు | పోతులూరి వీరబ్రహ్మంగారి ఆరాధన, దత్తజయంతి, అనఘావ్రతం |
| శని | స్వామి అయ్యప్పజయంతి, వేంకటేశ్వరవ్రతం, శనీశ్వరవ్రతము |
| బుధ | విజయదశమి, సత్యనారాయణవ్రతము |
| కేతు | వినాయకచవితి, పుత్రగణపతివ్రతం |
| శుక్ర | వరలక్ష్మీవ్రతము, దీపావళి |

## గ్రహములు - సమిధలు, దక్షిణ, పండ్లు

గ్రహదోషనివారణకు ఆయాగ్రహములకు హోమం చేస్తారు. వేరు వేరు గ్రహాలుకు చేసే హోమాలలో వేరు వేరు సమిధలు ఉపయోగిస్తారు. వాటిని గురించి తెలుసుకుందాం. అంతేకాక గ్రహదోషనివారణకు హోమాలు చేయుటయేకాక సద్గుణవంతులకు దక్షిణ లేదా పండ్లను దానంచేయుట చేస్తారు. వాటిని గురించి తెలుసుకుందాం.

| గ్రహము | హోమంకు సమిధ | ఈయవలసిన దక్షిణ | పంచవలసిన పండ్లు |
|---|---|---|---|
| రవి | జిల్లేడు | ఆవు | రేగిపండ్లు |
| చంద్ర | మోదుగ | శంఖము | బత్తాయి, నారింజ |
| కుజ | చండ్ర | వృషభము | ఎండుద్రాక్ష |
| రాహు | దూర్వ | లోహము | ఖర్జూర |
| గురు | రావి | వస్త్రము | పనస |
| శని | జమ్మి | కపిలగోవు | నేరేడు |
| బుధ | ఉత్తరేణి | బంగారం | సీమచింత |
| కేతు | దర్భలు | మేక | సీతాఫలం |
| శుక్ర | మేడి | గుఱ్ఱము | అరటి, ఏలకులు |

# 18. గ్రహానుగ్రహం - ధారణం రత్నధారణ

ఈ రోజులలో ఏ జ్యోతిష్యుని వద్దకు వెళ్ళినా, టి.వి. ప్రకటనలను చూచినా రత్నాలను ధరిస్తే మన బాధలన్నీ తీరిపోతాయని, కోరుకున్న వరం లభిస్తుందని. 24 గంటలలో కోటీశ్వరులైపోతారని అనుకుంటారు. ఇది సత్యదూరము.

అయితే నవరత్నాలకు శక్తి లేదా? అని ప్రశ్నిస్తే 'ఉన్నది' అని సమాధానం ఇవ్వవలసి వుంటుంది.

నవరత్నధారణ కొంతవరకు కాలంలో మార్పు తీసుకొని వచ్చి ఒక గ్రహము యొక్క శుభఫలితాలను త్వరగా మనకు అనుభవానికి వచ్చునట్లు చేస్తుంది.

కాని ఉన్న స్థితిని మార్చజాలదు. ఖగోళ తంత్ర ప్రక్రియల ద్వారా కాస్మిక్ శక్తిని పెంచి, తద్వారా గ్రహాల చెడును తగ్గించి, మంచిని పెంచవచ్చు.

రత్నాలు విశ్వంలోని గ్రహాల నుండి విడుదల యగు విద్యుదయస్కాంత రేడియేషన్‌ను గ్రహించి, ఆ శక్తిని శరీరానికి అనుకూలంగా మార్చి శరీరానికి అందజేస్తుంది. దీనివలన "బయోమేగ్నటిక్ ససెప్టిబిలిటీ"లో మార్పు వస్తుంది. దానివలన మనం ధరించిన రత్నాన్ని బట్టి శరీరంలో అనుగుణ్యాత ఏర్పడుతుంది.

అనుగుణ్యాత శాతాన్ని బట్టి మన ఆలోచనావిధానం, ప్రవర్తన వంటి వాటిలో మార్పులు వస్తాయి.

దీని వలన శరీరానికి కలిగే హాని తీవ్రత తగ్గుతుంది. అనగా చెడు గ్రహాల ప్రభావం తగ్గుతుంది.

| గ్రహం | రత్నం | వికిరణం చెందించు కాంతి కిరణాలు |
|---|---|---|
| రవి | కెంపు | ఎరుపుకిరణాలు |
| చంద్రుడు | ముత్యం | నారింజ కిరణాలు |
| కుజుడు | పగడం | పసుపు కిరణాలు |
| బుధుడు | పచ్చ | ఆకుపచ్చకిరణాలు |
| గురువు | పుష్యరాగం | నీలిరంగు కిరణాలు |
| శుక్రుడు | వజ్రము | పాలపిట్టరంగు కిరణాలు |
| శని | నీలమణి | ఉమ్మెత్త రంగు కిరణాలు |
| రాహువు | గోమేధము | నీలలోహితకిరణాలు |
| కేతువు | వైఢూర్యము | పరారుణ కిరణాలు |

## ఎవరు ఏ రత్నం ధరించాలి

మన జీవితాన్ని శాసించే గ్రహముకు సంబంధించిన రత్నమును ధరించాలి అని పలువురు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అయితే జీవితశాసనకర్త యగు గ్రహాన్ని నిర్ణయించుటలో అనేకమంది అనేక పద్ధతులను ఆచరిస్తున్నారు.

1) జాతకుడు పుట్టిన వారము యొక్క అధిపతిని ఆ జాతకుని జీవితానికి అధిపతిగా భావిస్తారు. ఆ గ్రహము యొక్క రంగు, సంఖ్య, రత్నము జాతకుని అభివృద్ధికి తోడ్పడతాయి.

| వారం | అధిపతి | గ్రహముకు చెందిన సంఖ్య |
|---|---|---|
| ఆదివారం | రవి | 1 |
| సోమవారం | చంద్ర | 2 |
| మంగళవారం | కుజ | 9 |
| బుధవారం | బుధ | 5 |
| గురువారం | గురు | 3 |
| శుక్రవారం | శుక్ర | 6 |
| శనివారం | శని | 8 |

రాహు సంఖ్య 4, కేతు సంఖ్య 7.

2) జన్మతేదీ కూడా మన అదృష్టాన్ని తెలియజేస్తుంది. ఈ పుట్టిన తేదీకి సంబంధించిన గ్రహము, దానికి సంబంధించిన రత్నము, రంగు జాతకుని జీవనమార్గాన్ని సుగమం చేస్తాయి.

3) జన్మ నక్షత్రాధిపతి అయిన గ్రహము, దానికి సంబంధించిన రత్నము, రంగు జాతకునికి మేలు చేస్తాయి.

4) జాతకచక్రంలో 11వ స్థానాధిపతికి సంబంధించిన రత్నము, రంగు జాతకునికి శుభాన్ని చేకూరుస్తాయి

5) జాతక చక్రంలో 'ఫార్చునా' పడిన రాశి అధిపతి యొక్క రత్నము, రంగు జీవితాన్ని శాసిస్తాయి.

ఈ విధంగా రత్నధారణ విషయంలో అనేకులు అనేక పద్ధతులు ఉపయోగిస్తుంటారు. కొందరు జాతకునికి ఏ దశ జరుగుతుందో ఆ దశానాధునికి సంబంధించిన రత్నమును ధరింపజేస్తారు. మరికొందరు అంతర్దశానాధునికి సంబంధించిన రత్నమును ధరింపజేస్తారు.

# 19. రత్నధారణకు ముందుగా నిర్వహించవలసిన క్రియలు

**కెంపు :-**

రవికి ధరించవలసినది కెంపు. దీని అధిష్టాన దేవతయగు నారాయణుని పూజించాలి. నారాయణ మంత్రాన్ని, సూర్యమంత్రాన్ని జపిస్తూ ఆదివారంనాడు, శుభ నక్షత్రము, శుభతిథి కల రోజున, శుభకార్తెయందున ఆ కెంపుని ఎర్రని పూలతో పూజించాలి. ఆ దైవసాన్నిధ్యంలోనే కెంపును ఆరురోజులుంచి తరువాత నైవేద్యం, అన్నశాంతి చేసి తరువాత ధరించాలి.

**ముత్యము :-**

చంద్రునికి ధరించునది ముత్యము. అంతేకాక చంద్రునికి చంద్రకాంతమణి లేక Moon Stone ను ధరించవచ్చు.

సోమవారం, పూర్ణిమ, చంద్ర నక్షత్రం రోజున వెండి పాత్రలో ఒక చంద్ర గ్రహ యంత్రాన్ని వుంచి దానిపై ముత్యము లేదా చంద్రకాంతమణిని వుంచాలి. చంద్రగ్రహ మంత్రము, శ్రీసూక్తంతో ఆ మణిని 10రోజుల పాటు పాలలో, తేనెతో అభిషేకిస్తూ పూజించాలి. తరువాత ధరించాలి.

**పగడము :-**

కుజునికి ధరించవలసినది పగడము.

మంగళవారమునాడు శుక్లపక్ష షష్టిన ఎర్రని రంగు గల నూతన వస్త్రంపై రాగి పళ్ళెము వుంచాలి. ఆ పళ్ళెంలో పగడము నుంచి దానిని తేనె, ఆవునేతితో అభిషేకించాలి. పగలు ఉపవాసం చేసి, సుబ్రహ్మణ్యేశ్వరుని మంత్రము జపించాలి. ఈ విధంగా 9 రోజులు చేసి, చక్కెరపొంగలిని నైవేద్యం పెట్టి తరువాత ధరించాలి.

**మరకతము (పచ్చ) :-**

బుధునికి ధరించవలసినది పచ్చ.

బుధవారమున పూజించిన బుధయంత్రముపై ఆకుపచ్చని వస్త్రము నుంచి, దానిపై పచ్చను వుంచాలి. గరిక చిగుళ్ళతో గణపతి మూలమంత్రమును జపిస్తూ పూజించాలి. పచ్చ పెసల గుగ్గిళ్ళు లేదా కట్టెపొంగలిని నైవేద్యం పెట్టాలి. ఈ విధంగా 14 రోజులు పూజించాలి. (బుధవారం రాత్రిపూట ఉపవాసం వుండి శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం చేయాలి.)

తరువాత పచ్చను ధరించాలి.

**పుష్యరాగం :-**

గురువుకు ధరించవలసినది పుష్యరాగం.

గురువారంనాడు లేత పసుపురంగుగల వస్త్రంపై శనగల నుంచి, దానిపై పుష్యరాగాన్ని వుంచి 'శక్తి పంచాక్షరీ' మంత్రమును జపిస్తూ పూజించాలి. శనగగుగ్గిళ్ళు, చక్కెరపొంగలి లేదా పూర్ణాలు నైవేద్యం పెట్టాలి. 12 రోజులు ఈ విధంగా పూజించి తరువాత పుష్యరాగం ధరించాలి.

**వజ్రము :-**

శుక్రునికి ధరించవలసినది వజ్రము.

శుక్రగ్రహయంత్రముపై వజ్రము నుంచి, శుక్రగ్రహ మంత్రము, మహాలక్ష్మి మూల మంత్రముతో కుంకుమపూజ చేయాలి. పాయసం నైవేద్యంగా పెట్టాలి. ఈ విధంగా 16 రోజులు పూజించి తరువాత ముత్తయిదువలకు పసుపు కుంకుమలతో వస్త్రములను పెట్టి తాంబూలమిచ్చి సత్కరించాలి. తరువాత శుక్రవారంనాడు పౌర్ణమి లేదా శుద్ధ త్రయోదశినాడు శుక్ర నక్షత్రం కలసినపుడు లేదా శుభనక్షత్రం వున్నపుడు సాయం సంధ్యాసమయంలో వజ్రాన్ని ధరించాలి.

**నీలం :-**

శనికి ధరించవలసినది నీలం.

వెంకటేశ్వరస్వామిని పూజించి శనిగ్రహ మూలమంత్రంతో పూజిస్తూ శనిదానం, జపము, హోమము చేయాలి. శనికి తైలాభిషేకము, హనుమంతునికి తైలాభిషేకము చేయాలి. సుందరకాండను 16 రోజులు పారాయణ చేసి తరువాత నీలమును ధరించాలి.

**గోమేధికం :-**

రాహువుకు ధరించవలసినది గోమేధికం.

మినుములపై గోమేధికం వుంచి రాహుగ్రహ మంత్రము, సుబ్రహ్మణ్య మంత్రములను జపిస్తూ 18 రోజులు పూజించాలి. దుర్గా సూక్తము చదివి తరువాత గోమేధికం ధరించాలి.

**వైఢూర్యము :-**

కేతువుకు ధరించవలసినది వైఢూర్యము.

ఉలవలపైన వైఢూర్యము నుంచి, గరికచిగుళ్ళతో కేతుగ్రహ మంత్రము, గణపతి మహామంత్రము జపిస్తూ 18 రోజులు పూజించాలి. దర్భలతో హోమం చేయాలి. ఉలవగుగ్గిళ్ళు, చిత్రాన్నము నైవేద్యము పెట్టాలి. తరువాత వైఢూర్యము ధరించాలి.

# వివిధ సమస్యలకు నివారణోపాయములు

| ఏర్పడిన సమస్యలు | వ్యాధులు | జన్మలగ్నం | పుట్టిన వారం | పుట్టిన తేదీలు | జన్మ నక్షత్రాలు | ధరించవలసిన రత్నం |
|---|---|---|---|---|---|---|
| అధికారులతో విభేదాలు, కుటుంబముకు దూరముగా వుండటం, తండ్రితో మనస్పర్ధలు కలగటం, బలవంతులతో వైరం మొదలగునవి | నేత్రదోషాలు, హృదయ రోగాలు, కామెర్లు, రక్త హీనత, రక్త పోటు తలపోటు | సింహం | ఆది | 1,10,19,28 | కృత్తిక ఉత్తర ఉ.షా | కెంపు లేదా Star ruby, Sun stone, Red spinel |
| జనాకర్షణ తగ్గుట స్వస్థానము వీడి పోవుట, బంధు వియోగము, కారాగార వాసము, అపవాదులు, జలగండం, వ్యాపారంలో నిలకడ లేకపోవుట. మాతృ గండం మొదలగునవి. | అజీర్ణవ్యాధి, నిమ్ము, శరీరానికి నీరుచేరుట, కఫశ్లేష్మ సంబంధమగు వ్యాధులు, మూత్రపిండములలో ఆట oకాలు, సుగర్‌వ్యాధి (మధుమేహం) | కర్కాటకం | సోమ | 2,11,20,29 | రోహిణి హస్త శ్రవణం | ముత్యము చంద్రకాంతశిల White Sapphire |
| పోలీసు, మిలటరీ శాఖలతో విభేదాలు ఆటంకములు, భూతగదాలు, కోర్టు దావాలు, ఋణము, భార్యావియోగము, కలహాలు, వాహనప్రమాదము, అపకీర్తి, అగ్నిప్రమాదం మొదలగునవి | చర్మరోగములు, దృష్టిహీనత, ఆయుధములులేక వాహనముల వలన గాయములు, ఆపరేషన్‌లు, వ్రణములు, అపస్మారము. | మేషము | మంగళ | 9,18,27 | మృగశిర చిత్త ధనిష్ఠ | పగడము Red Jasper, Sang Moongi Cornelian |

| ఏర్పడిన సమస్యలు | వ్యాధులు | జన్మలగ్నం | పుట్టిన వారం | పుట్టిన తేదీలు | జన్మ నక్షత్రాలు | ధరించవలసిన రత్నం |
|---|---|---|---|---|---|---|
| బుద్ధిమాంధ్యము, పరీక్షలు తప్పుట, మోసపోవుట, వ్యాపారంలో నష్టము, ఆర్థికపరమైన ఇబ్బందులు, అనవసర ప్రయాణాలు, ముఖ్యమైన పత్రాలు గల్లంతు అవుట మొదలగునవి. | మతిమరుపు, నరాలబలహీనత, టైఫాయిడ్, కలరా మూర్ఛ, రక్తహీనత, అపస్మారము, గుండెజబ్బు | మిథునం కన్య | బుధ | 5,14,23 | ఆశ్రేష జ్యేష్ఠ రేవతి | మరకతం లేదా పచ్చ Green Zicron green Jade, Peridot |
| ఉద్యోగంలో వత్తిడి, పలుకుబడి లేకపోవుట పరులపై ఆధారపడుట, కుమార్తెలకు వివాహం కాకపోవుట, సంతానహీనత అధికారనష్టం. | అజీర్ణము, గ్యాస్, అధికంగా బరువుపెరుగుట, మధుమేహము, మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధులు. | ధనుస్సు మీనం | గురు | 3,12,21,30 | పునర్వసు విశాఖ పూ.భా | పుష్యరాగం Yellow tourmoline Yellow Zicron. |
| స్త్రీసౌఖ్యము లేకపోవుట, భార్యావియోగం, స్త్రీవలన కలహాలు, కుటుంబశాంతి లేక పోవుట, సెక్స్‌బలహీనతలు, ఎడముకంటికి అనారోగ్యం, దూరప్రాంతాలకు వెళ్ళుట, పురుషత్వ లోపము, నిద్రలేకపోవుట, ప్రయాణాలు ఎక్కువ. | అజీర్ణవ్యాధి, అనిద్ర, పురుషత్వ లోపము, విరేచనములు, దృష్టిదోషములు, మధు మేహము, సుఖ వ్యాధులు, రతిపై ఆసక్తి లేక పోవుట | వృషభం తుల | శుక్ర | 6,15,24 | భరణి పుబ్బ పూ.షా. | వజ్రం White Sapphire White tourmoline |

| ఏర్పడిన సమస్యలు | వ్యాధులు | జన్మలగ్నం | పుట్టిన వారం | పుట్టిన తేదీలు | జన్మ నక్షత్రాలు | ధరించవలసిన రత్నం |
|---|---|---|---|---|---|---|
| పరులవద్ద జీవించుట, ఆర్థిక ఇబ్బందులు దరిద్రము, అహంకారము, పెద్దలతో విభేదాలు, ఉద్యోగనష్టము, చెడు అలవాట్లు, కారాగార వాసము, శిక్షలు, ఎముకలు విరుగుట, అంధత్వము, పిచ్చి, శత్రు భయం, ప్రాణహాని మొ॥ | ఉదరబాధలు, దంతవ్యాధులు, చర్మవ్యాధులు, కీళ్ళ నొప్పులు, అంగవైకల్యం, పక్షవాతం, చెవుడు, నీరసం, కండరాల నొప్పులు, హిస్టీరియా. | మకరం కుంభం | శని | 8,17,26 | పుష్యమి అనూరాధ ఉ.భా | నీలం Blue Tourmoline Blue Zicron Amethyst |
| విషప్రయోగం, చేతబడులు, పాము, తేలులచే కాటువేయబడుట, మంత్రగాళ్ళ వలన బాధ, రహస్య కార్యకలాపాలు చేయువారు లేదా గూఢచారుల వలన ప్రమాదము, రహస్యశత్రువుల భయం, అధికారుల వత్తిడి, దుండగుల వలన భయం | శ్వాససంబంధమైన సమస్యలు, వెన్నుకు సంబంధించిన సమస్యలు, శుక్లం, మోకాళ్ళ నొప్పులు, వరిబీజము, చర్మవ్యాధులు | | | 4,13,22,31 | ఆరుద్ర స్వాతి శతభిషం | గోమేధికం Agate |
| ఎంత పని చేసినా రాణించలేకపోవటం, రావలసినంత పేరు రాకపోవటం, అజ్ఞాత జీవనం, ప్రమోషన్ రాకపోవుట, అధికారుల వ్యతిరేకత, అధికారంలో బలహీనత, ఉరిశిక్ష, స్థానచలనం, శత్రువులు పెరుగుట, మానసిక రోగాలు, యావజ్జీవ కారాగారశిక్ష, సంతాన నష్టం, అంగ విహీనులు అయిన సంతానం, బిడ్డ గర్భంలోనే చనిపోవుట. | శరీర బాధలు, జ్వరము వంటి నొప్పులు | | | 7,16,25 | అశ్వని మఖ మూల | వైఢూర్యము |

పైన పట్టికలో చూపినవి కేవలం ప్రాథమికమైన విషయాలు. జాతకచక్రంలో ఆయా గ్రహాల స్థితులబట్టి, దశలను బట్టి సూక్ష్మ విచారణచేసి రత్నధారణ చేయాలి.

# నవరత్న ఉంగరం

ఒక్కొక్క రత్నమును ధరించుటకాక, నవరత్నములను ఒక పద్ధతిలో ఉంగరంలో అమర్చి ధరించిన సర్వసౌఖ్యములు కలుగును.

నవరత్న ఉంగరంలో ఆయా రత్నములు వుండవలసిన క్రమము.

| ఈశాన్యం | తూర్పు | ఆగ్నేయం |
|---|---|---|
| పచ్చ | వజ్రము | ముత్యము |
| పుష్యరాగము (ఉత్తరం) | కెంపు | పగడము (దక్షిణం) |
| వైఢూర్యం | నీలము | గోమేధికం |
| వాయువ్యం | పడమర | నైరుతి |

నవరత్న ఉంగరాన్ని రోజుకో గ్రహం చొప్పున నవగ్రహ జపం చేస్తూ పూజించాలి. ఈ విధంగా 9 రోజులు పూజించి అన్నశాంతి చేయాలి. శుభతిథి, నక్షత్రంలతో కూడిన రోజున మంచి కాలంలో కుడిచేతి ఉంగరం వేలుకి ధరించాలి.

రత్నధారణ గురించి పాశ్చాత్యులు అనేకులు అనేకరకాలుగా చెప్పారు. ఆ విషయాలను తరువాత చర్చించుకుందాం. ప్రస్తుతం వాటి సంగతి అప్రస్తుతం.

# రుద్రాక్ష ధారణ

రుద్రాక్ష పరమ పవిత్రమైనది. మానవుని పలురకాల శారీరక, మానసిక రుగ్మతల నుండి దూరం చేయు శక్తి రుద్రాక్షకు కలదు. ప్రకృతి సిద్ధంగా లభించే రుద్రాక్ష పలురకాలుగా లభిస్తుంది. అవి లభించే స్థితిని బట్టి ఏకముఖి, ద్విముఖి, అని ఇలా విభజించుకు పోవచ్చును. ఏ రుద్రాక్షవలన ఎలాంటి ప్రయోజనం కలుగుతుందో తెలుసుకుందాం.

**ఏకముఖ రుద్రాక్ష:-**

1. దీనిని శివుని ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన శారీరక, మానసికరోగాలు నశించును.
3. సంఘంలో పేరు ప్రతిష్టలు కలిగి వుందురు.
4. మానసిక వికాసం ఏర్పడును. 5. రుద్రాక్షయందు ఒకేధార వుంటుంది.

**ద్విముఖ రుద్రాక్ష:-**

1. దీనిని అర్ధనారీశ్వరుని ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుటవలన మానసిక ఏకాగ్రత ఏర్పడుతుంది.
3. శివభక్తిని పెంపొందిస్తుంది.
4. రుద్రాక్షయందు రెండుధారలుంటాయి.

**త్రిముఖ రుద్రాక్ష:-**

1. దీనిని త్రిమూర్తులకు ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన అపమృత్యుభయం కలగదు.
3. రుద్రాక్షయందు మూడు ధారలుంటాయి.

**చతుర్ముఖ రుద్రాక్ష:-**

1. దీనిని బ్రహ్మకు ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన జ్ఞాపకశక్తి పెరుగును.
3. విద్యార్థులకు ఇది ఉపయుక్తమైనది.
4. రుద్రాక్షయందు నాలుగు ధారలుంటాయి.

**పంచముఖి రుద్రాక్ష:-**

1. దీనిని శివుని రుద్రరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన శివానుగ్రహం పొందుతారు.
3. రుద్రాక్ష యందు అయిదు ధారలుంటాయి.

**షణ్ముఖి రుద్రాక్ష:-**

1. దీనిని కుమారస్వామి స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన బి.పి, ఆస్త్మా, గ్యాస్ట్రబుల్ వంటివి నశిస్తాయి.
3. వ్యాపారాభివృద్ధి కలుగుతుంది. 4. రుద్రాక్షయందు ఆరు ధారలుంటాయి.

**సప్తముఖ రుద్రాక్ష:-**

1. దీనిని లక్ష్మీ స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించిన వానికి లక్ష్మీకటాక్షం కలుగుతుంది.
3. వ్యాపార ఉద్యోగాలలో అభివృద్ధి పొందుతారు.
4. రుద్రాక్షయందు ఏడు ధారలుంటాయి.

**అష్టముఖ రుద్రాక్ష:-**

1. దీనిని విఘ్నేశ్వరుని స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించినవారు కార్యసాధకులవుతారు.
3. శక్తి సామర్ధ్యాలు పెరుగుతాయి.
4. రుద్రాక్షయందు ఎనిమిది ధారలుంటాయి.

**నవముఖ రుద్రాక్ష:-**

1. దీనిని దుర్గాదేవి స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన మృత్యుభయం తొలగుతుంది.
3. రుద్రాక్షయందు తొమ్మిది ధారలుంటాయి.

**దశముఖ రుద్రాక్ష:-**

1. దీనిని విష్ణుమూర్తి స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన మానసిక రుగ్మతలు పోతాయి.

3. రాజకీయ రంగంలో పేరు పొందుతారు.
4. రుద్రాక్షయందు పది ధారలుంటాయి.

**ఏకాదశముఖ రుద్రాక్ష:-**

1. దీనిని శివుని రుద్రరూపానికి ప్రతీకగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన సమాజ గౌరవం పొందుతారు.
3. కుటుంబములో సంతోషం వుంటుంది.
4. రుద్రాక్షయందు పదకొండు ధారలుంటాయి.

**ద్వాదశ ముఖ రుద్రాక్ష:-**

1. దీనిని సూర్యభగవానుని స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన తేజస్సు పొందుతారు.
3. రుద్రాక్షయందు పన్నెండు ధారలుంటాయి.

**త్రయోదశ ముఖ రుద్రాక్ష:-**

1. దీనిని ఇంద్రుని స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన సర్వదేవతల ఆశీస్సులు పొందుతారు.
3. రుద్రాక్ష యందు పదమూడు ధారలుంటాయి.

**చతుర్ధశ ముఖ రుద్రాక్ష:-**

1. దీనిని శివుని నేత్ర స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించిన వారికి కష్టములు ఆమడదూరములో వుంటాయి.
3. ఆయురారోగ్యములు కలుగుతాయి.
4. రుద్రాక్షయందు పదునాలుగు ధారలుంటాయి.

**శివరుద్రాక్ష లేదా గౌరీ శంకర రుద్రాక్ష:-**

1. దీనినిపార్వతీ పరమేశ్వరుల స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన గృహమున సుఖసంతోషాలు విరాజిల్లుతాయి.
3. దీనియందు రెండు రుద్రాక్షలు కలసి వుండుట గమనార్హం.

| జన్మ నక్షత్రాలు | జన్మించిన తేదీలు | జన్మలగ్నం | జరుగుతున్న దశానాధుడు | దోషనివారణ కావలసిన గ్రహం | ధరించవలసిన రుద్రాక్ష | ధరించవలసిన మాల |
|---|---|---|---|---|---|---|
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ | | | రవి | సూర్యుడు | ఏకముఖిలేదా ద్వాదశముఖి | స్ఫటికమాల |
| రోహిణి, హస్త, శ్రవణం | అక్టోబర్ 21నుండి నవంబర్ 20; ఫిబ్రవరి 21 నుండి మార్చి 20వ. | వృశ్చికం, మీనం | చంద్ర | చంద్రుడు | ద్విముఖి | ముత్యాలమాల |
| మృగశిర, చిత్త, ధనిష్ట | జూలై 21 నుండి ఆగష్టు 20వరకు | సింహం | కుజ | కుజ | త్రిముఖి | పగడాలమాల |
| ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి | | | బుధ | బుధ | చతుర్ముఖి | తులసిమాల |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | మార్చి 21 నుండి ఏప్రియల్ 20; జూన్ 21 నుండి జూలై 20; నవంబర్ 21నుండి డిసెంబర్ 20; | మేషం, కర్కాటకం, ధనుస్సు | గురు | గురు | పంచముఖి | గంధమాల |
| భరణి, పుబ్బ, పూ.షాఢ | మే 21నుండి జూన్ 20వరకు ఆగష్టు 21 నుండి సెప్టెంబర్ 20, డిశెంబరు 21నుండి ఫిబ్రవరి 20 వరకు | మిధునం, కన్య, మకరం, కుంభం | శుక్ర | శుక్ర | షణ్ముఖి | తామరమాల |
| పుష్యమి, అనూరాధ,ఉ.భా | ఏప్రియల్ 21నుండి మే 20 వరకు సెప్టెంబర్ 21నుండి అక్టోబర్ 20 వరకు | వృషభం, తుల | శని | శని | సప్తముఖి | ఎఱ్ఱచందనమాల |
| ఆరుద్ర, స్వాతి, శతభిషం | | | రాహు | రాహు | అష్టముఖి | రుద్రాక్షమాల |
| అశ్విని, మఖ, మూల | | | కేతు | కేతు | నవముఖి | రుద్రాక్షమాల |

# నవగ్రహములు - ధారణ లేదా దానం చేయవలసిన ప్రతిమ

| దోషనివారణ కావలసిన గ్రహం | ధారణచేయ వలసిన ప్రతిమ | ఉపయోగించ వలసిన ధాతువు | దానం చేయవలసిన ప్రతిమ |
|---|---|---|---|
| రవి | సూర్యనారాయణమూర్తి | రాగి | గోవు |
| చంద్ర | పార్వతీదేవి | స్ఫటికం | గోవు |
| కుజుడు | సుబ్రహ్మణ్యస్వామి | రక్తచందనం | పద్మము |
| రాహువు | సరస్వతీదేవి | సీసం | నాగపడగ |
| గురువు | శివుడు | బంగారం | శ్రీవీరబ్రహ్మేంద్ర స్వామి |
| శని | వెంకటేశ్వరస్వామి | లోహము | నువ్వులతో నిండిన ఇనుపపాత్ర |
| బుధుడు | విష్ణుమూర్తి | బంగారం | లక్ష్మీనారాయణ మూర్తి |
| కేతువు | గణపతి | కంచు | ఉమామహేశ్వరులు |
| శుక్రుడు | లక్ష్మీదేవి | వెండి | ఆవు |

## నవగ్రహాలకు నపమాలలు

| కావలసిన ఫలితం | దోషనివారణ కావలసిన గ్రహం | ధరించవలసిన వారం | ధరించవలసిన మాల |
|---|---|---|---|
| మానసిక స్థైర్యం కోసం | రవి | ఆదివారం | స్ఫటికమాల |
| మానసిక శాంతికోసం | చంద్రుడు | సోమవారం | ముత్యాలమాల |
| కార్యసిద్ధికోసం | కుజుడు | మంగళవారం | పగడమాల |
| అనుకున్నపని నెరవేరుటకు | రాహువు | ఆదివారం | రుద్రాక్షమాల |
| జనవశీకరణ కోసం | గురువు | గురువారం | గంధమాల |
| అధికారుల అభిమానం పొందుటకు | శని | శనివారం | ఎఱ్ఱచందనమాల |
| దైవానుగ్రహం పొందుటకు | బుధుడు | బుధవారం | తులసిమాల |
| గ్రహానుగ్రహం పొందుటకు | కేతువు | శనివారం | నవరత్నమాల |
| ధనప్రాప్తికోసం | శుక్రుడు | శుక్రవారం | తామరమాల |

# నవగ్రహదోషములు - మూలికలు

ఆయుర్వేదము మూలికలు గురించి, వాటికి గల ప్రభావం గురించి ఎన్నో విషయాలు తెలిపింది. మన ప్రాచీన జ్యోతిష్యులు గ్రహదోషనివారణకు మూలికాధారణను ఒక పద్ధతిగా తెలిపారు. ప్రస్తుతం మనం గ్రహము, దానికి సంబంధించిన మూలికలను తెలుసుకుందాం. వీటిని మన శరీరాన్ని తాకునట్లుగా ధరించాలి. లేదా ఎల్లప్పుడు మనవద్దనే ఉండేలా చూచుకోవాలి.

| గ్రహము | మూలిక |
|---|---|
| రవి | మారేడు, తెల్లజిల్లేడు |
| చంద్రుడు | మోదుగ, పాలచెట్టు |
| కుజ | చంద్ర, పాల సుగంధి |
| రాహువు | చందనం |
| గురువు | రావి, అరటివేరు |
| శని | జమ్మి, దర్భలు |
| బుధుడు | ఉత్తరేణి, నేలగుమ్మడి |
| కేతువు | తెల్లజిల్లేడు, పిన్నేరు వేరు |
| శుక్రుడు | మేడి, ములువెంపలి |



## 19. నవగ్రహాలు - దశాంతర్దశలలో చేయవలసిన జపములు

| దశలు | రవిభక్తి | చంద్రభుక్తి | కుజభుక్తి | రాహుభుక్తి | గురుభుక్తి | శనిభుక్తి | బుధభుక్తి | కేతుభుక్తి | శుక్రభుక్తి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | మృత్యుంజయ | దుర్గాజపం | సుబ్రహ్మణ్య జపం | దుర్గాజపం | రుద్రజపం | మృత్యుంజయ జపం | దుర్గాజపం | దుర్గాజపం | మృత్యుంజయ జపం |
| చంద్ర | శనిజపం | మృత్యుంజయ జపం | సుబ్రహ్మణ్య జపం | దుర్గాజపం | రుద్రజపం | మృత్యుంజయ జపం | విష్ణుసహస్ర నామం | రుద్రజపం | దుర్గాజపం |
| కుజ | ఆదిత్యహృదయ పారాయణం | దుర్గాజపం | సుబ్రహ్మణ్య జపం | మృత్యుంజయ జపం | గురుమంత్ర జపం | విష్ణుసహస్ర నామం | దుర్గాజపం | మృత్యుంజయ జపం | లక్ష్మీ మంత్రజపం |
| రాహు | ఆదిత్య హృదయ పారాయణం | దుర్గాజపం | సుబ్రహ్మణ్య జపం | దుర్గాజపం | శివ సహస్ర నామం | విష్ణుసహస్ర నామ పారాయణం | విష్ణుసహస్ర నామ పారాయణం | దుర్గాజపం | లలిత సహస్రం |
| గురు | సూర్య మంత్ర జపం | లక్ష్మీమంత్ర జపం | సుబ్రహ్మణ్య జపం | మృత్యుంజయ జపం | శివసహస్ర నామ పారాయణం | విష్ణుసహస్ర నామ పారాయణం | విష్ణుసహస్ర నామ పారాయణం | మృత్యుంజయ జపం | దుర్గాజపం |
| శని | ఆదిత్య హృదయం | దుర్గామంత్ర జపం | సుబ్రహ్మణ్య జపం | దుర్గాజపం | గురుమంత్ర జపం | శనిమంత్ర జపం దుర్గా జపం | విష్ణుగాయత్రి జపం | దుర్గాస్తోత్రం | దుర్గామంత్ర జపం |
| బుధ | సూర్యమంత్ర స్తోత్రం | దుర్గాసప్త శతి | శివసహస్ర పారాయణం | మృత్యుంజయ జపం | శివసహస్ర పారాయణం | మృత్యుంజయ జపం | నారాయణ గాయత్రి | దుర్గామంత్ర జపం | లక్ష్మీమంత్ర జపం |
| కేతు | సూర్యమంత్ర జపం | దుర్గామంత్ర జపం | సుబ్రహ్మణ్య జపం | దుర్గాజపం | శివసహస్ర నామ పారాయణం | శనిమంత్ర జపం | విష్ణుసహస్ర నామ పారాయణం | దుర్గామంత్ర జపం | దుర్గామంత్ర జపం |
| శుక్ర | సూర్యమంత్ర జపం | దుర్గామంత్ర జపం | సుబ్రహ్మణ్య జపం | దుర్గాజపం జపం | గురుమంత్ర జపం | మృత్యుంజయ జపం | విష్ణుసహస్ర నామ పారాయణం | దుర్గాజపం | లక్ష్మీమంత్ర జపం |

# 20. స్థితగ్రహాల దోషాలు - పరిహారాలు

కొన్ని గ్రహాలు కొన్ని భావాలలో ఉంటే కొన్ని రకాల సమస్యలు ఏర్పడతాయి. వాటిని పరిష్కరించుటకు "లాల్ కితాబ్" కొన్ని ప్రత్యేక పరిహార క్రియలను సూచించినది. వాటిని గురించి తెలుసుకొందాము.

1. చంద్రుడు బలహీనంగా ఉన్నపుడు, పూర్ణిమ తరువాత షష్టి రోజున జాతకుని భార్య ప్రసవనెప్పులు పడుతుంటే, అతని తల్లి కోడలు వద్ద ఉండరాదు. ఆమె పుట్టిన శిశువును 43 రోజుల వరకు చూడరాదు.

2. కుజుడు 2వ భావంలో ఉంటే, కుటుంబాభివృద్ధికి సంబంధించిన సమస్యలు కలుగుతాయి. జాతకుడు సంతానము, కుటుంబ సభ్యుల గురించి శ్రద్ధ వహించాలి.

3. కుజుడు 9వ భావంలో ఉంటే సమస్యలు కలుగుతాయి. జాతకుడు వదినను సేవించాలి.

4. శని 5వ భావంలో ఉంటే, జాతకుడు గృహనిర్మాణం చేయునపుడు సంతానం ఆరోగ్యం క్షీణిస్తుంది. అందువలన జాతకుడు రవి, చంద్ర, కుజులను ఆరాధించాలి. వారికి సంబంధించిన వస్తువులును తనవద్ద ఉంచుకోవాలి.

5. కుమారుడు అనారోగ్యం వలనగాని, సమస్యలవలనగాని ఇబ్బంది పడుతుంటే, జాతకుడు నల్లకుక్కకు 43 రోజులు ఆహారం పెట్టాలి.

6. జన్మ చక్రంలో రవి, గురులు కలసి ఒకే రాశిలో ఉంటే, జాతకునికి ఆర్థిక సమస్యలు కలుగుతాయి.

   నివారణ కోసం :- జాతకుడు బంగారపు ఉంగరం ధరించాలి. కుంకుమ పువ్వును తినాలి.

7. జన్మచక్రంలో రవి, శని ఇద్దరు కలసి ఒకేరాశిలో ఉంటే జాతకుని భార్యకు అనారోగ్యం కలుగును.

   నివారణ కోసం :- 1. భార్య బరువుకు సమానమైన బరువు కల పశుగ్రాసాన్ని పశుశాలకు దానం చేయండి.

   2. రవి, శని ఇద్దరిలో రవి బలంగా ఉంటే రాగిని దానం చేయాలి. శని బలంగా ఉంటే ఇనుమును, నువ్వులను దానం చేయాలి.

8. జన్మచక్రంలో రవి, రాహువు లిరువురూ కలసి ఒకేరాశిలో ఉంటే జాతకుడు శ్వాసకోశ సంబంధమైన వ్యాధులకు గురి అవుతాడు.

నివారణ కోసం :- సూర్యగ్రహణ సమయంలో బొగ్గును, ఆవాలను నదిలోకి వేయండి.

9. జన్మచక్రంలో చంద్ర, రాహువు లిరువురూ కలసి ఒకే రాశిలో ఉంటే జాతకుడు మనశ్శాంతిని కోల్పోతాడు.

నివారణ కోసం :- చంద్రగ్రహణ సమయంలో బొగ్గును, ఆవాలను ప్రవహించే నీటిలోకి వేయండి.

10. జన్మచక్రంలో కుజ, బుధులిరువురూ కలసి ఒకే రాశిలో ఉంటే, జాతకుని చెల్లెలి ఆరోగ్యం క్షీణిస్తుంది.

నివారణ కోసం :- ఒక జాడీలో తేనె, సోపుగింజలను ఉంచి, మూతపెట్టి, ఇంటిహద్దు వద్ద భూమిలో పాతండి.

# 21. రాశులలో గ్రహాలు-దోషాలు- పరిహారములు

## మేషరాశిలో నవగ్రహాలు - పరిహారములు

### 1. మేషంలో రవి ఉంటే :-

మేషంలో రవి ఉంటే జాతకుడు భార్య, పిల్లలు, తల్లి, తండ్రి, సోదరీ సోదరులతో ఆనందంగా జీవిస్తాడు. అయితే అతను జాలిగుండె కలవాడైతే ధననష్టం పొందుతాడు. తులలో ఏ గ్రహము లేకపోతే జాతకుడు త్వరగా వివాహం చేసుకుంటాడు. జాతకుడు విద్యావంతుడు, వినయశీలి, సంఘంలో గౌరవం కలవాడు, పేదలకు సాయపడువాడు, అయితే కోపం ఎక్కువ. వినిన విషయాలను వెంటనే నమ్మకుండా, వాటిగురించి ఆలోచించిన జాతకుని జీవితం ప్రశాంతంగా సాగుతుంది. తులలో శుక్రుడు ఉంటే జాతకుని తండ్రి దీర్ఘాయుష్మంతుడు కాడు.

జాతకుడు ఒక నీటిపంపును ఏర్పరిస్తే స్వల్పమైన చికాకులు కూడ దూరమవుతాయి.

### 2. మేషంలో చంద్రుడు ఉంటే :-

మేషంలో చంద్రుడు ఉంటే జాతకుడు మంచి అధికారిగా పేరు తెచ్చుకుంటాడు. సంఘంలో గౌరవం పొందుతాడు. దీర్ఘాయుర్దాయము కలవాడు. తులలో ఏగ్రహం లేకపోతే, చంద్రుడు అనుకూలుడు కాడు.

జాతకునికి 24 సం॥ నిండిన తరువాత తల్లికి దూరమౌతాడు.

పరిహారములు :-

- ✤ జాతకుడు తన వయస్సు 24 నుండి 27 సం॥ల మధ్య ఉన్నపుడు వివాహం చేసుకొనరాదు.
- ✤ జాతకుడు తన భార్య చెల్లెలు (మరదలు)కు దూరంగా ఉండాలి.
- ✤ జాతకుడు తన వయస్సు 24 సం॥, 27 సం॥ల మధ్య ఉన్నపుడు స్వంత డబ్బుతో గృహనిర్మాణము చేయరాదు.
- ✤ జాతకుడు తరచుగా ఏదైనా విత్తనాలను భూమిలో నాటుతూ ఉండాలి.

**3. మేషంలో కుజుడు ఉంటే :-**

మేషంలో కుజుడు ఉంటే జాతకుడు సాంప్రదాయాలను, ఆచారాలను గౌరవిస్తాడు. నీతి, నిజాయితి కలవాడు, పెద్దలను గౌరవిస్తాడు. మంచి మిత్రులను కలిగి ఉంటాడు. శత్రువులను జయిస్తాడు.

✤ రవి, శని, కుజులలో ఎవరైనా వ్యతిరేకభావాలలో ఉంటే జాతకునికి అనేక సమస్యలు ఏర్పడతాయి.

పరిహారములు :-

- ✤ ఇంటిగోడకు ప్రాకుతున్న తీగను తొలగించాలి.
- ✤ దక్షిణవైపున ఉన్న ద్వారమును మూసివేయాలి.
- ✤ ఏదైనా చెట్టునీడ ఇంటిమీద పడుతున్న, దాని నీడ ఇంటిపై పడకుండా చూడాలి.

**4. మేషంలో రాహువు ఉంటే :-**

మేషంలో రాహువు ఉంటె జాతకుడు ధనవంతుడు, కార్యనిర్వాహకుడు.

- ✤ జాతకుడు భార్యతో సన్నిహితంగా ఉండడు.
- ✤ ఇతనికి శత్రుభయం ఉంటుంది.
- ✤ జాతకునికి స్థిరత్వం తక్కువ.
- ✤ జాతకుడు తరచు తనుచేయు ఉద్యోగాన్ని మారుస్తూ ఉంటాడు.

పరిహారములు :-

- ✤ నీలిరంగు దుస్తులను ధరించవద్దు.
- ✤ ప్రవహించే నీటిలో కొబ్బరిబొండాన్ని వదలండి.
- ✤ పేదలకు గోధుమపిండి, బెల్లం కలిపి పెట్టండి.
- ✤ అవసరమైన వారికి రాగిపాత్రను దానం చేయండి.
- ✤ మెడలో వెండిగొలుసును ధరించండి.

**5. మేషంలో గురువు ఉంటే :-**

సాధారణంగా మేషంలో గురువు శుభఫలితాలను ఇస్తాడు. కాని జాతకుని ఆలోచనలు వక్రమార్గాన పడితే గురువు దుష్ఫలితాలను ఇస్తాడు. అలాగే ఇతర గ్రహాల దృష్టుల వలన కూడ దుష్ఫలితాలను ఇస్తాడు.

- ✤ జాతకునికి పుత్రసంతానం ఉండదు.
- ✤ దాంపత్య సుఖం ఉండదు.
- ✤ మిత్రులు సహకరించరు. శత్రువులు పెరుగుతారు.
- ✤ సంఘంలో గౌరవం క్షీణిస్తుంది.

**పరిహారములు :-**

- ✤ ఆవుకు ఆకుకూరలు పెట్టండి.
- ✤ వెండితో చేసిన ముక్కుపుడక ధరించండి.
- ✤ ఏదైనా దేవాలయానికి దీపారాధనకు నువ్వులనూనెను ఇవ్వండి.
- ✤ పేదపిల్లలకు బట్టలు కుట్టించండి.
- ✤ విద్యార్థినీ విద్యార్థులకు పెన్ను పుస్తకము బహుమతిగా ఇవ్వండి.
- ✤ సింహంలో శని ఉన్నపుడు ఇల్లు కట్టవద్దు.
- ✤ ధనుస్సులో శని ఉంటే, ఇనుపవస్తువులు కొనవద్దు అంటే మెషీన్లు, ఆటోలు వంటివి కొనవద్దు.
- ✤ కుంభంలో గాని, మీనంలోగాని శనిఉంటే శాకాహారం మాత్రమే భుజించండి. ఆల్కహాలు మానండి.
- ✤ గుడి ముందున్న ఇంటిలో నివసించవద్దు.
- ✤ ఇంటి ఆవరణలో చెట్టును పెంచండి.

6. మేషంలో శని ఉంటే :-

మేషంలో శని ఉండగా జన్మించిన జాతకుని పూర్వీకుల ఆస్తి క్రమంగా తగ్గుతుంది.

- ✤ శరీరంపై రోమాలు అధికంగా ఉంటాయి.
- ✤ పూర్వీకుల ఆస్తి క్రమంగా తగ్గుతుంది.
- ✤ తరచు అనారోగ్యం కలుగుతుంది.
- ✤ బుధుడు బలహీనుడైతే, చదువుకు ఆటంకాలు కలుగుతాయి.

పరిహారములు :-

- ✤ అరటిచెట్టుకు నీరు పోయండి.
- ✤ ప్రతిరోజు అరటిచెట్టు మొదలువద్దగల మట్టిని బొట్టుగా ధరించండి.
- ✤ నల్లని కాటుకను నల్లని కాటుక డబ్బాలో ఉంచి భూమిలో పాతండి.
- ✤ ప్రతిరోజు కోతులకు ఆహారాన్ని పెట్టండి.

7. మేషంలో బుధుడు ఉంటే :-

మేషంలో బుధుడు ఉంటే, జాతకుడు కీర్తికలవాడు. ఆవేశపరుడైనా శాంతచిత్తుడు. బంధుప్రేమ కలవాడు. జాతకుని కూతురు అదృష్టవంతు రాలవుతుంది. మందులు, వనమూలికలు, కూరలు వంటి వాటితో వ్యాపారం లాభిస్తుంది.

- ✤ అపవాదులకు గురిఅవుతారు.

పరిహారములు :-

- ✤ ఏదైనా ఒకే వృత్తిలో లేదా ఒకే ఉద్యోగంలో స్థిరపడండి.
- ✤ ఆకు పచ్చని రంగు వస్త్రములు లేదా ఇతర ఆకుపచ్చని వస్తువులు ఏవైనా వాడవద్దు.
- ✤ మద్యం, మాంసం మానండి.

6. మేషంలో కేతువు ఉంటే :-

మేషంలో కేతువు ఉంటే జాతకుడు ఎక్కువగా ఆందోళన చెందుతూ ఉంటాడు. తన పనికొరకు అనవసర శ్రమ పడతాడు. ధర్మప్రవర్తన లేకపోతే, అల్పసంతానం ఉంటుంది.

**పరిహారక్రియ :-**

నియమబద్ధమైన జీవితం గడిపితే, జాతకునికి శుభము కలుగును.

**9. మేషంలో శుక్రుడు ఉంటే :-**

మేషంలో శుక్రుడు ఉంటే జాతకుడు ఆకర్షణీయమైన రూపం కలవాడు. మధురంగా మాట్లాడువాడు. స్త్రీలచేత ఆకర్షింపబడతాడు. ఆనందకరమైన జీవితం గడుపుతాడు. భార్యకు మాత్రం అనారోగ్యం ఉంటుంది.

జన్మ చక్రంలో మేషంలో శుక్రుడు ఉంటే, గోచారంలో శుక్రుడు 7వస్థానం లోకి వచ్చినపుడు జాతకునికి అనారోగ్యం ఏర్పడుతుంది. జాతకుడు వృత్తిపరంగా స్థిరపడకముందే, అతనికి వివాహం అవుతుంది. అయితే తన 25 సం॥ వయస్సులో వివాహం అవుతుంది. అయితే తన 25 సం॥ వయస్సులో వివాహం చేసుకుంటే ఆస్తి నష్టమౌతుంది.

జాతకుడు ప్రేమలో పడితే నష్టపోతాడు. శని, శుక్ర సంబంధం కలిగితే జాతకుడు అనేకమంది స్త్రీలతో సంపర్కం కలిగి ఉంటాడు. భార్య ఆరోగ్యం క్షీణిస్తుంది.

పరిహారక్రియలు :-

- ❖ పగలు స్త్రీతో సంభోగాన్ని మానండి.
- ❖ నల్లని ఆవును పెంచండి.
- ❖ బెల్లాన్ని తినకండి.

## వృషభరాశిలో నవగ్రహాలు - పరిహారములు

**1. వృషభంలో రవి ఉంటే :-**

వృషభంలో రవి ఉంటే జాతకుడు శ్రమకు తగిన ఫలితాన్ని పొందుతాడు. సంఘంలో గుర్తింపు ఉంటుంది. ఆచారాలను గౌరవిస్తాడు. దాంపత్యసౌఖ్యం పొందుతాడు. అయితే భార్యవలన కుటుంబంలో కలతలు ఏర్పడతాయి. జాతకునకు వాహనం ఉంటుంది.

**పరిహారక్రియలు :-**

- ❖ గోధుమలను దానం తీసుకోవద్దు.
- ❖ దేవాలయానికి కొబ్బరిబొండాం, నూనె సమర్పించండి.

2. వృషభంలో చంద్రుడు ఉంటే :-

వృషభంలో చంద్రుడు ఉంటే జాతకునికి పిత్రార్జితం లభిస్తుంది. జీవితంలో అధికభాగం తల్లివద్ద ఉంటాడు. అతనికి తల్లిసాయం లభిస్తుంది. మేషంలో కేతువు ఉంటే చదువుకు ఆటంకాలేర్పడతాయి.

పరిహారక్రియలు :-

- ✤ వెండి ఉంగరం లేదా వెండి గొలుసు ధరించండి.
- ✤ ఇంటిలో వెండి పళ్ళెము, వెండి గ్లాసు వాడండి.
- ✤ ఇంటి పునాదిలో వెండిని పాతిపెట్టండి.

3. వృషభంలో కుజుడు ఉంటే :-

వృషభంలో కుజుడు ఉంటే జాతకుడు లేని పెద్దరికాన్ని తెచ్చుకొని, అందరిమీద అధికారం చెలాయించటానికి ప్రయత్నిస్తుంటాడు. కట్నంకోసం భార్యను హింసించి, అత్తవారింట చెడ్డపేరు తెచ్చుకుంటాడు.

పరిహారక్రియలు :-

- ✤ తెల్లని దుస్తులు ధరించండి.
- ✤ ముత్యం అమర్చిన వెండి ఉంగరం ధరించండి.
- ✤ కుమారస్వామికి అభిషేకం చేయించండి.
- ✤ కుక్క, ఆవు మొదలగు ఏ జీవికైనా స్వీట్స్ పెట్టండి.

4. వృషభంలో రాహువు ఉంటే :-

వృషభంలో రాహువు ఉంటే జాతకుడు కుటుంబ సుఖమును పొందుతాడు. ఆర్థికపరంగా సమస్యలుండవు. గురువు బలహీనుడైన ఆర్థిక ఇబ్బందులు కలుగుతాయి. జాతకుడు ప్రమాదం కారణంగా మరణించవచ్చు. గోచారంలో శని మేషంలోకి వచ్చినపుడు, శనిబలంగా ఉంటే ఆకాలమంతా జాతకునికి అనుకూలంగా ఉంటుంది. గురువు బలహీనంగా ఉంటే అశుభము.

పరిహారక్రియలు :-

- ✤ ప్రతిదినము తల్లికి నమస్కారం చేయండి.
- ✤ సాయిబాబాను ముద్రించిన వెండి ఉంగరం లేదా బంగారపు ఉంగరాన్ని ధరించండి.

* బ్రహ్మంగారి దేవాలయం లేదా రాఘవేంద్రుని దేవాలయంకు శనగగుగ్గిళ్ళు ప్రసాదంగా సమర్పించండి.
* అత్తగారింటినుండి ఎలక్ట్రికల్ పరికరాలు ఏవీ బహుమతిగా తీసుకోవద్దు.

### 5. వృషభంలో గురువు ఉంటే :-

వృషభంలో గురువు ఉంటే జాతకుడు సంఘంలో గుర్తింపు, ఆదాయము పొందుతాడు. స్త్రీలచేత అభిమానింపబడతాడు. జాతకుని తల్లి ఉదార స్వభావం కలది. జాతకుని భార్య, అత్తగారు అనారోగ్యం పొందుతారు. సాధారణంగా బంగారునగల వ్యాపారం, వ్యవసాయంలలో లాభం వస్తుంది.

కన్యలో రాహువు, వృశ్చికంలో బుధుడు, మకరంలో శని ఉంటే జాతకునికి ఆర్థిక ఇబ్బందులు కలుగుతాయి. అవమానాలు జరుగుతాయి.

**పరిహారక్రియలు :-**

* దానగుణాన్ని అలవరచుకోవాలి. వచ్చిన అతిథులను గౌరవించాలి.
* తాత, తండ్రులతో వ్యాపారం చేయవద్దు. వారిని వినియోగదారులుగానో, పాటివ్యాపారులుగానో భావించకండి.
* పుట్టలో పాలు పోయండి.
* ధర్మకార్యాలకు, దేవాలయాలకు విరాళాలు ఇవ్వండి.
* పేదలకు అన్నదానం చేయండి.

### 6. వృషభంలో శని ఉంటే :-

వృషభంలో శని ఉంటే జాతకుడు ఆరోగ్యవంతుడు. తెలివైనవాడు, సాంప్రదాయాలను పాటించడు. పూర్వీకుల ఆస్తి నాశనమగును. సంతానం వలన మనశ్శాంతిని కోల్పోతాడు. జాతకుడు జీవితాంతం కుటుంబ 'పెద్ద'గా ఉంటాడు. అనగా కుటుంబ సభ్యులు అతనిమాటను గౌరవిస్తారు.

**పరిహారక్రియలు :-**

* ప్రతిదినం ఏదైనా దేవాలయముకు వెళ్ళండి.
* పాలు లేదా పెరుగును నుదురుపై బొట్టుగా పెట్టుకోండి.
* ప్రతిసోమవారం కనీసం ఒకరికి అన్నం పెట్టండి.
* వీధి పిల్లలకు పాలు పంచండి.
* నాగేంద్రస్వామి పుట్టలో పాలు పోయండి.

**7. వృషభంలో బుధుడు ఉంటే :-**

వృషభంలో బుధుడు ఉంటే జాతకుడు తెలివైనవాడు. స్వార్ధపరుడు. ఇతరుల గురించి పట్టించుకొనడు. జాతకుడు మంచి వక్త, రచయిత, తండ్రికి సహాయపడడు.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిదినం రావిచెట్టుకు నీరుపోయండి.
- ✤ శివాలయమును దర్శించండి.
- ✤ మేకలు, గొర్రెలు పెంచకండి.
- ✤ మాంసాహారము, మద్యమును మానివేయండి.
- ✤ ప్రతిదినం దుర్గాస్తుతి చేయండి.

**8. వృషభంలో కేతువు ఉంటే :-**

వృషభంలో కేతువు ఉంటే జాతకుడు కష్టపడతాడు. అతనికి విశ్రాంతి తక్కువ. ఎక్కువగా ప్రయాణాలు చేస్తుంటాడు. శరీర సుఖము తక్కువ. ధనాన్ని సంపాదిస్తాడు. సంఘంలో గౌరవం ఉంటుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిదినము దేవాలయముకు వెళ్ళుట మంచిది.
- ✤ ప్రతిదినము నుదుటిపై కుంకుమ ధరించండి.
- ✤ దక్షిణామూర్తికి శనగలు సమర్పించండి.
- ✤ లక్ష్మీదేవిని పూజించండి.

**9. వృషభంలో శుక్రుడు ఉంటే :-**

వృషభంలో శుక్రుడు ఉంటే జాతకుడు ధనము, కీర్తి, సుఖము పొందుతాడు. సంతాన సుఖం ఉంటుంది. సోదరులుంటారు. 60 సం॥ వరకు ధన సంపాదన ఉంటుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిసంవత్సరం వరలక్ష్మీవ్రతం చేయండి.
- ✤ లక్ష్మీదేవి ఆలయానికి ఆవునెయ్యి సమర్పించండి.
- ✤ ఆవుకు ఆహారం పెట్టండి.
- ✤ తప్పనిసరిగా వివాహం చేసుకోండి.
- ✤ తెల్లని వస్త్రాలు ధరించండి.

## మిధునరాశిలో నవగ్రహాలు - పరిహారాలు

### 1. మిధునంలో రవి ఉంటే :-

మిధునంలో రవి ఉంటే, జాతకునకు తమ్ముళ్ళు ఉంటారు. తల్లి ఆరోగ్యంగా ఉంటుంది. జాతకుడు ఆస్తిని సంపాదిస్తాడు. తీర్థయాత్రలు చేస్తాడు. దైవభక్తి పరుడు.

వ్యసనాలకు గురిఅయితే, ఆస్తిని నష్టపోతాడు.

**పరిహారక్రియలు :-**

- ప్రత్యేకంగా చేయవలసిన పరిహారక్రియలు లేవు. జాతకుడు చెడు అలవాట్లకు దూరంగా ఉంటే, అతడు ధనలాభము, స్త్రీ సౌఖ్యము పొందుతాడు.

### 2. మిధునంలో చంద్రుడు ఉంటే :-

మిధునంలో చంద్రుడు ఉంటే జాతకునకు ధనము, ఆరోగ్యము లభించును. చంద్రునితోపాటు అదేరాశిలో కేతువుకాని, బుధుడు కాని, రాహువుకాని, శుక్రుడు కాని ఉంటే అశుభము.

**పరిహారక్రియలు :-**

- ప్రతిదినము దుర్గాదేవిని పూజించండి.
- గోధుమపిండి, బెల్లం కలిపి పిల్లలకు పంచండి.
- పేదలకు అన్నదానం చేయండి.

### 3. మిధునంలో కుజుడు ఉంటే :-

మిధునంలో కుజుడు ఉంటే జాతకుడు మూర్ఖుడు. అతని మూర్ఖత్వాన్ని ఉపయోగించుకొని ఇతరులు వృద్ధి చెందుతారు. ఇతరుల మోసాన్ని భరించలేడు. జాతకునికి ఓర్పుతక్కువ.

**పరిహారక్రియలు :-**

- మూర్ఖపు పట్టుదలను విడిచి పెట్టండి.
- సోదరులతో కలసిమెలసి తిరగండి. ఏ పనికైనా వారి సలహాలు కూడా తీసుకోండి
- ఏనుగు దంతంతో చేసిన దేవుని విగ్రహాన్ని ఇంటిలో ఉంచండి.

**4. మిథునంలో రాహువు ఉంటే :-**

మిథునంలో రాహువు ఉంటే జాతకుడు విద్యావంతుడు. రచయిత, ధనము కీర్తి, గౌరవము పొందును. నిజాయితీ పరునిగా గుర్తింపు పొందుతాడు. సోదరుల మధ్య సఖ్యత తక్కువ. కుటుంబ సుఖము, శాంతి కలుగును. చంద్రుడు బలహీనుడైతే, లోభ గుణం కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- వెండి ఉంగరం లేదా వెండి గొలుసు ధరించండి.
- పేదపిల్లలకు బాదం పప్పు పంచండి.

**5. మిథునంలో గురువు ఉంటే :-**

మిథునంలో గురువు ఉంటే జాతకుడు ఆస్తిపరుడు. సింహంలో శనిఉంటే కుమారునికి, మేనమామకు సమస్యలు ఏర్పడతాయి. జాతకుడు కపటి అయితే, ఇతరులను మోసగిస్తే అతను ఆర్థిక సమస్యలును ఎదుర్కోవలసి వస్తుంది. అంతేకాక భయము, ఆందోళన కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- దుర్గాదేవిని పూజించాలి.
- మిత్రులను, బంధువులను మోసగించకండి.
- మద్యమును, మాంసాహారమును మానివేయండి.
- వృషభం, సింహం, ధనస్సు, కుంభం, మీనంలలో బుధుడు ఉంటే చిన్నపిల్లలకు మిఠాయిలు పంచండి. ప్రతిరోజు దుర్గాస్తోత్రం చదవండి.
- పైన చెప్పిన అయిదురాశులలో దేనిలోనైనా శుక్రుడు ఉంటే ప్రతిరోజు ఆవుకు ఆహారం పెట్టండి. పేదలను ఆదరించండి. లక్ష్మీదేవిని పూజించండి.
- పైన చెప్పిన అయిదురాశులలో దేనిలోనైనా రాహువు ఉంటే ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి. చదువుకొనే వారికి సాయం చేయండి.

**6. మిథునంలో శని ఉంటే :-**

మిథునంలో శని ఉంటే జాతకుడు తెలివైనవాడు. విద్యావంతుడు. ఆర్థిక ఇబ్బందులు పడతాడు. కుజుడు అనుకూలుడు కాకపోతే సమస్యలు కలుగుతాయి. కాని ఎవరో ఒకరు సాయపడతారు. ఇంటిలో దొంగతనం వలన ధననష్టం కావచ్చు.

నీటి ప్రమాదం జరిగే అవకాశం ఉన్నది. కేతువు అనుకూలుడైతే ఆస్తి లభించును మరియు గృహనిర్మాణం చేస్తాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ గణపతిని ఆరాధించండి.
- ✤ తెల్లజిల్లేడును ధరించండి.
- ✤ కుక్కను పెంచండి.
- ✤ ఇంటి గడపకు ఇనుపమేకును కొట్టండి.

**7. మిధునంలో బుధుడు ఉంటే :-**

మిధునంలో బుధుడు ఉంటే జాతకుడు వినయశీలి. విద్యపై ఆసక్తి కలవాడు. విద్యావంతులతో స్నేహం చేస్తాడు. పరోపకారి.

**పరిహారక్రియలు :-**

- ✤ దక్షిణపువైపు ద్వారమున్న ఇంటిలో నివసించవద్దు.
- ✤ ప్రతిరోజు సూర్యనమస్కారములు చేయండి.
- ✤ నానబెట్టిన పెసలను ఆవులకు పెట్టండి.
- ✤ పక్షులకు ఆహారం పెట్టండి.
- ✤ వినాయకుని గుడికి వెళ్ళండి.
- ✤ కుక్కలకు చపాతీ పెట్టండి.

**8. మిధునంలో కేతువు ఉంటే :-**

మిధునంలో కేతువు ఉంటే జాతకుడు తన కుటుంబముకు దూరంగా ఉంటాడు. బంధువులతో అభిప్రాయ బేధాలు కలిగి ఉంటాడు. అశాంతి కలుగును.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిదినం నుదుటిపై కుంకుమను ధరించండి.
- ✤ వినాయకుని గుడికి వెళ్ళండి.
- ✤ సోదరులతో, బంధువులతో కలసి మెలసి ఉండండి.
- ✤ పేదవారికి చక్రపొంగలి పంచండి.
- ✤ బ్రహ్మాంగారికి పసుపురంగు వస్త్రాన్ని సమర్పించండి.
- ✤ సోమవారం శివునికి అభిషేకం చేయండి.

9. మిథునంలో శుక్రుడు ఉంటే :-

మిథునంలో శుక్రుడు ఉంటే జాతకుడు దయ కలవాడు. ధనవంతుడు, స్త్రీల అభిమానాన్ని పొందువాడు. భార్యమాట వినువాడు. ధైర్యవంతుడు. కాని క్లిష్ట సమస్యలు ఎదురైనప్పుడు క్రుంగిపోయేలక్షణం ఉంటుంది. ప్రయాణాలు ఎక్కువగా చేస్తాడు.

పరిహారక్రియలు :-

- వయస్సు 34 సం॥లోపు గృహనిర్మాణం చేయవద్దు.
- ప్రతిదినం సింధూరం బొట్టుగా పెట్టుకోండి.
- ప్రతి మంగళవారం సుబ్రహ్మణ్యస్వామికి అభిషేకం చేయండి.
- పేదపిల్లలకు స్వీట్లు పంచండి.
- ప్రతిదినం హనుమాన్ చాలీసా చదవండి.

## కర్కాటక రాశిలో నవగ్రహాలు-పరిహారాలు

1. కర్కాటకంలో రవి ఉంటే :-

కర్కాటకంలో రవి బలంగా ఉంటే జాతకుడు ఉద్యోగరీత్యా ఉన్నతస్థాయిలో ఉంటాడు. ముఖ్యంగా న్యాయస్థానాలలో మంచిపేరు తెచ్చుకుంటాడు. సంఘంలో గుర్తింపు ఉంటుంది. తన తల్లిదండ్రులు, పూర్వీకులు చేయలేని పనిని చేయగలుగుతాడు. అయితే తల్లికి, సోదరికి ఇబ్బందులు కలుగుతాయి. జాతకునకు కూడ సుఖం తక్కువ. గురు, శుక్ర, శని స్థితుల వలన అగ్ని ప్రమాదము, శత్రుభయము, సంసారసౌఖ్యం లేకపోవటం కలుగుతుంది.

పరిహారక్రియలు :-

- అంధులకు ఆహారం ఇవ్వండి.

2. కర్కాటకంలో చంద్రుడు ఉంటే :-

కర్కాటకంలో చంద్రుడు ఉంటే జాతకునకు సంఘంలో గుర్తింపు, ధనము, పశువులు భూమి లభించును. ఇతరులకు ఉపయోగపడుట వలన జాతకుని ఆదాయం పెరుగుతుంది. కుటుంబంలో సుఖశాంతులు ఉంటాయి.

గురువు బలంగా లేకపోతే అనుకోని సమస్యలు ఉత్పన్నమవుతాయి.

**పరిహారక్రియలు :-**

- ✤ పాలు, పాల ఉత్పత్తుల వ్యాపారం చేయరాదు.
- ✤ చిన్న పిల్లలకు పాలు ఇవ్వండి.
- ✤ ముఖ్యమైన పని ప్రారంభించుటకు ముందు పాలు పొంగించండి. ఆ పాలను పంచండి.

**3. కర్కాటకంలో కుజుడు ఉంటే :-**

కర్కాటకంలో కుజుడు ఉంటే జాతకునకు నీచకార్యాలపై ఆసక్తి ఉంటుంది. ఇతరుల ఆస్తిని, అభివృద్ధిని చూసి, ఈర్ష్య పడుతుంటాడు. క్రమంగా సోదరులకు, భార్యకు దూరమవుతాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ శివునికి పాలతో అభిషేకం చేయండి.
- ✤ పేదపిల్లలకు పాలను పంచండి.
- ✤ ఇంటిలో అరటిచెట్టుపెంచండి. దానికి పంచదార కలిపిన పాలను నీటిలో కలిపి, ఆ నీటిని పోయండి. చెట్టు మొదలువద్దగల మట్టిని బొడ్డుకు రాయండి.
- ✤ బంగారపు ఉంగరం, లేదా బంగారపు గొలుసు ధరించండి.

**4. కర్కాటకంలో రాహువు ఉంటే :-**

కర్కాటకంలో రాహువు ఉంటే జాతకుడు దయలేనివాడు. కఠినంగా మాట్లాడును. ఆశాజీవి. "అంతా తన మంచికే" అనుకొనే స్వభావం కలవాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ పేదపిల్లలకు గోధుమపిండి, బెల్లం కలిపి చేసిన ఉండలు పెట్టండి.
- ✤ ఆవుకు ఆహారం పెట్టండి.
- ✤ ప్రతిదినం ఆదిత్య హృదయం చదవండి.
- ✤ రాగినాణెమును నదిలో వేయండి.
- ✤ నుదుటిపై సింధూరమును బొట్టుగా ధరించండి.

**5. కర్కాటకంలో గురువు ఉంటే :-**

కర్కాటకంలో గురువు ఉంటే జాతకుడు ఆస్తిపరుడు. పిత్రార్జితము మరియు స్వార్జితము ఉంటుంది. జాతకుడు దయ కలిగినవాడు. ఇతరులను గౌరవించును.

పరోపకారి. జాతకునకు అనుకోనిధనం వచ్చే అవకాశం ఉన్నది. ఇతరుల ఆస్తి సంక్రమించే అవకాశం ఉన్నది. సముద్ర ప్రయాణం, విమాన ప్రయాణం లాభదాయకం. ఇతరుల సమస్యలను, తగాదాలను పరిష్కరించును. సంఘంలో గుర్తింపు. ప్రభుత్వాధికారుల అభిమానం పొందుతాడు. జీవితాంతం సుఖశాంతులు ఉంటాయి. అనేకమందికి ఆశ్రయం కల్పించి, వారికి జీవనమార్గం చూపగల సామర్థ్యం కలిగి ఉంటాడు. ఇంటి ఆవరణలో గుడి ఉంటే, జాతకుడు పేదరికమును అనుభవిస్తాడు. సుఖశాంతులను కోల్పోతాడు.

**పరిహారక్రియలు :-**

- ఇంటిలోని గుడిని తీసివేయండి.
- ఆవును పెంచండి.
- ఇంటికి దక్షిణంవైపున పశువుల పాకను నిర్మించండి.
- మేకలు, గొర్రెలు, చిలకలును పెంచకండి.
- నాగేంద్రస్వామి పుట్టలో పాలు పోయండి.
- మద్యమును, మాంసాహారమును మానండి.
- పండితులను, విద్యావంతులను ఆదరించండి.
- సాయిబాబా దేవాలయముకు ప్రసాద నిమిత్తం శనగలను ఇవ్వండి.
- ఇంటి వద్ద రావిచెట్టును పెంచండి.

**6. కర్కాటకంలో శని ఉంటే :-**

కర్కాటకంలో శని ఉంటే జాతకుడు నీచకార్యాసక్తి కలవాడు. అతని తల్లి బాధపడును. అయితే వృషభంలో గాని, మిధునంలోగాని చంద్రుడు ఉంటే జాతకుడు సుఖమును పొందుతాడు. పరస్త్రీల పొందుతో ధనవ్యయం జరుగుతుంది. జాతకుడు మూర్ఖత్వం, తొందరపాటుతనం కలవాడు.

**పరిహారక్రియలు :-**

- సోమవారం అనాథలకు అన్నం పెట్టండి.
- పేద పిల్లలకు పాలు ఇవ్వండి.
- నాగేంద్రస్వామి పుట్టలో పాలు పోయండి.
- ప్రతి సోమవారం శివాలయం వెళ్ళి నువ్వులనూనెతో దీపారాధన చేయండి.

**7. కర్కాటకంలో బుధుడు ఉంటే :-**

కర్కాటకంలో బుధుడు ఉంటే జాతకునకు సంఘంలో గుర్తింపు ఉంటుంది. జాతకుడు సాధారణ జీవితాన్ని గడుపుతాడు. ఆర్థిక ఇబ్బందులు కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- గోధుమపిండి, బెల్లం కలిపి అనాథపిల్లలకు పెట్టండి.
- సాయిబాబా లేదా బ్రహ్మంగారి గుడికి పసుపురంగు వస్త్రాలను ఇవ్వండి.
- వీధిపిల్లలకు శనగగుగ్గిళ్ళు పంచండి.
- పేదలకు క్షీరాన్నం పెట్టండి.
- బ్రహ్మంగారి ఆలయానికి చక్రపొంగలి ప్రసాదంగా ఇవ్వండి.

**8. కర్కాటకంలో కేతువు ఉంటే :-**

కర్కాటకంలో కేతువు ఉంటే జాతకునికి కుటుంబ సుఖం ఉండదు. అశాంతి కలుగుతుంది. ధనవ్యయం కలుగుతుంది. జాతకుడు శ్రమచేస్తాడు. కాని ఫలితం ఉండదు. పూర్వీకుల ఆస్తి నశించును.

**పరిహారక్రియలు :-**

- ప్రతిదినము రావిచెట్టుకు నీరు పోయండి.
- ఏదైనా దేవాలయముకు పసుపు ఇవ్వండి.
- పిల్లలకు అరటిపండ్లు పంచండి.
- ప్రతిదినము శివనామస్మరణ చేయండి.
- సాయిబాబా గుడికి శనగలు ఇవ్వండి.

**9. కర్కాటకంలో శుక్రుడు ఉంటే :-**

కర్కాటకంలో శుక్రుడు ఉంటే జాతకుడు ధనవంతుడు, స్త్రీ వ్యామోహం కలవాడు. ద్వికళత్రయోగం ఉంటుంది.

కుటుంబ కలహాల వలన అశాంతి కలుగును.

**పరిహారక్రియలు :-**

- ప్రతిసోమవారం పేదలకు అన్నం పెట్టండి.
- ప్రతిదినం శివాలయమును దర్శించండి.
- దక్షిణామూర్తికి పసుపురంగు వస్త్రం సమర్పించండి.
- ఆవుకు అరటిపండ్లు పెట్టండి.
- పేదపిల్లలకు పులిహోర పంచండి.
- ప్రతిదినం దుర్గాస్తుతి చేయండి.

# సింహరాశిలో నవగ్రహాలు-పరిహారాలు

## 1. సింహంలో రవి ఉంటే :-

సింహంలో రవి ఉంటే జాతకుడు తల్లిదండ్రుల ప్రేమను అధికంగా పొందుతాడు. తన విద్యతో, తెలివితేటలతో అందరి అభిమానాన్ని పొందుతాడు. సంఘంలో గొప్పవ్యక్తిగా పేరు పొందుతాడు. కుటుంబపెద్దగా బాధ్యతలను స్వీకరించి, దానిలో సఫలీకృతుడవుతాడు. జాతకుని సంతానం కూడ విద్యావంతు లవుతారు. 10 వ స్థానంలో గురువు ఉంటే భార్యకు అనారోగ్యం, ఆపద కలుగుతాయి. శని మిథునంలో ఉంటే ఆర్థిక సమస్యలు, కుటుంబ సమస్యలు ఏర్పడతాయి.

**పరిహారక్రియలు :-**

- ప్రతిరోజు హనుమంతుని దేవాలయాన్ని దర్శించండి.
- సింధూరాన్ని బొట్టుగా ధరించండి.
- హనుమాన్ చాలీసా చదవండి.

## 2. సింహంలో చంద్రుడు ఉంటే :-

సింహంలో చంద్రుడు ఉంటే జాతకుడు దయ కలిగినవాడు, నిజాయితీ పరుడు. సత్యమును పలుకువాడు. పరోపకారి. దీర్ఘాయుర్దాయము కలవాడు. కుటుంబ సుఖము పొందువాడు. మకరంలో బుధుడు ఉంటే చెల్లెలు, కూతురు, మేనత్త, మరదలకు హాని కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- పెద్దలను గౌరవించండి
- పేదపిల్లలకు శనగ గుగ్గిళ్ళు పంచండి.

## 3. సింహంలో కుజుడు ఉంటే :-

సింహంలో కుజుడు ఉంటే జాతకుడు అదృష్టవంతుడు. జాతకుని సంతానం అభివృద్ధి చెందుతారు. ఆర్థికంగా వృద్ధి చెందుతారు. కుటుంబంలో సుఖము, శాంతి పెరుగుతాయి. నీచ గ్రహదృష్టి వలన కుజుడు బలహీనుడైతే జాతకునకు అశాంతి కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- ప్రతిరోజు హనుమాన్ చాలీసా చదవండి.
- రాత్రిపూట నిద్రించునపుడు తలవైపున నీటితో నిండిన గ్లాసును ఉంచుకోండి.
- పేదవారికి కందిపప్పు దానం చేయండి.

**4. సింహంలో రాహువు ఉంటే :-**

సింహంలో రాహువు ఉంటే జాతకుడు లోభి. మోసకారి. శని బలహీనుడైతే గర్భస్రావము జరుగుతుంది. జాతకుని వయస్సు 21 సం॥ లేదా 42 సం॥ఉన్నప్పుడు తండ్రికి ప్రమాదము. జాతకుని మొదటి సంతానం అల్పాయుర్దాయము కలిగినది. సంతానం వలన ప్రత్యేకమైన కీర్తి ప్రతిష్ఠలు కలుగవు. చదువుకు ఆటంకాలు కలుగుతాయి. జాతకుని తల్లి బ్రతికున్నంత కాలం, జాతకునికి అన్ని పనులు అనుకూలంగా జరుగుతాయి. ద్వికళత్రయోగం ఉంటుంది.

**పరిహారక్రియలు :-**

- ❖ మద్యం త్రాగకండి. మాంసాహారం మానివేయండి.
- ❖ వెండితో చేసిన వినాయకుడిని రోజు పూజించండి.
- ❖ గడప క్రింద పలుచని వెండిరేకును పూడ్చండి.
- ❖ భార్యాభర్తలు ఇద్దరు కలసి సత్యనారాయణ వ్రతం చేయండి.

**5. సింహంలో గురువు ఉంటే :-**

సింహంలో గురువు ఉంటే జాతకుడు సంఘంలో గుర్తింపు, ప్రభుత్వ అధికారుల అండ కలిగి ఉంటాడు. సంతానం కలిగిన తరువాత జాతకుని ఆస్తి పెరుగుతుంది, శత్రుభయం, మానసిక ఆందోళన కలిగి ఉంటాడు. బుధ, శుక్ర, రాహులలో ఎవరైనా వృషభంలోగాని, ధనస్సులోగాని, కుంభంలోగాని, మీనంలోగాని ఉంటే అధికంగా శ్రమించినా సంపాదన చాలదు. అప్పు చేయవలసి ఉంటుంది. నిజాయితీగా పనిచేస్తున్న శుభఫలితాలు కలుగుతాయి. అప్పుచేయకుండా, శ్రమద్వారా వచ్చిన సొమ్మును మాత్రమే వాడుకుంటే గురుని అనుగ్రహం పొందగలుగుతారు.

**పరిహారక్రియలు :-**

- ❖ చందాలు వసూలు చేయవద్దు.
- ❖ దుర్గాదేవి ఆలయాన్ని దర్శించండి.
- ❖ ప్రతిరోజు ఆవుకు ఆహారం పెట్టండి.
- ❖ నదిలో కొబ్బరికాయను వేయండి.
- ❖ త్రిశక్తి మూర్తులను ప్రతిదినము పూజించండి.

**6. సింహంలో శని ఉంటే :-**

సింహంలో శని ఉంటే, జాతకుడు ఇబ్బందులు పడతాడు. సంతానం ఉంటుంది. సుఖం ఉండదు. సాధారణ జీవితం గడుపుతాడు. గోచారంలో శని

మేషంలోకి ప్రవేశించినపుడు జాతకుని ఆస్తి నష్టమౌతుంది. విష జంతువులు, కీటకాల వలన ప్రమాదం ఉంటుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ చీకటిగదిలో ఇనుపసామాను, మినుములు ఉంచండి.
- ✤ ఇంటిలో ఒకచోట రాగి, వెండి, బంగారంలను పాతిపెట్టండి.
- ✤ అనాథపిల్లలకు, వీధిపిల్లలకు సాల్ట్‌బిస్కట్లు పంచండి.
- ✤ బడి పిల్లలకు పుస్తకాలు పంచండి. లేదా పేదపిల్లవాడిని చదివించండి.

**7. సింహంలో బుధుడు ఉంటే :-**

సింహంలో బుధుడు ఉంటే జాతకుడు ధనవంతుడు అవుతాడు. అతనికి సంఘంలో గౌరవం ఉంటుంది. సంతానం అభివృద్ధి చెందుతుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ వెండి ఉంగరం లేదా వెండి గొలుసు ధరించండి.
- ✤ సోమవారం పేదలకు అన్నదానం చేయండి.
- ✤ బుధవారం ఉడికించిన గోధుమరవ్వ, బెల్లం కలిపి పేదపిల్లలకు పెట్టండి.

**8. సింహంలో కేతువు ఉంటే :-**

సింహంలో కేతువు ఉంటే జాతకుడు బాల్యంలో కష్టాలు పడతాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రవహించే నదిలో పాలుపోయండి.
- ✤ నుదుటిపై కుంకుమ ధరించండి.
- ✤ దక్షిణామూర్తికి శనగలు సమర్పించండి.
- ✤ బ్రహ్మంగారికి చక్రపొంగలి ప్రసాదంగా ఇవ్వండి.

**9. సింహంలో శుక్రుడు ఉంటే :-**

సింహంలో శుక్రుడు ఉంటే జాతకుడు తెలివైనవాడు. వ్యాపారంలో లాభం పొందుతాడు. కుటుంబసుఖం కలవాడు. సంఘంలో గుర్తింపు కలవాడు. వివాహమయిన తరువాత అతనికి వ్యాపారంలోగాని, ఉద్యోగంలోగాని అభివృద్ధి కలుగుతుంది. పరస్త్రీ సంపర్కం ఉంటుంది. భార్య గుణవంతురాలు.

**పరిహారక్రియలు :-**

- ✤ సోమవారం నాడు శివునికి అభిషేకం చేయండి.
- ✤ పిల్లలకు పాలు పంచండి.
- ✤ వెండి ఉంగరం ధరించండి.
- ✤ ఆవుకు అన్నం పెట్టండి.

# కన్యరాశిలో నవగ్రహాలు - పరిహారాలు

**1. కన్యలో రవి ఉంటే :-**

కన్యలో రవి ఉంటే జాతకుడు విధిని నమ్ముతాడు. ఎక్కువగా కోర్టుల చుట్టు తిరుగుతాడు. ప్రభుత్వం చేత బాధలు పడతాడు. స్వల్ప ఆదాయంతో ఇబ్బంది పడతాడు. ఏపని సక్రమంగా నెరవేరదు. కన్యలో రవి ఉంటే జాతకుడు జీవితం ఒకసారయినా పతనమవుతాడు. ఈ జాతకుని స్థితి, ఇతని తండ్రి స్థితి, మేనమామ స్థితి ఉన్నతంగా ఉండదు. ఇతనికి పుత్రజననం కలిగిన తరువాత స్థితి మారుతుంది. 12వ స్థానంలో శని ఉండిన భార్యకు మరణభయం 10వ స్థానమున కుజుడు ఉండిన కుమారులకు మరణభయం.

**పరిహారక్రియలు :-**

- ప్రతిరోజు దేవాలయానికి వెళ్ళి, అచటి పేదలకు ఆర్థికసాయం చేయండి.
- జాతకుడు ఎల్లప్పుడు వెండి ఉంగరం లేదా వెండి గొలుసును ధరించాలి.
- రాత్రిపూట నిద్రించునపుడు ఒక చెంబునిండా నీరుపోసి, తన తలవైపు ఉంచుకోండి.
- ఇంటిలో నదీజలమున్న పాత్రను ఉంచండి.

**2. కన్యలో చంద్రుడు ఉంటే :-**

కన్యలో చంద్రుడు ఉంటే జాతకుడు దయ కలవాడు. ఆచారములు పాటించువాడు. దీర్ఘాయుర్దాయము కలవాడు. సుఖవంతమైన జీవితం గడుపువాడు. గురువు కన్యలో ఉంటే జాతకుడు పేద కుటుంబంలో పుట్టినా, ధనవంతుడు అవుతాడు. కర్కాటకంలో రాహువు కాని, కేతువుకాని ఉంటే లేదా సింహంలో బుధుడు ఉంటే ఇబ్బందులు కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- పేదపిల్లలకు పాలు ఇవ్వండి.
- పుట్టలో పాలు పోయండి.
- ఆవుకు ఆహారం పెట్టండి.

**3. కన్యలో కుజుడు ఉంటే :-**

కన్యలో కుజుడు ఉంటే జాతకుడు కళాప్రియుడు. జాతకుని సోదరుడు, తల్లి, మేనమామ ఇబ్బందులను ఎదుర్కొంటారు.

పరిహారక్రియలు :-

* ప్రతిదినము విష్ణునామజపం చేయండి.
* ఆంజనేయస్వామి దేవాలయముకు అప్పాలు ప్రసాదంగా చేయించి ఇవ్వండి.
* దుర్గాదేవి ఆలయముకు మినపప్పు ఇవ్వండి.

**4. కన్యలో రాహువు ఉంటే :-**

కన్యలో రాహువు ఉంటే జాతకుడు తెలివైనవాడు, ధైర్యవంతుడు. ఇతరులను రక్షించు స్వభావం కలవాడు. మీనంలో రవి, శుక్ర, బుధులలో ఒకరు ఉంటే జాతకుడు విదేశాలకు వెళ్ళే అవకాశం ఉన్నది. మీనంలో కుజుడు ఉంటే ధననష్టం, కుటుంబంలో కలహాలు ఏర్పడతాయి.

పరిహారక్రియలు :-

* ప్రతిరోజు సరస్వతీ స్తోత్రం చేయండి.
* బడిపిల్లలకు పుస్తకాలు పంచండి.
* గోధుమరంగు కుక్కను (బ్రౌన్‌రంగు కుక్క) పెంచండి.
* నల్లని గాజుతో చేసిన బంతిని మీవద్ద ఉంచుకోండి.

**5. కన్యలో గురువు ఉంటే :-**

కన్యలో గురువు ఉంటే జాతకుడు సాధారణజీవితం గడుపుతాడు. ధనవంతుడు కాకపోయినా ఆర్థిక ఇబ్బందులు ఉండవు. కాని కేతువు బలహీనుడైతే జాతకుడు భిక్షగాడితో సమానంగా జీవిస్తాడు. బుధుడు బలహీనుడైతే చెల్లెలు, చెల్లెలి కుటుంబం సమస్యలతో బాధపడతారు.

పరిహారక్రియలు :-

* తల్లిదండ్రులు తనతోపాటు ఉండునట్లుగా చూడండి.
* మేనల్లుడు లేదా మేనకోడలును ఆదరించండి.
* ప్రతిదినము నుదుటిపై కుంకుమను ధరించండి.
* సాయిబాబా సంకీర్తనలో పాల్గొనండి.
* బంగారు ఉంగరం లేదా బంగారపు గొలుసు ధరించండి.
* సింహద్వారము యొక్క గడపకు పసుపు పూయండి.

**6. కన్యలో శని ఉంటే :-**

కన్యలో శని ఉంటే జాతకుడు, ఉచ్ఛస్థితిలోని కేతువు వలన ఆటగాడిగా పేరు తెచ్చుకుంటాడు. 28 సం॥ తరువాతనే వివాహం చేసుకొనుట శుభము.

సోదరులతో, పుత్రులతో సఖ్యత తక్కువ. జాతకుని వృద్ధాప్యంలో కుమారులు మేలుచేస్తారు. గోచారంలో శని మేషం నుండి 2,7,9,12 రాశులలోకి వచ్చినపుడు శుభము కలుగుతుంది. వ్యాపారం, ఉద్యోగంలలో ఆటంకాలు కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- ప్రతిదినము దుర్గాదేవి స్తోత్రం చేయండి.
- దుర్గాదేవి ఆలయాన్ని దర్శించండి.
- చిన్న పిల్లలకు పెసరపప్పు గుగ్గిళ్ళు పంచండి.
- ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి.
- కుక్కను పెంచండి.
- అనాథపిల్లలకు చెప్పులు ఇవ్వండి.
- ఏదైనా క్రొత్తవ్యాపారము ప్రారంభించుటకు కృష్ణపక్షపు రాత్రులను ఎంచుకోండి.
- నాగేంద్రస్వామి పుట్టలో పాలు పోయండి.

**7. కన్యలో బుధుడు ఉంటే :-**

కన్యలో బుధుడు ఉంటే జాతకుడు అదృష్టవంతుడు. అనుకున్న పనులను నెరవేర్చుకుంటాడు. వ్యాపారంలో లాభమును పొందుతాడు. ధనము సంపాదిస్తాడు. వ్యవసాయం కూడ లాభిస్తుంది. పేపరుకు సంబంధించిన వ్యాపారములో అధికలాభము వస్తుంది.

**పరిహారక్రియలు :-**

- ఒక సీసాలో ఏదైనా పవిత్రనదీ జలాన్ని నింపి, దానిని పొలం లేదా భూమిలో పాతండి.
- భార్య ఎడమచేతికి వెండి ఉంగరం ధరింపచేయండి.
- ప్రతిరోజు దుర్గాసప్తశతిని చదవండి.

**8. కన్యలో కేతువు ఉంటే :-**

కన్యలో కేతువు ఉంటే జాతకుడు బాల్యంలో బాధలు పడతాడు. కేతుదశలో జాతకుడు బాధలు పడతాడు.

**పరిహారక్రియలు :-**

- వినాయకుని గుడికి వెళ్ళండి.
- బ్రహ్మంగారికి పసుపు రంగు వస్త్రం సమర్పించండి.

- పేదలకు శనగగుగ్గిళ్ళు పంచండి.
- బంగారపు ఉంగరం ధరించండి. లేదా చెవులకు బంగారు రింగులు ధరించండి.
- కుంకుమపువ్వు కలిపిన పాలు త్రాగండి.

**9. కన్యలో శుక్రుడు ఉంటే :-**

కన్యలో శుక్రుడు ఉంటే జాతకుడు ఆరోగ్యవంతుడు. స్త్రీలను ఆకర్షించు రూపము కలవాడు. స్త్రీసుఖము తక్కువ. వివాహం ఆలస్యంగా జరుగుతుంది. స్త్రీ సంతానం ఉంటుంది. ప్రేమకోసం ఏపనిఅయినా చేయుటకు సిద్ధపడతాడు. తగాదాలలో పాల్గొంటాడు. శుక్రుడు అనుకూలుడైతే అధికంగా ధనాన్ని సంపాదిస్తాడు. శుక్రుని అనుకూలతలేకపోతే కుమారులు ఉండరు. జాతకునకు ఆలోచన తక్కువ.

**పరిహారక్రియలు :-**

- వెండి ఉంగరం ధరించండి.
- ఆవుకు అన్నం పెట్టండి.
- ఆవును పెంచండి.
- పేదలకు దానం చేయండి.
- దేవాలయముకు ఆవునెయ్యి సమర్పించండి.

## తులారాశిలో నవగ్రహాలు - పరిహారాలు

**1. తులలో రవి ఉంటే :-**

తులలో రవి ఉంటే జాతకునకు కుటుంబసౌఖ్యము తక్కువ. అతని భార్య అనారోగ్యంతో బాధపడుతూ ఉంటుంది. పూర్వీకుల ఆస్తి కూడ హరించుకు పోతుంది. శ్రమపడినా ఫలితం తక్కువగా ఉంటుంది. జాతకుడు కుటుంబాన్ని వదలి సన్యాసం తీసుకొనే అవకాశం ఉంది. శుక్రుడు మేషంలోకి వచ్చినపుడు అశాంతి, అనారోగ్యం కలుగుతుంది. బుధుడు ధనస్సులో ఉంటే పిల్లల అభివృద్ధి కుంటుపడుతుంది.

**పరిహారక్రియలు :-**

- ఏ పని అయినా చేయబోయేముందు ఒక గ్లాసు నీరు త్రాగండి.
- నల్లని ఆవును పెంచండి.
- ఘనాకారపు రాగిముక్కలను భూమిలో పాతండి.

**2. తులలో చంద్రుడు ఉంటే :-**

తులలో చంద్రుడు ఉంటే జాతకునికి ధనము, రత్నాలు, పశువులు, ధాన్యము లభించును. అత్తాకోడళ్ళమధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడి, అశాంతి కలుగుతుంది. కుమారుడు దూరమవుతాడు.

**పరిహారక్రియలు :-**

- పాల వ్యాపారం చేయవద్దు.
- తల్లిని పూజించండి. ఆమెతో వైరం వద్దు.
- జాతకుడు పాలకు సంబంధించిన ఉత్పత్తులు కాని, పాలతో తయారగు పిండివంటలను గాని తయారు చేయరాదు.
- వయస్సు 24 సం॥ దాటిన తరువాత వివాహం చేసుకోండి.

**3. తులలో కుజుడు ఉంటే :-**

తులలో కుజుడు ఉంటే జాతకుడు అనుకున్న పనులు నెరవేరును. ధనము, సుఖము లభించును. రవి, శని శత్రుస్థానాలలో ఉంటే మరదలు, పిన్ని సమస్యలను ఎదుర్కొంటారు.

**పరిహారక్రియలు :-**

- శనిజపం చేయండి.
- ఇంటిలో వెండిని ఉంచండి.
- ఆడపిల్లలకు స్వీట్లు పంచండి.
- అయ్యప్పస్వామి భజనలో పాల్గొనండి.

**4. తులలో రాహువు ఉంటే :-**

తులలో రాహువు ఉంటే జాతకుడు ఉన్నతస్థాయిలో ఉంటాడు. కాని ఆర్థిక ఇబ్బందులు ఏర్పడలాయి. కుటుంబ సుఖము తక్కువ. కాని జాతకుని మిత్రులు మాత్రం జాతకుని సహకారంతో ఆనందంగా ఉంటారు.

**పరిహారక్రియలు :-**

- శనివారం రోజున ప్రవహించేనదిలో ఒక కొబ్బరికాయను వేయండి.
- వెండి ఉంగరం లేదా వెండి గొలుసును ధరించండి.
- విష్ణు సహస్రనామసంకీర్తన చేయండి.

**5. తులలో గురువు ఉంటే :-**

తులలో గురువు ఉంటే జాతకుడు దైవభక్తి పరాయణుడు. మంచిప్రవర్తన కలవాడు. అయితే కుటుంబబాధ్యతల నుండి తప్పుకొనే స్వభావం కలవాడు.

భార్యను గౌరవించువాడు. భార్యమాట వినకపోతే, జాతకునికి మనశ్శాంతి ఉండదు. ఎక్కువగా సన్యాసులతో, ఆధ్యాత్మికవాదులతో కలసి తిరుగుతాడు. జాతకునికి శరీర సౌఖ్యము తక్కువ.

**పరిహారక్రియలు :-**

- ఇంటి ఆవరణలో గుడిఉంటే, దానిని తొలగించాలి.
- జాతకుడు సన్యాసులతో తిరుగుట మానివేయాలి.
- జాతకుడు కుటుంబ విషయాలపై దృష్టి పెట్టాలి.
- పరస్త్రీలతో అనుబంధాలు పెంచుకోవద్దు.

**6. తులలో శని ఉంటే :-**

తులలో శని ఉంటే జాతకుడు తెలివైనవాడు. వివేకవంతుడు మంత్రవిద్య తెలిసినవాడు. భార్య, పిల్లలు, మిత్రులచేత ఇబ్బందులు పడతాడు. జాతకుడు పుట్టుకతో పేదవాడయినా 35 సంవత్సరముల వయస్సులో స్వార్జితంతో ధనవంతుడు అవుతాడు. గోచారంలో శని సింహంలోగాని, తులలోగాని ప్రవేశించిన జాతకుడు అనారోగ్యం పాలవుతాడు. మేషంలో బుధుడు ఉంటే తలపై దెబ్బవలన జాతకుడు మరణిస్తాడు. నీచస్త్రీ సంబంధం కలిగి ఉంటాడు.

**పరిహారక్రియలు :-**

- నల్లనిఆవును పెంచండి.
- శనిజపం చేయండి.
- పేదపిల్లలకు సున్నుండలు పంచండి.
- ప్రతిదినం శివాలయంకు వెళ్ళండి.
- లక్ష్మీదేవి ఆలయానికి మినుములు ఇవ్వండి.

**7. తులలో బుధుడు ఉంటే :-**

తులలో బుధుడు ఉంటే జాతకుడు బంధువులు, స్నేహితులు అభివృద్ధి చెందుతారు. జాతకుడు మాత్రం శ్రమకు తగ్గ ఫలితం పొందలేడు. జాతకుడు విద్యావంతుడు. రచయిత, స్త్రీ జనాకర్షణ కలవాడు. వాగ్దానాలు చేస్తాడు. ఆర్థిక సంబంధమైన విషయాలలో ఆలోచించి, ఆ విషయంలో ముందుకు సాగాలి.

**పరిహారక్రియలు :-**

- వ్యాపారంలో భాగస్వామ్యం పనికిరాదు.
- స్త్రీలకు దూరంగా ఉండండి.
- దుర్గాపూజ చేయండి.
- పిల్లలకు స్వీట్లు పంచండి.

8. తులలో కేతువు ఉంటే :-

తులలో కేతువు ఉంటే జాతకుడు బాల్యంలో తరచు అనారోగ్యం పొందుతాడు. వాగ్దానాలు చేస్తాడు. ధనం సంపాదిస్తాడు.

పరిహారక్రియలు :-

- ❖ దక్షిణామూర్తికి పసుపువస్త్రం సమర్పించండి.
- ❖ సాయిబాబాగుడికి శనగలు ప్రసాదంగా సమర్పించండి.
- ❖ పేదలకు అరటిపళ్ళు పంచండి.

9. తులలో శుక్రుడు ఉంటే :-

తులలో శుక్రుడు ఉంటే జాతకుడు ధనము, సుఖము, వాహనములను పొందుతాడు. కుటుంబంలో అందరు కలసిమెలసి ఆనందంగా జీవిస్తారు. టెంట్‌హౌస్, బ్యూటీపార్లర్, పూలకొట్టు మొదలైన వ్యాపారాలు లాభిస్తాయి. పరస్త్రీ పరిచయం ఉంటుంది. బంధువులు, స్నేహితులు కోసం ధనమును వ్యయము చేస్తాడు.

పరిహారక్రియలు :-

- ❖ పెద్దలను గౌరవించండి.
- ❖ ఎర్రని ఆవును పెంచండి.
- ❖ నీలిరంగు పూలను డ్రెయిన్‌లో వేయండి.
- ❖ నీలిరంగు వస్త్రాలను వాడవద్దు.
- ❖ పిల్లలకు పటికబెల్లం పంచిపెట్టండి.
- ❖ లక్ష్మీదేవి ఆలయానికి ఇత్తడిదీపపుసెమ్మెలు ఇవ్వండి.

## వృశ్చికరాశిలో నవగ్రహాలు - పరిహారాలు

1. వృశ్చికంలో రవి ఉంటే :-

వృశ్చికంలో రవి ఉంటే, జాతకుడు స్త్రీలను ఆకర్షిస్తాడు. తొందరపాటు స్వభావం కలవాడు. ఓర్పులేనివాడు. కోర్టుతగాదాలు ఎక్కువ. ఆరోగ్యం తక్కువ. ఆర్థికసమస్యలు ఉంటాయి. సోదరి ఇంటిలోగాని, తోడల్లుళ్ళ ఇంటిలోగాని నివసించకూడదు.

వృశ్చికంలో రవి ఉన్న జాతకుడు చనిపోబోయే రోగి ప్రక్కనగాని చనిపోయిన రోగి ప్రక్కనగాని కూర్చొనరాదు.

**పరిహారక్రియలు :-**

- ఏపని అయినా ప్రారంభించబోయేముందు జాతకుడు కొంచెం బెల్లం తిని, నీటిని త్రాగాలి.
- నల్లని లేదా గోధుమరంగు గల ఆవును పెంచండి.
- ఒక ఆదివారం నుండి తరువాత ఆదివారం వరకు ప్రతిరోజు గోధుమలు, బెల్లంలను దేవాలయానికి ఇవ్వండి.

**2. వృశ్చికంలో చంద్రుడు ఉంటే :-**

వృశ్చికంలో చంద్రుడు ఉంటే జాతకుడు అనారోగ్యంతో బాధపడతాడు. చెడు అలవాట్లకు బానిసయిన, జాతకుని కూతురు ప్రమాదానికి గురి అవుతుంది.

**పరిహారక్రియలు :-**

- తల్లిదండ్రులను గౌరవించండి.
- ప్రతిదినము ఇంటిలోని పెద్దవారికి పాదనమస్కారం చేయండి.
- నగల వ్యాపారం చేయకండి.
- శనగ గుగ్గిళ్ళు చేసి పేదవారికి పంచండి.

**3. వృశ్చికంలో కుజుడు ఉంటే :-**

వృశ్చికంలో కుజుడు ఉంటే జాతకుని తమ్ముళ్ళు ఇబ్బందులు పడతారు. అన్నదమ్ముల మధ్య సఖ్యత తక్కువగా ఉంటుంది.

**పరిహారక్రియలు :-**

- బియ్యం, బెల్లంతో చక్రపొంగలి చేసి, దేవాలయంలో ప్రసాదంగా ఇవ్వండి.
- మురికివాడలలో పిల్లలకు శనగగుగ్గిళ్ళు పెట్టండి.
- కుక్కకు చపాతీలు పెట్టండి.
- ఒక కుండలో బెల్లం ఉంచి, దానిని స్మశానానికి దగ్గర భూమిలో పాతండి.

**4. వృశ్చికంలో రాహువు ఉంటే :-**

వృశ్చికంలో రాహువు ఉంటే జాతకుడు ధైర్యవంతుడు. అనవసర విషయాలకు ధనాన్ని, సమయాన్ని వెచ్చిస్తాడు. జాతకుడు పైల్స్ వ్యాధితో లేదా జీర్ణక్రియకు సంబంధించిన అనారోగ్యంతో బాధపడతాడు. మిత్రులు దూరమవుతారు.

జాతకుడు ఏ ఉద్యోగంలోను స్థిరంగా ఉండడు. ఇతని జీవనయానం మిట్టపల్లాలలో సాగుతుంది. ప్రమాదాలకు గురి అయ్యే అవకాశం ఉన్నది.

**పరిహారక్రియలు :-**

- వెండిబిళ్ళపై సరస్వతీదేవిని ముద్రించి, దానిని ధరించండి.
- ప్రతిరోజు దేవాలయానికి వెళ్ళి, అచటి భిక్షగాళ్ళకు దానం చేయండి. ఇలా వరుసగా 43 రోజులు చేయండి.
- నిప్పులలో రాగి నాణెమును వేయండి.

**5. వృశ్చికంలో గురువు ఉంటే :-**

వృశ్చికంలో గురువు ఉంటే జాతకుడు దైవభక్తి కలవాడు. అల్పాయుర్దాయం కలవాడు. జాతకుడు దీర్ఘాయుష్మంతుడైన అతని తండ్రి లేదా తాత అనారోగ్యంతో బాధలు పడతాడు. జాతకుడు ప్రమాదవశాత్తు మరణిస్తాడు. గురువు బలవంతుడైన జాతకుడు సంఘంలో గుర్తింపు, ఆస్తి పొందుతాడు. గురువు బలహీనుడైతే, జాతకుడు తరచు అనారోగ్యం పొందుతాడు. అప్పుడప్పుడు అవమానాలు కలుగుతాయి. కుమారుడు బాధలు పడుతుంటాడు.

**పరిహారక్రియలు :-**

- ఇంటిలో గుడి ఉంటే, దానిని తొలగించండి.
- బావిలో కొబ్బరికాయ వేయండి.
- స్మశానంలో రావిచెట్టును పాతండి.
- బుధుడు ధనస్సులో ఉంటే జాతకుడు తనవద్ద ఇనుపగోళీ ఉంచుకోవాలి.
- బుధుడు కుంభంలో ఉంటే జాతకుడు స్టీలుతో చేసిన ఉంగరం ధరించాలి.
- బుధుడు మీనంలో ఉంటే జాతకుడు తెల్లనిదారం చుట్టిన రాగి నాణెమును తనవద్ద ఉంచుకోవాలి.

**6. వృశ్చికంలో శని ఉంటే :-**

వృశ్చికంలో శని ఉంటే జాతకుడు ఆయుర్దాయం కలవాడు. అయితే తండ్రి ప్రేమ స్వల్పం. కుటుంబంలో సమస్యలుంటాయి. బలహీనమైన రాహువు వలన ప్రమాదాలు జరగవచ్చు. మీనంలో ఏ గ్రహము లేకపోతే జాతకుడు జీవితాంతం ఆర్థిక ఇబ్బందులతో బాధపడతాడు.

**పరిహారక్రియలు :-**

- ప్రతిదినము శివాలయముకు వెళ్ళండి.
- ప్రతిసోమవారం శివునికి అభిషేకం చేయండి. వరుసగా 8 వారాలు చేయండి.

- వెండిని ధరించండి.
- అన్నదానం చేయండి.
- పేదపిల్లలకు పాలు దానం పంచండి.

**7. వృశ్చికంలో బుధుడు ఉంటే :-**

వృశ్చికంలో బుధుడు ఉంటే జాతకుడు తరచు అనారోగ్యం పొందుతాడు. వ్యాపారంలో నష్టం వస్తుంది. ఆర్థిక సమస్యలు కలుగుతాయి. దంతములు, నరములకు సంబంధించిన వ్యాధులు కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- ప్రతిదినం శివాలయంకు వెళ్ళండి.
- అనాథపిల్లలకు సున్నుండలు పంచండి.
- ఒక మట్టిపాత్రలో బెల్లం, తేనె ఉంచి, దానిని ఊరిబయట ఖాళీ ప్రదేశంలో పాతిపెట్టండి.
- ఒక రాగిపాత్రలో పెసలు ఉంచి, దానిని నదిలో వదలండి.
- ప్రతిదినం పంచాక్షరి జపించండి.
- దుర్గగుడికి మినుములు ఇవ్వండి.

**8. వృశ్చికంలో కేతువు ఉంటే :-**

వృశ్చికంలో కేతువు ఉంటే జాతకునికి కష్టాలు కలుగుతాయి. కుటుంబసుఖం తక్కువ. భార్యవలన, సంతానం వలన బాధలు కలుగుతాయి.

పరిహారక్రియలు :-

- బ్రహ్మంగారి గుడికి పసుపురంగు వస్త్రాన్ని ఇవ్వండి.
- బంగారు ఉంగరం లేదా బంగారు చెవిపోగులు ధరించండి.
- బ్రౌన్ రంగు తివాచీని గణపతి దేవాలయముకు సమర్పించండి.
- నుదుటిపై కుంకుమ ధరించండి.
- ప్రతిదినము వినాయకుడిని బంతిపూలతో లేదా పసుపురంగు పూలతో పూజించండి.

**9. వృశ్చికంలో శుక్రుడు ఉంటే :-**

వృశ్చికంలో శుక్రుడు ఉంటే జాతకుడు సంపాదిస్తున్నా అప్పులు చేయక తప్పదు. పరుషంగా మాట్లాడును. అనారోగ్యం పొందుతాడు. నీచస్త్రీలతో సంబంధం ఉంటుంది.

పరిహారక్రియలు :-

- ❖ నల్లని ఆవును పెంచండి.
- ❖ సోమవారం పేదవారికి అన్నదానం చేయండి.
- ❖ ప్రతిదినం సింధూరం బొట్టుగా పెట్టుకోండి.
- ❖ మంగళవారం సుబ్రహ్మణ్యస్వామికి దీపారాధన చేయండి.
- ❖ పేదపిల్లలకు గోధుమరొట్టెలు, బెల్లం పంచండి.

## ధనస్సురాశిలో నవగ్రహాలు - పరిహారాలు

**1. ధనస్సులో రవి ఉంటే :-**

ధనస్సులో రవి ఉంటే జాతకుడు దయగలవాడు. పరోపకారి. ఉమ్మడి కుటుంబమును కష్టపడి వృద్ధిలోకి తెస్తాడు. ఒకవిధంగా అతని జీవితం అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ముల వృద్ధికి, తన కుటుంబం అభివృద్ధికి అంకితమై పోతుంది. 22 సం॥ వయస్సు వచ్చిన తరువాత జాతకుడు సంఘంలో గుర్తింపు, ప్రభుత్వ అధికారుల ఆదరణ పొందుతాడు. కాని సోదరుల ప్రవర్తన అతనిని బాధిస్తుంది.

జాతకుడు ఆలోచించకుండా తొందరపడితే నష్టపోతాడు.

పరిహారక్రియలు :-

- ❖ అవసరమైన వారికి బియ్యం లేదా పాలు దానం చేయండి.
- ❖ పేదపిల్లకు వెండి ఉంగరం లేదా వెండి గొలుసు ఇవ్వండి.

**2. ధనుస్సులో చంద్రుడు ఉంటే :-**

ధనస్సులో చంద్రుడు ఉంటే జాతకుడు దీర్ఘాయుర్దాయము కలవాడు. వృషభము, కర్కాటకములలో ఏ గ్రహము లేకపోతే జాతకుడు ఆస్తిని సంపాదిస్తాడు. వాహనములను కొంటాడు. శని నీచదృష్టిని కలిగి ఉంటే జాతకునకు ఇబ్బందులు కలుగుతాయి. ఇతరస్త్రీలతో సంబంధం కలిగి ఉంటాడు. ధననష్టం కలుగుతుంది.

పరిహారక్రియలు :-

- ❖ ప్రతిదినము శివాలయమును దర్శించండి.
- ❖ ఇంటిలో బావిని తవ్వించండి. లేదా ఒక కుండనిండా ప్రతిదినము బావిలో నీరు లేదా నదిలో నీరు పోసి, ఆ నీటి కుండను ఇంటిలో ఉంచండి.
- ❖ పరస్త్రీలకు దూరంగా ఉండండి.
- ❖ సోదరుని ఇంటిని కొనకండి.

- ఇనుముకు సంబంధించిన వస్తువుల వ్యాపారం చేయకండి.
- కారు, లారీ, ఆటో, మిషనరీ మొదలైన వాటిని కొనకండి.
- నూనెలు, మాంసములను మీరు కొనకండి.

**3. ధనస్సులో కుజుడు ఉంటే :-**

ధనస్సులో కుజుడు ఉంటే జాతకుడు పెద్దవారి అండతో సుఖవంతమైన జీవితం గడుపుతాడు. ఆచారాలు పాటించకపోతే దురదృష్టవంతుడగును.

**పరిహారక్రియలు :-**

- దేవాలయం హుండీలో ధనం వేయండి.
- పేదవారికి బియ్యం దానం చేయండి.
- ప్రాచీన సంప్రదాయాల్ని, ఆచారాలను పాటించండి.
- ప్రతిదినము సాయిబాబా లేదా బ్రహ్మంగారి గుడికి వెళ్ళండి.

**4. ధనస్సులో రాహువు ఉంటే :-**

ధనస్సులో రాహువు ఉంటే జాతకుడు శ్రమజీవి. కష్టపడి పనిని సాధిస్తాడు. కాని జాతకునికి రావలసిన గుర్తింపు (లేదా) ప్రతిఫలం దక్కదు. కుటుంబంలో అశాంతి ఉంటుంది. ఆర్థిక సమస్యలు ఉంటాయి.

నూనెలు, ఆల్కహాలు, ఇనుముకు సంబంధించిన వ్యాపారములు లాభిస్తాయి. సోదరులతో సఖ్యత, జాతకునకు లాభదాయకం. రాహువు బలహీనంగా ఉంటే గర్భస్రావం జరుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- తప్పనిసరిగా ఇంటిలో కుక్క ఉండాలి.
- ప్రతిదినం నుదుటిపై కుంకుమ ధరించండి.
- బంగారపు ఉంగరం లేదా గొలుసును ధరించండి.
- తరచు కుటుంబ సభ్యులతో గడపటానికి సమయాన్ని కేటాయించండి.

**5. ధనస్సులో గురువు ఉంటే :-**

ధనస్సులో గురువు ఉంటే జాతకుడు ధనవంతుడు. అతని కుటుంబము పేరు, ప్రఖ్యాతులు కలది. జాతకుని పిల్లలు కూడ సంతోషంగా జీవిస్తారు. అనుకున్న పనులను నెరవేరుస్తాడు. వ్యాపారంలో లాభం వస్తుంది. తన కుటుంబానికి తగిన వారసుడు అని అతని కుటుంబసన్నిహితులు అతన్ని కీర్తిస్తారు.

గురువు బలహీనపడితే జాతకుడు పేదవాడు. కార్యహాని కలుగుతుంది. పెద్దవారి అండ ఉండదు. కుమారునకు దూరమౌతాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిదినము సాయిబాబా గుడికివెళ్ళి, ప్రసాదము సమర్పించి, దానిలో కొంతభాగము ఇంటికి తీసుకొని వెళ్ళండి.
- ✤ వెండితో చేసిన ముక్కుపుడక ధరించండి.
- ✤ వెండి ఉంగరంలో కెంపును అమర్చి, దానిని ధరించండి.
- ✤ ముత్యమును వెండి ఉంగరంలో అమర్చి, దానిని ధరించండి.
- ✤ కొబ్బరికాయను నదిలో వేయండి.
- ✤ శివలింగముకు అభిషేకం చేయించండి.
- ✤ మెడలో షణ్ముఖరుద్రాక్షను ధరించండి.

**6. ధనస్సులో శని ఉంటే :-**

ధనస్సులో శని ఉంటే జాతకుడు ధనము, కీర్తి, సుఖము సంపాదిస్తాడు. సోదరుల సహకారము పొందుతాడు. ఆలస్యంగా సంతానాన్ని పొందుతాడు. 36-60 సంవత్సరాల మధ్య జాతకుడు సంఘంలో అత్యధిక గౌరవాన్ని పొందుతాడు. వృషభంలో ఏ గ్రహము లేకపోతే ఆర్థిక నష్టం కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ పేదపిల్లలకు శనగ గుగ్గిళ్ళు పంచండి.
- ✤ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర చదవండి.
- ✤ బంగారపు ఉంగరం లేదా బంగారపు గొలుసు ధరించండి.
- ✤ ఇంటిమీద గడ్డి లేదా కలప లేకుండా చూడండి.
- ✤ ప్రతిదినము రావిచెట్టుకు నీరుపోయండి. ఈ విధంగా కనీసం 44 రోజులు చేయండి.

**7. ధనస్సులో బుధుడు ఉంటే :-**

ధనస్సులో బుధుడు ఉంటే జాతకుడు తెలివైనవాడు. కాని ఆర్థిక సమస్యలతో బాధపడతాడు. అపనిందలకు గురి అవుతాడు. మనశ్శాంతిని కోల్పోతాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ పచ్చరంగు వస్త్రాలను చెల్లెలుకు కాని, అత్తయ్యకు కాని బహుమతిగా ఇవ్వండి.
- ✤ బ్రహ్మంగారి గుడికి లేదా సాయిబాబా గుడికి ఆకుపచ్చని వస్త్రాన్ని ఇవ్వండి.

- సోమవారం పేదలకు అన్నదానం చేయండి.
- ప్రతిదినము శివనామస్మరణ చేయండి.
- పసుపురంగు టోపీ లేదా రుమాలు లేదా వస్త్రమును ఎల్లప్పుడు ధరించండి.
- ఒక ఇనుపగోళీకి, రెడ్ ఆక్సైడ్ పూసి, దానిని మీవద్ద ఉంచుకోండి.
- వెండి ఉంగరం ధరించండి.
- పేదపిల్లలకు శనగగుగ్గిళ్ళు పంచండి.

**8. ధనస్సులో కేతువు ఉంటే :-**

ధనస్సులో కేతువు ఉంటే జాతకుడు దైవభక్తిపరుడు. ఆధ్యాత్మిక చింతన కలవాడు. కోపం కలవాడు. నిశ్చలమైన మనస్సు కలవాడు. అనారోగ్యం కలుగుతుంది. తండ్రికి సాయపడతాడు.

**పరిహారక్రియలు :-**

- కుక్కలను పెంచండి.
- పెద్దలను గౌరవించండి.
- మీ గురువును సన్మానించండి.
- సాయిబాబా గుడికి వేయించిన శనగలు ప్రసాదంగా ఇవ్వండి.

**9. ధనస్సులో శుక్రుడు ఉంటే :-**

ధనస్సులో శుక్రుడు ఉంటే జాతకునకు ఆర్థిక సమస్యలు ఉండవు. స్వార్జితం ఉంటుంది. కుజుడు అనుకూలుడు కాకపోతే, ఆస్తినష్టం కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- తెల్లని వస్త్రం ధరించవద్దు.
- ప్రతిరోజు సింధూరంను బొట్టుగా పెట్టుకోండి.
- ఇంటిలో వెండిని పాతిపెట్టండి.
- ప్రతిరోజు హనుమాన్ చాలీసా చదవండి.

## మకరరాశిలో నవగ్రహాలు - పరిహారాలు

**1. మకరంలో రవి ఉంటే :-**

మకరంలో రవి ఉంటే జాతకుడు ధనము, వాహనము, సేవకులు, కీర్తి కలిగి ఉంటాడు. అయితే జాతకుడు అనుమానించే గుణాన్ని కలిగి ఉంటాడు. శుక్రుడు కర్కాటకంలో ఉంటే తండ్రి, సింహంలో ఉంటే తల్లి అనారోగ్యం

పొందుతారు. రవి, శని నీచదృష్టిని కలిగియుంటే ఆర్థికనష్టం, తండ్రికి దూరంగా జీవించడం జరుగుతుంది. శుక్రుడు కర్కాటకంలో ఉంటే జాతకుని బాల్యదశలోనే తండ్రి ప్రాణాలకు ప్రమాదం కలుగుతుంది. చంద్రుడు సింహంలో ఉంటే జాతకుడు అల్పాయుష్మంతుడు.

**పరిహారక్రియలు :-**

- ఎల్లప్పుడు నల్లని దుస్తులు ధరించండి. లేదా నీలిరంగు దుస్తులు ధరించండి.
- తలకు తెల్లని టోపీ పెట్టుకోండి.
- రాగినాణెములు లేక రాగిముక్కలను నదిలో వేయండి.

**2. మకరంలో చంద్రుడు ఉంటే :-**

మకరంలో చంద్రుడు ఉంటే జాతకుడు గుణవంతుడు. సాధారణంగా ఎవరితోను వైరం పెంచుకొనడు. స్థూలశరీరం కలవాడు. అయితే వికారరూపం ఉండదు. దీర్ఘాయుర్దాయం కలవాడు. ఆనందకరమైన జీవితం గడుపుతాడు. ధనము, సుఖము, శాంతి లభిస్తాయి. శుక్ర, శనులు అనుకూలంగా లేకపోతే నీచకార్యాలకు ధనాన్ని వ్యయం చేస్తాడు.

**పరిహారక్రియలు :-**

- పుణ్యక్షేత్రాలను దర్శించండి.
- మద్యపానం మానండి. మాంసాహారం తినకండి.
- ఇనుము, నూనె, కారు, మెషినరీ వంటివాటిని మీరు కొనకండి.
- సోదరుని వద్దనుండి దేనినీ కొనకండి.
- పేదపిల్లలకు పటిక బెల్లం పంచండి.

**3. మకరంలో కుజుడు ఉంటే :-**

మకరంలో కుజుడు ఉంటే జాతకుడు అనుకున్న పనులను నెరవేర్చును. మిథునంలో రవి, చంద్ర, గురులలో ఏగ్రహం ఉన్నా జాతకుని ఆస్తి నశిస్తుంది.

**పరిహారక్రియలు :-**

- మంగళవారం సుబ్రహ్మణ్యస్వామిని పూజించండి.
- ప్రతిదినం సింధూరంను ధరించండి.
- బెల్లమును, వెండినాణెమును నదిలో వేయండి.

**4. మకరంలో రాహువు ఉంటే :-**

మకరంలో రాహువు ఉంటే జాతకుని తల్లికి అనారోగ్యము. శని, చంద్రులు కలసి ఉంటే జాతకుడు తగాదాలతో సతమతమౌతాడు.

**పరిహారక్రియలు :-**

- ❖ పిల్లలకు స్వీట్లు పంచండి.
- ❖ ప్రతిదినము శివాలయముకు వెళ్ళండి.
- ❖ చక్రపొంగలి చేయించి ఏదైనా దేవాలయముకు ప్రసాదంగా ఇవ్వండి.
- ❖ బడి పిల్లలకు పుస్తకాలు పంచండి.

**5. మకరంలో గురువు ఉంటే :-**

మకరంలో గురువు ఉంటే జాతకుడు అప్రమత్తంగా ఉంటే ఆనందకరమైన జీవితం గడుపుతాడు. వివాహేతర సంబంధాలు ఉంటాయి. నీచప్రవర్తన ఉంటుంది. సంఘంలో గౌరవం ఉండదు. తరచు అనారోగ్యం కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- ❖ ఇంటి ఆవరణలో దేవాలయము ఉండకూడదు.
- ❖ అర్చకత్వము చేయకూడదు.
- ❖ ప్రతి సోమవారం పేదవారికి భోజనం పెట్టండి.
- ❖ ప్రవహించే నదిలో రాగినాణెం వేయండి.
- ❖ ప్రతిదినము నుదుటిపై కుంకుమతో బొట్టు పెట్టుకోండి.
- ❖ మద్యపానము, మాంసాహారము తినుట మానివేయండి.
- ❖ నల్లనువ్వులు, బెల్లంతో చిమ్మిరిచేసి పిల్లలకు పంచండి.

**6. మకరంలో శని ఉంటే :-**

మకరంలో శని ఉంటే జాతకుడు ఉన్నతమైన ఆశయాలు కలవాడు. ఆశాజీవి. ఇతరులను గౌరవిస్తాడు. ఇతరులచేత గౌరవింపబడతాడు. భార్యఇబ్బందులు పడుతుంది. జాతకుడు ఇల్లుకట్టి ఆర్థిక సమస్యలు ఎదుర్కొంటాడు. మేషంలో రవి, చంద్ర, కుజులలో ఎవరైనా ఉంటే జాతకుడు నీచస్వభావం. కలిగి ఉంటాడు.

**పరిహారక్రియలు :-**

- ❖ అంధులకు ఆహారం పెట్టండి.
- ❖ సాయిబాబా లేదా బ్రహ్మంగారి గుడికి వరుసగా 44 రోజులు వెళ్ళండి.

- ✤ వీధి పిల్లలకు ప్రతిదినము శనగగుగ్గిళ్ళు పంచండి. ఈ విధంగా వరుసగా 44 రోజులు చేయండి.
- ✤ మాంసాహారం తినకండి. మద్యపానం చేయకండి.

**7. మకరంలో బుధుడు ఉంటే :-**

మకరంలో బుధుడు ఉంటే జాతకుడు సూక్ష్మబుద్ధి కలవాడు. మధురంగా మాట్లాడువాడు. ఇతరులను ఆకర్షించే గుణము కలవాడు. కుటుంబంలో స్త్రీలు బాధపడతారు.

**పరిహారక్రియలు :-**

- ✤ మాంసాహారం తినకండి.
- ✤ మద్యపానం చేయకండి.
- ✤ కుక్కలకు ఆహారం పెట్టండి.
- ✤ పక్షులకు ఆహారం పెట్టండి.
- ✤ ఏదైనా దేవాలయానికి చక్రపొంగలి ప్రసాదంగా ఇవ్వండి.

**8. మకరంలో కేతువు ఉంటే :-**

మకరంలో కేతువు ఉంటే జాతకుడు ఆశాజీవి. తనకు జరిగిన చెడునుంచి మంచిని గ్రహించగల నేర్పరి. భార్య, పిల్లలతో ఆనందంగా జీవిస్తాడు. ఇతరుల సమస్యలను పరిష్కరించగలడు. పరస్త్రీలతో సంబంధం కలిగి ఉంటాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిదినం శనిజపం చేయండి.
- ✤ శివునికి అభిషేకం చేయండి.
- ✤ కుక్కలకు ఆహారం పెట్టండి.
- ✤ ప్రతి మంగళవారం సుబ్రహ్మణ్యస్వామి దేవాలయాన్ని దర్శించండి.
- ✤ నాగేంద్రస్వామి పుట్టలో పాలు పోయండి.

**9. మకరంలో శుక్రుడు ఉంటే :-**

మకరంలో శుక్రుడు ఉంటే జాతకునకు కళలంటే ఇష్టం. చేతివృత్తులపై ఆసక్తి ఎక్కువ. జాతకుడు లోభి. ఆరోగ్యం, ఆస్తి, భూమి లభించును. మంచి రూపం కలవాడు. భార్యను గౌరవిస్తాడు. వృద్ధాప్యంలో ఇబ్బందులు పడకుండా ఆనందకరమైన జీవితం గడుపుతాడు. గ్రహములు అనుకూలంగా లేకపోతే పరస్త్రీల వలన జాతకుని కుటుంబం బాధలు పడుతుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిదినం శివాలయంకు వెళ్ళండి.
- ✤ పక్షులకు ఆహారం పెట్టండి.
- ✤ శివాలయముకు దీపారాధన కోసం నువ్వులనూనెను ఇవ్వండి.
- ✤ పేదవారికి గారెలు పంచండి.

## కుంభరాశిలో నవగ్రహాలు - పరిహారాలు

**1. కుంభంలో రవి ఉంటే :-**

కుంభంలో రవి ఉంటే జాతకుడు ఆనందకరమైన జీవితాన్ని అనుభవిస్తాడు. ఆచారాలను పాటిస్తాడు. దైవభక్తి పరుడు. జాతకుడు మద్యము, మాంసాహారములను విడిచిపెట్టాలి. లేకపోతే జాతకునకు ఇబ్బందులు కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- ✤ పంచదార, పాలు, బియ్యంలతో పొంగలి (క్షీరాన్నం) చేయించి, దేవాలయానికి సమర్పించండి.
- ✤ ప్రతిరోజు శనిస్తోత్రం చేయండి.

**2. కుంభంలో చంద్రుడు ఉంటే :-**

కుంభంలో చంద్రుడు ఉంటే జాతకునకు కుటుంబసుఖము తక్కువ. గ్రహస్థితిగతులను బట్టి కుటుంబంలో తల్లికి లేదా కుమారునికి అనారోగ్యం కలుగుతుంది. ధననష్టం కలుగుతుంది.

**పరిహారక్రియలు :-**

- ✤ వ్యాపారం చేయదలిస్తే దానిని బుధవారం చేయండి.
- ✤ గృహమును నిర్మించుటగాని, కొనుటను గాని శనివారం చేయండి.
- ✤ పేదపిల్లలకు పాలు పంచండి.
- ✤ ప్రవహించే నీటిలో 250 పటిక బెల్లంముక్కలు (పంచదారచిప్స్) వేయండి.
- ✤ శివలింగాన్ని పాలతో అభిషేకించండి.

**3. కుంభంలో కుజుడు ఉంటే :-**

కుంభంలో కుజుడు ఉంటే జాతకుడు ధనమును, మనశ్శాంతిని పొందును. జాతకుడు కోపిష్ఠి. శరీర సౌఖ్యము తక్కువ.

పరిహారక్రియలు :-

- ఇంటిలో ఎల్లప్పుడూ తేనె ఉండాలి.
- పేదవారికి గోధుమరొట్టె, బెల్లం ఇవ్వండి.
- కుక్కలను పెంచండి.

4. కుంభంలో రాహువు ఉంటే :-

కుంభంలో రాహువు ఉంటే జాతకుడు నీచులతో స్నేహం చేస్తాడు. ధనవ్యయం అవుతుంది. జాతకుని తండ్రి లేదా తాత ప్రమాదంలో మరణిస్తారు. నమ్మకమైన వ్యక్తులతో జాతకుడు మోసగింపబడతాడు. రాహువు బలహీనపడితే జాతకుడు సన్యాసి అవుతాడు.

పరిహారక్రియలు :-

- ప్రతిరోజు నుదుటిపై కుంకుమ ధరించండి.
- పేదపిల్లలకు శనగ గుగ్గిళ్ళు పంచండి.
- పేదవారికి పసుపువస్త్రం దానం చేయండి.
- ప్రతి గురువారం బ్రహ్మంగారి గుడి, (లేదా) సాయిబాబా గుడి (లేదా) రాఘవేంద్రస్వామిగుడికి వెళ్ళండి.

5. కుంభంలో గురువు ఉంటే :-

కుంభంలో గురువు ఉంటే జాతకుడు సంపాదిస్తాడు. కాని అప్పులు చేస్తాడు. తండ్రితో కలసిఉన్నంతకాలం ఆనందకర జీవితాన్ని అనుభవిస్తాడు. తండ్రినుండి దూరంగా ఉన్నపుడు ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటాడు. జాతకుని భార్యకు మాత్రం ఎక్కువకాలం దుఃఖమయము. జాతకుని చెల్లెలు, మేనత్త, కూతురు ఇబ్బందులు పడతారు.

పరిహారక్రియలు :-

- తండ్రితోపాటు జీవించండి.
- బంగారు ఆభరణాలు ధరించండి.
- ప్రతిదినం ఆదిత్య హృదయం చదవండి.
- చేతికి రాగికంకణం ధరించండి. లేదా రాగిలో చేసిన ఉంగరాన్ని ధరించండి.
- పేదపిల్లలకు గోధుమపిండి, బెల్లం కలిపి పెట్టండి.

6. కుంభంలో శని ఉంటే :-

కుంభంలో శని ఉంటే జాతకుడు అదృష్టవంతుడు. జాతకుడు సంపాదిస్తాడు కాని ఖర్చుపెడతాడు. మిథునంలో బుధుడు ఉంటే చర్మరోగంతో బాధపడతాడు. ధనసంపాదనకు నీచకార్యములు చేస్తే, అవి మరణానికి దారితీస్తాయి.

జాతకునకు 48 సం॥ల వయస్సులో గ్రహస్థితిని బట్టి అదృష్టము లేదా దురదృష్టము కలుగుతుంది. కేతువు శుభస్థానంలో ఉంటే జాతకుడు అనుకున్న పనులు నెరవేరతాయి. ధనలాభం కలుగుతుంది. కేతువు నీచస్థానంలో ఉంటే ధననష్టం జరుగుతుంది.

పరిహారక్రియలు :-

- ప్రతిదినము బ్రహ్మంగారి గుడికి వెళ్ళండి.
- వినాయకుని దేవాలయముకు శనగ గుగ్గిళ్ళు ప్రసాదంగా ఇవ్వండి.
- బడిపిల్లలకు పుస్తకాలు పంచండి.
- పేదపిల్ల పెళ్ళికి మంగళసూత్రమును దానమీయండి.
- ప్రతిదినం శనిస్తోత్రం చేయండి.

7. కుంభంలో బుధుడు ఉంటే :-

కుంభంలో బుధుడు ఉంటే జాతకుడు ఆస్తి నష్టపోతాడు. మనశ్శాంతిని కోల్పోతాడు. కష్టపడినా ఫలితం దక్కదు. 34 సం॥ తరువాత జాతకుని బాధలు తొలగుతాయి.

పరిహారక్రియలు :-

- బంధుగణానికి సాయం చేయండి. కాని మీవద్ద ఆశ్రయంమాత్రం కల్పించవద్దు.
- రాగి కంకణాన్ని లేదా రాగి ఉంగరాన్ని ధరించండి.
- వెండి గొలుసును ధరించండి. దానికి రాగితో చేసిన లాకెట్ అమర్చండి

8. కుంభంలో కేతువు ఉంటే :-

కుంభంలో కేతువు ఉంటే జాతకుడు ఆస్తిపరుడు. సంఘంలో గుర్తింపు కలవాడు. కుమారుని జననం తరువాత భార్య ఆరోగ్యం స్వల్పంగా కొన్ని ఇబ్బందులు కలుగుతాయి.

పరిహారక్రియలు :-

- కుంకుమ పువ్వు వేసిన పాలను త్రాగుతూ ఉండండి.
- వినాయకుని గుడికి వెళ్ళండి

✤ బ్రహ్మంగారి జీవిత చరిత్ర చదువుతూ ఉండండి.
✤ అనాథలకు శనగగుగ్గిళ్ళు పెట్టండి.

9. **కుంభంలో శుక్రుడు ఉంటే :-**

కుంభంలో శుక్రుడు ఉంటే జాతకుడు పిరికివాడు. స్త్రీ లక్షణాలు కలిగి ఉంటాడు. భార్యవలన బాధలు పడతాడు. కాని బావమరిది సహాయంగా ఉంటాడు. ఆలస్యంగా పిల్లలు పుడతారు.

**పరిహారక్రియలు :-**

✤ బంగారంతో కూడిన మందులు వాడాలి. (ఉదాహరణకు సిద్ధమకరధ్వజం మొదలగునవి)
✤ ప్రవహించే నీటిలో నూనెను పోయండి.
✤ ఏదైనా దేవాలయముకు నూనెను సమర్పించండి.
✤ ప్రతిదినం దుర్గాస్తుతి చేయండి.
✤ ప్రతి బుధవారం ఆడపిల్లలకు పెసలతో చేసిన వంటకాలు పెట్టండి.
✤ పచ్చను ధరించండి.

## మీనరాశిలో నవగ్రహాలు - పరిహారాలు

1. **మీనంలో రవి ఉంటే :-**

మీనంలో రవి ఉంటే జాతకునికి ఆర్థికసమస్యలు, కుటుంబసమస్యలు ఏర్పడతాయి. మనశ్శాంతిని కోల్పోతాడు. నీచకార్యాలకు అలవాటు పడతాడు. జాతకుడు నియమబద్ధమైన జీవితాన్ని గడుపుతూ ఒక మంచిరైతువలె జీవించిన అతని జీవితం ఆనందంగా గడచిపోతుంది. వ్యాపారం చేయుట జాతకునికి లాభకరం. అయితే ఇనుము, నూనె, మందులు, మద్యం మొదలైన వ్యాపారులు నష్టపరుస్తాయి.

**పరిహారక్రియలు :-**

✤ నీచకార్యాలకు దూరంగా ఉండండి.
✤ ప్రతిదినము ఆవుకు ఏదోఒక ఆహారం పెట్టండి.
✤ ప్రతిదినము దేవాలయాన్ని దర్శించండి.

2. **మీనంలో చంద్రుడు ఉంటే :-**

మీనంలో చంద్రుడు ఉంటే, కుజుని స్థితిని బట్టి జాతకుడు వ్యాపారంలో లాభాన్ని పొందుతాడు. ప్రభుత్వాధికారుల ఆదరణ పొందుతాడు. బంధుమిత్రుల సహకారాన్ని అందుకుంటాడు. మనశ్శాంతిని పొందుతాడు.

కర్కాటకంలో, కేతువు ఉంటే కుటుంబసభ్యులకు ఆపద, మానసిక ఆందోళన కలుగుతాయి.

**పరిహారక్రియలు :-**

- ✤ గురుజపం చేయాలి.
- ✤ పుణ్యక్షేత్రాలను దర్శించాలి.
- ✤ ప్రతిదినం సాయిబాబా ఆలయం లేదా రాఘవేంద్రుని ఆలయం లేదా బ్రహ్మంగారి ఆలయాన్ని దర్శించండి.

**3. మీనంలో కుజుడు ఉంటే :-**

మీనంలో కుజుడు ఉంటే, జాతకుడు కష్టజీవి. శరీర సుఖము తక్కువ.

**పరిహారక్రియలు :-**

- ✤ ప్రతిరోజు హనుమాన్ చాలీసా చదవండి.
- ✤ తీయని చపాతీలు పంచండి.
- ✤ కుక్కలను పెంచండి.

**4. మీనంలో రాహువు ఉంటే :-**

మీనంలో రాహువు ఉంటే, జాతకుడు దుర్మార్గులతో స్నేహం చేస్తాడు. దావాలకు ఎక్కువ సొమ్మును ఖర్చుపెడతాడు. అనవసర సమస్యలు ఏర్పడతాయి. అనారోగ్యం కలుగుతుంది. నిద్రపోవు సమయం తక్కువ. ఇంటిలో ఆడపిల్లలకు ఎక్కువ సొమ్ము ఖర్చుచేయును. కుంభంలో బుధ, గురులు ఉంటే జాతకునకు ధనలాభము, కార్యసిద్ధి కలుగుతుంది. రాహువు బలహీనమైతే, ముఖ్యమైన పనులను కూడ కొంతవరకు శ్రమచేసి వదిలివేయవలసి వస్తుంది. జాతకుడు ఎక్కువగా ఊహాజీవి. ఆత్మహత్యాప్రయత్నం కూడ చేసుకొనే స్వభావం కలవాడు.

**పరిహారక్రియలు :-**

- ✤ జాతకుడు సరస్వతీ పూజ చేయాలి.
- ✤ ప్రవహించే నీటిలో బొగ్గును వేయండి.
- ✤ ప్రతిరోజు కుక్కలకు ఆహారం పెట్టండి.
- ✤ మద్యం, మాంసం ముట్టకండి.
- ✤ మీ సంపాదనను కూతురుకు లేదా చెల్లెలుకు ఇచ్చి, వారినుండి తీసుకొని మీరు ఖర్చు పెట్టండి. లేదా మీ సంపాదన ఖర్చుచేసే అధికారం పూర్తిగా వారికే ఇవ్వండి.

5. మీనంలో గురువు ఉంటే :-

మీనంలో గురువు ఉంటే, జాతకుడు మంచి ప్రవర్తనను కలిగి ఉంటే అతను ఆర్థికంగా ఎదురుగుతాడు. సమాజంలో గుర్తింపు పొందుతాడు. ధర్మకార్యములు నిర్వహిస్తాడు. మోసకారి అయితే ధననష్టం జరుగుతుంది. సమస్యలు కలుగుతాయి. వాహనములు, మెషినరీలకు సంబంధించిన వ్యాపారములు లాభిస్తాయి.

పరిహారక్రియలు :-

- ❖ మద్యపానం, మాంసాహారభక్షణ పనికిరాదు.
- ❖ ప్రతిరోజు కుంకుమ బొట్టు పెట్టుకోండి.
- ❖ పేదలకు అన్నదానం చేయండి.
- ❖ శనీశ్వర వ్రతం చేయండి
- ❖ బడిపిల్లలకు పుస్తకాలు పంచండి.

6. మీనంలో శని ఉంటే :-

మీనంలో శని ఉంటే, జాతకునకు ఆస్తి ఉంటుంది. అధికంగా ధనవ్యయం చేస్తాడు. కాని ఆర్థిక ఇబ్బందులు ఉండవు. పిత్రార్జితం వ్యయమవుతుంది. తల్లి బాధపడుతుంది. రవి కన్యలో ఉంటే కళత్రనష్టం కలుగుతుంది.

పరిహారక్రియలు :-

- ❖ నల్లనువ్వులు, బెల్లం కలిపి చిమ్మిరిచేసి, పిల్లలకు పంచండి.
- ❖ ప్రతిదినం శనిస్తోత్రం చేయండి.
- ❖ పక్షులకు ఆహారం పెట్టండి.

7. మీనంలో బుధుడు ఉంటే :-

మీనంలో బుధుడు ఉంటే, జాతకుడు మాటకారి. కుటుంబంలో సమస్యలు కలుగుతాయి. మనశ్శాంతి కోల్పోతాడు.

పరిహారక్రియలు :-

- ❖ నుదుటిపై కుంకుమ ధరించండి.
- ❖ కుక్కను పెంచండి.
- ❖ ఖాళీ కుండను నీటిలో వేయండి.

- పేదపిల్లలకు శనగగుగ్గిళ్ళు పంచండి.
- గణపతి దేవాలయముకు శనగలు ఇవ్వండి.
- బ్రహ్మంగారి గుడికి లేదా సాయిబాబా గుడికి పసుపురంగు వస్త్రాన్ని ఇవ్వండి.
- ప్రతిదినం రావిచెట్టుకు నీరుపోయండి.

**8. మీనంలో కేతువు ఉంటే :-**

మీనంలో కేతువు ఉంటే, జాతకుడు ధనవంతుడు. సంఘంలో గుర్తింపు కలవాడు. కుటుంబ సుఖం కలవాడు. కేతువు బలహీనుడైతే కుమారుని వలన ఇబ్బందులు పడతాడు.

**పరిహారక్రియలు :-**

- కుక్కను పెంచండి.
- ప్రతిరోజు గణపతి దేవాలయముకు వెళ్ళండి.
- తెల్లజిల్లేడును మీవద్ద ఉంచుకోండి.

**9. మీనంలో శుక్రుడు ఉంటే :-**

మీనంలో శుక్రుడు ఉంటే, జాతకుడు ఆనందకరమైన జీవితం గడుపుతాడు. స్త్రీలచే నడుపు సంస్థలలో అతను అభివృద్ధి చెందుతాడు. జాతకుడు సమస్యలలో ఉన్నపుడు ఒకస్త్రీ అతనిని ఆదరిస్తుంది. 28 సం॥ల తరువాత జాతకునిలో ఆధ్యాత్మిక చింతన ఎక్కువవుతుంది.

**పరిహారక్రియలు :-**

- బడిపిల్లలకు పుస్తకాలు పంచండి.
- ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి.
- ప్రతిరోజు ఒక నీలిరంగు పూవును నదిలోవేయండి. ఈవిధంగా 45 రోజులు వేయండి.
- పేదలకు గారెలు పంచండి.

# 22. లాల్ కితాబ్ ప్రకారం గ్రహములు

ప్రాచీన జ్యోతిష్య గ్రంథాలలో గ్రహాలమధ్య సంబంధాలకు లాల్‌కితాబ్ ప్రకారం వాటిమధ్య సంబంధాలకు తేడా ఉన్నది. మనం ప్రస్తుతం లాల్‌కితాబ్ ప్రకారం ఆయా గ్రహములకు మిత్ర, శత్రు, సమాన గ్రహములను తెలుసుకుందాం. అంతేకాక ఆ గ్రహాల దృష్టుల గురించి, ఉచ్ఛ, నీచ స్థానాలను గురించి తెలుసుకుందాం. పరిహారక్రియలు తెల్పుటకు ఈ విషయములు తెలుసుకొనుట ఉపయోగకరంగా ఉంటుంది.

| గ్రహము | సమాన గ్రహము | మిత్ర గ్రహాలు | శత్రు గ్రహాలు | అనుకూలించే భావాలు | అనుకూలించని భావాలు |
|---|---|---|---|---|---|
| రవి | బుధుడు | గురు, కుజ చంద్రులు | రాహు, శని కేతు, శుక్ర | 1,2,3,4 5,9,12 | 6,7,8 10,11 |
| చంద్ర | కుజ,గురు శని, శుక్ర | రవి, బుధ | రాహు, కేతు | 1,2,4,5 9,11,12 | 3,6,7 8,10 |
| కుజ | రాహు, శని, శుక్ర | రవి, చంద్ర గురు | బుధ, కేతు | 1,2,3,5, 7,9,10,11,12 | 4,6,8 |
| రాహు | చంద్ర, గురు | బుధ, శని, కేతు | రవి, కుజ, శుక్ర | 3,6,4,5, 10 | 1,2,7,8 9,11,12 |
| గురువు | రాహు, శని కేతు | రవి, చంద్ర కుజ | బుధ, శుక్ర | 1,2,4,5,9 11,12 | 3,6,7,8 10 |
| శని | గురు, కేతు | రాహు, బుధ శుక్ర | రవి, చంద్ర కుజ | 4,7,9,10 11,12 | 1,3,5 6,8 |
| బుధ | కుజ, గురు శని, కేతు | రవి, రాహు శుక్ర | చంద్రుడు | 1,2,4,5 6,7,10 | 3,8,9 11,12 |
| కేతు | రవి,గురు శని, బుధ | రాహు, శుక్ర | చంద్ర, కుజ | 1,2,5,9 10,12 | 3,4,6 7,8 |
| శుక్ర | కుజ, గురు | శని, బుధ కేతు | రవి, చంద్ర రాహు | 3,7,10 11,12 | 1,2,4,5 6,8,9 |

## రాశులు - గ్రహముల మధ్య సంబంధం

| రాశి స్థానం | రాశి నాథుడు | రాశికి చెందిన ఉచ్ఛగ్రహం | రాశికి చెందిన నీచగ్రహం | కారక గ్రహం |
|---|---|---|---|---|
| 1. | కుజుడు | రవి | శని | రవి |
| 2. | శుక్రుడు | చంద్రుడు | - | గురుడు |
| 3. | బుధుడు | రాహువు | కేతువు | కుజ |
| 4. | చంద్రుడు | గురుడు | కుజుడు | చంద్రుడు |
| 5. | రవి | - | - | గురుడు |
| 6. | బుధుడు, కేతువు | బుధుడు | శుక్రుడు కేతువు | కేతువు |
| 7. | శుక్రుడు | శని, రాహువు | రవి | శుక్రుడు, బుధుడు |
| 8. | కుజుడు | కుజుడు | చంద్రుడు | శని,కుజ, చంద్రుడు |
| 9. | గురుడు | కేతువు | రాహువు | గురువు |
| 10. | శని | కుజుడు | గురుడు | శని |
| 11. | శని | - | - | గురుడు |
| 12. | గురుడు రాహువు | శుక్రుడు కేతువు | బుధుడు రాహువు | రాహువు |

## గహములు - దృష్టులు

సాధారణంగా జ్యోతిష్యపరంగా గ్రహములు తానున్నరాశినుండి 7వరాశిని వీక్షిస్తాయి. ఇదికాక ప్రత్యేకంగా కుజుడు తానున్నరాశినుండి 4వరాశి, 8వరాశిని చూస్తాడు. గురుడు 5వరాశి 9వ రాశిని చూస్తాడు. శని 3వరాశి, 10వరాశిని చూస్తాడు. లాల్‌కితాబ్ ప్రకారం గ్రహదృష్టులు వేరుగా ఉన్నాయి. వాటిని తెలుసుకుందాము.

| గ్రహము ఉన్న రాశి | గ్రహము చేత చూడబడే రాశి |
|---|---|
| 1 | 7 |
| 2 | 6 |
| 3 | 9,11 |
| 4 | 10 |
| 5 | 9,11 |
| 6 | 12 |
| 7 | 2 |

ఏ గ్రహము కూడ వెనుకవైపు నున్న గ్రహమును చూడదు. ముందువైపున ఉన్న గ్రహమునే చూస్తుంది. అయితే 8వ రాశిలోని గ్రహం మాత్రం రెండువైపుల మున్న గ్రహమును చూస్తుంది.

## యోగదృష్టి

గ్రహములు తమకు ఉన్న సాధారణ దృష్టి కాక ప్రత్యేకంగా దృష్టిని కలిగి ఉండుటను యోగదృష్టి అంటారు.

ఒక గ్రహం బాధలలో ఉన్నపుడు వేరొక గ్రహం యొక్క సహకారాన్ని పొందుటకు దానివైపు చూస్తుంది. దీనినే యోగదృష్టి అంటారు.

| భావము | దృష్టి | పరస్పర సహకారం | పరస్పర స్నేహం | అనుమాన ప్రదము | తాత్కాలిక వైరం | ఆకస్మిక హాని |
|---|---|---|---|---|---|---|
| 1 | య | 5 | 9 | 10 | 8 | 3 |
| | ర | 9 | 5 | 4 | 6 | - |
| 2 | య | 6 | 10 | 11 | 9 | - |
| | ర | 10 | 6 | 5 | 7 | 4 |
| 3 | య | 7 | 11 | 12 | 10 | - |
| | ర | 11 | 7 | 6 | 8 | 1 |

| భావము | దృష్టి | పరస్పర సహకారం | పరస్పర స్నేహం | అనుమాన ప్రదము | తాత్కాలిక వైరం | ఆకస్మిక హాని |
|---|---|---|---|---|---|---|
| 4 | య | 8 | 12 | 1 | 11 | - |
| | ర | 12 | 8 | 7 | 9 | 10 |
| 5 | య | 9 | 1 | 2 | 12 | - |
| | ర | 1 | 9 | 8 | 10 | 7 |
| 6 | య | 10 | 2 | 3 | 1 | - |
| | ర | 2 | 10 | 9 | 11 | 4 |
| 7 | య | 11 | 3 | 4 | - | - |
| | ర | 3 | 11 | 10 | 12 | 1 |
| 8 | య | 12 | 4 | 5 | 3 | - |
| | ర | 4 | 12 | 11 | 1 | 10 |
| 9 | య | 1 | 5 | 6 | 4 | - |
| | ర | 5 | 1 | 12 | 2 | 7 |
| 10 | య | 2 | 6 | 7 | 5 | - |
| | ర | 6 | 2 | 1 | 3 | 4 |
| 11 | య | 3 | 7 | 8 | 6 | - |
| | ర | 7 | 3 | 2 | 4 | 1 |
| 12 | య | 4 | 8 | 9 | 7 | - |
| | ర | 8 | 4 | 3 | 5 | 10 |

పై పట్టికలో య, ర అనేవి భావంలోని గ్రహములు "య" అనే గ్రహము పరస్పర సహకారం క్రింద సూచించబడిన భావంలో ఉన్న గ్రహమునకు సహాయం చేస్తుంది. "ర" అనే గ్రహము ఆభావంలోని గ్రహంనుండి సహాయాన్ని పొందుతుంది.

## తుల్య గ్రహాలు

కొన్ని గ్రహాలు అందించే ఫలితాలు, వేరొక గ్రహం అందించే ఫలితానికి సమానంగా ఉంటాయి. ఇటువంటి సమాన ఫలితాలను ఇచ్చే గ్రహాలను తుల్యగ్రహాలు అంటారు.

| గ్రహము | తుల్యగ్రహాలు |
|---|---|
| రవి | బుధుడు |
| చంద్ర | కుజ,గురు, శని, శుక్ర |
| కుజ | రాహువు, శని, శుక్ర |
| రాహువు | చంద్ర, గురు |
| గురువు | రాహువు, శని, కేతువు |

| గ్రహము | తుల్యగ్రహాలు |
|---|---|
| శని | గురుడు, కేతు |
| బుధుడు | కుజ, గురు, శని, కేతువు |
| కేతువు | రవి, గురువు, శని, బుధ |
| శుక్రుడు | కుజ, గురుడు |

## అంధ గ్రహాలు

ఏదైనా ఒకగ్రహము 10వ భావంలో ఉండి, ఆస్థానం ఆ గ్రహానికి శత్రులేదా నీచస్థానమైతే, ఆ గ్రహం సరియగు ఫలితముల నీయదు. అటువంటి గ్రహములను అంధగ్రహము అని అంటారు.

## ఫలితమీయని గ్రహాలు

1. రవి, బుధులు ఒకే రాశిలో ఉంటే బుధుడు తన ఫలితముల నీయడు.
2. చంద్రుడు, రాహువు కలసి ఒకే రాశిలో ఉంటే, చంద్రుడు తన ప్రభావాన్ని కోల్పోతాడు.
3. కుజ, రాహువులు కలసి ఒకేరాశిలో ఉంటే, రాహువు ఫలితముల నీయడు.
4. కేతువు, రవి కలసి ఒకేరాశిలో ఉంటే, రవి ప్రభావం తగ్గిపోతుంది.

## సాధుగ్రహాలు

సాధారణంగా శని, రాహు, కేతువులు పాపగ్రహాలు. అవి అలుక వహిస్తే జాతకుడు తల్లడిల్లుతాడు. కాని కొన్ని ప్రత్యేక సందర్భాలలో అవి సాధుగ్రహాలుగా మారతాయి. అవి ఏ భావంపైనా, ఏ ఇతర గ్రహంపైనా తమ ప్రభావాన్ని చూపవు. అశుభఫలితాలను ఇవ్వవు.

1. రాహు, కేతువులు చతుర్థభావంలో చంద్రునితో కలసి ఉంటే సాధుగ్రహాలుగా ప్రవర్తిస్తాయి.
2. శని 11వ భావంలో ఉంటే సాధుగ్రహం అవుతుంది.
3. శని గురువుతో కలసి ఏరాశిలో ఉన్నా సాధుగ్రహంగా మారుతుంది.

## మిత్రులే శత్రువులయిన వేళ

లాల్‌కితాబ్‌ప్రకారం రెండు మిత్ర గ్రహాలులో ఒక గ్రహం రెండవ దాని స్థిరరాశిని చేరినపుడు, రెండవగ్రహం మొదటిగ్రహం యొక్క స్థిరరాశిని చేరకపోతే, ఆ మొదటి గ్రహం రెండవగ్రహానికి మిత్రగ్రహంగా సాయంచేయదు. అది రెండవగ్రహం అందించు ఫలితాలను దెబ్బతీస్తుంది. వీటిని వంచనగ్రహాలు అనవచ్చు.

లాల్‌కితాబ్ ప్రకారం ఏ గ్రహానికి ఏరాశి స్థిరరాశి అవుతుందో తెలుసు కుందాము.

| గ్రహము | వాటి స్థిరరాశులు |
|---|---|
| రవి | 1 |
| చంద్ర | 4 |
| కుజ | 3, 8 |
| రాహువు | 12 |
| గురువు | 2, 5, 9, 12 |
| శని | 8, 10 |
| బుధ | 7 |
| కేతు | 6 |
| శుక్ర | 7 |

## పరస్పర సహకారం అందించు గ్రహాలు

ఏవైనా రెండు గ్రహాలు, పరస్పరం ఒక దాని స్వక్షేత్రంలోకి మరొకటి చేరినపుడు అవి శత్రుగ్రహాలయినా ఒకదానికొకటి సహకరించుకుంటాయి.

ఏవైనా రెండు మిత్రగ్రహాలు ప్రక్కప్రక్కనే ఉన్న రెండు రాశులలోకి చేరితే అవి మిత్రగ్రహాలుగానే వ్యవహరిస్తాయి. కాని రెండు శత్రుగ్రహాలు ప్రక్కప్రక్కనే ఉన్న రెండు రాశులలోకి చేరితే అవి శత్రువులుగానే వ్యవహరిస్తాయి.

## ద్విగ్రహకూటమి - విశేష ఫలితం

రెండుగ్రహాలు కలిసి ఒకే రాశిలో ఉంటే అవి మరొకగ్రహం ఫలితాన్ని అందిస్తాయి, ఆ సంయుక్త గ్రహాలను గురించి తెలుసుకుందాం.

| గ్రహము | గ్రహఫలితాన్ని అందించే గ్రహకూటమి |
|---|---|
| రవి | బుధ + శుక్ర |
| చంద్ర | రవి + గురు |
| కుజ (శుభుడు)<br>కుజ (నీచుడు) | రవి + బుధ<br>రవి + శని |
| రాహు (ఉచ్ఛ)<br>రాహు (నీచ) | కుజ + శని<br>రవి + శని |
| గురు | రవి + శుక్ర |
| శని | గురు + శుక్ర<br>(లేదా)<br>కుజ + బుధ |
| బుధ | గురు + రాహు |
| కేతు (ఉచ్ఛ)<br>కేతు (నీచ) | శుక్ర + శని<br>చంద్ర + శని |

## నిద్రించే గ్రహాలు

గ్రహాలు నిద్రపోతాయా? ప్రాచీన జ్యోతిష గ్రంధాల ననుసరించి గ్రహాలు నిద్రపోతాయి.

ఫలితమీయని గ్రహాలను నిద్రించే గ్రహాలు అంటారు.

1. ఏదైనా ఒక భావం నుండి 9వ భావం ఖాళీగా ఉంటే, ఆ భావం మరియు ఆ భావం లోని గ్రహం ఫలితమీయదు.
2. అస్తమించిన రాశులలోని గ్రహాలు ఫలితం ఈయవు.
3. అస్తమించిన నక్షత్రాలలోని గ్రహాలు ఫలితం ఈయవు.

కొన్ని గ్రహాలు కొన్నిభావాలలో ఉన్నపుడు అవి తమంతట తామే నిద్రలేస్తాయి. అనగా జాగృతమై తమ ఫలితాలను ఇస్తాయి.

నిద్రించిన భావం అనగా ఖాళీగా ఉండి ఏ గ్రహం దృష్టి పొందని భావంను ఏ గ్రహం మేల్కొల్పుతుందో తెలుసుకుందాం.

| నిద్రించినభావం | మేల్కొలిపే గ్రహం |
|---|---|
| 1 | కుజుడు |
| 2 | చంద్రుడు |
| 3 | బుధుడు |
| 4 | చంద్రుడు |
| 5 | రవి |
| 6 | రాహువు |

| నిద్రించినభావం | మేల్కొలిపే గ్రహం |
|---|---|
| 7 | శుక్రుడు |
| 8 | చంద్రుడు |
| 9 | గురుడు |
| 10 | శని |
| 11 | గురుడు |
| 12 | కేతువు |

## గ్రహాలు స్వయంగా మేల్కొనే కాలం

| గ్రహము | మేల్కొనే సంఘటన | ప్రభావం చూపే వయస్సు | ప్రభావం మందగించే వయస్సు |
|---|---|---|---|
| రవి | ప్రభుత్వ ఉద్యోగ సమయం | 22 సం॥ తరువాత | 24 సం॥ తరువాత |
| చంద్ర | చదువు | 24 సం॥ తరువాత | 25 సం॥ తరువాత |
| కుజ | స్త్రీ సంబంధం | 28 సం॥ తరువాత | 34 సం॥ తరువాత |
| రాహు | భార్య ఇంటి విషయం | 42 సం॥ తరువాత | 48 సం॥ తరువాత |
| గురుడు | ఏదైనా ముఖ్య సంఘటన | 16 సం॥ తరువాత | 22 సం॥ తరువాత |
| శని | స్వంత ఇల్లు | 36 సం॥ తరువాత | 42 సం॥ తరువాత |
| బుధుడు | వ్యాపార విషయం కూతురు లేదా చెల్లెలు వివాహం | 34 సం॥ తరువాత | 36 సం॥ తరువాత |
| కేతువు | సంతానం | 48 సం॥ తరువాత | 51 సం॥ తరువాత |
| శుక్రుడు | వివాహం | 25 సం॥ తరువాత | 28 సం॥ తరువాత |

ఇదే విధంగా లాల్‌కితాబ్ ప్రకారం కొన్నిభావాలు తమఫలితాలను వేరొక ప్రత్యేకభావాలకు బదిలీచేస్తాయి. ఫలితాలను బదిలేచేసేభావం. తనలోఉన్న గ్రహం ద్వారా ఫలితాలను బదిలీ చేస్తుంది. స్వీకరించే భావంలో, ఫలితాలను బదిలీ చేసేగ్రహముకు శత్రుగ్రహం ఉంటే ఆ భావఫలితాలు చెడిపోతాయి.

| ఫలితాలను బదిలీ చేయు భావము | ఫలితాలను స్వీకరించు భావము |
|---|---|
| 1 | 7 |
| 2 | 6 |
| 3 | 9,11 |
| 4 | 10 |
| 5 | 9 |
| 6 | 12 |
| 7 | - |
| 8 | 2 |
| 9 | - |
| 10 | - |
| 11 | - |
| 12 | - |

## గ్రహాలు ఫలితమందించే సమయం

జాతకునికి వయస్సు ఆధారంగా ఆయాగ్రహాలు తమ ఫలితాలను ఇస్తాయి. ప్రస్తుతం ఏగ్రహం ఏ సంవత్సరంలో ఫలితమిస్తుందో తెలుసుకుందాం.

| గ్రహం | కలిసియున్న గ్రహం | ఫలితం యిచ్చే వయస్సు |
|---|---|---|
| రవి | రాహువు | 1సం॥ లోపు |
| రవి | కేతువు | 11 సం॥ |
| రవి | ఎవరితోనైనా | 16 సం॥ |
| చంద్రుడు | గురు+శని+బుధ | 12 సం॥ |
| చంద్రుడు | రాహువు+శని | 8 సం॥ |
| చంద్రుడు | ఎవరితోనైనా | 24 సం॥ |
| కుజుడు | ఎవరితోనైనా | 28 సం॥ |
| రాహువు | ఏవరితోనైనా | 42 సం॥ |
| గురుడు | ఎవరితోనైనా | 16 సం॥ |
| శుక్రుడు | రవి | 34 సం॥ |
| శుక్రుడు | కుజుడు | 8 సం॥ |
| శుక్రుడు | గురుడు | 60 సం॥ |
| శుక్రుడు | ఎవరితోనైనా | 25 సం॥ |
| శని | రవి | 28 సం॥ |
| శని | బుధుడు | 48 సం॥ |

| గ్రహం | కలిసియున్న గ్రహం | ఫలితం ఇచ్చే వయస్సు |
|---|---|---|
| శని | గురుడు | 18 సం॥ |
| శని | కుజ+బుధ | 12 సం॥ |
| శని | ఎవరితోనైనా | 36 సం॥ |
| బుధుడు | రవి | 17 సం॥ |
| బుధుడు | కుజుడు | 17 సం॥ |
| బుధుడు | ఎవరితోనైనా | 34 సం॥ |
| కేతువు | గురువు | 40 సం॥ |
| కేతువు | శని | 24 సం॥ |
| కేతువు | ఎవరితోనైనా | 48 సం॥ |

## శత్రుగ్రహాలు కలహించుకుంటే

రెండు శత్రు గ్రహాలు కలహించుకున్నప్పుడు ఒకదాని ఫలితాలను మరొకటి చెడగొడతాయి. అంతేకాక ఈ రెండుగ్రహాలు తమ పరస్పర పీడనను మూడవ గ్రహంపై వేస్తాయి. దానివలన ఆ మూడవగ్రహం చెడు ఫలితాలను ఇస్తుంది.

త్యాగశీలిశుక్రుడు :- అందరిబాధలు శుక్రుడు మోస్తుంటాడు.

✤ రవి, శని ఇరువురు కలహించుకొని, శని బాధింపబడినపుడు, శని తన బాధను శుక్రునిపై వేస్తాడు.

దానివలన జాతకుని భార్య బాధలు పడుతుంది.

✤ బుధుడు బాధింపబడినపుడు, బుధుడు తన బాధను శుక్రునిపై వేస్తాడు. దానివలన జాతకుని భార్య అనారోగ్యంతో బాధలు పడుతుంది.

కేతువు ఎవరి సమస్యలు స్వీకరిస్తాడో తెలుసుకుందాం.

✤ జన్మరాశిలో 6వ స్థానంలో ఉన్న రవి వలన 10వ స్థానంలో ఉన్న కుజుడు పీడింపబడతాడు. కుజుడు తన బాధలను కేతువుకు అప్పగిస్తాడు. కేతువు మౌనంగా ఆ బాధలను స్వీకరిస్తాడు. దానివలన జాతకుని కుమారుడు లేదా మేనల్లుడు బాధలు పడతారు.

✤ గురువు బాధింపబడినపుడు తన బాధలను కేతువుపై వేస్తాడు. దానివలన జాతకుని కుమారుడు, మామ బాధలు పడతారు. గురువు 5వ స్థానంలో ఉన్నపుడు మామ బాధలు పడతాడు.

✤ రవి బాధలను కూడ కేతువు స్వీకరిస్తాడు. దానివలన జాతకుని మామ బాధలు పడతాడు.

చంద్రుడు ఎవరి బాధలు తీసుకుంటాడో తెలుసుకుందాం.

✤ శని, బుధుల బాధలు స్వీకరించే శుక్రుడు కూడ తన బాధలను పరాయిగ్రహంపై వేస్తాడు. శుక్రుడు బాధించబడినపుడు, తన బాధలను చంద్రునిపై వేస్తాడు. దానివలన జాతకుని తల్లి అనారోగ్య సమస్యలతో బాధపడుతుంది. చూపు తగ్గుతుంది.

చంద్రుని బాధలు ఎవరు మోస్తారు?

✤ చంద్రుడు బాధింపబడినపుడు తన బాధలను రవి, కుజ, గురులకు పంచుతాడు.

## రాహు - కేతువులు ధైర్య గ్రహాలు

✤ రాహు కేతువులు బాధింపబడినపుడు, అవి ధైర్యంగా తమ సమస్యలను తామే ఎదుర్కొంటాయి. కాని ఇతరుల మీదకు రుద్దవు.

## పీడితగృహం, గ్రహం - సహకారమందించే గ్రహాలు

లాల్ కితాబ్ ప్రకారం ప్రతిగ్రహము తానున్న స్థానంనుండి 8వ స్థానంలో ఉన్న గ్రహమును పీడిస్తుంది. అపుడు 8వస్థానంలో ఉన్న గ్రహము తనస్థానం నుండి 5వ స్థానంలో ఉన్న గ్రహము యొక్క సహకారాన్ని కోరుతుంది.

ఏ భావం ఉన్న గ్రహము ఏ భావంలో ఉన్న గ్రహమును పీడిస్తుందో, దానికి ఏభావంలోని గ్రహం సహకారమందిస్తుందో తెలుసుకుందాం.

| గ్రహం ఉన్న భావం | పీడించబడే గ్రహం ఉన్న భావం | సహకార మందించే గ్రహం ఉన్న భావం | గ్రహం ఉన్న భావం | పీడించబడే గ్రహం ఉన్న భావం | సహకార మందించే గ్రహం ఉన్న భావం |
|---|---|---|---|---|---|
| 1 | 8 | 12 | 7 | 2 | 6 |
| 2 | 9 | 1 | 8 | 3 | 7 |
| 3 | 10 | 2 | 9 | 4 | 8 |
| 4 | 11 | 3 | 10 | 5 | 9 |
| 5 | 12 | 4 | 11 | 6 | 10 |
| 6 | 1 | 5 | 12 | 7 | 11 |

పరిహారక్రియలు :-

పై పట్టిక ననుసరించి జాతకుని సమస్యలకు కారణం కనుగొనాలి. శుభఫలితాలు అందకపోవటానికి, చెడు ఫలితాలు కలుగుటకు ఏగ్రహప్రభావమో తెలుసుకోవాలి. ఆగ్రహము యొక్క అనుగ్రహము పొందుటకు తగిన పరిహారక్రియలు జరపాలి. అంతేకాక పీడించబడే గ్రహంకు సహకరించే గ్రహం యొక్క శక్తిని పెరుగునట్లు పరిహారక్రియలు జరపాలి.

## 23. ఆగ్రహిస్తున్న గ్రహాలను గమనించడమెలా?

జన్మచక్రంలో గ్రహాలు అవియున్న రాశుల వలన, కలసియున్న గ్రహాల వలన, వీక్షిస్తున్న గ్రహాల వలన జాతకుని అనుగ్రహించవు. వాటివలన జాతకునికి అశుభఫలితములు కలుగును. జాతకుని జీవితంలో ఏర్పడిన సమస్యలవలన, అతనికి ఏ గ్రహము అనుకూలము కాదో తెలుసుకొనవచ్చును. తరువాత అనుకూలం కాని గ్రహముకు సంబంధించిన పరిహారక్రియలు జరిపి, ఆ సమస్య తీవ్రతను తగ్గించుకొనవచ్చును. పురాతన జ్యోతిష్యగ్రంథం లాల్‌కితాబ్ ప్రకారం ఏ గ్రహం అనుకూలించకపోతే ఏ విధమైన సమస్యలు కలుగుతాయో, ఆ గ్రహము యొక్క ఆగ్రహమును తగ్గించి దానిని తనకు సానుకూలమగునట్లు చేయుటకు చేయవలసిన కార్యాలను తెలుసుకుందాము.

**✤ రవి అనుకూలించకపోతే :-**

శరీర కండరాలు పట్టేసినట్లు ఉంటుంది. కదపటం కూడ కష్టంగా ఉంటుంది. నోటిలో లాలాజలం ఎక్కువగా ఊరుతూ ఉంటుంది. జాతకునికి సంబంధించిన గేదె కాని ఆవుకాని దొంగిలించబడుతుంది. లేదా చనిపోతాయి.

**✤ రవి అనుగ్రహించాలంటే :-**

1. ఏదైనా పని చేయుటకు ముందు ఏదో ఒక స్వీటు తిని, మంచినీరు త్రాగి ఆ పనిని ప్రారంభించండి.
2. రాగిని, గోధుమలను దానం చేయండి.
3. విష్ణుమూర్తిని పూజించండి.
4. హరివంశపురాణం చదవండి.
5. సమాన బరువు కల రెండు రాగిముక్కలను తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియ జరిపి, వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**✤ చంద్రుడు అనుకూలించకపోతే :-**

1. జాతకునికి సంబంధించిన బావులు, చెరువులు ఎండిపోతాయి. చేతిపంపునుండి నీరురాదు. పశువులు, పెంపుడు జంతువులు మరణిస్తాయి. మనసు నిస్తేజంగా మారుతుంది. ఏ అనుభూతులు మనసును తాకలేవు.

**చంద్రుడు అనుగ్రహించాలంటే :-**

1. పెద్దలను గౌరవించండి. వారికి పాదాభివందనం చేసి వారి ఆశీస్సులను పొందండి.
2. పాలు, బియ్యం, వెండి దానం చేయండి.
3. శివుణ్ణి ఆరాధించండి.
4. ప్రతిదినం 'ఓమ్‌నమః శివాయ' అను మంత్రమును జపించండి.
5. మృత్యుంజయ జపాన్ని చేయండి.
6. సమాన బరువులు కల రెండు వెండి ముక్కలు లేదా రెండు ముత్యములను తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియజరిపి, వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**✤ కుజుడు అనుకూలుడు కాకపోతే :-**

సంతానం లేకపోయినా, సంతానం కలిగినా ఆ సంతానం తక్కువ వయస్సులోనే మరణించినా, జాతకుడు రక్తహీనతను కలిగియున్నా చిన్న చిన్న విషయాలకు ఉద్రేకం పొందుతున్నా, తరచుగా తగాదాలు సంభవిస్తున్నా జాతకునికి కుజుడు అనుకూలుడు కాడని చెప్పవచ్చు.

**కుజుడు అనుగ్రహించాలంటే :-**

1. కనులకు తెల్లని సుర్మా పెట్టుకొనండి.
2. కందిపప్పు దానం చేయండి.
3. ఆంజనేయస్వామి దేవాలయమునకు ప్రసాదమును సమర్పించండి.
4. హనుమంతుని పూజించండి.
5. ప్రతిదినం గాయత్రి మంత్రాన్ని స్మరించండి.
6. సమాన బరువుగల రెండు ఎరుపురంగురాళ్ళు లేదా పగడములను తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియజరిపి, వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

✤ రాహువు అనుకూలించకపోతే :-

జాతకుని చేతివ్రేళ్ళకు చెందిన గోళ్ళు ఊడిపోయినా, కుక్క చనిపోయినా, సమయస్ఫూర్తిని కోల్పోయినా, సందర్భానుసారంగా ఆలోచించే శక్తి నశించినా జాతకునికి రాహువు అనుకూలుడుగా లేడని చెప్పవచ్చు.

రాహువు అనుగ్రహించాలంటే :-

1. ఉమ్మడి కుటుంబంలో జీవించండి.
2. బంధువులను ఆదరించండి.
3. పిలక పెట్టుకోండి.
4. నీలమణిని, ఆవాలను దానం చేయండి.
5. పేద ఆడపిల్ల పెళ్ళికి సాయపడండి.
6. సరస్వతీ దేవిని పూజించండి.
7. సమాన బరువుగల రెండు నీలిరంగు రాళ్ళు లేదా నీలమణులను తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియ జరపండి. వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

✤ గురువు అనుకూలించకపోతే :-

చేతియొక్క బొటనవేలు బలహీనపడినా, అది పనిచేయలేకపోతున్నా, చర్మవ్యాధులు ఏర్పడినా, రాత్రులు నిద్రపట్టకపోయినా జాతకునికి గురువు అనుకూలుడు కాడని చెప్పవచ్చు.

గురువు అనుగ్రహించాలంటే :-

1. పరిశుభ్రమైన వస్త్రాలు ధరించండి.
2. శనగలు, బంగారమును దానం చేయండి.
3. బ్రహ్మను ఆరాధించండి.
4. హరివంశ పురాణమును చదవండి.
5. సమాన బరువు గలిగిన రెండు బంగారపు ముక్కలు లేదా రెండు భాగాలు కుంకుమ పువ్వు తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియజరిపి, వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**❖ శని అనుకూలించకపోతే :-**

ప్రమాదవశాత్తు ఇల్లు కూలిపోయినా, కాలిపోయినా, దున్నపోతులు చనిపోయినా, కనుబొమ్మల మరియు కనురెప్పల వెంట్రుకలు రాలిపోతున్నా జాతకునికి శని అనుకూలంగా లేదని చెప్పవచ్చు.

**శని అనుగ్రహించాలంటే :-**

1. కాకులకు 43 రోజుల వరకు ప్రతిరోజు చపాతీ పెట్టండి.
2. మినుములు, ఇనుము దానం చేయండి.
3. భైరవుడిని పూజించండి.
4. సమాన బరువు కలిగిన రెండు ఇనుపముక్కలు లేదా రెండు భాగాల కాటుక తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియజరపండి. వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**❖ బుధుడు అనుకూలించకపోతే :-**

జాతకుడు వాసన కనుగొనే శక్తిని కోల్పోయినా, అతని దంతములు విరిగిపోయినా, సెక్సుసామర్థ్యం తగ్గినా జాతకునికి బుధుడు అనుకూలంగా లేదని చెప్పవచ్చు.

**బుధుడు అనుగ్రహించాలంటే :-**

1. ఎప్పుడూ దంతాలను పరిశుభ్రంగా ఉంచుకోండి.
2. ముక్కుపుడక ధరించండి.
3. పెసలను దానం చేయండి.
4. దుర్గాదేవిని పూజించండి.
5. 'దుర్గా సప్తశతి' ని చదవండి.
6. సమాన బరువు కల రెండు వజ్రాలను లేదా రెండు ఆలుచిప్పలను తీసుకోండి. వాటిని కన్యాదానం చేసినట్లుగా క్రియజరిపి, ఒకదానిని ప్రవహించేనదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**❖ కేతువు అనుకూలించకపోతే :-**

జాతకునికి కీళ్ళనొప్పులు కలిగినా, మూత్రసంబంధమైన సమస్యలు కలిగినా, కాలివేళ్ళగోళ్ళు ఊడిపోతున్నా, సంతానం అనారోగ్యంతో బాధపడుతున్నా జాతకునికి కేతువు అనుకూలంగా లేదని చెప్పవచ్చు.

**కేతువు అనుగ్రహించాలంటే :-**

1. చెవులకు రింగులు, పోగులు వగైరా ధరించండి.
2. కుక్కలను పెంచండి.
3. ఆవును, నువ్వులను దానం చేయండి.
4. గణపతిని ఆరాధించండి.
5. సమానబరువు కల రెండు విభిన్న రంగులు కల రాళ్ళను రెండింటిని తీసుకోండి. కన్యాదానం జరిపినట్లుగా క్రియ జరిపి, వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**✤ శుక్రుడు అనుకూలించకపోతే :-**

భార్యాభర్తల మధ్య కలహాలు ఏర్పడినా, దాంపత్యసుఖం లేకపోయినా, పురుషత్వలోపం కలిగినా, జాతకునికి శుక్రుడు అనుకూలంగా లేడని చెప్పవచ్చు.

**శుక్రుని అనుగ్రహం పొందాలంటే :-**

1. ప్రతిరోజు తను తినే ఆహారంలో మూడుముద్దలు జంతువులకు లేదా పక్షులకు ఆహారంగా పెట్టండి.
2. పాలు దానం చేయండి.
3. నెయ్యి, పెరుగు, కర్పూరం, ముత్యములను దానం చేయండి.
4. లక్ష్మీదేవిని పూజించండి.
5. సమానబరువు కలిగిన రెండు తెల్లని ముత్యములను తీసుకోండి కన్యాదానం జరిపినట్లుగా క్రియ జరిపి, వాటిలో ఒకదానిని నదిలో వేయండి. రెండవదానిని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

# 24. బలహీన గ్రహాలకు బలాన్ని అందించడం

కొన్ని గ్రహాలు బలహీనమై, తగిన ఫలితములను ఈయలేవు. ఇలాంటి గ్రహాలను బలవంతులుగా చేసి, వాటినుండి శుభఫలితములను పొందు విధములను "లాల్ కితాబ్" తెలిపింది.

✤ పాప గ్రహాలు అనుగ్రహం చూపాలంటే, వాటికి సంబంధించిన వస్తువులను ఎల్లప్పుడు జాతకుని వద్ద ఉండేలా చూడాలి. ఆయాగ్రహాలకు చెందిన జంతువులను పెంచుకోవాలి. లేదా వాటికి ప్రతిరోజు ఆహారం పెట్టాలి.

- అర్థగోళాకారంగా ఉండే కొయ్యపాత్రను తీసుకొని, దానిలో బెల్లపుపొడి, నెయ్యిని తీసుకోండి. ఖాళీగా ఉండి, ఎక్కువ జనసంచారంలేని ప్రాంతంలో చిన్నగోతిని తీసి, పాత్రను దానిలో ఉంచండి. పాత్రలోని నెయ్యి, బెల్లంలను కీటకాలు, పురుగులు, చీమలు తినుటకు వీలుగా పాత్రను అమర్చాలి.
- కుజుడు బలహీనంగా ఉంటే చపాతీపిండిలో పంచదార పొడి కలిపి, చపాతీలు చేసి, వాటిని నిప్పులలో కాల్చి, ఆ తీపిచపాతీలను పేదలకు పంచితే కుజుడు శుభఫలితములను అందిస్తాడు.
- రాహువు బలహీనంగా ఉంటే బార్లీగింజలను పాలతో కడిగి, వాటిని ఒక ఎర్రగుడ్డలో మూటకట్టి, దానిని ఇంటిలో ఉంచుకోవాలి. ముల్లంగి ని దానం చేయాలి. ప్రవహించే నీటిలో బొగ్గును వేయాలి. ఈ క్రియలు చేసిన రాహువు శుభఫలితాలను అందిస్తాడు.
- రవి బలహీనంగా ఉంటే గోధుమలు, బెల్లం దానం చేసిన శుభఫలితాలు అందిస్తాడు.
- చంద్రుడు బలహీనంగా ఉంటే బియ్యం, పాలు దానం చేసిన శుభఫలితాలు అందిస్తాడు.
- గురువు బలహీనంగా ఉంటే శనగలు దానం చేయాలి. బడికి వెళ్ళే పిల్లలకు పుస్తకాలు పంచిన గురువు శుభఫలితాలు అందిస్తాడు.
- శని బలహీనంగా ఉంటే భోజనం చేయునపుడు ముందుగా మూడుముద్దలు అన్నమును (ఆహారాన్ని) విడిగా ఉంచి, వానిని కాకికి పెట్టాలి. శివాలయానికి నువ్వుల నూనెను దీపారాధన నిమిత్తం సమర్పించిన శని శుభఫలితాలు ఇస్తాడు.
- బుధుడు బలహీనంగా ఉంటే భోజనం చేయునపుడు, ముందుగా మూడు ముద్దలు ఆహారాన్ని విడిగా ఉంచి, వానిని ఆవుకు పెట్టాలి. పెసలు దానం చేసిన బుధుడు శుభఫలితాలు అందిస్తాడు.
- కేతువు బలహీనంగా ఉంటే కుక్కలకు చపాతీ పెట్టిన శుభఫలితాలు ఇస్తాడు.
- శుక్రుడు బలహీనంగా ఉంటే భోజనం చేయునపుడు ముందుగా మూడు ముద్దల ఆహారాన్ని విడిగా ఉంచి, వానిని కుక్కకు పెట్టాలి. పేదపిల్లలకు రెడిమేడ్‌బట్టలు యిస్తే శుక్రుడు శుభఫలితాలు అందిస్తాడు.

## గ్రహానుగ్రహానికి మరికొన్ని సూచనలు

1. తినే ఆహారం నుండి మూడు పిడికిళ్ళు తీసి, వాటిని ఆవు, కుక్క, కాకులకు పెట్టండి.
2. రాత్రిపూట నిద్రించునపుడు, తలవద్ద ఒక పాత్రతో నీరు ఉంచి, మరునాటి ఉదయాన ఆ నీటిని మొక్కలకు పోయండి.
3. కుటుంబ సభ్యుల సంఖ్య కంటె కనీసం 2,3 ఎక్కువ తీపి చపాతీలు చేసి, వాటిని జంతువులకు పెట్టండి.
4. చంద్ర, గురులు కలసి ఒకేరాశిలో ఉండుట శుభకరం కాదు. ఆరోగ్యపరంగా, ఆర్థికపరంగా జాతకుడు నష్టపోయే అవకాశం ఉన్నది. అటువంటి సందర్భాలలో ఒక వెండి పళ్ళెమును ఇంటి మూలలో పాతిపెట్టండి. వ్యాపారాభివృద్ధికోసం అనాథలకు తెలుపు, నలుపు దుప్పటి దానం చేయండి. అనాథ పిల్లలకు అరటి పండ్లు పంచండి. ఇంటిమూలలో వైఢూర్యాన్ని పాతిపెట్టండి.

   11 వ భావంలో చంద్రగురులు కలసియుంటే స్వీపర్‌కు లేదా కూతురు లేదా వదినకు ఆర్థికసాయం చేయండి.
5. కుజుడు దుష్ఫలితములను కలిగిస్తుంటే ఏనుగు దంతమును గాని లేదా దానితో చేసిన వస్తువును కాని ఎల్లప్పుడు ఇంటిలో ఉంచండి.
6. గురు, శని కలసియుంటే శనిని శాంతింపచేయండి.
7. గురువు 6వ భావంలో ఉండి, కేతువు అనుకూలుడు కానిచో అనాథపిల్లలకు అరటిపండ్లు పెట్టండి. కుక్కలకు చపాతీ పెట్టండి. అవసరమున్న వారికి పలకరంగు దుప్పటి లేదా తెలుపు నలుపు గడులున్న దుప్పటి దానం చేయండి.
8. గురు, శుక్రులు కలసి యుంటే రోడ్ల నిర్మాణంలో జాతకునికి లాభం చేకూరుతుంది. లేదా గృహనిర్మాణం, బొమ్మలతయారీలలో లాభం వస్తుంది. దేవాలయములకు తరచు వెళ్ళండి. దైవకార్యాలకు సాయపడండి.
9. శని, శుక్రులు కలసియుంటే జాతకుడు మద్యపానానికి దూరంగా ఉండాలి. లేదా పతనం తప్పదు.
10. గురువు లగ్నంలో ఉంటే చంద్రునికి లేదా కేతువుకు సంబంధించిన వ్యాపారాలు ఆర్థిక లాభాన్ని అందిస్తాయి.

11. మకరంలో శని దుష్ఫలితాలను ఇస్తుంటే శనగలను దానం చేయండి. పుష్యరాగంను ఇంటిమూల పాతిపెట్టండి.
12. 10వ భావంలో ఏ గ్రహము లేకపోతే అంధులను ఆదరించండి.
13. 11వ భావంలో రవి యుంటే జాతకుడు మాంసాహారం తినకూడదు.
14. ఏ గ్రహమైనా ఉచ్ఛస్థితిలో ఉన్నపుడు, ఆ గ్రహానికి సంబంధించిన వస్తువు దానం చేయకూడదు.
15. ఏ గ్రహమైనా నీచస్థితిలో ఉన్నపుడు ఆ గ్రహానికి సంబంధించిన వస్తువులు ఎవరివద్ద ఉచితంగా తీసుకోవద్దు.

| గ్రహము | సంబంధించిన వస్తువులు |
|---|---|
| రవి | గోధుమలు, బెల్లం, ఎర్రని మిరపకాయలు, రాగి, తెల్లజిల్లేడు, ఎర్రగులాబి, రక్తచందనం, ముళ్ళున్న చెట్లు, కెంపు, హరివంశపురాణం. |
| చంద్రుడు | బియ్యము, పాలు, చెఱుకు, తేనె, బత్తాయి, నారింజ, దోసకాయ, ఉప్పు, సుగంధద్రవ్యములు, తెల్లటిపూలు, చేపలు, గుర్రము, పాము, కర్పూరము, స్ఫటికములు, ముత్యములు, ఇష్టదేవతారాధన. |
| కుజుడు | కందులు, మసూర్ పప్పు, స్వీట్లు, తగరము, రాగి, శూలము, గొడ్డలి, మట్టిపాత్రలు, పులి, ఒంటె, జింక, గాయత్రిజపం, సుబ్రహ్మణ్యస్వామి ఆరాధన. |
| రాహువు | మినుములు, ఆవాలు, పాములు, అడవిఎలుక, ఏనుగు, గొడుగు, గోమేధికము, దుర్గాపూజ. |
| గురుడు | శనగలు, పనసపళ్ళు, తీయని గుమ్మడికాయలు, పసుపు, రావి, సింహము, ఏనుగులు, రథము, బ్రాహ్మణులు, గురువు, స్నేహితులు, దేవాలయములు, పుణ్యక్షేత్రములు, హోమము, శివపూజ, గురుపూజ, పుష్యరాగం, బంగారం, పుస్తకాలు, పసుపురంగు వస్త్రం. |
| శని | మినుములు, నువ్వులు, నూనె, జమ్మి, ఇనుము, ఉక్కు, సీసము, పాములు, కుక్కలు, గేదెలు, పక్షులు, గ్రుడ్డు, మద్యం, మాంసం, విధవరాలు, వికలాంగులు, బూడిద, నల్లనివస్త్రం, యమధర్మరాజు, రుద్రాభిషేకం. |

| గ్రహము | సంబంధించిన వస్తువులు |
|---|---|
| బుధుడు | పెసలు, ఉత్తరేణి, కంచు, మిశ్రమలోహవస్తువులు, నగలు, పూలు, కలము, పుట్టగొడుగులు, చిలుకలు, మేక, గొర్రె, జ్యోతిష్యులు, తాత, మేనమామ, యంత్రములు, మంత్రములు, తంత్రములు, పచ్చ, దుర్గాస్తోత్రము, విష్ణుసహస్రనామములు, ఆకుపచ్చని వస్త్రము. |
| కేతువు | ఉలవలు, నువ్వులు, కోడి, కుక్క, పంది, రాబందులు, గాడిద, బల్లి, దర్భలు, వైఢూర్యము, సూర్యనమస్కారములు, అరటికాయ, చింతపండు, ఉల్లిపాయ, వెల్లులి. |
| శుక్రుడు | బొబ్బర్లు, పాలు, పెరుగు, వెన్న, పంచదార, ఏలకులు, మిఠాయిలు, పూలు, సుగంధద్రవ్యములు, వెండి, బంగారము, సంగీతసాధనాలు, నృత్యకళాకారులు, గాయకులు, తెల్లటిగొడుగు, కర్పూరము, వజ్రము, అన్నదానం, లక్ష్మీదేవి ఆరాధన, రెడీమేడ్ వస్త్రాలు. |

| జంటగ్రహాలు | సంబంధించిన వస్తువులు |
|---|---|
| రవి + చంద్ర | మర్రిచెట్టుపాలు, గుర్రము. |
| రవి + బుధ | తెల్లనిగాజు, ఎర్రని పటిక |
| రవి + శుక్ర | కంచు, ఎర్రమట్టి, ఎర్రరాయి |
| చంద్ర + శని | తాబేలు, బావి, ఎర్రసిరా, చెడిపోయిన పాలు |
| కుజ + శని | ఖర్జూరాలు, కొబ్బరికాయ |
| కుజ + నీచ బుధ | మెరుస్తున్న ఎరుపురంగు చీర లేదా ఏదైనా స్త్రీలు ధరించే వస్త్రాలు, మాగ్నిఫైయింగ్ గ్లాసు, దానిమ్మపూలు. |
| కుజ + శుభ బుధ | పెళ్ళికూతురు ధరించే ఎర్రని మెరిసే వస్త్రము |
| గురు + చంద్ర | మర్రిచెట్టు |
| గురు + కేతు | పసుపు పచ్చని నిమ్మ |
| బుధ + శని | మామిడిచెట్టు |
| శుక్ర + కుజ | తందూర్ Ruddle (geru) |
| శుక్ర + బుధ | త్రాసు, పిండిమర, సూర్యుని విగ్రహం |
| శుక్ర + శని | నెయ్యి, నల్లని మిరియాలు. |

# 25. అదృష్టగ్రహాలు అనుగ్రహించాలంటే

ఏదైనా ఒక రాశిలో ఒకే ఒకగ్రహము ఉండి, ఆ గ్రహము ఇతర గ్రహాల వీక్షణను పొందకపోతే ఆ గ్రహమును అదృష్టగ్రహము అంటారు. సాధారణంగా ఈ అదృష్టగ్రహము జాతకునికి అనుకూలఫలితాలు ఇస్తాయి. కాని కొన్ని భావాలలో మాత్రం అనుకూల ఫలితాలు రాయవు.

అదృష్టగ్రహాలు ఏ భావాలలో ఉంటే దురదృష్ట గ్రహాలుగా మారతాయో, వాటి దుష్ఫలితాల తీవ్రతను ఎలా తగ్గించాలో పురాతన గ్రంధాల ననుసరించి తెలుసుకుందాము.

**1.రవి :-** రవి ఒంటరిగా కన్య, తుల, మకరంలలో ఉండి, ఇతర గ్రహాల వీక్షణ లేకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- ప్రవహించే నదిలో బెల్లం వేయాలి.

**2.చంద్రుడు:-** చంద్రుడు ఒంటరిగా కన్య, వృశ్చికం, మకరం, కుంభం, మీనంలలో ఉండి, ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభ ఫలితాలను ఇస్తాడు.

నివారణ :- ఒక పాత్ర నిండా నీటినితీసుకొని, దానిని రాత్రి పడుకొనే సమయాన తలవైపు ఉంచుకోవాలి. మరునాడు ఉదయం ఆ నీటిని రావిచెట్టు మొదట్లో పోయాలి.

**3.కుజుడు:-** కుజుడు కర్కాటకం, వృశ్చికంలలో ఒంటరిగా ఉండి, ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- నువ్వులు, పంచదారతో చేసిన జీడీలను పంచాలి.

**4.రాహువు:-** రాహువు మేషం, వృషభం, సింహం, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనంలలో ఒంటరిగా ఉండి ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- ప్రవహించే నీటిలో బొగ్గును వేయాలి. ముల్లంగిని దానం చేయాలి.

**5.గురువు:-** గురువు వృషభం, కర్కాటకం, సింహం, తులలలో ఒంటరిగా ఉండి, ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- నిత్యం కుంకుమను ధరించాలి.

**6. శని :-** శని మేషం, కర్కాటకం, సింహం, కన్యలలో ఒంటరిగా ఉండి, ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- నూనెలో నీ ముఖం యొక్క ప్రతిబింబాన్ని చూచి, ఆ నూనెను ఎవరికైనా ఇవ్వాలి.

**7. బుధుడు :-** బుధుడు మిధునం, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనంలలో ఒంటరిగా ఉండి, ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- మధ్యలో రంధ్రం కలిగిన రాగి బిళ్ళ లేదా రాగి ముక్కను ప్రవహించే నీటిలో వేయాలి.

**8. కేతువు :-** కేతువు మిధునం, కర్కాటకం, సింహం, కన్య, వృశ్చికంలలో ఒంటరిగా ఉండి, ఇతర గ్రహాల వీక్షణ పొందకపోతే అశుభఫలితాలు ఇస్తాడు.

నివారణ :- కుక్కలకు చపాతీ పెట్టాలి.

**9. శుక్రుడు :-** శుక్రుడు మేషం, కన్య, ధనుస్సులలో ఒంటరిగా ఉండి ఇతర గ్రహాల వీక్షణ లేకపోతే అశుభఫలితాలను ఇస్తాడు.

నివారణ :- గోశాలకు పశుగ్రాసం దానం చేయాలి.

గ్రహాలకు పైన సూచించిన (అశుభఫలితాలను అందించే) రాశులలో తప్ప, మిగిలిన రాశులలో ఒంటరిగా ఉండి, ఇతర గ్రహాల వీక్షణ లేకపోతే ఆ గ్రహాలు అదృష్ట గ్రహాలు అవుతాయి. ఆ గ్రహాల దశలో జాతకుడు శుభఫలితాలు పొందుతాడు.

# 26. నవగ్రహ దోషనివారణకు జపములు

**నవగ్రహస్తోత్రము :-**

ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

**రవి స్తుతి :-**

జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మిదివాకరమ్ ॥

రవికోసం పైమంత్రమును 6,000 సార్లు జపించాలి. రుద్రాభిషేకం చేయించి గోధుమలు, బంగారం దానం చేయాలి.

**చంద్ర స్తుతి :-**

దధి శంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవం ।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్ ॥

చంద్రుని కోసం పై మంత్రమును 10,000 సార్లు జపం చేయాలి. దుర్గాపూజ చేసి బియ్యం, వెండి దానం చేయాలి.

**కుజ స్తుతి :-**

ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంచన సన్నిభం
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥

కుజుని కోసం పై మంత్రమును 7,000 సార్లు జపం చేయాలి. సుబ్రహ్మణ్య పూజ చేసి, కందులు దానం చేయాలి.

**రాహు స్తుతి :-**

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం
సింహికాగర్భ సంభూతం రాహుంతం ప్రణమామ్యహం ॥

రాహువు కోసం పై మంత్రమును 18,000 సార్లు జపం చేయాలి. దుర్గాపూజ చేసి మినుములు దానం చేయాలి.

**గురు స్తుతి :-**

దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం నమామి బృహస్పతిం ॥

గురువు కోసం పై మంత్రమును 16,000 సార్లు జపం చేయాలి. రుద్రాభిషేకం చేయించి శనగలు దానం చేయాలి.

**శని స్తుతి :-**

నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం ॥

శనికోసం పై మంత్రమును 19,000 సార్లు జపం చేయాలి. తైలాభిషేకం చేయించి నువ్వులు దానం చేయాలి.

**బుధ స్తుతి :-**

ప్రియంగు కళికా శ్యామం రూపేణ ప్రతిమం బుధం
సౌమ్యం సత్యగుణోపేతం తంబుధం ప్రణమామ్యహం ॥

బుధుని కోసం పైమంత్రమును 17,000 సార్లు జపం చేయాలి. శ్రీ మహావిష్ణుపూజ చేసి, పెసలు దానం చేయాలి.

**కేతుస్తుతి :-**

పలాశ పుష్ప సంకాశం తారకాగ్రహ మస్తకం ।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం ॥

కేతువు కోసం పైమంత్రమును 7,000 సార్లు జపం చేయాలి. సూర్య నమస్కారములు చేసి ఉలవలు దానం చేయాలి.

**శుక్రస్తుతి :-**

హిమ కుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుం।
సర్వ శాస్త్రప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం ॥

శుక్రుడు కోసం పైమంత్రమును 20,000 సార్లు జపం చేయాలి. మహా లక్ష్మిపూజ చేసి, బొబ్బర్లు దానం చేయాలి.

ప్రతి ఒక్కరు ప్రతిరోజు నవగ్రహ స్తుతిని కనీసం 9 సార్లు జపం చేసిన శుభం కలుగుతుంది.

# 27. నవగ్రహ దోష నివారణకు నవగ్రహ హోమం

జీవితం నిస్సారంగా తయారైనపుడు, అనుకున్నపని జరగనప్పుడు, ప్రతిపనికీ ఆటంకాలు ఎదురౌతున్నపుడు, ఏ వ్యాపారం చేస్తున్నా నష్టం వస్తున్నపుడు, ఎన్ని పూజలు చేసినా ఫలితం లేనప్పుడు, ఆత్మధైర్యం కోల్పోతున్నపుడు, కష్టపడి పనిచేసినా ఫలితం శూన్యమైనపుడు, చేజిక్కిన అధికారం కోల్పోయినపుడు, అవకాశాలు ఉన్నా అధికారం, పదవి అందకపోయినపుడు ... ఇలా ఎన్నో సమస్యలకు పరిష్కారం నవగ్రహహోమం. శ్రద్ధగా ఈ హోమాన్ని నిర్వర్తిస్తే ఫలితం ఉత్తమంగా ఉంటుంది.

నిజానికి నవగ్రహహోమం స్వయంగా జరుపుకోవటం అందరికీ సాధ్యమయ్యే పనికాదు. అయినా ప్రయత్నిస్తే సాధ్యంకానిది లేదు అని పట్టుదలతో విషయాన్ని నేర్చుకొని ఆచరించేవారు కొందరు ఉంటారు. వారికోసం, స్వరయుక్తంగా మంత్రోచ్చారణ చేయగల వారికోసం ఈ నవగ్రహహోమ విధానాన్ని తెలియ జేస్తున్నాను.

ఈ నవగ్రహహోమ విధానం, దానిలో ఉపయోగించే మంత్రాలు నా స్వంతం కావు. అనూచానంగా వేదాలలో, పురాణాలలో, పూర్వీకుల నుండి సాంప్రదాయకంగా వచ్చిన పూజావిధానాల నుండి గ్రహించబడినవి.

నవగ్రహహోమం చేయు పద్ధతిని ముందుగా తెలుసుకుందాం. 1. సంకల్పం 2. గణపతిపూజ 3. కలశస్థాపన 4. పుణ్యాహవాచనము 5. ఋత్విగ్వరణము 6. పంచలోకపాలక పూజ 7. నక్షత్రపూజ 8. నవగ్రహమండప నిర్మాణం. 9. నవగ్రహారాధన 10. నవగ్రహాల ఆవాహన, పూజ 11. ఉపగ్రహముల ఆవాహన, పూజ. 12. దిక్పాలకుల ఆవాహన, పూజ 13. త్రిమూర్తుల ఇతర దేవతల ఆవాహన పూజ 14. సమిష్టి పూజ 15. మంత్రపుష్పం 16. నవగ్రహాల జపం 17 నవగ్రహమంత్ర తర్పణం 18. నవగ్రహహోమ ప్రారంభం 19. షట్పాత్రప్రయోగం 20. నక్షత్రహోమం 21. నవగ్రహ హోమం 22. అష్టదిక్పాలకుల మంత్రములు - హోమం 23. పంచలోక పాలకుల, ఉపగ్రహముల మంత్రములు - హోమం 24. జయాది హోమం 25. స్విష్టకృత్ హోమం 26. ప్రాయశ్చిత్తహోమము 27. పూర్ణాహుతి 28. పూర్ణపాత్రోదక ప్రోక్షణం 29. బ్రహ్మవిసర్జనం 30 దానములు 31. మండప ఉద్వాసన 32. ఆశీర్వాదము.

ఈ వరుస క్రమంలో నవగ్రహ హోమం జరుగుతుంది. సాధారణంగా ముందుగానే నవగ్రహాలకు జపం చేసి తరువాత నవగ్రహపూజ, నవగ్రహహోమం చేస్తారు. ఎందుకంటే ప్రస్తుత పరిస్థితులలో నవగ్రహజపం ఒక రోజులో పూర్తి అయ్యే ప్రక్రియ కాదు.

సంకల్పం అంటే మనం ఒక లక్ష్యానికి లేదా ఒక క్రియ నిర్వహించుటకు బద్ధులమయి, ఆపనిని ఏకాగ్రతతో, విజయవంతంగా పూర్తిచేయుటకు నిశ్చయించుకొనుట, అందువలన గణపతిపూజ, కలశ స్థాపన, మంత్ర తర్పణం, జపం, హోమం ఇలా ఏ కార్యమునైనా ప్రారంభించుటకు ముందుగా సంకల్పము చెప్పుకోవాలి.

నవగ్రహపూజ, హోమము చేయుటకు ముందుగా వాటికి కావలసిన ద్రవ్యములును తెలుసుకుందాము.

**1. పూజకు కావలసిన ద్రవ్యములు :-**

1. పసుపు 2. కుంకుమ 3. తమలపాకులు 4. వక్కలు 5. అగరుబత్తీలు 6. దీపపు ప్రమిద 7.వత్తులు 8. కర్పూరం 9. బియ్యము 10. కొబ్బరికాయలు 11. పసుపు కొమ్ములు 12. ఖర్జూర పండ్లు 13. రావి మండలు 14. జువ్విమండలు 15. మేడి మండలు 16. మర్రిమండలు 17. మామిడి మండలు 18. పంచ గవ్యములు (ఆవుపేడ, ఆవు పంచితము, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి) 19. దర్భలు 20. ఆరు చిన్న గిన్నెలు 21. ధాన్యము 22. దారము 23. తొమ్మిది రాగి పాత్రలు లేదా ఇతర లోహపాత్రలు 24. శతచ్ఛిద్రకలశం (చిల్లులున్న పాత్ర) 25. బంగారు లక్ష్మీనారాయణ ప్రతిమ 26. కలశములపైకి తెల్లని వస్త్రములు 27. మండపారాధనకు ఆయా రంగుల వస్త్రములు 28. నవగ్రహ ధాన్యములు (గోధుమలు, బియ్యము, కందులు, పెసలు, శనగలు, బొబ్బర్లు, నువ్వులు, మినుములు, ఉలవలు) 29. దక్షిణకొరకు నాణెములు 30. పుట్టమన్ను 31. నాలుగు రోడ్ల కూడలిలోని మట్టి 32. పశువుల శాలలోని మట్టి. 33. పండ్లు.

**2. మంత్రతర్పణముకు కావలసిన ద్రవ్యములు :-**

ఆవుపాలు

**3. హోమముకు కావలసిన ద్రవ్యములు :-**

1. నవగ్రహ సమిధలు

(జిల్లేడు, మోదుగ, చంద్ర, ఉత్తరేణి, రావి, మేడి, జమ్మి, గరిక, దర్భలు)

2. నవగ్రహ ధాన్యములు

(గోధుమలు, బియ్యము, కందులు, పెసలు, శనగలు, బొబ్బర్లు, నువ్వులు, మినుములు ఉలవలు)

3. ఆవునేయి, 4. బియ్యపు పిండి, 5. స్రుక్స్రువములు 6. ఇధ్మము 7. దర్భలు 8. ఆజ్యపాత్ర 9. ప్రోక్షణ పాత్ర 10. పూర్ణపాత్ర 11. చరువు పాత్ర 12. కొబ్బరి కుండలు. 13. కొబ్బరి కురిడి 14. పట్టుగుడ్డ 15. సుగంధ ద్రవ్యములు.

ఆయా గ్రహములకు సంబంధించిన సమిధలు, ధాన్యములు, మంత్రజపసంఖ్య, అధిదేవత, ప్రత్యధి దేవతలను తెలుసుకుందాం.

| గ్రహము | అధిదేవత | ప్రత్యధిదేవత | ధాన్యము | సమిధ | జపసంఖ్య |
|---|---|---|---|---|---|
| రవి | అగ్ని | రుద్రుడు | గోధుమ | జిల్లేడు | 6,000 |
| చంద్ర | ఆపః | గౌరి | బియ్యం | మోదుగ | 10,000 |
| కుజ | పృధ్వి | క్షేత్రపాలకుడు | కందులు | చంద్ర | 7,000 |
| బుధ | విష్ణువు | నారాయణుడు | పెసలు | ఉత్తరేణి | 17,000 |
| గురు | బ్రహ్మ | ఇంద్రుడు | శనగలు | రావి | 16,000 |
| శుక్ర | ఇంద్రాణి | ఇంద్రమరుత్వంతుడు | బొబ్బర్లు | మేడి | 20,000 |
| శని | యముడు | ప్రజాపతి | నువ్వులు | జమ్మి | 19,000 |
| రాహువు | గోవు | సర్పము | మినుములు | గరిక | 18,000 |
| కేతువు | చిత్రగుప్తుడు | బ్రహ్మ | ఉలవలు | దర్భ | 7,000 |

ఉపాసన మంత్రజపము, తర్పణము, హోమము, మార్జనము, బ్రాహ్మణ సమారాధన అను వరుసలో జరుగుతుంది.

పరాశరస్మృతి ప్రకారం ఏ మంత్రమయినా సిద్ధించాలంటే

మంత్రజప సంఖ్యకు 4 రెట్లు జపం చేయాలి.

ఉదాహరణకు రవిమంత్రమును 6,000×4=24,000 సార్లు జపం చేయాలి.

తర్పణము చేయునపుడు జపసంఖ్యలో 10 వంతు,
హోమం చేయునపుడు జపసంఖ్యలో 100 వంతు,
మార్జనం చేయునపుడు జపసంఖ్యలో 1000 వంతు,
మూలమంత్రమును జపించాలి

కనీసం జపసంఖ్యలో 10,000 వంతు సంఖ్యకు సమానమగు
పూర్ణసంఖ్యలో మనుషులకు భోజనం పెట్టాలి.

ఉదాహరణకు చంద్రుని జపసంఖ్య 10,000. దోష నివారణకు చంద్రగ్రహమూల మంత్రమును 40,000 సార్లు జపించాలి. కావున కనీసం 4గురికైనా భోజనం పెట్టాలి.

జప హోమాలు నిర్వహించునపుడు రకరకాల మంటపములను నిర్మించ వలసి ఉంటుంది. అనగా ముగ్గులో మంటముల ఆకారములను నిర్మించాలి. వాటిగురించి తెలుసుకుందాము.

## సర్వతోభద్రమండలం






## పంచలోక పాలక పూజ

పంచలోకపాలకులయిన 1. గణపతి 2. బ్రహ్మ 3. విష్ణువు 4. రుద్రుడు 5. గౌరిలను చతురస్రాకారముగా ఉన్న మంటపము పైకి ఆవాహన చేస్తారు. ఎవరిని ఏ స్థానంలో ఆవాహన చేస్తారో ప్రక్కపటంలో గుర్తించ బడింది.

## నవగ్రహ మండపం - దానిలో నవగ్రహ స్థానములు :-

మండపం మధ్యలో వృత్తాకారంలో రవిని, మండపమునకు ఆగ్నేయంలో చతురస్రాకారంలో చంద్రుడును, మండపమునకు దక్షిణమున త్రిభుజాకారంలో కుజుడిని, మండపమునకు నైరుతిలో చేట ఆకారంలో రాహువును, మండపమునకు పడమరలో ధనుస్సు ఆకారంలో శనిని, మండపమునకు వాయవ్యంలో జెండా ఆకారంలో కేతువును, మండపమునకు ఉత్తరములో దీర్ఘచతురస్రాకారంలో గురువును, మండపమునకు ఈశాన్యములో బాణాకారంలో బుధుడిని, మండపంలో తూర్పులో నక్షత్రాకారంలో శుక్రుడిని స్థాపించాలి.




ప్రతి గ్రహముకు కుడివైపున (పటంలో B స్థానంలో) ప్రత్యధిదేవతను ఎడమవైపున (పటంలోA స్థానంలో) అధిదేవతను స్థాపించాలి.

అర్చనా విధిలో ప్రతిదైవకార్యాన్ని ప్రారంభించుటకు ముందు ఆచమనము, భూతోచ్చాటనము, ప్రాణాయామము తరువాత సంకల్పము తప్పనిసరిగా చేయాలి. దీపారాధన చేసి నమస్కరించి ఆచమనము చేయాలి.

ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయస్వాహా, గోవిందాయ నమః, విష్ణవే నమః, ఓం మధుసూధ నాయనమః । ఓం త్రివిక్రమాయ నమః। ఓం వామనాయనమః । ఓం శ్రీధరాయనమః। ఓం హృషీకేశాయనమః । ఓం పద్మనాభాయ నమః। ఓం దామోదరాయనమః । ఓం సంకర్షణాయనమః। ఓం వాసుదేవాయ నమః। ఓం ప్రద్యుమ్నాయనమః। ఓం అనిరుద్ధాయ నమః। ఓం పురుషోత్తమాయ నమః। ఓం అధోక్షజాయ నమః। ఓం నారసింహాయ నమః। ఓం అచ్యుతాయనమః । ఓం జనార్దనాయనమః। ఓం ఉపేంద్రాయ నమః । ఓం హరయేనమః। ఓం శ్రీకృష్ణాయ నమః ॥

**1. దేవతా నమస్కారము**

శ్లో॥ యశ్శివోనామ రూపాభ్యాం యాదేవీ సర్వమంగళా ।
తయోస్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్ ॥

శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
యేషా మిందీవర శ్యామో హృదయస్థో జనార్దనః ॥

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్॥

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే।
శరణ్యేత్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తుతే॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః, ఉమామహేశ్వరాభ్యాం నమః వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః, శచీ పురందరాభ్యాం నమః, అరుంధతీ వసిష్ఠాభ్యాం నమః, శ్రీ సీతా రామాభ్యాం నమః, సర్వేభ్యో మహాజనేభ్యో నమః, అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు"

**భూశుద్ధిః :- (భూతోచ్చాటనము)**

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః సర్వేతే భూమి భారకాః।
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

**ప్రాణాయామం :-**

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యమ్,

ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।

ధియో యోనః ప్రచోదయాత్॥ ఓ మాపో
జ్యోతీ రసోఽ మృతం బ్రహ్మభూర్భువ స్సువరోమ్॥

## సంకల్పః :-

మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహా విష్ణోరాజ్ఞాయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః, ద్వితీయ పరార్థే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే (తాము ఉన్న ప్రదేశము శ్రీశైలమునకు యే దిశలోనున్నదో ఆ దిశ), శోభన గృహే సమస్త దేవతా బ్రాహ్మణ సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చంద్రమానేన............సంవత్సరే........ఆయనే........ ఋతౌ............ మాసే..........పక్షే............తిథౌ.............వాసరే శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్..............గోత్రః.......... నామధేయః ధర్మపత్నీ సమేతోఽహమ్, శ్రీమతః........... ృగోత్రస్య......... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం మమ కుటుంబస్య క్షేమ స్థైర్య విజయాభయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుష ఫలావాప్త్యర్థం, చింతితే మనోరథ సిద్ధ్యర్థం, శ్రీ ఆదిత్యాది నవగ్రహ ముద్దిశ్య నవగ్రహ ప్రీత్యర్థం, తత్కాల

గ్రహచారగత దోషనివారణార్థం, సర్వగ్రహశాంతి సిద్ధ్యర్థం నవగ్రహ పూజాం కరిష్యే. ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణపతి పూజాం కరిష్యే, తదంగ కలశారాధనం కరిష్యే।

(ఒక కలశము (చెంబు)లో నిండుగా నీరుపోసి, పైన గంధము, కుంకుమ బొట్లు పెట్టి కలశములో మామిడాకులు, పుష్పములు అక్షింతలు వేసి బియ్యముతో మన్న పళ్ళెములో ఆ కలశము నుంచి నమస్కరించి)

కలశం గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య-

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః।
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యేమాతృ గణాస్స్మృతాః॥

శ్లో॥ కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా।
ఋగ్వేదోఽథ యజుర్వేదస్సామవేదోహ్యథర్వణః॥

శ్లో॥ అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః॥
కలశే గంధ పుష్పాక్షతాన్నిక్షిప్య, హస్తేనాచాద్య-
(కలశమునందు గంధ పుష్పాక్షతలు వేసి, కలశమును చేతితో మూసి)

ఆ కలశేషు ధావతి పవిత్రే పరిషించ్యతే।
ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే । ఆపోవా ఇదగ్ం సర్వం
విశ్వా భూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ
ఆపోఽ న్నమాపోఽ మృత మాపస్సమ్రా డాపో
విరాడా పస్స్వ రాడాపశ్ఛందాగ్ంస్యాపో
జ్యోతీ గ్ంష్యాపో యజ్జూగ్ ష్యాప స్సత్యమాప
స్సర్వా దేవతా ఆపో భూర్భువ స్సువరాప ఓమ్॥

శ్లో॥ గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి।
నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్సన్నిధిం కురు॥

ఆయాం తు శ్రీ నవగ్రహ శాంతి పూజాంగ భూతం శ్రీ మహాగణాధిపతి పూజార్థం మమ దురితక్షయ కారకాః।

కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య - దేవమాత్మానం చ సంప్రోక్ష్య - (కలశము లోని నీటిని పూవులు లేక మామిడాకులతో పూజాద్రవ్యముల మీద, తనమీద చల్లుకోవాలి.) (తరువాత ఒక తమలపాకుపై పసుపు ముద్దను పిరమిడ్‌వలె చేసిపెట్టి, పళ్ళెములోని బియ్యముపై తమలపాకుపై నున్న పసుపు వినాయకుని ఉంచవలెను. అట్లుంచుచూ)

# గణపతి పూజా

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునఃప్రాణ
మిహనో దేహి భోగమ్, జ్యోక్పశ్యేమ సూర్య
ముచ్చరంత మనుమతే మృడయాన స్వస్తి।
అమృతం వైప్రాణా అమృత మాపః ప్రాణానేవ
యథాస్థాన ముపహ్వాయతే॥ స్థిరోభవ।
వరదోభవ। సుముఖోభవ। సుప్రసన్నోభవ। స్థిరాసనం కురు।
ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమ శ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభి స్సీదసాధనమ్॥
శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి॥
తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి।
తన్నోదంతిః ప్రచోదయాత్॥ ఆవాహయామి ।
సువర్ణ రత్న ఖచిత సింహాసనం సమర్పయామి।
పాదయోః పాద్యం సమర్పయామి॥
హస్తయోరర్ఘ్యం సమర్పయామి।
శుద్ధాచమనీయం సమర్పయామి.
ఓ ఆపోహిష్ఠా మయో భువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివమాతరః।
తస్మా అరంగమామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జన యథా చ నః॥

శ్రీ మహాగణాధిపతయే నమః - శుద్ధోదక స్నానం సమర్పయామి। స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి।

ఓం అభివస్త్రా సువసనా న్య ర్షాభిధేనూ
స్సుదుఘాః పూయమానాః। అభి
చంద్రా భర్తవేనో హిరణ్యాభ్యశ్వాన్రథినో
దేవసోమ॥శ్రీ మహాగణాధిపతయే నమః।

వస్త్రయుగ్మం సమర్పయామి। తదభావే వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి।

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్।

ఆయుష్య మగ్ర్యం ప్రతిమంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజః॥

శ్రీ మహాగణాధిపతయే నమః। యజ్ఞోపవీతం సమర్పయామి॥

తదభావే అక్షతాన్ సమర్పయామి॥

గంధద్వారాం దురాధర్షాం నిత్య పుష్టా కరీషిణీమ్।

ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥

శ్రీ మహాగణాధిపతయే నమః। శ్రీ గంధం సమర్పయామి॥

ఆయనే తే పరాయణే దూర్వా రోహంతు పుష్పిణీః।

హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే॥

శ్రీ మహాగణాధిపతయే నమః। గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి॥ పుష్పైః పూజయామి॥

ఓం సుముఖాయ నమః। ఓం ఏకదంతాయ నమః। ఓం కపిలాయ నమః। ఓం గజకర్ణకాయ నమః। ఓం గణాధిపాయ నమః। ఓం ధూమకేతవే నమః। ఓం గణాధ్యక్షాయ నమః। ఓం ఫాలచంద్రాయ నమః। ఓం గజాననాయ నమః। ఓం వక్రతుండాయ నమః। ఓం శూర్పకర్ణాయ నమః। ఓం హేరంబాయ నమః। ఓం స్కంధపూర్వజాయ నమః। ఓం శ్రీ మహాగణాధిపతయే నమః। షోడశనామ పూజాం సమర్పయామి।

శ్లో॥ వనస్పత్యుద్భవైర్దివ్యై ర్నానాగంధై స్సుసంయుతం।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్॥
శ్రీ మహాగణాధిపతయే నమః। ధూపమాఘ్రాపయామి॥

శ్లో॥ సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినాయోజితం ప్రియమ్।
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్॥
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే।
త్రాహిమాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోఽస్తుతే॥
శ్రీ మహాగణాధిపతయే నమః। దీపం దర్శయామి॥
ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి॥

నైవేద్యమ్ :-

ఓం భూర్భువస్సువః॥ ఓం తత్సవితుర్వరేణ్యం

భర్గో దేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్॥

సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణ మసి॥

శ్రీ మహాగణాధిపతయే నమః॥ నైవేద్యం సమర్పయామి.

ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా

ఓం సమానాయస్వాహా॥ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.

అమృతాపిధాన మసి। ఉత్తరాపోఽశనం సమర్పయామి।
హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి॥

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతమ్।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్
శ్రీ మహాగణాధిపతయే నమః॥ తాంబూలం సమర్పయామి

శ్లో॥ సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః॥
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః॥

శ్లో॥ ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః॥
వక్రతుండశ్శూర్పకర్ణో హేరంబస్కందపూర్వజః॥
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి।
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా।
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే॥

శ్రీ మహాగణాధిపతయే నమః. సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి.
ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

శ్లో॥ యస్యస్మృత్యా చ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతమ్॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్సర్వాత్మకః॥ శ్రీ మహాగణాధిపతి స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భూత్వా ఉత్తరే శుభకర్మణ్యా విఘ్నమస్త్వితి భవంతో బ్రువంతు। ఉత్తరే శుభకర్మణ్యా విఘ్నమస్తు శ్రీ

మహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి॥ (పూజ చేసిన పూలను ప్రసాదంగా శిరస్సున ధరించాలి).

**ఉద్వాసన :-**

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్।

తేహనాకం మహిమాన స్సచంతే యత్రపూర్వే సాధ్యాసంతి దేవాః॥

శ్రీ మహాగణపతిం యథాస్థానం ప్రతిష్ఠాపయామి॥

శోభనార్థం పునరాగమనాయచ॥

శ్లో॥ వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ।

అవిఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా॥ -ఓం తత్సత్

(ఇంతవరకూ పూజించిన పసుపు విఘ్నేశ్వరుని పళ్ళెముతో సహా ఆ స్థానము నుండి కదిపి ప్రక్కన పెట్టవలెను.)

## కలశారాధనము

గృహస్య ఈశాన్య దిగ్భాగే గ్రహారాధనం కుర్యాత్॥

నూతన వస్త్రద్వయేన మంటపద్వయం ఆసాద్య।

తస్యోపరి యథాశక్తి తండులాన్నిక్షిప్య।

తత్ర తామ్ర నిర్మిత కలశద్వయం నిధాయ।

తత్ర పంచపల్లవాని నారికేళాది ఫలపుష్పాది

కలశేనిధాయ। నూతన వస్త్రేణావేష్ట్య॥

(గృహమందలి ఈశాన్య భాగమున సమ చతురస్రముగ భూమిని గోమయము చేత నలికి, అయిదురంగుల ముగ్గులతో నలంకరించవలెను. ఆ ముగ్గులు సర్వతోభద్ర మండలము వలె వేయుట శుభము. తర్వాత ఆ మండపముపై తెల్లనివి, అంచులు కలిగినవియైన రెండు క్రొత్త వస్త్రములను చతురస్రములుగా మడచి, అంచులు ఉత్తరమునకు గాని, తూర్పునకు గాని వచ్చునట్లు పరచవలెను. వాటిపై తమ శక్తికొలది బియ్యమును పోసి వాటిపై రెండు రాగిపాత్ర (చెంబు-గ్లాసు)లను పెట్టవలెను. వాటికి తిరిగి నూతన వస్త్రములను చుట్టబెట్టి, వాటిలో మామిడి నేరేడు మొదలగు ఆకుల నుంచవలెను.

(పదకొండు దర్భలతో కూర్చను ముడివేసి మంత్రములను చెప్పుచు దానితో పూజాద్రవ్యములను తాకుచుండవలెను.)

మంత్రం:- స్యోనా పృథివి భవానృక్షరాని వేశనీ।
యచ్ఛాన శ్శర్మ సప్రథా:॥

(ఈ మంత్రమును చెప్పుచు కూర్చతో భూమిని తాకవలెను. తరువాత క్రింది మంత్రములను చదువుచూ భూమిపై వస్త్రములను పరచి, దానిపై బియ్యమును పోసి నలుచదరముగా నెరపి, మధ్యను, కుడిచేతి ప్రక్కను కలశముల నుంచవలెను.)

## సర్వతోభద్ర మండలము (ముగ్గు)



మంత్రం:- ఏవతో కాయతనయాయ ధాన్యాం బీజం వహద్బ్యై అక్షితం।
అస్మభ్యం తద్ధత్తనయ ద్యయీ మహోరాధో విశ్వాయు సౌభగం॥

మం॥ అవ్రణాన్, సుదృఢాన్, కలశాన్ నిధాయ, తేషాం తన్తు వ్రన్వన్నితి తన్తునావేష్ట్య తన్తుప్త వ్యవ్రజసో భాను మన్విః॥ జ్యోతిష్మత: పరథోక్షధియాకృతాన్।
అనుల్బణం వయత జోగునామపో మనుర్భవ జనయా దైవ్యంజనం॥
మధ్యే ప్రధానకలశం. ప్రాచ్యాం అన్య కలశాన్నిధాయ।

మం॥ ఆ కలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే। ఉక్థైర్యజ్ఞేష వర్ధతే।
ఆ కలశేషు ధావతి శ్యేనోవర్మ విగాహతే। అభిద్రోణి కవిక్రదత్॥

మం॥ యా ఓషధీ స్సోమ రాజ్ఞీర్బ హ్వాశ్శత విచక్షణాః॥
తాసాంత్వమస్యుత్తమార్థం కామాయ శంహ్నదే॥

(పై మంత్రాన్ని చెప్తూ ఆ కలశములందు పిల్లపీచరములు గోరింట, విష్ణుక్రాంత్ర వ్రేళ్ళను, లేక ఏ ఒక్కదాని వ్రేళ్ళైనను, అవియు లేవిచో డబ్బునాణెమును వేయాలి.)

మం॥ ఓషధయస్సంవదన్తే సోమేన సహరాజ్ఞా।
యస్మైకరోతి బ్రాహ్మణస్తగ్ం రాజన్పారయామసి॥

(అను మంత్రాన్ని చదువుతూ నవధాన్యములను కొంచముగా (చాలా తక్కువగా) ఆ పాత్రలలో వేయాలి.)

మం॥ ఉధృతా శిరరాహోణ కృష్ణేన శతబాహునా।
మృత్తికే హనమే పాపం యన్మయా దుష్కృతం కృతం।
మృత్తికే బ్రహ్మదత్తాసి కాశ్యపే నాభి మంత్రితా।
మృత్తికే దేహి మే పుష్టిం త్వయి సర్వం ప్రతిష్ఠితం।
మృత్తికే ప్రతిష్ఠితే సర్వం తన్మేనిర్నుద మృత్తికే।
తయాహతేన పాపేన గచ్ఛామి పరమాం గతిం॥

(పై మంత్రాన్ని చదువుతూ నీళ్ళ మడుగులోని మన్ను, ఆవులు మొ॥ పశువులున్న స్థలములోని మన్ను, బండ్లు, వాహనములున్న చోట మన్ను, వీధిద్వారము ముందరి మన్ను, పుట్టమన్ను, నాలుగుదారులు కలపినచోటి మన్ను తెచ్చి కొంచముగా కలశము లలో వేయాలి. పువ్వులు/అక్షితలు వేయాలి.)

మం॥ రువతి భీమో వృషభస్త విష్యయా శృంగే శిశానో హరిణి విచక్షణః॥
అయోనిం సోమ సుకృతం నిషీదతి గవ్యయాత్వగ్భ వతి నిర్ణిగవ్యమ్॥

(పై మంత్రాన్ని చదువుతూ మేడి, మర్రి, రావి, జువ్వి, మామిడి చెక్కలను కలశములో వేయాలి.)

మం॥ ప్రవో యజ్ఞేషు దేవయన్తో అర్చం ద్యావానమోభిః॥
పృథివీ ఇషధ్యై ఏషాం బ్రహ్మాణ్య సమాని విప్రాణి
విష్వగ్వ్యేత్తివని వోనశాఖాః॥

(పై మంత్రాన్ని చెబ్తూ మర్రి, మామిడి, రావి, జువ్వి, మేడిమండలు (ఆకులతో నున్న చిన్న కొమ్మలు) కలశాలలో పెట్టాలి.)

మం॥ సహిరత్నాని దాశుషే సువాతి సవితా భగః।
తం భాగం చిత్రమీ మహే॥

(ఈ మంత్రాన్ని చదువుతూ ముత్యం, పగడాది రత్నములను లేదా డబ్బు నాణెములను కలశములలో వేయాలి.)

మం॥ గంధద్వారాన్దురా ధర్షాన్నిత్య పుష్టాం కరీషిణీం।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం॥

(ఈ మంత్రాన్ని చెబ్తూ కుంకుమ, గంధము, గోరోచనము, అగరు మొ॥ సుగంధ ద్రవ్యాలని కలశములలో వేయాలి.)

మం॥ ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య
ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్॥
(ఈ మంత్రాన్ని చదువుతూ గోమూత్రాన్నీ కలశములలో వేయాలి.)

మం॥ గన్ధద్వారాన్దురా ధర్షాన్నిత్యపుష్టా కరీషిణీం,
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం॥
(ఈ మంత్రాన్ని చెప్తూ ఆవుపేడను కలశములలో వేయాలి.)

మం॥ ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగధే॥
(ఈ మంత్రం చెప్తూ కలశములలో ఆవుపాలు వేయాలి.)

మం॥ దధిక్రావుణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్యవాజినః।
సురభినోముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
(పై మంత్రముతో ఆవుపెరుగును కలశాలలో వేయాలి.)

మం॥ శుక్రమసి జ్యోతిరసితేజోసి దేవోవస్సవితో
త్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
(పై మంత్రం చెప్తూ ఆవు నెయ్యిని కలశాలలో వేయాలి.)

మం॥ దేవస్యత్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం।
పూష్ణోహస్తాభ్యామాధదే॥
(ఈ మంత్రాన్ని చెప్తూ దర్భలను కలశములలో పెట్టి కొంచం నీరుపోయాలి.)

మం॥ కాండాత్కాండాత్ప్రరోహన్తీ పరుషః పరుషః పరి।
ఏవానో దూర్వేప్రతను సహస్రేణ విలోహసి।
తస్యాస్తే దేవీష్టకే మావిషావయం।
పునంతు మాదేవజనాః। మనస్తు మనవోధియా।
విశ్వేదేవాః పునీతమా। జాతవేదః పునీహిమా॥
మం॥ యాః ఫలినీర్యా అఫలా అ పుష్పాః యాశ్చ పుష్పిణీః।
బృహస్పతి ప్రసూతాస్తో నోముంచన్త్వగ్ంహసః॥
(పై మంత్రాలను చెప్తూ కలశములలో దూర్వాలను (గరికగడ్డి పోచలను) పుష్పములు, పండ్లను పెట్టాలి.)
మం॥ ఇమంగే గంగేయమునే సరస్వతి శతుద్రిస్తోమగ్ం సచ తాప ఋష్ణియా।
అశిక్నియా మరుద్వృదేవి తస్తయార్జీ కీయెశ్వణుహ్యా సుహోమయా।
సితాసితే సరితోయత్ర సంగతే తత్రాప్లుతాసోదివ ముత్పతంతి।
ఏవై తన్వా అవిసృజన్తి ధీరాస్తే జనాసో అమృతత్వం భజన్తే।
యాః ప్రవతో నివతః ఉద్వత ఉదద్వతీ రనుదగాశ్చయాః।
తా అస్మభ్యం పయసా పిన్వమానాశ్శివాదేవీ రసిపదా భవన్తు।
సర్వ్యానద్యో అసిమిదా భవన్తు॥
(పై మంత్రాలను చెప్తూ కలశములలో నీరు పోయాలి.)
మం॥ ఆనోభద్రాః క్రతవోయన్తు విశ్వతో దదబ్ధాసో అపరీతా స ఉద్భిదః।
దేవానోయథా సదమిద్వృధే సన్నప్రాయువో రక్షితారోదివేదివే।
దేవానాం భద్రా సుమత్తి ఋజూయ్యతా దేవానాం రాతిరభినో నివర్తతాం॥
దేవానాం సఖ్యముపసేదిమావయం దేవాన ఆయుః ప్రతిరంతుజీవసే
తాన్పూర్వయాని మిదాహుూ మహోవయం భగం మిత్రమదితిం దక్షమస్రిధం।
అర్యమణం వరుణం సోమ మశ్వినా సరస్వతీన సుభగా మయస్కరత్।
తన్నోవాతోమయో భువాతు భేషజం తన్మాతా పృథివీ తత్పితాద్యౌః॥
తద్గ్రావాణస్సోమసుతోమయో భవన్త దశ్వినా శ్రుణుతం ధిష్ణ్యాయుధం॥
(పై మంత్రాలను చెప్తూ కలశములను తాకి అభిమంత్రించాలి.)

## అథ స్వస్తి పుణ్యాహవాచనమ్

ఓం పుణ్యాహం దీర్ఘమాయురస్తు। (శిరస్యభిమంత్ర = శిరస్సును చేతితో తాక వలెను.) శివా ఆపస్సంతు। (కలశేష్వభిమృశ్య=కలశములందలి నీటిని తాకవలెను.) సౌమనస్యమస్తు। (హృదయేఽభిమృశ్య=హృదయాన్ని తాకవలెను.)
ఏవంత్రిః॥

ఓం అర్చత ప్రార్చత ప్రియమేథా సో అర్చత।
అర్చంతు పుత్రకా ఉత పురన్నధృష్ణ్వర్చత॥
అక్షతా: పాంతుతు॥ గంధద్వారాం దురాధర్షాం
నిత్య పుష్టాంకరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వభూతానాం
తామిహోపహ్వయే శ్రియమ్॥
గంధా: పాంతు ॥ ఓం ఆయనేతే పరాయణే దూర్వా రోహంతు పుష్పిణీ:॥
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే॥

అక్షతా: పాంతు॥ ఆయుష్యమస్తు॥ పుష్పాణి పాంతు - సౌమంగల్యంచాస్తు॥ తాంబూలాని పాంతు। ఐశ్వర్యమస్తు॥ దక్షిణా: పాంతు - బహుదేయమస్తు॥ శ్వశ్శ్రేయస మస్తు। ప్రజాపతి: ప్రియతామ్। శాంతిరస్తు। యం కృత్వా సర్వవేద యజ్ఞక్రియా కరణ కర్మారంభాశ్శుభా శ్శోభనా: ప్రవర్తంతే తమహ మోంకార మాదిం కృత్వా భవద్భి రనుజ్ఞాత: పుణ్యం పుణ్యాహం వాచయిష్యే వాచ్యతామ్॥

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవా:। భద్రం పశ్యేమాక్షభిర్యజత్రా:।
స్థిరై రంగైస్తుష్టువాగ్ం సస్తనూభి: వ్యశేమ దేవహితం యదాయు:॥
ద్రవిణో దాద్రవిణ సస్తురస్య ద్రవిణోదా స్సనరస్య ప్రయంసత్।
ద్రవిణో దావీరవతీ మిషం న:। ద్రవిణో దారాసతే దీర్ఘమాయు:॥
సవితా పశ్చాతా త్సవితా పురస్తా త్సవితోత్తరాత్తా
త్సవితాఽ ధరాత్తాత్। సవితా నస్సువతు సర్వ
తాతిం సవితా నో రాసతాం దీర్ఘమాయు:॥
నవో నవోభవతి జాయమానోఽ హ్నాం కేతురుషసామేత్యగ్రే।
భాగం దేవేభ్యో విదధాత్యాయ న్ప్రచంద్రమాస్తి రతిదీర్ఘమాయు:॥
ఆప ఉందంతు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చసే॥
యస్త్వా హృదా కీరిణా మన్యమానోఽమర్త్యం మర్త్యో జోహవీమి।
జాతవేదో యశో అస్మాసు ధేహి ప్రజాభి రగ్నే అమృతత్వ మశ్యామ్।

యస్మై త్వగ్ సుకృతే జాతవేద ఉలోకమగ్నే కృణవ స్యోనమ్।

అశ్వినగ్ం సపుత్రిణం వీరవంతం గోమంతగ్ం రయిం నశ తే స్వస్తి॥

సం త్వా సించామి యజుషా ప్రజామాయుర్ధనం చ॥

దక్షిణ కలశమాదాయ। ప్రాక్కలశే కించిత్కించిదుదకం నిషయతి (కుడివేపున కలశమును పైకితీసి అందలి నీటిని రెండవ కలశములో కొంచము కొంచము వేయాలి.)

దీర్ఘమాయురస్తు మానస్సమాధీయతామ్। సమాహితమనసస్స్మ॥ ప్రసీదంతు భవంతః। ప్రసన్నాస్స్మ। శాన్తిరస్తు। పుష్టిరస్తు। తుష్టిరస్తు। వృద్ధిరస్తు। అవిఘ్నమస్తు। ఆయుష్య మస్తు। ఆరోగ్యమస్తు। స్వస్తి శివం కర్మాస్తు। కర్మసమృద్ధిరస్తు। పుత్రసమృద్ధిరస్తు। వేదసమృద్ధి రస్తు। శాస్త్ర సమృద్ధిరస్తు। ధనధాన్య సమృద్ధిరస్తు। ఇష్ట సంపదస్తు। ఈశాన్యాం బహిర్దేశే అరిష్ట నిరసన మస్తు। కలశానా మీశాన్యదేశే ఉదకం సించేత్ (కలశములందలి జలమును ఈశాన్య ప్రదేశములపై చల్లవలెను.) యత్పాపం తత్ప్రతిహతమస్తు। యచ్ఛ్రేయస్తదస్తు। శుక్రాంగారక బుధ బృహస్పతి శనైశ్చర రాహుకేతు సోమ సహితాదిత్య పురోగా స్సర్వేగ్రహాః ప్రీయంతామ్। తిథి కరణ ముహూర్త జన్మ నక్షత్ర దిగ్దేవతాః ప్రీయంతామ్। నైరృత్యాందిశి సించేత్ (కలశములందలి నీటిని నైరృతి దిశలో చల్లవలెను.)

శామ్యంతు ఘోరాణి। శామ్యంతు పాపాని। శామ్యంతు ఈతయః। ప్రథమ కలశే। శుభాని వర్ధంతామ్। శివా ఋతవస్సంతు। శివా ఓషధయస్సంతు। శివా వనస్పతయ స్సంతు। అహోరాత్రే శివే స్యాతామ్। ఉత్తరే శుభకర్మణ్య విఘ్నమస్తు। ఉత్తరోత్తరం మహాభివృద్ధిరస్తు। ఉత్తరోత్తరాశ్శుభాః క్రియాస్సం పద్యంతామ్। అగ్ని పురోగా విశ్వే దేవాశ్చ ప్రీయంతామ్। మాహేశ్వరీ పురోగాః మాతరః ప్రీయంతామ్। ఇంద్ర పురోగా మరుద్గణాః ప్రీయంతామ్। వశిష్ఠ పురోగా ఋషిగణాః ప్రీయంతామ్ శ్రీ విష్ణు పురోగా స్సర్వేదేవాశ్చ ప్రీయంతామ్। ఆదిత్య పురోగాస్సర్వే గ్రహాః ప్రీయంతామ్। ఋషయశ్ఛందాగ్ం స్యాచార్యా వేదాయజ్ఞా దక్షిణాశ్చ ప్రీయంతామ్। బ్రహ్మంచ బ్రాహ్మణాశ్చ ప్రీయంతామ్। బ్రహ్మ విష్ణు మహేశ్వరాశ్చ ప్రీయంతామ్। శ్రద్ధామేధే ప్రీయంతామ్। ప్రీయతాం భగవాన్నారా యణః। ప్రీయతాం భగవాన్ స్వామీ మహాసేనః। ప్రీయతాం భగవాన్పితామహః। ప్రీయతాం భగవాన్ప్రపితామహః॥ సత్యా ఏతా ఆశిష స్సంతు॥

తాని వా ఏతానియమ నక్షత్రాణి యాన్యేవ దేవ నక్షత్రాణి,

తేషు కుర్వీత యత్కారీస్యాత్ పుణ్యాహ ఏవ కురుతే॥

ఓం పుణ్యాహం భవంతో బ్రువంతు। ఓం పుణ్యాహమ్॥ మహ్యాం సహకుటుం బాయ శుద్ధి వృద్ధ్యభ్యుదయ కర్మణే మహాజనాన్నమస్కు ర్వాణాయాశీర్వచన మపేక్షమా ణాయాయుష్మతే స్వస్తి భవంతో బ్రువంతు, ఆయుష్మతే స్వస్తి॥ వామదక్షిణ హస్తాభ్యాం దక్షిణోత్తర కలశౌ యుగపద్గృహీత్వా। (కుడిచేత్తో ఎడమకలశాన్ని, ఎడమచేతితో కుడి కలశాన్ని ఇలా రెండు చేతులతో ఒక్కసారే కలశములను పైకి తీసి చేతులను సరిగా చేసి కలశములను క్రింద నుంచాలి.

ఋద్ధిం భవంతో బ్రువంతు। ఋధ్యతామ్॥

ఋద్ధి సమృద్ధిః॥ ముఖ సమ ముద్వృత్య॥

స్వస్తి పుణ్యాహ సమృద్ధిరస్తు। వర్షశత సంపూర్ణమస్తు। గోత్రాభివృద్ధిరస్తు। శాంతిః పుష్టిస్తుష్టిశ్చాస్తు। శుభగ్ం శుభమస్తు। పునరపి గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు। సర్వ సంపదస్తు॥ (ఇత్యుదకం నిక్షిప్య) ( ఆ కలశములందలి నీటిని తనపైనను, పూజాద్రవ్య ముల పైనను చల్లుకోవాలి.)

ఏతేభ్యో బ్రాహ్మణేభ్యో నానాగోత్రేభ్యో నానా నామభ్యశ్శ్రీ లక్ష్మీనారాయణోమా మహేశ్వరాదిత్యాది నవగ్రహ స్వరూపేభ్యః శ్రీ లక్ష్మీనారాయణోమా మహేశ్వరాదిత్యాది నవగ్రహ ప్రీత్యర్థం స్వస్తి పుణ్యాహ వాచన మంత్రజప దక్షిణాం మనసోత్సాహ పరిమిత హిరణ్యం తుభ్యమహం సంప్రదదేన మమ॥ శుభగ్ం శుభమ్॥ ఓం తత్సత్॥

(ఇట్లు పుణ్యాహవాచన మంత్రములతో కలశములందలి నీటిని అభిమంత్రించి ఆ నీటిని తనపైనను, పూజా ద్రవ్యముల పైనను అమృతమస్తు। అమృతమస్తు। అనుచు చల్లవలెను. మిగిలిన నీళ్ళను తన కుటుంబ సభ్యులపైనను, గృహమందలి గదులలోను, వస్తు సముదాయముపైనను చల్లవలెను.)

## ఋత్విగ్వరణము

నక్షత్రపూర్వక నవగ్రహ మఖాఖ్యం కర్మ కరిష్యామి - తదంగ ఆచార్య బ్రహ్మ ఋత్విగ్వరణం కరిష్యామి॥ (అని సంకల్పం చెప్పి. తర్వాత)

"ఆచార్యం త్వామహం వృణే। బ్రహ్మాణం త్వామహం వృణే॥ నక్షత్రపూర్వక ఆదిత్యాది నవగ్రహ జపమస్మదర్థం భవంతః కుర్వంతు॥"

(అని చెప్పి పూజ చేయించు బ్రహ్మ (పురోహితుడు)గార్కి పాదాభి వందనము చేసి, బట్టలు, డబ్బు, ఫలపుష్పములు అతని చేతిలో పెట్టి నమస్కరించాలి.)

# అథ పంచలోకపాలక పూజా

హరి: ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
   జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

2. ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
   శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
   సమూఢమస్యపాంగ్ం సురే॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
   వోచేమ శంతమగ్ం హృదే॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
   అష్టాపదీ జనవదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
   సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

*గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.*

**Note :** కొన్ని మంత్రాలకు స్వర చిహ్నాలను గుర్తించలేదు కారణం అవి ఇంతకుముందు రావడం, అక్కడ వాటికి స్వర చిహ్నాలు గుర్తించడం, అవి అందరికీ సస్వరముగా పలుకుట తెలియుననే తలంపు.)

# నక్షత్రపూజా

ఆచమ్య-ఓం కేశవాయస్వాహా, ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయస్వాహా, గోవిందా, విష్ణుః, మధుసూధనా, త్రివిక్రమా, వామనా, శ్రీధరా, హృషీకేశా, దామోదరా, సంకర్షణా, వాసుదేవా, ప్రద్యుమ్నా, అనిరుద్ధా, పురుషోత్తమా, అధోక్షజా, నారసింహా, అచ్యుతా, జనార్ధనా, ఉపేంద్రా, హరే శ్రీ కృష్ణాయ నమః॥

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం, శుభతిథౌ శుభనక్షత్ర పూర్వక ఆదిత్యాదీనాం నవానాం గ్రహాణా మానుకూల్య సిద్ధ్యర్థం, తేషాం గ్రహాణామత్యంత శుభఫలా వాప్త్యర్థం, అపమృత్యు పరిహార ద్వారా ఆయుషాభి వృద్ధ్యర్థం నక్షత్రపూర్వకాదిత్యాది నవగ్రహ ప్రసాద సిద్ధ్యర్థం నవగ్రహారాధనాఖ్యం కర్మ కరిష్యే।

(చేతిలో కొంచం నీరు పోసుకొని (క్రింద పళ్ళెములో వదలాలి) తదంగత్వేన నక్షత్రదేవతా, అధిదేవతా, ప్రత్యధిదేవతా పూజాఖ్యం కర్మ కరిష్యే. (నీటిని చేతిలో పోసు కొని క్రింద వదలాలి.)

**ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।**
**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥**

*గణాధిపతిమావాహయామి. స్థాపయామి. పూజయామి.*

(ఇక నక్షత్రములకు ఆవాహనాది పూజా):- ఆవాహయామి, స్థాపయామి, పూజయామి, అనగానే మంటపముపై తమలపాకును, వక్కను, దబ్బునాణెమును ఉంచి నమస్కరించాలి.)

1. కృత్తికా నక్షత్రం :- శ్రీ గురుభ్యోనమః। హరిః ఓం॥

అగ్ని ర్నపాతు కృత్తికాః। నక్షత్రం దేవమింద్రియమ్।

ఇదమాసాం విచక్షణమ్।హవిరాసంజుహోతన।

యస్యభాంతి రశ్మయోయస్యకేతవః యస్యేమా

విశ్వాభువనాని సర్వా। సకృత్తికాభిరభిసంవసానః

అగ్నిర్నోదేవ స్సువితే దధాతు॥

కృత్తికా నక్షత్ర దేవతా మగ్నిం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి.

2. రోహిణి :-

ప్రజాపతే రోహిణీ వేతు పత్నీ। విశ్వరూపా బృహతీ చిత్రభానుః।

సానోయజ్ఞస్య సువితే దధాతు। యథా జీవేమ శరదస్సువీరాః।

రోహిణీ దేవ్యుదగా త్పురస్తాత్। విశ్వారూపాణి ప్రతిమోదమానా।

ప్రజాపతిగ్ం హవిషా వర్ధయంతీ। ప్రియాదేవానా ముపయాతుయజ్ఞమ్॥

రోహిణీ దేవతాం ప్రజాపతి మావాహయామి। స్థాపయామి. పూజయామి.

3. మృగశిర :-

సోమోరాజా మృగశీర్షేణ ఆగ్నన్। శివం నక్షత్రం ప్రియమస్య ధామ।

ఆప్యాయమానో బహుధాజనేషు। రేతఃప్రజాం యజమానే దధాతు।

యత్తే నక్షత్రం మృగశీర్షమస్తి। ప్రియగ్ం రాజన్ప్రియతమం ప్రియాణామ్।

తస్మై తే సోమ హవిషా విధేమ। శం న ఏధి ద్విపదే శం చతుష్పదే॥

మృగశిర్షా నక్షత్ర దేవతాం సోమమావాహయామి। స్థాపయామి। పూజయామి.

4. ఆర్ద్రా :-

ఆర్ద్రయా రుద్రః ప్రథమాన ఏత శ్రేష్ఠో దేవానాం పతిరఘ్నియానామ్।

నక్షత్రమస్య హవిషా విధేమ। మానః ప్రజాగ్ం రీరిషన్మోతవీరాన్।

హేతి రుద్రస్య పరిణో వృణక్తు। ఆర్ద్రా నక్షత్రం జుషతాగ్ం హవిర్నః।

ప్రముంచమానా దురితాని విశ్వా। అపాఘ శగ్ం సన్నుదతా మరాతిమ్॥
ఆర్ద్రా నక్షత్ర దేవతాం రుద్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**5. పునర్వసు :-**

పునర్నోదేవ్యదితి స్పృణోతు। పునర్వసూ నః పున రేతాం యజ్ఞమ్।
పునర్నోదేవా అభియంతు సర్వే। పునః పునర్వోహవిషా యజామః॥
ఏవా న దేవ్యదితి రనర్వా। విశ్వస్య భర్త్రీజగతః ప్రతిష్ఠా।
పునర్వసూ హవిషా వర్ధయంతీ। ప్రియం దేవానా మప్యేతు పాథః॥
పునర్వసూ నక్షత్ర దేవతాం అదితిం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**6. పుష్యమి :- (తిష్య అని మరొకపేరు):**

బృహస్పతిః ప్రథమం జాయమానః తిష్యన్నక్షత్ర మభి సంబభూవ।
శ్రేష్ఠో దేవానాం పృతనాసుజిష్ణుః దిశోను సర్వా అభయన్నో అస్తు।
తిష్యః పురస్తాదుత మధ్యతో నః బృహస్పతి ర్నః పరిపాతు పశ్చాత్।
బాధేతాం ద్వేషో అభయం కృణుతామ్ సువీర్యస్య పతయస్స్యామ॥
పుష్య నక్షత్ర దేవతాం బృహస్పతిం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**7. ఆశ్రేష :-**

ఇదగ్ం సర్పేభ్యో హవిరస్తు జుష్టం। ఆశ్రేషా యేషామనుయంతి చేతః।
యే అంతరిక్షం పృథివీం క్షియంతి। తేనస్సర్పాసోహవమాగమిష్ఠాః।
యే రోచనే సూర్యస్యాపి సర్పాః। యే దివం దేవీమను సంచరంతి।
యేషా మాశ్రేషా అనుయంతి కామమ్। తేభ్యస్సర్పేభ్యో మధుమజ్జుహోమి॥
ఆశ్రేషా నక్షత్ర దేవతాం సర్పం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**8. మఖ :-**

ఉపహూతాః పితరో యే మఘాసు। మనోజవస్సుకృత స్సుకృత్యాః।
తేనో నక్షత్రే హవ మాగమిష్ఠాః। స్వధాభిర్యజ్ఞం ప్రయత జుషతాం।

యే అగ్నిదగ్ధా యేఽ నగ్నిదగ్ధాః। యే అములోకం పితరః క్షియంతి।

యాగ్ంశ్చ విద్మ యాగ్ం ఉచన ప్రవిద్మ। మఘాసు యజ్ఞగ్ం సుకృతం జుషతాం॥

మఘానక్షత్ర దేవతాం పిత్రూణామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**9. పూర్వఫల్గుణి (పుబ్బ):-**

గవాంపతిః ఫల్గుణీ నామసిత్యమ్। తదర్యమన్వరుణ మిత్రచారు।

తం త్వాపయుగ్ం సవితారగ్ం సనీనామ్। జీవా జీవంతముప సంవిశేమ।

యే నేమా విశ్వాభువనాని సంజితా। యస్యదేవా అనుసంయంతి చేతః।

అర్యమా రాజా జరస్తు విష్మాన్। ఫల్గుణీ నామృషభో రోరవీతి॥

పూర్వఫల్గుణీ దేవతాం సూర్యం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**10. ఉత్తరఫల్గుణి (ఉత్తర) :-**

శ్రేష్ఠో దేవానాం భగవో భగాని। తత్త్వావిదుః ఫల్గునీస్తస్య విత్తాత్।

అస్మభ్యం క్షత్ర మజరగ్ం సువీర్యమ్। గోమ దశ్వవ దుపసన్నుదేహా।

భగోహదాతా భగ ఇత్ప్రదాతా। భగోదేవీః ఫల్గునీ రావివేశ।

భగస్యే త్తం ప్రసవం గమేమ। యత్రదేవైస్సధమాదం మదేమ॥

ఉత్తరఫల్గుణీ నక్షత్రదేవతాం భగమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**11. హస్త :-**

ఆయా తదేవస్సవితోపయాతు। హిరణ్యయేన సువృతారాధేన।

వహన్ హస్తగ్ం సుభగ్ం విద్మనాపసమ్। ప్రయచ్ఛం తం పపురిం పుణ్యమచ్ఛ।

హస్తః ప్రయచ్ఛ త్వమృతం వసీయః। దక్షిణేన ప్రతి గృహ్ణీమ ఏవత్।

దాతార మద్యసవితా విదేయ। యోనోహస్తాయ ప్రసువాతి యజ్ఞమ్॥

హస్తా నక్షత్ర దేవతాం అర్యమ్ణం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**12. చిత్రా :-**

త్వష్టా నక్షత్ర మభ్యేతి చిత్రామ్। సుభగం ససంయువతిగం రోచమానామ్,
నివేశయన్నమృతా న్మర్త్యాగంశ్చ। రూపాణి పిగంశన్భువనాని విశ్వా,
తన్నస్త్వష్టా తదు చిత్రావిచష్టామ్। తన్నక్షత్రం భూరిదా అస్తుమహ్యామ్,
తన్నః ప్రజాం వీరవతీగం సనోతు। గోభిర్నోఅశ్వై స్సమనక్తు యజ్ఞమ్॥
చిత్రా నక్షత్ర దేవతాం త్వష్టారం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**13. స్వాతి :-**

వాయుర్నక్షత్ర మభ్యేతి నిష్ట్యామ్। తిగ్మశృంగో వృషభో రోరువాణః।
సమీర యన్భువనామాతరిశ్వా। అపద్వేషాగంసి నుదతా మరాతీః।
తన్నోవాయు స్తదు నిష్ట్యాశృణోతు। తన్నక్షత్రం భూరిదా అస్తు మహ్యామ్।
తన్నో దేవాసో అనుజానంతు కామమ్। యథాతరేమ దురితాని విశ్వా॥
స్వాతీ నక్షత్ర దేవతాం వాయుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**14. విశాఖ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం తద్విశాఖే।
తన్నోదేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చాత్పురస్తాదభయన్నో అస్తు।
నక్షత్రాణామధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ।
విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధన్నుదతా మరాతిమ్॥
విశాఖా నక్షత్ర దేవతే ఇంద్రాగ్నీ ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**15. అనూరాధ :-**

బుద్ధాస్మ హవ్యైర్నమసోపసద్య। మిత్రం దేవం మిత్రధేయన్నో అస్తు।
అనూరాధాన్ హవిషా వర్ధయంతః। శతం జీవేమ శరదస్సవీరాః।
చిత్రం నక్షత్ర ముదగాత్పురస్తాత్। అనూరాధా స ఇతి యద్వదంతి।
తన్మిత్ర ఏతి పథిభిర్దేవయానైః। హిరణ్యయైర్వితతైరంతరిక్షే॥
అనూరాధా నక్షత్ర దేవతాం మిత్రం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**16. జ్యేష్ఠ :-**

ఇంద్రో జ్యేష్ఠా మను నక్షత్రమేతి। యస్మిన్వృత్రం వృత్రతూర్యేతతార
తస్మిన్వయ మమృతం దుహానా॥ క్షుదంతరేమ దురితం దురిష్టిమ్।
పురందరాయ వృషభాయ ధృష్ణవే। అషాఢాయ సహమానాయ మీఢుషే
ఇంద్రాయ జ్యేష్ఠా మధుమద్దుహానా। ఉరుం కృణోత్తు యజమానాయ లోకమ్॥
జ్యేష్ఠా నక్షత్ర దేవతాం ఇంద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**17. మూల :-**

మూలం ప్రభాం వీరవతీం విదేయ। పరాచ్యేతు నిర్‌బుతి: పరాచా।
గోభిర్న నక్షత్రం పశుభిస్సమక్తమ్। అహర్భూయాద్యజమానాయ మహ్యమ్।
అహర్నోఽద్య సువితే దధాతు। మూలం నక్షత్రమితి యద్వదంతి।
పరాచీం వాచా నిర్‌బుతిం నుదామి। శివం ప్రజాయై శివమస్తు మహ్యమ్॥
మూలా నక్షత్రదేవతాం అసురం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**18. పూర్వాషాఢ :-**

యాదివ్యా ఆప: పయసా సంబభూవు॥ యా అంతరిక్ష ఉతపార్థివీర్యా॥
యాసామాషాఢా అనుయంతి కామమ్। తాన ఆపశ్శగ్గ్ంస్యోనా భవంతు।
యాశ్చ కూప్యాయాశ్చ నాద్యాస్సముద్రియా॥ యాశ్చవైశంతీ రుతప్రాసచీర్యా॥
యాసా మషాఢా మధు భక్షయంతి। తాన ఆపశ్శగ్గ్ం స్యోనా భవంతు॥
పూర్వాషాఢా నక్షత్ర దేవతా ఆప ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**19. ఉత్తరాషాఢా :-**

తన్నో విశ్వే ఉపశృణ్వంతు దేవా॥ తదషాఢా అభిసంయంతు యజ్ఞమ్।
తన్నక్షత్రం ప్రథతాం పశుభ్య॥ కృషిర్వృష్టిర్యజమానాయ కల్పతామ్।
శుభ్రా: కన్యా యువతయస్సుపేశ స॥ కర్మకృత స్సుకృతో వీర్యావతీ॥
విశ్వాన్ దేవాన్ హవిషా వర్ధయంతీ॥ అషాఢా: కామ ముపయాంతు యజ్ఞమ్॥
ఉత్తరాషాఢా నక్షత్ర దేవతా విశ్వాదేవానావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**20. శ్రవణ:-**

శృణ్వంతి శ్రోణా మమృతస్యగోపామ్। పుణ్యామస్యా ఉపశృణోమివాచమ్।
మహీం దేవీం విష్ణుపత్నీ మజూర్యామ్। ప్రతీచీ మేనాగ్ం హవిషా యజామః॥
త్రేధా విష్ణురురుగాయో విచక్రమే। మహీం దివం పృథివీమంతరిక్షమ్।
తచ్ఛ్రోణైతి శ్రవ ఇచ్ఛమానా। పుణ్యగ్గ్శ్లోకం యజమానాయ కృణ్వతీ॥
శ్రవణ నక్షత్ర దేవతాం విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**21. ధనిష్ఠా :-**

అష్టౌ దేవా వసవస్సోమ్యాసః। చతస్రో దేవీ రజరాశ్శ్రవిష్ఠాః।
తేయజ్ఞం పాంతు రజసః పరస్తాత్। సంవత్సరీణ మమృతగ్గ్ స్వస్తి।
యజ్ఞన్నః పాంతు వసవః పురస్తాత్। దక్షిణతోఽ భియంతు శ్రవిష్ఠాః॥
పుణ్యం నక్షత్ర మభిసంవిశామ। మానో అరాతిరఘశగ్ం సాగన్॥
ధనిష్ఠా నక్షత్ర దేవతా వసూనావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**22. శతతారా (శతభిషం) :-**

క్షత్రస్య రాజావరుణోఽధిరాజః। నక్షత్రాణాగ్ం శతభిష గ్వసిష్ఠః।
దేవేభ్యః కృణుతో దీర్ఘమాయుః। శతగ్ం సహస్రా భేషజాని ధత్తః।
యజ్ఞం నో రాజా వరుణ ఉపయాతు। తన్నో విశ్వే అభిసంయంతు దేవాః।
తన్నో నక్షత్రగ్ం శతభిషగ్జుషాణమ్। దీర్ఘమాయుః ప్రతిరద్భేషజాని॥
శతభిషఙ్నక్షత్ర దేవతాం వరుణం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**23. పూర్వాభాద్ర :-**

అజ ఏకపాదుదగాత్పురస్తాత్। విశ్వా భూతాని ప్రతిమోదమానః।
తస్యదేవాః ప్రసవం యంతి సర్వే। ప్రోష్ఠపదాసో అమృతస్యగోపాః।
విభ్రాజమానస్సమిధాన ఉగ్రః। అంతరిక్ష మరుహదగంద్యామ్।
తగ్ం సూర్యం దేవ మజమేకపాదం। ప్రోష్ఠపదాసో అనుయంతి సర్వే॥
పూర్వాభాద్ర నక్షత్ర దేవతా మజమేకపాద మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**24. ఉత్తరాభాద్ర :-**

అహిర్బుధ్నియః ప్రథమాన ఏతి। శ్రేష్ఠో దేవానాముత మానుషాణామ్।
తం బ్రాహ్మణాస్సోమపాస్సోమ్యాసః। ప్రోష్ఠపదాసో అభిరక్షంతిసర్వే।
చత్వార ఏకమభికర్మదేవాః। ప్రోష్ఠపదా స ఇతి యాన్ వదంతి।
తే బుధ్నియం పరిషద్యగ్గ్ం స్తువంతః। అహిగ్ం రక్షంతి నమసోపసద్య॥
ఉత్తరాభాద్ర నక్షత్రదేవతాం అహిర్బుధ్నియమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**25. రేవతీ :-**

పూషారేవత్యన్వేతి పంథామ్। పుష్టిపతీ పశుపావాజబస్త్యౌ।
ఇమాని హవ్యా ప్రయతా జుషాణా। సుగైర్నోయానై రుపయాతాం యజ్ఞమ్।
క్షుద్రాన్ పశూన్ రక్షతు రేవతీ నః। గావో నో అశ్వాగ్ం అన్వేతు పూషా।
అన్నగ్ం రక్షంతా బహుధా విరూపమ్। వాజగ్ం సనుతాం యజమానాయ యజ్ఞమ్॥
రేవతీ నక్షత్ర దేవతాం పూషాణమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**26. అశ్వనీ :-**

తదశ్వినా వశ్వయు జోపయాతామ్। శుభం గమిష్ఠౌ సుయమేభి రశ్వైః।
స్వం నక్షత్రగ్ం హవిషా యజంతౌ। మధ్వా సంపృక్తౌ యజుషా సమక్తౌ॥
యౌదేవా నాం భిషజౌ హవ్యవాహౌ। విశ్వస్యదూతా వమృతస్య గోపౌ।
తౌ నక్షత్రం జుజుషాణోపయాతామ్। నమోఽశ్విభ్యాం కృణుమోఽశ్వయుగ్భ్యామ్॥
అశ్వనీ నక్షత్ర దేవతే అశ్వినావావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**27. భరణీ :-**

అపపాప్మానం భరణీర్భరంతు। తద్యమో రాజా భగవాన్ విచష్టామ్।
లోకస్యరాజా మహతో మహాన్ హి। సుగన్నః పంథా మభయం కృణోతు।
యస్మిన్నక్షత్రేయమ ఏతి రాజా। యస్మిన్నేనమభ్యషించంతదేవాః।
తదస్య చిత్రగ్ం హవిషా యజామ। అపపాప్మానం భరణీర్భరంతు॥
భరణీ నక్షత్ర దేవతాం యమమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

# నవగ్రహ మండప నిర్మాణం

ఒక వస్త్రమునుపరిచి, దానిపై బియ్యమును పరవాలి. దానిపై పసుపు కొమ్ముతో నవగ్రహమండపమును గీయాలి. ఇంతకు ముందు తెలిపిన విధంగా ఆయా గ్రహాల స్థానంలో ఆయా గ్రహాలకు సంబంధించిన రంగు వస్త్రములను ఉంచి వాటిపై ఆయాగ్రహాలకు చెందిన ధాన్యమును పరచాలి. వాటిపై 9 కలశాలను స్థాపించాలి. నవగ్రహ మంటపముకు సంబంధించి ప్రధాన కలశము నొకదానిని స్థాపించాలి. ఆ కలశముకు షోడశోపచార పూజను చేసి, తరువాత నవగ్రహారాధనను ప్రారంభించాలి.

# నవగ్రహారాధనమ్

(గృహస్య ఈశాన్య దిగ్భాగే గ్రహారాధనం కుర్యాత్। నూతన వస్త్రద్వయేన మంటప ద్వయమాసాద్య। తస్యోపరి యథాశక్తి తండులాన్నిక్షిప్య। తత్ర తామ్రనిర్మిత కలశద్వయం నిధాయ। తత్ర పంచపల్లవాని నారికేళాది ఫలపుష్పాది కలశే నిధాయ। నూతన వస్త్రే ణావేష్ట్య.)

ఆచమ్య। ఓం కేశవాయస్వాహా, నారాయణాయస్వాహా, మాధవాయస్వాహా, గోవిందా, విష్ణు, మధుసూధనా, త్రివిక్రమా, వామనా, శ్రీధరా, హృషీకేశా, పద్మనాభా, దామోదరా, సంకర్షణా, వాసుదేవా, ప్రద్యుమ్నా, అనిరుద్ధా, పురుషోత్తమా, అధోక్షజా, నారసింహా, అచ్యుతా, జనార్దనా, ఉపేంద్రా, హరే, శ్రీకృష్ణాయ నమః।

ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, శుభనక్షత్ర పూర్వకాదిత్యాదీనాం నవానాం గ్రహాణాం మధ్యే యేయే గ్రహాః అరిష్ట స్థానేషుస్థితాః తేషాం గ్రహాణా మాను కూల్య సిద్ధ్యర్థం, యేయే గ్రహాః శుభస్థానేషు స్థితాః తేషాం గ్రహాణాం అత్యంత శుభఫలా వాప్త్యర్థం, అపమృత్యు పరిహార ద్వారా ఆయుష్యాభి వృద్ధ్యర్థం ఆదిత్యాది నవగ్రహారాధ నాఖ్యం కర్మ కరిష్యే। (చేతిలో నీళ్ళు పోసుకొని క్రింద వదలాలి.)

తదంగత్వేన ప్రతిమా శోధనాదికం కరిష్యే। (చేతిలో నీళ్ళు పోసుకొని వదలాలి. లక్ష్మీనారాయణ ప్రతిమను లేక నవగ్రహములకు నిర్ణయింపబడిన రాగి యంత్రములను మంచినీటితో శుభ్రముగా కడిగి, మంటపముమీది కలశములపై పెట్టి క్రింది మంత్రాలతో.)

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహా।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే। దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।

సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్‌ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవః।
మాధ్వీ ర్నస్సం త్వోషధీః। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః।
మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః।
మాధ్వీర్గావో భవంతు నః। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాత్స్థేయానస్తేయ సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః।
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

# నవగ్రహాల ఆవాహన-పూజ

## సూర్య

ఆ కృష్ణే నే తస్య మంత్రస్య। హిరణ్య స్తూపఋషిః। సవితా దేవతా। త్రిష్టుప్ఛందః। యజమానస్య (మమ) ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత సూర్యగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే సూర్య గ్రహారా ధనే వినియోగః॥

ధ్యాన శ్లో॥ వేదీమధ్యే లలితకమలే కర్ణికాయాం రథస్సప్తాశ్వోఽర్కోరుణరుచి
వపుస్సప్త రజ్జుర్ద్విబాహుః। గోత్రేరమ్యే బహువిధగుణే కాశ్యపాఖ్యే ప్రసూతః,
కాళింగాఖ్యే విషయ జనితః ప్రాఙ్ముఖః పద్మహస్తః॥
పద్మాసనః పద్మకరో ద్విబాహుః పద్మద్యుతి స్సప్తతురంగవాహః।
దివాకరో లోకవపుః కిరీటీమయి ప్రసాదం విదధాతు దేవః॥

మంత్రం:-

ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ।
హిరణ్యయేన సవితా రథేనాదేవో యాతి భువనాని పశ్యన్॥

ఓం భూర్భువస్సువః సూర్య గ్రహేహాగచ్ఛ।
సూర్యగ్రహం రక్తవర్ణం రక్తగంధం రక్తపుష్పం రక్తమాల్యాంబర ధరం
రక్తచ్ఛత్రధ్వజ రథ పతాకాదిశోభితం దివ్యరథ సమారూఢం
మేరుం ప్రదక్షిణీకుర్వాణం ప్రాఙ్ముఖం పద్మాసనస్థం।
ద్విభుజం సప్తాశ్వం సప్తరజ్జుం కళింగదేశాధిపతిం కాశ్యప
సగోత్రం ప్రభవ సంవత్సరే మాఘశుక్ల సప్తమ్యాం విశాఖా

(అశ్వని అని కొందరు - నక్షత్రేజాతం సింహ రాశ్యధిపతిం భానువార ప్రయుక్తం కిరీటినం సుఖాసీనం పత్నీపుత్ర పరివార సమేతం గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే మధ్యే వర్తులాకార మండలే సూర్యగ్రహం ఆవాహయామి। స్థాప యామి। పూజయామి॥

**అధిదేవత - అగ్నిః :- (ఋ-1మం, 12సూ. 1మం)**

మంత్రం:- అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసం। అస్యయజ్ఞస్య సుక్రతుం। సూర్య గ్రహాధిదేవతాం అగ్నిం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం సూర్యగ్రహస్య దక్షిణతః అగ్ని మావాహయామి. స్థాపయామి పూజయామి॥

**ప్రత్యధిదేవత - రుద్రః :- (ఋ-1మం-43సూ మంత్రం)**

మంత్రం :- కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వోచేమ శంతమగ్ం హృదే। సూర్యగ్రహ ప్రత్యధి దేవతాం రుద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం సూర్యగ్రహస్య ఉత్తరతః రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**2. చంద్రః :- (ఋ-1మం-91 సూ-16 మంత్రం)**

ఆప్యాయస్వేత్యస్య మంత్రస్య। గౌతమ ఋషిః। చంద్రోదేవతా। గాయత్రీఛందః। (మమః) యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత చంద్రగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే చంద్రగ్రహారాధనే వినియోగః॥

ధ్యానశ్లో॥ ఆగ్నేయభాగే సరథో దశాశ్వశ్చాత్రేయజో యామున దేశజశ్చ।
ప్రత్యఙ్ముఖస్థశ్చతురశ్రపీఠే గదాధరాంగో హిమవత్స్వభావః॥
శ్వేతాంబరశ్శ్వేతవపుః కిరీటీ శ్వేతద్యుతి ర్దండధరో ద్విబాహుః।
చంద్రోఽమృతాత్మా వరదః కిరీటీ శ్రేయాంసి మహ్యం విదధాతు దేవః॥

**మంత్రం :-** ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమవృష్ణియమ్। భవావాజస్య సంగథే॥
ఓం భూర్భువస్సువః చంద్రగ్రహేహాగచ్ఛ। చంద్రగ్రహం। చంద్రగ్రహం శ్వేతవర్ణం

శ్వేత గంధం శ్వేతపుష్పం శ్వేతమాల్యాంబరధరం శ్వేతచ్ఛత్ర ధ్వజరథపతాకాది శోభితం దివ్యరథ సమారూఢం మేరుం ప్రదక్షిణీ కుర్వాణం దశాశ్వ రథవాహనం ప్రత్యఙ్ముఖం ద్విభుజం దండధరం యామున దేశాధిపతిం ఆత్రేయస గోత్రం నందన సంవత్సర కార్తీక శుద్ధ చతుర్దశ్యాం కృత్తికా నక్షత్రజాతం కర్కటక రాశ్యాధిపతిం ఇందువాసర ప్రయుక్తం కిరీటినం సుఖాసీనం పత్నీపుత్ర పరివార సమేతం గ్రహమండలే ప్రవిష్ఠ మస్మిన్నధికరణే సూర్య గ్రహస్యాగ్నేయ దిగ్భాగే సమచతురశ్ర మండలే చంద్రగ్రహమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అధిదేవత - అపః :- (ఋ-1మం-23సూ-20మంత్రం)**

మంత్రం :- అప్సుమే సోమో అబ్రవీదంతరిశ్వాని భేషజా।
అగ్నిం చ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః॥

చంద్రగ్రహాధిదేవతా అప: సాంగా: సాయుధా: సవాహనా: సశక్తి పుత్ర పరివార సమేతా: చంద్రగ్రహస్య దక్షిణత: అప: ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధిదేవత – గౌరీ:-**

మంత్రం:- గౌరీర్మిమాయ సలిలాని తక్షత్యేక పదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్॥

చంద్రగ్రహ ప్రత్యధిదేవతా గౌరీం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తి పుత్ర పరివార సమేతాం చంద్రగ్రహ స్యోత్తరత: గౌరీమావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**3. అంగారక (కుజ) :-**

అగ్నిర్మూర్ధేత్యస్య మంత్రస్య। విరూప ఋషి:।అంగారక గ్రహోదేవతా। త్రిష్టుప్ఛంద:। (మమ) యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతా సహితాంగారక గ్రహప్రసాద సిద్ధ్యర్థే అంగారక గ్రహారాధనే వినియోగః॥

ధ్యానశ్లో॥ యామ్యే గదాశక్తిధరశ్చ శూలీ వరప్రదో యామ్యముఖోఽతిరక్త:।
కుజస్త్వవంతీ విషయస్త్రి కోణ స్తస్మిన్ భరద్వాజకులే ప్రసూత:॥
రక్తాంబరో రక్తవపు: కిరీటీ చతుర్భుజో మేషగమోగదాభృత్।
ధరాసుతశ్శక్తి ధరశ్చ శూలీసదా మమస్యాద్వరద: ప్రశాన్త:॥

మంత్రం:- ఓం అగ్నిర్మూర్ధాదివ: కకుత్పతి: పృథివ్యా
అయమ్। అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి॥ ఓం భూ
ర్భువస్సువ:॥ అంగారకగ్రహోహాగచ్ఛ।

అంగారకగ్రహం రక్తవర్ణం, రక్తగంధం, రక్తపుష్పం, రక్తమాల్యాంబర ధరం, రక్త చ్ఛత్రధ్వజ రథపతాకాది శోభితం, దివ్యరథసమారూఢం, మేరుం ప్రదక్షిణీకుర్వాణం, మేషవాహనం, దక్షిణాభిముఖం, చతుర్భుజం, గదాశూల శక్తిధరం, అవన్తి దేశాధిపతిం, భారద్వాజస గోత్రం, అక్షయ సంవత్సర వైశాఖకృష్ణ ద్వితీయాయాం పూర్వఫల్గుణీ (పుబ్బా) నక్షత్రజాతం। భౌమవాసర ప్రయుక్తం, కిరీటినం, సుఖాసీనం, పత్నీపుత్ర పరివార సమేతం, గ్రహ మండలే ప్రవిష్ట మస్మిన్నధికరణే సూర్యస్య దక్షిణ దిగ్భాగే, త్రికోణాకారమండలే అంగారక గ్రహ మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**అధిదేవత - పృథివీ :- (ఋ-1మం-22సూ-15 మంత్రం)**

మంత్రం :- స్యోనా పృథివీ భవానృక్షరా నివేశనీ। యచ్ఛానశ్శర్మసప్రథాః॥

అంగారకగ్రహాధి దేవతా పృథివీం సాంగాం సాయుధా సవాహనాం సశక్తి పుత్రపరివార సమేతాం అంగారక గ్రహస్య దక్షిణతః పృథివీం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి॥

**ప్రత్యధిదేవత - క్షేత్రపాలకః-**

మంత్రం:- క్షేత్రస్య పతినా వయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్వావనో మృడా తీదృశే॥

అంగారక గ్రహస్య ప్రత్యధి దేవతాం క్షేత్రపాలకం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం అంగారక గ్రహస్యోత్తరతః క్షేత్రపాలక మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**4. బుధః-** ఉద్బుధ్యస్వేత్యస్య మంత్రస్య నారాయణ ఋషిః। బుధగ్రహో దేవతా। త్రిష్టుప్ఛందః॥ (మమ) యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత బుధగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే బుధ గ్రహారాధనే వినియోగః॥

ధ్యానం:- ఉదఙ్ముఖో మాగధజో హరిస్థ శ్చాత్రేయగోత్రశ్శర మండలస్థః।
సఖడ్గ చర్మోరు గదాధరోఙ్ఘ్రిస్త్వీశాన భాగే వరదస్సుప్రీతః॥
పీతాంబర పీతవపుః కిరీటీ చతుర్భుజో దండధరశ్చ సౌమ్యః।
చర్మాపి ధృత్వోమసుతస్సు మేరు స్సింహాధిరూఢో వరదో బుధశ్చ॥

మంత్రం :- ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహ్యేన మిష్టా పూర్తే సగ్ం సృజేథా మయంచ।
పునః కృణ్వగ్ స్త్వా పితరం యువా నమన్వాతాగ్ం సీత్వయి తంతుమేతమ్॥

ఓం భూర్భువస్సువః॥ బుధగ్రహేహాగచ్ఛ। బుధగ్రహం, పీతవర్ణం, పీతగంధం,

84. దోష నివారణకు దక్షిణ - ఆవు
85. ప్రీతికరమైన తిథి - జ్యేష్ట శుక్ల ద్వాదశి, కార్తీక శుక్ల సప్తమి
86. ఆచరించవలసిన వ్రతము - ఆదివార వ్రతం
87. పారాయణ చేయవలసిన పురాణాలు - హరివంశ పురాణం
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - సూర్య అష్టోత్తర శతనామావళి
89. పారాయణ చేయవలసిన సహస్ర నామావళి - విష్ణు సహస్ర నామావళి
90. ఆచరించవలసిన దీక్ష - గాయత్రి దీక్ష
91. ధరించవలసిన మాల - స్ఫటిక మాల
92. ధరించవలసిన రత్నము - కెంపు
93. ధరించవలసిన రుద్రాక్ష - ఏకముఖి (లేదా) ద్వాదశముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - శివాలయం
95. చేయవలసిన పూజలు - గాయత్రి పూజ, రుద్రాభిషేకం
96. దానం చేయవలసిన ద్రవ్యములు ద్రవ్యములు - గోధుమలు, బెల్లం, రాగి
97. గ్రహజపసంఖ్య - 6,000
98. హోమముకు వాడు సమిధ - జిల్లేడు
99. నవగ్రహ మండపంలో గ్రహ ఆసనం - వృత్తాకారం
101. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్నరాశినుండి 7వ రాశివి
102. గ్రహసంఖ్య - 1
103. గ్రహం సూచించు వారం - ఆదివారం
104. శుభ సమయం - ఉదయం 8 నుండి 10 గంటలవరకు
105. ప్రతివిధిగ్రహాలు - బుధ+శుక్ర
106. గ్రహం బలంగా ఉంటే ఫలితం - ఆత్మవిశ్వాసం పెరుగుతుంది
107. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - అహంకారం పెరుగుతుంది
108. తండ్రి - కశ్యప్రజాపతి
109. తల్లి - అదితి
110. భార్య - సంధ్య, ఛాయ
111. సూచించులోహములు - రాగి

| | | |
|---|---|---|
| 112. | గ్రహప్రభావితుల మనఃస్థితి | - స్థిరము |
| 113. | భావకారకత్వం | - ఆత్మధైర్యము, ఉత్సాహము |
| 114. | గ్రహదృష్టి | - ఊర్ధ్వ |
| 115. | గ్రహమునకు గుర్తు | - ⊙ |
| 116. | సంబంధించిన వృత్తి | - ఎకౌంటెంట్, సైనికుడు |
| 117. | గ్రహజన్మ సంవత్సరం | - ప్రభవ |
| 118. | జన్మమాసం | - మాఘము |
| 119. | జన్మతిథి | - శుద్ధ సప్తమి |
| 120. | జన్మ నక్షత్రం | - విశాఖ |
| 121. | అధిపత్యం వహించు దేశం | - కళింగ |
| 122. | గ్రహఋషి | - హిరణ్యస్తూపుడు |
| 123. | గ్రహఛందస్సు | - త్రిష్టుప్ |
| 124. | పుట్టినవారము | - ఆదివారము |

**124 : సంబంధించిన వస్తువులు, పనులు :-**

గోధుమలు, బెల్లం, ఎర్రని మిరపకాయలు, రాగి, తెల్లజిల్లేడు, ఎర్రగులాబీ, రక్తచందనం, ముళ్ళున్న చెట్లు, కెంపు, హరివంశపురాణం.

## 30. ఖగోళ శాస్త్ర పరంగా సూర్యుడు

మన పాలపుంతలోని 100 బిలియన్ల నక్షత్రాలలో, సూర్యుడు ఒక మామూలు G2 తరగతికి చెందిన నక్షత్రము. గ్రీకు పురాణాల ప్రకారము సూర్యుని పేరు 'హెలియోస్ (Helios) మరియు రోమన్ల ప్రకారము 'సోల్' (Sol)

సూర్యునిలో 70% హైడ్రోజన్, 28% హీలియమ్ మరియు మిగిలిన 2% ఖనిజపదార్థాలు కలవు. వీటి నిష్పత్తులు నెమ్మదిగా మారుతుంటాయి. సూర్యుని కేంద్రములో హైడ్రోజన్ హీలియముగా మారును.

సూర్యుని వ్యాసము 1,3,90,000 Km. ద్రవ్యరాశి $1.989 \times 10^{30}$ కిలోగ్రాములు ఉండును. ఉపరితల ఉష్ణోగ్రత సుమారు $5800^0$K వరకు ఉండును. కేంద్రములో సుమారు $1,50,00,000^0$ K ఉష్ణోగ్రత ఉండును.

మన సూర్యకుటుంబములో దాదాపు 99.8% ద్రవ్యరాశి సూర్యుని ద్రవ్యరాశి.

సూర్యుని బయట పొరలలో మధ్యరేఖ దగ్గరి ఉపరితలం ఆత్మ భ్రమణకాలం 25.4 రోజులు ధ్రువాల ఆత్మభ్రమణకాలం 36 రోజులు. దీనికి కారణము సూర్యుని ఉపరితలము వాయుస్థితిలో ఉండటమే.

సూర్యుని కేంద్రములో (దాదాపు దాని వ్యాసార్థములో 25% వద్ద) ఉష్ణోగ్రత 15.6 మిలియన్ల కెల్విన్స్ మరియు పీడనము 250 బిలియన్ల అట్మాస్ఫియర్లు ఉండును. సూర్యుని కేంద్రములో సాంద్రత నీటిసాంద్రత కన్నా 150 రెట్లు ఎక్కువ ఉండును.

సూర్యుని నుండి సుమారు 386 బిలియన్ బిలియన్ మెగావాట్‌ల శక్తి విడుదల అవుతుంది. ఈ శక్తికి కారణము సాధారణముగా నక్షత్రములలో జరిగే "న్యూక్లియర్ ఫ్యూజన్ (Nuclear Fusion)"

ప్రతి సెకనుకి సుమారు 70,00,00,000 టన్స్ హైడ్రోజన్, సుమారు 69,50,00,000 టన్స్ హీలియము మరియు 50,00,000 టన్స్ (=3.86e [23] ఎర్గ్స్) శక్తిగా, గామా కిరణాల రూపంలో విడుదల అవుతుంది. ఈ గామా కిరణాలు సూర్యుని ఉపరితలంకు చేరేసరికి ఎన్నో సార్లు శోషణకు, పునః శోషణకు గురి అయి మన కంటికి కనిపించే కాంతి రూపంలో విడుదల అవుతుంది.

సూర్యుని ఉపరితలమును "ఫొటోస్ఫియర్ (Photosphere)" అని అందురు. ఇక్కడ ఉష్ణోగ్రత సుమారు 5800°k ఉండును. "సన్‌స్పాట్స్ (Sunmspots)" అనేవి కొంచెం తక్కువ ఉష్ణోగ్రత కలిగి ఉండును, ఇక్కడ సుమారు 3800°k ఉష్ణోగ్రత ఉండును. ఈ సన్‌స్పాట్స్ సుమారు 50,000 Km వరకు వ్యాపించి ఉంటాయి.

ఈ ఫొటోస్ఫియర్ పైన క్రోమోస్ఫియర్ (Chromosphere) అనే మరియొక క్షేత్రము కలదు.

చాలా అరుదుగా ఈ క్రోమోస్ఫియర్ మీద 'కరోన (corona)' అనే ప్రాంతము కలదు, ఇది మిలియన్స్ కిలోమీటర్ల వరకు అంతరిక్షంలోకి వ్యాపించి ఉండును కాని ఇది సూర్యగ్రహణం రోజు మాత్రమే కనిపించును. ఈ కరోనాలో సుమారు 10,00,000° K ఉష్ణోగ్రత ఉండును.

భూమి నుంచి చూసినపుడు సూర్యుడు, చంద్రుడు ఒకే పరిమాణంలో కనిపిస్తాయి. కొన్ని సమయాలలో చంద్రుడు, సూర్యుడు మరియు భూమి కక్ష్యల మధ్యకు వచ్చును. దీనినే సంపూర్ణ సూర్యగ్రహణం అందురు. కొన్ని సమయాలలో చంద్రుడు, సూర్యుని కొంత భాగాన్నే కప్పి ఉంటుంది, దీనినే పాక్షిక సూర్యగ్రహణం అంటారు. సూర్యగ్రహణము సంవత్సరానికి ఒకటి లేదా రెండుసార్లు మాత్రమే వచ్చును.

సూర్యుని అయస్కాంతక్షేత్రము చాలా బలమైనది మరియు మిశ్రమమైనది. దీని అయస్కాంతక్షేత్రము (దీనినే హెలియోస్కోపు అనికూడ అందురు) ప్లూటో వరకు వ్యాపించి ఉండును.

సూర్యుడు కాంతి, వేడితోపాటు కొంచెం సాంద్రత కలిగిన ఎలక్ట్రాన్ మరియు ప్రోటాన్స్ విడుదల చేయును. వీనినే దిసోలార్ విండ్స్ (Solar winds) ' అని అందురు. ఇవి 450Km/s తో అంతరిక్షంలో వ్యాపిస్తూ ఉంటాయి.

సూర్యుని వయస్సు సుమారు 4.5 బిలియన్ల సంవత్సరాలు. ఇది మరో 5 బిలియన్ల సంవత్సరాల వరకు కాంతిని ఉద్గారించగలదు.

## 31. పురాణాల పరంగా సూర్యుడు

సూర్యుడు పద్మము వంటి దేహకాంతి కలిగినవాడు. రెండుభుజములు కలిగి, ఒక చేతిలో పద్మమును ధరించి ఉంటాడు. సప్తాశ్వములు కల రథమును అధిరోహించి ఉంటాడు ఇతనికి రవి, ఆదిత్యుడు, భాస్కరుడు, భానుడు, దివాకరుడు, ప్ర భాకరుడు, మార్తాండుడు, అర్కుడు, ఇనుడు, తపనుడు, జగత్సాక్షి, తిగ్మాంశుడు అను పేర్లు కలవు.

సూర్యుడు ఏకచక్ర రధారూఢుడు. ఈ చక్రమే కాలచక్రము. కనుక కాలము పరమాత్మ స్వరూపము. పురాణాల ప్రకారం.. సూర్యజన్మ వృత్తాంతం ఇదీ :

విరాట్పురుషుడు శ్రీమన్నారాయణుడు, జీవుల్ని ఉద్ధరించ దలచి దక్ష ప్రజాపతి పుత్రిక అయిన అదితి యందు కశ్యప మహర్షికి 'వివస్వంతుడు' అనే పేర జన్మించాడు. అదితి - కశ్యపులకు పుత్రుడైనందున ఆదిత్యుడని, కశ్యపుడనీ అంటారు. ఈ ఆదిత్యులను ద్వాదశాదిత్యులుగా వ్యవహరిస్తారు. కనుకనే సృష్టిలో అనేకానేక సూర్యమండలములున్నాయి (భవిష్యపురాణము).

1. ఇంద్రుడు; 2. ధాత; 3. పర్జన్యుడు ; 4. త్వష్ట; 5. పూషుడు; 6. అర్యముడు; 7. వివస్వంతుడు; 8. భగుడు; 9. అంశుమంతుడు; 10. వరుణుడు; 11. మిత్రుడు; 12. విష్ణువు ఈ పన్నెండుమంది సూర్యులు సమస్త జీవజాలానికి - సృష్టి విధానానికి ఆధారభూతులవుతున్నారు.

విశ్వకర్మ అనే త్వష్టప్రజాపతి కూతురు సంజ్ఞ సూర్యునికి భార్య. ఈమెయందు సూర్యునికి వైవస్వత మనువు; యమున (యమి అనేపేరుగలవది) యముడు (ప్రాణులను ముక్తి దరి చేర్చు ధర్మరాజు) అనే కవలలు ఉద్భవించారు.

సంజ్ఞ తనకు మారుగా ఛాయను సృజించి, కొంత కాలము భర్తకు దూరంగా ఉన్న సమయంలో సూర్యుడు ఆ ఛాయనే సంజ్ఞగా భావించుట చేత ఆమెవల్ల సూర్యునికి శనైశ్చరుడు కలిగాడు. అలాగే సావర్ణుడు అనే ఇంకొక కుమారుని కూడా ఛాయ-సూర్యునికి కని ఇచ్చింది. సూర్యుని తేజము భరించలేనంతగా ఉండుటచేత, దేవతల శిల్పి విశ్వకర్మ సూర్యుని తేజస్సు కొంత చిత్రిక పట్టించాడు. అలా తరణి పట్టగా వెలువడిన రజనుతో ఒక చక్రాన్ని తయారుచేసి, విష్ణుమూర్తికి యివ్వగా అది ఆయుధంగా ధరించి శ్రీహరి చక్రధారి అయ్యాడు. (బ్రహ్మపురాణం 6వ అధ్యాయం 1-53 శ్లోకములు).

# 32. జ్యోతిష్యశాస్త్ర పరంగా సూర్యుడు

**రవి లక్షణాలు :-**

రవి పురుషగ్రహము ఇది రుచులలో కారమును, రంగులలో రక్తవర్ణమును సూచిస్తుంది. పొడుగైనవారిని, గోధుమరంగు జుట్టుకలవారిని, ఎర్రటికనులు, పెద్దదయిన గుండ్రని ముఖము కలవారిని సూచిస్తుంది. ఇది క్షత్రియజాతికి చెందినది. అధిదేవత అగ్ని. 50 సంవత్సరముల వయస్సు గలవారిని సూచించును. ఈ గ్రహము పిత్తము ప్రకృతిగా కలది. గ్రీష్మఋతువును సూచిస్తుంది. అగ్నితత్త్వము కలిగి తూర్పుదిక్కుకు అధిపతిగా ఉంటుంది. ఇది లోహములలో రాగిని, రత్నములలో మాణిక్యము (కెంపు)ను సూచిస్తుంది. ఈ గ్రహసంఖ్య 1. దశమభావంలో ఇతనికి దిగ్బలం కలుగును.

రవి కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములకు అధిపతి. ఇది శరీరావయవములలో గుండె, రక్తము, పురుషుల కుడికన్ను, స్త్రీల ఎడమకన్నును సూచించును. రవి సింహరాశికి అధిపతి. సింహంలో మొదటి 20 డిగ్రీలు దీనికి మూలత్రికోణము. ఇతనికి ఉచ్చరాశి మేషము. నీచరాశి తుల. మేషంలో 10వ డిగ్రీ ఇతనికి పరమోచ్చ. అలాగే తులలో 10 వ డిగ్రి ఇతనికి పరమనీచ. ఇతనికి చంద్ర, కుజ, గురులు స్నేహితులు. శని, శుక్రులు శత్రువులు, బుధుడు సముడు.

**రవి ప్రభావం :-**

రవి ప్రభావితులకు ఆత్మాభిమానం, చురుకుదనం ఎక్కువ. ఇతరులను ఆకర్షించు గుణము కలిగియుంటారు. సంఘంలో పలుకుబడి వుంటుంది. విశాలహృదయులు. ఆవేశం ఎక్కువ. పొగడ్తలకు లొంగి పోతారు. సంపాదిస్తారు కాని అశ్రద్ధవలన ఎక్కువ ఖర్చు చేస్తారు. నడివయస్సులో కంటి జబ్బులు రావచ్చు.

ఆపత్కాలమున సరియైన ఆలోచనలు వస్తాయి. గుండెజబ్బు, వడదెబ్బ వల్ల ప్రమాదం కలుగవచ్చును.

**రవి కారకత్వములు :-**

రవి ఆత్మకు కారకుడు. తండ్రి, శక్తి, అగ్ని, ప్రతాపము, ఆకాశము, తూర్పు, రాజ్యము, దేశాధిపత్యము, ముండ్లచెట్టు, మిరియాలు, మిరపకాయలు, వీర్యము, వేరుశనగ, కొబ్బరి, వాము, శివపూజ, శివభక్తులు, శివాలయములు, రక్తచందనం, సింహం, ఎలుగుబంటి, గుర్రము, సర్పము, కాకి, కోకిల, కోడి, హంస, ప్రభుత్వ కార్యాలయాలు, వైద్యులు, రిజర్వుబ్యాంకులను సూచించును. హృదయమునకు సంబంధించిన వ్యాధులు, జ్వరము, మందులను సూచించును.

విమానాలు, విదేశీయులు, అసాధారణ విషయాలు, ఆందోళన, పరోపకారము, ఖగోళశాస్త్రము, అపాయ సూచిక, విమానాశ్రయము, విమానచోదక విద్య, బ్యాటరీ, భూకంపాలు, మార్పులు, విడాకులు, ఎలక్ట్రికల్ సామాను, డైనమో, బహిష్కరించుట, స్వతంత్రము, తుఫాను, రాడార్, విమానయానం, ఎలక్ట్రానిక్స్, రేడియో, టి.వి, పురాతనవస్తువులు, ఎక్స్‌రే, విద్యుత్తు, సాంప్రదాయకరహితం, ఆధునికత, శాస్త్రవేత్తలు, నూతనభావాలు, నూతన కల్పన, ఆటంకములు, హెలికాప్టర్, హోమోసెక్సువల్, అరాచకము, కట్టుబాట్లను సూచించును.

**రవి సూచించు విద్యలు :-**

రవి భౌతికశాస్త్రము, వైద్యశాస్త్రము, మేనేజిమెంటు కోర్సులు, రాజకీయ శాస్త్రములను సూచించును. రవి శుక్రునితో కలసి కంటివైద్యము బుధునితో కలసి నరములు, చెవికి సంబంధించిన వైద్యము, శనితో కలసి కార్డియాలజిస్టు, ఆర్థోపెడిక్స్, అనస్తీషియా వైద్యుడు, గురునితో కలసి ఆయుర్వేదము, కుజునితో కలసి సర్జన్‌ను సూచించును.

**రవి సూచించు వ్యాధులు :-**

అధికవేడి, జ్వరములు, ఎసిడిటీ, అల్సర్, గుండెజబ్బు, కుడి కంటికి సంబంధించిన వ్యాధులు, రక్తముకు సంబంధించిన వ్యాధులు, రక్తపోటులను రవి సూచిస్తుంది.

**రవి సూచించు వృత్తి, వ్యాపారాలు :-**

రాగి, బంగారం, మందులు, రసాయనాలు, గోధుమలతో సంబంధించిన వృత్తులను, ప్రభుత్వోద్యోగులను, స్థిరమైన వృత్తిని, వైద్యులను, మంత్రులను రవి సూచించును. రవి గురునితో కలసి ఫిజీషియన్, కుజునితో కలసి సర్జన్‌లను,

బుధునితో కలసి రోగ నిర్ధారణకు సహాయాన్ని, గురు, శుక్రులతో కలసి మెటర్నిటిలో ప్రత్యేక శిక్షణను సూచించును. శుక్రునితో కలసి 5 లేదా 8వ స్థానంలో ఉంటే కంటివైద్యుడు, శనితో కలసి 1 లేదా 8వ స్థానంలో ఉంటే డెంటిస్ట్, బుధునితో కలసి 5 లేదా 9వస్థానంలో ఉంటే ఇ.యన్.టి. స్పెషలిస్ట్‌ను సూచించును.

## ద్వాదశ లగ్నాలలో రవి-ఫలితాలు

**మేషరాశి లగ్నమైతే**

- మేషలగ్నమై లగ్నంయందు రవియున్న జాతకునికి, మంచి రాజయోగము, దైవభక్తి, పరోపకారము, దయాదాక్షిణ్యము, అధికారులచే సన్మానము, పేరు ప్రతిష్ఠలు గలుగును.
- 2 వ స్థానంలో రవియున్న ఆర్జించిన ధనమంతయు ఖర్చుపెట్టును.
- 3 వ స్థానంలో రవియున్న జాతకునికి ధైర్య సాహసములు ఎక్కువగా ఉండును.
- 4 వ స్థానంలో రవియున్న జాతకునికి మాతృసౌఖ్యము తక్కువగా నుండును. కాని కార్యలాభం, సుఖం కలుగును.
- 5 వ స్థానంలో రవియున్న పేరు ప్రతిష్ఠలు కల పుత్రుడు ఒకడే యుండును. రవిదశ యందు అధికారులచే సన్మానము కలుగును.
- 6 వ స్థానంలో రవియున్న ధన వ్యయము కలుగును.
- 7వ స్థానములో రవియున్న సంతానం వలన దుఃఖము, తండ్రికి ప్రమాదము, విశేష నష్టము కలుగును.
- 8వ స్థానంలో రవియున్న అనారోగ్యము, ధననష్టము, సంతానంవలన దుఃఖము కలుగును.
- 9వ స్థానములో రవియున్న సంఘంలో గౌరవము, సన్మానములు, విశేష ధనము లభించును.
- 10వ స్థానములో రవియున్న ఉద్యోగము, ధనసంపాదన కలుగును. ప్రయాణాలు చేయును.
- 11వ స్థానములో రవియున్న ఉద్యోగంలో రాణిస్తారు.
- 12 స్థానములో రవియున్న సామాన్య జీవనము కలుగును. పిత్రార్జిత ధనము వ్యయమగును.

**వృషభం లగ్నమైతే**

- వృషభం లగ్నమై లగ్నంలో రవియున్న అందమైన వాడు, సాత్త్వికుడు.
- 2వ స్థానంలో రవియున్న నేత్రరోగము, ధననష్టము కలుగును.
- 3వ స్థానంలో రవియున్న సోదరుల వలన కీర్తి పొందును.
- 4వ స్థానంలో రవియున్న అధికారం, వాహనం, ఉద్యోగం కలుగును.
- 5వ స్థానంలో రవియున్న ధనము, సుఖము, పుత్రసంతానము కలుగును.
- 6వ స్థానంలో రవియున్న భూవ్యయమగును. ఋణబాధలు కలుగును.
- 7వ స్థానమున రవియున్న మంచి భార్యలభించును. కాని భార్యకు ప్రమాదము కలదు.
- 8 వ స్థానమున రవియున్న తల్లికి ప్రమాదము, అనారోగ్యము, ధనవ్యయం కలుగును.
- 9 వ స్థానమున రవియున్న దాయాదుల ఆస్తి లభించును.
- 10 వ స్థానమున రవియున్న పుణ్యకార్యములు చేయును. ప్రయాణాలు చేయుదురు.
- 11 వ స్థానమున రవియున్న కీర్తి, కార్యలాభము, ధనము కలుగును.
- 12 వ స్థానమున రవియున్న సత్కార్యములకు ధనవ్యయమగును.

**మిధునం లగ్నమైతే**

- మిధువలగ్నంలో రవి ఉన్న అనారోగ్యం, ఋణంపెరుగుట జరుగును.
- రెండవ స్థానంలో రవి ఉన్న అనారోగ్యం కలుగును.
- 3 వ స్థానంలో రవి వున్న సోదరుని వలన గుర్తింపు గలుగును.
- 4 వ స్థానంలో రవి వున్న తల్లికి అనారోగ్యం, భూమి వ్యయము, చదువుకు ఆటంకములు ఏర్పడును.
- 5 వ స్థానంలో రవి ఉన్న సోదర నష్టం కలుగును. సుఖ దుఃఖాలు సమానంగా ఉంటాయి.
- 6 వ స్థానంలో రవి ఉన్న శత్రువుల వలన కష్టములు ఏర్పడును.
- 7 వ స్థానంలో రవి ఉన్న భార్యకు అనారోగ్యం కలుగును.
- 8 వ స్థానంలో రవి ఉన్న అనవసరమైన ఖర్చులు పెరుగును. పనులందు ఆటంకం కలుగును.

- 9 వ స్థానంలో రవి ఉన్న తండ్రికి అనారోగ్యం కలుగును. ధనరాబడి పెరుగును.
- 10 వ స్థానంలో రవి ఉన్న పుణ్యకార్యములు, ప్రయాణములు చేయును. గౌరవము కలుగును.
- 11 వ స్థానంలో రవి ఉన్న సోదరులవలన భాగ్యం కలుగును.
- 12 వ స్థానంలో రవిఉన్న శత్రువుల వలన బాధలు, ఆర్థిక ఇబ్బందులు, కార్యహాని కలుగును.

**కర్కాటకం లగ్నమైతే**

- కర్కాటకం లగ్నమై లగ్నములో రవియున్న ధనలాభము, అనారోగ్యము కలుగును.
- 2 వ స్థానంలో రవి యున్న ధనమును సంపాదించును. ఖర్చు చేయును.
- 3 వ స్థానములో రవియున్న ఒక సోదరుడు ఉంటాడు. సుఖ, దుఃఖములు సమానముగా ఉంటాయి.
- 4 వ స్థానములో రవియున్న సంతానము వలన తండ్రివలన విచారము ధనవ్యయము చేయును.
- 5 వ స్థానంలో రవియున్న ధనలాభం, సంతాన విచారం.
- 6 వ స్థానంలో రవియున్న అప్పులు చేయుదురు.
- 7 వ స్థానంలో రవియున్న ధనలాభము, అనారోగ్యము
- 8 వ స్థానంలో రవియున్న ఆస్తినష్టము.
- 9 వ స్థానంలో రవియున్న పితృసౌఖ్యం తక్కువ.
- 10 వ స్థానంలో రవియున్న అధికధనలాభము, ఉద్యోగము
- 11 వ స్థానంలో రవియున్న, స్త్రీ వలన ధనలాభము.
- 12 వ స్థానంలో రవియున్న తండ్రి వలన ధనవ్యయము.

**సింహం లగ్నమైతే**

- సింహలగ్నమై లగ్నంలో రవి ఉన్న బహుస్త్రీ సాంగత్యము కలుగును.
- 2 వ స్థానంలో రవి వున్న సామాన్యజీవితము, ధనవ్యయము కలుగును.
- 3 వ స్థానంలో రవి ఉన్న అనారోగ్యము, మోసకారితనము కలుగును.
- 4 వ స్థానంలో రవి ఉన్న భూమి, విద్య, ధనము, కీర్తి, సుఖము కలుగును.

- 5 వ స్థానంలో రవి ఉన్న భాగ్యము కలుగును. సంతానము కలుగును.
- 6 వ స్థానంలో రవి ఉన్న అనారోగ్యము, ఋణబాధలు కలుగును.
- 7 వ స్థానంలో రవి ఉన్న భార్యకు అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానంలో రవి ఉన్న తండ్రి సంపాదించిన ఆస్తి పోగొట్టుకొనును. కార్యహాని కలుగును.
- 9 వ స్థానంలో రవి ఉన్న భోగ భాగ్యములు కలుగును. పితృసుఖము లక్ష్మీ కలుగును.
- 10 వ స్థానంలో రవి ఉన్న వాహనము, అధికారము లభించును.
- 11 వ స్థానంలో రవి ఉన్న పిత్రార్జితమును పొందును.
- 12 వ స్థానంలో రవి ఉన్న బాల్యమున ఈ దశ వచ్చిన బాలారిష్టము కలుగును.

**కన్య లగ్నమైతే**

- కన్యలగ్నములో రవి ఉన్న సామాన్య జీవనము కలుగును.
- 2 వ స్థానంలో రవి ఉన్న నీచకార్యములు, ధనార్జన, వృధాఖర్చు కలుగును.
- 3 వ స్థానములో రవి ఉన్న సామాన్యజీవనము కలుగును.
- 4 వ స్థానంలో రవి ఉన్న తల్లికి అనారోగ్యము, పూర్వుల ఆస్తి కోల్పోవుట జరుగును.
- 5 వ స్థానంలో రవి ఉన్న ధనము, సుఖము, పుత్రుడు కలుగును.
- 6 వ స్థానంలో రవి ఉన్న దాయాదుల ఆస్తి లభించును. కుటుంబ సుఖము కలుగును.
- 7 వ స్థానంలో రవి ఉన్న భార్యకు అనారోగ్యము, ధనవ్యయము కలుగును.
- 8 వ స్థానంలో రవి ఉన్న మంచి కార్యములు చేయును. కీర్తి గడించును.
- 9 వ స్థానంలో రవి ఉన్న పుత్రుల వలన దుఃఖము, పిసినారితనము కలుగును.
- 10 వ స్థానంలో రవి ఉన్న పుణ్యక్షేత్రములను దర్శించును.
- 11 వ స్థానంలో రవి ఉన్న దుష్ట కార్యములు చేయును. ధనము, సుఖము కలుగును.
- 12 స్థానంలో రవి ఉన్న నీచ కార్యములు, ధనవ్యయము కలుగును.

**తుల లగ్నమైతే**

- తులాలగ్నమై లగ్నమందు రవి ఉన్న రాజయోగము లేని యెడల అనేక కష్టములు కలుగును.
- 2 వ స్థానమున రవియున్న ధనలాభము, ధనవ్యయము కలుగును.

- 3 వ స్థానమున రవియున్న విశేష భాగ్యాన్ని పొందుతాడు.
- 4 వ స్థానమున రవియున్న తల్లికి అనారోగ్యము సంభవించును.
- 5 వ స్థానమున రవియున్న సిరి, సంపదలను అనుభవించును.
- 6 వ స్థానమున రవియున్న సుఖదుఃఖాలు సమానంగా ఉండును.
- 7 వ స్థానమున రవియున్న సుఖజీవనాన్ని పొందుతాడు.
- 8 వ స్థానమున రవియున్న ధననష్టాన్ని పొందుతాడు.
- 9 వ స్థానమున రవియున్న భోగభాగ్యాలు కలవారవుతారు.
- 10 వ స్థానమున రవియున్న ప్రయాణాలు చేస్తారు.
- 11 వ స్థానమున రవియున్న ఆయుర్దాయం కలవారవుతారు.
- 12 వ స్థానమున రవియున్న పసితనంలో ప్రమాదం, పిత్రార్జిత వ్యయము, అనారోగ్యము సంభవించును.

**వృశ్చికం లగ్నమైతే**

- వృశ్చికలగ్నమై లగ్నమందు రవియున్న ధనలాభము కలుగును.
- 2 వ స్థానమందు రవియున్న ధనమును సంపాదించును. ఖర్చు చేయును.
- 3 వ స్థానంలో రవియున్న సుఖదుఃఖములు సమానముగా నుండును.
- 4 వ స్థానంలో రవియున్న వాహనసుఖం, ముద్రాధికారము కలుగును.
- 5 వ స్థానంలో రవియున్న సంతాన నష్టం, కార్యసిద్ధి, కీర్తి కలుగును.
- 6 వ స్థానంలో రవియున్న సుఖము, ధనము, గౌరవము కలుగును.
- 7 వ స్థానంలో రవియున్న కార్యసిద్ధి, భార్య వలన ఆస్తి కలుగును.
- 8 వ స్థానంలో రవియున్న పిత్రార్జితమును కోల్పోవుట జరుగును.
- 9 వ స్థానంలో రవియున్న భోగభాగ్యము కలుగును.
- 10 వ స్థానంలో రవియున్న అధికారుల అభిమానం, సంఘంలో కీర్తి పలుకుబడి, ముద్రాధికారము కలుగును.
- 11 వ స్థానంలో రవియున్న విశేష ధనార్జనము కలుగును.
- 12 వ స్థానంలో రవియున్న పిత్రార్జిత నష్టము కలుగును.

**ధనుస్సు లగ్నమైతే**

- ధనుస్సు లగ్నమై లగ్నమున రవి ఉన్న అధికారం, ధనము, సుఖము, పేరు ప్రతిష్టలు కలుగును.
- 2 వ స్థానములో రవి ఉన్న సామాన్య జీవనం, ధననష్టము కలుగును.

- 3 వ స్థానంలో రవి ఉన్న తండ్రికి ఆపద కలుగును.
- 4 వ స్థానంలో రవి ఉన్న పితృ సుఖం తక్కువ. ఆరోగ్యము, ధనము, సుఖము కలుగును.
- 5 వ స్థానంలో రవి ఉన్న వాహన సుఖం, ముద్రాధికారము కలుగును.
- 6 వ స్థానంలో రవి ఉన్న వ్యవహారము లందు ఆటంకములు, శతృభయం కలుగును.
- 7 వ స్థానంలో రవి ఉన్న మంచి భార్య లభించును.
- 8 వ స్థానంలో రవి ఉన్న పిత్రార్జిత ధన నష్టము కలుగును.
- 9 వ స్థానంలో రవి ఉన్న సంపూర్ణ ఆయుర్భాగ్యము కలుగును.
- 10 వ స్థానంలో రవి ఉన్న సంఘంలో గౌరవం, అధికారం కలుగును.
- 11 వ స్థానంలో రవి ఉన్న వ్యవహార చిక్కులు కలుగును.
- 12 వ స్థానంలో రవి ఉన్న సత్కార్యములకు ధన వ్యయం కలుగును.

**మకరం లగ్నమైతే**

- మకర లగ్నమై 1 వ స్థానంలో రవి వున్న ధనంఖర్చు, శరీరపీడలు కలుగును.
- 2 వ స్థానంలో రవి వున్న ధనసంపాదన ఉండును. అధిక ఖర్చులు ఉండును.
- 3 వ స్థానంలో రవి వున్న సామాన్య జీవితంను గడుపును.
- 4 వ స్థానమున రవి వున్న పిత్రార్జిత భూమి కొంత ఖర్చు పెట్టును. మాతృసౌఖ్యం తక్కువ. అధిక ఆయుర్భాగ్యాలు వుండును.
- 5 వ స్థానమున రవివున్న సంతానసుఖము వుండదు. ఆయుర్భాగ్యాలు అధికంగా వుండును.
- 6 వ స్థానమున రవి వున్న అధిక శత్రువులు, శరీరబాధలు ఎక్కువగా వుండును.
- 7 వ స్థానమున రవి వున్న అనుకూలవతి అయిన భార్య వచ్చును. భార్య అనారోగ్యముతో బాధపడుచుండును.
- 8 వ స్థానమున రవి వున్న పూర్ణాయుర్దాయము. సామాన్యమైన జీవితాన్ని అనుభవించును.
- 9 వ స్థానమున రవి వున్న పితృసౌఖ్యం తక్కువైనా సుఖజీవనం వుంటుంది.
- 10 వ స్థానమున రవి వున్న ధనహీనము, అల్పాయుర్దాయము కలుగును.
- 11 వ స్థానమున రవి వున్న ధనవంతుడు, సుఖమైన జీవితం, పూర్ణాయుర్దాయం కలుగును.
- 12 వ స్థానమున రవి వున్న బాలారిష్టము, అనవసరపు ఖర్చులు చేయును. సుఖసంతోషాలు లేని జీవితం.

**కుంభం లగ్నమైతే**

- కుంభలగ్నమైన లగ్నమందు రవి ఉన్న రవిదశలో సామాన్యజీవనం, అనారోగ్యము కలుగును.
- 2 వ స్థానమున రవిఉన్న ధనవ్యయము, అనారోగ్యము, సామాన్యజీవనం కలుగును.
- 3 వ స్థానమున రవి ఉన్న పూర్ణయోగము, మంచి భార్య లభించును.
- 4 వ స్థానమున రవి ఉన్న భార్య వలన ఆస్తి లభించును.
- 5 వ స్థానమున సుఖము, ధనము, శాంతి, పుత్ర సంతానము కలుగును.
- 6 వ స్థానమున రవి ఉన్న భార్యకి అనారోగ్యము, వ్యవహారములలో చిక్కులు, అశాంతి కలుగును.
- 7 వ స్థానమున రవి ఉన్న మంచి భార్య, సుఖము, ధనము, శాంతి లభించును.
- 8 వ స్థానమున రవి ఉన్న భార్యకి అనారోగ్యము, యోగహీనము కలుగును.
- 9 వ స్థానమున రవి ఉన్న భార్యవలన నష్టము, ధనము ఖర్చు అగుట జరుగును.
- 10 వ స్థానమున రవి ఉన్న పూర్ణయోగమును పొందును.
- 11 వ స్థానమున రవి ఉన్న పూర్ణయోగము, ధనలాభము, భూలాభము కలుగును.
- 12 వ స్థానమున రవి ఉన్న రవి దశలో వ్యవహారములలో చిక్కులు, అశాంతి, భార్యకి అనారోగ్యము, ధనము ఖర్చగుట వంటివి జరుగును.

**మీనం లగ్నమైతే**

- మీన లగ్నమై లగ్నంలో రవి ఉన్న అనారోగ్యము, ధననష్టము, సంఘంలో గుర్తింపు కలుగును.
- 2 వ స్థానంలో రవి ఉన్న అనారోగ్యము, ధననష్టము కలుగును.
- 3 వ స్థానంలో రవి ఉన్న సుఖము కలుగును. అనారోగ్యం కలుగును.
- 4 వ స్థానంలో రవి ఉన్న స్వల్ప విద్య, భూమి, వాహనములు లభించును.
- 5 వ స్థానంలో రవి ఉన్న సంతాన సౌఖ్యము తక్కువగా ఉండును.
- 6 వ స్థానంలో రవి ఉన్న ఆయుర్భాగ్యములు లభించును.
- 7 వ స్థానంలో రవి ఉన్న సుఖహీనము కలుగును.
- 8 వ స్థానంలో రవి ఉన్న అనేక కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో రవి ఉన్న ధనము, సుఖము కలుగును.

- 10 వ స్థానంలో రవి ఉన్న శాంతి కీర్తి కలుగును.
- 11 వ స్థానంలో రవి ఉన్న శత్రువుల వల్ల కష్టములు, కార్యసిద్ధి కలుగును.
- 12 వ స్థానంలో రవి ఉన్న సుఖహీనులు. రోగము, ఋణము కలుగును.

## వివిధ భావాలలో రవి - ఫలితాలు

- రవి లగ్నంలో ఉంటే జాతకుడు కార్యసాధకుడు, బుద్ధిమంతుడు, ధనలాభం పొందువాడు. సంతోషకరమైన జీవితాన్ని గడుపుతాడు కోపిష్టి.
- రవి ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు ధనహీనుడు అవుతాడు.
- రవి తృతీయభావంలో ఉంటే జాతకుడు ధనవంతుడు, సౌఖ్యపరుడు, వాహనములు కలవాడు. అభిమానులు కలవాడు.
- రవి చతుర్థభావంలో ఉంటే జాతకునకు బంధుప్రేమ ఎక్కువ. పిత్రార్జితమును కోల్పోతాడు. సుఖజీవనం పొందుతాడు.
- రవి పంచమ భావంలో ఉంటే జాతకుడు తెలివైనవాడు. సమస్యలను పరిష్కరించును. కాని ప్రథమసంతానం వలన ఇబ్బందులు పడతాడు.
- రవి షష్ఠభావంలో ఉంటే జాతకుడు ధైర్యవంతుడు. శత్రువులను జయిస్తాడు.
- రవి సప్తమభావంలో ఉంటే జాతకునకు కుటుంబ సమస్యలు ఎక్కువగా ఉంటాయి. దానివలన అశాంతి కలుగుతుంది. కళత్రసౌఖ్యం తక్కువ.
- రవి అష్టమభావంలో ఉంటే జాతకుడు బలహీనంగా ఉంటాడు. కోపం ఎక్కువ. అందువలన ఇతరులచేత ద్వేషింపబడతాడు. జాతకునకు దృష్టిలోపం ఉంటుంది.
- రవి నవమ భావంలో ఉంటే జాతకుడు ధర్మపరుడు. కుటుంబ సౌఖ్యం కలవాడు. మేనమామ, మేనత్తలకు దూరంగా ఉంటాడు.
- రవి దశమ భావంలో ఉంటే జాతకుడు ఇతరులకు సాయం చేస్తుంటాడు. సమాజంలో గౌరవం పొందుతాడు.
- రవి ఏకాదశ భావంలో ఉంటే జాతకుడు సుఖజీవనం చేయువాడు. ఆరోగ్యవంతుడు, ధనార్జన చేస్తాడు.
- రవి ద్వాదశభావంలో ఉంటే జాతకునకు తండ్రిపై భక్తి, అభిమానం ఉంటుంది. లౌక్యము ఎక్కువ. కుటిల స్వభావం కలిగి ఉంటాడు.

**రవి కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- తండ్రితో తరచు అభిప్రాయ భేదాలు కలుగుతుంటాయి.
- తరచు కాళ్ళకు ఏదో ఒకటి అడ్డంపడి, మీరు పడుతుంటారు.
- తరచు జ్వరం వస్తూంటుంది.

- తరచు శరీరంలో వేడి చేస్తుంది.
- ఇంటిలో పెరుగుతున్న ఎర్ర ఆవు చనిపోతుంది.
- పాతఫర్నిచర్ పాడైపోతుంది.
- మీ పనులకు గవర్నమెంటు ద్వారా ఆటంకాలు ఏర్పడతాయి.
- కుడికన్ను నొప్పి ఉంటుంది. లేదా తరచు ఎర్రబడుతుంది.

పై సంఘటనలలో ఏది జరిగినా రవి అనుకూలుడు కాడని తెలుసుకోవచ్చు. దానికి క్రింది పరిహార క్రియలలో తగిన దానిని చేసుకోవాలి.

**రవి శాంతించుటకు చేయదగిన కార్యాలు.**

- ప్రతిరోజు పనిచేయుటకు ముందుగా ఒక స్వీటు లేదా పంచదార తినండి.
- తండ్రిని గౌరవించండి. ఆయన వద్ద వినయంగా ఉండండి. ప్రతిరోజు ఆయన ఆశీస్సులు తీసుకోండి.
- నిద్రించునపుడు తలవద్ద పాలచెంబు ఉంచుకోండి. మరునాటి ఉదయాన ఆ పాలను ఏదైన పూలకుండీలో పోయండి.
- తూర్పు ఆగ్నేయం దిశలో ఒక కుండను ఉంచి, దానిని ప్రతిరోజు నీటితో నింపి ఉంచండి.
- బుధవారం సూర్యోదయవేళలో కుడిచేతి ఉంగరం వేలుకు మరకతం (పచ్చ) పొదిగిన ఉంగరాన్ని ధరించండి. పచ్చ కనీసం 3 కారెట్లు ఉండాలి.

## వివిధ భావాలలో రవి - పరిహార క్రియలు

**1. లగ్నంలో రవి ఉంటే చేయవలసిన పరిహార క్రియ**

- పెద్దల ఎడ వినయ విధేయతలతో ఉండండి.
- ప్రతిదినం తండ్రికి నమస్కరించండి.
- ఇంటి చివరగా ఎడమవైపున ఒక చీకటిగదిని నిర్మించండి.

**2. ద్వితీయ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహార క్రియ**

- ఇంటిలో బోరింగ్ వేయించండి.
- చంద్రునకు సంబంధించిన వస్తువులను దానంగా తీసుకోవద్దు.

**3. తృతీయ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహార క్రియ**

- ప్రతిరోజు తల్లికి పాదనమస్కారములు చేయండి.
- అమ్మమ్మను గౌరవించండి.

**4. చతుర్థ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- మద్యపానం చేయవద్దు
- మాంసాహారం తినవద్దు.
- అంధులకు దానం చేయండి.
- మెడలో ఖాకీ దారం చుట్టిన రాగినాణెమును ధరించండి.

**5. పంచమ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- సాధ్యమైనంత తక్కువగా మాట్లాడండి
- ఎవరికీ వాగ్దానాలు చేయవద్దు.
- ఆంజనేయస్వామిని పూజించండి.

**6. షష్టమ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- ప్రతిరోజు ఆంజనేయస్వామి గుడికి వెళ్ళండి
- గోధుమలు, బెల్లం కలిపి కోతులకు పెట్టండి.
- ప్రతిరోజు అమ్మపాదాలను కడగండి.
- కనీసం 46 రోజులు గోధుమపిండి, బెల్లంతో చేసిన వంటకాలను పేదపిల్లలకు పంచండి.
- ఇంటి ఆవరణలో తూర్పువైపున ఒక రాగిరేకును పాతండి.

**7. సప్తమ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- ఆవుకు ఆహారం పెట్టండి
- ఏ పని చేయాలన్నా, ముందుగా స్వీటు తిని, మంచినీరు త్రాగి తరువాత ఆ పనిని ప్రారంభించండి.
- వంట పూర్తిగా అయిపోయిన తరువాత పొయ్యిని పాలతో ఆర్పండి.
- వంట పూర్తిగా అయిపోయిన తరువాత పొయ్యిలో బ్రెడ్ ముక్క వేయండి.
- ఇంటి ఆవరణలో 9 చతురస్రాకారపు రాగిరేకులను పాతిపెట్టండి.

**8. అష్టమ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- ఆవులను పెంచండి లేదా ప్రతిరోజు ఆవుకు ఆహారం పెట్టండి.
- సోదరులను ఆదరించండి.
- దక్షిణపు వీధివైపు ముఖద్వారమున్న ఇంటిలో ఉండవద్దు.

**9. నవమ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- ప్రతిరోజు ప్రాణాయామం లేదా ధ్యానం చేయండి.
- పాలు, బియ్యం, వెండి మొదలగు చంద్రునికి సంబంధించిన వస్తువులను ఉచితంగా తీసుకోవద్దు.

- సాధ్యమైనంతవరకు ఇత్తడిపాత్రలు వాడండి. ముఖ్యంగా త్రాగునీరు నిలువ చేయటానికి, త్రాగటానికి ఇత్తడి బిందె, ఇత్తడి గ్లాసులనే వాడండి.
- ఎవరితోను వాదన చేయకండి.

**10. దశమ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహారక్రియ**

- స్వంత ఇంటిలో చేతిపంపును పంపును పెట్టించండి
- గేదెలను పెంచండి
- తలపై ఎల్లప్పుడు తెల్లటిటోపి లేదా తెల్లని తలపాగా ధరించండి

**11. ఏకాదశ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహార క్రియ**

- మద్యపానం చేయరాదు
- మాంసాహార భక్షణ మానివేయాలి
- మేకను పెంచండి

**12. ద్వాదశ భావంలో రవి ఉంటే చేయవలసిన పరిహార క్రియ**

- ఖాళీస్థలం ఎక్కువగా ఉండే ఇంటిలో ఉండండి.
- వాహనాలకు సంబంధించిన ఉద్యోగం అంటే డ్రైవరు, మెకానిక్ మొదలైన ఉద్యోగాలను చేయవద్దు.

# 33. రవిహోర

రవి హోరకు అధిపతి సూర్యుడు. కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములు కలిగిన దినములలో రవిహోర సమయములో రవి ప్రభావం ఎక్కువగా ఉంటుంది.

రవి అధికారము, పరపతి, గౌరవము, హోదా, పేరు ప్రతిష్టలును సూచిస్తుంది. కాబట్టి రవిహోరలో అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, గవర్నరు, మేయరు, జడ్జి, సర్జను వంటి పదవులను స్వీకరించుట లేదా ఆ పదవులలో వున్నవారిని దర్శించుటకు వెళ్ళుటకు లేదా వారి వద్ద పనిచేయుటకు మంచి సమయము.

రవి ఆయాగ్రహాలతో కలిసిన సమయాలలో రవిహోరలో కాంట్రాక్టులపై సంతకాలు చేయుట, డాక్యుమెంట్సును రిజిష్టర్ చేయుట, విల్లువ్రాయుట, ప్రమోషన్ కోసం ప్రయత్నించుట, జరిగిన దొంగతనం గురించి పోలీసులకు ఫిర్యాదు చేయుట, రాజకీయాలలో ప్రవేశించుటకు మంచి సమయం. అంతేకాదు బియ్యం, మిరియాలు, లవంగాలు, మిరప, కొబ్బరి మొదలగునవి కొనుటకు మంచి కాలము.

అయితే మందులు వాడుటకు ఆపరేషనుకు సరియైన సమయం కాదు. ఆదిత్యహృదయం, విష్ణుసహస్రనామం పఠించుటకు అనువైన సమయం.

# రవిహోరసమయం

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయం నుండి హోర సమయములను లెక్కిస్తారు. హోరకాల ప్రమాణం ఒక గంట.

సూర్యోదయ, సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింద సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు | రాత్రి |
|---|---|---|
| ఆదివారం | 6-7, 1-2 | 8-9, 3-4 |
| సోమవారం | 10-11, 5-6 | 12-1 |
| మంగళవారం | 7-8, 2-3 | 9-10, 4-5 |
| బుధవారం | 11-12 | 6-7, 1-2 |
| గురువారం | 8-9, 3-4 | 10-11, 5-6 |
| శుక్రవారం | 12-1, | 7-8, 2-3 |
| శనివారం | 9-10, 4-5 | 11-12 |

# 34. ధారణం

## రవిగ్రహ దోష నివారణకు రత్న ధారణ

అధికారము, పదవిలలో మార్పు, ఉద్యోగము, పితృసౌఖ్యములకు సంబంధించిన సమస్యల పరిష్కారమునకు కెంపును ధరిస్తారు. మరియు నేత్ర, హృదయ వ్యాధిగ్రస్తులు కెంపును ధరించుట ఉత్తమం.

**కెంపు :-**

రవి ధరించవలసినది కెంపు. దీని అధిష్టాన దేవతయగు నారాయణుని పూజించాలి. నారాయణ మంత్రాన్ని, సూర్యమంత్రాన్ని జపిస్తూ ఆదివారంనాడు, శుభనక్షత్రము. శుభతిథి కల రోజున, శుభకార్తెయందున ఆ కెంపుని ఎర్రని పూలతో పూజించాలి. ఆ దైవసాన్నిధ్యంలోనే కెంపును ఆరురోజులుంచి తరువాత నైవేద్యం, అన్నశాంతి చేసి తరువాత ధరించాలి.

కెంపును ధరించలేనివారు స్టార్‌రూబి, సన్‌స్టోన్, రెడ్‌స్పైనెల్ వంటి ఉపరత్నములను ధరించవచ్చును.

కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రము జన్మనక్షత్రములయినవారు, సింహరాశిలగ్నంగా లేదా జన్మరాశిగా గలవారు రవికి సంబంధించిన రత్నములను ధరించవచ్చును.

**రవిగ్రహదోషనివారణకు రుద్రాక్షధారణ :-**

రవిగ్రహం అనుకూలంగా లేనివారు, ఏకముఖరుద్రాక్ష, (లేదా) ద్వాదశముఖి రుద్రాక్ష ధరించవచ్చు.

**ఏకముఖ రుద్రాక్ష:-**

1. దీనిని శివుని ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన శారీరక, మానసికరోగాలు నశించును.
3. సంఘంలో పేరు ప్రతిష్టలు కలిగి వుందురు
4. మానసిక వికాసం ఏర్పడును
5. రుద్రాక్షయందు ఒకేధార వుంటుంది.

**ద్వాదశముఖ రుద్రాక్ష:-**

1. దీనిని సూర్యభగవానుని స్వరూపంగా చెబుతారు
2. దీనిని ధరించుటవలన ఆరోగ్యం, తేజస్సు పొందుతారు
3. దీనికి 12 ధారలుంటాయి.

# రవి గ్రహానుగ్రహం కోసం కవచ ధారణ

ఒక రాగి రేకుకు ఇరువైపుల క్రింది యంత్రమును చెక్కించాలి. దానిని 'ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆదిత్యాయనమః" అను మంత్రమును 1,00,000సార్లు జపిస్తూ పూజించాలి.

తరువాత దానిని లాకెట్‌గా మెడలో ధరించిన ఆర్థిక సమస్యలు తొలగును. ఆరోగ్యం కలుగును.

| పది | ఐదు | పన్నెండు |
|---|---|---|
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |
| ఏడు | రెండు | తొమ్మిది |
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |
| ఎనిమిది | ఒకటి | ఆరు |
| మూడు | ఐదు | ఏడు |
| నాలుగు | తొమ్మిది | రెండు |

| ఎనిమిది | ఒకటి | ఆరు |
|---|---|---|
| రెండు | ఐదు | ఏడు |
| నాలుగు | తొమ్మిది | రెండు |
| ఏడు | రెండు | తొమ్మిది |
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |
| పది | ఐదు | పన్నెండు |
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |

# 35. దానం

## సూర్య మహాదశలో చేయదగిన దానాలు

| | |
|---|---|
| 1. సూర్యమహాదశలో చంద్ర అంతర్దశ } గోదానం | 5. సూర్యమహాదశలో శుక్ర అంతర్దశ } శ్వేత గోదానం |
| 2. సూర్యమహాదశలో కుజ అంతర్దశ } ఎద్దు దానం | 6. సూర్యమహాదశలో శని అంతర్దశ } మేక దానం |
| 3. సూర్యమహాదశలో బుధ అంతర్దశ } వెండి దానం | 3. సూర్యమహాదశలో రాహు అంతర్దశ } గేదె దానం |
| 4. సూర్య మహాదశలో గురు అంతర్దశ } బంగారం | 4. సూర్య మహాదశలో కేతు అంతర్దశ } మేష దానం |

# 36. పారాయణం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన రవి గ్రహానుగ్రహం పొందవచ్చును.

## పారాయణ స్తోత్రాలు

1. బ్రహ్మకృత సూర్యస్తుతి / సూర్యసూక్తము
2. సూర్య సహస్రనామ స్తోత్రం / ఏకవింశతి నామస్తోత్రం
3. సూర్యోపనిషత్ / ద్వాదశ సూర్య ప్రార్థన / సూర్యాష్టకం
4. సూర్య అష్టోత్తర శతనామ స్తోత్రం / సూర్యస్తుతి
5. ఆదిత్య హృదయం / మహామృత్యుంజయ మంత్రం
6. సూర్య కవచమ్ / సూర్య అష్టోత్తర శతనామావళి
7. సూర్య నమస్కారములు / పంచాక్షరీ జపం
8. సూర్యగాయత్రీ మంత్రాలు / రుద్రాభిషేకం
9. సూర్య సహస్ర నామావళి / రామావతార స్తుతి
10. సూర్య ప్రాతః స్మరణం / సూర్యమంగళాష్టకం
11. సూర్య స్తవరాజం / రామాయణ పారాయణ
12. సూర్యమండల స్తోత్రం / సూర్యప్రార్థన

## దోష పరిహారార్థం

# రామాయణ పారాయణ

1. సూర్యమహాదశలో సూర్య అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : బాలకాండ 43వ సర్గ.
   నైవేద్యం : పటిక బెల్లం, చెరకు, క్యారట్.
2. సూర్యమహాదశలో చంద్ర అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : అరణ్యకాండ 18వ సర్గ
   నైవేద్యం : పాలు, క్షీరాన్నం.
3. సూర్యమహాదశలో కుజ అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : అయోధ్యాకాండ 1-2 సర్గలు.
   నైవేద్యం : బెల్లం పొంగలి, కందిపప్పు పొంగలి.
4. సూర్యమహాదశలో బుధ అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : బాలకాండ 75వ సర్గ
   నైవేద్యం : ద్రాక్ష / తాంబూలం
5. సూర్యమహాదశలో గురు అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : అయోధ్యకాండ 17వ సర్గ
   నైవేద్యం : అరటిపళ్లు
6. సూర్యమహాదశలో శుక్ర అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : అయోధ్యకాండ 18వ సర్గ
   నైవేద్యం : పటికబెల్లం / పంచదార
7. సూర్యమహాదశలో శని అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : యుద్ధకాండ 91వ సర్గ
   నైవేద్యం : నేరేడు / నల్లద్రాక్ష
8. సూర్యమహాదశలో రాహు అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : బాలకాండ 36వ సర్గ
   నైవేద్యం : ఎండుద్రాక్ష / తేనె
9. సూర్యమహాదశలో కేతు అంతర్దశ జరుగు కాలమున -
   పారాయణ : అరణ్యకాండ 68వ సర్గ
   నైవేద్యం : ఖర్జూరం / నారికేళం

★ సూర్యమహాదశ జరిగే ఆరేళ్లకాలంలో ఎప్పుడైనా బాలకాండ మొత్తం పూర్తిగా పారాయణచేసి పాయసం నైవేద్యం పెట్టాలి.

# 37. సందర్శనం

రవి గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన పుణ్యక్షేత్రాలను తరచు సందర్శించడం ఉత్తమం.

## దర్శించదగిన పుణ్యక్షేత్రాలు

సూర్యగ్రహదోష నివారణతోపాటు శనిగ్రహదోష పరిహారార్థం కూడా శివ క్షేత్రాలను దర్శించుట యుక్తమని పురాణవచనం. కనుక పంచారామాలు, ద్వాదశ జ్యోతిర్లింగాలు, పంచభూతలింగ క్షేత్రాలు, ఇంకా - శైవ సంబంధ క్షేత్రాలు వేవినైనా యథాశక్తి దర్శించవచ్చును. స్థానికంగా ఉండే శివాలయాలను కూడ దర్శించ వచ్చును. విశేషంగా ఇక్కడనే పేర్కొనబడినవాటి గురించి సంక్షిప్త సమాచారం ఇక్కడ ఇవ్వబడింది. ఇది తీర్థయాత్రాసక్తులకు తోడ్పడగలదు.

## ద్వాదశ జ్యోతిర్లింగాలు

**1.శ్రీశైలం:** మన రాష్ట్రంలోనే యాత్ర చేయగలిగిన వారందరికీ అందుబాటులో ఉన్న శివక్షేత్రం జ్యోతిర్లింగ పుణ్యస్థలం శ్రీశైలం. నల్లమలకొండల్లో విలసిల్లిన యీ పుణ్యక్షేత్రం మహిమను వివరించడానికి వేలాది పుటలైనా చాలవు. భూలోక కైలాసం, దక్షిణకాశీ అని పిలువబడుతున్న శ్రీశైలం కర్నూలు జిల్లా డోర్నాల నుంచి 50కి.మీ దూరంలో ఉంది.స్వామి-మల్లికార్జునుడు, అమ్మవారు-భ్రమరాంబ.

శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అని ప్రమాణము. అనగా శ్రీశైల శిఖరాన్ని దర్శించిన వారికి మరో జన్మ అనేదే ఉండదని అదే ముక్తి మార్గమనీ నానుడి. నాలుగు గాలిగోపురాలు గల ప్రవేశద్వారాలు నాలుగు ఉపప్రవేశం ద్వారాలు గల పెద్ద ఆలయం. ఇది అష్టాదశ శక్తి పీఠాల్లోనూ ఒకటిగా ప్రసిద్ధి పొందింది. ఈ ఆలయానికి వెళ్ళే దారిలో సాక్షి గణపతి ఆలయం కూడా దర్శించండి. ఈ క్షేత్రంలోని జ్యోతిర్లింగ దర్శనం మాత్రమే కాక, పూజవల్ల ఇంకా ఎక్కువ ఫలితం ఉంది. దర్శించి పూజించి తరింతురు గాక!

**2.రామేశ్వరం:-** తమిళనాడు రాష్ట్రంలో ఉన్నట్లుగా చెప్పబడుతున్న యీ లింగం బంగాళాఖాతంలో సముద్రతీరానికి చేరువగా ఉన్న ఒక చిన్న ద్వీపం. పాంబన్ అనే ప్రదేశం వద్ద నుండి రైలు మార్గంలో ఇక్కడికి చేరవచ్చు.

ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన ఈ రామేశ్వరలింగం, రావణవధా నంతరం శ్రీరామునిచేత ప్రతిష్ఠించబడినది. ఇది సైకత (ఇసుక) లింగం. అమ్మవారు పర్వత వర్ధని. ఇక్కడ స్నానానికి ప్రత్యేకత. ముఖ్యంగా నూతినీళ్ళ స్నానం సర్వపాప పరిహారం అని నమ్మిక. గ్రహదోష నివారకం.

**3.కాశీ:-** వారణాసిగా, బెనారస్‌గా పిలువబడే కాశీ మహా పుణ్యక్షేత్రం. జీవితంలో ఒక్కసారైనా కాశీని దర్శించాలని అనుకోకుండా ఏ భక్తుడూ ఉండలేడు. ఉత్తర ప్రదేశ్‌లోని మొఘల్ సరాయ్ నుండి సహరాన్ పూర్ రైల్వేలైన్‌లో ఉంది. ముస్లిముల దండయాత్రల్లో పూర్తిగా నాశనం గావించబడినా, వేలాది సంవత్సరాల చారిత్రక నేపథ్యం గల కాశీని దర్శించి తీరాలి. కాశ్యాంతు మరణాన్ముక్తిః అని నానుడి. ఇక్కడ కూడా స్నానానికే ప్రాముఖ్యత. ఇక్కడ 64 స్నానఘట్టాలున్నాయి. ఇక్కడ 59 శివలింగాలు, 12 సూర్యనారాయణ మూర్తుల్ని దర్శించినవారికి జీవితంలో యెన్నడూ గ్రహపీడలుండవంటారు.

**4.కేదార్‌నాథ్:-** ఉత్తరప్రదేశ్‌లోనే ఉన్న మరోజ్యోతిర్లింగ క్షేత్రం కేదార్‌నాథ్. చిత్రంగా ఇది కూడా జలప్రాముఖ్యత ఉన్నదే! అయితే ఇక్కడ స్నానంకంటే పానం ముఖ్యం. ఈ క్షేత్రంలోని నీటిని త్రాగి స్వామివారిని సేవిస్తే మోక్షప్రాప్తి. హృషీకేశ్ నుండి 250 కి.మీ బస్సు ప్రయాణంతో ఇక్కడకు చేరుకోవచ్చు! ఈ ఆలయం భక్తుల సందర్శనార్థం 6 నెలల కాలం మాత్రం తెరిచి ఉంటుంది. కాలి నడకనగాని, డోలీల్లోగాని చేరాలి.

మహిషరూపధారియైన శివుని పాండవులు గుర్తించారని, ధర్మరాజు కాలభైరవుడు తప్ప మిగిలిన పాండవులు యిక్కడే సిద్ధిపొందారని చెప్పబడు తున్నది. ఆదిశంకరాచార్యులవారి నిర్యాణం కూడా ఇక్కడే! మహిమ గల క్షేత్రమిది.

**5. త్రయంబక్ :-** మహారాష్ట్రంలోని కుషావర్తం అనే సరస్సు తీరంలో బ్రహ్మగిరి కొండ దిగువగా ఉంది. త్రయంబక క్షేత్రం స్వామివారు నిరాకారుడు. అమ్మవారు ఈశ్వరి. నాసిక్ నుంచి 30కి.మీ దూరములో ఉన్న ఈ క్షేత్రంలోనే పవిత్ర గోదావరీ నది జన్మించింది.

ఈ శైవ క్షేత్రంలోనే పరమశివుడు బ్రహ్మహత్యాపాతకం నుంచి విముక్తుడై నాడు. ఇక్కడ స్వామి వారి జ్యోతిర్లింగ దర్శనం, మానవుని ఔన్నత్యానికీ, సంఘంలో పలుకుబడి పెరగడానికీ, గ్రహసంబంధ బాధలు తొలగడానికీ సర్వోత్కృష్ట మార్గంగా భావిస్తారు. ఇక్కడ స్నానం దర్శనం రెండూ ముఖ్యం.

**6. భీమశంకర్ :-** మహారాష్ట్రలోనే వెలసిన మరో దివ్యజ్యోతిర్లింగం భీమశంకర్‌లో ఉంది. బొంబాయినుంచి పూణే వెళ్ళేదారిలో పూణే నుంచి 122 కి.మీ దూరంలో ఉన్న జ్యోతిర్లింగ క్షేత్రం ఇది. భీమనది ఇక్కడే పుట్టింది. శివలింగం నుంచి నీరు కొద్దికొద్దిగా స్రవించే ఈ క్షేత్రం చాలా ప్రాచీనమైనది. స్వామివారు భీమశంకరుడు. అమ్మవారు కమలిని/కమలజ. బ్రహ్మదేవునిచేత పూజింపబడిన అమ్మవారని ప్రతీతి. యాత్రికులకు వసతి సౌకర్యాలు అంతగా లేకపోవుటచేత ఆహారపదార్థాలు కూడా వెంట తీసుకెళ్లాల్సిందే!

**7. ఓంకారేశ్వర్ :-** మధ్యప్రదేశ్ రాష్ట్రంలో నర్మదానదీతీరాన వెలసిన స్వామి ఓంకారేశ్వరజ్యోతిర్లింగం. ఈ నదీ తీరానికి ఇరువైపులా రెండు ఆలయాలలో వెలసిన స్వామి ఒక్కరే అని చెపుతుంటారు. అమ్మవారు అన్నపూర్ణాంబ. రత్లాం-ఖాండ్వా రైల్వేలైన్‌లో ఇండోర్ నుండి 80కి.మీ, ఖాండ్వానుండి 78 కి.మీ దూరం ఓంకార్ రోడ్ రైల్వే స్టేషన్‌లో దిగి, ఆలయానికి చేరడానికి 12కి.మీ. రహదారి వాహన సౌకర్యం ఉంది.

నదికి ఇరువైపులా ఉన్న ఆలయాలు రెండిటినీ సందర్శించడానికి అనువుగా ప్రస్తుతం బ్రిడ్జి నిర్మించారు. ఇక్కడ పితృదేవతలకు పిండప్రదానాలు చేయడానికి కూడా ఏర్పాట్లున్నాయి.

**8. వైద్యనాథ్ :-** మహారాష్ట్రంలో ఉన్న 'పర్లి' అనే గ్రామంలో వెలసిన వైద్యనాథేశ్వర లింగం ద్వాదశజ్యోతిర్లింగాలలో పేర్కొనబడిన ప్రదేశం. కాగా, ఇంకొక వైద్య నాథేశ్వరుడు బీహార్ రాష్ట్రంలోని దేవగఢ్ అనే చోట వెలసి వున్నాడు. చాలామంది ఈ వైద్యనాథ్ ధామ్‌నే ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటిగా పరిగణిస్తున్నారు. ఏది ఏమైనా పరమాత్మ సందర్శనాభిలాషులు, రెండుచోట్ల గల వైద్యనాథుని సందర్శించడం ఉత్తమంగా భావిస్తున్నారు.

సికింద్రాబాద్-పర్లి బ్రాడ్‌గేజ్ లైన్‌లో పర్లీవైద్యనాథ్ వరకు నేరుగా మన రాష్ట్రం నుంచి చేరుకోవచ్చు! ఆలయము గ్రామానికి మధ్యలోనే ఉంది యాత్రికులకు వసతి ఏర్పాట్లు బాగానే ఉన్నాయి. ఇంకొక వైద్యనాథేశ్వరుని దర్శించానికి కలకత్తానుండి పాట్నా వెళ్ళే రైల్వేలైన్‌లో జెసిడీస్టేషన్ నుంచి 5 కి.మీ బస్సు రూట్‌లో ప్రయాణించి చేరుకోవచ్చు.

**9. కాళేశ్వరం :-** మహాలింగరూపుడై అవంతికాపురి (ఉజ్జయిని) పట్టణంలో వెలసిన జ్యోతిర్లింగం ఇది. ఈ స్వామి దర్శనం సర్వగ్రహదోష పరిహారకం. అకాలమృత్యు

పురాణం. ఒక వాడుక ప్రకారం ఈ క్షేత్రానికి మహాశ్మశానం అని పేరు. అమ్మవారు విక్రమాదిత్యచక్రవర్తి ఆరాధించిన హరసిద్ధిమాత. మహాకాళిక. ఇది అష్టాదశ శక్తి పీఠాల్లో కూడా ఒకటని పేరు పొందింది. ఈ క్షేత్రం 54 శివ స్వరూపాలు (లింగాలు) దర్శించదగ్గవి. 12 సంవత్సరాలకోసారి ఇక్కడ జరిగే 'కుంభామేళా'కు భక్తులు విశేషసంఖ్యలో వస్తారు. మధ్యప్రదేశ్‌రాష్ట్రంలో ఇండోర్‌నుండి 55కి.మీ దూరంలో ఉందీక్షేత్రం. ఇక్కడ పార్వతీదేవి 3 ఆకారాలు ఒకేచోట ఒకదాని వెనుక ఒకటి ఉన్నాయి. 1. గౌరి 2. అన్నపూర్ణాదేవి 3. హరసిద్ధి మాతలను ఒక్కసారి దర్శించగలం! ఇక్కడ చంద్రగ్రహ, కుజగ్రహ దోషములను పోగొట్టుకో వచ్చు. ఖగోళశాస్త్ర ప్రయోగశాలకూడా ఉంది. ఈ నగరం గుండా కర్కాటక రేఖ పోతున్నది.

**10. సోమనాథ్ :-** ప్రభాసక్షేత్ర తీరాన వీరవల్లి పట్నానికి 7కి.మీ దూరంలో ఉంది. ఈ జ్యోతిర్లింగాలయం చాలా పెద్దది. దండయాత్రల మూలంగా పలుమార్లు దోపిడీకి గురైన క్షేత్రం. ఒకానొక దశలో మహమ్మదీయుల దండయాత్రలకు భయపడి, అసలు లింగాన్ని ఇక్కడకు కొద్ది దూరంలో భూమికి దిగువన దాచారని ప్రతీతి.

ఈ ఆలయానికి దగ్గర్లో దర్శించదగ్గ విశేషాలు చాలా ఉన్నప్పటికీ శ్రీకృష్ణాలయం, బలరాముడు దేహం చాలించిన గుహ, గౌరీ అమ్మవారు, బ్రహ్మ ప్రతిష్ఠిత లింగం వీనిని ముఖ్యంగా చూడాలి. క్షేత్ర దర్శనం, సముద్రస్నానం ఇక్కడ గ్రహదోష నివారణకు మార్గాలు. గుజరాత్ రాష్ట్రంలోని జునాగఢ్ జిల్లాలో ఉందీ జ్యోతిర్లింగం.

**11. ఘృష్ణేశ్వర్ :-** మహారాష్ట్రంలోని ఔరంగాబాద్‌నుండి 30 కి.మీ దూరంలో ఉన్న ఎల్లోరా గుహలకు అతి సమీపంలో ఉన్న వేరుల్ గ్రామం (2కి.మీ)లో ఉన్న జ్యోతిర్లింగం. ఘృష్ణేశ్వరం. ఇది శ్రీమహావిష్ణు ప్రతిష్ఠ. దేవాలయం చాలా పెద్దది. ఎల్లోరాగుహల్ని సందర్శించేవారంతా ఇక్కడకు కూడా వస్తారు. పుత్రశోక వినాశనకరమైన దివ్యలింగం. ఇక్కడ ఢాకినీ శిఖరం చూడదగ్గది. లక్షవినాయకుని మందిరం ఉన్న ప్రదేశం ఇది.

స్థలపురాణం ప్రకారం - శివుడు తాను స్వయంగా ఇక్క వెలియనున్నట్లు చెప్పాడంటారు. అమ్మవారు ఘృష్ణేశ్వరి. గొప్ప శివభక్తురాలు. ఘృష్ణ/ఘుశ్మ పేరిట క్షేత్రం ప్రసిద్ధి.

**12. నాగేశ్వర :** గుజరాత్ రాష్ట్రంలోని ద్వారక క్షేత్రానికి 12 కి.మీ దూరంలో ఉన్నది. దారుకావనంలో ఉన్న ఈ 'నాగేశ్వర లింగం' ద్వాదశజ్యోతిర్లింగాలలో ఒకటి.

మరో నాగేశ్వరుడు కూడా జ్యోతిర్లింగ రూపుడని చెప్పబడుతున్నాడు. మహారాష్ట్రలోని హోండా నాగనాథ గ్రామంలో ఈ లింగమును దర్శించగలం. ఇది సికింద్రాబాద్-మన్మాడ్ రైల్వేలైన్‌లో పర్బని స్టేషన్‌కు 50కి.మీ దూరంలో ఉంది. నాగేశ్వర లింగం (జ్యోతిర్లింగ క్షేత్రాల్లో) విషయమై భిన్నాభిప్రాయాలున్నాయి. శ్లోకంలో ప్రకారం దుర్లభం.

## పంచభూత లింగములు

**1. శ్రీకాళహస్తి (వాయులింగం) :-** ఆంధ్రప్రదేశ్‌లోనే చిత్తూరు జిల్లాలో సువర్ణముఖీ నదీ తీరాన, తిరుపతికి చేరువగా 40కి.మీ దూరములో ఉన్న స్వయంభూ వాయు లింగమును శ్రీకాళహస్తిలో దర్శించగలం. ఇక్కడ లింగం నుంచి వచ్చే గాలికి, లింగానికి ఎదురుగా ఉండే దీపం రెపరెపలాడుట చూడగలం. దీన్ని 'దక్షిణకాశి'గా వ్యవహరిస్తారు. చతురస్రాకారం లింగం ప్రత్యేకత.

**2. చిదంబరం (ఆకాశలింగం) :-** తమిళనాడు రాష్ట్రంలోని చెన్నయ్‌కి 243 కి.మీ దూరంలో కావేరీ నదీ తీరాన గల క్షేత్రం. సముద్రం నుండి 5 కి.మీ స్వామివారు ఆకాశలింగం కనుక (శూన్యం) కనిపించనందున నటరాజమూర్తికే ఆరాధన. అమ్మవారు శివకామి. ఈ ఆకాశలింగదర్శనం "చిదంబర రహస్యమనే' పేర ప్రసిద్ధి. చాలా పెద్ద ఆలయం. గ్రహదోష నివారణార్థం దర్శిందగినది.

**3. కంచి (పృథ్విలింగం) :-** 'క్షితి' (పృథ్వి) లింగం అనే పేర పిలువబడే ఈ క్షేత్రంలో స్వామివారికి అభిషేకం ఉండదు. తైలాభిషేకం ఉంది. ఇది గ్రహదోష నివారకం కూడా! పార్వతీదేవిచేత ప్రతిష్ఠించబడిన లింగం. ఆలయ విధ్వంసం జరపడానికి నాటి ముస్లిములు చేసిన ప్రయత్నాలు గోపురంపై చూడవచ్చు.

**4. శ్రీరంగం (జల లింగం) :-** తమిళనాడులోనే ఉన్న మొత్తం 4 పంచభూత లింగాలలో ఒకటి శ్రీరంగానికి సమీపంలోని జంబుకేశ్వరం వద్ద ఉంది. లింగం క్రింది భాగాన ఎల్లవేళలా నీరూరడంతో జలలింగంగా చెప్తుంటారు. తిరుచినా పల్లినుంచి 10కి.మీ.

**5. తిరువన్నామలై (తేజోలింగం) :-** చెన్నయ్‌నుంచి 68 కి.మీ దూరములో ఉన్న అరుణాచలం పట్టణంలోని తిరువణ్ణామలైవద్ద గల ఈ తేజోలింగం పృథ్వికి హృదయుంగా భావించబడుతున్నది. ఇక్కడ రమణ మహర్షి ఆశ్రమం ఉంది. శిఖరాగ్రం నుంచి అగ్ని శిఖ ఒకటి ఉద్భవించి తేజోరూపాన వెలసిందని భావిస్తారు.

# పంచారామములు (మనరాష్ట్రంలోనివే)

సాధారణంగా శైవ క్షేత్రాలన్నీ కుజ, శని దోషనివారక పుణ్యస్థలాలే అయినప్పటికీ పంచారామాలలో ప్రత్యేకంగా ఈ గ్రహదోషాల నివారణార్థం ప్రత్యేకంగా ఆయా గ్రహాలకు వేర్వేరుగా పూజలు/అభిషేకాలు జరిపించుకునే సౌకర్యం ఉన్నది

**1.అమరావతి:-** ఇక్కడి అమరేశ్వర లింగం దేవేంద్రుని చేత ప్రతిష్ఠింపబడినందున అమరావతి అనే పేరు వచ్చిందంటారు. గుంటూరు నుంచి 32కి.మీ దూరంలో ఉంది. చాలా పొడవయిన లింగం. ఆలయ ప్రాంగణంలో 108 శివలింగాలున్నాయి. ఇక్కడ ఏకాదశ రుద్రాభిషేకానికి ప్రత్యేకత గలదు.

**2.పాలకొల్లు:-** క్షీరారామలింగేశ్వరుడు వెలసిన క్షేత్రంగా ప్రసిద్ధి పొందిన పాలకొల్లు నరసాపురానికి 11 కిమీ. పశ్చిమగోదావరి జిల్లా భీమవరానికి 21కి.మీ. ఇది హరిహర క్షేత్రం. శనీశ్వరునికి, ఋణగణపతికి ప్రత్యేకంగా ఆలయాలున్నాయి.

**3.సామర్లకోట :-** భీమేశ్వరుడు గల కుమార లింగం అనబడే ఈ ఆరామం సామర్లకోట (తూ.గో.జిల్లా)యందు పిఠాపురానికి 18 కి.మీ దూరంలో ఉంది. శివుని లింగాన్ని ఆయన తనయుడైన కుమారస్వామి ప్రతిష్ఠించాడు. కనుక దీనిని స్కందారామం అని కూడా అంటారు.

**4.గునుపూడి:-** పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురానికి 32 కి.మీ దూరంలో ఉన్న భీమవరం సమీపమున గునుపూడి యందు సోమారామం ఉన్నది. ఇది చంద్రునిచే ప్రతిష్ఠితమైనది. ఈ లింగం అమావాస్య రోజున నల్లగా, పౌర్ణమికి తెల్లగా ఉంటుంది.

**5.ద్రాక్షారామం:-** తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడకు 32 కి.మీ. దూరము లోను, రాజమండ్రికి 62 కి.మీ దూరంలోను ఉన్న పంచారామ దివ్యక్షేత్రం ద్రాక్షా రామం. దక్షప్రజాపతి యజ్ఞంచేసిన చోటు. ఇది యెత్తయిన స్ఫటికలింగం. ఇక్కడి భీమేశుని అనుగ్రహం వల్లనే వాక్‌శుద్ధి లభించిన కవిగా వేములవాడ భీమ కవి ప్రసిద్ధిగాంచాడు. ఇక్కడి గుడి సూర్యరశ్మిచేత నిర్మించబడిందని ప్రతీతి.



# 38. సూర్యగ్రహ అర్చనం

రవి గ్రహదోషమున్న రవి గ్రహజపంను తగు సంఖ్యలో చేయాలి. రవిగ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౬ | ౧ | ౫ | ౨ | ౩ | ౯ | ౪ | ౮ |
| ౯ | ౪ | ౮ | ౭ | ౬ | ౧ | ౫ | ౨ | ౩ |
| ౫ | ౨ | ౩ | ౯ | ౪ | ౮ | ౭ | ౬ | ౧ |
| ౬ | ౧ | ౭ | ౨ | ౩ | ౫ | ౪ | ౮ | ౯ |
| ౪ | ౮ | ౯ | ౬ | ౧ | ౭ | ౨ | ౩ | ౫ |
| ౨ | ౩ | ౫ | ౪ | ౮ | ౯ | ౬ | ౧ | ౭ |
| ౧ | ౭ | ౬ | ౩ | ౫ | ౨ | ౮ | ౯ | ౪ |
| ౮ | ౯ | ౪ | ౧ | ౭ | ౬ | ౩ | ౫ | ౨ |
| ౩ | ౫ | ౨ | ౮ | ౯ | ౪ | ౧ | ౭ | ౬ |

## 1. సూర్యుడు



## సూర్య యంత్రము

వం

క్షం హాస్వాం సోహం యం

ప్రచోదయాత్ ॥ ఓం యంత్ర రాజాయ విద్మహే

ఓం శం

ఓం రాం

షం

వౌషట్ వౌషట్

రం హాం

లం

# సూర్యగ్రహ జపము

**సూర్యమంత్రం :**

అస్య శ్రీ సూర్యగ్రహ మహా మంత్రస్య హిరణ్యస్తూప ఋషిః త్రిష్టుప్ ఛందః శ్రీ సూర్య గ్రహో దేవతా సూర్యగ్రహ ప్రసాద సిద్ధ్యర్థం మంత్ర జపం కరిష్యే। అధి దేవతా ప్రత్యధిదేవతా సహిత సూర్యగ్రహ దేవతా మంత్రజపం కరిష్యే.

**కరన్యాసం :**

ఓం ఆకృష్ణేన - అంగుష్ఠాభ్యాం నమః
ఓం రజసేతి - తర్జనీభ్యాం నమః
ఓం వర్తమానో నివేశయన్నితి - మధ్యమాభ్యాం నమః
ఓం అమృతం మర్త్యంచేతి - అనామికా భ్యాం నమః
ఓం హిరణ్యయేన సవితారథేనేతి - కనిష్ఠికా భ్యాం నమః
ఓం ఆదేవో యాతి భువనానిపశ్యన్నితి - కరతల కరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసం :**

ఓం ఆకృష్ణేన - హృదయాయనమః
ఓం రజసేతి - శిరసే స్వాహా
ఓం వర్తమానో నివేశయన్నితి - శిఖాయై వషట్
ఓం అమృతం మర్త్యం చేతి - కవచాయ హుం
ఓం హిరణ్యయేన సవితారథేనేతి - నేత్రత్రయాయవౌషట్
ఓం ఆదేవో యాతిభువనా విపశ్యన్నితి - అస్త్రాయ ఫట్
ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానం :**

వేదీమధ్యే లలిత కమలే కర్ణికాయాం రథస్థః
సప్తాశ్వోఽరుణ రుచివ పుష్పస్తరజ్జు ర్ద్విబాహుః
గోత్రేరమ్యే బహువిధగుణే కాశ్యపాఖ్యేప్రసూతః
కాళింగాఖ్యే విషయజనితః ప్రాఙ్ముఖః పద్మహస్తః
పద్మాసనః పద్మకరోద్విబాహుః పద్మద్యుతిస్సప్తతురంగవాహః
దివాకరోలోక గురుః కిరీటీ మయి ప్రసాదం విదధాతు దేవః ॥
జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం
తమోరింసర్వపాపఘ్నం ప్రణతోస్మిదివాకరమ్ ॥

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోపహార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

**అధిదేవతా:**

ఓం అగ్నిదూతం వృణీ మహేహోతారం విశ్వవేదసం -
అస్యయజ్ఞస్య సు క్రతుం.

**ప్రత్యధిదేవతా:**

ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్ట మాయ
తవ్యసే వో చే మశం తమగ్ం హృదే

(అధిదేవతా ప్రత్యధి దేవతా మంత్రములను - జపమునకు మొదట చివర-ముమ్మారు/ఒకమారైనను జపించవలెను).

**వేదమంత్రము :**

ఓం ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ।
హిరణ్యయేన సవితా రథేనా దేహో యా తి భువనాని పశ్యన్ ॥

**సూర్యగ్రహ జపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామం, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒక మీటరు ఎర్రనిరంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై రాగితో చేసిన రవిప్రతిమను లేదా సూర్యయంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేన ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహ ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః ॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవః।
మాధ్వీ ర్నస్సం త్వోషధీః। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః।
మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః।
మాధ్వీర్గావో భవంతు నః। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణ్షై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాత్త్స్థియానస్థేయ సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః।
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపముపైకి పంచలోకపాలకులను, అష్టదిక్పాలకులను, ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నపుడు ఆయాస్థానములలో ఒక తమలపాకును, వక్కను, ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ ఉండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరిః ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే.

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం। జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

2. ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం। శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమ యు సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః। ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.

# దిక్పాలకులు

ఇంద్రః:- (1-7-10 మం):-

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యం:। అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అగ్నిః:- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

యమః:-(ఋ-10మం-14 సూ - 13 మంత్రం)

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్ఋతిః- మూషుణః పరాపరా నిర్ఋతిర్దుర్హణావధీత్। పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ఋతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వరుణః:-(ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)

ఇమంమే వరుణ శృధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాయుః:-(ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। ఆవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

కుబేరః:-

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాసుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।
సాదన్యం విదత్యగ్ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఈశానః:-

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృథే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

**ఊర్ధ్వపురుషః :-**

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వాయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**పృథివీ :- (ఋ - 1 మం- 27 సూ - 15 మంత్రం)**

స్యోనా పృథివీ భవానృక్షరా నివేశినీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వాస్తు పురుషః :-**

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహే ప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

**బ్రహ్మ :-**

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్స్వధి తిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

**సరస్వతీ :-**

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)**

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**లక్ష్మీ :-**

సక్తుమివ తితఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః:- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరీ:-గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా :-

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ధద్వితా॥
అదిత్ర్పుత్రస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతె దివా॥
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఏషోఉషా అపూర్వావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గరుడః:-

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్సోమ
ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ
యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్ం స్యంగాని ధిష్ణియా
శ్శఫా యజూగ్ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥
గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః :-

ధన్వనాగా ధన్వనాఽఽ జిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।
ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥
ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఇంద్రాగ్నీ :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।
గ్రాహిర్జ గ్రాహ యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥
ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్ఋతి: యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ,
తమాహరామి నిర్ఋతే రుపస్థాదస్పార్‌ష మేనం శతశారదాయ॥
నిర్ఋతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**(శల్యఫలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)**

సంస్పృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తాం వరుణశ్చ మన్యు
భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥
మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విశాఖా నక్షత్రమ్ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే,
తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు
నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ
విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥
విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥
మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

# 42. అభినుతి

క్రింది సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన రవి గ్రహానుగ్రహం పొందవచ్చును.

1. ఘృణిః పాతు శిరోదేశే - సూర్యః పాతు లలాటకం
   ఆదిత్యో లోచనే పాతు - శ్రుతీ పాతు దివాకరః॥
2. ఘ్రాణం పాతు సదా భానుః - ముఖం పాతు సదారవిః
   జిహ్వాం పాతు జగన్నేత్రః - కంఠం పాతు విభావసుః॥
3. స్కంధౌ గ్రహపతిః పాతు - భుజౌ పాతు ప్రభాకరః
   కరావబ్జకరః పాతు - హృదయం పాతు భానుమాన్ ॥
4. ద్వాదశాత్మా.కటిం పాతు - సవితా పాతు సక్థినీ
   ఊరూః పాతు సురశ్రేష్ఠో - జానునీ పాతు భాస్కరః॥
5. జంఘే మే పాతు మార్తాండో - గుల్ఫౌ పాతు త్విషాం పతిః
   పాదౌదినమణిః పాతు - మిత్రోఽ ఖిలం వపుః॥

ఫలశ్రుతి :

శ్లో॥ ఆదిత్య కవచం పుణ్యం అభేద్యం వజ్రసన్నిభం - సర్వరోగ భయాదిభ్యో ముచ్యతే నాత్ర సంశయః - సంవత్సర ముపాసిత్వా సామ్రాజ్య పదవీం లభేత్

## సూర్య సూక్తమ్

ఓం ॥ నమో మిత్రస్య వరుణస్య చక్షసే మహోదేవాయ తదృతం సపర్యత ।
దూరేదృశే దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ సూర్యాయ శంసత ॥ 1

సా మా సత్యోక్తిః పరి పాతు విశ్వతో ద్యావా చ యత్ర తతనన్నహాని చ ।
విశ్వమన్యన్ని విశతే యదేజతి విశ్వాహాపో విశ్వాహోదేతి సూర్యః ॥ 2

న తే అదేవః ప్రదివో ని వాసతే యదేతశేభిః పతరై రథర్యసి ।
ప్రాచీనమన్యదను వర్తతే రజ ఉదన్యేన జ్యోతిషా యాసి సూర్య ॥ 3

యేన సూర్య జ్యోతిషా బాధసే తమో జగచ్చ విశ్వముదియర్షి భానునా ।
తేనాస్మద్విశ్వామనిరామనాహుతిమపా మీవామప దుష్ష్వప్న్యం సువ ॥ 4

విశ్వస్య హి ప్రేషితో రక్షసి వ్రతమహేళయన్నుచ్చరసి స్వధా అను ।
యదద్య త్వా సూర్యోపబ్రవామహే తం నో దేవా అనుమంసీరత క్రతుమ్ ॥ 5

తం నో ద్యావాపృథివీ తన్న ఆప ఇంద్రః శృణ్వన్తు మరుతో హవం వచః ।
మా శూనే భూమ సూర్యస్య సన్దృశి భద్రం జీవన్తో జరణామశీమహి ॥ 6

విశ్వాహా త్వా సుమనసః సుచక్షసః ప్రజావన్తో అనమీవా అనాగసః ।
ఉద్యంతం త్వా మిత్రమహో దివేదివే జ్యోగ్జీవాః ప్రతి పశ్యేమ సూర్యః ॥ 7
మహి జ్యోతిర్బిభ్రతం త్వా విచక్షణ భాస్వన్తం చక్షుషే చక్షుషే మయః ।
ఆరోహన్తం బృహతః పాజసస్పరి వయం జీవాః ప్రతి పశ్యేమ సూర్య ॥ 8
యస్య తే విశ్వా భువనాని కేతునా ప్ర చేరతే ని చ విశన్తే అక్తుభిః ।
అనాగాస్త్వేన హరికేశ సూర్యాహ్నాహ్నా నో వస్యసావస్యసోదిహి ॥ 9
శం నో భవ చక్షసా శం నో అహ్నా శం భానునా శం హిమాశం ఘృణేన ।
యథా శమధ్వంఛమసద్ దురోణే తత్ సూర్యద్రవిణం ధేహి చిత్రమ్ ॥ 10

ఓం శాంతిః శాంతిః శాంతిః

# ధనదాయక సూర్యాష్టకం

శ్లో॥ ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే ॥ 1
సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజం
శ్వేత పద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 2
లోహితం రథమారూఢం సర్వలోక పితామహం ।
మహఃపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 3
త్రైగుణ్యం చ మహాశూరం బ్రహ్మ విష్ణు మహేశ్వరం ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 4
బృంహితం తేజసాం పుంజం వాయురాకాశమే వచ ।
ప్రభుస్త్వం సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 5
బంధూక పుష్పసంకాశం హార కుండల భూషితం ।
ఏకచక్రధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 6
విశ్వేశం విశ్వకర్తారం మహాతేజః ప్రదీపకం ।
మహాపాప హరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 7
శ్రీవిష్ణుం జగతాంనాథం జ్ఞాన విజ్ఞాన మోక్షదం ।
మహాపాప హరం దేవం తంసూర్యం ప్రణమామ్యహమ్ ॥ 8

ఫలశ్రుతి :-
సూర్యాష్టకం పఠేన్నిత్యం - గ్రహపీడా ప్రణాశనం ।
అపుత్రో లభతే పుత్రం-దరిద్రో ధనవాన్ భవేత్ ॥ 1

ఆమిషం మధుపానం చ - యః కరోతి రవేర్దినే
సప్తజన్మ భవేద్రోగీ - జన్మ జన్మ దరిద్రతా ॥ 2
స్త్రీ తైల మధు మాంసాని - యే త్యజంతి రవేర్దినే ।
నవ్యాధి శోక దారిద్ర్యం - సూర్యలోకం స గచ్ఛతి ॥ 3

(ఈ సూర్యాష్టకాన్ని నిత్యం పారాయణం చేసేవారికి - ఏ గ్రహంవల్ల కలిగే పీడలైనా నశిస్తాయి. నియమం ప్రకారం మద్యం, మాంసం, తైలం, స్త్రీ సంభోగాల జోలికి పోకుండా, ఆదివారం రోజున ఇది 108 పర్యాయాలు జపిస్తే రోగాలు, శోకాలు, దరిద్రం తొలగి మేధస్సు ధనం సుఖం శాంతి, మోక్షం ప్రాప్తిస్తాయి.)

## సూర్య ప్రార్థన

1. జయః సూర్యాయ దేవాయ తమోహంత్రే వివస్వతే
   జయప్రదాయ సూర్యాయ భాస్కరాయ నమోస్తుతే॥
2. గ్రహోత్తమాయ దేవాయ జయః కల్యాణ కారిణే
   జయః పద్మ వికాసాయ బుధ రూపాయ తే నమః॥
3. జయః దీప్తి నిధానాయ జయః శాంతి విధాయినే
   తమోఘ్నాయ జయాయైవ అజితాయ నమోనమః॥
4. జయార్క జయ దీప్తీశ సహస్ర కిరణో జ్వల
   జయ నిర్మిత లోకస్త్వమ జితాయ నమో నమః॥
5. గాయత్రీ దేహ రూపాయ, సావిత్రీ దైవతాయచ
   ధరాధరాయ సూర్యాయ మార్తాండాయ నమోనమః॥

(దోష పరిహారార్థం ఈ పంచశ్లోక స్తోత్రం ఆరుపర్యాయాలునిత్యం పఠిస్తే ఆయురారోగ్య భోగభాగ్యాది శుభములు ప్రాప్తించును.)

## సౌరస్తవము

అస్యశ్రీ సౌర స్తోత్ర మహామంత్రస్య బ్రహ్మ ఋషిః అనుష్టుప్ ఛందః సవితా దేవతా సాం బీజం హ్రీం శక్తిః శ్రీం కీలకం త్రిచ సంపుటీయుక్త శ్రీ సూర్య నమస్కారార్ఘ్య ప్రదానార్చన ఫలప్రసాద సిద్ధ్యర్థే సౌర స్తవ పఠనే వినియోగః

| | కరన్యాసం | అంగన్యాసం |
|---|---|---|
| ఓం హ్రాం సాం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| ఓం హ్రీం సీం | తర్జనీభ్యాం నమః | శిరసే స్వాహా |
| ఓం హ్రూం సూం | మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |

ఓం హ్రైం సౌం కనిష్టికాభ్యాం నమః నేత్రత్రయాయ వౌషట్
ఓం హ్రౌం సౌం అనామికాభ్యాం నమః కవచాయహుంఫట్
ఓం హ్రః సః కరతల కరపృష్ఠాభ్యాం నమః అస్త్రాయ ఫట్

ఓం భూర్భువస్సువరోం - ఇతి దిగ్బంధః

శ్లో॥ ద్విభుజం పద్మహస్తం చ వరదం మకుటాన్వితం
ధ్యాయేత్ దివాకరం దేవం సర్వాభీష్ట ప్రదాయకం॥

లమిత్యాది పంచపూజాం కృత్వా

బ్రహ్మోవాచ :-

శ్లో॥ ఆది దేవోఽసి దేవానాం ఐశ్వర్యాచ్చ త్వమీశ్వరః
ఆది కర్తాసి భూతానాం దేవదేవో దివాకరః॥

2. జీవనః సర్వభూతానాం దేవ గంధర్వ రక్షసాం
ముని కిన్నర సిద్ధానాం తథైవోరగ పక్షిణాం॥

3. త్వం బ్రహ్మ త్వం మహాదేవ స్త్వం విష్ణు స్త్వం ప్రజాపతిః।
వాయు రింద్రశ్చ సోమశ్చ వివస్వాన్ వరుణ స్తథా॥

4. త్వం కాలః సృష్టికర్తా చ హర్తా భర్తా తథా ప్రభుః।
సరితః సాగరాః శైలా విద్యుదింద్ర ధనూంషి చ॥

5. ప్రళయః ప్రభవ శ్చైవ వ్యక్తా వ్యక్తః సనాతనః।
ఈశ్వరా త్పరతో విద్యా- విద్యాయా పరతః శివః

6. శివా త్పరతరో దేవ స్త్వ మేవ పరమేశ్వరః ।
సర్వతః పాణి పాదాంతః సర్వతోఽక్షి శిరోముఖః ॥

7. సహస్రాంశుః స్సహస్రాస్య స్సహస్ర చరణేక్షణః।
భూతాది ర్భూర్భువః స్వశ్చ మహః సత్యం తపో జనః॥

8. ప్రదీప్తం దీపనం దివ్యం సర్వలోక ప్రకాశకమ్।
స్తుతం పరమమవ్యక్తం యద్రూపం తస్యతే నమః।

9. సురసిద్ధ గుణైర్జుష్టం భృగ్వత్రి పులహాదిభిః।
స్తుతం పరమమవ్యక్తం యద్రూపం తస్యతే నమః।

10. వేద్యం వేదవిదాం నిత్యం సర్వజ్ఞాన సమన్వితమ్।
సర్వదేవాది దేవస్య యద్రూపం తస్యతే నమః॥

11. విశ్వకృ ద్విశ్వ భూతం చ వైశ్వానర సురార్చితమ్।
విశ్వస్థిత మచింత్యం చ యద్రూపం తస్యతే- నమః॥

12. పరం యజ్ఞాత్ పరం వేదాత్ పరం లోకాత్ పరం దివః।
పరమాత్మే త్యభిఖ్యాతం యద్రూపం తస్యతే నమః॥
13. అవిజ్ఞేయ మనాలక్ష్య మధ్యాన గత మవ్యయమ్।
అనాది నిధనం చైవ యద్రూపం తస్యతే నమః॥
14. నమో నమః కారణ కారణాయ నమో నమః పాప విమోచనాయ।
నమో నమస్తే దితిజార్దనాయ నమో నమో రోగ విమోచనాయ॥
15. నమో నమః సర్వ వరప్రదాయ నమోనమః సర్వ సుఖప్రదాయ।
నమో నమః సర్వ ధనప్రదాయ నమో నమః సర్వ మతిప్రదాయ॥
16. తతః సాంఖ్యాశ్చ యోగాశ్చ యేచాన్యే మోక్షకాంక్షిణః।
ధ్యాయంతి ధ్యాయినో దేవం హృదయస్థం దివాకరమ్॥
17. సర్వలక్షణ హీనోఽపి యుక్తోవా సర్వపాతకైః।
సర్వం చ తరతే పాపం దేవమర్కం సమాశ్రితః॥
18. అగ్నిహోత్రం చ వేదాశ్చ యజ్ఞాశ్చ బహుదక్షిణాః।
భానో ర్భక్తి నమస్కార కలాం నార్హంతి షోడశీమ్॥
19. తీర్థానాం పరమం తీర్థం మంగళానాం చ మంగళమ్।
పవిత్రం చ పవిత్రాణాం ప్రపద్యంతే దివాకరమ్॥
20. శక్రాద్యైః సంస్తుతం దేవం యే నమస్యంతి భాస్కరమ్।
సర్వ కిల్బిష నిర్ముక్తాః సూర్యలోకం వ్రజంతితే॥

**పునః పూజ :-** పూర్వోక్త ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ మమ యజమానస్య సర్వాభీష్ట సిద్ధ్యర్థం సంజ్ఞా ఛాయా ఉషాసమేత శ్రీ సూర్యనారాయణ ప్రీతయే పునః పూజాం కరిష్యే॥

యథాశక్తి ధ్యానా వాహనాది పూజాం కృత్వా॥ క్షీరాన్న నివేదనం కుర్యాత్॥

శ్లో॥ ప్రయాతు భగవానీశ స్సర్వదేవ నమస్కృతః।
అనేన హవిషా తృప్తః అభీష్టం యచ్ఛమే ప్రభో॥

**ధారాదత్తవిధి:-** అనయా ధ్యానావాహనాది త్రిచవిధాన షోడశోపచార రార్చనా - అష్టాక్షరీ మహామంత్ర జప - త్రిచ మంత్ర సంపుటీ యుక్త సూర్య నమస్కారార్ఘ్య ప్రదాన కవచ స్తోత్ర పారాయణ పునఃపూజయా - సర్వదేవాత్మకః శ్రీ సూర్యనారాయణ స్సుప్రీణాతు - ఏతత్ఫలం పరమేశ్వరార్పణ మస్తు॥ మమ, యజమానస్య, సర్వ మనోరథ ఫలసిద్ధి రస్తు॥

# 43. అభివందనం

రవిగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. రవి గ్రహదేవతను కీర్తించండి.

## రామావతారస్తుతి

## (దశావతారాలలో రామావతారం సూర్యగ్రహ పరమాత్మ అంశ)

శ్లో॥ నామ స్మరణాదన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామ హరే కృష్ణహరే తవ నామ వదామి సదా నృ హరే॥
సీతావల్లభ దాశరథే దశరథ నందన లోకగురో
రావణ మర్దన రామనమో భక్తంతే పరిపాలయ మాం

## సూర్యమంగళాష్టకం

భాస్వాన్ కాశ్యప గోత్రజోఽ రుణ రుచిర్యస్సింహపోర్కస్స
మిత్‌షట్త్రిస్థో దశ శోభనో గురు శశీ భౌమ స్సుమిత్రాస్పదా
శుక్రో మందరిపుః కళింగ జన పశ్చాగ్నీశ్వరో దేవతా
మధ్యేవర్తుల పూర్వదిగ్దినకరః కుర్యాత్ సదామంగళం ॥

## సూర్యగ్రహస్తోత్ర కీర్తన

## రచన : శ్రీ ముత్తుస్వామి దీక్షితార్

రాగం : సౌరాష్ట్ర చతురస్రగతి తాళం : ధృవ

పల్లవి : సూర్య మూర్తే నమోస్తుతే
సుందర ఛాయాధిపతే ॥సూర్య॥

అనుపల్లవి : కార్య కారణాత్మక జగత్ ప్రకాశ సింహరాశ్యధి పతే
ఆర్యవినుత తేజ స్ఫూర్తే ఆరోగ్యాది ఫలదకీర్తే ॥సూర్య॥

చరణం 1 : సారసమిత్ర మిత్ర భానో సహస్ర కిరణ కర్ణసూనో
క్రూరపాపహర కృశానో గురు గుహ మోదిత స్వభానో ॥సూర్య॥

చరణం 2 : సూరి జనేడిత సుదిన మణే సోమాది గ్రహ శిఖామణే
ధీరార్చిత కర్మ సాక్షిణే దివ్యతర సప్తాస్వరథినే ॥సూర్య॥

చరణం 3 : సౌ రాష్ట్రార్ణ మంత్రాత్మనే సౌవర్ణ స్వరూపాత్మనే
భారతీశ హరి హరాత్మనే భక్తి ముక్తి వితరణాత్మనే

(వాగ్గేయకారులలో 'గురుగుహ' ముద్రతో నవగ్రహకీర్తనలు రచించిన "సూర్య" ముత్తుస్వామి దీక్షితులు, అది ఏరాగంలో ఉన్నదీ కీర్తనలోనే సూచించారు.)

# 44. యంత్రస్థాపనం

## 1. రవిగ్రహానుగ్రహం కోసం

ఒక రాగిరేకుకు ఇరువైపులా క్రింద చూపిన యంత్రమును రాయించి, దానిని పూజించండి.

| | | |
|---|---|---|
| 8 | 1 | 6 |
| 3 | 5 | 7 |
| 4 | 9 | 2 |

| | | |
|---|---|---|
| 6 | 7 | 2 |
| 1 | 5 | 9 |
| 8 | 3 | 4 |

పై యంత్రమును "ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హః ఆదిత్యాయ నమః" అను మూలమంత్రమును 1,25,000 సార్లు జపిస్తూ పూజించండి.

## 2. సూర్యయంత్రం :-

ఆరోగ్యం, ఐశ్వర్యం, నాయకత్వం కోసం క్రింది యంత్రమును "ఓం ఘృణిః సూర్య ఆదిత్యోం" అను మంత్రమును 1,25,000 సార్లు జపిస్తూ పూజించాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 6 | 32 | 3 | 24 | 35 | 1 |
| 7 | 11 | 27 | 28 | 8 | 30 |
| 19 | 14 | 16 | 15 | 23 | 24 |
| 18 | 20 | 22 | 21 | 17 | 13 |
| 25 | 29 | 10 | 9 | 26 | 12 |
| 36 | 5 | 33 | 4 | 2 | 31 |

# ధారణ

## సూర్యయంత్రం

క్రింది యంత్రమును చిన్న వెండి బిళ్ళ మీద ముద్రించి, దానిని "ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రూం హ్రః" అనే మంత్రమును 1,25,000 సార్లు జపిస్తూ పూజించాలి. తరువాత ఈ వెండి బిళ్ళను మెడలో ధరిస్తే సమస్తరోగాలు నశించి ఆరోగ్యం కలుగుతుంది. ఆర్థికబాధలు తొలగుతాయి.




## బీజాక్షర సహిత సూర్యయంత్రం

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై రాయించి దానిని "ఓం ఖం ఖోల్కాయ నమః" అను మంత్రమును 1,32,600 సార్లు జపించి పూజించిన అకాల మృత్యువు నుండి రక్షించును.



# 45. చంద్రుడు - ఒకవీక్షణ

| | | |
|---|---|---|
| 1. | ఇతర నామాలు | - సోముడు, ఇందు, నిశాకరుడు, శశాంకుడు, తారాపతి, శీతాంశుడు విధుడు, కుముద బాంధవుడు, ఉడునాధుడు |
| 2. | లింగము | - స్త్రీగ్రహము |
| 3. | జాతి | - వైశ్య |
| 4. | రంగు | - తెలుపు |
| 5. | తత్త్వము | - జలతత్త్వము |
| 6. | గ్రహస్వభావము | - శుభ / పాప |
| 7. | స్వభావము | - చర |
| 8. | గుణము | - సత్వ |
| 9. | రుచులు | - ఉప్పు |
| 10. | గ్రహోదయము | - శీర్ష |
| 11. | జీవులు | - బహుపాది |
| 12. | గ్రహస్థానము | - జలాశయం |
| 13. | ఆదిపత్యదిక్కు | - వాయువ్యము |
| 14. | జలభాగం | - జల |
| 15. | ఆత్మాధికారకత్వం | - మనస్సు |
| 16. | పాలనశక్తులు | - రాజు |
| 17. | శరీరధాతువు | - రక్తము |
| 18. | లోహధాతువు | - వెండి |
| 19. | కుటుంబ సభ్యుడు | - తల్లి |
| 20. | గ్రహరూపవర్ణం | - గౌరవర్ణం |
| 21. | గ్రహపీడ | - మానసిక ఆందోళన |
| 22. | గ్రహవర్గం | - గురు |
| 23. | గృహ భాగములు | - బాత్‌రూమ్‌లు, నీరు ఉండే ప్రాంతాలు |
| 24. | కాల బలము | - రాత్రి బలవంతుడు |
| 25. | దిగ్బలము | - చతుర్థభావం |
| 26. | ఆధిపత్యకాలము | - క్షణము |
| 27. | స్వక్షేత్రము | - కర్కాటకం |
| 28. | శత్రుక్షేత్రము | - లేదు |

29. మిత్రక్షేత్రము - మిథునం, కన్య, ధనస్సు, మీనం
30. విషమక్షేత్రము - ....
31. సమక్షేత్రము - మేషము, ధనస్సు
32. ఉచ్చరాశి - వృషభం
33. నీచరాశి - వృశ్చికం
34. మూలత్రికోణము - వృషభం
35. పరమ ఉచ్ఛ - వృషభంలో 3వ డిగ్రీ
36. పరమ నీచ - వృశ్చికంలో 3వ డిగ్రీ
37. మిత్రగ్రహాలు - రవి, బుధ
38. శత్రుగ్రహాలు - లేరు
39. సమగ్రహాలు - కుజ, గురు, శుక్ర, శని
40. వ్యధాగ్రహము - శుక్ర
41. నైసర్గిక బలగ్రహము - రవి
42. దినచలనం - 13 నుండి 14 డిగ్రీలు
43. రాశిలో గ్రహం ఉండే కాలం - 2 1/4 రోజు
44. రాశిలో ఫలమిచ్చే భాగం - రాశిలో చివరి భాగం
45. గ్రహ ప్రకృతి - వాత, శ్లేష్మము
46. ఋతువు - వర్షఋతువు
47. దిగ్బలము - ఉత్తరమున బలవంతుడు
48. సూచించు ఎత్తు - పొట్టి
49. సూచింపబడే వయస్సు - 70 సం॥లు
50. సూచించు ప్రాంతాలు - అన్ని ప్రాంతాలు
51. నివాస ప్రాంతం - జల ప్రాంతాలు
52. సూచించబడే శరీర అవయవము - మగవారి ఎడమకన్ను, స్త్రీ కుడి కన్ను, స్తనములు, లింపు, గర్భసంచి.
53. సూచించే శరీర వ్యాధులు - మానసిక వ్యాధులు, స్త్రీగర్భకోశముకు చెందిన వ్యాధులు, ఋతుక్రమము సరిగా లేకపోవుట, మూర్ఛ, స్తనములకు సంబంధించిన వ్యాధులు.
54. గోచార రీత్యా శుభస్థానములు - 1,6,7,10,11
55. గోచార రీత్యా అశుభ స్థానములు - 2,4,5,8,9,12
56. గోచార రీత్యా వేధస్థానములు - 5,9,12,2,4,8

57. గ్రహదశాకాలము - 10 సంవత్సరాలు
58. జీవన కారకత్వము - మనోకారకుడు
59. సంబంధించిన నక్షత్రములు - రోహిణి, హస్త, శ్రవణం
60. సూచించు వృక్షజాతి - పాదులు, పాలచెట్లు
61. సూచించు ధాన్యం - బియ్యము
62. సూచించు పండ్లు - బత్తాయి, నారింజ
63. సూచించు పక్షులు - బాతు, గుడ్లగూబ, గబ్బిలము
64. సూచించు జంతువులు - గుర్రము
65. సూచించు ఇతర ద్రవ్యములు - పాలు, కర్పూరం, శంఖం, ఉప్పు, చెఱకు దోసకాయలు, తెల్లనిపూలు
66. సంబంధించిన సమిధ - మోదుగ
67. సంబంధించిన మూలిక - పాలచెట్టు
68. సూచించు వస్త్రము - నూతనవస్త్రం
69. దేవవర్గము - వైష్ణవ
70. గ్రహగోత్రము - అత్రేయస
71. వేదములు -
72. శుభత్వం - శుక్ల పక్ష చంద్రుడు
73. అవతారం - శ్రీకృష్ణావతారము
74. గ్రహస్వరూపం - రెండు చేతులు కలిగి తెల్లని వస్త్రము, గద తెల్లని అలంకారములు కలవాడు.
75. గ్రహ స్వరూప వర్ణం - ధవళవర్ణం
76. గ్రహారూఢ వాహనం - దశాశ్వములున్న రథం
77. పూజార్థం గ్రహప్రతిమకు వాడవలసినది - స్ఫటికము
78. గ్రహప్రీతికి నైవేద్యం - పరమాన్నము
79. అధిష్టాన దేవత - పార్వతిదేవి
80. అధిదేవత - అపః
81. ప్రత్యధిదేవత - గౌరి
82. గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు - మహాశివరాత్రి
83. చేయవలసిన ప్రసాదము - క్షీరాన్నం, వెన్న
84. దోష నివారణకు దక్షిణ - శంఖము

85. ప్రీతికరమైన తిథి - శ్రావణ శుక్ల అష్టమి
86. ఆచరించవలసిన వ్రతము - కేదారేశ్వర వ్రతము
87. పారాయణ చేయవలసిన పురాణాలు - శివపురాణం
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - చంద్రగ్రహ అష్టోత్తర శత నామావళి
89. పారాయణ చేయవలసిన సహస్ర నామావళి - దుర్గా సహస్ర నామావళి
90. ఆచరించవలసిన దీక్ష - శివదీక్ష
91. ధరించవలసిన మాల - ముత్యాలమాల
92. ధరించవలసిన రత్నము - ముత్యము
93. ధరించవలసిన రుద్రాక్ష - ద్విముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - దుర్గాదేవి ఆలయం
95. చేయవలసిన పూజలు - రుద్రాభిషేకం
96. దానం చేయవలసిన ద్రవ్యములు - బియ్యము, పాలు, బార్లీ, పంచదార
97. గ్రహ జపసంఖ్య - 10,000
98. హోమమునకు వాడు సమిధ - మోదుగ
99. నవగ్రహమండపంలో గ్రహ ఆసనం - చతురస్రాకారం
100. గ్రహదృష్టిని పొందు రాశి స్థానం - తానున్న రాశినుండి 7వరాశిని
101. గ్రహసంఖ్య - 2
102. గ్రహం సూచించు వారం - సోమవారం
103. శుభ సమయం - పున్నమిరాత్రి, అపరాహ్ణము
104. ప్రతినిధిగ్రహాలు - రవి+బుధ
105. గ్రహం బలంగా వుంటే ఫలితం - మనోధైర్యం కలిగి ఉంటారు. కల్పనా శక్తిని కలిగి ఉంటారు.
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం- మనో రుగ్మతలు కలుగుతాయి.
107. తండ్రి - అత్రి
108. తల్లి - అనసూయ
109. భార్య - రోహిణి
110. సూచించు లోహములు - వెండి
111. గ్రహ ప్రభావితుల మనఃస్థితి - ప్రశాంతం
112. భావకారకత్వం - ఆలోచన

113. గ్రహదృష్టి - సమదృష్టి
114. గ్రహమునకు గుర్తు - ☾
115. సంబంధించిన వృత్తి - విద్య, నేవీ, ఖజానా
116. గ్రహజన్మ సంవత్సరం - నందన
117. జన్మ మాసం - కార్తీకం
118. జన్మ తిథి - శుద్ధ చతుర్దశి
119. జన్మ నక్షత్రం - కృత్తిక
120. ఆధిపత్యం వహించుదేశం - యమున నదీ ప్రాంతం
121. గ్రహ ఋషి - గౌతముడు
122. గ్రహ ఛందస్సు - గాయత్రి
123. పుట్టినవారం - సోమవారం

**సంబంధించిన వస్తువులు, పనులు :-**

బియ్యము, పాలు, చెఱుకు, తేనె, బత్తాయి, నారింజ, దోసకాయ, ఉప్పు, సుగంధ ద్రవ్యములు, తెల్లటి పూలు, చేపలు, గుర్రము, పాము, కర్పూరము స్ఫటికములు ముత్యములు, ఇష్టదేవతారాధన.

## 46. ఖగోళ పరంగా చంద్రుడు

చంద్రుడు, భూమి యొక్క ఉపగ్రహము, చంద్రునికి గ్రీకు మరియు రోమన్ల పురాణాలలో చాలా పేర్లు కలవు. గ్రీకులు చంద్రుడిని సెలెని (Selene) మరియు అర్థెమిస్(Arthemis) అని, రోమన్లు లూనా (Luna) అని పిలిచేవారు.

మన ఆకాశంలో సూర్యుని తరువాత కాంతివంతంగా కనిపించేది చంద్రుడే. చంద్రుడు భూమి చుట్టూ తిరగడానికి 30 రోజులు పడుతుంది. భూమి, చంద్రుడు మరియు సూర్యుని మధ్యలో ఉన్న కోణాల తేడా వలన మనకు పౌర్ణమి, అమావాస్యలు ఏర్పడుతున్నాయి.

రెండు పౌర్ణమిల మధ్య సమయము సుమారు 29.5 రోజులు.

చంద్రున్ని మొట్టమొదటిసారిగా 1959 సోవియెట్ అంతరిక్షనౌక లూనా 2 (Lina 2) నుంచి సందర్శించారు. చంద్రుడి మీద మొదటిసారిగా 1969, July 20న కాలు పెట్టారు. చివరిగా December 1972 న తిరిగి దిగారు.

భూమి మరియు చంద్రుడి మధ్యగల ఆకర్షణశక్తి వలన ఎన్నో ఆసక్తికరమైనవి జరుగుతుంటాయి. వాటిలో ఒకటి సముద్రాలలో వచ్చే అలలు. చంద్రుడికి దగ్గరగా

ఉండే భూమి మీద చంద్రుని ఆకర్షణ ఎక్కువగా, దాని ఆవలివైపు తక్కువగా ఉండును. ఈ ఆకర్షణ సముద్రపు నీటిమీద ఎక్కువగా ఉండును. అందుకని రోజుకు రెండు అలలు చాలా పెద్దగా వచ్చును.

భూమి మరియు చంద్రుని మధ్యగల అసమాన ఆకర్షణ మరియు భ్రమణ శక్తుల తేడా వలన భూమి ఆత్మపరిభ్రమణ వేగము 1.5 Milliseconds / century తగ్గుతూ వస్తున్నది.

చంద్రుని మీద వాతావరణము లేదు. కాని శాస్త్రవేత్తలు పరిశోధనలు చేసి, చంద్రుని పొరలలో నీరు మంచురూపంలో గడ్డకట్టి ఉండవచ్చని భావిస్తున్నారు.

చంద్రుడి మీద ముఖ్యంగా రెండు ప్రాంతాలు కలవు.

1. Old highlands

2. Maria.

చంద్రుని చాలా ఉపరితలం regolith తో కప్పబడి ఉన్నది. ఈ regolith తోకచుక్కల వలన వచ్చిన మట్టి, దుమ్ము మరియు రాళ్ళ సమ్మేళనము.

చంద్రుడు మీద ఎటువంటి వాతావరణం లేకపోవడం వలన మరియు ఎటువంటి అయస్కాంతక్షేత్రం లేకపోవడం వలన చంద్రుని regolith లో సూర్యుని నుండి వచ్చే Solarwinds లోని కణాలు ఉన్నాయి.

## 47. పురాణాల పరంగా చంద్రుడు

చంద్రుడు గౌరవర్ణము కలవాడు. రెండు భుజములు కలవాడు. తెల్లగా మెరియు ఆభరణాలను అలంకారములను ధరించును. తెల్లని వస్త్రము, గద ధరించును. దశాశ్వములు గల రథమును అధిరోహించును. ఈయన శిరస్సున స్వర్ణ కిరీటము, మెడలో ముత్యాలమాల ఉంటాయి. ఒకచేతిలో గద, మరొక చేయి వరముద్రతో ఉంటుంది. శ్రీ మద్భాగవతం ప్రకారం చంద్రుడు అత్రి మహర్షి, అనసూయల పుత్రుడు. ఈయన్ని 'సర్వమయ'డనీ అంటారు. ఇతనికి సోముడు, ఇందు, నిశాకరుడు, శశాంకుడు, తారాపతి, శీతాంశుడు, విధుడు, కుముదబాంధవుడు, ఉడునాధుడు, అనుపేర్లు కలవు. మహాతపస్వి అయిన అత్రి మహర్షి బ్రహ్మమానస పుత్రుడు. ఒకప్పుడాయన తన తేజస్సును ఊర్ధ్వగమనం కలదానినిగా చేసాడు. అనగా... వీర్యాన్ని పైకి ఎగజిమ్మాడు. దశదిశలా ఆ మహాతేజస్సును భరించడానికి యెవరికీ శక్యం కాలేదు. అంతటి అసాధారణ

తేజాన్ని, లోకహితార్థం బ్రహ్మ తన రథంపై ఎక్కించుకున్నాడు. సోమరూపమైన ఈ వీర్యం 21సార్లు భూప్రదక్షిణం చేసి, సర్వ ఓషధులు మొలకెత్తడానికి కారణమైంది.

ఈ మహాతేజమే పదిరూపాలను ధరించి, క్షీరసాగరమథనం సమయంలో సముద్రంలోకి చేరి, శ్రీలక్ష్మీదేవిగా ఉద్భవించింది. కనుకనే ఆమె చంద్రునికి సహోదరి అయింది.

జగదాధారభూతములైన ఔషధాల ఉత్పత్తికి కారకుడయి సోముడు పృథ్వీపతి (రాజు) కూడా అయ్యాడు. గర్వం, మదం తలకెక్కి దేవగురువు బృహస్పతి భార్యను చెరబట్టాడు. ఆమెయే తార. వీరిద్దరికీ జన్మించిన కుమారుడే బుధుడు. తరువాత బుధునికి ఇళయందు పురూరవుడు, అతడికి ఊర్వశియందు ఏడుగురు పుత్రులు కలిగి చంద్రవంశం విస్తరించింది. బుధునికి బ్రహ్మచేత గ్రహాధిపత్యం ఇవ్వబడింది. ప్రజాపతి బ్రహ్మ చంద్రుణ్ణి విత్తనములు, ఔషధములు, నీరు మరియు బ్రాహ్మణులకు రాజును చేశాడు. నవగ్రహాలలో చంద్రుడిది రెండవ స్థానం.

ఈయన 16 కళలతో కూడి ఉంటాడు. ఈయన్ని అన్నమయ, మనోమయ, అమృతమయ పురుష స్వరూప భగవానుడంటారు. ఆ తర్వాత కాలంలో శ్రీకృష్ణ భగవానుడు ఈయన వంశంలో జన్మించాడు. అందువలననే ఆయన చంద్రుని 16 కళలతో శోభిల్లాడు. దేవతలు, పితృదేవతలు, యక్షులు, మానవులు, పశుపక్ష్యాదులు, వృక్షాలు మొదలగువాటికి చంద్రుడే బలము నిస్తున్నాడు. ఈయన వివాహం దక్షప్రజాపతియొక్క 27గురు కుమార్తెలైన అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి మొదలగువారితో జరిగింది. వీరే 27 నక్షత్రాలుగా పిలువబడుతున్నారు. అధిదేవత 'అపః' ప్రత్యధి దేవత ఉమాదేవి. చంద్రమహర్దశ పది సంవత్సరాలు.

## 48. జ్యోతిష్యశాస్త్ర పరంగా చంద్రుడు

**చంద్రుడు - లక్షణాలు :-**

చంద్రుడు స్త్రీగ్రహము. రుచులలో ఉప్పును, రంగులలో తెలుపు రంగును సూచించును. వైశ్యజాతికి చెందినవాడు. అధిదేవత వరుణుడు. పొట్టిగా ఉండి, స్థూలశరీరం కలవారిని సూచించును. 70 సంవత్సరాల వయసు కలవారిని సూచించును. జలతత్త్వము కలిగి వాయవ్యదిశను సూచించును. వాత, శ్లేష్మ ప్రకృతి కలదు. చంద్రుడు వర్షఋతువును సూచించును. లోహములలో వెండిని, రత్నములలో ముత్యమును సూచించును. ఈ గ్రహసంఖ్య 2. చతుర్థభావంలో దిగ్బలము పొందును. ఇతను సత్వగుణప్రధానుడు. శుక్ల పక్షదశమి నుండి బహుళ

పక్ష పంచమి వరకు పూర్ణచంద్రుడని, బహుళపక్షచంద్రునినుండి అమావాస్య వరకు క్షీణచంద్రుడని, శుక్లపక్ష పాడ్యమినుండి నవమి వరకు మధ్యమ కారకత్వములు.

చంద్రుడని జాతక పారిజాతం తెలుపుతున్నది.

చంద్రుడు రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రములకు అధిపతి. శరీరావయవములలో మగవారి ఎడమకన్ను, స్త్రీల కుడికన్ను, స్తనములు, గర్భసంచి, లింపులను సూచించును. చంద్రుడు కర్కాటకరాశికి అధిపతి. వృషభంలో 3వ డిగ్రీ నుండి 27వ డిగ్రీ వరకు మూలత్రికోణం. ఇతనికి ఉచ్ఛరాశి వృషభం. నీచరాశి వృశ్చికం. వృషభంలో 3వడిగ్రీ ఇతనికి పరమోచ్ఛ. అలాగే వృశ్చికంలో 3వ డిగ్రీ పరమనీచ. బుధ, రవి ఇతనికి స్నేహితులు. మిగిలినవారు సములు. చంద్రునికి శత్రువులు లేరు.

**చంద్రుడు - ప్రభావం :-**

చంద్రుని ప్రభావం కలిగినవారు చిన్నవయసులోనే శ్లేష్మవ్యాధులతో బాధపడతారు. వీరికి నీటిగండం వున్నది. వీరు కొంతకాలం ధైర్యముగా, సంతోషంగా, ఉత్సాహంగా వుంటారు. మరికొంతకాలము పిరికితనంతో, నిరాశతో నీరసంగా వుంటారు. స్నేహితులు, అభిప్రాయాలు తరచుగా మారుచుండును. వివాహం తరువాత పెద్దపొట్ట కలిగి ఉంటారు. కొంతకాలం ధనవంతులుగా కొంతకాలం దరిద్రులుగా జీవిస్తారు. భోజనప్రియులు. స్వతంత్రించి ఏ పనిని చేయలేరు. నీటిపారుదలన, పబ్లిక్‌వర్క్స్, వస్త్రములు, బియ్యము వ్యాపారము పానీయాల వ్యాపారములో రాణించగలరు. పాండురోగము, మధుమేహము, శ్వాసకోశవ్యాధులు, క్షయ కలుగవచ్చును.

చంద్రుడు మనస్సుకు కారకుడు. తల్లి, స్త్రీ, పూలు, నీరు, నీరుగల ప్రాంతములు అనగా సముద్రము, నది, నీటిగుంట మొదలగునవి, ముఖము, ఎడమకన్ను, పొట్ట, మహిళా సంఘములు, స్త్రీ సంక్షేమశాఖ, నౌకావ్యాపారము, ఓడరేవులు, వంతెనలు, ప్రాజెక్టులు, చేపల పెంపకం, వెండి, ముత్యము, చలిజ్వరము, రక్తహీనత, అతిమూత్రము, స్త్రీలకు వచ్చు వ్యాధులు, శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు, వరిబీజము, డయేరియా, కాన్సర్ మొదలైన వ్యాధులను సూచించును. చెఱకు, తేనె, పాలు, పెరుగు, భోజనము జొన్న, గోధుమలు, చేపలు, పంచదార, నెయ్యి, అరటిపండ్లు, దోసకాయలు, తమలపాకులు, గుమ్మడి, కేబేజీ, కాలీ ఫ్లవర్, కర్బూజాఫలము, కుక్కగొడుగులు తాబేలు, బాతు, గుడ్లగూబ,

గబ్బిలము, పిల్లి, నీటి గుర్రము, తిమింగములు, షార్క్ చేపలు, కర్పూరము, నికెలు, జర్మన్ సిల్వర్‌ను సూచించును. సంగీతం, కవిత్వం, నాట్యం మొదలగు లలిత కళలు, పూలతోటలు, స్విమ్మింగ్‌పూల్, వ్యవసాయం, వర్షము, వరద, వ్యాపారులను సూచించును.

పొత్తికడుపు, గుడ్లు, క్షీరదాలు, చేపలు, ఆవులు, పుట్టగొడుగులు, కాఫీవ్యాపారం, కుటుంబం, ఉతికే నీరు, చెట్లు, కోళ్ళ పరిశ్రమ, జీర్ణము, తరగతి, జున్ను, పాలములు, పంటలు, వంట, హోటళ్ళు, కాలువలు, బీరు, బ్రాంది వంటి మత్తుపానీయాలు, సీసాలు, సారాయి కొట్టు, కంటినీరు, నివాసము, ఎండదెబ్బ, నౌకాయానము, హోటలు, శుభ్రపరచుట, పిల్లలు, సీసాలు, తూములు, డైరీ, అలవాట్లు, కోళ్ళపరిశ్రమ, ముత్యాలు, అజీర్ణము, జీర్ణము, జున్ను, చదువు, చెట్లు, స్త్రీలు, ఎండదెబ్బ, సముద్రయానం, నౌకాయానములను సూచించును.

**చంద్రుడు సూచించు విద్యలు :-**

చంద్రుడు చరిత్ర, మనస్తత్వశాస్త్రము, నీటిసరఫరా, నావికాశిక్షణ, కవిత్వమును సూచించును. చంద్రుడు శుక్రునితో కలసి పాలపరిశ్రమ, కుజ, శుక్రులతో కలసి పశువైద్యము, పౌరశాస్త్రము, మంత్రసానికి సంబంధించిన విషయములును సూచించును.

**చంద్రుడు సూచించు వ్యాధులు :-**

మానసిక ఆందోళన, ఎడమకంటికి సంబంధించిన వ్యాధులు, పిచ్చి, గర్భాశయవ్యాధులను చంద్రుడు సూచించును. చంద్రుడు శుక్రునితో కలసి షుగర్‌వ్యాధి (మధుమేహము) కుజునితో కలసి గర్భాశయం తీసివేయుటను సూచించును. గురునితో కలసి కడుపుకు సంబంధించిన వ్యాధులు, రొమ్ము కాన్సర్, శనితో కలసి అమీబియాస్, దగ్గు, జలుబు, ఆస్మా, డిసెంట్రీ, ఋతుక్రమముకు సంబంధించిన వ్యాధులు, గర్భాశయకాన్సర్, డ్రగ్ ఎడిక్ట్, బుధునితో కలసి మానసిక రోగాలు, రాహువుతో కలసి మతి చాంచల్యం, ఇతరులను చంపాలనే ఆలోచన, కేతువుతో కలసి బాలారిష్ట శిశుమరణాలు, ఊపిరితిత్తులలో జలుబు, శ్వాసకోశ సంబంధమైన ఇబ్బందులు చంద్రుడు సూచించును.

**చంద్రుడు సూచించు వృత్తి వ్యాపారాలు :-**

నావికులు, మంత్రసానులు, నర్సులు, చేపలు పట్టువారు, హోటల్‌కీపర్స్ మట్టితో బొమ్మలు చేయువారు, కుమ్మరులను సూచించును. బత్తాయి, అరటి,

తాటిచెట్టు, కర్బూజాపండు, చెరుకు, పాలు, పెరుగు, నెయ్యి, పంచదార, తమలపాకులు, కర్పూరము, చేపలు, వెండి, వండిన ఆహారముకు సంబంధించిన వ్యాపారములను సూచించును. చంద్రుడు కుజునితో సంబంధముంటే బాయిలర్‌లతో వ్యాపారం, శనితో సంబంధముంటే శంఖువు వంటి సముద్ర గర్భంలోని వస్తువులతో వ్యాపారం, గురు, బుధులతో కలసి ఆడిటర్స్‌ను, సేల్స్‌మన్‌లను, వీధిలో వస్తువులను అమ్మువారిని సూచించును.

## ద్వాదశ లగ్నాలులో చంద్రుడు -ఫలితాలు

**మేషరాశి లగ్నమైతే**

- మేషలగ్నమై లగ్నంయందు పూర్ణచంద్రుడున్న భూ, ధన లాభము గలుగును. క్షీణ చంద్రుడున్న శుభఫలము నిచ్చును గాని అన్యాయార్జితము, కపటస్వభావం కలుగును.
- 2వ స్థానంలో పూర్ణచంద్రుడున్న శుభఫలము గలిగి ధనలాభము కలుగును. క్షీణ చంద్రుడున్న స్వల్ప ధనలాభం కలుగును.
- 3వ స్థానంలో చంద్రుడున్న ధనవ్యయము, పిత్రార్జిత నష్టము కలుగును.
- 4వ స్థానములో పూర్ణ చంద్రుడున్న భూ, ధనలాభము కలుగును. క్షీణచంద్రుడున్న ఇవి స్వల్పంగా లభించును.
- 5వ స్థానములో చంద్రుడున్న మంచి సంతానం కలుగును.
- 6 వ స్థానములో చంద్రుడున్న భూమి, ధనవ్యయము కలుగును.
- 7వ స్థానములో పూర్ణచంద్రుడున్న కేంద్రాధిపత్యదోషము వలన శరీరపీడ, మరణభయం కూడా కలుగును. క్షీణచంద్రుడున్న మరణభయముండదు.
- 8వ స్థానంలో పూర్ణచంద్రుడున్నను క్షీణచంద్రుడున్నను శుభఫలముల నీయరు. పూర్ణచంద్రుని వలన మరణభయము కలుగును.
- 9వ స్థానంలో చంద్రుడున్న జాతకునికి పేరుప్రతిష్ఠలు కలుగును.
- 10వ స్థానములో చంద్రుడున్న ధనము తీర్థయాత్రలకు వ్యయమగును.
- 11వ స్థానములో చంద్రుడున్న న్యాయధనార్జన కలుగును.
- 12వ స్థానములో చంద్రుడున్న బహునష్టములు, విశేష ధనవ్యయము కలుగును.

వృషభం లగ్నమైతే

- 1వ స్థానములో పూర్ణ చంద్రుడు వున్నట్లయితే జాతకుడు గొప్ప వంశమున పుట్టును. అందమైనవాడు అవుతాడు. దేశ ప్రఖ్యాతిగల వాడు అవుతాడు. అధిక ధనవంతుడు అవుతాడు. క్షీణచంద్రుడున్న ఈ ఫలములు వుండవు.
- 2వ స్థానములో పూర్ణచంద్రుడు వున్నట్లయితే జాతకుడు వేల సంఖ్యలో డబ్బు కూడబెట్టును. క్షీణచంద్రుడున్న సంపాదించిన ధనమును ఖర్చు పెట్టును.
- 3వ స్థానములో పూర్ణచంద్రుడు వున్నట్లయితే జాతకుడు అధికముగా అక్కాచెల్లెళ్ళు కలిగి ఉంటాడు. క్షీణచంద్రుడున్న సోదరి నష్టము కలుగును.
- 4వ స్థానములో పూర్ణ చంద్రుడు వున్నట్లయితే విద్య, వాహనము భూమి ఎక్కువగా వుండువాడు అవుతాడు. క్షీణచంద్రుడున్న సోదరి నష్టము కలుగును.
- 5వ స్థానములో పూర్ణ చంద్రుడు వుంటే జాతకునికి ఒక్క కుమార్తె మాత్రమే ఉండును. ఈమె మిక్కిలి ధనవంతురాలు అవుతుంది. క్షీణచంద్రుడున్న అటువంటి జాతకునికి బిడ్డల వల్ల సంతోషముండదు.
- 6వ స్థానములో పూర్ణ చంద్రుడున్న విరోధులు, రోగాలు అప్పులు తక్కువగా ఉండును. క్షీణచంద్రుడున్న విరోధులు, రోగాలు, అప్పులు ఎక్కువగా ఉండును.
- 7వ స్థానములో పూర్ణ చంద్రుడు వున్న ఎడల జాతకునికి అనుకూలవతి యగు అందమైన భార్య వుండును. క్షీణచంద్రుడున్న భార్యవలన బాధలు కలుగును.
- 8వ స్థానములో ఏ చంద్రుడున్నా జాతకునికి అనేక నష్టాలు కలుగును.
- 9వ స్థానములో పూర్ణచంద్రుడు వున్నట్లయితే జాతకుడు ధనవంతుడు అవుతాడు. క్షీణచంద్రుడున్న ధనం వ్యయమగును.
- 10 వ స్థానములో పూర్ణ చంద్రుడు వున్నట్లయితే మిక్కిలి రాజయోగము వచ్చును. గంగానదిలో స్నానము చేయుట వల్ల మంచి పనులు చేయువాడు అవుతాడు. క్షీణచంద్రుడున్న అనాచారవంతుడు అవుతాడు.
- 11 వ స్థానములో పూర్ణ చంద్రుడు వున్నట్లయితే అధిక ధనం సంపాదించును. క్షీణచంద్రుడున్న అన్యాయార్జితం ఉంటుంది.

- ✤ 12వ స్థానములో పూర్ణచంద్రుడు వున్నట్లయితే జాతకుడు తాను సంపాదించిన ధనము అంతా పుణ్య కార్యాలకు ఖర్చు చేయును. కాని క్షీణచంద్రుడు వుంటే చెడు ప్రవర్తన కలవాడై వుంటాడు.

**మిథునం లగ్నమైతే**

- ✤ మిథున లగ్నంలో పూర్ణచంద్రుడు ఉన్న సుఖ, సంతోషములతో జీవించును.
- ✤ 2వ స్థానంలో పూర్ణచంద్రుడున్న ధనలాభము, క్షీణ చంద్రుడున్న ధన నష్టం కలుగును.
- ✤ 3వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న సోదరి వృద్ధి, లాభము, నష్టములు సమానంగా ఉంటాయి.
- ✤ 4వ స్థానంలో పూర్ణచంద్రుడు ఉన్న విద్య, గృహం, మాతృసౌఖ్యం కలుగును.
- ✤ 5వ స్థానంలో పూర్ణచంద్రుడు ఉన్న స్త్రీ సంతానం ఎక్కువగా ఉండును. ధనలాభం కలుగును.
- ✤ 6వ స్థానంలో చంద్రుడున్న సంతానం వలన విచారం కలుగును. పూర్వుల ఆస్తి నష్టపోవును.
- ✤ 7 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న అనారోగ్యం కలుగును. క్షీణ చంద్రుడున్న మరణ భయం కలుగును.
- ✤ 8 వ స్థానంలో చంద్రుడున్న సుఖజీవనం కలుగును.
- ✤ 9 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న అధిక ధనలాభం, కుటుంబ సౌఖ్యము, శాంతి కలుగును.
- ✤ 10 వ స్థానంలో చంద్రుడున్న పుణ్యక్షేత్రాలు దర్శించును.
- ✤ 11 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న ధన లాభం కలుగును.
- ✤ 12వ స్థానంలో చంద్రుడున్న మంచి పనులకు ధనవ్యయము అగును. ధనలాభం కలుగును.

**కర్కాటకం లగ్నమైతే**

- ✤ కర్కాటక లగ్నమై లగ్నమున పూర్ణచంద్రుడున్న సుఖము, అనారోగ్యము.
- ✤ 2వ స్థానంలో పూర్ణచంద్రుడున్న ధనలాభము, మరణభయము.
- ✤ 3వ స్థానంలో చంద్రుడున్న ధననష్టము, అశాంతి, సోదరులు సుఖంగా జీవిస్తారు.

- 4వ స్థానంలో పూర్ణచంద్రుడున్న మాతృసౌఖ్యము, విద్య, వాహనము లభించును. గృహలాభం కలుగును.
- 5వ స్థానంలో చంద్రుడున్న శత్రువులు, రోగు, ఋణము కలుగును.
- 6వ స్థానంలో చంద్రున్న ధనవ్యయము, శత్రుభయము.
- 7వ స్థానంలో చంద్రుడున్న గుణవంతురాలైన భార్య లభించును.
- 8వ స్థానంలో చంద్రుడున్న ధననష్టము, పసితనంలో బాలారిష్టము కలుగును.
- 9వ స్థానంలో పూర్ణచంద్రుడున్న శుభము కలుగును. పిత్రార్జిత ధనం లభించును. ధనాభివృద్ధి కలుగును.
- 10వ స్థానంలో పూర్ణచంద్రుడున్న వ్యవసాయం వలన లాభము కలుగును. వ్యయము చేయును.
- 11వ స్థానంలో పూర్ణచంద్రుడున్న విశేష ధనలాభము, కీర్తి ప్రతిష్టలు, ఉద్యోగము, అధికారము కలుగును.
- 12వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సత్కార్యములకు ధనవ్యయము కలుగును.

**సింహం లగ్నమైతే**

- సింహలగ్నమై లగ్నంలో పూర్ణచంద్రుడున్న మంచిరూపము, సంఘంలో గుర్తింపు కలుగును. క్షీణచంద్రుడున్న వికారి, ధనహీనుడు.
- 2 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న అక్క, చెల్లెళ్ళు ఉంటారు.
- 3 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సంతాన సౌఖ్యము, సుఖము, ధనము కలుగును.
- 4 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న ద్వికళత్ర యోగము కలుగును.
- 5 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సంతాన సౌఖ్యము, సుఖము, ధనము కలుగును.
- 6 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న శత్రు, రోగ, ఋణములు, శత్రుజయము కలుగును.
- 7 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న మంచిభార్య, క్షీణచంద్రుడున్న ద్వికళత్రయోగము కలుగును.
- 8 వ స్థానంలో ఏ చంద్రుడున్నను యోగఫలము ఇవ్వడు, బాల్యములో, బాలారిష్టం కలుగును.

- 9 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న తండ్రి సంపాదించిన భాగ్యము లభించును.
- 10 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న భూలాభము, ఆచారము, ధనలాభము కలుగును.
- 11 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న ధనలాభము, న్యాయార్జితము, లోభత్వము కలుగును.
- 12 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న సత్‌కార్యముల వలన ధనవ్యయము, క్షీణ చంద్రుడున్న దుష్టుల స్నేహము, అనవసర ఖర్చు కలుగును.

**కన్య లగ్నమైతే**

- కన్య లగ్నమై లగ్నంలో పూర్ణచంద్రుడు ఉన్న అధిక ధనార్జనము, మంచి రూపము, కీర్తి కలుగును. క్షీణచంద్రుడు ఉన్న సామాన్య జీవనము కలుగును.
- 2 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న మంచి వాక్కు, ధనసంపాదన కలుగును. క్షీణచంద్రుడు ఉన్న సామాన్య జీవనము కలుగును.
- 3 వ స్థానములో పూర్ణచంద్రుడు ఉన్న సామాన్య జీవనము, క్షీణచంద్రుడు ఉన్న యోగహీనము కలుగును.
- 4 వ స్థానంలో పూర్ణచంద్రుడు ఉన్న విద్య, భూమి, ధనము లభించును. క్షీణచంద్రుడు ఉన్న స్వల్పధనలాభము కలుగును.
- 5 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న పుత్రసంతానము కలుగును. సుఖజీవనం కలుగును. క్షీణచంద్రుడున్న స్వల్ప ఆదాయం ఉంటుంది.
- 6 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న ఋణబాధలు కలుగును. క్షీణచంద్రుడు ఉన్న ఋణము కూడా దొరకదు.
- 7 వ స్థానంలో పూర్ణచంద్రుడు ఉన్న తీర్థయాత్రలు చేయును. క్షీణచంద్రుడు ఉన్న సామాన్య జీవనము కలుగును.
- 8 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న బాలారిష్టము కలుగును. క్షీణచంద్రుడు ఉన్న అనారోగ్యం కలుగును.
- 9 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న ధనలాభము, పూర్ణయోగము కలుగును. క్షీణచంద్రుడు ఉన్న సామాన్య జీవనము కలుగును.
- 10 వ స్థానంలో పూర్ణచంద్రుడు ఉన్న సత్కార్యాలు, క్షీణచంద్రుడు ఉన్న అనాచారము కలుగును.
- 11 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న విశేషధనలాభము. క్షీణచంద్రుడు ఉన్న నీచమైన పనులు, అన్యాయార్జితము కలుగును.

- 12 వ స్థానంలో పూర్ణచంద్రుడు ఉన్న సత్కథా కాలక్షేపములు. క్షీణచంద్రుడు ఉన్న పెద్దవారు స్నేహితులు అవుతారు.

**తుల లగ్నమైతే**

- తులా లగ్నమై లగ్నమందు చంద్రుడున్న, చంద్రదశలో గొప్ప రాజయోగాన్ని పేరు ప్రతిష్టలను పొందుతాడు.
- 2 వ స్థానమున చంద్రుడున్న సాధారణజీవితమును పొందును.
- 3 వ స్థానమున చంద్రుడున్న సామాన్య యోగమును పొందును.
- 4 వ స్థానమున చంద్రుడున్న విద్య, భూలాభము పొందును.
- 5 వ స్థానమున చంద్రుడున్న మంచి సంతానము, రాజయోగమును పొందును.
- 6 వ స్థానమున చంద్రుడున్న అప్పు పెరుగును.
- 7 వ స్థానమున చంద్రుడున్న మంచిభార్య, స్త్రీ వల్ల ధనలాభంను పొందును.
- 8 వ స్థానమున చంద్రుడున్న పసితనంలో ప్రమాదము, గొప్ప యోగము కల్గును.
- 9 వ స్థానమున చంద్రుడున్న భోగభాగ్యములు కలుగును.
- 10 వ స్థానమున చంద్రుడున్న ప్రయాణాలు చేయును.
- 11 వ స్థానమున చంద్రుడున్న ధనలాభము, న్యాయసంపద గల్గును.
- 12 వ స్థానమున చంద్రుడున్న మంచి కార్యాల వల్ల డబ్బు ఖర్చగును.
- తులా లగ్నమునకు పూర్ణచంద్రుడు కేంద్రకోణములయందు ఉన్న గొప్పయోగమును పొందుతాడు.

  తులాలగ్నమునకు క్షీణచంద్రుడు కేంద్రకోణముల యందు ఉన్న సామాన్య యోగాన్ని పొందుతాడు.

**వృశ్చికం లగ్నమైతే**

- వృశ్చికలగ్నమై లగ్నంలో చంద్రుడున్న కుటుంబ సుఖము, శాంతి కలుగును.
- 2 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న విశేష ధనలాభం కలుగును. క్షీణచంద్రుడున్న స్వల్పధనము లభించును.
- 3 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న సుఖ జీవనం కలుగును. క్షీణ చంద్రుడున్న కష్టములు కల్గును.

- 4 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న విద్యావేత్త అగును. విశేష భూలాభం, వాహన సౌఖ్యము కలుగును. క్షీణచంద్రుడున్న సామాన్య జీవనం కలుగును.
- 5 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న సంతానం వలన సుఖం, భాగ్యం కలుగును. క్షీణచంద్రుడున్న సామాన్య జీవనం ఉంటుంది.
- 6 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న శాంతి జీవనం, క్షీణచంద్రుడున్న శత్రువులు, రోగములు, ఋణము కలుగును.
- 7 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న మిక్కిలి రాజయోగం, విశేష భాగ్యములు కలుగును. క్షీణచంద్రుడున్న సామాన్యజీవనం ఉంటుంది.
- 8 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న సాధారణ జీవనం, క్షీణ చంద్రుడున్న శారీరక బాధలు కలుగును.
- 9 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న భాగ్యలాభం, కీర్తి, క్షీణచంద్రుడున్న సామాన్య జీవనం కలుగును.
- 10 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న ఆచారం, పుణ్యకార్యాలు, తీర్థయాత్రలు, ధనలాభం కలుగును. క్షీణచంద్రుడున్న స్వల్ప ఆదాయం ఉంటుంది.
- 11 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న ధనలాభము, క్షీణచంద్రుడున్న అన్యాయార్జితము కలుగును.
- 12 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న సత్కార్యాలు చేయును. పేరు పొందును. క్షీణచంద్రుడున్న వృథాధనవ్యయము కలుగును.

**ధనుస్సు లగ్నమైతే**

- ధనుస్సు లగ్నమై లగ్నమున చంద్రుడున్న శరీరరోగము, సుఖహీనము కలుగును.
- 2 వ స్థానములో పూర్ణచంద్రుడున్న గొప్ప ధనలాభము కలుగును. క్షీణచంద్రుడున్న ధనహీనము కలుగును.
- 3 వ స్థానములో పూర్ణ చంద్రుడు ఉన్న సోదరవృద్ధి, క్షీణచంద్రుడైన సోదరి నష్టమును కలుగును.
- 4 వ స్థానంలో పూర్ణ చంద్రుడున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనము, క్షీణచంద్రుడున్న సామాన్య జీవనం కలుగును.
- 5 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న సంతానం వలన గౌరవం, క్షీణచంద్రుడు ఉన్న సంతాన నష్టము కలుగును.

- 6 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న శత్రువుల వలన ఇబ్బందులు, అనారోగ్యం. క్షీణచంద్రుడున్న శత్రు, రోగ బాధలు ఎక్కువగా కలుగును.
- 7 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న సుకళత్రము. క్షీణచంద్రుడున్న కళత్ర నష్టము కలుగును.
- 8 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న దైవభక్తి, పితృ సౌఖ్యము, ధనలాభము, క్షీణచంద్రుడున్న వీనికి వ్యతిరేక ఫలములు కలుగును.
- 9 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న పెద్దలయందు గౌరవము, తండ్రి ప్రేమ, భాగ్యము లభించును. క్షీణచంద్రుడున్న వ్యతిరేక ఫలములు లభించును.
- 10 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న తీర్థయాత్రలు, సదాచారము, పేరు ప్రతిష్టలు, క్షీణచంద్రుడున్న నీచజీవనము, ఆచార హీనము కలుగును.
- 11 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న ధర్మవర్తనము, ధనసంపాదన కలుగును. క్షీణ చంద్రుడు ఉన్న అన్యాయ ధనార్జనము కలుగును.
- 12 వ స్థానంలో పూర్ణ చంద్రుడు ఉన్న దుర్జన సహవాసము, దుష్కార్యములు, అల్పాయుర్దాయము కలుగును. క్షీణచంద్రుడున్న అనేక కష్టములు కలుగును.

**మకరం లగ్నమైతే**

- మకరలగ్నమై లగ్నంలో పూర్ణ చంద్రుడున్న స్థూలశరీరము కలవాడు. వికారి కాడు. దుర్మార్గుడు కానివాడు. క్షీణచంద్రుడున్న సన్ననివాడు. కష్టములు కలుగును.
- 2 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న విద్య, ధనము లభించును. క్షీణ చంద్రుడున్న ధనహీనము కలుగును. మరణ భయము కలుగును.
- 3 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సోదరిని కలిగి ఉంటాడు. పిరికివాడు. సామాన్య జీవనం కలుగును. క్షీణచంద్రుడున్న సుఖము, శాంతి, ధైర్యము కలుగును.
- 4 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న విద్య, భూమి, వాహనం, మాతృసౌఖ్యం కలుగును. క్షీణచంద్రుడున్న పై ఫలములు తక్కువగా ఫలించును.
- 5 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న పేరు ప్రతిష్టలు పొందగల పుత్రుడు ఉంటాడు. క్షీణచంద్రుడున్న సంతాన నష్టము కలుగును.

- 6 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న ఆర్థిక ఇబ్బందులు ఉండవు. క్షీణ చంద్రుడున్న కొద్దిగా అనారోగ్యం, అప్పు కలుగును.
- 7 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న అందమైన భార్య లభించును. క్షీణచంద్రుడున్న సంసారసుఖము తక్కువ.
- 8 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న మధ్యమాయుర్దాయం కలవాడు. క్షీణచంద్రుడున్న అల్పాయుర్దాయం కలవాడు.
- 9 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న పేరు ప్రఖ్యాతులు కలిగిన తండ్రి కలవాడు. ఆరోగ్యము, ధనము కలవాడు.
- 10 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సదాచారము కలవాడు. స్వతంత్రజీవనము కలవాడు, ప్రయాణాలు చేయును. క్షీణ చంద్రుడున్న ఆచారములు పాటించని వాడు, దాంబికుడు, నీచవృత్తి కలవాడు.
- 11 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న కళత్రసుఖము తక్కువ. క్షీణచంద్రుడున్న భార్య వలన దుఃఖము, ధననష్టము కలుగును.
- 12 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న ధర్మకార్యములు, భార్యకు అనారోగ్యము కలుగును. క్షీణ చంద్రుడున్న కళత్ర నష్టము, అనవసర ఖర్చులు కలుగును.

**కుంభం లగ్నమైతే**

- కుంభలగ్నమై లగ్నములో పూర్ణచంద్రుడున్న, సుఖహీనము, వాతరోగము, క్షీణచంద్రుడున్న చెడుస్వభావము, అనేక కష్టములు.
- 2 వ స్థానములో పూర్ణచంద్రుడున్న స్వల్ప ధనము, క్షీణచంద్రుడున్న ధనము లేకుండుట, అనారోగ్యము కలుగును.
- 3 వ స్థానములో పూర్ణచంద్రుడున్న స్వల్పయోగము, అక్కాచెల్లెళ్ళు ఎక్కువగా ఉంటారు. క్షీణచంద్రుడున్న ధనము, సుఖము, శాంతి కలుగును, సోదర నష్టము.
- 4 వ స్థానములో పూర్ణచంద్రుడున్న సంతాన నష్టము, స్వల్పయోగము, క్షీణచంద్రుడున్న స్వల్ప మాతృసౌఖ్యము, విద్య, భూమి, అశాంతి కలుగును.
- 5 వ స్థానములో పూర్ణచంద్రుడున్న ధనము, సుఖము, శాంతి కలుగును, క్షీణచంద్రుడున్న సంతానము వలన సుఖహీనుడు, యోగహీనుడు.
- 6 వ స్థానములో పూర్ణచంద్రుడున్న స్వల్పయోగము, క్షీణచంద్రుడున్న యోగహీనుడు, శత్రువులు, రోగము, ఋణము కలుగును.

- 7 వ స్థానములో పూర్ణచంద్రుడున్న ధనము, సుఖము, శాంతి, మంచి భార్య కలుగును. క్షీణచంద్రుడున్న భార్య వలన నష్టము, యోగభంగము.
- 8 వ స్థానములో పూర్ణచంద్రుడున్న అర్ధాయుష్కుడు, అనారోగ్యము కలుగును, క్షీణచంద్రుడున్న ఆయుష్షు తక్కువ.
- 9 వ స్థానములో పూర్ణచంద్రుడున్న ధనము, సుఖము, శాంతి కలుగును, క్షీణచంద్రుడున్న తండ్రివలన సుఖహీనుడు, యోగభంగము.
- 10 వ స్థానములో పూర్ణచంద్రుడున్న స్వల్పయోగము. క్షీణచంద్రుడున్న ధనము, సుఖము, శాంతి కలుగును.
- 11 వ స్థానములో పూర్ణచంద్రుడున్న ధనలాభము, క్షీణచంద్రుడున్న ధనము, సుఖము, శాంతి కలుగును.
- 12 వ స్థానములో పూర్ణచంద్రుడున్న ధనవ్యయము, తీర్థయాత్రలు, క్షీణ చంద్రుడున్న చెడ్డవారితో స్నేహము, వృధా ఖర్చు, సుఖము, ధనము ఉండదు.

**మీనం లగ్నమైతే**

- మీన లగ్నమై లగ్నంలో పూర్ణచంద్రుడున్న సంఘంలో గుర్తింపు కలిగి సుఖశాంతులలో జీవించును. క్షీణ చంద్రుడుంటే సామాన్య జీవనము, సంతానం వల్ల బాధలు కలుగును.
- 2 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న అధిక ధనము, కీర్తి కలుగును. క్షీణచంద్రుడున్న సామాన్య జీవనము, ధనము లభించును.
- 3 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సంతానం వల్ల గుర్తింపు కలుగును. క్షీణచంద్రుడున్న విద్యాభివృద్ధి ఉండదు.
- 4 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న విద్యాభివృద్ధి, భూలాభము, వాహన సౌఖ్యము కలుగును. క్షీణచంద్రుడున్న సామాన్యజీవనము కలుగును.
- 5 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సుఖశాంతులు, మంచి సంతానము కలుగును. క్షీణచంద్రుడున్న సంతాన నష్టం కలుగును.
- 6 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సామాన్య జీవనం కలుగును. క్షీణచంద్రుడున్న అనారోగ్యము, ఆర్థిక ఇబ్బందులు కలుగును.
- 7 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న గుణవంతురాలైన భార్య లభించును సుఖజీవనం కలుగును. క్షీణచంద్రుడున్న సామాన్యజీవనము కలుగును.
- 8 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సుఖదుఃఖాలు సామాన్యంగా కలుగుతాయి. క్షీణ చంద్రుడున్న సుఖహీనము కలుగును.

- 9 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సంతానం వలన దుఃఖము కలుగును. క్షీణచంద్రుడున్న అధిక బాధలు కలుగును.
- 10 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న సదాచారము, పుణ్యక్షేత్ర సందర్శనము, ప్రయాణాలు కలుగును. క్షీణచంద్రుడున్న సంతానం అభివృద్ధి చెందును.
- 11 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న అధికధనార్జన ప్రయాణాలు కలుగును. క్షీణచంద్రుడున్న అన్యాయార్జన ఉంటుంది.
- 12 వ స్థానంలో పూర్ణచంద్రుడున్న పుణ్యకార్యాలకు ధనము వ్యయము చేయును. క్షీణచంద్రుడైన పెద్దవారి స్నేహము లభించును.

## వివిధ భావాలలో చంద్రుడు - ఫలితాలు

- చంద్రుడు లగ్నంలో ఉంటే జాతకుడు సుఖజీవనం గడుపుతాడు. కాని ఆరాశి చంద్రునికి నీచక్షేత్రమయితే వికలాంగుడు అవుతాడు.
- చంద్రుడు ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు రత్నములు, ధనము కలిగి ఉంటాడు. సుఖంగా జీవిస్తాడు.
- పూర్ణచంద్రుడు తృతీయభావంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు శాస్త్రపరిజ్ఞానం కలవాడు. వినోదభరితమైన జీవితం గడుపుతాడు. కాని తృతీయభావంలో క్షీణచంద్రుడు ఉంటే మూర్ఖంగా ప్రవర్తిస్తుంటాడు. అధిక ప్రసంగం చేస్తుంటాడు.
- చంద్రుడు చతుర్థభావంలో ఉంటే జాతకుడు బంధుప్రేమకలవాడు. ఇతరులకు సాయం చేయువాడు. సంఘంలో గుర్తింపు కలవాడు శిల్పి.
- పూర్ణచంద్రుడు పంచమభావంలో ఉంటే గుణవంతుడైన పుత్రుడు జన్మిస్తాడు. క్షీణచంద్రుడు ఉంటే కుమార్తెలు జన్మిస్తారు. వారికి స్థిర స్వభావం ఉండదు.
- చంద్రుడు షష్టమ భావంలో ఉండి శుభుడైతే జాతకుడు శత్రువులను జయిస్తాడు. అశుభుడైతే జాతకునకు ఆపద కలుగుతుంది.
- పూర్ణ చంద్రుడు సప్తమభావంలో ఉంటే జాతకుడు ఇద్దరు అంతకంటె ఎక్కువమంది స్త్రీలతో సంబంధం కలిగి ఉంటాడు. క్షీణచంద్రుడు సప్తమ భావంలో ఉంటే జాతకుని భార్యకు అనారోగ్యం ఉంటుంది.
- చంద్రుడు అష్టమ భావంలో ఉంటే జాతకునకు తొందర ఎక్కువ. ప్రతి విషయానికి అనవసరంగా ఆందోళన చెందుతూ అనారోగ్యం పొందుతాడు.

ఇతరులచే అవమానింపబడతాడు. మాతృసౌఖ్యం తక్కువ.

- ✤ చంద్రుడు నవమభావంలో ఉంటే జాతకుడు సాంప్రదాయవాది. ఆచారవంతుడు.
- ✤ చంద్రుడు దశమభావంలో ఉంటే జాతకుడు ధనం, కీర్తి కలిగి ఉంటాడు. స్వంత గృహం ఉంటుంది.
- ✤ చంద్రుడు ఏకాదశభావంలో ఉంటే జాతకుడు పరోపకారి. విద్యావంతుడు. కష్టపడి ధనలాభం పొందుతాడు. తల్లివలన ధనం ప్రాప్తిస్తుంది. శాంతంగా ఉంటాడు. మనశ్శాంతి కలవాడు.
- ✤ చంద్రుడు ద్వాదశ భావంలో ఉంటే జాతకునకు కంటిదోషం ఉంటుంది. నీచస్వభావం కలవాడు. శత్రువులు ఉంటారు.

**చంద్రుడు ఆగ్రహించిన జరిగే సంఘటనలు :-**

- ✤ తరచు తల్లితో అభిప్రాయభేదాలు కలుగుతాయి.
- ✤ ఇంటిలో బావి ఉంటే అది ఎండిపోతుంది. బోర్ వెల్ కాని, కుళాయి కాని ఉంటే వాటికి మరమ్మత్తులు చేయువలసి వస్తుంది. నీటి సమస్య కలుగుతుంది.
- ✤ తరచు పాలుపొంగి, పొయ్యి ఆరిపోతుంది.
- ✤ మనం ధరించే తెల్లని వస్త్రాలపై తరచు మరకలు పడుతుంటాయి.
- ✤ ఎడమకన్ను బాధ పెడుతుంది.

పై సఘటనలలో ఏది జరిగినా చంద్రుడు మనపై చెడు ప్రభావం చూపుతున్నాడని గ్రహించాలి. దానికి పరిహారంగా క్రిందివాటిలో ఏదో ఒకటి చేయాలి.

**చంద్రుడు శాంతించుటకు చేయవలసిన పరిహార క్రియలు :-**

- ✤ ప్రతిరోజు ఉదయాన మీతల్లిగారికి నమస్కరించి, ఆమె ఆశీస్సులు తీసుకోండి.
- ✤ ఒక చిన్న కుండలో పాలుపోసి, దానిని నైరుతి స్థానంలో పాతిపెట్టండి.
- ✤ ముత్యం పొదిగిన వెండి ఉంగరాన్ని ధరించండి. లేదా ముత్యాల హారాన్ని ధరించండి.

# వివిధ భావాలలో చంద్రుడు-పరిహార క్రియలు

**లగ్నంలో చంద్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిదినం తల్లికి నమస్కరించండి. ఆమె ఆశీర్వాదం తీసుకోండి.
- వరుసగా 43 రోజులు ప్రవహించే నీటిలో రాగినాణెం వేయండి.
- ఒక మంచం కోళ్ళకు రాగిమేకులు కొట్టి, ప్రతిరోజు ఆ మంచం మీదనే నిద్రించండి.

**ద్వితీయ భావంలో :-**

- ఇంటిపునాదిలో వెండి ఇటుకను పాతిపెట్టండి.
- ప్రతిరోజు తల్లికి నమస్కరించి, ఆమె ఆశీర్వాదం తీసుకోండి.
- పార్వతీదేవిని పూజించండి.

**తృతీయ భావంలో :-**

- ప్రతి బుధవారం అన్నదానం చేయండి. కనీసం 7 బుధవారాలు వరుసగా అన్నదానం చేయాలి.
- గోధుమపిండి, బెల్లం కలిపిన ఉండలను పేదపిల్లలకు పంచండి. ఈ విధంగా వరుసగా 43 రోజులు చేయాలి.
- ప్రతిదినం దుర్గాస్తోత్రం చేయండి.
- పేదపిల్ల పెళ్ళికి సాయం చేయండి.

**చతుర్థ భావంలో :-**

- వస్త్రవ్యాపారంలో రాణిస్తారు. అయితే అది మీతల్లి పేరుమీద ఉండాలి.
- పాలు, బియ్యం, వెండి అమ్మవద్దు.

**పంచమ భావంలో :-**

- ప్రతిదినం అమ్మవారి గుడికి వెళ్ళండి.
- ప్రతిసోమవారం శివాలయంకు వెళ్ళండి.

**షష్టమ భావంలో :-**

- కుందేళ్ళను పెంచండి.
- వ్యక్తిగత విషయాలు వేటినైనా ఎవరితోనూ చర్చించవద్దు.

**సప్తమ భావంలో :-**

- ప్రతిదినం లక్ష్మీస్తోత్రం చేయండి.
- 25 సం॥ల తరువాత వివాహం చేసుకొనుట మంచిది.

**అష్టమ భావంలో :-**

- స్మశానవాటికలో నీటిపంపును పెట్టించండి.
- మసూర్ పప్పు దానం చేయండి.
- ప్రతిదినం రావిచెట్టుకు నీరు పోయండి.
- శివాలయంలో నైవేద్యముకు శనగలు ఇవ్వండి.

**నవమ భావంలో :-**

- పుణ్యక్షేత్రాలను దర్శించండి.
- ప్రతిరోజు పంచాక్షరిని పఠించండి.

**దశమ భావంలో :-**

- నిద్రించుటకు ముందు తల వద్ద ఒక ఇత్తడిపాత్రలో పాలు పోసి ఉంచి, మరునాటి ఉదయం ఆ పాలను పూలకుండీలో లేదా ఏదైనా చెట్టు మొదట్లో పోయండి.
- రాత్రిపూట పాలు త్రాగవద్దు.

**ఏకాదశ భావంలో :-**

- మీకు అబ్బాయి పుడితే, మీ అమ్మగారు మనవడిని 43 రోజుల వరకు చూడరాదు.
- పాలకోవా బిళ్ళలును పిల్లలకు పంచండి. ఈ విధంగా వరుసగా 43 రోజులు చేయాలి.
- ప్రతిరోజు శివునికి క్షీరాభిషేకం చేయండి.

**ద్వాదశ భావంలో :-**

- ఒక పెద్ద పాత్రనిండా వర్షపునీరు పట్టండి. దానిలో వెండితో చేసిన 4 గోళీలు వేసి, ఆ పాత్రను ఇంటికప్పు క్రింద ఉంచండి.

## 49. చంద్రహోర

చంద్రహోరకు అధిపతి చంద్రుడు. సోమవారం రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రములను కలిగియున్న రోజులలో చంద్రహోర సమయంలో చంద్రుని ప్రభావం ఎక్కువగా వుంటుంది.

రైతులు వ్యవసాయం ప్రారంభించుటకు, మొక్కలు నాటటానికి, బావులు, కాలువలు త్రవ్వటానికి, పాల ఉత్పత్తులకు, నూనెలు అమ్ముటకు చంద్రహోర ప్రభావం ఎక్కువగా ఉంటుంది.

సోమవారం, శుక్రవారాలలో చంద్రహోర సమయములో సంగీతం నేర్చుకొనుటకు, పాటలకు ట్యూను కట్టుటకు మంచికాలం. ఇలాగే మంగళవారంలోని చంద్రహోర కాలం తబలా, మద్దెల వంటి వాయిద్యములు నేర్చుకొనుటకు బుధవారంనాటి చంద్రహోర జలతరంగం నేర్చుకొనుటకు మంచి సమయాలు.

కఠినమైన స్త్రీ హృదయాన్ని కరిగించటానికి చంద్రహోర అనువైనది. సముద్రప్రయాణాలకు, చంద్రహోర శుభసమయం. నర్సుగా బాధ్యతలు తీసుకోవటానికి, రక్షణశాఖలో చేరటానికి, లేదా దుస్తులకు సంబంధించిన కంపెనీలో చేరుటకు చంద్రహోర ఉత్తమం.

మంగళవారంనాడు చంద్రహోరలో హోటళ్ళు లేదా డ్రింకుషాపులు ప్రారంభించుట మంచిది.

చంద్రహోరలో గౌరీదేవి, లలితను ప్రార్థించుట మంచిది.

# చంద్రహోర సమయం

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయం నుండి హోర సమయమును లెక్కిస్తారు. హోర కాలప్రమాణం ఒక గంట.

సూర్యోదయ, సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింది సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు | రాత్రి |
|---|---|---|
| ఆదివారం | 9-10,4-5 | 11-12 |
| సోమవారం | 6-7, 1-2 | 8-9, 3-4 |
| మంగళవారం | 10-11, 5-6 | 12-1 |
| బుధవారం | 7-8, 2-3 | 9-10, 4-5 |
| గురువారం | 11-12 | 6-7, 1-2 |
| శుక్రవారం | 8-9, 3-4 | 10-11, 5-6 |
| శనివారం | 12-1 | 7-8, 2-3 |

# 50. ధారణం

## చంద్రగ్రహ దోష నివారణకు రత్నధారణ

మానసిక ఆందోళన, వ్యాపారంలో నిలకడలేకపోవుట, తల్లిఆరోగ్యం క్షీణించుట వంటి సమస్యల పరిష్కారముకు ముత్యమును ధరిస్తారు. శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు మధుమేహము కలవారు ముత్యము ధరించుట ఉత్తమము.

**ముత్యము :-**

చంద్రునికి ధరించునది ముత్యము. అంతేకాక చంద్రునికి చంద్రకాంతమణి లేక Moon Stone ధరించవచ్చు.

సోమవారం, పూర్ణిమ, చంద్ర నక్షత్రం రోజున వెండి పాత్రలో ఒక చంద్రగ్రహ యంత్రాన్ని వుంచి దానిపై ముత్యము లేదా చంద్రకాంతమణిని వుంచాలి. చంద్రగ్రహ మంత్రము, శ్రీసూక్తంతో ఆ మణిని 10 రోజుల పాటు పాలలో, తేనెతో అభిషేకిస్తూ పూజించాలి. తరువాత ధరించాలి.

ముత్యమును ధరించలేనివారు చంద్రకాంతశిల, వైట్‌సఫైర్ వంటి ఉపరత్నములను ధరించవచ్చును.

రోహిణి, హస్త, శ్రవణం లు జన్మ నక్షత్రములయినవారు, కర్కాటకలగ్నం లేదా కర్కాటకరాశిలో పుట్టినవారు, చంద్రదశ నడుస్తున్న వారు ముత్యం ధరించవచ్చు.

**చంద్రగ్రహదోషనివారణకు రుద్రాక్ష ధారణ :-**

చంద్రగ్రహం అనుకూలం లేనివారు ద్విముఖరుద్రాక్షను ధరించవచ్చును.

**ద్విముఖ రుద్రాక్ష :-**

1. దీనిని అర్ధనారీశ్వరుని ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుటవలన మానసిక ఏకాగ్రత ఏర్పడుతుంది.
3. శివభక్తిని పెంపొందిస్తుంది.
4. రుద్రాక్షయందు రెండుధారలుంటాయి.

# చంద్ర గ్రహానుగ్రహం కోసం కవచం

ఒక రాగిరేకు ఇరువైపుల క్రింది యంత్రాలను చెక్కించాలి.

| పది | ఐదు | పన్నెండు |
|---|---|---|
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |
| ఏడు | రెండు | తొమ్మిది |
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |

| ఏడు | రెండు | తొమ్మిది |
|---|---|---|
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |
| పది | ఐదు | పన్నెండు |
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |

ఈ యంత్రమును "ఓం శ్రా శ్రీం శ్రౌం సః చంద్రమసే నమః" అను మంత్రమును లక్షసార్లు జపిస్తూ పూజించాలి. తరువాత మెడలో లాకెట్‌గా ధరించిన వ్యాపారాభివృద్ధి, సంతానప్రాప్తి, విద్యాభివృద్ధి జరుగుతుంది.

## 51. దానం

## చంద్ర మహాదశలో చేయదగిన దానాది విశేషాలు

1. చంద్ర మహాదశలో చంద్ర అంతర్దశ - తెల్లని ఆవు
2. చంద్ర మహాదశలో కుజ అంతర్దశ - నాగప్రతిమ
3. చంద్ర మహాదశలో కేతు అంతర్దశ - మేకప్రతిమ
4. చంద్ర మహాదశలో రాహు అంతర్దశ - మేకప్రతిమ
5. చంద్ర మహాదశలో బుధ అంతర్దశ - లక్ష్మీవిష్ణురూపు
6. చంద్ర మహాదశలో గురు అంతర్దశ - దుర్గారూపు
7. చంద్ర మహాదశలో శుక్రఅంతర్దశ - తెల్లని ఆవు
8. చంద్ర మహాదశలో రవి అంతర్దశ - దుర్గాప్రతిమ
9. చంద్ర మహాదశలో శని అంతర్దశ - గేదె

ఈ ఆకారాలలో వెండితో యథాశక్తి ప్రతిమలు చేయించి దానం ఇవ్వడం శ్రేష్ఠం.

# 52. పారాయణం

క్రింది సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన చంద్రగ్రహానుగ్రహం పొందవచ్చును.

## పారాయణ స్తోత్రాలు

1. చంద్ర అష్టోత్తర శతనామావళి/భవానీ స్తోత్రం/అర్గళాస్తోత్రం
2. చంద్రగ్రహమంగళాష్టకం/లలితా పంచకం/మీనాక్షి స్తోత్రం
3. లలితా మంత్రకవచం/దేవీషట్కం
4. నవదుర్గాస్తోత్రం/శ్రీవిద్యాకవచం/దుర్గాస్తవం
5. శారదాస్తుతి/భవానీ అష్టకం/భ్రమరాంబికాస్తవం
6. దుర్గాష్టోత్తర శతనామావళి/దుర్గాసూక్తం
7. దేవీఖడ్గమాల/దుర్గాస్తుతి/చంద్రగ్రహమంగళాష్టకం
8. దుర్గా ద్వాత్రింశన్నామమాల/దేవీకవచం
9. చండీధ్యానం/దుర్గాకవచం/దుర్గా ఆపదుద్ధారకస్తోత్రం
10. చంద్ర కవచస్తోత్రం/దేవీసూక్తం.

చంద్ర మహాదశలో సుందరకాండ పారాయణ-5 సర్గ ఉత్తమ ఫలితం కలిగిస్తుంది. పూజ : కృష్ణునకు, నైవేద్యం : పాలు,

1. చంద్ర మహాదశలో చంద్ర అంతర్దశ =
   పారాయణ : ఉత్తరకాండ 53-54 సర్గలు
   నైవేద్యం : పాలు/పంచదార/పాయసం
2. చంద్ర మహాదశలో రవి అంతర్దశ=
   పారాయణ: ఉత్తరకాండ 53-54 సర్గలు
   నైవేద్యం : బెల్లం-కందిపప్పు పొంగలి
3. చంద్రమహాదశలో కుజ అంతర్దశ=
   పారాయణ : బాలకాండ 19-20-21-22 సర్గలు
   నైవేద్యం : బెల్లం-కందిపప్పు పొంగలి.
4. చంద్రమహాదశలో బుధ అంతర్దశ=
   పారాయణ : 26-27-28-29-30 సర్గలు
   నైవేద్యం : తాంబూలం లేక ఆకుపచ్చద్రాక్ష

5. చంద్రమహాదశలో గురు అంతర్దశ=
పారాయణ : బాలకాండ ప్రథమసర్గ
నైవేద్యం : అరటిపళ్ళు (కర్పూర చక్రకేళి)
6. చంద్రమహాదశలో శుక్ర అంతర్దశ=
పారాయణ : యుద్ధకాండ 121 సర్గ
నైవేద్యం : పటికబెల్లం/పంచదార గుళికలు
7. చంద్రమహాదశలో శని అంతర్దశ=
పారాయణ : అరణ్యకాండ 30 సర్గ
నైవేద్యం : నేరేడు/నల్లద్రాక్ష
8. చంద్రమహాదశలో రాహు అంతర్దశ=
పారాయణ : బాలకాండ 49 సర్గ
నైవేద్యం : ఎండుద్రాక్ష/తేనె
9. చంద్రమహాదశలో కేతు అంతర్దశ=
పారాయణ : అరణ్యకాండ 6 సర్గ
నైవేద్యం : కొబ్బరికాయ/ఖర్జూరం

## 53. సందర్శనం

గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన పుణ్యక్షేత్రాలను తరచు సందర్శించడం ఉత్తమం.

## దర్శించదగిన క్షేత్రాలు

1. తూర్పుగోదావరి జిల్లాలోని మురమండలో వీరేశ్వరస్వామి/కామరగిరి (ఐ.పోలవరం)లో వేణుగోపాలస్వామి.
2. తూర్పుగోదావరిజిల్లా వెల్ల (రామచంద్రపురం)లో సోమేశ్వరస్వామి.
3. తూర్పుగోదావరిజిల్లా సహాపురం వేణుగోపాలస్వామి
4. తూ.గో.జిల్లా సుదరబాదలో (రాయవరం) వేణుగోపాలస్వామి.
5. పశ్చిమ గోదావరి జిల్లా ఇరగవరంలో పాలేశ్వరస్వామి.
6. పశ్చిమ గోదావరి జిల్లా జుత్తిగ ఉమావాసుకీ సోమేశ్వరస్వామి.

7. పశ్చిమగోదావరిజిల్లా గునుపూడి (భీమవరం)లో సోమేశ్వరస్వామి.
8. విశాఖపట్నం జిల్లా పంచదార్లలో శ్రీ సోమేశ్వరాలయం (ధర్మలింగేశ్వరుడు).
9. తూర్పుగోదావరిజిల్లా కోటిపల్లిలో సోమేశ్వరస్వామి.
10. కృష్ణాజిల్లాలోని మొవ్వ, హంసలదీవి, ఘంటసాలల్లో వేణుగోపాలస్వామి.
11. కృష్ణాజిల్లాలోని బందరు దరి చిలకల పూడిలో పాండురంగస్వామి.
12. కృష్ణాజిల్లా పెదకళ్లేపల్లిలో దుర్గాదేవి.
13. విజయవాడ-దుర్గామల్లేశ్వరస్వామి ఆలయం.
14. నల్గొండజిల్లా కొలనుపాక (ఆలేర్) వేణుగోపాలుడు
15. నల్గొండజిల్లా ప్రానుగల్లులో ఛాయాసోమేశ్వరుడు.
16. ఆదిలాబాద్‌జిల్లా బుగ్గరామేశ్వరం-రామేశ్వరుడు.
17. చిత్తూరుజిల్లా నగరిలో మహిషమర్దని.
18. యావద్భారత విఖ్యాత దేవాలయం-కలకత్తా కాళికాంబ ఆలయం.
19. మహారాష్ట్రంలోని పండరీపురం విఠలుడు.
20. తమిళనాడు కుంభకోణం వద్ద తిరంగళ్లూర్
21. ఉత్తరప్రదేశ్ మధుర బృందావనంలో కృష్ణాలయం
22. కర్నాటకలో ఉడుపి-శ్రీకృష్ణాలయం.
23. కేరళలో గురువాయూర్-కృష్ణాలయం
24. ఒరిస్సా-పూరీలోని జగన్నాథాలయం.
25. కేరళ త్రివేంద్రం-అనంత పద్మనాభుడు.

## అష్టాదశ శక్తిపీఠాలు

**1. శ్రీలంక (శాంకరీదేవి) :-** అష్టాదశ శక్తిపీఠాల్ని వర్ణించే శ్లోకంలో తొలిపాదం 'లంకాయాం శాంకరీదేవి' అన్నారు. గాని నేటి శ్రీలంకలో ఎక్కడా శాంకరీదేవి ఆలయమే లేదు. ప్రకృతి బీభత్సాలవల్ల-విదేశీ దురాక్రమణంవల్ల చాలా ప్రాచీన ఆలయాలు శిధిలాలై ఉండవచ్చు! అక్కడక్కడ శివుని సన్నిధిన పార్వతిని నిలిపిన ఆలయాలు శ్రీలంకలో ఉన్నా, శాంకరీదేవిగా గుర్తించదగ్గ ఆధారాలు లభించుట లేదు. అయినా గౌరి/పార్వతి/దుర్గ శకి అంశలే గనుక లంకలో ఈ దేవి దర్శనం ఎక్కడ లభించినా అమ్మవారి దర్శనం అయినట్లే భావించాలి.

**2. కాంచీపురం (కామాక్షి) :-** తమిళనాడులోని చెంగల్పట్ జిల్లాలో చెన్నైకి 70 కి.మీ దూరంలో ఉంది కంచి. దీన్ని సప్తమోక్షపురాల్లో ఒకటిగా అభివర్ణిస్తారు. 3 గోపురాలు గల గొప్ప ఆలయం. ఆదిశంకరాచార్యులు ఇచట శ్రీచక్రాన్ని స్థాపించి నారని ప్రతీతి. శ్రీమహావిష్ణువు సన్నిధిలో, కామాక్షి ఏకాంబరేశ్వరుని ప్రార్థించి ప్రసన్నుని చేసుకున్న పుణ్యస్థలం.

**3. గంగాసాగర్ (శృంఖం/గంగ) :-** భారతదేశం పైకి ముస్లింల దండయాత్రల ఫలితంగా నాశనమైన చాలా ప్రాంతాలు కాలక్రమేణా వాటి ఉనికితోపాటు, నామ ధేయాది రూపు రేఖల్ని కూడా కోల్పోయాయి. 'ప్రద్యుమ్నే శృంఖలాదేవీ' అని శ్లోక పాదంలో ఉంది. నేటి బెంగాల్‌ను ప్రద్యుమ్న దేశంగా గుర్తించగలిగినప్పటికీ కలకత్తాకు 135 కి.మీ దూరంలో ఉన్న గంగా సాగర్‌నే శక్తిపీఠ క్షేత్రంగా పరిగణిస్తు న్నారు. ఇక్కడ పావనగంగ సముద్రునితో సంగమిస్తున్నందున పవిత్ర తీర్థస్థలమైనది. ప్రస్తుతానికిదే శక్తిపీఠక్షేత్రం.

**4. మైసూర్ (చాముండి) :-** కర్నాటక రాష్ట్రంలో మైసూర్‌కు 13కి.మీ దూరంలో చాముండీ కొండపై వెలసిన అమ్మవారు మహిషుడనే రాక్షసుడిని వధించినందున మహిషూర్ కాలక్రమేణా మైసూర్‌గా మారిందంటారు. ఈ దేవి మైసూర్ మహారాజుల ఆరాధ్యదేవత కూడ.

**5. అలంపూర్ (జోగులాంబ) :-** మన రాష్ట్రంలోనే మహబూబ్‌నగర్ జిల్లా (40కి.మీ కర్నూలుకు) యందున్న శక్తిపీఠం. స్వామివారు బాల బ్రహ్మేశ్వరుడు. ఇక్కడ సప్తమాతృకలకు, నవబ్రహ్మలకు కూడా విగ్రహాలున్నాయి. ఇక్కడే గుడిగోడలో రససిద్ధి వినాయక విగ్రహాన్ని కూడా చూడవచ్చు! తుంగభద్రా, కృష్ణానదుల సంగమస్థలం.

**6. శ్రీశైలం (భ్రమరాంబిక) :-** మన రాష్ట్రంలోనే డోర్నాల నుంచి 52కి.మీ. ఘాట్ రోడ్డుపై ప్రయాణించి ఇక్కడకు చేరుకోవచ్చు. ఛత్రపతి శివాజీ కొలిచిన అమ్మవారు. అరుణాసురుడనే రాక్షసుని అమ్మవారు భ్రమర రూపం ధరించి సంహరించినందున ఈ పేరు వచ్చింది. అమ్మవారికి మాధవి అనీ, సర్వమంగళ అనీ పేర్లున్నాయి.

**7. కొల్హాపూర్ (మహాలక్ష్మి) :-** మహారాష్ట్రలో పన్హానుండి 18కి.మీ, రత్నగిరి నుండి 125 కి.మీ. పూనానుండి గోవా వెళ్ళే రైలు మార్గంలో ఉంది. షోలాపూర్‌నుండి బస్సులో రైల్లోనూ ఇక్కడకు వెళ్ళవచ్చు. ఇక్కడ మహాలక్ష్మిని భవానీ మాతగా

కొలుస్తారు. దేహరంగు పసుపు, ముఖం మాత్రం నలుపురంగు స్వామివార్ని 'జ్యోతిభా' అంటారు. ఈ ఆలయం ఇక్కడ్నుంచి 20కి.మీ. దూరంలో ఉంది.

**8. మాహోర్ (ఏకవీరిక) :-** మహారాష్ట్రలోనే ఇంకో శక్తిపీఠ క్షేత్రం మాహోర్‌లో ఉంది. నాందేడ్ జిల్లా కేంద్రం నుండి ఇక్కడకు 128 కి.మీ. ఇక్కడ ఉన్న మూడు కొండశిఖరాల్లో ఒకదానిపై అమ్మవారు వేంచేసి ఉన్నారు. క్షుద్రవిద్యలు పొందగోరు వారిని ఈ దేవి కరుణిస్తుందని ఒక నమ్మకం. గంగసింధూరంతో నిండి ఎర్రగా కనిపించే భీకరరూపం. తల మాత్రమే ఉంటుంది. కొందరు రేణుకా మాతగా కొలుస్తారు.

**9. ఉజ్జయిని (మహాకాళి) :-** మధ్యప్రదేశ్‌రాష్ట్రంలోని ఇండోర్ నుంచి ఉజ్జయినికి 55 కి.మీ అవంతిక క్షేత్రం అని పిలిచే ఈ ప్రాంతాన్ని షిప్రానదీ తీరంలో చూడవచ్చు. మహాకవి కాళిదాసు యిక్కడే అమ్మవార్ని ఆరాధించి వరప్రసాద సిద్ధుడయ్యాడు. ఇక్కడ అమ్మవారి ఆలయం పట్టణం మధ్యలో వున్నది. ఈ క్షేత్రం పృధ్వీదేవతకు నాభిస్థానం అంటారు.

**10. పిఠాపురం (పురుహూతిక) :-** మనరాష్ట్రంలోనే ఉన్న శక్తిపీఠక్షేత్రం. దీనిని పాదగయా క్షేత్రం అని కూడా అంటుంటారు. ప్రస్తుతం ఇక్కడ మూడు ఆలయాల్లోను అమ్మవారున్నారు. అసలు పురుహూతిక మాత విగ్రహం ఏనాడో భూస్థాపితం అయిందని స్థానికుల కథనం. కనుక ఇక్కడ గల రాజ్యలక్ష్మీదేవి, కుక్కుటేశ్వర ఆలయం, సుబ్రహ్మణ్యాలయం మూడింటినీ దర్శించవచ్చు.

**11. జాజ్‌పూర్ (గిరిజ) :-** ఒరిస్సా రాష్ట్రంలో ఉన్న జాజ్‌పూర్ రోడ్ రైల్వేస్టేషన్ నుండి ఈ శక్తి పీఠ క్షేత్రానికి చేరుకోవచ్చు. హౌరా-విశాఖపట్నం రైల్వే లైన్‌లో ఉంది. ఈమె వెలసి వున్న గ్రామాన్ని వైతరణి అంటారు. మహాలక్ష్మి, పార్వతి అంశలు గల అమ్మవార్ని గిరిజాదేవి అని కూడా అంటారు. ఇక్కడ పితృదేవతలకు పిండప్రదానాలు చేయవచ్చు! కటక్ నుంచి నేరుగా బస్సులున్నాయి.

**12. ద్రాక్షారామం (మాణిక్యాంబ) :-** మన రాష్ట్రంలోనే ఉన్న ఇంకొక శక్తిపీఠ క్షేత్రం ఇది. తూర్పుగోదావరి జిల్లాలో ఉంది. కాకినాడ నుండి 32కి.మీ. రాజమండ్రి నుండి 60 కి.మీ. ఈ అమ్మవారిని సతీదేవి అవతారంగా కొలుస్తారు. 108 శక్తి పీఠక్షేత్రాలలో ఇదీ ఒకటి. ఇక్కడ స్నానం పుణ్యప్రదం.

**13. గౌహతి (కామాఖ్య) :-** అస్సాం రాష్ట్రంలో. ఉన్న శక్తి పీఠక్షేత్రం. శ్లోకపాదంలో హరిక్షేత్రే కామరూపీ' అని ఉంటుంది. ఈ క్షేత్రం గౌహతి నగరానికి 8 కి.మీ

దూరంలో నీలాచలంకొండ మీద ఉంది. శివుడు మన్మథుని మసిచేసిన చోటుగా అభివర్ణిస్తారు. ప్రాచీనకాలంలో ప్రాగ్జ్యోతిష్యపురం (కామరూప) ఇదే! అమ్మవార్ని ఇక్కడ తాంత్రిక శక్తిగా ఆరాధిస్తారు. ఇక్కడ అమ్మవారికి బహిష్టు ఉన్నట్లుగా నిరూపించే నిదర్శనాలున్నాయి. ప్రతినెలలోనూ 4రోజులు దేవాలయం మూసి ఉంటుంది. ఐదోరోజు ఆలయం తెరిచేవేళ విగ్రహం క్రిందనుంచి ఎర్రటి ఈను బైటికొస్తుంది. ఇక్కడ నవగ్రహాలయాలున్నాయి.

**14. ప్రయాగ (మాధవి)** :- ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాద్ నగరం వద్దగల ప్రయాగ క్షేత్రం అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటిగా ప్రసిద్ధి. ఇక్కడ అమ్మవారిని మాయాదేవి అని కూడా పిలుస్తారు. శ్రీచక్రస్వరూపిణి. విగ్రహం లేదు. ఇది త్రివేణీ సంగమ క్షేత్రం. కుంభమేళా 12 సం॥ల కొకసారి ఇక్కడ జరుగుతుంది. గ్రహదోష నివారణార్థం ప్రత్యేక పూజలు జరుపుకోగల ఏర్పాట్లున్నాయి.

**15. జమ్ము (వైష్ణవి)**:- జమ్ము అండ్ కాశ్మీర్ రాష్ట్రంలో గల శక్తి పీఠం. జమ్మునుంచి కాట్రాకు 46కి.మీ. అక్కడనుంచి బాణగంగ మీదుగా వైష్ణోదేవి ఆలయానికి 14 కి.మీ. కాలినడకన గాని, చిన్న డోలీలపై గాని వెళ్ళవచ్చు! ఇక్కడి అమ్మవారిని 'త్రికూట భగవతి' అంటారు.

**16. గయ (మంగళగౌరి)**:- బీహార్ రాష్ట్రంలోని పాట్నానుండి 73కి.మీ ఔరంగాబాద్ నుండి బస్సులో ధనబాద్ నుంచి రైల్లో గయ వెళ్ళవచ్చు! శ్రాద్ధకర్మలకు గయ ప్రసిద్ధమైనది. ఇక్కడ శ్రీవిష్ణుపాదాలయం కూడా కలదు. చంద్రాంశలో విష్ణు అవతారమైన శ్రీకృష్ణుడు జన్మించినందువలన ఈ క్షేత్రదర్శనమే సర్వపాపహారం. ఇక్కడ ఫల్గుణీనది అంతర్వాహిని. మధుర, శ్వేత నదుల సంగమస్థలం. అమ్మవారు- మంగళగౌరి లేక సర్వమంగళాదేవి.

**17. వారణాశి (విశాలాక్షి)**:- ఉత్తరప్రదేశ్‌లోని వారణాశి 'కాశీ'గా సుప్రసిద్ధం. సప్తమోక్ష పురాలలో ఇదొకటి. ఇక్కడకు దగ్గర్లోనే మాతా అన్నపూర్ణేశ్వరీ ఆలయం కూడా ఉంది. ఇక్కడ పవిత్ర గంగాస్నానం చేయడం ముక్తిదాయకం. గ్రహదోష నివారకం. కాశీలో పితృదేవతలకు పిండప్రదానాదులు చేయుట కూడా ఎంతో పుణ్యమని విశ్వాసం.

**18. కాశ్మీర్ (సరస్వతి)**:- జమ్ము అండ్ కాశ్మీర్ రాష్ట్రంగా ప్రస్తుతం పిలువ బడుతున్న కాశ్మీర్ ముస్లిమ్‌ల దురాక్రమణలతో దాడులతో పూర్వపు వైభవాన్ని కోల్పోయింది.

ఒకప్పుడిక్కడ సరస్వతీ శక్తిపీఠం ఉండేచోట నేడు మసీదులు కనిపిస్తున్నాయి. ఆది శంకరాచార్యులవారు ఈ రాష్ట్రం సందర్శించినప్పుడు, ఇక్కడి సువర్ణ శారదాంబకు పూజలు జరుగుట లేదని గుర్తించి, ఈ అమ్మవారినే కర్ణాటకలోని శృంగేరి తరలించి పునః ప్రతిష్ఠించారని, కనుక మనం ఈ శక్తిపీఠ క్షేత్రాన్ని దగ్గరలోని ఉన్న కర్ణాటక రాష్ట్రంలోనే దర్శించవచ్చునని గ్రహించవచ్చు.

(శక్తిపీఠ క్షేత్రాల్ని సూచించే శ్లోకం ప్రకారం ఆయా పీఠాలను వెదకి పట్టుకోగల అవకాశం ఇప్పటి భారతదేశంలో అసాధ్యం! ఎన్నో మార్పు చేర్పులకు, విదేశీ దురాక్రమణలకు, ముఖ్యంగా ముస్లిందాడులకు గురై ఉనికినే కోల్పోయిన కొన్ని శక్తిపీఠ క్షేత్రాలవల్ల సంశయాస్పద పరిస్థితులు నెలకొన్నాయి. ఈ నేపథ్యంలో కొన్ని అమ్మవారి క్షేత్రాలు, అవేశక్తిపీఠ క్షేత్రాలుగా చెలామణీ అవుతు న్నాయి. ఎక్కడున్నా ఏ క్షేత్రమైనా భక్తుల్ని దయజూసే అమ్మవారి రూపాలను భేదం యెంచక భక్తి మాత్రమే ముఖ్యమనుకోగలవారికి మరికొన్ని వివరాలు ఇవి.

**1. గిరిజ (అహోబిలం):-** ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలోనే ఆళ్ళగడ్డకు 30కి.మీ. దూరంలో ఉంది. నిజానికి ఇది నారసింహ క్షేత్రంగా ప్రసిద్ధి, కానీ శ్రీచక్ర ప్రతిష్ఠ వల్ల లోపల భూగర్భంలో దేవీ ఆలయం ఉందంటారు. ఇక్కడ నృసింహానికి ఫాలలోచనం ఉండటం ఒక విశేషం. నల్లమల కొండల్లో ఉన్న అహోబిలం ఆదిశేషుని నడుముపై ఉన్నట్లు ఒక భావన. కనుకనే గ్రహదోష నివారణ పొందగోరువారిక్కడ గిరిజాసమేత హరిహర మూర్తిని దర్శించుకోగలరు.

**2. మహామాయ (ఖాట్మండ్) :-** నేపాల్ రాజధాని ఖాట్మండ్ వద్ద గల సతీదేవి (పార్వతీదేవి) ఆలయం శక్తిపీఠ క్షేత్రంగా విరాజిల్లుతున్నది. ఇక్కడ ఇప్పటికీ జంతుబలుల ఆచారాన్ని చూడవచ్చు! అవకాశం ఉన్నవారు గ్రహదోష నివారణార్థం ఇక్కడి మహామాయ అనబడే గుహ్యేశ్వరిని దర్శించవచ్చు!

**3. వజ్రేశ్వరి (కాంగ్డా):-** హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలో ఉంది. కాంగ్డా జిల్లా కేంద్రం నుంచి 20కి.మీ. అమ్మవారు జ్వాలాముఖి. వజ్రేశ్వరిగా వాడుక. ఇక్కడ సతీదేవి శిరస్సు పడిన ప్రదేశం అంటారు.

**4. గౌరి (కనోజ్) :-** కన్యాకుబ్జంగా ప్రసిద్ధనగరం. ఉత్తరప్రదేశ్‌లోని ఫరూఖాబాద్ జిల్లాలో ఉంది. అమ్మవారు గౌరీదేవి. చంద్రగ్రహ దోషనివృత్తికి దర్శించదగ్గ అమ్మవారు.

**5. జ్వాలాముఖి (హిమాచల్‌ప్రదేశ్) :-** వైష్ణవీదేవి, విద్యేశ్వరీదేవి. ఇక్కడ అమ్మవారు మంటల రూపాన దర్శనం ఇస్తుంది. కనుకనే జ్వాలాముఖి అంటారు. ఆలయం

కాళీధర్ పర్వతంమీద ఉంది. ఆలయం గదులు గదులుగా సాగుతుంది. ఈ గదుల గోడలకు అక్కడక్క అగ్గిపుల్ల వెలిగించి చూపిస్తే మంటలు వస్తాయి. ఆలయానికి సమీపంలో వేడినీటి ఊటలు కూడా ఉన్నాయి. పాలు, హల్వా, కోవా ప్రసాదంగా ఇస్తారు. ముస్లింల ప్రభావం ఇక్కడ కూడా ఉన్నది.

## ప్రధానంగా అమ్మవారు వెలసిన 12 క్షేత్రాలు

| క్షేత్రం | అమ్మవారు | రాష్ట్రం |
|---|---|---|
| 1. శ్రీశైలం | భ్రమరాంబిక | ఆంధ్రప్రదేశ్ |
| 2. కన్యాకుమారి | కన్యక | తమిళనాడు |
| 3. కంచి | కామాక్షి | తమిళనాడు |
| 4. గయ | మంగళగౌరి | బీహార్ |
| 5. ఖాట్మండ్ | గుహ్యేశ్వరి | నేపాల్ |
| 6. తారాపీఠ్ | తారకేశ్వరి | పశ్చిమబెంగాల్ |
| 7. ఉజ్జయిని | మహాకాళి | మధ్యప్రదేశ్ |
| 8. ప్రయాగ | లలితాదేవి | ఉత్తరప్రదేశ్ |
| 9. కాశీ | విశాలాక్షి | ఉత్తరప్రదేశ్ |
| 10. వింధ్యాచల్ | వింధ్యవాసిని | ఉత్తరప్రదేశ్ |
| 11. జునాగఢ్ | అంబాజి | గుజరాత్ |
| 12. కొల్హాపుర్ | మహాలక్ష్మి | మహారాష్ట్ర |

ఇంకా.... అంబాత్రయంలో మిగిలిన ఇద్దరు అమ్మవార్ల (ఒకరు-శ్రీశైల భ్రమరాంబిక) దర్శనం అఖండపాప సంహారణదాయకం. వారు: మూకాంబిక, జ్ఞాన ప్రసూనాంబిక.

**జ్ఞానప్రసూనాంబిక :-** ఈ దేవిదర్శనం మనకు మనరాష్ట్రంలోనే చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తిలో లభిస్తుంది. ఆదిశంకరాచార్యుల వారిచట శ్రీచక్రస్థాపన చేశారు. ఈ ఆలయంలో గ్రహపూజలకు ప్రత్యేక ఏర్పాట్లున్నాయి.

**మూకాంబిక :-** కర్ణాటక రాష్ట్రంలో షిమోగా జిల్లాలోని కొల్లూర్ గ్రామంలో వెలసిన అమ్మవారు, దుర్గా- మహాలక్ష్మి అవతారం. చతుర్భుజి-శంఖం చక్రధారిణి.

ఇక్కడ గణపతికి, విష్ణుమూర్తికి కూడా శివునికి వున్నట్లుగా పానవట్టాలు ఉంటాయి. గ్రహదోష నివారణార్థం ఈ దేవిని కూడా దర్శిస్తారు.

# 54. చంద్రగ్రహ అర్చనం

చంద్రగ్రహదోషమున్న చంద్రగ్రహజపంను తగు సంఖ్యలో చేయుట, చంద్రగ్రహ హోమం చేయించుట ఉత్తమమైన ఆర్యోక్తి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౩ | ౨ | ౯ | ౫ | ౪ | ౭ | ౮ | ౬ |
| ౭ | ౮ | ౬ | ౧ | ౩ | ౨ | ౯ | ౫ | ౪ |
| ౯ | ౫ | ౪ | ౭ | ౮ | ౬ | ౧ | ౩ | ౨ |
| ౮ | ౬ | ౭ | ౫ | ౪ | ౯ | ౩ | ౨ | ౧ |
| ౫ | ౪ | ౯ | ౩ | ౨ | ౧ | ౮ | ౬ | ౭ |
| ౩ | ౨ | ౧ | ౮ | ౬ | ౭ | ౫ | ౪ | ౯ |
| ౨ | ౧ | ౩ | ౪ | ౯ | ౫ | ౬ | ౭ | ౮ |
| ౬ | ౭ | ౮ | ౨ | ౧ | ౩ | ౪ | ౯ | ౫ |
| ౪ | ౯ | ౬ | ౫ | ౭ | ౮ | ౨ | ౧ | ౩ |



## చంద్ర యంత్రము

వం

క్షం యం

షం వం

రం హం

లం

ఓం యంత్ర రాజాయ విద్మహే మహా యంత్రాయ ధీమహి ... శ్చంద్రప్రచోదయాత్ ॥

శం రాం

అం ఆం
ఓం
ఇం ఈం
చం
ఉం ఊం

# చంద్రగ్రహ జపము

**చంద్ర మంత్రము :-**

అస్యశ్రీ చంద్రగ్రహ మహామంత్రస్య గౌతమ ఋషిః చంద్రోదేవతా, గాయత్రీ ఛందః చంద్రగ్రహప్రసాద సిద్ధ్యర్థం అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత చంద్రగ్రహ మహామంత్ర జపం కరిష్యే!

**కరన్యాసం :-**

ఓం ఆప్యాయస్వ - అంగుష్ఠాభ్యాం నమః
ఓం సమేతుతే - తర్జనీభ్యాం నమః
ఓం విశ్వతః - మధ్యమాభ్యాం నమః
ఓం సోమవృష్టియం - అనామికాభ్యాం నమః
ఓం భవావాజస్య - కనిష్ఠికాభ్యాం నమః
ఓం సంగథే - కరతల కరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసం :-**

ఓం ఆప్యాయస్వ - హృదయాయ
ఓం సమేతుతే - శిరసే స్వాహా
ఓం విశ్వతః - శిఖాయై వషట్
ఓం సోమవృష్టియం - కవచాయ హుం
ఓం భవావాజస్య - నేత్ర త్రయాయ హుం
ఓం సంగథే - అస్త్రాయ ఫట్

**ధ్యానం :-**

**దధిశంఖతుషారాభం క్షీరార్ణవ సముద్భవం ।**
**నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్ ॥**

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోప హార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

**అధిదేవతా:-**

**అప్సు మే సోమో అబ్రవీదంతర్విశ్వాని భేషజాః**
**అగ్నిం చ విశ్వ శంభువ మాపశ్చ విశ్వభేషజీః ॥**

**ప్రత్యధిదేవతా :-**

గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ
అష్టాపదీనవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్
(అధిదేవతా ప్రత్యధి దేవతా మంత్రములను-జపమునకు మొదట చివర.
ముమ్మారు/ఒకమారైనను జపించవలెను).

**వేదమంత్రము :-**

ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం భవా వాజస్య సంగథే ॥

## చంద్రగ్రహజపం చేసే విధానము

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహ వాచనము ను నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరించాలి.

**మండపమును ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగి పాత్రను ఉంచాలి. దానిపై తెల్లని ఒక మీటరు తెల్లని రంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై స్ఫటికంతో చేసిన చంద్రుని ప్రతిమను లేదా చంద్రయంత్రమును ఉంచాలి.

వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.

తదంగత్వేన ప్రతిమా శోధనాదికం కరిష్యే

అని సంకల్పం చెప్పి తరువాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహ ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః ॥

మంత్రం : ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః ।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్
శుక్రమసి జ్యోతిరసి తేజో-సి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవః ॥
మాధ్వీ ర్నస్సం త్వోషధీః । మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః ॥

మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః॥
మాధ్వీర్గావో భవంతు నః॥ తా శ్శర్కరా ఽభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాచ్ఛ్రేయాన్ప్రేయ సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః॥ ఉశతీరివ మాతరః॥
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మండపముపైకి పంచలోకపాలకులను, అష్టదిక్పాలకులను, ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నపుడు ఆయాస్థానములలో ఒక తమలపాకును, వక్కను, ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ ఉండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరిః ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

2. ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః। ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

*గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.*

## దిక్పాలకులు

**ఇంద్రః :- (1-7-10 మం) :-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః :- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః :- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్ఋతిః-** మూషుణః పరాపరా నిర్ఋతిర్దుర్హణావధీత్। పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ఋతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)**

ఇమంమే వరుణ శ్రుధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)**

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। అవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**కుబేరః :-**

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాశుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।
సాదన్యం విదత్స్యగ్ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

**చంద్ర :- (ఋ-1మం-91 సూ-16 మంత్రం)**

ఆప్యాయస్వేత్యస్య మంత్రస్య। గౌతమ ఋషిః। చంద్రోదేవతా। గాయత్రీఛందః। (మమః) యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత చంద్రగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే చంద్రగ్రహారాధనే వినియోగః॥

**ధ్యానశ్లో॥** అగ్నేయభాగే సరథో దశాశ్వశ్చాత్రేయజో యామున దేశజశ్చ।
ప్రత్యఙ్ముఖస్థశ్చతురస్రపీఠే గదాధరాంగో హిమవత్స్వభావః॥
శ్వేతాంబరశ్శ్వేతవపుః కిరీటీ శ్వేతద్యుతి ర్దండధరో ద్విబాహుః।
చంద్రోఽమృతాత్మా వరదః కిరీటీ శ్రేయాంసి మహ్యం విదధాతు దేవః॥

మంత్రం:- ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమవృష్ణియమ్। భవావాజస్య సంగధే॥ ఓం భూర్భువస్సువః। చంద్రగ్రహేహాగచ్ఛ। చంద్రగ్రహం। చంద్రగ్రహం శ్వేతవర్ణం శ్వేత గంధం శ్వేతపుష్పం శ్వేతమాల్యాంబరధరం శ్వేతచ్ఛత్ర ధ్వజరథ పతాకాదిశోభితం దివ్యరథ సమారూఢం మేరుం ప్రదక్షిణీ కుర్వాణం దశాశ్వ రథవాహనం ప్రత్యఙ్ముఖం ద్విభుజం దండధరం యామున దేశాధిపతిం ఆత్రేయస గోత్రం నందన సంవత్సర కార్తీక శుద్ధ చతుర్దశ్యాం కృత్తికా నక్షత్రజాతం కర్కాటక రాశ్యాధిపతిం ఇందువాసర ప్రయుక్తం కిరీటినం సుఖాసీనం పత్నీపుత్ర పరివార సమేతం గ్రహమండలే ప్రవిష్ట మస్మిన్నధికరణే సూర్య గ్రహస్యాగ్నేయ దిగ్భాగే సమచతురస్ర మండలే చంద్రగ్రహమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అధిదేవత - అపః:- (ఋ-1మం-23సూ-20మంత్రం)**

మంత్రం:- అప్సుమే సోమో అబ్రవీదంతరిశ్వాని భేషజా।
అగ్నిం చ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః॥

చంద్రగ్రహాధిదేవతా అపః సాంగాః సాయుధాః సవాహనాః సశక్తి పుత్ర పరివార సమేతాః చంద్రగ్రహస్య దక్షిణతః అపః ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధిదేవత - గౌరీ:-**

గౌరీ:-గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥ఈశానః:-
చంద్రగ్రహ ప్రత్యధిదేవతా గౌరీం సాంగాం సాయుధాం సవాహనం సశక్తి పుత్ర పరివార సమేతం చంద్రగ్రహ స్యోత్తరతః గౌరీమావాహయామి, స్థాపయామి, పూజయామి ॥

**ఈశాన :-**

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

**ఊర్ధ్వపురుషః :-**

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం - 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవానృక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాస్తు పురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

బ్రహ్మ :-

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్స్వధి తిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీ :-

సక్తుమివ తితఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః :- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరీ :- గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అశ్వనీ దేవతా :-**

త్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ధద్వితా॥

ఆదిత్ప్రత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతె దివా॥

అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఏషోఉషా అపూర్వ్యావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥

అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**గరుడః :-**

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్తోమ

ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ

యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్గ్ం స్యంగాని ధిష్ణియా

శ్శఫా యజాగ్ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥

గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ధన్వంతరిః :-**

ధన్వనాగా ధన్వనాఽఽ జిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।

ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥

ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఇంద్రాగ్నీం :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)**

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్

గ్రాహిర్జ గ్రాహ యదినైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥

ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్రుతి :** యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।

తమాహరామి నిర్ర్ఋతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥

నిర్రుతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**(శత్రుఫలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)**

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తా వరుణశ్చ మన్యుః।

ఛియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥

మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విశాఖా నక్షత్రమ్ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।

తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।

నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపా।

విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥

విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।

ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।

హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥

ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు

శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః

యజుర్వేద మావాహయామి। పూజయామి॥

**సామవేదము :-**

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।

నిహోతాసత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః

సామవేద మావాహయామి। పూజయామి॥

అధర్వణ వేదము :-

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అధర్వణ వేదాయ నమః॥
అధర్వణ వేదమావాహయామి। పూజయామి॥

## ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

దుర్గా :- ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః
నవః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గణపతి :- ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమమ్
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

క్షేత్రపాలకుడు:- క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనో మృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అభయంకరుడు:- యత ఇంద్ర భయామహే తతో నో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః॥
ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥
జాతకుని జన్మనక్షత్రమును ఆహ్వానించాలి.

తరువాత చంద్రునికి సంబంధించిన రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రములను ఆహ్వానించాలి.

రోహిణి :-

ప్రజాపతే రోహిణీ వేతు పత్నీ। విశ్వరూపా బృహతీ చిత్రభానుః।
సానోయజ్ఞస్య సువితే దధాతు। యథా జీవేమ శరదస్సవీరాః॥

రోహిణీ దేవ్యుదగా త్పురస్తాత్। విశ్వారూపాణి ప్రతిమోదమానా।

ప్రజాపతిగ్ం హవిషా వర్ధయంతీ। ప్రియాదేవానా ముపయాతుయజ్ఞమ్॥

రోహిణీ దేవతాం ప్రజాపతి మావాహయామి। స్థాపయామి. పూజయామి.

మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

హస్త:-

ఆయా తదేవస్సవితోపయాతు। హిరణ్యయేన సువృతారాథేన।

వహన్ హస్తగ్ం సుభగ్ం విద్మనాపసమ్। ప్రయచ్ఛం తం పపురిం పుణ్యమచ్ఛ।

హస్త: ప్రయచ్ఛ త్వమృతం వసీయః। దక్షిణేన ప్రతి గృహ్ణీమ ఏవత్।

దాతార మద్యసవితా విదేయ। యోనోహస్తాయ ప్రసువాతి యజ్ఞమ్॥

హస్తా నక్షత్ర దేవతాం అర్యమ్ణం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

శ్రవణ:-

శృణ్వంతి శ్రోణా మమృతస్యగోపామ్। పుణ్యామస్యా ఉపశృణోమివాచమ్।

మహీం దేవీం విష్ణుపత్నీ మజూర్యామ్। ప్రతీచీ మేనాగ్ం హవిషా యజామః।

త్రేధా విష్ణురురుగాయో విచక్రమే। మహీం దివం పృథివీమంతరిక్షమ్।

తచ్ఛ్రోణైతి శ్రవ ఇచ్ఛమానా। పుణ్యగ్గ్ శ్లోకం యజమానాయా కృణ్వతీ॥

శ్రవణ నక్షత్ర దేవతాం విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత చంద్ర నవగ్రహ దేవతాభ్యోనమః.

ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం

సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

**నైవేద్యం :- (పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)**

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంభృతం సఫలం దేవగృహ్యాతాం సర్వదేవతా:॥

ఓం భూర్భువస్సువ: భర్గోదేవస్య ధీమహి। ధియోయోన: ప్రచోదయాత్, సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి। తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

**ఓం, "ధాతా పురస్తాద్యముదాజహార శక్ర: ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్ర:।
తమేవం విద్యానమృత ఇహ భవతి। నాన్య: పన్థా: అయనాయ విద్యతే॥**

1. ఓం సహస్ర శీర్‌షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వత: పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణ: పర:॥
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణ: పర:॥

నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।

5. యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థ్సితః।

6. అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।

అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।

సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।

తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।

తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।

తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।

నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।

సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।

నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।

ఓం తత్పురోర్నమః॥ అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోऽధిపతిర్బ్రహ్మ శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోऽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోऽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యోऽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యోऽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యోऽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యోऽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యోऽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥
28. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥
29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥
30. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥
31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥1 య ఏవం వేద॥
32. యో౽ప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥
33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।
ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥
34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।
త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥
35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణో౽ధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥
36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥
37. తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమిన్ధతే విష్ణోర్యత్పరమం పదం॥
38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥
39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత చంద్రగ్రహ దేవతాభ్యోనమః దివ్యశ్రీ పుష్ప మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారం:-** చంద్రగ్రహ దేవతాభ్యో నమః ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోళికామారోపయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునఃనీరాజనం:-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపోऽహం పాపకర్మాऽహం పాపాత్మా పాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యథాశరణం నాస్తి
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥

చంద్ర నవగ్రహదేవతాభ్యో నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోऽచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

**ఉద్వాసన:-** "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేహనాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

చంద్ర నవగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటపములో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత చంద్ర నవగ్రహ దేవతా స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజ చేసి తరువాత చంద్రగ్రహజపము చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటుంటే "మమ" అని చెప్పాలి. "యాజమానస్య" అని చెప్పకూడదు. ఒకరు మరొకరికోసం జపం చేస్తుంటే యాజమానస్య అని చెప్పాలి. మమ అని చెప్పకూడదు.)

**చంద్రగ్రహ జపము :-**

ఆప్యాయస్యేత్యస్య మంత్రస్య। గౌతమ ఋషిః।
చంద్రో దేవతా। గాయత్రీ ఛందః। (మమ)

యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత చంద్రగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే చంద్రగ్రహ మూలమంత్ర జపం కరిష్యే॥

**కరన్యాసము :-**

1. ఆప్యాయస్వ - అంగుష్ఠాభ్యాన్నమః.
2. సమేతుతే - తర్జనీభ్యాన్నమః.
3. విశ్వతః - మధ్యమాభ్యాన్నమః.
4. సోమవృష్ణియం - అనామికాభ్యాన్నమః.
5. భవావాజస్య - కనిష్ఠికాభ్యాన్నమః.
6. సంగథే - కరతల కరపృష్ఠాభ్యాన్నమః.

**హృదయాదిన్యాసః :-**

ఆప్యాయస్వ - హృదయాయ నమః.
సమేతుతే - శిరసేస్వాహా.
విశ్వతః - శిఖాయై వషట్.

సోమవృష్ణియం - కవచాయ హుం.
భవావాజస్య - నేత్రత్రయాయ వౌషట్
సంగధే - అస్త్రాయ ఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

**ధ్యానం:-**

ఆగ్నేయభాగే సరథో దశాశ్వశ్చాత్రేయజో యామున దేశజశ్చ,
ప్రత్యఙ్ముఖస్థ శ్చతురశ్ర పీఠే గదాధరాంగో హిమవత్స్వభావః॥

**మంత్రం :-**

ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగధే॥

**అధిదేవత :-**

అప్సుమే సోమో అబ్రవీ దంతర్విశ్వాని భేషజా।
అగ్నించ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః॥

**ప్రత్యధిదేవత :-**

గౌరీమిమాయ సలిలాని తక్షత్యేక పదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్

(పై విధమంతా ఒకసారి చెప్పి తర్వాత మూల మంత్రమును 10,000 జపించాలి.)

**మంత్రం :-**

ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగధే॥

(పై మంత్రాన్ని 10,000సార్లు జపించిన తర్వాత అధిదేవత, ప్రత్యధి దేవత మంత్రాలు ఒక్కొక్కసారి చెప్పాలి. ఆ తర్వాత)

"(మమ) యజమానస్య చంద్రగ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు"

(అని చెప్పి ఉద్ధరణితో నీళ్ళను పళ్ళెములో వదలాలి.)

# చంద్రగ్రహయంత్ర తర్పణము

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతిపూజ చేయాలి. (ఇచట సంకల్పంలో జల తర్పణం కరిష్యామి అని చెప్పుకోవాలి.)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి. తర్పణం చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మనముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

చంద్రగ్రహముకు సంబంధించిన "ధ్యానమును" ఏకాగ్రత స్మరించాలి.

ఉద్ధరణిలోకి నీటిని తీసుకొని చంద్ర గ్రహమంత్రమును చదవాలి. తరువాత "చంద్రాయ తర్పయామినమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని గ్రహ అధిదేవత మంత్రమును చదివి,

"చంద్ర గ్రహస్య అధిదేవతాః తర్పయామి నమః"

అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరణిలోకి నీటిని తీసుకొని ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత "చంద్ర గ్రహస్య ప్రత్యధిదేవతా : తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 1000సార్లు తర్పణము చేయాలి. మరల గ్రహ అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత

"చంద్రగ్రహ ప్రసాదేన మమ ఆరోగ్య సిద్ధిరస్తు సుర్వాభీష్ట సిద్ధిరస్తు" అని నీటిని పళ్ళెములో ధారపోయాలి.

(జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు
"మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ"
స్థానంలో "యాజమానస్య" అని చెప్పాలి)

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత. ప్రత్యధి దేవత సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత రోహిణి, హస్త శ్రవణం నక్షత్రములకు హోమం చేయాలి.

రోహిణి : ప్రజాపతయే స్వాహా । రోహిణ్యై స్వాహా

రోచమానాయై స్వాహా । ప్రజాభ్య స్స్వాహా ॥ (108 సార్లు)

హస్తా : సవిత్రేస్వాహా। హస్తాయస్వాహా దదతేస్వాహా

పృరాతేస్వాహా । ప్రయచ్ఛతేస్వాహా । ప్రతిగృహ్ణతేస్వాహా ॥

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత రోహిణీయేదం నమమ ॥ (108 సార్లు)

3. శ్రవణం : విష్ణవేస్వాహా । శ్రోణాయైస్వాహా॥ శ్లోకాయస్వాహా । శ్రుతాయ స్వాహా

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత శ్రవణాయైదం న మమ॥ (108 సార్లు)

ప్రతి నక్షత్రమునకు 108 సార్లు హోమం చేయాలి. తరువాత గ్రహమునకు హోమం చేయాలి. చంద్రగ్రహమంత్రము, దాని అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను వరుసగా చదవాలి.

"స్వాహా" అనిన ప్రతిసారి, మోదుగపుల్లలు, ఆవునేయి, బియ్యమును హోమంలో వేయాలి. ఈ విధంగా 100 సార్లు మూలమంత్రం అధిదేవతా, ప్రత్యధిదేవతా మంత్రమును క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు ఇతర దేవతలకు హోమం, జయాదిహోమం, స్విష్టకృత ప్రాయశ్చితహోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము, ఆ గ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట గ్రహాది దేవతల ఉద్వాసన, మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధన చేసి పెద్దల ఆశీర్వాదమును పొందాలి.

చంద్రగ్రహ హోమంలో మార్జన 100 సార్లు చేయాలి. కనీసం 10మందికి భోజనం పెట్టాలి.

# 55. స్మరణం

గ్రహజపం చేయలేనివారు చంద్ర అనుగ్రహం పొందాలనుకునేవారు క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

## చంద్రగ్రహ మంత్రాలు

1. దధిశంఖ తుషారాభం - క్షీరార్ణవ సముద్భవం
   నమామి శశినం సోమం - శంభోర్మకుట భూషణం
2. గదాధర ధరం దేవం - శ్వేత వర్ణ నిశాకరం
   ధ్యాయే దమృతసంభూతం - సర్వకామ ఫలప్రదం
3. ఓం ఐం హ్రీం శ్రీం శ్రాం క్లీం ఐం సౌః వం చంద్రాయ అమృత ప్రదాయ నమః
4. ఓం సోం సోమాయ నమః
5. ఓం ఐం క్లీం సోమాయ నమః
6. ఓం శ్రీం క్రీం హ్రాం చం చంద్రాయ స్వాహా
7. ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే
8. ఓం శ్రాం శ్రీం శ్రౌం సః చంద్రాయ నమః
9. ఓం క్లీం శ్రీం హ్రీం ఐం అమృతకరామృతం ప్లావయ స్వాహా
10. ఓం క్లీం హ్రీం ఐం అమృత కరామృతం ప్లావయస్వాహా
11. ఓం వం అమృతకరాయ చంద్రాయ అమృతం ప్లావయ ప్లావయ స్వాహా
12. ఓం జాం జీం జూం సం సోమాయ షోడశకళాత్మనే శ్రీం హ్రీం స్వాహా
13. ఆప్యాయ స్వ సమేతుతే - విశ్వతస్సోమ వృష్ణియం-భవావాజస్యసంగధే
14. జటాధర శిరోరత్నం - శ్వేతవర్ణం నిశాకరం
    ధ్యాయే దమృత సంభూతం - సర్వకామ ఫలప్రదం ॥

## చంద్రగాయత్రీ మంత్రాలు

1. ఓం సుధాకరాయ విద్మహే - ఓషధీశాయ ధీమహి
   తన్నస్సోమః ప్రచోదయాత్ ॥
2. ఓం నిశాకరాయ విద్మహే - కాలనాథాయ ధీమహి
   తన్నశ్చంద్రః ప్రచోదయాత్ ॥
3. ఓం పద్మధ్వజాయ విద్మహే కాలనాథాయ ధీమహి
   తన్నస్సోమః ప్రచోదయాత్ ॥

4. క్షీర పుత్రాయ విద్మహే అమృత తత్త్వాయ ధీమహి ,
తన్నశ్చంద్రః ప్రచోదయాత్ ॥

**అనుకూల సమయాలు :-**

చంద్రుని అనుగ్రహం పొందాలనుకునేవారు చంద్ర గ్రహజపం, హోమం చేసి, సమారాధన చేయుట ఉత్తమము. ఆ విధంగా చేయలేనివారు చంద్రునికోసం సూచించిన ఏమంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది. అదేవిధంగా చంద్రునిస్తోత్రము చేయాలి.

చంద్రునికి అనుకూలమైన వారము సోమవారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యంలోని నక్షత్రములు రోహిణి, హస్త, శ్రవణంలుయున్న దినములు కూడా చంద్రునికి అనుకూలమైనవే. చతుర్దశి అష్టమి, పౌర్ణమి అనుకూలించు తిథులు. ముఖ్యంగా చంద్రునికి శ్రావణ శుక్ల అష్టమి, కార్తీక శుద్ధ చతుర్దశి ప్రతిపౌర్ణమి ఉత్తమమైన తిథులు ఈ సమయాలలో ప్రత్యేకంగా చంద్రుని పూజించుట శుభకరము.

మహాశివరాత్రి, కృష్ణాష్టమి పండుగలను భక్తి శ్రద్ధలతో జరిపిన చంద్రుడు అనుగ్రహిస్తాడు. చంద్రదోషం ఉన్నా, లేకపోయినా కేదారేశ్వర వ్రతం లేదా సోమవార వ్రతం చేస్తే మానసిక ఆందోళనలు తొలగుతాయి.

చంద్రుని పూజించునపుడు దీపారాధనకు తెలుపు వస్త్రంతో చేసిన వత్తిని వాడుట ఉత్తమము. పూజకు బియ్యము, పంచదారతో చేసిన క్షీరాన్నమును ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలు లేదా పేదవారికి ద్రాక్ష, వెన్న, బియ్యము, పాలు, తేనె, బత్తాయి, నారింజ మొదలైన చంద్రునికి చెందిన ద్రవ్యములను దానం చేయాలి.

ప్రతిరోజు శివపురాణం, దుర్గాసహస్ర నామావళి చదవాలి.

## 56. ఆరాధనం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒకదానిని నిత్యం పఠించిన చంద్ర గ్రహానుగ్రహం పొందవచ్చును.

### చంద్ర అష్టోత్తర శతనామస్తోత్రమ్

శ్రీమాన్ శశధరశ్చన్ద్రో తారాధీశో నిశాకరః । 1
సుధానిధిస్సదారాధ్యస్సత్పతిస్సాధుపూజితః ॥

జితేంద్రియో జయోద్యోగః జ్యోతిశ్చక్ర ప్రవర్తకః ।
వికర్తనానుజోవీరో విశ్వేశో విదుషాంపతిః ॥ 2
దోషాకరో దుష్టదూరః పుష్టిమాన్ శిష్టపాలకః ।
అష్టమూర్తిప్రియోనన్తకష్టదారుకుఠారకః ॥ 3
స్వప్రకాశః ప్రకాశాత్మా ద్యుచరో దేవభోజనః ।
కళాధరః కాలహేతుః కామకృత్కామదాయకః ॥ 4
మృత్యుసంహారకో మర్త్యో నిత్యానుష్ఠానదాయకః ।
క్షపాకరః క్షీణపాపః క్షయవృద్ధి సమన్వితః ॥ 5
జైవాతృకశ్శుచిశ్శుభ్రో జయీ జయఫలప్రదః
సుధామయస్సురస్వామీ భక్తానామిష్టదాయకః ॥ 6
భుక్తిదోముక్తిదో భద్రో భక్తదారిద్ర్యభఞ్జకః ।
సామగానప్రియస్సర్వరక్షకస్సాగరోద్భవః ।
భయాన్త కృద్భక్తి గమ్యో భవబంధవిమోచకః ॥ 7
జగత్ ప్రకాశ కిరణో జగదానన్దకారణః ।
నిస్సపత్నో నిరాహారో నిర్వికారో నిరామయః ॥ 8
భూచ్ఛాయాచ్ఛాదితో భవ్యో భువనప్రతిపాలకః
సకలార్తి హర స్సౌమ్య జనక స్సాధువందితః ॥ 9
సర్వాగమజ్ఞ స్సర్వజ్ఞో సనకాది మునిస్తుతః
సితచ్ఛత్ర ధ్వజోపేత స్సితాంగ స్సితభూషణః ॥ 10
శ్వేత మాల్యాంబరధర శ్వేతగంధాను లేపనః ।
దశాశ్వ రథ సంరూఢో దండపాణిర్ధనుర్ధరః ॥ 11
కుంద పుష్పోజ్జ్వలాకారో నయనాబ్జ సముద్భవః ।
ఆత్రేయ గోత్రజో-త్యంత వినయః ప్రియదాయకః ॥ 12
కరుణారస సంపూర్ణః కర్కట ప్రభురవ్యయః ।
చతురశ్రాసనా రూఢ శ్చతురః దివ్యవాహనః ॥ 13
వివస్వన్మండలాం జ్ఞేయ వాసో వసు సమృద్ధిదః ।
మహేశ్వర ప్రియోదాంతః మేరు గోత్ర ప్రదక్షిణః ॥ 14
గ్రహమండల మధ్యస్థో గ్రసితార్కో గ్రహాధిపః ।
ద్విజరాజో ద్యుతికరో ద్విభుజో ద్విజపూజితః ॥ 15

ఔదుంబర నగావాస ఉదారో రోహిణీ పతిః ।
నిత్యోదయో ముని స్తుత్యో నిత్యానంద ఫలప్రదః
సకలాహ్లాదః [illegible] లాశ సమిథ ప్రియః ॥
ఏవం నక్షత్ర నాథస్య నామ్నాం అష్టోత్తరం శతం 16

## చంద్రస్తోత్రం : (మంత్రమహార్ణవం)

ఓం శ్వేతాంబరః శ్వేతవపుః కిరీటీ శ్వేతద్యుతిర్దండధరోద్విబాహుః॥
చంద్రో అమృతాత్మా వరదః శశాంకః శ్రేయాంసిమహ్యం ప్రదదాతుదేవః॥
దధిశంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవమ్।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్॥
క్షీరసింధుసముత్పన్న రోహిణీ సహిత ప్రభో:
హరస్య ముకుటావాస బాలచంద్ర నమోస్తుతే।
సుధామయా య త్కిరణాః పోషయంత్యోషధీవనమ్॥
సర్వాన్నర దాతారం నమామి సింధు సుందనమ్।
రాకేశం తారకేశం చ రోహిణీప్రియ సుందరమ్॥
ధ్యాయతాం సర్వదోషఘ్నం నమామీందుం ముహుర్ముహుః

## చంద్ర ధ్యాన స్తోత్రం

శ్లో॥ చంద్రారిష్టేతు సంప్రాప్తే చంద్రపూజాంచ కారయేత్
చంద్రధ్యానం ప్రవక్ష్యామి మనః పీడోపశాంతయే ॥

(ఋగ్వేదం-91 సూక్తం-16మంత్రం ప్రకారం..... చంద్రగ్రహప్రసాద సిద్ధ్యర్థం ఈ స్తోత్రం సర్వకాల సర్వావస్థలయందు పఠించదగినది.)

ఆప్యాయస్వ సమేతు తే విశ్వత స్సోమ వృష్ణియం భవావాజస్య సంగథే ఓం భూర్భువస్సువః చంద్రగ్రహేహాగచ్ఛ చంద్రగ్రహం శ్వేత వర్ణం శ్వేత గంధం శ్వేత పుష్పం శ్వేత మాల్యాంబరధరం శ్వేతచ్ఛత్ర ధ్వజ పతాకాది శోభితం దివ్యరథ సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, దశాశ్వరథవాహనం, ప్రత్యంఙ్ముఖం, ద్విభుజం, దండధరం, యామున దేశాధిపతిం, ఆత్రేయస గోత్రం, సౌమ్య సంవత్సరే కార్తీకమాస శుక్ల దశమ్యాం ఉత్తరాభాద్ర నక్షత్రజాతం, ఇందువాసరే, కిరీటినం సుఖాసీనం పత్నీపుత్ర పరివార సమేతం గ్రహమండలే ప్రవిష్టం అస్మిన్నధికరణే సూర్యగ్రహస్యాగ్నే య దిగ్భాగే సమచతురస్రాకార మండలే చంద్రగ్రహం ధ్యాయామి-పూజయామి ॥

అధిదేవతా-ప్రత్యధిదేవతా స్సహిత చంద్రగ్రహం ధ్యాయామి-పూజయామి

# సోమస్తోత్రం

అస్య శ్రీచన్ద్రస్తోత్ర మహామన్త్రస్య గౌతమ ఋషిః, చన్ద్రో దేవతా, అనుష్టుప్ ఛందః చన్ద్రగ్రహ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః వామితి హృదయాదిన్యాసః భూర్భువస్సువరోం॥ ఇతిదిగ్బంధః

ధ్యానం: శ్వేతాంబరా న్విత వపుం వరశుభ్ర వర్ణం
శ్వేతాశ్వ యుక్త రథగ్ం సురసేవితాంఘ్రిం
దోర్భ్యాం ధృతాభయగదం వరదం సుధాంశుం ।
శ్రీవత్స మౌక్తికధరం ప్రణమామి చన్ద్రమ్ ॥ 1

ఆగ్నేయభాగే సరథో దశాశ్వ శ్చాత్రేయజో యామునదేశగశ్చ ।
ప్రత్యఙ్ముఖస్థశ్చతురశ్రపీఠే గదాధరాంగో వరరోహిణీశః ॥ 2

చన్ద్రం చతుర్భుజం దేవం కేయూరమకుటోజ్జ్వలం ।
వాసుదేవస్య నయనం శఙ్కరస్య చ భూషణమ్ ॥ 3

చన్ద్రం చ ద్విభుజం జ్ఞేయం శ్వేత వస్త్రధరం విభుం ।
శ్వేతమాల్యామ్బరధరం శ్వేతగన్ధాను లేపనమ్ । 4
శ్వేతచ్ఛత్రధరందేవం సర్వాభరణ భూషితమ్ ॥

ఫలశ్రుతి:
ఏతత్ స్తోత్రం పఠిత్వా తు సర్వసంపత్కరం శుభమ్ ।
క్షయాపస్మారకుష్ఠాది తాపజ్వరనివారణం,
ఇదం నిశాకరస్తోత్రం యః పఠేత్సతతం నరః
ఉపద్రవాత్ప్రముచ్యేత నాత్రకార్యా విచారణా ॥ 5

(ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే ఉమామహేశ్వరసంవాదే దక్షిణఖండే చంద్రస్తోత్రం సంపూర్ణమ్)

# 57. అభినందనం

క్రింది నామములతో చంద్రగ్రహయంత్రమును తరచు పూజించిన చంద్రగ్రహానుగ్రహం కలుగుతుంది.

# శ్రీ చంద్ర అష్టోత్తర శతనామావళి

ధ్యానమ్ :-

శ్లో॥ గదాధర ధరందేవం శ్వేత వర్ణనిశాకరం
ధ్యాయేదమృత సంభూతం । సర్వకామ ఫలప్రదమ్ ॥
దుర్గాపూజ, వెండి, బియ్యము దానము, వస్త్రదానము ముఖ్యము.

ప్రతినామమునకు ముందు 'ఓం' చివర 'నమః' చేర్చి చదువుకొనవలెను.

ఓం శ్రీమతే నమః
శశిధరాయ నమః
చంద్రాయ నమః
తారాధీశాయ
నిశాకరాయ
సుధానిధయే
సదారాధ్యాయ
సత్పతయే
సాధుపూజితాయ
జితేంద్రియాయ
జయోద్యోగాయ
జ్యోతిశ్చక్రప్రవర్తకాయ
వికర్తనానుజాయ
వీరాయ
విశ్వేశాయ
విదుషాంపతయే
దోషాకరాయ
దుష్టదూరాయ
పుష్టిమతే
శిష్టపాలకాయ
అష్టమూర్తిప్రియాయ
అనంతాయ
కష్టదారుకుఠారకాయ
స్వప్రకాశాయ
ప్రకాశాత్మనే
ద్యుచరాయ
దేవభోజనాయ
కళాధరాయ
కాలహేతవే
కామకృతే
కామదాయకాయ
మృత్యుసంహారకాయ
అమర్త్యాయ
నిత్యానుష్ఠానదాయ
క్షపాకరాయ
క్షీణపాపాయ
క్షయవృద్ధి సమన్వితాయ
జైవాతృకాయ
శుచయే
శుభ్రాయ
జయినే
జయఫలప్రదాయ
సుధామయాయ
సురస్వామినే
భక్తానామిష్టదాయకాయ
భుక్తిదాయ(ముక్తిదాయ)
భద్రాయ
భక్తదారిద్ర్యభంజనాయ
సామగానప్రియాయ
సర్వరక్షకాయ
సాగరోద్భవాయ
భయాంతకృతే
భక్తిగమ్యాయ
భవబంధవిమోచకాయ
జగత్ప్రకాశ కిరణాయ
జగదానందకారణాయ
నిస్సపత్నాయ
నిరాహారాయ
నిర్వికారాయ
నిరామయాయ
భూచ్ఛాయాచ్ఛాదితాయ
భవ్యాయ
భువన ప్రతిపాలకాయ
సకలార్తిహరాయ
సౌమ్యజనకాయ
సాధువందితాయ
సర్వాగమజ్ఞానాయ
సర్వజ్ఞాయ
సనకాదిమునిస్తుతాయ
సితచ్ఛత్రధ్వజోపేతాయ
సితాంగాయ
సితభూషణాయ
శ్వేతగంధానులేపనాయ
దశాశ్వరథసంరూఢాయ
దండపాణయే
ధనుర్ధరాయ
కుందపుష్పోజ్జ్వలాకారాయ
నయనాబ్జసముద్భవాయ
ఆత్రేయగోత్రజాయ
అత్యంతవినయాయ
ప్రియదాయకాయ
కరుణారససంపూర్ణాయ
కర్కటప్రభవే
అవ్యయాయ
చతురశ్రాసనారూఢాయ
చతురాయ
దివ్యవాహనాయ
వివస్వన్మండలాజ్ఞేయ వాసాయ
వసుసమృద్ధిదాయ
మహేశ్వరప్రియాయ
దాంతాయ
మేరుగోత్రప్రదక్షిణాయ
గ్రహమండలమధ్యస్థాయ
గ్రసితార్కాయ
ద్విజరాజాయ
ద్యుతిలకాయ
ద్విభుజాయ
ద్విజపూజితాయ
ఔదుంబరనగావాసాయ
ఉదారాయ
రోహిణీపతయే
నిత్యోదయాయ
మునిస్తుత్యాయ
నిత్యానందఫలప్రదాయ
సకలాహ్లాదనకరాయ
పలాశసమిధప్రియాయ
శ్రీచంద్రమసే నమః

## షోడశ (16) చంద్రకళలు

ఓం హ్రీం శ్రీం సాం సీం సూం సమలవరయు వుం సం సోమ మండలాయ కామప్రద షోడశ కళాత్మనే నమః

1. అం - అమృత కళాయై నమః
2. ఆం - మానదాకళాయై నమః
3. ఇం - పూషా కళాయై నమః
4. ఈం - తుష్టి కళాయై నమః
5. ఉం - పుష్టి కళాయై నమః
6. ఊం - రతి కళాయై నమః
7. ఋం - ధృతి కళాయై నమః
8. ౠం - శశినీ కళాయై నమః
9. ౡ - చంద్ర కళాయై నమః
10. ౡం - జ్యోత్స్నా కళాయై నమః
11. ఏం - కాంతి కళాయై నమః
12. ఐం - శ్రీ కళాయై నమః
13. ఓం - అంగదా కళాయై నమః
14. ఔం - ప్రీతి కళాయై నమః
15. అం - పూర్ణా కళాయై నమః
16. అః - పూర్ణామృతాకళాయై నమః

## 58. అభినుతి

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒకదానిని నిత్యం పఠించిన చంద్రగ్రహానుగ్రహం పొందవచ్చును.

## చంద్రగ్రహ కవచ స్తోత్రమ్

అస్య శ్రీ చన్ద్రకవచస్తోత్ర మహామంత్రస్య, గౌతమ ఋషిః, గాయత్రీఛన్దః సోమో దేవతా, రం బీజమ్, సః శక్తిః, ఓం కీలకమ్, మమ సోమగ్రహప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.

వాం - అఙ్గుష్ఠాభ్యాం నమః,
వీం - తర్జనీభ్యాం నమః,
వూం - మధ్య మాభ్యాం నమః,
వైం - అనామికాభ్యాం నమః
వౌం - కనిష్ఠికాభ్యాం నమః,
వః - కరతలకరపృష్ఠాభ్యాం నమః,
ఏవం హృదయాదిన్యాసః భూర్భువస్సువరోమితి దిగ్బన్ధః.

ధ్యానమ్ :-

సోమం ద్విభుజపద్మం చ శుక్లామ్బరధరం శుభం ।
శ్వేత గన్ధాను లేపం చ ముక్తాభరణభూషణమ్ ॥ 1

శ్వేతాశ్వరథమారూఢం మేరుం చైవ ప్రదక్షిణం ।
సోమం చతుర్భుజం దేవం కేయూర మకుటోజ్జ్వలమ్ ॥ 2
వాసుదేవస్య నయనం శంకరస్య చ భూషణం ।
ఏవం ధ్యాత్వా జపేన్నిత్యం చంద్రస్య కవచమ్ ॥ 3
ముదా శశీ పాతు శిరోదేశే ఫాలం పాతు కలానిధిః ।
చక్షుషీ చంద్ర మాః పాతు శ్రుతీ పాతు కలాత్మకః ॥ 4
ఘ్రాణం పక్షకరః పాతుముఖం కుముదబాంధవః ।
సోమః కరౌ తు మే పాతు స్కన్ధౌ పాతు సుధాత్మకః ॥ 5
ఊరూ మైత్రీనిధిః పాతు మధ్యం పాతు నిశాకరః ।
కటిం సుధాకరః పాతు ఉరః పాతు శశంధరః ॥ 6
మృగాఙ్కో జానునీ పాతు జఙ్ఘే పాత్వమృతాబ్ధిజః ।
పాదౌ హిమకరః పాతు పాతు చన్ద్రోఽఖిలం వపుః ॥ 7
ఏతద్ధి కవచం పుణ్యం భుక్తిముక్తిప్రదాయకం ।
యః పఠేచ్ఛృణుయా ద్వాపి సర్వత్ర విజయీ భవేత్ ॥ 8

ఇతి శ్రీబ్రహ్మవైవర్తే మహాపురాణే దక్షిణఖండే చన్ద్రకవచః

## 59. అభివందనం

చంద్రగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. చంద్రగ్రహదేవతను కీర్తించండి.

## శ్రీకృష్ణావతార స్తుతి

(దశావతారాల్లో పరమాత్మాంశ గల కృష్ణ అవతారం చంద్రగ్రహమే)

శ్లో॥ కృష్ణానంత కృపాజలధే కంసారే కమలేశ హరే
కాళియమర్దన లోక గురో భక్తంతే పరిపాలయమాం
నామస్మరణా దన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదానృహరే ॥

(భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ తాను గ్రహాలలో సోముడినని స్వయంగా సెలవిచ్చి వున్నాడు.).

## చంద్రగ్రహ మంగళాష్టకం

శ్లో॥ చంద్రః కర్కటక ప్రభుస్సిత నిభశ్చాత్రేయ గోత్రోద్భవ
శ్చాత్రేయ శ్చతురశ్రవారుణ ముఖశ్చాపో హ్యు మాధీశ్వరః
షట్సప్తాగ్ని దశైక శోభనఫలో శౌరి ర్బుధార్కౌప్రియౌ
స్వామీ యామునదేశః పర్ణ సమిధః కుర్యాత్ సదామంగళం ॥

# చంద్రగ్రహస్తోత్ర కీర్తన

రచన : శ్రీముత్తుస్వామి దీక్షితులు

రాగం : అసావేరి చతురస్ర మఠ్యతాళం

పల్లవి : చంద్రం భజ మానస
సాధు హృదయ సదృశం ॥చంద్రం॥

అనుపల్లవి : ఇంద్రాది లోకపాలేడిత తారేశం
ఇందుం షోడశ కళాధరం నిశాకరం
ఇందిరా సహోదరం సుధాకర మనిశం ॥చంద్రం॥

చరణం 1 : శంకర మౌళి విభూషణం-శీతకిరణం-చతుర్భుజం
మదనచ్ఛత్రం క్షపాకరం వేంకటేశ నయనం
విరాణ్మనో జననం విధుం కుముద మిత్రం
విధిగురు గుహ వక్త్రం - శశాంకం ॥చంద్రం॥

చరణం 2 : శశాంకం గీష్పతి శాపానుగ్రహ పాత్రం
శరచ్చంద్రికాధవళ ప్రకాశ గాత్రం
కంకణ కేయూర హార మకుటాది ధరం
పంకజరిపుం రోహిణీ ప్రియకరం చతురమ్ ॥ ॥చంద్రం॥

# 60. చంద్ర గ్రహానుగ్రహం - ప్రత్యేక స్తోత్రం

## విశ్వనాథ స్తుతి

గంగాతరంగ రమణీయ జటాకలాపం గౌరీనిరంతర విభూషిత వామభాగం।
నారాయణ ప్రియమనంగ మదాపహారం వారణాసీపురపతిం భజ విశ్వనాథమ్ ॥
వాచామగోచరమనేక గుణస్వరూపం వాగీశ విష్ణుసుర సేవిత పాదపీఠం ।
వామేన విగ్రహవరేణ కళత్రవంతం వారణాసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥
భూతాధిపం భుజగభూషణ భూషితాంగం వ్యాఘ్రాజినాంబరధరం జటిలం త్రినేత్రం।
పాశాంకుశాభయవర ప్రదశూలపాణిం వారణాసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥

# 61. . యంత్ర ధారణం - స్థాపనం

**చంద్రగ్రహానుగ్రహం కోసం :-**

ఒక రాగిరేకుకు ఇరువైపుల క్రింది యంత్రమును రాయించి, దానిని పూజించాలి.

| | | |
|---|---|---|
| 7 | 2 | 9 |
| 8 | 6 | 4 |
| 3 | 10 | 5 |

| | | |
|---|---|---|
| 7 | 8 | 3 |
| 2 | 6 | 10 |
| 9 | 4 | 5 |

పై మంత్రమును "ఓం శ్రాం శ్రీం శ్రౌం సః చంద్రమసే నమః" అను మూలమంత్రమును 1,00,000 సార్లు జపిస్తూ పూజించాలి.

2. చంద్రయంత్రం (భృగుసంహిత)

క్రింది యంత్రమును రాగిరేకుపై రాయించి దానిని "ఓం శ్రాం శ్రీం శ్రౌం సః చంద్రమసే నమః" అను మంత్రమును 11000 సార్లు జపంచేసి, యంత్రానికి ధారపోయాలి. ఈ యంత్రం స్థాపించిన వ్యాపారవృద్ధి జరుగుతుంది. ఉప్పు, బియ్యం, చేపలు, ముత్యములు, నీటికి సంబంధించిన వస్తువుల వ్యాపారంలో అభివృద్ధికి వాయవ్య దిశలో దోషమును తొలగించుటకు ఈ యంత్రం ఉపయోగిస్తుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 40 | 39 | 24 | 38 | 23 | |
| 41 | 6 | 53 | 9 | 8 | 22 |
| 15 | 37 | 16 | 45 | 1 | |
| 14 | 43 | 5 | 44 | 46 | 25 |
| 36 | 17 | 52 | 18 | 28 | |
| 26 | 13 | 4 | 19 | 2 | 27 |
| 7 | 34 | 33 | 20 | 29 | |
| 60 | 35 | 32 | 3 | 59 | 30 |
| 42 | 12 | 21 | 31 | 11 | |
| 51 | 54 | 50 | 10 | 47 | 49 |
| 57 | 55 | 58 | 56 | 48 | |

# బీజాక్షర సహిత
# చంద్రయంత్రం (మంత్ర మహార్ణవము)

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై చెక్కించి, దానిని "ఓం సొం సోమాయ రోహిణిపతయే నమః" అను మంత్రమును జపిస్తూ పూజించిన సంతాన ప్రాప్తి కలుగుతుంది. కనీసం 5 లక్షల సార్లు మంత్రమును జపించాలి.



# 62. కుజుడు - ఒక వీక్షణ

1. ఇతరనామాలు - అంగారకుడు, వక్ర, అర, రుధిర, క్షితిజ, రక్త క్రూరనేత్ర
2. లింగము - పురుషగ్రహము
3. జాతి - క్షత్రియ జాతి
4. రంగు - ఎరుపు
5. తత్త్వము - అగ్నితత్త్వము
6. గ్రహస్వభావము - పాపగ్రహం
7. స్వభావము - ఉగ్రస్వభావం
8. గుణము - తమోగుణము
9. రుచులు - పులుపు
10. గ్రహోదయము - పృష్ఠ
11. జీవులు - చతుష్పాది
12. గ్రహస్థానము - వహ్ని
13. అధిపత్యదిక్కు - దక్షిణము
14. జలభాగం - నిర్జల
15. ఆత్మాధికారకత్వం - బలము
16. పాలనశక్తులు - నాయకుడు
17. శరీరధాతువు - మెదడు
18. లోహధాతువు - రాగి
19. కుటుంబ సభ్యుడు - సోదరులు
20. గ్రహరూపవర్ణం - రక్తవర్ణం
21. గ్రహపీడ - రక్తహీనత, రక్తంచెడిపోవుట
22. గ్రహవర్గం - గురు
23. గృహభాగములు - వంటగది
24. కాల బలము - రాత్రి బలవంతుడు
25. దిగ్బలము - దశమభావం
26. అధిపత్యకాలము - దినము
27. స్వక్షేత్రము - మేషం, వృశ్చికం
28. శత్రుక్షేత్రము - వృషభం, తుల
29. మిత్రక్షేత్రము - సింహం, ధనస్సు, మీనం

30. విషమక్షేత్రము -
31. సమక్షేత్రము - తుల, కుంభము
32. ఉచ్చరాశి - మకరం
33. నీచరాశి - కర్కాటకం
34. మూల త్రికోణము - మేషము
35. పరమ ఉచ్ఛ - మకరంలో 28వ డిగ్రీ
36. పరమ నీచ - కర్కాటకంలో 28 వ డిగ్రీ
37. మిత్ర గ్రహాలు - రవి, చంద్ర, గురు
38. శత్రుగ్రహాలు - బుధుడు
39. సమగ్రహాలు - శుక్ర, శని
40. వ్యధా గ్రహము - గురువు
41. నైసర్గిక బలగ్రహము - బుధుడు
42. దిన చలనం - 40 నిమిషాలు
43. రాశిలో గ్రహం ఉండే కాలం - 45 రోజులు
44. రాశిలో ఫలమిచ్చేభాగం - రాశిలో మొదటి భాగంలో
45. గ్రహ ప్రకృతి - పిత్త
46. ఋతువు - గ్రీష్మఋతువు
47. దిగ్బలము - దక్షిణమున బలవంతుడు
48. సూచించు ఎత్తు - పొడుగు
49. సూచింపబడే వయస్సు - 16 సంవత్సరాలు
50. సూచించు ప్రాంతాలు - లంకా పట్టణం నుండి కృష్ణానది వరకు గల ప్రాంతాలు
51. నివాస ప్రాంతం - రాతి ప్రదేశము
52. సూచించబడే శరీరావయవము - కండరము, ఎముకలలోని మజ్జ, మజ్జ, మర్మావయవములు
53. సూచించే శరీర వ్యాధులు - గాయములు, ప్రేలుడు లేదా అగ్ని వలన కలుగు దెబ్బలు
54. గోచారరీత్యా శుభస్థానములు - 3,6,11
55. గోచారరీత్యా అశుభస్థానములు - 1,2,4,5,7,8,9,10,12
56. గోచారరీత్యా వేధస్థానములు - 5,9,12
57. గ్రహదశా కాలము - 7 సంవత్సరములు
58. జీవన కారకత్వము - ఋణకారకుడు

59. సంబంధించిన నక్షత్రాలు - మృగశిర, చిత్త, ధనిష్ఠ
60. సూచించు వృక్షజాతి - కారంగల చెట్టు
61. సూచించు ధాన్యం - కందులు, మసూర్ పప్పు
62. సూచించు పండ్లు - ఎండు ద్రాక్ష
63. సూచించు పక్షులు - కోడి, గ్రద్ద
64. సూచించు జంతువులు - ఒంటె, వేడి, పులి
65. సూచించు ఇతర ద్రవ్యములు - మట్టిపాత్రలు, కత్తి, నిప్పు
66. సంబంధించిన సమిధ - చండ్ర
67. సంబంధించిన మూలిక - చండ్ర, పాలసుగంధి
68. సూచించు వస్త్రము - కాలిన వస్త్రం
69. దేవవర్ణము - వైష్ణవ
70. గ్రహగోత్రము - భారద్వాజస
71. వేదములు - సామవేదము
72. శుభత్వం - త్రిపాద పాపి
73. అవతారం - నరసింహావతారము
74. గ్రహస్వరూపం - ఎర్రని కన్నులు, దుర్బలమైన శరీరము కలవాడు, నాలుగు భుజాలు కలిగి ఎర్రని పూలమాల, ఎర్రనివస్త్రము, శూలము, శక్తి గద ధరించినవాడు.
75. గ్రహ స్వరూప వర్ణం - ఎర్రని రంగు
76. గ్రహారూఢ వాహనం - అజవాహనం
77. పూజార్థం గ్రహ ప్రతిమకు వాడవలసినది - రక్తచందనము
78. గ్రహప్రీతికి నైవేద్యం - హవిష్యాన్నము
79. అధిష్ఠాన దేవత - కుమార స్వామి
80. అధిదేవత - పృథ్వీ
81. ప్రత్యధిదేవత - క్షేత్రపాలకుడు
82. గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు - నాగుల చవితి
83. చేయవలసిన ప్రసాదము - అప్పాలు, కందులతో గుగ్గిళ్ళు
84. దోష నివారణకు దక్షిణ - ఎద్దు
85. ప్రీతికరమైన తిథి - వైశాఖ శుక్ల త్రయోదశి (లేదా) బహుళదశమి

86. ఆచరించవలసిన వ్రతము - హనుమద్వ్రతము
87. పారాయణ చేయవలసిన పురాణాలు - సుందరకాండ
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - కుజగ్రహ అష్టోత్తర శతనామావళి
89. పారాయణ చేయవలసిన సహస్రనామావళి - సుబ్రహ్మణ్యస్వామి సహస్రనామావళి
90. ఆచరించవలసిన దీక్ష - హనుమద్దీక్ష
91. ధరించవలసిన మాల - పగడాల మాల
92. ధరిచవలసిన రత్నము - పగడం
93. ధరించవలసిన రుద్రాక్ష - త్రిముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - సుబ్రహ్మణ్యస్వామి, ఆంజనేయ స్వామి
95. చేయవలసిన పూజలు - పుట్టలో పాలు పోయుట, సుబ్రహ్మణ్య షష్టి
96. దానంచేయవలసిన ద్రవ్యములు - కందులు, ఎర్రచందనం, అప్పాలు, ఎర్రని వస్త్రములు
97. గ్రహజప సంఖ్య - 7,000
98. హోమముకు వాడు సమిధ - చండ్ర
99. నవగ్రహమండపంలో గ్రహఆసనం - త్రిభుజాకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 4,7,8 రాశులు
101. గ్రహసంఖ్య - 6
102. గ్రహం సూచించు వారం - మంగళవారం
103. శుభసమయం - మధ్యాహ్న సమయం
104. ప్రతినిధి గ్రహాలు - రవి+బుధ, రవి+శని
105. గ్రహం బలంగా ఉంటే ఫలితం - ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉంటారు.
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - ఉద్రేకంతో విరోధాలు తెచ్చుకుంటారు.
107. తండ్రి - విఘ్నమూర్తి
108. తల్లి - భూదేవి
109. భార్య - జ్వాలిని
110. సూచించు లోహములు - రాగి

111. గ్రహప్రభావితుల మనఃస్థితి - ఉగ్రస్వభావం
112. భావకారకత్వం - ఉద్రేకము
113. గ్రహదృష్టి - కటాక్ష
114. గ్రహమునకు గుర్తు - ♂
115. సంబంధించిన వృత్తి - మిలిటరీ, పోలీసు
116. గ్రహజన్మ సంవత్సరం - అక్షయ
117. జన్మమాసం - వైశాఖం
118. జన్మతిథి - బహుళవిదియ
119. జన్మనక్షత్రం - పుబ్బ
120. ఆధిపత్యం వహించుదేశం - అవంతి
121. గ్రహఋషి - విరూపుడు
122. గ్రహ ఛందస్సు - త్రిష్టుప్
123. పుట్టినవారం - మంగళవారం

**సంబంధించిన వస్తువులు, పనులు :-**

కందులు, మసూర్ పప్పు స్వీట్లు, తగరము, రాగి, శూలము, గొడ్డలి, మట్టిపాత్రలు, పులి, ఒంటె, జింక, గాయత్రి, జపం, సుబ్రహ్మణ్యస్వామి ఆరాధన.

## 63. ఖగోళశాస్త్ర పరంగా కుజుడు

సూర్యుని నుండి నాల్గవ గ్రహంగా ఉండే గ్రహం కుజుడు. భూమికి అత్యంత సమీపంలో ఉండేగ్రహం కుజుడు. కుజగ్రహమును అంగారకుడు అని పిలుస్తారు. ఇంగ్లీషులో మార్స్ అంటారు. "మార్స్" అంటే రోమన్ల యుద్ధదేవుడు. గ్రీకులు కుజుడిని "ఏరీస్" అంటారు. ఆంగ్లోశాక్షన్ భాషలో కుజుడిని "టీయూ" అని పిలుస్తారు. మార్స్ అనువారం పేరును బట్టి "మార్చ్" నెల, టీయూ అను పేరును బట్టి "ట్యూస్‌డే" అను పేరు వచ్చింది. కుజ అంటే భూమికి పుట్టినవాడు అని అర్థం. మన పురాణాల ప్రకారం కుజుడు భూదేవి కుమారుడు.

కుజగ్రహం ద్రవ్యరాశి $6.37 \times 10^{23}$ కిలోగ్రాములు. ఇది భూమి పరిమాణంలో 1/7 వంతు పరిమాణం కలిగి ఉంటుంది. సూర్యునినుండి 22,80,00,000 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. ఇది సూర్యుని చుట్టు తిరుగుటకు 687 రోజులు పడుతుంది. ఇది గంటకు 8686.8 కిలోమీటర్ల వేగంతో తిరుగుతుంది. కుజగ్రహ మధ్యరేఖ పొడవు 6794 కిలోమీటర్లు.

కుజగ్రహంపై కూడ వాతావరణం ఉన్నది. అయితే అది చాల పలుచగా ఉండుటవలన వేడి తక్కువగా ఉంటుంది. చల్లని వాతావరణం ఉంటుంది. దీని ఉపరితలంపై - 63 డిగ్రీల సెంటిగ్రేడు ఉష్ణోగ్రత ఉంటుంది. దీనిపై వాతావరణంలో 95.3 శాతం కార్బన్‌డై ఆక్సైడ్ ఉంటుంది.

1964లో పంపిన మారినర్ 4 అంతరిక్షనౌక కుజ గ్రహముకు సమీపంలో సంచరించి అనేక సమాచారం సంపాదించింది. 1976లో నాసా కేంద్రం కుజగ్రహంపైకి ఉపగ్రహాలు పంపాయి. మార్స్ 2, మార్స్ 3, మార్స్ 6, పాత్‌ఫైండర్, స్పిరిట్ రోవర్ వంటివి కుజగ్రహంపై దిగాయి.

కుజగ్రహం ఉపరితలంపై 'ఒలింపస్ మాన్స్' అనబడే అతిపెద్దదైన అగ్నిపర్వతం ఉన్నది. దీని ముఖద్వారం 90 కిలోమీటర్ల వెడల్పు ఉంటుంది. "మారినర్ వ్యాలీ" అనబడే అతిపెద్ద లోయ కూడ ఈ గ్రహ ఉపరితలంపై ఉన్నది. ఈ లోయ పొడవు 4,000 కిలోమీటర్లు. లోతు 7 కిలోమీటర్లు.

కుజగ్రహముకు రెండు ఉపగ్రహములు ఉన్నవి. వాటిలో "ఫోబోస్" అనబడే ఒక ఉపగ్రహము పడమర ఉదయించి, తూర్పున అస్తమిస్తుంది. ఇది 7 1/2 గంటలలో కుజుని చుట్టు తిరుగుతుంది. రెండవది అయిన "డీమోస్" తూర్పున ఉదయించి పడమర అస్తమిస్తుంది. ఇది 30 గంటలలో కుజుని చుట్టు తిరుగుతుంది.

## 64. పురాణాల పరంగ కుజుడు

కుజుడు రక్తవర్ణము కలవాడు. నాలుగు భుజములు కలవాడు. ఎర్రని వస్త్రము, ఎరుపు రంగు పూలమాల ధరించి ఉంటాడు. చేతిలో శూలమును, శక్తిని ధరిస్తాడు. అజవాహనమును అధిరోహించును. ఇతనికి అంగారకుడు, వక్ర, ఆర, రుధిర, క్షితిజ, రక్త, క్రూరనేత్ర పేర్లు కలవు.

హిరణ్యాక్షుని కుమార్తె అయిన 'వికేశి' గొప్ప అందగత్తె, ఆమెను శివుడు పొందగోరగా అగ్నిదేవుడు అడ్డుకున్నాడు. దానితో కుపితుడయిన శివుడు, తన తేజస్సు బయటకు వెలువరించాడు. ఆ తేజస్సును పార్వతి గ్రహించినది, కాని భరించలేక జారవిడిచింది.

శివవీర్యతేజం విష్ణువు గ్రహించి భూదేవికి ఇచ్చాడు. ఆమె ఆ తేజాన్ని ధరించడంతో గర్భవతి అయి కుజునికి జన్మ నిచ్చెను. ఇతడే అంగారకుడని ప్రసిద్ధి. ఈ కుజ జన్మము అక్షయనామ సంవత్సర శ్రావణశుద్ధ త్రయోదశి పూర్వాషాఢ నక్షత్రమునందు జరిగెను.

అసలు తేజము రుద్రునిది. పరిరక్షణ విష్ణువుది. భరించిన ఓర్పు భూదేవిది. కనుక అతడికి ముగ్గురి లక్షణములు ఏర్పడినవి.

# 65. జ్యోతిష్యశాస్త్ర పరంగా కుజుడు

**లక్షణాలు :-**

కుజుడు పురుషగ్రహం. రుచులలో చేదును, రంగులలో ఎరుపురంగును సూచించును. క్షత్రియజాతికి చెందినవాడు. అధిదేవత పృధ్వి. అగ్నితత్త్వము కలిగి, దక్షిణదిక్కును సూచించును. సన్నని నడుము కలిగి వంకీల జుట్టు, కండలు కలిగిన, ఎరుపురంగు ఛాయ కలిగిన వారిని సూచించును. 16 సంవత్సరముల వయస్సు కలవారిని సూచించును. పిత్తాధిక్యత కలవాడు. గ్రీష్మఋతువును సూచించును. లోహములలో ఇనుము, ఉక్కును, రత్నములలో పగడమును సూచించును. ఈ గ్రహసంఖ్య 6. దశమ భావంలో దిగ్బలము పొందును. ఇతను తమోగుణ ప్రధానుడు. లంకాపట్టణము మొదలు కృష్ణానది వరకు ఇతని దేశమని జాతకపారిజాతం తెల్పుతున్నది.

కుజుడు మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రములకు అధిపతి శరీరావయవములలో కండరాలుఎముకలలోని మజ్జ, బాహ్య జననేంద్రియములు, కణములును సూచించును. కుజుడు మేషం, వృశ్చిక రాశులకు అధిపతి. ఉచ్ఛరాశి మకరం. నీచరాశి కర్కాటకం. మకరరాశిలో 28వ డిగ్రీ ఇతనికి పరమోచ్ఛ. అలాగే కర్కాటకంలో 28 వ డిగ్రీ పరమనీచ. రవి, చంద్ర, గురులు ఇతనికి స్నేహితులు. బుధుడు శత్రువు. శుక్ర, శని ఇతనికి సములు.

**కుజుడు ప్రభావం :-**

శారీరక ధారుఢ్యము కలిగియుండి పొట్టిగా వుంటారు. త్వరగా ధనాన్ని సంపాదించగలరు. అంతేవేగంగా ధనాన్ని ఖర్చుపెట్టగలరు. బంధుమిత్రులంటే అపారమైన ప్రేమ. వీరు తమ ఆవేశాన్ని అదుపులో వుంచుకోవాలి. పదవి, అధికారం, సేవకులు కలిగియుంటారు. కోరికలు అధికంగా వుంటాయి. దానధర్మాలు అధికంగా చేస్తారు. యంత్రములు, ఆయుధములు మొదలగు శాస్త్రములలో ప్రావీణ్యత పొందుతారు. పోలీసు మిలటరీ వంటి శాఖలలో రాణిస్తారు.

**కారకత్వములు :-**

కుజుడు శక్తికి కారకుడు. సోదరులు, అక్కాచెల్లెళ్ళు, ఆయుధములు, అగ్ని, వంటగది, శస్త్రచికిత్స, భూమి, బ్లడ్ బాంకులు, ప్రేలుడు సామాను, బాంబులు, రసాయనాలు, అన్నిరకాల యంత్రాలను సూచించును. అసత్యము చెప్పుట, పరస్త్రీలతోసంబంధము, మూర్ఖత్వము, కోపము, కఠినముగా మాట్లాడుట, దోపిడీలు కొట్లాటలు, విప్లవములు, కిడ్నాపులు, కాల్పులను సూచించును. పీసము, క్రూరమృగములు, మశూచి, ఆటలమ్మ, అపెండిసైటిస్, హెమరేజ్ మొదలగు వ్యాధులను సూచించును. న్యాయవాదులు, న్యాయమూర్తులు, స్త్రీవ్యామోహులు, మాంత్రికులు, టెర్రరిస్టులును సూచించును. కాఫీ, టీ, పొగాకు, బీడీ, ఆవాలు, అల్లము, శొంఠి, వెల్లుల్లి, జీడిమామిడిని సూచించును.

కండపుష్టి, యుద్ధము, గాయాలు, హింస, అత్యాచారము, కత్తి, క్రూరత్వము, ధైర్యము, సాముగరిడీలు, సైన్యము, కలహాలు, ఆయుధసామాగ్రి, సాహసము, హంతకుడు, తిరుగుబాటుదారులు, ఫిరంగులు, దోపిడీదొంగ, మండుట, వేడిపరికరములు, కొట్లు, జ్వరాలు, పనులు, కోపము, పెళ్ళి, వంట, పాత్రలు, పగలగొట్టుట, పొయ్యి, బాక్సర్, రేడియేషన్, సలహాలు, సర్జనులు, ఇంజనీర్లు, ఆడపంది, కంచగాడిద, టార్పెడోలను సూచించును.

**కుజుడు సూచించు విద్యలు :-**

కుజుడు అగ్రికల్చర్ డిగ్రీ, సివిల్ ఇంజనీరింగ్, మిలిటరీ ఇంజనీరింగ్, ఏరోనాటికల్ ఇంజనీరింగ్, రసాయన విద్య, ఆయుధముల తయారీ, అగ్ని మాపకములు, న్యాయవాదులు, విద్యుతుద్పాదన, బ్లాక్స్మిత్‌లను సూచించును.

**కుజుడు సూచించు వ్యాధులు :-**

గాయములు, అబార్షన్, ఋతుక్రమము సరిగా లేకపోవుట, మశూచికం, ఆటలమ్మవ్యాధి, గవద బిళ్ళలు, అపెండిక్స్‌వ్యాధి, హెర్నియాలను కుజుడు సూచించును. కుజుడు బుధునితో కలసి చర్మరోగాల్ను శుక్రునితో కలసి కంఠరములకు సంబంధించిన వ్యాధులు, హైడ్రోసీల్, రక్తనాళములు పగులుట, పైత్యరోగము, వ్రణములు, సెప్టిక్ అగుటను సూచించును. రాహువుతో కలసి విషప్రయోగము, శక్తి క్షీణించుట, ముసలితనము, విషకీటకముల వలన బాధలు, మెదడులో రక్తనాళములు చిట్లుట, తలనెప్పిలను సూచించును.

**కుజుడు సూచించు వృత్తి వ్యాపారాలు :-**

మందులమ్మువారు, కెమిస్టులు, పోలీసు, మిలటరీవ్యక్తులు, రియల్ ఎస్టేట్ వ్యాపారస్థులు, కసాయివారు, సర్జనులను సూచించును. వంటవారు, ఇనుము, ఉక్కు సంబంధించిన ఫ్యాక్టరీలలో పనిచేయువారు, లోహములతో వస్తువులు తయారు చేయువారిని సూచించును. పొగాకు, లక్క, కల్లు, సారాయి, బ్రాందీ, విస్కీ, కత్తి, గొడ్డలి, తుపాకి, జీడిపప్పు, వేరుశనగ, వక్క, టీ, కాఫీ, అల్లం మొదలగు వాటికి సంబంధించిన వ్యాపారాలను సూచించును. మోటారు, నిప్పు, గ్యాస్‌లతో కూడిన వృత్తులను సూచించును. రవితో కూడిన మిలటరీ హాస్పిటల్‌లో, రవి, బుధులతో కలసి రక్షణశాఖలో ఆడిటర్, శనితో కలసి స్మశానంలో గుంటలు త్రవ్వేవారిని సూచించును.

## ద్వాదశ లగ్నాలలో కుజుడు - ఫలితాలు

**మేషం లగ్నమైతే**

- మేషలగ్నమై లగ్నమందు కుజుడున్న అనారోగ్యం కలుగును.
- 2వ స్థానంలో కుజుడున్న కళత్ర పీడనము, సంతాన విచారం కలుగును.
- 3 వ స్థానంలో కుజుడున్న దుష్ప్రవర్తన, అపకీర్తి, రక్తహీనము శత్రువృద్ధియు కలుగును.
- 4 వ స్థానంలో కుజుడున్న సామాన్య జీవితం, ఆచార రహితం, విచారము, అనారోగ్యము కలుగును.
- 5 వ స్థానంలో కుజుడున్న సంతానం వలన ఆటంకములు, కలహాలు, ధననష్టం కలుగును.
- 6 వ స్థానంలో కుజుడున్న ఋణము, రోగము, ధనహీనము కలుగును.
- 7 వ స్థానంలో కుజుడున్న అపవాదులు, ధననష్టం, స్త్రీలోలత్వం మొదలగునవి కలుగును.
- 8 వ స్థానంలో కుజుడున్న భార్యవలన విచారం, ధనవ్యయము కలుగును.
- 9 వ స్థానంలో కుజుడున్న పితృసౌఖ్యము ఉండదు.
- 10 వ స్థానంలో కుజుడున్న శుభఫలములు నిచ్చును. పేరు ప్రతిష్ఠలు పెరుగును.
- 11 వ స్థానంలో కుజుడున్న అన్యాయార్జిత ధనం ఉంటుంది.
- 12 వ స్థానంలో కుజుడున్న విశేషధననష్టం, నీచకార్యములు చేయుట, ఆర్థిక ఇబ్బందులు మొదలయినవి కలుగును.

**వృషభం లగ్నమైతే**

- 1 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకునికి ఎల్లపుడు సంతోషము ఉండదు. మశూచి వంటి రోగములతో బాధ పడును.
- 2 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకునికి ఇద్దరు భార్యలు ఉంటారు. అంతేకాక ధనము సంపాదించినను నిలవదు.
- 3 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకుని భార్యకు శరీర బాధలు కలుగును. సోదర, భూమి నష్టము కలుగును.
- 4 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకునికి ఏవిద్య కూడ పూర్తిగా లభించదు. తల్లి ప్రేమ వుండదు.
- 5 వ స్థానములో కుజుడు వున్న ఎడల సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకుడు అధిక అనారోగ్యవంతుడు, విరోధుల వల్ల బాధలు కలవాడు. అప్పుచే భూమి సంపాదించును.
- 7 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకునికి కళత్రనష్టం కలుగును.
- 8 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకునికి ఇద్దరు భార్యలు ఉంటారు. అంతేకాక తండ్రి ఇచ్చిన ఆస్తి అంతా పోయి అనేక బాధలు కలుగును.
- 9 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకునికి ధనము లభించును. తండ్రికి అనారోగ్యము కలుగును.
- 10 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకుడు వ్యవసాయం చేయును. పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ వుంటాడు.
- 11 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకుడు న్యాయంగా అధిక ధనము సంపాదించును.
- 12 వ స్థానములో కుజుడు వున్నట్లయితే జాతకుడు అప్పుచేసి భూమి సంపాదించును. అధికంగా ధనవ్యయం కలుగును.

**మిధునం లగ్నమైతే**

- మిధునం లగ్నమై లగ్నంలో కుజుడున్న అనారోగ్యము, అశాంతి కలుగును. జాతకుడు దయలేనివాడు, మోసగాడు.
- రెండవ స్థానంలో కుజుడున్న దరిద్రుడు, కళత్ర నష్టం కలుగును.

- 3 వ స్థానంలో కుజుడున్న సోదరి నష్టం కలుగును.
- 4 వ స్థానంలో కుజుడున్న విద్యకు ఆటంకాలు, తల్లి వలన దుఃఖము, పూర్వుల ఆస్తి నష్టము కలుగును.
- 5 వ స్థానంలో కుజుడున్న పుత్రశోకము కలుగును.
- 6 వ స్థానంలో కుజుడున్న అప్పుచేసి భూమిని కొనును.
- 7 వ స్థానంలో కుజుడున్న కళత్ర నష్టం, అశాంతి కలుగును.
- 8 వ స్థానంలో కుజుడున్న మరణ భయము, ఆటంకములు, స్థాన చలనం, ఋణం వలన భూలాభం, భార్యకు అనారోగ్యం కలుగును.
- 9 వ స్థానంలో కుజుడున్న తండ్రికి ప్రమాదము లేదా తండ్రియొక్క ఆస్తి నష్టం కలుగును.
- 10 వ స్థానంలో కుజుడున్న ఆచారహీనుడు, అధికార గర్వము కలవాడు నిర్దయుడు, భూధనలాభం కలవాడు.
- 11 వ స్థానంలో కుజుడున్న భూ, ధనలాభం, కుటుంబ సుఖము కలుగును.
- 12 వ స్థానంలో కుజుడున్న అటంకాలు, ఋణములు, అంగవిహీనం కారాగార వాసము లభించును.

**కర్కాటకం లగ్నమైతే**

- కర్కాటకం లగ్నమై లగ్నములో కుజుడున్న అనారోగ్యము, అందహీనుడు, చెడు సావాసము చేయుదురు.
- 2 వ స్థానములో కుజుడున్న సంతాన సుఖము లేకపోవుట, భార్యవలన బాధలు
- 3 వ స్థానంలో కుజుడున్న సోదర నష్టము.
- 4 వ స్థానంలో కుజుడున్న విద్యార్జనముకు ఆటంకములు ఏర్పడును. తల్లికి అనారోగ్యము.
- 5 వ స్థానంలో కుజుడున్న పూర్ణయోగము, అధికారము కలుగును. అనుకున్న పని నెరవేరును, భూలాభము, సంతాననష్టము.
- 6 వ స్థానంలో కుజుడున్న శత్రువులు, రోగము, ఋణము కలుగును.
- 7 వ స్థానంలో కుజుడున్న భూలాభము, ధనలాభము, భార్యకు అనారోగ్యము కలుగును.

- 8 వ స్థానంలో కుజుడున్న, ద్వికళత్రయోగము కలుగును.
- 9 వ స్థానంలో కుజుడున్న తండ్రికి అనారోగ్యము.
- 10 వ స్థానంలో కుజుడున్న భూలాభము, సుఖము, మనశ్శాంతి కలుగును.
- 11 వ స్థానంలో కుజుడున్న భూలాభము, ధనలాభము, అన్యాయార్జనము కలుగును.
- 12 వ స్థానంలో కుజుడున్న కష్టజీవనము, అనవసర ధనవ్యయము చేయును.

**సింహం లగ్నమైతే**

- సింహం లగ్నమై లగ్నములో కుజుడున్న శరీర సుఖము తక్కువ.
- 2వ స్థానములో కుజుడున్న బహుస్త్రీ సాంగత్యం ఉంటుంది.
- 3 వ స్థానంలో కుజుడున్న సోదరనష్టం కలుగును.
- 4 వ స్థానములో కుజుడున్న మాతృసౌఖ్యం తక్కువ, అధిక భూమిని సంపాదించును.
- 5 వ స్థానములో కుజుడున్న సంతాన విచారం కలుగును.
- 6 వ స్థానములో కుజుడున్న అధికారం, విరోధుల వలన అధిక భాగ్యము లభించును.
- 7 వ స్థానములో కుజుడున్న ద్వికళత్రయోగము కలుగును. ధనము అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానములో కుజుడున్న తండ్రి నుంచి వచ్చిన ఆస్తి ఖర్చు పెట్టును. కుటుంబ సుఖం తక్కువ.
- 9 వ స్థానంలో కుజుడున్న అధిక భూమి లభించును. పితృసౌఖ్యం తక్కువగా ఉండును.
- 10 వ స్థానంలో కుజుడున్న వాహనం, అధికారం కలుగును.
- 11 వ స్థానంలో కుజుడున్న అన్యాయముగా ధనము సంపాదించును.
- 12 వ స్థానంలో కుజుడున్న ధనహీనము కలుగును.

**కన్య లగ్నమైతే**

- కన్యాలగ్నమై లగ్నంలో కుజుడుయున్న కష్టాలు కలుగును. శరీర సౌఖ్యము తక్కువ.
- 2 వ స్థానంలో కుజుడున్న ధనహీనుడు, భార్యవలన బాధలు కలుగును.
- 3 వ స్థానంలో కుజుడున్న సామాన్యజీవనము, భూమి కలుగును.

- 4 వ స్థానంలో కుజుడున్న మాతృసౌఖ్యం, విద్య, సౌఖ్యం తక్కువగా ఉండును.
- 5 వ స్థానంలో కుజుడున్న పూర్ణాయుర్దాయము, సంతాన విచారం కలుగును.
- 6 వ స్థానంలో కుజుడున్న శత్రుజయం, కీర్తి కలుగును.
- 7 వ స్థానంలో కుజుడున్న భార్య వలన విచారము కలుగును.
- 8 వ స్థానంలో కుజుడున్న అధిక కష్టాలు అనుభవించును.
- 9 వ స్థానంలో కుజుడున్న తండ్రి వలన బాధలు పొందుతాడు.
- 10 వ స్థానంలో కుజుడున్న నీచవృత్తి వలన జీవనం గడుపును.
- 11 వ స్థానంలో కుజుడున్న సోదర నష్టము కలుగును.
- 12 వ స్థానంలో కుజుడున్న అంగవిహీనుడు అవుతాడు.

**తుల లగ్నమైతే**

- తులా లగ్నమై లగ్నమున కుజుడు ఉన్న యోగము, అనారోగ్యము, మేహతత్వ మును పొందుతాడు.
- 2 వ స్థానమున కుజుడున్న ప్రథమ కళత్ర నష్టము కలుగును.
- 3 వ స్థానమున కుజుడున్న సామాన్య యోగమును పొందుతాడు.
- 4 వ స్థానమున గొప్పయోగము, భూ, ధనలాభమును పొందుతాడు.
- 5 వ స్థానమున కుజుడున్న సంతాన నష్టము, గొప్ప యోగమును పొందును.
- 6 స్థానమున కుజుడున్న సామాన్య జీవనం గడుపును.
- 7 వ స్థానమున భార్యవలన దుఃఖము కలుగును. భూలాభము కలుగును.
- 8 వ స్థానమున భార్యవలన దుఃఖము కలుగును.
- 9 వ స్థానమున కుజుడున్న తండ్రి అనారోగ్యము, స్వల్పయోగమును పొందును.
- 10 వ స్థానమున కుజుడున్న నీచవృత్తి వలన జీవనము, వ్యవసాయము వలన నష్టము కలుగును.
- 11 వ స్థానమున కుజుడున్న సుఖమైన జీవితమును, భూధనలాభములను పొందును.
- 12 వ స్థానమున కుజుడున్న భార్యవలన దుఃఖము సంభవించును.

**వృశ్చికం లగ్నమైతే**

- వృశ్చిక లగ్నమై లగ్నంలో కుజుడున్న బహుస్త్రీ సౌఖ్యము కలుగును.
- 2 వ స్థానంలో కుజుడున్న ధనవ్యయము, అనారోగ్యం కలుగును.

- 3 వ స్థానంలో కుజుడున్న సాధారణ జీవనం, సోదరియొక్క ఆస్తి లభించును.
- 4 వ స్థానంలో కుజుడున్న భూలాభం, స్వల్ప ఋణం కలుగును.
- 5 వ స్థానంలో కుజుడున్న సంతాన నష్టం కలుగును.
- 6 వ స్థానంలో కుజుడున్న శత్రువులు, రోగములు, ఋణములును కలుగును.
- 7 వ స్థానంలో కుజుడున్న స్త్రీ వ్యామోహం, ధనవ్యయం కలుగును.
- 8 వ స్థానంలో కుజుడున్న కళత్రమునకు అనారోగ్యము, సంతానము వలన విచారం కలుగును.
- 9 వ స్థానంలో కుజుడున్న సామాన్య జీవనం కలుగును.
- 10 వ స్థానంలో కుజుడున్న వ్యవసాయం వల్ల గౌరవ జీవనం, భూలాభం కలుగును.
- 11 వ స్థానంలో కుజుడున్న అన్యాయార్జితం కలుగును.
- 12 వ స్థానంలో కుజుడున్న స్వార్జిత ధనం కలవాడు, ధనవ్యయం చేయువాడు.

**ధనుస్సు లగ్నమైతే**

- ధనుస్సు లగ్నమై లగ్నములో కుజుడు ఉన్న కోపము, వికృతరూపము, భూలాభము, రోగ భయము కలుగును.
- 2 వ స్థానంలో కుజుడు ఉన్న ధనవృద్ధి, సంతాన వృద్ధి, స్త్రీ సంతానము ఎక్కువ కోప స్వభావం, సౌఖ్య హీనము కలుగును.
- 3 వ స్థానంలో కుజుడు ఉన్న లోభి, మోసకారి, సోదరుని మోసగించుట కలుగును.
- 4 వ స్థానంలో కుజుడు ఉన్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనము, సంతానవృద్ధి ఉంటుంది.
- 5 వ స్థానంలో కుజుడు ఉన్న మాతృ సౌఖ్యము, విద్య, భూమి, వాహనము సంతాన నష్టం కలుగును.
- 6 వ స్థానంలో కుజుడు ఉన్న ఋణములు, పుత్రునితో విభేదాలు కలుగును.
- 7 వ స్థానంలో కుజుడు ఉన్న కళత్ర సౌఖ్యహీనము, పౌరుషము కలుగును.
- 8 వ స్థానంలో కుజుడు ఉన్న సంతానము వలన విచారము, సౌఖ్యహీనము, విద్యావిహీనము, వ్యవహారములో ఆటంకాలు కలుగును.
- 9 వ స్థానంలో కుజుడు ఉన్న సుయోగము, పితృ సౌఖ్యహీనము కలుగును.

- 10 వ స్థానంలో కుజుడు ఉన్న గ్రంథరచన, కీర్తికాముడైన పుత్రుడు కలుగును.
- 11 వ స్థానంలో కుజుడు ఉన్న విశేష సంతానము, పాండిత్యము, కీర్తి కలుగును.
- 12 వ స్థానంలో కుజుడు ఉన్న సంతాన సౌఖ్యం తక్కువ, లోభం కలుగును.

**మకరం లగ్నమైతే**

1. మకరం లగ్నమై 1 వ స్థానమున కుజుడు వుంటే కోపిష్ఠి, పేరు ప్రతిష్ఠలు కలవాడు, సుఖసంతోషాలతో జీవించును.
2. 2 వ స్థానములో కుజుడు వుంటే సంతాన విచారము, సుఖ సంతోషాలు లేని జీవితం కలుగును.
3. 3 వ స్థానమున కుజుడు వుంటే ధైర్యవంతుడు, సోదర నష్టము, సుఖ సంతోషాలతో కూడిన జీవితాన్ని అనుభవించును.
4. 4 వ స్థానమున కుజుడు వుంటే అధిక భూమి కలవాడు. ధనవంతుడు. సుఖ సంతోషాలతో కూడిన జీవితాన్ని అనుభవించును.
5. 5 వ స్థానమున కుజుడు వుంటే గర్భస్రావం కలుగును. సంతాన విచారం కలుగును. సామాన్యమైన జీవితాన్ని అనుభవించును.
6. 6 వ స్థానమున కుజుడు వుంటే భూ సంబంధమైన వ్యవహారపు చిక్కులు, భూ నష్టము జరుగును.
7. 7 వ స్థానమున కుజుడు వున్న దుర్బలమైన భార్య వచ్చును. సుఖ సంతోషాలు లేని జీవితం కలుగును.
8. 8 వ స్థానమున కుజుడు వుంటే ధనం ఖర్చు, భార్య వలన విచారము కలుగును. సుఖంలేని జీవితం కలుగును.
9. 9 వ స్థానమున కుజుడు వున్న తండ్రివలన సుఖం తక్కువ. సామాన్యజీవనం.
10. 10 వ స్థానమున కుజుడు వున్న ధనవంతుడు, పేరు ప్రతిష్ఠలు కలవాడు. సుఖ సంతోషాలతో జీవించును.
11. 11 వ స్థానమున కుజుడు వున్న ధనవంతుడు, మోసగాడు, సంతోషకరమైన జీవితం కలవాడు.
12. 12 వ స్థానములో కుజుడు వున్న భార్యకు బాధలు, ధనవ్యయం కలుగును.

**కుంభం లగ్నమైతే**

- కుంభలగ్నమై లగ్నమందు కుజుడున్న సుఖము, ధనము, శాంతి, కోప స్వభావము, శరీరసౌఖ్యహీనంను పొందును.
- 2 వ స్థానమున కుజుడున్న ధనవ్యయం, భార్య లేక పుత్రుల వలన దుఃఖము.
- 3 వ స్థానమున కుజుడున్న సుఖము, ధనము, శాంతి, భూలాభం, సోదర భాగ్యమును పొందును.
- 4 వ స్థానమున కుజుడున్న సుఖము, ధనము, శాంతి, విద్యా విఘ్నమును పొందును.
- 5 వ స్థానమున కుజుడున్న సుఖము, ధనము, శాంతి, సంతాన సౌఖ్య హీనము కలుగును.
- 6 వ స్థానమున కుజుడున్న యోగహీనము, శత్రువులు, రోగము కలుగును.
- 7 వ స్థానమున కుజుడున్న సుఖము, ధనము, శాంతి, భార్యకి అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానమున కుజుడున్న వ్యవహారములో చిక్కులు, అశాంతి కలుగును.
- 9 వ స్థానమున కుజుడున్న కార్యసిద్ధి, పూర్వీకుల ఆస్తి లభించును. రాజసన్మానమును పొందును.
- 10 వ స్థానమున కుజుడున్న సంఘంలో గౌరవం, సుఖము ధనము, గొప్పఉద్యోగమును పొందును.
- 11 వ స్థానమున కుజుడున్న భూ, ధనలాభం, కార్యసిద్ధి, సుఖము, శాంతి కలుగును.
- 12 వ స్థానమున కుజుడున్న మధ్య మధ్య వ్యవహారంలో చిక్కులు, అశాంతి కలుగును. ధనము ఖర్చు అగును. యోగహీనాన్ని పొందును.

**మీనం లగ్నమైతే**

- మీనలగ్నమై లగ్నములో కుజుడు ఉన్న స్వల్ప శరీర సుఖము కలుగును.
- 2 వ స్థానంలో కుజుడు ఉన్న కుటుంబ సుఖము తక్కువ.
- 3 వ స్థానంలో కుజుడు ఉన్న ఉద్యోగము లభించును.
- 4 వ స్థానంలో కుజుడు ఉన్న ఆస్తి వివాదములో జయము.
- 5 వ స్థానంలో కుజుడు ఉన్న సుఖజీవనమున్నా సంతాన నష్టం కలుగును.
- 6 వ స్థానంలో కుజుడు ఉన్న ఆటంకములు, అశాంతి కలుగును.
- 7 వ స్థానంలో కుజుడు ఉన్న భార్యకు అశాంతి కలుగును.

- 8 వ స్థానంలో కుజుడు ఉన్న తండ్రి ఆస్తి నష్టము, సంసార సుఖము లేకపోవుట కలుగును.
- 9 వ స్థానంలో కుజుడు ఉన్న ఉద్యోగము, భూమి, గౌరవము లభించును.
- 10 వ స్థానంలో కుజుడు ఉన్న సంపూర్ణ ఆరోగ్యము, భూలాభము కలుగును.
- 11 వ స్థానంలో కుజుడు ఉన్న విశేష భూ లాభము కలుగును.
- 12 వ స్థానంలో కుజుడు ఉన్న కళత్ర విచారము, ధన నష్టము కలుగును.

## వివిధభావాలలో కుజుడు - ఫలితాలు

- కుజుడు లగ్నంలో ఉంటే జాతకుడు అందంగా ఉండాలని ప్రయత్నిస్తాడు. ఏ పనిని స్థిరంగా చేయడు. చపల చిత్తం కలవాడు. నీచస్వభావం కలవాడు. సుఖంగా జీవించలేడు చర్మరోగం ఏర్పడుతుంది.
- కుజుడు ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు విలాసవంత జీవితం గడుపుతాడు. పాడి, పంట కలవాడు. జూదమాడి నష్టపోతాడు. అప్పులు చేస్తాడు.
- కుజుడు తృతీయభావంలో ఉంటే జాతకుడు కష్టజీవి. ఆరాశి కుజునకు శుభస్థానమైతే జాతకుడు విలాసవంతమైన జీవితం గడుపుతాడు. అశుభస్థానమైతే దరిద్రం అనుభవిస్తాడు. సోదరులకు ఆపద కలుగుతుంది.
- కుజుడు చతుర్థభావంలో ఉంటే జాతకుడు స్నేహితులను నమ్మి, ఇబ్బందులు పడతాడు. స్వస్థలానికి దూరంగా జీవిస్తాడు. అనారోగ్యం కలవాడు.
- కుజుడు పంచమభావంలో ఉంటే జాతకునకు పుత్రులు ఉంటారు. కుజుడు ఉచ్చలో ఉంటే పుత్రులు అభివృద్ధి చెందుతారు. కుజుడు నీచలో ఉంటే పుత్రులు ధనహీనులవుతారు.
- కుజుడు షష్టమభావంలో ఉంటే జాతకుడు గర్వంతో ఇతరులను హేళన చేస్తుంటాడు. అందువలన ఇతరులకు ఇతనిపై అయిష్టభావం ఏర్పడుతుంది. కుజుడు శత్రునీచస్థానంలలో ఉంటే ఎల్లప్పుడు కలహాలు ఏర్పడుతుంటాయి. స్వక్షేత్రం, మిత్రక్షేత్రం, ఉచ్చ క్షేత్రాలలో ఉంటే శత్రువుల వలన భయం ఉండదు.
- కుజుడు సప్తమ భావంలో ఉంటే భార్యాభర్తలు కలసి ఉండరు.
- కుజుడు అష్టమ భావంలో ఉంటే జాతకునకు శ్వాసకోశ సంబంధమైన అనారోగ్యం కలుగుతుంది. కంటిదోషం ఉంటుంది. ద్వికళత్రయోగం కలదు.
- కుజుడు నవమభావంలో ఉంటే జాతకునకు ధనం లేకపోయినా దైవభక్తి ఎక్కువగా ఉంటుంది.

- కుజుడు దశమభావంలో ఉంటే జాతకునకు అధికారం ఉంటుంది. ధనసంపాదన ఉంటుంది. రత్నములను కలిగిఉంటాడు. సుఖజీవనం గడుపుతాడు.
- కుజుడు ఏకాదశభావంలో ఉంటే జాతకుడు దానధర్మాలు చేస్తాడు. ఇతరులకు సాయపడతాడు.
- కుజుడు ద్వాదశభావంలో ఉంటే జాతకుడు స్నేహితులతో గిల్లికజ్జాలు పెట్టుకుంటూ ఉంటాడు. అంగవిహీనుడు.

**కుజుడు కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- కుటుంబంలోని స్త్రీలకు గర్భస్రావం జరుగుతుంది.
- తరచు గాయాలు ఏర్పడతాయి. (చాకు, బ్లేడు, కత్తిపీట వంటివి ఉపయోగించినపుడు వాటివలన తెగుట మొదలైనవి)
- తగాదాలలో దెబ్బలు తగులుతాయి.
- కోర్టు వ్యాజ్యాలలో పాల్గొనవలసివస్తుంది.
  స్థిరాస్తులపై దావా వేయబడుతుంది.
- ఉపయోగించే వాహనములను తరచుగా మరమ్మత్తులు చేయవలసి వస్తుంది.
- సోదరులతో అభిప్రాయభేదాలు ఏర్పడతాయి.

**కుజుడు శాంతించుటకు చేయవలసిన పరిహార క్రియలు :-**

- "యోగా" చేయండి. కోపం తగ్గించుకోండి.
- సోదరులను ఆదరించండి.
- తూర్పు ఆగ్నేయదిశలో ముళ్ళున్నచెట్లు పెంచండి.
- ఇంటిలో సుబ్రహ్మణ్యస్వామి పటమును ఉంచి, ప్రతిదినం దీపారాధన చేయండి.
- భూలక్ష్మి యంత్రమును ఇంటిలో దక్షిణదిశలో ఉంచండి.
- "పగడము" పొదిగిన ఉంగరాన్ని ధరించండి.

## వివిధభావాలలో కుజుడు - పరిహార క్రియలు

**లగ్నంలో కుజుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- కుటుంబ సభ్యులు కాక ఇతరుల వద్దనుండి ఏవస్తువును ఉచితంగా తీసుకోవద్దు.
- ప్రతిదినం సుబ్రహ్మణ్యజపం చేయండి.

**ద్వితీయ భావంలో :-**

- వరుసగా 6 మంగళ వారాలు గోధుమపిండి, బెల్లం కలిపిన ఉండలను పిల్లలకు పంచండి.
- మీ వద్ద ఎప్పుడూ ఎర్రని వస్త్రం ఉండాలి. కనీసం ఎర్రరుమాలు అయినా ఉండాలి.
- ఇంటిలో దక్షిణపువైపు గదిలో జింకచర్మాన్ని ఉంచాలి.

**తృతీయభావంలో :-**

- ప్రతిదినం సుబ్రహ్మణ్యస్వామి జపం చేయండి.
- సాధ్యమైనంత తక్కువగా మాట్లాడండి.
- ఎవరితోను వాదన చేయకండి. ఎవరినీ విమర్శించకండి.
- చట్టాలను గౌరవించండి.

**చతుర్థభావంలో :-**

- ప్రతి మంగళవారం సాధువులకు భోజనం పెట్టండి.
- "పగడం" బిగించిన వెండి ఉంగరాన్ని ధరించండి.
- ప్రతిదినం సుబ్రహ్మణ్యస్వామిని పూజించండి.
- ప్రతిదినం పిల్లలకు స్వీట్లు పంచండి. ఈ విధంగా కనీసం 42 రోజులు పంచాలి.

**పంచమభావంలో :-**

- ప్రతిరోజు సుబ్రహ్మణ్యస్తోత్రం చేయండి.
- ప్రతిరోజు వేపచెట్టుకు నీరు పోయండి.
- నిద్రించుటకు ముందు, తలవద్ద నీటితో నిండిన రాగి పాత్రను ఉంచుకొని, మరునాటి ఉదయాన ఆ నీటిని పూలకుండీలో పోయండి.

**షష్ఠమ భావంలో :-**

- ప్రతిదినం సుబ్రహ్మణ్యస్తోత్రం చేయండి.
- ప్రతిదినం కుజమంత్రాన్ని జపించండి.
- కొత్తగా ఇనుపవస్తువులను కొనకండి. అవసరమైతే కొనినా, వాటిని ఇంటిలో ఉంచకండి.
- వంటయింటిని ఎల్లప్పుడు శుభ్రంగా ఉంచండి.

**సప్తమ భావంలో :-**

- బంధువులను ఆదరించండి.
- ఆడపిల్లలకు స్వీట్లు పంచండి.
- ఇంటిలో లేదా ఇంటి ఆవరణలో ప్రాకేమొక్కను పెంచండి.

**అష్టమ భావంలో :-**

- ప్రతిరోజు అంగారక మంత్రమును జపించండి.
- విధవలకు సహాయం చేయండి.
- అనాథపిల్లలకు స్వీట్లు పంచండి. ఇలావరుసగా 42 రోజులు చేయండి.
- నూతనంగా ఇనుపవస్తువులను కొనవద్దు. కొనినా ఇంట్లో ఉంచవద్దు.

**నవమ భావంలో కుజుడు :-**

- అన్నగారి మాట వినండి.
- వదిన ఆశీర్వాదం పొందండి.
- ఎల్లప్పుడు ఎర్రని వస్త్రం ధరించాలి. కనీసం ఎర్రరుమాలు ఎల్లప్పుడు మీవద్ద ఉండాలి.
- సాయిబాబా గుడికి స్వీట్లు ప్రసాదంగా ఇవ్వండి.

**దశమ భావంలో కుజుడు :-**

- మీవద్ద సుబ్రహ్మణ్యస్వామి పటంను ఉంచుకోండి.
- పగడం పొదిగిన ఉంగరాన్ని ధరించండి.
- పాలు పొంగి పొయ్యిలో పడకుండా చూడండి.
- వెంకటేశ్వరస్వామి దేవాలయముకు చక్రపొంగలిని ప్రసాదంగా సమర్పించండి.

**ఏకాదశ భావంలో కుజుడు :-**

- ప్రతిరోజు ఆంజనేయస్వామి గుడికి వెళ్ళండి.
- ప్రతిరోజు సింధూరాన్ని ధరించండి.
- ఒకచిన్న పాత్ర నిండా తేనెపోసి, దానిని ఇంటిలో ఉంచండి.

**ద్వాదశ భావంలో కుజుడు :-**

- ప్రతిరోజు సుబ్రహ్మణ్యస్వామిని పూజించండి.
- 6 మంగళవారాలు ఆంజనేయస్వామికి "అప్పాలు" చేయించండి.
- ప్రతిదినం ఉదయాన పరగడుపుతో తేనెను త్రాగండి.

# 66. కుజహోర

**కుజహోర :-**

కుజహోరకు అధిపతి కుజుడు. మంగళవారం లేదా మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రములు కలిగియున్న రోజులలో కుజ ప్రభావం ఎక్కువగా వుంటుంది. ఆనాటి కుజహోర సమయంలో కుజుని ప్రభావం అత్యధికంగా వుంటుంది.

కుజహోరలో యుద్ధం ప్రారంభించుటకు, కోర్టులో దావా వేయుటకు మంచి సమయం.

సోమవారం వచ్చే కుజహోర ఎరువులు కొనుటకు, శస్త్రచికిత్సకు సంబంధించిన పరికరాలు కొనుటకు అనుకూలము.

మంగళవారం నాటి కుజహోర మిలటరీలో చేరటానికి, పోలీసు వ్యవస్థలో చేరటానికి, ఫ్యాక్టరీలో ఉద్యోగంలో చేరుటకు అనుకూలం.

బుధవారం నాటి కుజహోర ప్రెస్సు, గృహనిర్మాణం, ఎలక్ట్రానిక్ షాపు ప్రారంభించుటకు అనువైన సమయం.

గురువారంనాడు కుజహోర సమయంలో కోర్టులో ఉద్యోగం చేరుటకు శుభ సమయం. దేవాలయాలు, చర్చి వంటి ఆధ్యాత్మిక కేంద్రాలకు, కళాశాలలకు అందులోని బోధకులకు శుభప్రదమైన కాలం.

శుక్రవారం నాడు కుజహోర శక్తినిస్తుంది. కలయికకు మంచికాలం. కాఫీ, టీ, తోలు, పరిశ్రమలకు, లాడ్జింగ్, సినిమాథియేటర్, ఫ్యాన్సీషాపు, వ్యవసాయము ప్రారంభించుటకు సరియగు సమయము.

శనివారం కుజహోరలో తోళ్ళపరిశ్రమ లేదా దానికి సంబంధించిన వ్యాపారం ప్రారంభిస్తే అది అభివృద్ధి చెందుతుంది.

ఆదివారం నాటి కుజహోర శస్త్రచికిత్సకు సంబంధించిన పరికరాలు కొనుగోలు చేయుటకు ఉత్తమం.

సుబ్రహ్మణ్యస్వామిని ప్రార్థించుట మంచిది.

**కుజహోర సమయం :-**

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయం నుండి హోర సమయమును లెక్కిస్తారు. హోరకాలప్రమాణం ఒక గంట.

సూర్యోదయ, సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింద సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు (6 A.M నుండి 6 P.M వరకు) | రాత్రి (6 P.M నుండి6 A.M మరునాడు వరకు) |
|---|---|---|
| ఆదివారం | 12-1, | 7-8, 2-3 |
| సోమవారం | 9-10, 4-5 | 11-12 |
| మంగళవారం | 6-7, 1-2 | 8-9, 3-4 |
| బుధవారం | 10-11, 5-6 | 12-1 |
| గురువారం | 7-8, 2-3 | 9-10, 4-5 |
| శుక్రవారం | 11-12, | 1-2, |
| శనివారం | 8-9, 3-4 | 10-11, 5-6. |

# 67. ధారణం

**కుజదోష నివారణకు రత్నధారణ :-**

కోర్టు దావాలు, ఋణము, ప్రమాదము వంటి సమస్య పరిష్కారముకు పగడమును ధరిస్తారు. వ్రణములు, గాయములు, అపస్మారము కలవారు పగడమును ధరించుట ఉత్తమము.

**పగడము :-**

కుజునికి ధరించవలసినది పగడము.

మంగళవారమునాడు శుక్లపక్ష షష్టిన ఎర్రని రంగు గల నూతన వస్త్రంపై రాగి పళ్ళెము వుంచాలి. ఆ పళ్ళెంలో పగడము నుంచి దానిని తేనె, ఆవునేతితో అభిషేకించాలి. పగలు ఉపవాసం చేసి, సుబ్రహ్మణ్యేశ్వరుని మంత్రము జపించాలి. ఈ విధంగా 9 రోజులు చేసి, చక్కెరపొంగలిని నైవేద్యం పెట్టి తరువాత ధరించాలి.

పగడమును ధరించలేనివారు రెడ్ జాస్పర్, సాంగ్‌మూంగి, కామెలియన్ ఉపరత్నములన ధరించవచ్చును.

మృగశిర, చిత్త, ధనిష్ట నక్షత్రములు జన్మనక్షత్రములైనవారు, మేషలగ్నం, వృశ్చిక లగ్నం లేదా మేషరాశి, వృశ్చికరాశిలో పుట్టినవారు, కుజునికి సంబంధించిన రత్నములను ధరించవచ్చును.

**కుజదోష నివారణకు రుద్రాక్షధారణ :-**

కుజగ్రహం అనుకూలంగా లేనివారు త్రిముఖషణ్ముఖి రుద్రాక్షను ధరించ వచ్చును.

**త్రిముఖి రుద్రాక్ష:-**

1. దీనిని త్రిమూర్తులకు ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన అపమృత్యుభయం కలగదు.
3. రుద్రాక్షయందు మూడు ధారలుంటాయి.

**షణ్ముఖి రుద్రాక్ష:-**

1. దీనిని కుమారస్వామి స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన బి.పి. ఆస్మా, గ్యాస్ట్రబుల్ వంటివి నశిస్తాయి.
3. వ్యాపారాభివృద్ధి కలుగుతుంది. 4. రుద్రాక్షయందు ఆరు ధారలుంటాయి.

## కుజగ్రహానుగ్రహం కోసం కవచం

ఒక రాగిరేకుకు ఇరువైపుల క్రింది యంత్రాలను చెక్కించాలి.

| | | |
|---|---|---|
| ఎనిమిది | ఒకటి | ఆరు |
| మూడు | ఐదు | ఏడు |
| నాలుగు | తొమ్మిది | రెండు |
| ఎనిమిది | మూడు | పది |
| తొమ్మిది | ఏడు | ఐదు |
| నాలుగు | పదకొండు | ఆరు |
| ఏడు | రెండు | తొమ్మిది |
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |

| | | |
|---|---|---|
| ఏడు | రెండు | తొమ్మిది |
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |
| ఎనిమిది | మూడు | పది |
| తొమ్మిది | ఏడు | ఐదు |
| నాలుగు | పదకొండు | ఆరు |
| ఎనిమిది | ఒకటి | ఆరు |
| మూడు | ఐదు | ఏడు |
| నాలుగు | తొమ్మిది | రెండు |

ఈ యంత్రమును "ఓం క్రాం క్రీం క్రౌం సః భౌ మాయ నమః" అను మంత్రమును 1,25,000 సార్లు జపిస్తూ పూజించాలి. తరువాత మెడలో లాకెట్‌గా ధరిస్తే ఋణ విముక్తి, రాజకీయ లబ్ధి కలుగుతుంది.

## 68. దానం

1. కుజమహాదశలో కుజ అంతర్దశ - ఎద్దు ప్రతిమ
2. కుజమహాదశలో రాహు అంతర్దశ - నల్లని ఆవు ప్రతిమ
3. కుజమహాదశలో గురు అంతర్దశ - బంగారం
4. కుజమహాదశలో శని అంతర్దశ - నువ్వులు/చిమ్మిలి
5. కుజమహాదశలో బుధ అంతర్దశ - గుర్రము ప్రతిమ
6. కుజమహాదశలో కేతు అంతర్దశ - మేక ప్రతిమ
7. కుజమహాదశలో శుక్ర అంతర్దశ - దుర్గారూపు/ప్రతిమ
8. కుజమహాదశలో రవి అంతర్దశ - పద్మం ప్రతిమ
9. కుజమహాదశలో చంద్ర అంతర్దశ - ఎద్దు ప్రతిమ

★ కనీసం యధాశక్తి రేకు ప్రతిమనైనా దానం ఇచ్చుట శ్రేయస్కరం. అవకాశం గలవారు నిజమైన జీవములనే దానం ఇవ్వవచ్చును.

## 69. పారాయణం

## పారాయణ స్తోత్రాలు

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన కుజ గ్రహానుగ్రహం పొందవచ్చును.

1. కుజకవచస్తోత్రం/కుజఅష్టోత్తర శతనామావళి
2. కుజ అష్టోత్తర శతనామస్తోత్రం/కుజ కవచ స్తోత్రం
3. కుజగ్రహమంగళాష్టకం/ఋణ విమోచక కుజస్తోత్రం
4. ఋణవిమోచక కుజదండకం/సుందరకాండ పారాయణ
5. కుజజపం/సుబ్రహ్మణ్యాష్టకం/సుబ్రహ్మణ్యస్తోత్రం
6. సుబ్రహ్మణ్యాష్టోత్తర శతనామస్తోత్రం/సుబ్రహ్మణ్యకవచం
7. సుబ్రహ్మణ్య పంచరత్నస్తోత్రం/భుజంగస్తోత్రం/షట్కం
8. సుబ్రహ్మణ్య స్తవరాజం/కుమారస్తుతి/కుమార కవచం
9. హనుమాన్ చాలీసా/ఆంజనేయ దండకం
10. సుబ్రహ్మణ్య మాలాస్తోత్రం/కార్తికేయ స్తుతి

# రామాయణ పారాయణ

కుజమహార్దశలో బాలకాండ 36-37 సర్గలు పారాయణం. హనుమంతుని పూజ. చక్కెర పొంగలి నైవేద్యం.

1. కుజ మహాదశలో రవి అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : బాలకాండ 23 సర్గ
   నైవేద్యం : పంచదార గుళిక/పటిక బెల్లం/పాయసం
2. కుజమహాదశలో చంద్ర అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : బాలకాండ 17 సర్గ
   నైవేద్యం : క్షీరాన్నం/పాలు/పంచదార
3. కుజమహాదశలో కుజ అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : ఉత్తరకాండ 26 సర్గ
   నైవేద్యం : బెల్లం - కందిపప్పు పొంగలి.
4. కుజమహాదశలో బుధ అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : సుందరకాండ 51 సార్లు
   నైవేద్యం : అరటిపళ్ళు (చక్కెర కేళీలు) ఆకుపచ్చవి
5. కుజమహాదశలో గురు అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : సుందరకాండ 51 సర్గ
   నైవేద్యం : పచ్చని పళ్ళు ఏవైనా
6. కుజ మహాదశలో శుక్ర అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : 53 సర్గ సుందరకాండ
   నైవేద్యం : పంచదార/ఖండ శర్కర
7. కుజమహాదశలో శని అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : అరణ్యకాండ 70 సర్గ
   నైవేద్యం : నేరేడు/నల్లద్రాక్ష
8. కుజ మహాదశలో రాహు అంతర్దశ జరుగు కాలమును
   పారాయణ : యుద్ధకాండ 59 సర్గ
   నైవేద్యం : ఎండుద్రాక్ష/తేనె
9. కుజమహాదశలో కేతు అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : యుద్ధకాండ 11సర్గ
   నైవేద్యం : కొబ్బరికాయ/ఖర్జూరం

# 70. సందర్శనం

## దర్శించదగిన క్షేత్రములు

కుజుడు, సుబ్రహ్మణ్యుడు అభేదమూర్తులు గనుక, కుమారస్వామి ఆలయాలు ఎక్కడవున్నా సందర్శించవచ్చును. నృసింహ ఆలయాలు, విష్ణు, ఆంజనేయస్వామి మందిరాలను కూడా కుజదోష నివృత్తికి దర్శించవచ్చు!

**తమిళనాడులో ఉన్న 6 సుబ్రహ్మణ్య క్షేత్రాలు :-** (ప్రసిద్ధం)

1.పళని, 2. తిరుత్తని 3. తిరుచ్చెందూర్ 4. తిరుప్పరకుండ్రం 5. స్వామిమలై 6. పఝముదిరిసోలై.

**1 పళని:-** ఇక్కడ స్వామిని దండాయుధపాణిగా కొలుస్తారు. శివగిరి కొండమీద ఉన్న ఆలయం. మధురై నుంచి 122కి.మీ దూరంలో ఉంది. మెట్లతో పాటు వించ్ ఏర్పాటు కూడా ఉంది. కొండదిగువన షణ్ముఖనది ఉంది. ఇక్కడ స్వామివారికి కావడి ఉత్సవాలు మహావైభవంగా జరుగుతాయి. తేనె, పాలు, పంచదార, కదళీఫలం గుజ్జుతో అభిషేకాలు. ప్రతిరోజు రకరకాల అభిషేకాలు జరిపినా, విగ్రహం మాత్రం చెక్కు చెదరలేదు. ఖనిజాలతో రూపొందిన విగ్రహం. ఈ స్వామివారికి కదంబపూలపరిమళం అంటే చాలా ఇష్టం. దీనికై ప్రత్యేకంగా ఇక్కడ ఒక పూలవనం కూడా ఉంది. స్వామివారి అభిషేక జలంతో సిద్ధవైద్యం చేస్తారు.

**2. తిరుత్తణి:-** ఆరు ప్రసిద్ధ సుబ్రహ్మణ్యక్షేత్రాల్లో ఒకటి. చెన్నయ్ నుంచి 80కి.మీ. ఆర్కోణం నుంచి 13 కి.మీ స్వామివారిని 'కార్తికేయన్'గా కొలుస్తారు. ఇక్కడగల పెద్ద గంధపు సాన నుంచి తీసిన చందన ప్రసాదాన్ని 'శ్రీపాదరేణువు' అంటారు. ఇది సర్వవ్యాధినివారిణిగా భక్తులు విశ్వసిస్తారు. శ్రీవల్లీ దేవసేనా సమేతంగా యిక్కడ స్వామి దర్శనం ఇస్తాడు. తిరుపతి-చెన్నై రూటులో ఉన్న పుణ్య క్షేత్రం.

**3. తిరుచ్చెందూర్ :-** సముద్రతీరాన ఉన్న సుబ్రహ్మణ్యేశ్వరాలయం. కన్యాకుమారి నుండి 99కి.మీ తిరునల్వేలి నుండి 48 కి.మీ. ఇక్కడ పీచు పూర్తిగా తీసివేసి గుండ్రంగా ఉన్న కొబ్బరికాయలు కొడతారు. ఇక్కడ భస్మం, గంధం ఆకులలో పెట్టి ప్రసాదంగా ఇస్తారు. ఇసుకలో కాళ్ళు కాలకుండా ప్రయాణించడానికి ఆలయందాకా పైకప్పు, రహదారి కూడా ఉన్నాయి. ఈ ఆలయపు రెండో ప్రాకారంలో విష్ణుమూర్తి ఆలయం ఉంది. ఇక్కడ రైతులు తమ మొదటి పంటను స్వామివారికి సమర్పించుకుంటారు. ఇక్కడ మే నెలలో (వైశాఖంలో) గొప్ప ఉత్సవం

జరుగుతుంది. మూగవారికి మాటలు వచ్చేలా చేయు స్వామివారిగా ప్రసిద్ధి.

**4. తిరుప్పరకుంద్రం :-** మధురై నుంచి 8కి.మీ దూరంలో ఉన్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం. ఇంద్రుని కుమార్తె అయిన దేవసేనను కుమారస్వామి పెళ్ళాడిన చోటు. ఇక్కడ స్వామివారికి గాక, ఆయన ఆయుధానికి పూజలు జరుగుతాయి. స్వామివారి ఆలయం కొండమీద ఉంది.

**5. స్వామి మలై :-** కుంభకోణం నుంచి 18 కి.మీ. దూరంలో ఉంది. ఆరు సుప్రసిద్ధ కుమార క్షేత్రాల్లో ఒకటి. ఇక్కడ స్వామిని గురునాథుడని అంటారు. ఇక్కడే శివునికి సుబ్రహ్మణ్యస్వామి ప్రణవ రహస్యాన్ని తెలిపాడట. దేవాలయం గర్భగుడిలోని విగ్రహం (స్వామిది) కొంచెం యెత్తుగా, శివుని విగ్రహం కాస్త దిగువన భక్తితో ఉపదేశం పొందుతున్న రీతిలో ఉంటుంది.

**6. పళముదిరిసోలై :-** మధురైకి 12కి.మీ దూరంలో ఉంది. స్వామివారు బాల సుబ్రహ్మణేశ్వరుడు. అళఘర్ కోయిల్‌కు 4 కి.మీ. ఆరు కుమారస్వామివారి క్షేత్రాల్లో ఇది ఒకటి. ఇవికాక...

తమిళనాడులోనే 1. తీన్‌కాశితాలూకా, తిరునల్వేలిజిల్లా ఫణ్‌పాళియందు, 2. పుదుక్కోట యందు, 3. ఇదే జిల్లాలోని కున్నాండార్ యందు కూడా కుమార స్వామికి ఆలయాలున్నాయి. దర్శించండి.

## కర్ణాటకలో ఉన్న సుబ్రహ్మణ్య క్షేత్రాలు

**1. కుక్కే సుబ్రహ్మణ్యం :-** మంగుళూరు నుండి 100 కి.మీ దూరంలో ఉన్న సుబ్రహ్మణ్యక్షేత్రం ఇది. కుమార నదీ తీరంలో కుమార పర్వతం ప్రక్కన ఉన్న దివ్యస్థితి. కన్నడ భాషలో 'కుక్కే' అనగా బుట్ట స్వామి. ఈ స్వామి బుట్టలో దొరికినందున ఆ పేరు వచ్చింది. ఈ క్షేత్రంలో ఒక ఫర్లాంగు పొడవున కొండగుహ ఉంది. ఈ గుహలో ఇటువైపు నుంచి అటువైపు వరకు వేళ్తే పుణ్యం. కనుక కొత్త శ్రమ, భయం ఉన్నప్పటికీ, భక్తిభావంతో యాత్రికులంతా గుహలోకెళ్ళి అటువైపు నుంచి తిరిగొస్తారు. శ్రీవల్లిని పరిణయమాడిన పవిత్రస్థలి అనీ దేవసేనాధిపతిగా అభిషేకింపబడిన స్థలం అనీ స్థలపురాణం చెపుతోంది.

**2. ఘాటి సుబ్రహ్మణ్యం :-** బెంగుళూరుకు 53కి దూరంలోను, బెంగుళూర్-గుంతకల్ రైల్వే లైన్‌లో మాకాళ్ స్టేషన్‌కు 3 కి.మీ దూరంలోను ఉన్న ఈ పుణ్యక్షేత్రంలో శివపార్వతులతో పాటు కుమారస్వామి కూడ కొలువై ఉన్నాడు. గ్రహదోష నివారణ నిమిత్తం ప్రదక్షిణలు దానములు జరుపుకొనవచ్చును.

**3. శృంగేరి:-** ఇక్కడ నవగ్రహములకు విడివిడిగా స్తంభాలపై చెక్కిన విగ్రహాలున్నాయి. పూజలు జరుపుకోగలవారికి గొప్ప అవకాశము. సువర్ణశారదాంబను ఇక్కడే ఆదిశంకరులు ప్రతిష్ఠించారు. ఇక్కడున్న శివాలయంవద్ద 12 రాశులకు ప్రాముఖ్యత కల్పించేలా తీర్చిదిద్దారు. ఏ రాశిలో సూర్యుడుంటే, ఆరాశి స్తంభం మీద తొలి సూర్య కిరణాలు పడేలా చెక్కిన వాస్తు విజ్ఞానం అపూర్వం.

**బెంగుళూర్** హనుమంతనగర్‌లో కూడ గణపతిగుడిలో స్వామిని చూడొచ్చు.

## కేరళలో కుమారస్వామి ఆలయాలు

**1. ఉదయనపురం:-** కొట్టాయం జిల్లా వైక్కంకు 3 కి.మీ దూరంలో ఉంది. ఇక్కడ కుమారస్వామికి తండ్రి శివస్వామికి ఒకే ఊరేగింపు, స్నానోత్సవం జరుగుతాయి. (దీనిని కూడి పూజ అంటారు) రాత్రి లక్షదీపార్చన గొప్ప భక్తి ప్రపత్తులతో సాగుతుంది. స్వామివారు ఉదయనపురతప్పన్. యావద్భారత దేశంలోనే ఈ రీతిన తండ్రీకొడుకులకు పూజను ఎక్కడా మనం చూడలేము. తారకాసుర సంహారానికి సూచనగా ఈ సంబరం.

**2. కుమారనల్లూర్:-** ఇదే కొట్టాయం జిల్లాలో కొట్టాయానికి 3 కి.మీ దూరంలో కుమార్ నల్లూర్‌లోనూ సుబ్రహ్మణ్యస్వామి ఆలయం ఉంది. ఇక్కడ నైవేద్యాన్ని దేవాలయపు ప్రహరీ గోడలపై ఉంచే ఆచారం ప్రత్యేకత.

**3. హరిపాడ్:-** అలెప్పీ జిల్లాలో చెంగన్నూర్‌కు 20కి.మీ దూరంలో ఉన్న కుమార క్షేత్రం. ఇక్కడ స్వామి చతుర్భుజుడు.

**4. మన్నార్:-** కొచ్చిన్‌కు 135 కి.మీ దూరంలో ఉన్న క్షేత్రం.

## ఉత్తరాదిన గల ఒకే ఒక కుమారస్వామి గుడి

**అచలేశ్వర్:-** ఉత్తర భారతదేశంలో సుబ్రహ్మణ్యస్వామి వెలసిన ఒకే ఒక్క దివ్యక్షేత్రం అచలేశ్వర్. పంజాబ్ రాష్ట్రంలోని అమృతసర్-పఠాన్‌కోట లైన్‌లో బటాలా రైల్వే స్టేషన్‌కు 6 కి.మీ. ఇక్కడనుంచే శివపార్వతుల అనుమతితో కుమారస్వామి భూప్రదక్షిణకు బయలుదేరగా, తల్లిదండ్రులకే ప్రదక్షిణం చేసిన గణపతికి భూప్రదక్షిణ ఫలం సిద్ధించింది. దీనితో కుమారస్వామి తాను యిక ప్రదక్షిణం చేయడం అనవసరం అని తలచి అట్లే కదలకుండా ఉండిపోయిన చోటు ఇదేనని స్థలపురాణం. ఇక్కడ పార్వతీ పరమేశ్వరుల్నీ దర్శించగలం.

## మనరాష్ట్రంలో గల కుమారస్వామి క్షేత్రాలు

**1. మోపిదేవి:-** కృష్ణాజిల్లాలో చల్లపల్లికి 5 కి.మీ దూరంలో గల సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయం. ఇక్కడ స్వామివారు లింగరూపుడు. ఇది పాతాళం వరకు ఉన్నదని ప్రతీతి. ఈ లింగము గుండ్రముగా గాక పలకలుగా ఉంటుంది. పానవట్టం క్రింది భాగాన (కుడివైపు) రంధ్రం ఉండి, అప్పుడప్పుడు సజీవంగా ఉన్న సర్పం బైటికి వచ్చి దర్శనం ఇస్తుంటుంది. కుజదోష నివారణార్ధం, ఈ గ్రంథంలో ఆచరించదగిన మార్గాలలో అన్నీ చేయగల ఏర్పాట్లు ఈ క్షేత్రంలో ఉన్నాయి.

**2. ఘంటశాల:-** కృష్ణాజిల్లాలోనే చల్లపల్లికి 8కి.మీ. దూరమున గల ఘంటశాలలో విభూతిపూత నిండి ఉన్నట్లు తెల్లని శివలింగం (జలధీశ్వరస్వామి) గల శివస్వామి. పార్వతి ఒకే పానవట్టంపై వెలసినట్లు కనిపిస్తారు. పక్కనే సుబ్రహ్మణ్యేశ్వరుడు కూడా ఉన్నాడు. ప్రాచీన ఆలయం-గ్రహదోష నివారణనిమిత్తం దర్శించదగినది.

★ చిత్తూరు జిల్లా చిత్తూరులో కూడ సుబ్రహ్మణ్యేశ్వరుని, విజయవాడకు 10కి.మీ. దూరంలో ఉన్న చోడవరంలో నాగేశ్వరస్వామిని దర్శించుకోవచ్చు.

## తిరు చెందూర్ ఆలయ ప్రత్యేకత

తమిళనాడులోని ప్రసిద్ధ సుబ్రహ్మణ్యక్షేత్రం తిరుచెందూర్ ఆలయ ప్రత్యేకతలు ఎన్నో ఉన్నాయి. శనీశ్వరుని విగ్రహం గల సుబ్రహ్మణ్యాలయం దేశం మొత్తంమీద ఇదొక్కటే.

అరేబియా సముద్ర తీరంలో ఉన్న ఈ ఆలయంలో తెరవెనుక ఉన్న షణ్ముఖునికి ముందుగా పూజ జరుగుతుంది. ఈ పూజ ఆత్మశక్తిని ఇస్తుందంటారు. అనంతరం తెరముందు గల స్వామికి పూజ జరుగుతుంది. రహస్య దీపారాధన (తెర వెనుకపూజ) దర్శించే భాగ్యం అందరికీ లభించదు.

ఎంతనీరు తోడినా తరగని రెండు బావులు (ఒకటి ఉప్పునీరు, ప్రక్కనే రెండో దానిలో - మంచినీరు) ఈ క్షేత్రంలో ఉన్నాయి.

## వైదీశ్వరన్ కోయిల్ ఆలయ ప్రత్యేకత

అన్యోన్య దాంపత్యం కోసం భార్యాభర్తలు గాని, నూతన వధూవరులుగాని, ఇంకా పెళ్ళి కావలసి వున్న కన్యలు గాని దర్శించదగ్గ క్షేత్రం. తమిళనాడులోని వైదీశ్వరన్ కోయిల్. ఈ వూరి ప్రత్యేకతలు చాలా ఉన్నాయి.

ఇక్కడ ప్రత్యేకంగా కుజునికి ఆలయం ఉంది. అట్లే ఇతర గ్రహాలకూ విడివిడిగా ఆలయాలున్నాయి. తంజావూర్ జిల్లాలో షీర్‌కాశి-పెరుంపాల్లెం రూట్‌లో పెరుంపాల్లెం నుంచి ఇక్కడకు 28 కి.మీ షీర్ కాశినుంచి 6కి.మీ. చిదంబరం నుంచి 24 కి.మీ స్వామివారు వైదీశ్వరుడు. అమ్మవారు తెయ్యలనాయకి. ఈ క్షేత్రంలో స్వామివారు కుష్ఠురోగనివారణకు ప్రసిద్ధి. ఇక్కడ గొప్ప వేపచెట్టు కలదు. సాక్షాత్ అంగారకునికే కుష్ఠురోగ నివారణ చేసిన స్వామివారు వైద్యేశ్వరుడు. ఇక్కడ గల సిద్ధామృత తీర్థం 'కుజ'దోష నివారణ నిమిత్తం స్నానం చేయదగినది ఇక్కడ తిరుచందుపిల్స్ (ఆలయంలోని బూడిద, అంగారక తీర్థంలోని నీటిని, మట్టిని కలిపి తయారుచేస్తారు) లభిస్తాయి. ఇవి సర్వరోగనివారకం. ఇంత మహత్తుగల ఈ ప్రదేశంలో జటాయువు నిర్యాణంచెందగా, శ్రీరాముడు ఆ పక్షిరాజుకు దహన సంస్కారాలు జరిపించాడు. ఈ అంగారక తీర్థంలో కప్పలు గాని పాములు గాని ఉండవు. అన్నిటికంటే ముఖ్యంగా నాడీ జ్యోతిష్యానికీ ఊరు ప్రసిద్ధి.

ఇంకా తమిళనాడులోనే తిరుమనంజేరిలో ఉన్న కల్యాణసుందరేశ్వరస్వామి ఆలయం దర్శనీయం. ఎంతకూ వివాహంకాని కన్యలకు ఈ గుడిలో ఒక మాలను, ఒక నిమ్మకాయను ఇస్తారు. ఈ నిమ్మకాయ రసంలో ఏమీకలపకుండా అలానే త్రాగడం మాలను తెల్లని వస్త్రంలో మూటకట్టి పూజ గదిలో ఉంచడం చేయాలి. ఇలా చేసినవారికి త్వరగా వివాహాలు జరిగిన నిదర్శనాలు కోకొల్లలు. వివాహం అయ్యాక మాలను తిరిగి గుడిలో ఇచ్చేయాలి. లేకుంటే భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు వస్తాయంటారు. మైలాడ్‌దురై నుంచి 35కి.మీ దూరంలో ఉన్న ఆలయం ఇది. పరమశివుని వివాహము కూడా ఇక్కడే జరిగిదంటారు. కుర్తాళం నుంచి 6 కి.మీ.



# 71. కుజగ్రహ అర్చనం

గ్రహదోషమున్న గ్రహజపంను తగుసంఖ్యలో చేయాలి. గ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౮ | ౭ | ౫ | ౩ | ౧ | ౨ | ౯ | ౬ | ౪ |
| ౯ | ౬ | ౪ | ౮ | ౭ | ౫ | ౩ | ౧ | ౨ |
| ౩ | ౧ | ౨ | ౯ | ౬ | ౪ | ౮ | ౭ | ౫ |
| ౫ | ౮ | ౭ | ౪ | ౯ | ౬ | ౨ | ౩ | ౧ |
| ౪ | ౯ | ౬ | ౨ | ౩ | ౧ | ౫ | ౮ | ౭ |
| ౨ | ౩ | ౧ | ౫ | ౮ | ౭ | ౪ | ౯ | ౬ |
| ౬ | ౪ | ౯ | ౭ | ౫ | ౮ | ౧ | ౨ | ౩ |
| ౧ | ౨ | ౩ | ౬ | ౪ | ౯ | ౭ | ౫ | ౮ |
| ౭ | ౫ | ౮ | ౧ | ౨ | ౩ | ౬ | ౪ | ౯ |



## అంగారక యంత్రము

సాం

యాం అం హ్రాం క్రోం...... తిష్ఠన్తు స్వాహా హాం

హం యం రం లం వం

తన్నః కుజః ప్రచోదయాత్ ఓం యంత్ర రాజాయ

శం

రాం

కా

హాసాం

అం ఇం ఉం ఓం అం ఈం ఊం

కుం

హాసం

క్షాం వౌషట్ వౌషట్ రం

షాం

# కుజగ్రహ జపము

అంగారక మంత్రము :-

అగ్నిర్మూర్ధేత్యస్య మంత్రస్య విరూపఋషిః అంగారక గ్రహోదేవతా-గాయత్రీ ఛ్ఛందః-అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత అంగారక గ్రహ/దేవతా ప్రసాద సిద్ధ్యర్థం-అంగారక గ్రహదేవతా జపం కరిష్యే.

అంగారక ధ్యానమ్ :-

ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ
కుమారం శక్తి హస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్ప యామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోప హార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారా న్సమర్పయామి.

కరన్యాసం :-

| | | |
|---|---|---|
| ఓం అగ్నిర్మూర్ధాదివః | - | అంగుష్ఠాభ్యాం నమః |
| కకుత్పతిః | - | తర్జనీభ్యాం నమః |
| పృధివ్యాః | - | మధ్యమాభ్యాం నమః |
| అయం | - | అనామికాభ్యాం నమః |
| అపాగ్ంరేతాగ్ంసి | - | కనిష్ఠికాభ్యాం నమః |
| జిన్వతి | - | కరతలకరపృష్ఠాభ్యాం నమః |

అంగన్యాసం :-

| | | |
|---|---|---|
| ఓం అగ్నిర్మూర్ధాదివః | - | హృదయాయ నమః |
| కకుత్పతిః | - | శిరసేస్వాహా |
| పృధివ్యాః | - | శిఖాయైవషట్ |
| అయం | - | కవచాయహుం |
| అపాగ్ంరేతాగ్ంసి | - | నేత్రత్రయాయవౌషట్ |
| జిన్వతి | - | అస్త్రాయఫట్ |

అధిదేవతా:-

స్యోనాపృథివీ భవాన్ ఋక్షరానివేశనీయచ్ఛానః శర్మసప్రథాః

ప్రత్యధిదేవతా :-

క్షేత్రస్యపతినావయగ్ం హితేనేవ జయామసి
గామశ్వంపోషయిత్వా సనోమృడాతీదృశే

**వేదమంత్రము :-**

ఓం అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృధివ్యా అయం అపాంగ్‌రేతాంగ్‌ంసి జిన్వతి

**కుజగ్రహ మంత్ర జపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు ఎర్రనిరంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై రక్తచందనంతో చేసిన కుజప్రతిమను లేదా కుజయంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేన ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్‌ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్‌ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవః।
మాధ్వీ ర్నస్సం త్వోషధీః। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః
మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః
మాధ్వీర్గావో భవంతు నః। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిర్గ్నిం
పరిమిహోతి వజ్రేణైవాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాత్స్త్రేయాన్ష్ఠేయ సోనోపహరతే త్రినస్త్రాభిః పశుకామస్యా
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపము పైకి పంచాలోకపాలకులను, అష్టదిక్పాలకులను నవగ్రహాదిదేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు, ఆయా స్థానములలో ఒక తమలపాకును, వక్కను ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ వుండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరిః ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
   జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం

గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

2. ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
   శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం

బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
   సమూఢమస్యపాంగ్ం సురే॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం

లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
   వోచేమ శంతమగ్ం హృదే॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం'

లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ,
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః। ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

*గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.*

## దిక్పాలకులు

**ఇంద్రః :- (1-7-10 మం) :-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః :- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః :- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిరృతిః-** మూషుణః పరాపరా నిర్ఋతిర్దుర్హణావధీత్। పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ృతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)**

ఇమంమే వరుణ శ్రుధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత, ఆవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

కుబేరః :-

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాశుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు,
సాదన్యం విదత్యగ్ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

ఈశానః :-

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్,
పూషావో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

ఊర్ధ్వపురుషః :-

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా,
ఊర్ధ్వో వాజస్య సనితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వాయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం - 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవాన్వక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

వాస్తు పురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ త్స్వావేశో అనమీవో భవా నః,
యత్త్వే మహే ప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుష మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

## ఇతర దేవతలు

## త్రిమూర్తులు- (సతీసమేతంగా)

బ్రహ్మ :-

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం,
శ్యేనో గృధ్రాణాగ్ స్వధితి ర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్,

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీ :-

నక్తుమివ తిత ఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః :- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరీ :- గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా :-

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ధద్వితా
అదిత్ర్పత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతె దివా
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఏషోఉషా అపూర్వ్యావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గరుడః :-

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్తోమ
ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ
యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్గ్ం స్యంగాని ధిష్ణియా
శ్శఫా యజూగ్ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥
గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః:-

ధన్వనాగా ధన్వనాఽఽజిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।
ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥
ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఇంద్రాగ్నిం:-(ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।
గ్రాహిర్జ గ్రాహ యదీవైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥
ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్ఋతి: యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।
తమాహరామి నిరృతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥
నిర్ఋతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

(శతృఫలమ్) మన్యుః:-(ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం దత్తాం వరుణశ్చ మన్యుః।
భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥
మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విశాఖా నక్షత్రమ్ :-

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।
తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।
నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ।
విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥
విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మృత్యుంజయ త్ర్యంబకః:-

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥
మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఋగ్వేదము :-

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

యజుర్వేదము :-

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

సామవేదము :-

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
నిహోతాసత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

అథర్వణ వేదము :-

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అథర్వణ వేదాయ నమః॥
అథర్వణ వేదమావాహయామి। పూజయామి॥

## ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

దుర్గా :- ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః॥
సనః పర్ష దతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గణపతి :- ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

క్షేత్రపాలకుడు:- క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనోమృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అభయంకరుడు:- యత ఇంద్ర భయామహే తతోనో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః॥

ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

జాతకుని జన్మనక్షత్రమును ఆహ్వానించాలి.

తరువాత కుజుని నక్షత్రములయిన మృగశిర, చిత్త, ధనిష్ఠలను ఆహ్వానించాలి.

మృగశిర :-

సోమోరాజా మృగశీర్షేణ ఆగ్నన్। శివం నక్షత్రం ప్రియమస్య ధామ।

ఆప్యాయమానో బహుధాజనేషు। రేతః ప్రజాం యజమానే దధాతు।

యత్తే నక్షత్రం మృగశీర్షమస్తి। ప్రియగ్ం రాజన్ప్రియతమం ప్రియాణామ్।

తస్మై తే సోమ హవిషా విధేమ। శం న ఏధి ద్విపదే శం చతుష్పదే॥

మృగశీర్షా నక్షత్ర దేవతాం సోమమావాహయామి। స్థాపయామి। పూజయామి.

మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణేమును వుంచి నమస్కరించాలి.

చిత్రా:-

త్వష్టా నక్షత్ర మభ్యేతి చిత్రామ్। సుభగ్ం ససంయువతిగ్ం రోచమానామ్।

నివేశయన్నమృతా న్మర్త్యాగ్ంశ్చ। రూపాణి పిగ్ంశన్భువనాని విశ్వా।

తన్నస్త్వష్టా తదు చిత్రావిచష్టామ్। తన్నక్షత్రం భూరిదా అస్తుమహ్యామ్।

తన్నః ప్రజాం వీరవతీగ్ం సనోతు। గోభిర్నోఅశ్వై స్సమనక్తు యజ్ఞమ్॥

చిత్రా నక్షత్ర దేవతాం త్వష్టారం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు దానిపై వక్క, ఖర్జూరపండు, దక్షిణంగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

ధనిష్ఠా :-

అష్టౌ దేవా వసవస్సోమ్యాసః। చతస్రో దేవీ రజరాశ్శ్రవిష్ఠా।

తే యజ్ఞం పాంతు రజసః పరస్తాత్। సంవత్సరీణ మమృతగ్గ్ స్వస్తి।

యజ్ఞన్నః పాంతు వసవః పురస్తాత్। దక్షిణతో౽భియంతు శ్రవిష్ఠాః।

పుణ్యం నక్షత్ర మభిసంవిశామ। మానో అరాతిరఘశగ్ం సాగన్॥

ధనిష్ఠా నక్షత్ర దేవతా వసూనావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకు, దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణంగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

(ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, నాణెమును ఉంచి నమస్కరించాలి.)

**అంగారక (కుజ) :-**

అగ్నిర్మూర్ధేత్యస్య మంత్రస్య। విరూప ఋషిః।అంగారక గ్రహోదేవతా। త్రిష్టుప్ఛందః। (మమ) యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతా సహితాంగారక గ్రహప్రసాద సిద్ధ్యర్థే అంగారక గ్రహారాధనే వినియోగః॥

**ధ్యానశ్లో॥** యామ్యే గదాశక్తిధరశ్చ శూలీ వరప్రదో యామ్యముఖోఽతిరక్తః।
కుజస్త్వవంతీ విషయస్త్రి కోణ స్తస్మిన్ భరద్వాజకులే ప్రసూతః॥
రక్తాంబరో రక్తవపుః కిరీటీ చతుర్భుజో మేషగమోగదాభృత్।
ధరాసుతశ్శక్తి ధరశ్చ శూలీసదా మమస్యాద్వరదః ప్రశాన్తః॥

**మంత్రం:-** (ఓం అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యా
అయమ్। అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి॥ ఓం భూ
ర్భువస్సువః॥ అంగారకగ్రహేహాగచ్ఛ।)

(అంగారకగ్రహం రక్తవర్ణం, రక్తగంధం, రక్తపుష్పం, రక్తమాల్యాంబర ధరం, రక్త చ్ఛత్రధ్వజ రథపతాకాది శోభితం, దివ్యరథసమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, మేషవాహనం, దక్షిణాభిముఖం, చతుర్భుజం, గదాశూల శక్తిధరం, అవన్తి దేశాధిపతిం, భారద్వాజస గోత్రం, అక్షయ సంవత్సర వైశాఖశుక్ల ద్వితీయాయాం పూర్వఫల్గుణీ (పుబ్బా) నక్షత్రజాతం। భౌమవాసర ప్రయుక్తం, కిరీటినం,) సుఖాసీనం, పత్నీపుత్ర పరివార సమేతం, గ్రహ మండలే ప్రవిష్ట మస్మిన్నధికరణే సూర్యస్య దక్షిణ దిగ్భాగే, త్రికోణాకారమండలే అంగారక గ్రహ మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**అధిదేవత - పృథివీ :-(ఋ-1మం-22సూ-15 మంత్రం)**

**మంత్రం:-** స్యోనా పృథివీ భవానృక్షరా నివేశనీ। యచ్ఛానశ్శర్మసప్రథాః॥

అంగారకగ్రహాధి దేవతా పృథివీం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తి పుత్రపరివార సమేతాం అంగారక గ్రహస్య దక్షిణతః పృథివీం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి॥

ప్రత్యధిదేవత - క్షేత్రపాలక ::-

మంత్రం:- క్షేత్రస్య పతినా వయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వానో మృడా తీదృశే॥

అంగారక గ్రహస్య ప్రత్యధి దేవతాం క్షేత్రపాలకం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం అంగారక గ్రహస్యోత్తరతః క్షేత్రపాలక మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత కుజగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

నైవేద్యం:-(పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంభృతం సఫలం దేవగృహ్యాతాం సర్వదేవతాః॥

ఓం భూర్భువస్సువః భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి। తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం, "ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థాః అయనాయ విద్యతే॥

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమేవేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥

5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।
యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్విభజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః॥ అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽ ధిపతిర్బ్రహ్మ శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యోఽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యోఽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

28. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

30. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

32. యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥

33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।
ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥

34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।
త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥

35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణో౽ధిపతిర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోమ్॥

36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥

37. తద్విప్రాసో విపన్యవో జాగృతాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥

38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత కుజగ్రహ దేవతాభ్యోనమః। దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారం:-** కుజగ్రహ దేవతాభ్యో నమః। ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోలికామారోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునః నీరాజనం:-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపో౽హం పాపకర్మా౽హం పాపాత్మా పాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యథాశరణం నాస్తి
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥

కుజగ్రహదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సో౽చ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

ఉద్వాసన:- "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేవానాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

కుజగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటప మునతో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శ్రీ కుజగ్రహ దేవతా స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజ చేసి తరువాత కుజగ్రహజపము చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటుంటే "మమ" అని చెప్పాలి. "యాజమానస్య" అని చెప్పకూడదు. ఒకరు మరొకరికోసం జపం చేస్తుంటే "యాజమానస్య" అని చెప్పాలి. "మమ" అని చెప్పకూడదు.)

**కుజగ్రహ జపము :-**

అగ్నిర్మూర్ధేతస్య। విరూపఋషిః। అంగారక గ్రహోదేవతా। త్రిష్టుప్ఛందః॥ (మమ) యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత అంగారకగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే అంగారక గ్రహ మూలమంత్ర జపం కరిష్యే.

**కరన్యాసః :-**

అగ్నిర్మూర్ధా - అంగుష్ఠాభ్యాన్నమః.
దివః కకుత్ - తర్జనీభ్యాన్నమః.
పతిః పృథివ్యా - మధ్యమాభ్యాన్నమః.
అయం - అనామికాభ్యాన్నమః.

అపాగ్ం రేతాగ్ం సి - కనిష్ఠికాభ్యాన్నమః.
జిన్వతి - కరతలకరపృష్ఠాభ్యా నమః

**హృదయాదిన్యాసః :-**

అగ్నిర్మూర్ధా - హృదయాయ నమః.
దివః కకుత్ - శిరసేస్వాహా.
పతిః పృథివ్యా - శిఖాయై వషట్.
అయం - కవచాయ హుం.
అపాగ్ం రేతాగ్ంసి - నేత్రత్రయాయ వౌషట్.
జిన్వతి - అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

**ధ్యానం :-**

యామ్యే గదాశక్తి ధరశ్చశూలీ వరప్రదోయామ్య ముఖోతిరిక్తః।
కుజస్త్వవంతీ విషయ స్త్రి కోణ స్తస్మిన్భరద్వాజ కులే ప్రసూతః॥

**మూలమంత్రం :-**

అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయం।
అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి॥

**అధిదేవత :-**

స్యోనా పృథివీ న్యక్షరా నివేశనీ।
యచ్ఛావ శ్శర్మ సప్రథాః॥

**ప్రత్యధిదేవత :-**

క్షేత్రస్య పతినా వయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్వాసనో మృడా తీదృశే॥

(అని చెప్పిన తర్వాత మూలమంత్రాన్ని 7,000 జపించి తర్వాత ఒకసారి అధి దేవతా, ప్రత్యధి దేవతా మంత్రాలను చెప్పి)

"(మమ) యజమానస్య అంగారక గ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు" (అని చెప్పి ఉద్ధరిణతో నీళ్ళను పళ్ళెములో వదలాలి.)

# కుజగ్రహ మంత్ర తర్పణము

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతి పూజ చేయాలి. (ఇచట సంకల్పంలో "జలతర్పణం కరిష్యామి" అని చెప్పుకోవాలి)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి. తర్పణము చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మనముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

కుజగ్రహముకు సంబంధించిన "ధాన్యమును" ఏకాగ్రతగా స్మరించాలి.

ఉద్ధరణిలోకి నీటిని తీసుకొని కుజగ్రహమంత్రమును చదవాలి. తరువాత "కుజాయ తర్పయామినమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలో నీటిని తీసుకొని గ్రహ అధిదేవతః మంత్రమును చదివి "కుజగ్రహస్య అధిదేవతా : తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరణిలోకి నీటిని తీసుకొని ప్రత్యధి దేవత మంత్రమును చదవాలి. తరువాత "కుజ గ్రహస్య ప్రత్యధిదేవతా : తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 700 సార్లు తర్పణము చేయాలి.

మరల గ్రహ అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను చదవాలి. తరువాత

"కుజగ్రహ ప్రసాదేనమమ ఆరోగ్యసిద్ధిరస్తు సర్వాభీష్ట సిద్ధిరస్తు" అని నీటిని పళ్ళెములో ధారపోయాలి.

(జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు

"మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ"

స్థానంలో "యాజమానస్య" అని చెప్పాలి)

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత ప్రత్యధిదేవతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత మృగశిర, చిత్త, ధనిష్ట నక్షత్రములకు హోమం చేయాలి.

మృగశిర: సోమాయ స్వాహా । మృగశీర్షాయ స్వాహా । ఇన్వకాభ్యస్స్వాహా ।
ఓషధీభ్య స్స్వాహా । రాజ్యాయ స్వాహా । అభిజిత్యై స్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత మృగశీర్షాయ ఇదం నమమ ॥ 108 సార్లు

చిత్రా: త్వష్ట్రేస్వాహా । చిత్రాయైస్వాహా । చైత్రాయ స్వాహా । ప్రజాయై స్వాహా
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత చిత్రాయైదం న మమ॥ 108 సార్లు

ధనిష్ఠా: వసుభ్యస్స్వాహా । శ్రవిష్ఠాభ్యస్వాహా । అగ్రాయస్వాహా । పరిత్యైస్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత ధనిష్ఠాయైదం న మమ। 108 సార్లు

ప్రతి నక్షత్రమునకు 108 సార్లు హోమం చేయాలి. తరువాత కుజ గ్రహమునకు హోమం చేయాలి. కుజగ్రహమంత్రము దాని అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి చంద్రపుల్లలు, ఆవునేయి, కందులు హోమంలో చేయాలి. ఈ విధంగా 70 సార్లు మూలమంత్రం, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రమును క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోక పాలకులు ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత, ప్రాయశ్చిత హోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము. ఆగ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన, మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధన చేసి పెద్దల ఆశీర్వాదమును పొందాలి.

కుజగ్రహ హోమంలో మార్జన 7సార్లు చేయాలి. కనీసం 7 గురికి భోజనం పెట్టాలి.

## 72. స్మరణం

కుజగ్రహజపం చేయలేనివారు, కుజగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు ఈ క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

# కుజగ్రహ మంత్రాలు

1. ఓం హాం హాం సః ఖం ఖః అంగారకాయ నమః ।
2. ఓం లం జం క్షిం భరద్వాజ కులోద్భవాయ భౌమాయ స్వాహా ॥
3. ఓం హుం శ్రీమంగళాయ నమః
4. ఓం అం అంగారకాయ నమః
5. ఓం క్రా క్రీం క్రాం సః భౌమాయ నమః
6. ఓం ఐం హాం శ్రీం ద్రాం కం గ్రహాధిపతయే భౌమాయ స్వాహా
   ఓం ఐం హ్రాం హ్రీం సర్వదుష్టా న్నాశయన్నాశయ
7. ఓం హాం శ్రీంద్రాం కం గ్రహాధిపతయే భౌమాయ స్వాహా ॥
8. ఓం ఐం హ్రీం శ్రీం క్లీం ఐం సౌః లం కుజగ్రహాయస్వాహా ॥
9. ధరణీ గర్భసంభూతం-విద్యుత్ కాంతి సమప్రభం కుమారం శక్తిహస్తం
   తం మంగళం ప్రణమామ్యహం ॥
10. ఓం హ్రీం సౌం శరవణ భవ సౌం హ్రీం ఓం
11. ఓం హ్రీం విరూపాక్షాయ రుద్రాయ శరవణ భవ స్వాహా ॥
12. ఓం నమో భగవతే సకల గుణాత్మశక్తి యుక్తాయ
    భూమి పుత్రాయ యోగ పీఠాత్మనే నమః
13. ఓం భూమిపుత్ర మహాతేజః స్వేదోద్భవపినాకినః
    సుతార్థినః ప్రపన్నాస్త్వాంగృహాణార్ఘ్యం నమోస్తుతే
14. ఓం రక్తప్రవాల సంకాశ జపాకుసుమ సన్నిభ
    మహీసుత మహాబాహో గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥

# కుజ గాయత్రీ మంత్రాలు

1. ఓం అంగారకాయ విద్మహే శక్తి హస్తాయ ధీమహి
   తన్నో భౌమః ప్రచోదయాత్ ॥
2. తత్పురుషాయ విద్మహే శిఖి ధ్వజాయ ధీమహి ।
   తన్నో భౌమః ప్రచోదయాత్ ॥
3. ఓం వీరధ్వజాయ విద్మహే విఘ్నహస్తాయ ధీమహి ।
   తన్నో భౌమః ప్రచోదయాత్ ॥
4. ఓం లోహితాక్షాయ విద్మహే-భూలాభాయ ధీమహి
   తన్న అంగారకః ప్రచోదయాత్ ॥

5. భుజంగేశాయ విద్మహే ఉరగేశాయ ధీమహి
   తన్నో నాగః ప్రచోదయాత్ ॥
6. అంగీరసాయ విద్మహే - శక్తిహస్తాయ ధీమహి
   తన్నో భౌమః ప్రచోదయాత్ ॥
7. ఓం కార్తికేయాయ విద్మహే వల్లీ సనాధాయ ధీమహి
   తన్నో నాగః ప్రచోదయాత్ ॥ (కుమారగాయత్రి)
8. ఓం తత్పురుషాయ విద్మహే - మహాసేనాయ ధీమహి:
   తన్న షణ్ముఖః ప్రచోదయాత్

**అనుకూల సమయాలు :-**

కుజుని అనుగ్రహం పొందాలనుకునేవారు కుజగ్రహ జపం, హోమం చేసి సమారాధన చేయుట ఉత్తమం. ఆ విధంగా చేయలేనివారు కుజుని కోసం సూచించిన ఏ మంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది, అదే విధంగా కుజునిస్తోత్రం చేయాలి.

కుజునికి అనుకూలమైన వారము మంగళవారము. అదేవిధంగా ఆయన అధిపత్యంలోని నక్షత్రములు మృగశిర, చిత్త, ధనిష్టలున్న దినములు కూడ కుజునికి అనుకూలమైనవే. త్రయోదశి, దశమి, విదియ కుజునికి అనుకూలించు తిథులు. ముఖ్యంగా కుజునికి వైశాఖశుద్ధ త్రయోదశి, వైశాఖ బహుళదశమి, వైశాఖ బహుళ విదియ ఉత్తమమైన తిథులు. ఈ సమయాలలో ప్రత్యేకంగా కుజుని పూజించుట శుభకరము.

నాగులచవితి, కుమారషష్ఠి, హనుమద్ జయంతి పండుగలను భక్తిశ్రద్ధలతో జరిపిన కుజుడు అనుగ్రహిస్తాడు. కుజదోషం ఉన్నా, లేకపోయినా మంగళవారవ్రతం హనుమద్వ్రతం చేస్తే శత్రుభయం తొలగుతుంది.

కుజుని పూజించునపుడు దీపారాధనకు ఎరుపురంగు వస్త్రంతో చేసిన వత్తిని వాడుట ఉత్తమము. పూజకు కందులతో గుగ్గిళ్ళు, అప్పాలు నైవేద్యంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలకు లేదా పేదవారికి ఎండుద్రాక్ష, స్వీట్లు, కందులు, మసూర్‌పప్పు, రాగిపాత్రలు, మట్టిపాత్రలు మొదలైన కుజునికి చెందిన ద్రవ్యములు దానం చేయాలి.

ప్రతిరోజు సుందరకాండ, సుబ్రహ్మణ్యస్వామి సహస్రనామావళి పఠించాలి.

# 73. ఆరాధనం

## కుజస్తోత్రమ్

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన కుజ గ్రహానుగ్రహం పొందవచ్చును.

శ్రీభౌమస్తోత్రస్య గర్గఋషి: మంగలోదేవతా త్రిష్టుప్ఛంద:
ఋణాపహారణే జపే వినియోగ:
ధరాసుత: శక్తి ధరశ్చ శూలీ సదా మమ స్యాద్వరద: ప్రశాంత:
ఓం మంగలో భూమి పుత్రశ్చ ఋణహర్తా ధనప్రద:
స్థిరాత్మజో మహాకాయ: సర్వకామార్థ సాధక:
లోహితో లోహితాంగశ్చ సామగానాంకృపాకర:
ధరాత్మజ: కుజోభౌమో భూతిదో భూమినందన:
అంగారకో యమశ్చైవ సర్వరోగాపహారక:
వృష్టికర్తాప హర్తా చ సర్వకామఫలప్రద:
ఏతాని కుజ నామాని ప్రాతరుత్థాయ య: పఠేత్
ఋణం నజాయతే తస్యధనం ప్రాప్నోత్య సంశయమ్
అంగారకో అతిబలవానసి యోగ్రహాణాం స్వేదోద్భవస్త్రినయనస్య పినాకపాణే:
ఆర్తచందన సుశీతల వారిణా యో అభ్యర్చితోతి విపులాంప్రదదాతి సిద్ధిమ్
భో భో ధరాత్మజ ఇతి ప్రథిత: పృథివ్యాం దు:ఖాపహోదురితశోక సమస్తహర్తా
ఏకేనహస్తేన గదాం బిభర్తి త్రిశూలమన్యేన ఋజుక్రమేణ
శక్తిం సదాన్యేన వరం దదాతి చతుర్భుజో మంగళమాదధాతు
యోమంగలో మంగలమాదధాతి మధ్యగ్రహో యచ్ఛతి వాంఛితార్థమ్
ధర్మార్థ కామాదిసుఖం ప్రభుత్వం కళత్ర పుత్రైర్నకదావియోగ:
కనక మయశరీరస్తేజసా దుర్నిరీక్ష్యో హుతవహసమకాంతిర్మాలవేలబ్ధజన్మా:
అవనిజ తనురేష శ్రూయతే య: పురాణో దిశతు మమ విభూతిం భూమిజ: స ప్రభావ:

ఇతి వశిష్ఠ సంహితాయాం భౌమస్తోత్రం సమాప్తం.

## కుజస్తోత్రమ్ (ఋణవిమోచక)

ఋణగ్రస్తస్య ఋణవిమోచనార్థం అంగారకస్తోత్ర మన్త్ర:
స్కందఉవాచ : ఋణగ్రస్తనరాణాంతు ఋణముక్తి: కథం భవేత్
బ్రహ్మోవాచ : వక్ష్యేఽహం సర్వలోకానాం హితార్థం హితకామదమ్ శ్రీ అంగారకమన్త్రస్య శ్రీ గౌతమ ఋషి: అనుష్టుప్ఛంద: అంగారకో దేవతా మమ ఋణ విమోచనార్థే జపే వినియోగ:.

ధ్యానం :-

రక్తమాల్యాంబరధర: శూలశక్తి గదాధర: ।
చతుర్భుజో మేషగతో వరదశ్చ ధరాసుత: ॥ 1
మంగళో భూమిపుత్రశ్చ ఋణహర్తా ధనప్రద: ।
స్థిరాసనో మహాకాయో సర్వకామఫలప్రద: ॥ 2
లోహితో లోహితాక్షశ్చ సామగానాం కృపాకర:
ధరాత్మజ: కుజో భౌమో భూమిదో భూమినందన: ॥ 3
అంగారకో యమశ్చైవ సర్వరోగాపహారక: ।
వృష్టే: కర్తాచ హర్తాచ సర్వదేవైశ్చ పూజిత: ॥ 4

ఫలశ్రుతి :

ఏతాని కుజనామాని నిత్యం య: ప్రయత: పఠేత్ ।
ఋణం నజాయతే తస్య ధనం ప్రాప్నోత్యసంశయ: ॥ 5
అంగారక మహీపుత్ర భగవన్ భక్తవత్సల ।
నమో-స్తుతే మమా శేషఋణమాశు వినాశయ ॥ 6
రక్త గంధైశ్చపుష్పైశ్చధూపదీపై ర్గుడోదనై: ।
మంగళం పూజయిత్వాతు మంగళాహని సర్వదా ॥ 7
ఏకవింశతినామాని పఠిత్వాతు తదంతికే ।
ఋణరేఖా: ప్రకర్తవ్యా అంగారేణ తదగ్రత: ।
తాశ్చ ప్రమార్జయేత్పశ్చాత్ వామపాదేన సంస్పృశన్ ॥ 8

మూలమంత్రం :

అంగారక మహీపుత్ర భగవన్ భక్తవత్సల: ।
నమోస్తుతే మమాశేష ఋణమాశు విమోచయ ॥ 9
ఏవం కృతే న సందేహో ఋణం హిత్వాధనీ భవేత్ ।
మహతీం శ్రియ మాప్నోతి హ్యపరో ధనదోయువా ॥ 10

అర్ఘ్యం :

భూమిపుత్ర మహాతేజ స్స్వేదోద్భవ పినాకిన: ।
ఋణార్త స్త్వాం ప్రపన్నోస్మి గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥

ఇతి అంగారక (కుజ) స్తోత్రం సంపూర్ణమ్

శ్లో॥ ధరణీ గర్భ సంభూతం - విద్యుత్కాంతి సమప్రభం ।
కుమారం శక్తి హస్తం - తం మంగళం ప్రణమామ్యహం ॥

# కుజ అష్టోత్తర శతనామస్తోత్రమ్

మహీసుతో మహాభాగో మంగళో మంగళప్రదః ।
మహావీరో మహాశూరో మహాబలపరాక్రమః ॥
మహారౌద్రో మహాభద్రో మాననీయో దయాకరః । 1
మానదోమర్షణః క్రూరస్తాప పాపవివర్జితః ॥
సుప్రతీప స్సుతామ్రాక్ష స్సుబ్రహ్మణ్య స్సుఖప్రదః । 2
వక్రస్తంచాదిగమనో వరేణ్యో వరదస్సుఖీ ॥
వీరభద్రో విరూపాక్షః విదూరస్థో విభావసుః । 3
నక్షత్రచక్రసంచారీ క్షత్రపః క్షాత్రపర్జితః ।
క్షయవృద్ధివినిర్ముక్తః క్షమాయుక్తో విచక్షణః । 4
అక్షీణఫలదశ్చక్షుర్గోచరశ్శుభలక్షణః ॥ 5
వీతరాగో వీతభయో విజ్వరో విశ్వకారణం ।
నక్షత్ర రాశిసంచారో నానా భయనికృంతనః ॥ 6
కమనీయో దయాసారః కనత్కనకభూషణః ।
భయఘ్నో భవ్యఫలదో భక్తాభయవరప్రదః ॥ 7
శత్రుహంతా శమోపేతః శరణాగతపోషకః ।
సాహసీసద్గుణాధ్యక్షస్సాధు స్సమరదుర్జయః ॥ 8
దుష్టదూరశ్శిష్టపూజ్యస్సర్వకష్టనివారకః ।
దుశ్చేష్టావారకో దుఃఖభంజనో దుర్ధరో హరిః ॥ 9
దుస్స్వప్నహంతా దుర్ధర్షో దుష్టగర్వవిమోచకః ।
భరద్వాజకులోద్భూతో భూసుతో భవ్యభూషణః ॥ 10
రక్తాంబరో రక్తవపుర్భక్తపాలన తత్పరః । 11
చతుర్భుజో గాధారీ మేషవాహో మితాశనః ॥
శ క్తిశూలధరశ్శ క్త శ్శస్త్రవిద్యావిశారదః । 12
తార్కిక స్తామసాధారస్తపస్వీ తామ్రలోచనః ॥
తప్తకాంచనసంకాశో రక్తకింజల్కసన్నిభః । 13
గోత్రాధిదేవో గోమధ్యచరో గుణవిభూషణః ॥
అసృంగంగారకోవంతిదేశాధీశో జనార్దనః । 14
సూర్యయామ్యప్రదేశస్థో యావనో యామ్యదిఙ్ముఖః ॥

త్రికోణమండలగత స్త్రిదశాధిపసన్నుత: ।
శుచిశ్శుచికరశ్శూరో శుచివశ్య శ్శుభావహ: ॥ 15
మేషవృశ్చికరాశీశో మేధావీ మితభాషణ: ।
సుఖప్రదస్సురూపాక్ష స్సర్వాభీష్ట ఫలప్రద: ॥ 16

అంగారక గ్రహస్యైవం నామ్నామష్టోత్తర శతమ్

# కుజస్తోత్రమ్

నమస్తే నమస్తే మహాశక్తిపాణే నమస్తే నమస్తే లసద్వజ్రపాణే
నమస్తే నమస్తే కటిన్యస్తపాణే నమస్తే నమస్తే సదాభీష్టపాణే

# ఋణ విమోచక కుజదండకం

శ్రీమన్మహీపుత్ర శృంగార గాత్రా। కృపాపాత్ర అంగారకా। లోహితా। మంగళా। శూలశక్తి స్వహస్తా। గదాధారి। రోగోపసంహారకా। మేషవాహా। ఋణగ్రస్తజా విదూరా। సదా సర్వదేవస్తుతా। రక్తవస్త్రాన్వితా। సూర్యమిత్రా। మహాస్ఫోటకవ్యాది దూరీకృతా। కీటకాదుల్ వ్రణంబుల్ ఋణంబుల్ భయంబొంది నీ పేరు విన్నంతనే దూరతీరాలకేగుంగదా। మంగళంబుల్ ప్రసాదింతువీవేకదా। ఘోరపైత్యాది రోగంబులన్ బాపవే? క్రూరదృష్టిన్ విసర్జించి ప్రేమానురాగాలతో మమ్ము జూడంగదే శత్రులన్ ద్రోలవే? రాజభోగంబులందించవే? ఔర। నిన్మించు దైవంబు, లింకేడ నున్నారు? పాండిత్యమీవయ్యా। పాపంబు వారించి నా యప్పులన్ వేళ్ళతో ద్రెంచి నాకిమ్ము సౌఖ్యంబు- శ్రీ విష్ణునాలింగనంబున్ బొనర్పంగ భూదేవి కయ్యంతలో నీవు జన్మించినావంట। నీవెంత ధన్యుండవయ్యా కుమారున్ స్మరింపగ సంతోష చిత్తుండవౌదంట। పంచాక్షరీ మంత్రసంసిద్ది నేనొంది వైఘూర్య రూపుండవౌ నిన్ను ధ్యానింతు - నీవు వక్రించు వేళా విశేషంబుచే భాగ్యము లీజాలుదీవంట, ఇంద్రుండు నీకన్న అల్పుండు కాడొకో? దక్షిణదేశా ధీశా తంత్రీ

నమస్తే నమస్తే నమస్తే నమ:

**ఫలశ్రుతి :**

ఉదయాన్నే ప్రతిరోజు మూడుసార్లు ఈ దండకాన్ని పఠించడం, మంగళవారం నాడు ఐదు సార్లు పఠించడము విశేష ఫలదాయకం.

# 74. అభినందనం

క్రింది నామములతో కుజ గ్రహయంత్రమును తరచు పూజించిన గ్రహానుగ్రహం కలుగుతుంది.

## కుజ అష్టోత్తర శతనామావళి

**ధ్యానమ్ :-**

ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభం
కుమారం శక్తి హస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥

**ప్రతి నామమునకు ముందు 'ఓం' అని చివర 'నమః' అని చదువుకొనవలెను.**

ఓం మహీసుతాయ నమః
మహాభాగాయ
మంగళాయ
మంగళప్రదాయ
మహావీరాయ
మహాశూరాయ
మహాబలపరాక్రమాయ
మహారౌద్రాయ
మహాభద్రాయ
మాననీయాయ 10
దయాకరాయ
మానదాయ
అమర్షణాయ
క్రూరాయ
తాపపాపవివర్జితాయ
సుప్రతీపాయ
సుతామ్రాక్షాయ
సుబ్రహ్మణ్యాయ
సుఖప్రదాయ
వక్రస్తంభాదిగమనాయ
వరేణ్యాయ
వరదాయ
సుఖినే
వీరభద్రాయ
విరూపాక్షాయ
విదూరస్థాయ
విభావసవే
నక్షత్రచక్రసంచారిణే
క్షత్రరూపాయ
క్షాత్రవర్జితాయ
క్షయవృద్ధివినిర్ముక్తాయ
క్షమాయుక్తాయ
విచక్షణాయ
అక్షీణఫలదాయ
చక్షుర్గోచరాయ
శుభలక్షణాయ
వీతరాగాయ
వీతభయాయ
విజ్వరాయ
విశ్వకారణాయ
నక్షత్రరాశిసంచారాయ
నానాభయనికృంతనాయ
కమనీయాయ
దయాసారాయ
కనత్కనకభూషణాయ
భయఘ్నాయ
భవ్యఫలదాయ
భక్తాభయవరప్రదాయ
శత్రుహంత్రే
శమోపేతాయ
శరణాగతపోషణాయ
సాహసినే
సద్గుణాధ్యక్షాయ
సాధవే
సమరదుర్జయాయ
దుష్టదూరాయ
శిష్టపూజ్యాయ
సర్వకష్టనివారకాయ
దుశ్చేష్టావారకాయ
దుఃఖభంజనాయ
దుర్ధర్షాయ
హరయే
దుస్స్వప్నహంత్రే
దుర్ధర్షాయ
దుష్టగర్వవిమోచనాయ
భరద్వాజకులోద్భవాయ

| | | |
|---|---|---|
| భూసుతాయ | తపస్వినే | త్రికోణమండలగతాయ |
| భవ్యభూషణాయ | తామ్రలోచనాయ | త్రిదశాధిపసన్నుతాయ |
| రక్తాంబరాయ | తప్తకాంచనసంకాశాయ | శుచయే |
| రక్తవపుషే | రక్తకింజల్కసన్నిభాయ | శుచితరాయ |
| భక్తపాలనతత్పరాయ | గోత్రాధిదేవాయ | శూరాయ |
| చతుర్భుజాయ | గోమధ్యచరాయ | శుచివశ్యాయ |
| గదాధారిణే | గుణవిభూషణాయ | శుభావహాయ |
| మేషవాహాయ | అసృజే | మేషవృశ్చికరాశీశాయ |
| అమితాశనాయ | అంగారకాయ | మేధావినే |
| శక్తిశూలధరాయ | అవంతిదేశాధీశాయ | మితభాషణాయ |
| శక్తాయ | జనార్దనాయ | సుఖప్రదాయ |
| శస్త్రవిద్యావిశారదాయ | సూర్యయామ్యప్రదేశస్థాయ | సురూపాక్షాయ |
| తార్కికాయ | యౌవనాయ | సర్వాభీష్టఫలప్రదాయ |
| తామసాధారాయ | యామ్యదిఙ్ముఖాయ | ఓం శ్రీమతే అంగారకాయ నమః |

# 75. అభినుతి

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన కుజగ్రహానుగ్రహం పొందవచ్చును.

ఓమ్, అస్య శ్రీఅంగారక కవచస్తోత్రమహామంత్రస్య, విరూపాక్షఋషిః, గాయత్రీ ఛందః, అంగారకో దేవతా, అం బీజం, గం శక్తిః, రం కీలకం, మమ అంగారక గ్రహప్రసాద సిద్ధ్యర్థేజపే వినియోగః,

ఆం అంగుష్ఠాభ్యాం నమః, ఈం తర్జనీభ్యాం నమః, ఊం మధ్యమాభ్యాం నమః, ఐం అనామికాభ్యాం నమః, ఔం కనిష్ఠికాభ్యాం నమః, అః కరతల కరపృష్ఠాభ్యాం నమః ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సురోమితి దిగ్బంధః

ధ్యానం:- నమామ్యంగారకం దేవం రక్తాంగం వరభూషణం ।
జానుస్థం వామహస్తాభ్యాం చాపేషువరపాణినమ్ ॥ 1

చతుర్భుజం మేషవాహం వరదం వసుధాప్రియం ।
శక్తిశూల గదాఖడ్గం జ్వాల పుంజోర్ధ్వ కేశకమ్ ॥ 2

మేరుం ప్రదక్షిణం కృత్వా సర్వదేవాత్మసిద్ధిదం ।
అంగారక శ్శిరో రక్షేత్ ముఖం వై ధరణీసుతః ॥ 3

కర్ణౌ రక్తాంబరః పాతు నేత్రే మే రక్తలోచనః ।
నాసికాం మే శక్తిధరః కంఠం మే పాతు భౌమకః ॥ 4
భుజౌతు రక్తమాలీ చ హస్తౌ శూలధర స్తథా ।
చతుర్భుజో మే హృదయం కుక్షిం రోగాపహారకః ॥ 5
కటిం మే భూమిజః పాతు ఊరూ పాతు గదాధరః ।
జానుజంఘే కుజః పాతు పాదౌ భౌమస్సదామమ ॥ 6
సర్వాణి యాని చాంగాని రక్షేన్మే మేషవాహనః ।
య ఇదం కవచం దివ్యం సర్వశత్రువినాశనం ॥ 7
భూతప్రేత పిశాచానాం నాశనం సర్వసిద్ధిదమ్ ।
సర్వరోగ హరం చైవ సర్వసంపత్ప్రదం శుభం ॥ 8
భుక్తిముక్తి ప్రదం నృణాం సర్వసౌభాగ్య వర్ధనమ్ ।
ఋణబంధవిము క్తిర్వైసత్యమేవ న సంశయః ॥ 9
స్తోత్ర పాఠస్తు కర్తవ్యో దేవస్యాగ్రే సమాహితః ।
రక్త గంథాక్షతైః పుష్పైర్ధూపదీపగుడోదనైః ॥ 10
మంగళం పూజయిత్వాతు మంగళేఽహని సర్వదా ॥
బ్రాహ్మణాన్భోజయేత్ప శ్చాచ్చతురో ద్వాదశాథవా ॥ 11
అనేన విధినా యస్తు కృత్వావ్రత మనుత్తమమ్ ।
వ్రతం తదేవ కుర్వీత సప్తవారేషు వాయది ॥ 12
తేషాం శస్త్రాణ్యుత్పలాని వహ్నిస్స్యాచ్చంద్రశీతలః ।
నచైనంవ్యథయంత్యస్మాన్మృగపక్షిగజాదయః ॥ 13
మహాంథతమసే ప్రాప్తే మార్తా ణ్డస్యో దయాదివ ।
విలయం యాంతి పాపాని శతజన్మార్జితాని వై ॥ 14

## 76. అభివందనం

కుజగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. కుజగ్రహదేవతను కీర్తించండి.

### నృసింహావతారస్తుతి

(దశావతారాల్లో నరసింహావతారం పరమాత్మాంశకుజగ్రహం)

శ్లో॥ నామ స్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదానృ హరే ॥
హిరణ్యకశిపుచ్ఛేదనతో ప్రహ్లాదాభయ దాయక హేతో
నరసింహాచ్యుత రూపనమో భక్తంతే పరిపాలయమాం

## కుజగ్రహ మంగళాష్టకం

శ్లో॥ భౌమో దక్షిణ దిక్ త్రికోణయమదిక్ వింధ్యేశ్వరః ఖాదిరః ।
స్వామీ వృశ్చిక మేషయో స్సురగురు శ్చార్క శ్శశీ సౌహృదః
జ్ఞో రిష్షట్ త్రిఫల ప్రదశ్చ వసుధా స్కందఃక్రమాద్దేవతాః
భారద్వాజ కులోద్వహో- రుణరుచిః కుర్యాత్సదా మంగళం

## కుజగ్రహ స్తోత్ర కీర్తన

రచన : శ్రీముత్తు స్వామి దీక్షితులు

రాగం : సురటి చతురస్రం తాళం : రూపక

పల్లవి : అంగారక మాశ్రయామ్యహం
వినతా శ్రితజన మందారం
మంగళవారం భూమికుమారం వారం వారం ॥అంగా॥

అనుపల్లవి : శృంగారక మేష వృశ్చిక రాశ్యధి పతిం
రక్తాంగం రక్తాంబరాది శక్తిశూలధరం
మంగళం కంబుగళం మంజులధర పదయుగళం
మంగళ దాయక మేష తురంగం మకరోత్తుంగం ॥అంగా॥

చరణం 1 దానవసుర సేవిత మందస్మిత విలసిత వక్త్రం
ధరణీప్రదం భ్రాతృకారకం రక్తనేత్రం

చరణం 2 దివ్యౌఘాది గురుగుహ కటాక్షానుగ్రహపాత్రం
భాను చంద్ర గురుమిత్రం భాసమాన సుకళత్రం
జానుస్థ హస్తచిత్రం చతుర్భుజమతి విచిత్రం ॥ ॥అంగా॥

# 77. కుజగ్రహానుగ్రహం కోసంప్రత్యేకస్తోత్రాలు

## సుబ్రహ్మణ్యస్తుతి

### మూలమంత్రం 10 వేలు జపం

ఓం శ్రీం క్రీం హ్రీం ఐం ఈం సాం శరవణభవ సుబ్రహ్మణ్యాయ నమః

శ్లో॥ షడ్వక్త్రం శిఖివాహనం త్రినయనం చిత్రాంబరాలంకృతం
శక్తిం వజ్రమసిం త్రిశూల మభయం ఖేటం ధనుశ్చక్రకం
పాశం కుక్కుట మంకుశం చ వరదం దోర్భిర్దధానం సదా
ధ్యాయేత్ ఈప్సిత సిద్ధిదం శివసుతం వందే సురారాధితం

# సుబ్రహ్మణ్య మంత్రాలు

1. ఓం హ్రీం సౌం శరవణభవ సౌం హ్రీం ఓం. 2. ఓం సౌం శరవణభవ
3. ఓం శ్రీం క్లీం హ్రీం ఐం ఈం సౌం శరవణభవ సుబ్రహ్మణ్యాయ నమః
4. ఓం శ్రీం క్లీం హ్రీం ఐం ఈం సం సౌః శరవణభవ

(ఈ మంత్రాలను దేనినైనా ఒకటి గ్రహించి 10వేలు జపం చేయవచ్చును. మండలం రోజుల వరకు)

★ ఈ క్రింద యిచ్చిన రెండు యంత్రాలను రాగి రక్షరేకులపై లిఖింపచేసి, చుట్టగా చుట్టి తాయెత్తు వలె కట్టుకొన్నా మేలు కలుగును.

| | | | |
|---|---|---|---|
| ఓం | సౌం | శ | ర |
| వ | ణ | భ | వ |
| శ | ర | వ | ణ |
| భ | వ | సౌం | ఓం |

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ | ర | వ | ణ | భ | వ |
| ర | వ | ణ | భ | వ | శ |
| వ | ణ | భ | వ | శ | ర |
| ణ | భ | వ | శ | ర | వ |
| భ | వ | శ | ర | వ | ణ |
| వ | శ | ర | వ | ణ | భ |

# కుజస్తోత్రం

నమస్తే నమస్తే మహాశక్తిపాణే నమస్తే నమస్తే లసద్వజ్రపాణే
నమస్తే నమస్తే కటిన్యస్తపాణే నమస్తే సదాభీష్టపాణే

# శ్రీసుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామావళి

## ధ్యానము :-

శ్లో॥ షడ్వక్త్రం శిఖివాహనం త్రినయనం చిత్రాంబరాలంకృతమ్ ।
శక్తిం వజ్రమసిం త్రిశూల మభయం ఖేటంధనుశ్చక్రకమ్ ।
పాశం కుక్కుట మంకుశం చ వరదం దోర్భిర్దధానం సదా ।
ధ్యాయేదీప్సిత సిద్ధిదం శివసుతం వందేసురారాధితమ్ ॥

ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర 'నమః' అని చదువుకొనవలెను

| | | |
|---|---|---|
| ఓం స్కందాయ నమః | పింగళాయ | శక్తిధరాయ |
| గుహాయ | కృత్తికాసూనవే | పిశితాశప్రభంజనాయ |
| షణ్ముఖాయ | శిఖివాహనాయ | తారకాసురసంహారిణే |
| ఫాలనేత్రసుతాయ | ద్విషడ్భుజాయ | రక్షోబలవిమర్దనాయ |
| ప్రభవే | ద్విషణ్ణేత్రాయ 10 | మత్తాయ |

ప్రమత్తాయ
ఉన్మత్తాయ
సురసైన్యసురక్షకాయ
దేవసేనాపతయే
ప్రాజ్ఞాయ 20
కృపాళవే
భక్తవత్సలాయ
ఉమాసుతాయ
శక్తిధరాయ
కుమారాయ
క్రౌంచదారణాయ
సేనాన్యే
అగ్నిజన్మనే
విశాఖాయ
శంకరాత్మజాయ 30
శివస్వామినే
గణస్వామినే
సర్వస్వామినే
సనాతనాయ
అనంతశక్తయే
అక్షోభ్యాయ
పార్వతీప్రియనందనాయ
గంగాసుతాయ
శరోద్భూతాయ
ఆహూతాయ 40
పావకాత్మజాయ
జృంభాయ
ప్రజృంభాయ
ఉజ్జృంభాయ
కమలాసనసంస్తుతాయ
ఏకవర్ణాయ
ద్వివర్ణాయ
త్రివర్ణాయ
సుమనోహరాయ
చతుర్వర్ణాయ 50
పంచవర్ణాయ
ప్రజాపతయే
అహస్పతయే
అగ్నిగర్భాయ
శమీగర్భాయ
విశ్వరేతసే
సురారిఘ్నే
హరిద్వర్ణాయ
శుభకరాయ
పటవే నమః 60
వటువేషభృతే
పూష్ణే నమః
గభస్తయే
గహనాయ
చంద్రవర్ణాయ
కళాధరాయ
మాయాధరాయ
మహామాయినే
కైవల్యాయ
శంకరాత్మజాయ 70
విశ్వయోనయే
అమేయాత్మనే
తేజోనిధయే
అనామయాయ
పరమేష్ఠినే
పరబ్రహ్మణే
వేదగర్భాయ
విరాట్సుతాయ
పుళిందకన్యాభర్త్రే
మహాసారస్వతావృతాయ
ఆశ్రితాఖిలదాత్రే
చోరఘ్నాయ
రోగనాశనాయ
అనంతమూర్తయే
ఆనందాయ
శిఖిండికృతకేతనాయ
దంభాయ
పరమదంభాయ
మహాదంభాయ
వృషాకపయే 90
కారణోత్పత్తిదేహాయ
కారణాఽతీతవిగ్రహాయ
అనీశ్వరాయ
అమృతాయ
ప్రాణాయ
ప్రాణాయామపరాయణాయ
విరుద్ధహంత్రే
వీరఘ్నాయ
రక్తాస్యాయ
శ్యామకంధరాయ 100
సుబ్రహ్మణ్యాయ
గుహాయ
ప్రీతాయ
బ్రహ్మణ్యాయ
బ్రాహ్మణ ప్రియాయ
వల్లీశాయ
రుద్రతేజస్వినే
గౌరీదృక్పద్మ భాస్కరాయ
దేవసేనాపతయే
వీరాయ
ద్వైమాతుర మనోహరాయ
ఓం వల్లీ దేవసేనా సమేత
శ్రీ సుబ్రహ్మణ్య స్వామినే
నమః

# శ్రీ సుబ్రహ్మణ్యాష్టోత్తర శతనామస్తోత్రము

ఓం శక్తిహస్తం విరూపాక్షం శిఖివాహన షడాననం ।
దారుణం రిపురోగఘ్నం భావయే కుక్కుటధ్వజమ్ ॥

ఓం స్కందో గుహ షణ్ముఖ శ్చ ఫాలనేత్రసుతః ప్రభుః ।
పింగళః కృత్తికాసూను శ్శిఖివాహో ద్విషడ్భుజః ॥ 1

ద్విష ణ్ణేత్ర శ్శక్తిధరః పిశితాశ ప్రభంజనః ।
తారకాసురసంహారీ రక్షోబల విమర్దనః ॥ 2

మత్తః ప్రమత్తఉన్మత్త స్సుర సైన్య సురక్షకః ।
దేవసేనాపతిః ప్రాజ్ఞః కృపాళు ర్భక్తవత్సలః ॥ 3

ఉమాసుత శ్శక్తిధరః కుమారః క్రౌంచదారణః ।
సేనానీ రగ్నిజన్మా చ విశాఖ శ్శంకరాత్మజః ॥ 4

శివస్వామీ గణస్వామీ సర్వస్వామీ సనాతనః ।
అనంతశక్తి రక్షోభ్యః పార్వతీ ప్రియనందనః ॥ 5

గంగా సుత శ్శరోద్భూత ఆహూతః పావకాత్మజః ।
జృంభః ప్రజృంభ ఉజ్జృంభః కమలాసన సంస్తుతః ॥ 6

ఏకవర్ణో ద్వివర్ణ శ్చ త్రివర్ణ స్సుమనోహరః ।
చతుర్వర్ణః పంచవర్ణః ప్రజాపతి రహస్పతిః ॥ 7

అగ్నిగర్భ శ్శమీ గర్భో విశ్వరేతా స్సురారిహా ।
హరిద్వర్ణ శ్శుభకరః టు శ్చ వటువేష భృత్ ॥ 8

పూషా గభస్తి ర్గహనః చంద్ర వర్ణః కళాధరః ।
మాయాధరో మహామాయీ కైవల్య శ్శంకరాత్మజః ॥ 9

విశ్వయోని రమేయాత్మా తేజోనిధి రనామయః ।
పరమేష్ఠీ పరబ్రహ్మా వేదగర్భో విరా ట్సుతః ॥ 10

పుళిందకన్యా భర్తా చ మహా సారస్వతావృతః ।
ఆశ్రితాఖిల దాతా చ చోరఘ్నో రోగనాశనః ॥ 11

అనంతమూర్తి రానందః శిఖండికృతకేతనః ।
దంభః పరమ డంభ శ్చ మహాదంభో వృషాకపిః ॥ 12

కారణోత్పత్తిదేహ శ్చ కారణాఽతీత విగ్రహః ।
అనీశ్వరోఽమృతఃప్రాణః ప్రాణాయామ పరాయణః ॥ 13

14

విరుద్ధ హంతా వీరఘ్నో రక్తాస్య శ్యామకంధరః ।
సుబ్రహ్మణ్యో గుహః ప్రీతో బ్రహ్మణ్యో బ్రాహ్మణప్రియః ॥ 15
వల్లీశోరుద్రతేజస్వీ గౌరీ దృక్పద్మ భాస్కరః
దేవసేనాపతిర్వీరోద్వైమాతురమనోహరః ॥

# సుబ్రహ్మణ్య జపం

మూలమంత్రం : (10 వేలు)

1. "ఓం సాం శరవణభవ"
2. "ఓం శ్రీం క్లీం హ్రీం ఐం ఈం సాం శరవణభవ సుబ్రహ్మణ్యాయ నమః॥"
3. "ఓం శ్రీం క్లీం హ్రీం ఐం ఈం నంశం సాం శరవణభవ॥"

గమనిక :- సుబ్రహ్మణ్య మంత్రము జపించు రోజులలో చాకలిమాట వినకూడదు.

అస్య శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరో దేవతా । ఓం సాం ఇతి బీజం । ఓం శరవణభవ ఇతి శక్తి । ఓం స్వాహా ఇతి కీలకమ్ । శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వరప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః.

**కరన్యాసం :**

ఓం శరవణభవసాం - అంగుష్ఠాభ్యాం నమః
ఓం శరవణభవసీం - తర్జనీభ్యాం నమః
ఓం శరవణభవసూం - మధ్యమాభ్యాం నమః
ఓం శరవణభవసైం - అనామికాభ్యాం నమః
ఓం శరవణభవసౌం - కనిష్ఠికాభ్యాం నమః
ఓం శరవణభవసః - కరతలకర పృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసం :**

ఓం శరవణభవసాం - హృదయాయ నమః
ఓం శరవణభవసీం - శిరసేస్వాహా
ఓం శరవణభవసూం - శిఖాయైవషట్
ఓం శరవణభవసైం - కవచాయహుం
ఓం శరవణభవసౌం - నేత్రత్రయాయవౌషట్
ఓం శరవణభవసః - అస్త్రాయఫట్
ఓం భూర్భు వస్సు వరోమితి దిగ్బంధః

ధ్యానము :-

శ్లో॥ షడ్వక్త్రం శిఖివాహనం త్రినయనం చిత్రాంబరాలంకృతమ్ ।
శక్తిం వజ్రమసిం త్రిశూల మభయం ఖేటంధనుశ్చక్రకమ్ ।
పాశం కుక్కుట మంకుశం చ వరదం దోర్భిర్దధానం సదా ।
ధ్యాయేదీప్సిత సిద్ధిదం శివసుతం వందేసురారాధితమ్ ॥

శ్లో॥ గాంగేయం వహ్నిగర్భం శరవణ జనితం జ్ఞానశక్తిం కుమారం ।
బ్రహ్మణ్యం స్కందదేవం గుహమమలగుణం రుద్రతేజ స్స్వరూపం ॥
సేనాన్యం తారకఘ్నం గురుమచలమతిం కార్తికేయం షడాస్యం ।
సుబ్రహ్మణ్యం మయూరధ్వజరథ సహితం దేవదేవం నమామి ॥

లం పృథివ్యాత్మనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః-గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః-పుష్పం సమర్ప యామి. యం వాయ్వాత్మనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః-ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః- అమృతోప హార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః-సర్వోపచారా న్సమర్పయామి.

## శ్రీ సుబ్రహ్మణ్యాష్టకము

హే స్వామినాథ కరుణాకర దీనబంధో । శ్రీ పార్వతీశ ముఖపంకజ పద్మబంధో ।
శ్రీ శాది దేవగణ పూజిత పాదపద్మ । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ । 1
దేవాది-దేవసుత దేవగణాధినాథ । దేవేంద్రవంద్య మృదుపంకజ మంజుపాద ।
దేవర్షి నారదమునీంద్ర సుగీతకీర్తే । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ । 2
నిత్యాన్నదాన నిరతాఽఖిల రోగహారిన్ । భాగ్యప్రదాన పరిపూరిత భక్తకామ ।
శ్రుత్యాగమ ప్రణవ వాచ్య నిజస్వరూప । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ ॥ 3
క్రౌంచాసురేంద్ర పరిఖండన శక్తి శూల । చాపాది శస్త్ర పరిమండిత దివ్యపాణే ।
శ్రీకుండలీశ ధృత తుండ శిఖీంద్రవాహ । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ ॥ 4
దేవాదిదేవ రథమండల మధ్యమేత్య । దేవేంద్ర పీఠ నగరం దృఢ చాపహస్తం ।
శూరం నిహత్య సురకోటిభి రీడ్యమాన । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ ॥ 5
హారాదిరత్న మణియుక్త కిరీటహార । కేయూర కుండల లసత్క వచాభిరామ ।
హేవీర తారక జయామర బృందవంద్య వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ ॥ 6
పంచాక్షరాది మను మంత్రిత గాంగతోయైః పంచామృతైః ప్రముదితేంద్రముఖై ర్మునీంద్రైః
పట్టాభిషిక్త హరియుక్త పరాసనాథ । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ ॥ 7

శ్రీ కార్తికేయ కరుణామృత పూర్ణదృష్ట్యా । కామాదిరోగ కలుషీకృత దుష్టచిత్తం ।
సిక్త్వా తు మా మవ కళాధరకాంతకాంత్యా । వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్ ॥ 8

# 78. యంత్రస్థాపనం

## 1. కుజ గ్రహానుగ్రహం కోసం

ఒక రాగిరేకుకు ఇరువైపులా క్రింది యంత్రమును రాయించి, దానిని పూజించాలి.

| 8 | 3 | 10 |
|---|---|---|
| 9 | 7 | 5 |
| 4 | 11 | 6 |

| 8 | 9 | 4 |
|---|---|---|
| 3 | 7 | 11 |
| 10 | 5 | 6 |

పై యంత్రమును "ఓం క్రాం క్రీం క్రౌం సః భౌమాయ నమః" అను మంత్రమును 1,25,000 సార్లు జపిస్తూ పూజించాలి.

## 2. అంగారక యంత్రం (మంత్రమహార్ణవం)

క్రింది యంత్రమును రాగిరేకుపై రాయించి "ఓం హాం హంసః ఖంఖః అను మంత్రమును 6 లక్షలసార్లు జపిస్తూ యంత్రమును పూజించాలి. ప్రమాదములు తొలగి ఆరోగ్యంగా ఉంటారు. పుత్రసంతానం కొరకు, ఋణవిమోచనకు, ధైర్యం కలిగించుటకు ఈ యంత్రం ఉపయోగపడుతుంది.



# 79. కుజదోషము

జాతకమున కుజదోషము ఏర్పడిన వివాహము కాదని పలువురి అభిప్రాయము.

**కుజదోషము కలుగు సందర్భాలు :-**

1) లగ్నాత్తు 2, 4, 7, 8, 12 స్థానములలో కుజుడున్నను.
2) చంద్రాత్తు 2, 4, 7, 8, 12 స్థానములలో కుజుడున్నను.
3) శుక్రుని లగాయతు 2, 4, 7, 8, 12 స్థానములలో కుజుడున్నను కుజదోషము కలుగును.

**కుజదోషము వలన నష్టములు :-**

★ కుజుడు గోచారంలో మఖ, మూల, పుష్యమి, పుబ్బ, పూర్వాషాఢ, రేవతి నక్షత్రములలో సంచరించునపుడు గృహమును నిర్మించిన ఆ నిర్మాణానికి ఆటంకములు కలుగును.

★ కుజుడు 2, 4, 7, 8, 12 స్థానాలలో వుంటే స్త్రీ భర్తను కోల్పోవును. పురుషుడు భార్యను కోల్పోవును.

★ కుజుడు గోచారరీత్యా 2, 4, 7, 8, స్థానములలో సంచరించు కాలములో ఇల్లు కాలిపోతుంది.

**కుజదోషముకు పరిహారక్రియలు :-**

★ సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధించాలి.

★ మంగళవారం పేదవారికి అన్నదానం చేయండి. లేదా కందులు దానం చేయండి.

★ పగడము కలిగిన ఉంగరం ధరించండి.

★ కుజగ్రహమునకు జపము చేయించాలి.

★ కుజ శ్లోకమును 7సార్లు గాని కుజమంత్రమును 70సార్లుగాని పారాయణ చేయాలి.

★ ప్రతిరోజు సుబ్రహ్మణ్యఅష్టకం పారాయణ చేయండి.

★ **కుజమంత్రం :-**

ఓం క్రాం క్రీం క్రౌం సః భౌమాయ నమః

# కుజదోషము పరిహారమగు సందర్భాలు

* సప్తమ స్థానంలో పూర్ణచంద్రుడు, బుధుడు, గురుడు, శుక్రుడులలో ఎవరైనా వున్నా లేదా వీరిదృష్టి 7వ స్థానంపై పడినా.
* సప్తమస్థానాధిపతితో పూర్ణచంద్రుడు, బుధుడు, గురుడు లేక శుక్రుడులలో ఎవరైనా కలసియున్నా
* సప్తమస్థానాధిపతి పూర్ణచంద్రుడు, బుధుడు, గురుడు లేక శుక్రుల దృష్టి కలిగియున్నను
* 10వ స్థానంలో శుభగ్రహమున్నను.
* వృషభముకాని సింహంకాని లగ్నమై, లగ్నాత్తు రెండవ స్థానంలో కుజుడు వున్నను.
* మకరం కాని సింహం కాని లగ్నమై 7 స్థానమున కుజుడున్నను.
* ధనుస్సు లేక మీనము 8వ స్థానమై అందులో కుజుడున్నను
* వృషభము లేదా తుల 12వ స్థానమై అచట కుజుడున్నను
* కుజుడు కేంద్ర కోణములలో వున్నను.
* అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, అనూరాధ, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణము, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు పుట్టినను కుజదోషము వర్తించదు.

# వివాహ సందర్భంలో కుజదోషం లేదు

స్కాంధపురాణంలో కుజుని సృష్టికర్తయగు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి "12 సంవత్సరాల తరువాత కుజదోషం వర్తించదు" అని తెలిపారు.

ఈనాడు 12 సం॥లకు ముందు వివాహం చట్టసమ్మతం కాదు. 12 సం॥ తరువాతనే వివాహాలు జరుగుతున్నవి. కావున వివాహాలకు కుజదోషానికి సంబంధం లేదు.

కుజదోషం కేవలం బాలారిష్ట దోషమే.

* * *

# 80. బుధుడు - ఒక వీక్షణ

1. ఇతరనామాలు - సౌమ్య, కుమార, బోధాయన
2. లింగము - నపుంసకగ్రహం
3. జాతి - వైశ్య
4. రంగు - ఆకుపచ్చ
5. తత్త్వము - భూతత్త్వము
6. గ్రహస్వభావము - శుభ / పాప
7. స్వభావము - మిశ్రమ స్వభావం
8. గుణము - రజోగుణము
9. రుచులు - మిశ్రమరుచి
10. గ్రహోదయము - శీర్ష
11. జీవులు - పక్షి
12. గ్రహస్థానము - క్రీడాస్థలములు
13. ఆధిపత్యదిక్కు - ఉత్తరము
14. జల భాగం - జల
15. ఆత్మాధికారకత్వం - వాక్కు
16. పాలనశక్తులు - రాకుమారుడు
17. శరీరధాతువు - చర్మము
18. లోహ ధాతువు - కాంస్యము
19. కుటుంబ సభ్యుడు - మేనత్త, మేనమామ
20. గ్రహరూపవర్ణం - దూర్వాదళకాంతి
21. గ్రహపీడ - బంధువుల వలన బాధలు
22. గ్రహవర్గం - శని
23. గృహభాగములు - రీడింగ్‌రూం, ఆటస్థలం
24. కాల బలము - రాత్రి, పగలు కూడ బలవంతుడు
25. దిగ్బలము - లగ్నము
26. ఆధిపత్య కాలము - ఋతువు
27. స్వక్షేత్రము - మిధునము, కన్య
28. శత్రుక్షేత్రము - ధనస్సు, మీనము
29. మిత్రక్షేత్రము - వృషభము, తుల, కుంభము, మకరము
30. విషమ క్షేత్రము - కర్కాటకము

31. సమక్షేత్రము - మేషము, వృషభము, ధనస్సు, మకరము
32. ఉచ్ఛరాశి - కన్య
33. నీచరాశి - మీనం
34. మూలత్రికోణము - కన్య
35. పరమ ఉచ్ఛ - కన్యలో 15వ డిగ్రీ
36. పరమ నీచ - మీనంలో 15వ డిగ్రీ
37. మిత్ర గ్రహాలు - రవి, శుక్ర
38. శత్రుగ్రహాలు - చంద్ర
39. సమగ్రహాలు - కుజ, గురు, శని
40. వ్యధాగ్రహము - చంద్రుడు
41. నైసర్గిక బలగ్రహము - గురుడు
42. దిన చలనం - 1 డిగ్రీ
43. రాశిలో గ్రహం ఉండేకాలం - 1 నెల
44. రాశిలో ఫలమిచ్చే భాగం - రాశిలో మొత్తం 30 భాగాలు
45. గ్రహ ప్రకృతి - పిత్త, వాత, శ్లేష్మములు
46. ఋతువు - శరదృతువు
47. దిగ్బలము - తూర్పున బలవంతుడు
48. సూచించు ఎత్తు - పొడుగు
49. సూచింపబడే వయస్సు - 20 సంవత్సరాలు
50. సూచించు ప్రాంతాలు - వింధ్యపర్వతం నుండి గంగానది వరకు గల ప్రాంతాలు
51. నివాస ప్రాంతం - జనపదములు
52. సూచించబడే శరీరావయవము - చర్మము, మెదడు, నరములు
53. సూచించే శరీర వ్యాధులు - మెదడు సంబంధించిన వ్యాధులు, నరముల బలహీనత, నపుంసకత్వము, ఫిట్స్, నత్తి, చెముడు, ల్యూకోడెర్మా, శ్వాసకోశవ్యాధులు.
54. గోచారరీత్యా శుభస్థానములు - 2,4,6,11
55. గోచారరీత్యా అశుభస్థానములు - 1,3,5,7,9,12
56. గోచారరీత్యా వేదస్థానములు - 3,5,9,12

57. గ్రహదశాకాలము - 17 సంవత్సరములు
58. జీవన కారకత్వము - విద్యాకారకుడు
59. సంబంధించిన నక్షత్రాలు - ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి
60. సూచించు వృక్షజాతి - ఫలములు లేని చెట్లు
61. సూచించు ధాన్యం - పెసలు
62. సూచించు పండ్లు - సీమచింత
63. సూచించు పక్షులు - చిలుక, గబ్బిలం
64. సూచించు జంతువులు - మేక, గొర్రె
65. సూచించు ఇతర ద్రవ్యములు - నగలు, మిశ్రమ వస్తువులు
66. సంబంధించిన సమిధ - ఉత్తరేణి
67. సంబంధించిన మూలిక - ఉత్తరేణి, నేలగుమ్మడి
68. సూచించు వస్త్రము - తడిసిన వస్త్రము
69. దేవ వర్గము - శైవ
70. గ్రహ గోత్రము - అత్రేయ
71. వేదములు - అధర్వణ
72. శుభత్వం - అర్థశుభుడు
73. అవతారం - బుద్ధావతారం
74. గ్రహస్వరూప - సుందరమూర్తి, నాల్గు భుజాలు కలిగి గద, కవచం, కత్తి, పసుపుపచ్చని మాల, పీతవస్త్రం ధరించువాడు.
75. గ్రహ స్వరూప వర్ణం - తాళపత్రం వంటి రంగు
76. గ్రహా రూఢవాహనం - సింహం
77. పూజార్ధం గ్రహ ప్రతిమకు వాడవలసినది - బంగారం
78. గ్రహప్రీతికి నైవేద్యం - పాలన్నం
79. అధిష్ఠాన దేవత - దుర్గాదేవి
80. అధి దేవత - విష్ణువు
81. ప్రత్యధిదేవత - నారాయణుడు
82. గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు - విజయదశమి
83. చేయవలసిన ప్రసాదము - వడపప్పు, పులిహోర
84. దోషనివారణకు దక్షిణ - బంగారం

85. ప్రీతికరమైన తిథి - శ్రావణ శుక్లపంచమి, వైశాఖపూర్ణిమ
86. ఆచరించవలసిన వ్రతము - సత్యనారాయణవ్రతము
87. పారాయణ చేయవలసిన పురాణాలు - దేవీ భాగవతం
88. పారాయణ చేయవసిన అష్టోత్తర శతనామావళి - బుధగ్రహ అష్టోత్తర శతనామావళి
89. పారాయణ చేయవలసిన సహస్రనామావళి - విష్ణు సహస్ర నామావళి
90. ఆచరించవలసిన దీక్ష - గోవిందుని దీక్ష
91. ధరించవలసిన మాల - తులసిమాల
92. ధరించవలసిన రత్నములు - పచ్చ
93. ధరించవలసిన రుద్రాక్ష - చతుర్ముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - విష్ణాలయం, దుర్గాదేవి ఆలయం
95. చేయవలసిన పూజలు - దుర్గాపూజ
96. దానం చేయవలసిన ద్రవ్యములు - పెసలు, ఆకుపచ్చని వస్త్రములు
97. గ్రహజపసంఖ్య - 17,000
98. హోమముకు వాడు సమిధ - ఉత్తరేణి
99. నవగ్రహమండపంలో గ్రహాఆసనం - బాణాకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 7వరాశి
101. గ్రహసంఖ్య - 5
102. గ్రహం సూచించు వారం - బుధవారం
103. శుభసమయం - ప్రాతఃకాలం (ఉదయం 3 నుండి 4 గంటలు)
104. ప్రతినిధి గ్రహాలు - గురు + రాహు
105. గ్రహం బలంగా ఉంటే ఫలితం - ఇతరులను ఆకర్షించు వాక్చాతుర్యం
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - కఠినవాక్కు, తగాదాలు
107. తండ్రి - చంద్రుడు
108. తల్లి - తార
109. భార్య - ఇల
110. సూచించు లోహములు - సీసం, తగరం
111. గ్రహ ప్రభావితుల మనఃస్థితి - సాత్వికం
112. భావకారకత్వము - బుద్ధి, జ్ఞానం

113. గ్రహదృష్టి - కటాక్ష
114. గ్రహమునకు గుర్తు - ☿
115. సంబంధించిన వృత్తి - నౌకావిభాగం, ఖజానా, విద్య
116. గ్రహజన్మ సంవత్సరం - సౌమ్య
117. జన్మమాసం - భాద్రపదం
118. జన్మతిధి - శుక్ల ఏకాదశి
119. జన్మ నక్షత్రం - ఉత్తర
120. ఆధిపత్యం వహించు దేశం - మగధ
121. గ్రహఋషి - నారాయణుడు
122. గ్రహఛందస్సు - త్రిష్టుప్
123. పుట్టినవారం - బుధవారం

**సంబంధించిన వస్తువులు, పనులు :-**

పెసలు, ఉత్తరేణి, కంచు, మిశ్రమలోహ వస్తువులు, నగలు, పూలు, కలము, పుట్టగొడుగులు, చిలుకలు, మేక, గొర్రె, జ్యోతిష్యులు, తాత, మేనమామ, యంత్రములు, మంత్రములు, తంత్రములు, పచ్చ, దుర్గాస్తోత్రము, విష్ణుసహస్ర నామములు, ఆకుపచ్చని వస్త్రము.

## 81. ఖగోళ శాస్త్రపరంగా బుధుడు

సూర్యునికి అత్యంత సమీపంలో ఉండే గ్రహము బుధుడు. బుధగ్రహమును ఇంగ్లీషులో "మెర్క్యురీ" అంటారు. గ్రీకు పురాణ కథలలో బుధగ్రహమును అపోలో, హెర్మ్స్ అని రెండు పేర్లతో పిలుస్తారు.

బుధగ్రహం ద్రవ్యరాశి $3.28 \times 10^{23}$ కి.గ్రా.లు ఉంటుంది. భూమి పరిమాణంలో 1/17 వంతు పరిమాణాన్ని కలిగి ఉంటుంది. సూర్యునినుండి 5,79,10,000 కిలోమీటర్లదూరంలో ఉంటుంది. ఇది సూర్యుని చుట్టు గంటకు 1,72,000 కిలోమీటర్ల వేగంతో తిరుగుతూఉంటుంది. సూర్యుని చుట్టు తిరుగుటకు 88 రోజులు పడుతుంది. సూర్యకుటుంబంలోని గ్రహాలన్నింటికంటె బుధగ్రహం వేగంగా పరిభ్రమిస్తుంది.

సూర్యునికి దగ్గరగా ఉండడంవలన, పగటిపూట బుధగ్రహంపై 427 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత ఉంటుంది. రాత్రిపూట దీనిపై ఉష్ణోగ్రత -173 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉంటుంది. అంటే దానివలన రాత్రిపూట బుధగ్రహం అతి చల్లగా ఉంటుంది. అంటే బుధగ్రహంపై పగటిపూట ఎంత వేడిగా వుంటుందో రాత్రిపూట

అంత చల్లగా ఉంటుంది. దీనికి కారణం బుధగ్రహంపై వాతావరణం లేకపోవటమే. దీని గురుత్వాకర్షణశక్తి భూమిపై గురుత్వాకర్షణ శక్తిలో 19/50 వ వంతు ఉంటుంది. ఉదాహరణకు భూమిపై 50 కిలోల బరువున్న రాయి, బుధగ్రహంపై 19 కి.గ్రాలు మాత్రమే ఉంటుంది.

బుధగ్రహమునకు ఉపగ్రహాలు ఉండవు. 1970లో "మారినర్ - 10" ఉపగ్రహమును పంపి బుధగ్రహము యొక్క ఉపరితలమును పరిశీలించడం జరిగింది.

బుధగ్రహంపై అగ్నిపర్వతాల ముఖద్వారాల వంటివి అనేకం ఉన్నవి. పొడవైన మైదానాలు కలవు. దీనిపై "కాలోరిస్ బేసిన్" అనే గొయ్యి ఉన్నది. దీని విస్తీర్ణం 1300 కిలోమీటర్లు. పురాణకథలలో బుధగ్రహంను సమాచారం అందించేవానిగా పేర్కొంటారు.

## 82. పురాణ పరంగా బుధుడు

బుధుడు దూర్వాదళము వంటి దేహకాంతి కలవాడు. నాలుగు భుజములు కలవాడు. పీతవస్త్రమును, పసుపుపచ్చని మాలను ధరించును. గద, కత్తి, డాలు ధరించును. సింహమును అధిరోహించును. ఇతనికి సౌమ్య, కుమార, బోధాయన అను పేర్లు కలవు.

శిరస్సున బంగారు కిరీటాన్ని, మెడలో అందమైన మాలను ధరిస్తాడు. బుధుని తల్లిదండ్రులు తారాచంద్రులు.

దేవతలకు గురువు బృహస్పతి. ఈయనవద్ద విద్యను అభ్యసించడానికి, యువకుడైన చంద్రుడు శిష్యునిగా చేరాడు. బృహస్పతి భార్య తార. మహా సౌందర్యవతి. ఆమె రాక్షసగురువైన శుక్రాచార్యుని దృష్టికి లోనై పుత్రసమానుడైన చంద్రుని మోహించింది.

చంద్రుడు కూడ గురుపత్ని తల్లిలో సమానమైనదని, దూరంగానే ఉన్నాడు. అయితే తార రెచ్చగొట్టేలాగ ప్రవర్తించి చంద్రుని తన వశం చేసుకున్నది. కాని ఆ తేజస్సును భరించలేక, చంద్రుని భార్యఅయిన దక్షకన్యకు ధారపోసింది. ఆ తేజమే బుధ రూపం దాల్చింది.

కాని, తారాచంద్రుల విలాసాల ఫలితంగా జనించిన బుధుని, బృహస్పతి అంగీకరించలేదు. అతడు తన పుత్రుడు కాదు పొమ్మన్నాడు. తారకూడ అతడు బృహస్పతి తనయుడు కాదని ధృవీకరించింది.

ఆ విధంగా బుధజననం సౌమ్యనామ సంవత్సర జ్యేష్ఠమాస కృష్ణ పక్ష ఏకాదశి తిథియందు భరణీ నక్షత్రాన జరిగింది.

బ్రహ్మ ఈయన గొప్పబుద్ధిని సూచించే విధంగా బుధుడని పేరుపెట్టాడు. ఈయన అన్ని శాస్త్రాలలో పండితుడు. చంద్రునితో సమానంగా కాంతికల శరీరము కలవాడీయన. యోగ్యతను చూచి బ్రహ్మ ఈయనని భూమికి అధిపతిగా, గ్రహంగా చేశాడు.

మహాభారతంలోని ఒక కథననుసరించి ఈయన విద్యాబుద్ధులకు ఎంతో సంతోషించిన మనుమహారాజు తన కుమార్తె 'ఇళ'ను ఇచ్చి ఇతనికి వివాహం చేశాడు. ఇళ మరియు బుధులకు కలిగిన సంతానమే పురూరవుడు. ఈ విధంగా చంద్రవంశం విస్తరించింది.

## 83. జ్యోతిష్యశాస్త్ర పరంగా బుధుడు

**లక్షణాలు :-**

బుధుడు నపుంసక గ్రహము. ఇతను రుచుల మిశ్రమమును తెలియ జేయును. రంగులలో ఆకుపచ్చరంగును సూచించును. ఇతను వైశ్యజాతికి చెందినవాడు. అధిదేవత విష్ణువు. గుండ్రని ఆకారం కలిగి, పొడవైన వారిని సూచించును. 20 సంవత్సరాల వయసు వారిని సూచించును. ఇతను వాత, కఫ, పిత్తముల మిశ్రమ తత్త్వము కలవాడు. శరదృతువును సూచించును. పృధ్వీతత్త్వము కలిగి ఉత్తర దిక్కును సూచించును. లోహములలో కంచు, ఇత్తడి (మిశ్రమలోహములు) ని సూచించును. రత్నములలో మరకతను (పచ్చ)ను సూచించును. సంఖ్య 5. లగ్నములో దిగ్బలమును పొందు రజోగుణప్రధానమైన గ్రహము. వింధ్యపర్వతంనుండి గంగానదివరకు ఇతని దేశంగా జాతక పారిజాతం చెపుతున్నది.

బుధుడు ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములకు అధిపతి శరీరావయవములలో మెదడు, చర్మము, నరములను సూచించును. బుధుడు మిధునము, కన్యారాశులకు అధిపతి. కన్యలో 15వ డిగ్రీ నుండి 20వ డిగ్రీ వరకు మూల త్రికోణము. ఇతనికి ఉచ్చరాశి కన్య. నీచరాశి మీనం. కన్యలో 15వ డిగ్రీ ఇతనికి పరమోచ్చ. అలాగే మీనంలో 15వడిగ్రీ ఇతనికి పరమనీచ. ఇతనికి రవి, శుక్రులు స్నేహితులు. చంద్రుడు శత్రువు. కుజ, గురు, శని సములు. బుధగ్రహదశ 17 సంవత్సరాలు.

## బుధుడు ప్రభావం

ఎల్లప్పుడు సంతోషంగా వుంటారు. వీరి పెదవులపై చిరునవ్వు మెదులుతూ వుంటుంది. పొట్టిగా వుంటారు. చురుకైనవారు. వృద్ధాప్యంలో కూడా యువకుల వలె వుంటారు. నాటకరచయితలు, నటులు, విషయజ్ఞానం ఎక్కువగానే వుంటుంది. దీర్ఘాలోచనా పరులు, సందేహపరులు.

తలనొప్పి, నరముల వ్యాధులు, అలసరువంటి వ్యాధులు రావచ్చు.

రేడియో, టి.వి., పత్రికారంగం, ప్రచురణరంగం, టెలిఫోన్‌రంగాలలో రాణిస్తారు.

**కారకత్వములు :-**

బుధుడు వాక్ కారకుడు, మేనమామ, మేనల్లుడు, మేనకోడలు మాతామహుడు, ఉపన్యాసములో నైపుణ్యం, లలితకళలు, గణితశాస్త్రం, వ్యాపార శాస్త్రం, అర్థశాస్త్రం, జ్యోతిష్యం, ఖగోళశాస్త్రం, వాణిజ్యం, వ్యాకరణము, వివిధరకాల భాషలు, శిల్పి, మంత్రం, తంత్రం, వివేకం, పుస్తక ప్రచురణ, గ్రంథాలయం, విష్ణుభక్తి, విష్ణాలయం, వైష్ణవభక్తులు, మధ్యవర్తిత్వం, వైద్యులను సూచించును. నాభి, నరము, నాలుక, స్వరపేటిక, చర్మములను సూచించును. నరముల బలహీనత, మూర్ఛ, చెముడు, మెదడుకు సంబంధించిన వ్యాధులను సూచించును. అన్నిరకముల ఆకుకూరలు, కూరగాయలను సూచించును. ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు, న్యాయవాదులు, యాంకరులను సూచించును.

తెలివైనవారు, పండితులు, చరిత్రకారులు, గుమస్తాలు, పెయింటర్లు, ఎడిటర్లు, రాయబారులు, విద్య, ఖాతాలు, దస్తూరి, వ్యాసములు, నవలలు, కల్పితాలు సామెతలు, చిన్నపుస్తకములు, ధృవీకరణపత్రాలు, వదంతులు, ప్రకటనలు, సత్యములు, యువకులు, వ్యాపారము, కేబుల్స్, డైరీలు, సైకిళ్ళు, గుర్రపుబండ్లు, చేతులు, కేటలాగు, పదనిఘంటువులు, వాహనములను సూచించును.

## బుధుడు సూచించు విద్యలు

బుధుడు గణితము, ఎకౌంట్లు, డిజైన్లు, ప్లానులు గీయుట, చిత్రలేఖనము, పుస్తకప్రచురణ, పుస్తకముల వ్యాపారం, రచన, తర్కములను సూచించును. శుక్రునితో కలసి సినిమావ్యాపారం, జీవశాస్త్రం, రసాయన శాస్త్రం, వృక్షశాస్త్రం, ఖగోళశాస్త్రం, జ్యోతిషశాస్త్రం, జర్నలిజంలను సూచించును. గురునితో కలసి ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు, బోధకులను సూచించును.

## బుధుడు సూచించు వ్యాధులు

మూగతనము, చెముడు, చర్మవ్యాధులు, మెదడుకు సంబంధించిన వ్యాధులు, పోలియో, నరముల బలహీనత, నత్తి, మాటలు ఆలస్యంగా రావటం, మూర్ఛ, ఫిట్సులను సూచించును. బుధుడు చంద్రునితో కలసి తరచుగా స్పృహకోల్పోవుట, హిస్టీరియా, మానసికవ్యాధి, అధికముగా మాట్లాడుట, కోమాలను సూచించును. బుధుడు గురునితో కలసి మెదడువాపు వ్యాధి, శనితో కలసి అకస్మాత్తుగా నిద్రపోవుట, కుజునితో కలసి బ్రెయిన్ కాన్సర్ అధికంగా ఆలోచించుట, నరాలు చిట్లిపోవుటను సూచించును. రాహువుతో కలసి విషప్రయోగం, మెదడు చెడిపోవుటను, కేతువుతో కలసి హింసించు స్వభావంను సూచించును.

## బుధుడు సూచించు వృత్తి వ్యాపారాలు

ఎడిటర్స్, ఉపాధ్యాయులు, టైపిస్టు, స్టెనోగ్రాఫర్, శిల్పి, రాయబారి, మధ్యవర్తి ఇన్సూరెన్స్ఏజెంట్, జ్యోతిష్యుడు, రైల్వేఉద్యోగి, తంతితపాలాశాఖలోని ఉద్యోగస్థులు, కవి, రచయిత, కాషియర్స్, ఆడిటర్, బ్యాంకు, ట్రెజరీ, రెవెన్యూ శాఖలలో ఉద్యోగస్థులు, ఆదాయశాఖ, వాణిజ్యశాఖ, ఇంజనీరింగ్ శాఖ, న్యాయశాఖలలో ఉద్యోగస్థులను సూచించును. ఫింగర్ ప్రింట్‌లను పరిశీలించువారు, ఎకౌంటెంట్లు, జర్నలిస్టులను సూచించును. శుక్రునితో చూడబడుతుంటె సంగీతం, రేడియో, ఆభరణాలు, దుస్తుల తయారీలను సూచించును.

## ద్వాదశ లగ్నాలులో బుధుడు -ఫలితాలు

**మేషరాశి లగ్నమైతే**

- మేషం లగ్నమై లగ్నమందు బుధుడున్న అనారోగ్యము, దైవభక్తి, మంచి స్వభావం కలుగును.
- 2 వ స్థానంలో బుధుడున్న మంచివాక్కు, ధనము సంపాదించి ఖర్చు పెట్టుట కలుగును
- 3 వ స్థానంలో బుధుడున్న సోదరిబలం పెరుగును.
- 4 వ స్థానంలో బుధుడున్న తల్లికి అనారోగ్యం, స్వల్పవిద్య, ఋణము కలుగును.
- 5 వ స్థానంలో బుధుడున్న సంతానం, సుఖం తక్కువ.
- 6 వ స్థానంలో బుధుడున్న శత్రుబాధ, రోగము, ఋణము, వ్యవహార ఆటంకాలు, కష్టనష్టములు కలుగును.

- 7 వ స్థానంలో బుధుడున్న అనారోగ్యం, శత్రువుల వలన బాధలు కలుగును.
- 8 వ స్థానంలో బుధుడున్న వ్యవహార చిక్కులు కలుగును.
- 9 వ స్థానంలో బుధుడున్న శత్రువుల వలన లాభం కలుగును.
- 10 వ స్థానంలో బుధుడున్న అధిక ప్రయాణాలు, ధనవ్యయము కలుగును.
- 11 వ స్థానంలో బుధుడున్న నీచకార్యములు, ధనార్జన పెరుగును.
- 12 వ స్థానంలో బుధుడున్న జాతకుడు కష్టపడును. సుఖ పడును.

**వృషభం లగ్నమైతే**

- వృషభ లగ్నమై 1 వ స్థానములో బుధుడు వుంటే జాతకుడు ఆరోగ్యవంతుడు, అందమైనవాడు మరియు విద్యా వినయం కలవాడు.
- 2 వ స్థానములో బుధుడు వున్నట్లయితే జాతకుడు ఎక్కువ ధనం కూడబెట్టును. కాని శరీర బాధలు కలవాడు అవుతాడు.
- 3 వ స్థానములో బుధుడు వున్నట్లయితే సుఖము, ధనము తక్కువ.
- 4 వ స్థానములో బుధుడు వున్నట్లయితే జాతకునికి తల్లి ప్రేమ వుండదు. కాని విద్యావంతుడు అవుతాడు.
- 5 వ స్థానములో బుధుడు వుంటే జాతకునికి వాహనం, అధికారం ఉండును.
- 6 వ స్థానములో బుధుడు వుంటే జాతకునికి డబ్బు ఖర్చు ఎక్కువగా ఉండును.
- 7 వ స్థానములో బుధుడు వుంటే జాతకునికి అందమైన భార్య లభించును.
- 8 వ స్థానములో బుధుడు వున్నట్లయితే జాతకునికి డబ్బు ఖర్చు ఎక్కువగా వుండును.
- 9 వ స్థానములో బుధుడు వున్నట్లయితే జాతకుడు అధిక ధనవంతుడు అవుతాడు.
- 10 వ స్థానములో బుధుడు వున్నట్లయితే జాతకుడు వ్యాపారము చేసి అధిక ధనము, పేరు సంపాదించును.
- 11 వ స్థానములో బుధుడు వున్నట్లయితే జాతకుడు ధనము సంపాదిస్తాడు. కాని మంచి పనులకు ఖర్చు చేయును. పుణ్యక్షేత్రాలను సందర్శిస్తాడు.
- 12 వ స్థానములో బుధుడు వుంటే జాతకుడు అప్పులు చేయును.

### మిధునం లగ్నమైతే

- ✤ మిధునం లగ్నమై లగ్నంలో బుధుడున్న విద్యాగోష్ఠులలో పాల్గొనును, వినయం, ఆరోగ్యం కలుగును.
- ✤ రెండవ స్థానంలో బుధుడున్న సంఘంలో గౌరవము, ధనలాభం కలుగును.
- ✤ 3 వ స్థానంలో బుధుడున్న అధిక ధన వ్యయమగును.
- ✤ 4 వ స్థానంలో బుధుడున్న తల్లి ఆరోగ్యముగా నుండును. విద్యావృద్ధి విషయ జ్ఞానం భూలాభం కలుగును.
- ✤ 5 వ స్థానంలో బుధుడున్న సంతానవృద్ధి, కుటుంబ సుఖం కలుగును.
- ✤ 6 వ స్థానంలో బుధుడున్న అనారోగ్యం, ఋణము కలుగును.
- ✤ 7 వ స్థానంలో బుధుడున్న గుణవంతురాలైన భార్య లభించును.
- ✤ 8 వ స్థానంలో బుధుడున్న పూర్వుల ఆస్తి కోల్పోవును. ఎక్కువదూరం ప్రయాణించును.
- ✤ 9 వ స్థానంలో బుధుడున్న పితృసౌఖ్యము, ఉద్యోగం, అధికారం, వాహనము లభించును.
- ✤ 10 వ స్థానంలో బుధుడున్న పుణ్యక్షేత్ర సందర్శన, మంచి కార్యములకు ధనము ఖర్చుపెట్టుట జరుగును.
- ✤ 11 వ స్థానంలో బుధుడున్న ధనలాభం, సోదరుల సహకారం కలుగును.
- ✤ 12 స్థానంలో బుధుడున్న మంచికార్యములు చేయును. సజ్జనుల మైత్రి లభించును.

### కర్కాటకం లగ్నమైతే

- ✤ కర్కాటకం లగ్నమై లగ్నములో బుధుడున్న సుఖ, దుఃఖములు సమానముగా ఉండును. సంఘంలో గుర్తింపు.
- ✤ 2 వ స్థానంలో బుధుడున్న ధనలాభం, ధనవ్యయము
- ✤ 3 వ స్థానంలో బుధుడున్న సుఖ, దుఃఖములు సమానముగా ఉండును, సోదరుని వలన ధనలాభము.
- ✤ 4 వ స్థానంలో బుధుడున్న తల్లివలన సుఖము, విద్య, భూమి, వాహనము, లభించును.
- ✤ 5 వ స్థానంలో బుధుడున్న సుఖ, దుఃఖములు సమానముగా ఉండును. స్త్రీ సంతానము ఎక్కువ.

- 6 వ స్థానంలో బుధుడున్న ఆర్థిక యిబ్బందులు, అశాంతి కలుగును.
- 7 వ స్థానంలో బుధుడున్న మంచిభార్య, శరీర పీడ కలుగును.
- 8 వ స్థానంలో బుధుడున్న అనారోగ్యం, ధనవ్యయం కలుగును.
- 9 వ స్థానంలో బుధుడున్న సుఖహీనం కలుగును.
- 10 వ స్థానంలో బుధుడున్న సాంప్రదాయవాది.
- 11 వ స్థానంలో బుధుడున్న ధర్మవర్తనం, పిసినారితనం, ధనసంపాదన కలుగును.
- 12 వ స్థానంలో బుధుడున్న సత్కార్యములు నిర్వహించును.

**సింహం లగ్నమైతే**

- సింహలగ్నమై లగ్నంలో బుధుడున్న ధనం, పేరుప్రతిష్ఠలు కలుగును.
- 2 వ స్థానంలో బుధుడున్న ధనవంతుడు, సుందరమైన ముఖము కలవాడు. వక్త.
- 3 వ స్థానంలో బుధుడున్న సుఖజీవనుడు, అక్కాచెల్లెళ్ళు ఉంటారు.
- 4 వ స్థానంలో బుధుడున్న మాతృసుఖం, విద్య, భూమి తక్కువగా కలుగును.
- 5 వ స్థానంలో బుధుడున్న ఆడపిల్లలు ఎక్కువ.
- 6 వ స్థానంలో బుధుడున్న ధనం అంతా విరోధుల పాలవుతుంది.
- 7 వ స్థానంలో బుధుడున్న సుఖశాంతులు, కొంత అనారోగ్యం కలుగును.
- 8 వ స్థానంలో బుధుడున్న అప్పులు ఎక్కువగా ఉండును.
- 9 వ స్థానంలో బుధుడున్న జ్ఞాతుల నుంచి ధనము సంపాదించును.
- 10 వ స్థానంలో బుధుడున్న కీర్తివంతుడు, ధనవంతుడు.
- 11 వ స్థానంలో బుధుడున్న కార్యసిద్ధి, శాంతి కలుగును.
- 12 వ స్థానంలో బుధుడున్న అధిక ధనవ్యయం.

**కన్య లగ్నమైతే**

- కన్యాలగ్నమై లగ్నంలో బుధుడుయున్న భూమి, ధనము, కీర్తి సంపాదించును.
- 2 వ స్థానంలో బుధుడుయున్న అందమైన ముఖము, ధనం, వాచాలత కలుగును.
- 3 వ స్థానంలో బుధుడుయున్న అక్కాచెల్లెళ్ళు ఎక్కువ, కార్యహాని కలుగును.
- 4 వ స్థానంలో బుధుడుయున్న మాతృసౌఖ్యం, భూమి అధికంగా కలుగును.

- 5 వ స్థానంలో బుధుడుయున్న ధనం సంపాదించి కూడబెట్టును. తప్పక సంతానం కలవాడు.
- 6 వ స్థానంలో బుధుడుయున్న కలహాల వలన నష్టం వస్తుంది.
- 7 వ స్థానంలో బుధుడుయున్న ఆయుర్భాగ్యాలు తక్కువగా ఉండును.
- 8 వ స్థానంలో బుధుడుయున్న పిత్రార్జితమంతయు ఖర్చు చేయును.
- 9 వ స్థానంలో బుధుడుయున్న భోగభాగ్యాలు కలుగును.
- 10 వ స్థానంలో బుధుడుయున్న న్యాయవృత్తి వలన జీవనాన్ని కొనసాగించును.
- 11 వ స్థానంలో బుధుడుయున్న ధనవంతుడు అవుతాడు.
- 12 వ స్థానంలో బుధుడుయున్న ఋణగ్రస్తుడు అవుతాడు.

**తుల లగ్నమైతే**

- తులాలగ్నమై లగ్నమందు బుధుడున్న ధనలాభము, సుఖము, శాంతి లభించును.
- 2 వ స్థానమున బుధుడున్న ధనలాభము పొందును. సంభాషణా చాతుర్యం కలవాడు.
- 3 వ స్థానమున సామాన్యజీవనము, తండ్రి నుంచి వచ్చిన డబ్బు నష్టము కలుగును.
- 4 వ స్థానమున బుధుడున్న గృహము, విశేషభాగ్యము కలుగును.
- 5 వ స్థానమున బుధుడున్న సంతానము, గొప్ప యోగమును పొందును.
- 6 వ స్థానమున బుధుడున్న సుఖహీనత, మనశ్శాంతి లేకపోవుట జరుగును. శత్రువులు, పిత్రార్జిత నష్టము కలుగును.
- 7 వ స్థానమున బుధుడున్న రూపవతి, గుణవతియగు భార్య లభించును. భార్య వలన ధనం లభించును.
- 8 వ స్థానమున బుధుడున్న సుఖహీనత, దరిద్రమును పొందును. పిత్రార్జిత ధననష్టము. ధనాభివృద్ధి తగ్గును.
- 9 వ స్థానమున బుధుడున్న విశేషభాగ్యములను పొందును.
- 10 వ స్థానమున బుధుడున్న విశేష భాగ్యములను పొందును. యజ్ఞములు చేయును.
- 11 వ స్థానమున బుధుడున్న విశేషధనము, ధన రాబడిని పొందును.
- 12 వ స్థానమున బుధుడున్న పనులు నెరవేరకపోవుట, పుణ్యకార్యాల వలన ధనము ఖర్చు అగుట వంటివి సంభవించును.

**వృశ్చికం లగ్నమైతే**

- వృశ్చికలగ్నమై లగ్నంలో బుధుడున్న అధిక శ్రమ, అలసట కలుగును.
- 2 వ స్థానంలో బుధుడున్న అనారోగ్యం, ఋణబాధ, కష్టములు కలుగును.
- 3 వ స్థానంలో బుధుడున్న దాయాదుల ఆస్తి లభించును.
- 4 వ స్థానంలో బుధుడున్న భూలాభం, భూనష్టం కలుగుతుంది.
- 5 వ స్థానంలో బుధుడున్న సంతాన సుఖం తక్కువ. పుత్రికలు ఉంటారు.
- 6 వ స్థానంలో బుధుడున్న భూ ధనలాభం, దాయాదుల ఆస్తి లభించును.
- 7 వ స్థానంలో బుధుడున్న భార్య వలన బాధలు కలుగును.
- 8 వ స్థానంలో మొదట సుఖం, తరువాత దుఃఖం కలుగును.
- 9 వ స్థానంలో బుధుడున్న స్వల్ప ధనలాభం కలుగును.
- 10 వ స్థానంలో బుధుడున్న సదాచారములను పాటించును.
- 11 వ స్థానంలో బుధుడున్న జీవితాంతం ధనార్జన చేస్తూ సుఖంగా జీవిస్తాడు.
- 12 వ స్థానంలో బుధుడున్న ధనం వ్యయమగును.

**ధనస్సు లగ్నమైతే**

- ధనుస్సు లగ్నమై లగ్నమున బుధుడు ఉన్న విద్య, వినయము, కీర్తి, ఆరోగ్యము, సుఖము కలుగును.
- 2 వ స్థానంలో బుధుడు ఉన్న ధనము, సుఖము, వాచాలత్వము కలుగును.
- 3 వ స్థానంలో బుధుడు ఉన్న ఉద్యోగము లభించును, సామాన్య జీవనము కలుగును.
- 4 వ స్థానంలో బుధుడు ఉన్న భార్య వలన దుఃఖము కలుగును.
- 5 వ స్థానంలో బుధుడు ఉన్న స్త్రీ సంతానము ఎక్కువ, కీర్తి, గౌరవం, సన్యాసము కలుగును.
- 6 వ స్థానంలో బుధుడు ఉన్న సామాన్య యోగము, అధికారము లేని ఉద్యోగము, భార్యకు అనారోగ్యము కలుగును.
- 7 వ స్థానంలో బుధుడు ఉన్న గుణవతియగు భార్య, కుటుంబ సుఖం కలుగును.
- 8 వ స్థానంలో బుధుడు ఉన్న కష్టజీవి.
- 9 వ స్థానంలో బుధుడు ఉన్న రాజాశ్రయము, తీర్థయాత్రలయందు ఆసక్తి పరస్త్రీ సాంగత్యము కలుగును. దరిద్రము, సుఖహీనం, కష్టజీవనం కలుగును.

- 10 వ స్థానంలో బుధుడు ఉన్న మంచి భార్య, రాజయోగము కలుగును.
- 11 వ స్థానంలో బుధుడు ఉన్న యుక్తిచే ధనార్జనము, సౌఖ్యము, సంతాన వృద్ధి కలుగును.
- 12 వ స్థానంలో బుధుడు ఉన్న దరిద్రము, పిసినారితనం, శత్రుబాధ, సంసార సుఖం లేకపోవుట కలుగును.

**మకరం లగ్నమైతే**

1. మకర లగ్నమై 1 వ స్థానమున బుధుడు వుంటే విద్యావంతుడు, ధనవంతుడు, తెలివి గలవాడు, వేద శాస్త్రజ్ఞుడు.
2. 2 వ స్థానమున బుధుడు వుంటే సామాన్యమైన జీవితం గడుపును.
3. 3 వ స్థానమున బుధుడు వుంటే అనేక కష్టాలు అనుభవించును.
4. 4 వ స్థానమున బుధుడు వుంటే ధనవంతుడు, విద్యావంతుడు. వాహనము వుండును. సుఖ సంతోషకరమైన జీవితంను అనుభవించును.
5. 5 వ స్థానమున బుధుడు వుంటే స్త్రీ సంతానం కలుగును. ధనవంతుడు, సుఖ సంతోషాలతో జీవించును.
6. 6 వ స్థానమున బుధుడు ఉంటే శత్రువులు, తగాదాలు కలిగి ఉంటాడు. పిత్రార్జితము అంతా ఖర్చు పెట్టును.
7. 7 వ స్థానమున బుధుడుంటే ధనవంతుడు. అనారోగ్యము కలుగును.
8. 8 వ స్థానమున బుధుడుంటే దరిద్రము కలుగును.
9. 9 వ స్థానమున బుధుడుంటే ధనవంతుడు, సుఖ సంతోషాలతో జీవించును.
10. 10 వ స్థానమున బుధుడు వున్న వ్యాపారము వలన గాని, వైద్యం వలన గాని, ధనవంతుడు అవుతాడు. పేరు ప్రతిష్ఠలు గలవాడు. సుఖ సంతోషకరమైన జీవితాన్ని గడుపును.
11. 11 వ స్థానమున బుధుడున్న ధనవంతుడు. తెలివైనవాడు. సుఖ సంతోషాలతో జీవించును.
12. 12 వ స్థానమున బుధుడున్న ధర్మదాత. వ్యవహారపు చిక్కులు అధికంగా నుండును.

**కుంభం లగ్నమైతే**

- కుంభలగ్నమై లగ్నమందు బుధుడున్న సుఖము, ధనము, శాంతి కలుగును.
- 2 వ స్థానమున బుధుడున్న వ్యవహారంలో చిక్కులు, అశాంతి, ధనహీనము, సంతాన విచారము కలుగును.

- 3 వ స్థానమున బుధుడున్న మిశ్రమ ఫలము, పిరికితనం కలుగును.
- 4 వ స్థానమున బుధుడున్న సుఖము, ధనము, శాంతి, విద్యావృద్ధి, భూలాభం, మాతృసౌఖ్యం కలుగును.
- 5 వ స్థానమున బుధుడున్న సుఖము, ధనము, శాంతి, స్త్రీ సంతానము కలుగును.
- 6 వ స్థానమున బుధుడున్న వ్యవహారంలో చిక్కులు, అశాంతి, సంతాన నష్టము కలుగును.
- 7 వ స్థానమున బుధుడున్న మంచి భార్య, సామాన్యజీవనం కలుగును.
- 8 వ స్థానమున బుధుడున్న స్త్రీ సంతానం, తాపత్రయము, వ్యవహారంలో చిక్కులు, అశాంతి కలుగును.
- 9 వ స్థానమున బుధుడున్న సుఖము, ధనం, శాంతి, స్త్రీ సంతానం కలుగును.
- 10 వ స్థానమున బుధుడున్న వైద్యము లేక వాణిజ్యము వల్ల జీవనం కలుగును.
- 11 వ స్థానమున బుధుడున్న సుఖము, శాంతి, న్యాయార్జనము వలన ధనము పొందును.
- 12 వ స్థానమున బుధుడున్న యోగహీనము, శత్రువులు, రోగాలు, అప్పులు కలుగును.

**మీనం లగ్నమైతే**

- మీన లగ్నమై లగ్నములో బుధుడు ఉన్న కళత్ర సౌఖ్యము తక్కువ. సామాన్య విద్య లభించును.
- 2 వ స్థానంలో  బుధుడు ఉన్న మరణ భయము
- 3 వ స్థానంలో  బుధుడు ఉన్న పిరికివాడు. సుఖం తక్కువ కలవాడు.
- 4 వ స్థానంలో  బుధుడు ఉన్న విద్య, భూమి, మాతృ సౌఖ్యం లభించును.
- 5 వ స్థానంలో  బుధుడు ఉన్న స్త్రీల యందు ఆసక్తి కలుగును.
- 6 వ స్థానంలో బుధుడు ఉన్న భార్యకు అనారోగ్యము కలుగును.
- 7 వ స్థానంలో బుధుడు ఉన్న సుకళత్రము లభించును.
- 8 వ స్థానంలో బుధుడు ఉన్న కార్యహాని కలుగును. కళత్ర సుఖము తక్కువ.
- 9 వ స్థానంలో బుధుడు ఉన్న భూలాభం, కుటుంబ సుఖం కలుగును.
- 10 వ స్థానంలో బుధుడు ఉన్న స్వతంత్ర జీవనం కలవాడు, ధనార్జన చేయువాడు.
- 11 వ స్థానంలో బుధుడు ఉన్న వ్యాపారంలో రాణించును. ధనలాభం కలుగును.
- 12 వ స్థానంలో బుధుడు ఉన్న కలహాలు, ఆటంకములు, ధనవ్యయం, కళత్ర సౌఖ్యము కలుగును.

# వివిధభావాలలో బుధుడు - ఫలితాలు

- బుధుడు లగ్నంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు. వైద్యము తెలిసినవాడు. సదాచార పరాయణుడు. పెద్దలను గౌరవించువాడు. ఆయుష్మంతుడు.
- బుధుడు ద్వితీయభావంలో ఉంటే జాతకుడు కార్యసాధకుడు. దైవభక్తి కలవాడు. సంపాదనాపరుడు.
- బుధుడు తృతీయభావంలో ఉంటే జాతకుడు తెలివైనవాడు. పుస్తకపరిజ్ఞానం కలవాడే కాని వ్యవహార జ్ఞానం లేనివాడు. పనులను సాధించలేడు.
- బుధుడు చతుర్థభావంలో ఉంటే జాతకుడు సంగీత విద్వాంసుడు. ఆనందంగా సమయాన్ని గడుపుతాడు.
- బుధుడు పంచమభావంలో ఉంటే జాతకుడు ప్రశాంతజీవితాన్ని గడుపుతాడు. కుటుంబ సభ్యులు సహకరిస్తారు.
- బుధుడు షష్టమ భావంలో ఉంటే జాతకునకు శత్రువులు ఉంటారు.
- బుధుడు సప్తమభావంలో ఉంటే జాతకునకు తెలివైన భార్య లభిస్తుంది. కాని తరచు భార్యాభర్తల మధ్య అభిప్రాయ భేదాలు వస్తుంటాయి.
- బుధుడు అష్టమభావంలో ఉంటే జాతకునకు నాయకుల అండ ఉంటుంది. బంధువుల సాయం పొందుతాడు. కష్టపడతాడు. కాని ఇతరుల పనులను చెడగొట్టే స్వభావం ఉన్నది.
- బుధుడు నవమభావంలో ఉంటే జాతకుడు కుటుంబంతో కలసి ఆనందంగా జీవిస్తాడు. అయితే ఆరాశి బుధునకు అశుభస్థానమయితే జాతకునకు ఆపదలు కలుగుతాయి.
- బుధుడు దశమభావంలో ఉంటే జాతకుడు చమత్కారంగా మాట్లాడుతాడు. హాస్యప్రియుడు. ధనము, విద్య కలవాడు.
- బుధుడు ఏకాదశభావంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు. మంచిప్రవర్తన కలిగి అందరి అభిమానాన్ని పొందుతాడు. వ్యాపారంలో రాణిస్తాడు. అనేక పనులను నిర్వర్తిసాడు.
- బుధుడు ద్వాదశభావంలో ఉంటే జాతకుడు నీచులతో స్నేహం చేస్తాడు. స్వార్థపరుడు.

**బుధుడు కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- నోటిపూత వస్తుంది.
- దంతవ్యాధులు కలుగుతాయి.
- కోపం ఎక్కువ అవుతుంది. అనవసరంగా ఇతరులను నిందించడం జరుగుతూ ఉంటుంది.
- ఆస్తి వ్యవహారాలు ఇబ్బందికరంగా మారతాయి.
- వ్యాపారముకు సంబంధించిన అకౌంట్లలో తేడాలు వస్తాయి.
- మేనమామతో అభిప్రాయభేదం కలుగుతుంది.
- పోలీస్‌స్టేషనుకు వెళ్ళవలసి వస్తుంది.
- మంత్రోచ్చారణ సరిగా ఉండదు.
- ఉత్తమ స్త్రీలను కూడ కామదృష్టితో చూడడం జరుగుతుంది.

పై సంఘటనలలో ఏది జరిగినా బుధుడు చెడు ఫలితాలను ఇస్తున్నాడని గ్రహించాలి. దానికి నివారణ కోసం క్రింద ఇచ్చిన పరిహార క్రియలను చేయాలి.

**బుధుడు శాంతించుటకు చేయవలసిన పరిహార క్రియలు :-**

- మేనమామను ఆదరించండి. గౌరవించండి.
- ఇంటిలో వాయువ్యమూల దుర్గాదేవి విగ్రహాన్ని ఉంచండి.
- ప్రతిరోజు పళ్ళుతోముకొనుటకు వేపపుల్లను వాడండి.
- పచ్చను ధరించండి.
- ఉత్తరదిశలో నీటికుండలు వగైరా లేకుండా చూడండి.

## వివిధ భావాలలో బుధుడు - పరిహార క్రియలు

**లగ్నంలో బుధుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- మద్యపానం చేయకండి.
- మాంసం, గ్రుడ్లు తినకండి.
- నిద్రించునపుడు సోపు గింజలను పొట్లంకట్టి, దానిని తలక్రింద ఉంచుకొని నిద్రించండి.
- తరచు వృత్తిని, ఉద్యోగాన్ని మార్చకండి.
- ఆకుపచ్చని వస్త్రం ధరించకండి.

**ద్వితీయ భావంలో బుధుడు :-**

- నిద్రించునపుడు ఒక రాగిచెంబులో నీరుపోసి తలవద్ద ఉంచుకోండి. మరునాటి ఉదయం ఆ నీటిని రావిచెట్టుకు పోయండి.
- పళ్ళను పటికతో శుభ్రం చేసుకోండి.
- ప్రతిసోమవారం శివునకు అభిషేకం చేయించండి.
- పేదవారికి క్షీరాన్నం పంచండి.

**తృతీయ భావంలో బుధుడు :-**

- నానబెట్టిన పెసలను మేకకు పెట్టండి.
- పక్షులను పెంచండి.
- ప్రతి సూర్యోదయాన సూర్యనమస్కారములు చేయండి.
- దుర్గాదేవిని ఆరాధించండి.
- పళ్ళను పటికతో శుభ్రం చేసుకోండి.

**చతుర్థ భావంలో బుధుడు :-**

- గోధుమలు, బెల్లం కలిపి దానం చేయండి.
- దేవాలయ పూజారికి పసుపురంగు వస్త్రం దానం చేయండి.
- వరుసగా 4 రోజులు శనగలను పంచండి.
- శివాలయంలో చక్రపొంగలి ప్రసాదంగా సమర్పించండి.

**పంచమ భావంలో బుధుడు :-**

- వరుసగా 7 సోమవారాలు అన్నదానం చేయండి.
- కోతులకు గోధుమలు, బెల్లం కలిపి పెట్టండి.
- ఒక రాగినాణెముకు రంధ్రం చేసి దానిని తెల్లనిదారంతో కట్టి మెడలో గొలుసుగా వేసుకోండి.
- వెండి ఉంగరం ధరించండి.
- దుర్గాపూజ చేయండి.

**షష్ఠమ భావంలో బుధుడు :-**

- ఒక గాజుసీసాను పవిత్రగంగానది జలముతో నింపి, దానిని పొలంలో పాతండి.
- ఎడమచేతివేలికి వెండి ఉంగరం ధరించండి.
- ఒకచిన్నకుండలో పాలుపోసి, దానిని నిర్జన ప్రదేశంలో వదిలిరండి.

**సప్తమ భావంలో బుధుడు :-**

- మీతోపాటు మరదలు (భార్యచెల్లెలు)ను ఉంచుకోవద్దు.
- వ్యాపారంలో భాగస్వామ్యం పనికిరాదు.
- పచ్చను ధరించండి.
- దుర్గాదేవిని ఆరాధించండి.

**అష్టమ భావంలో బుధుడు :-**

- ప్రతిరోజుకు 250 గ్రాముల పెసలను దానం చేయండి. ఇలా 7 బుధవారాలు చేయాలి.
- కుమార్తెకు వెండి ముక్కుపుడక చేయించండి.
- కుమార్తె ఎర్రని వస్త్రములు ధరించరాదు.
- సోపుగింజలను చిన్నసంచిలో వేసి దానిని తలక్రింద ఉంచుకొని నిద్రించండి

**నవమ భావంలో బుధుడు :-**

- తలపై పసుపురంగు టోపీని ధరించండి. లేదా పసుపురంగు రుమాలు మీవద్ద ఉంచుకోండి.
- ఒక ఇనుపగోళీకి రెడాక్సైడ్ పూసి, దానిని ఎల్లప్పుడు మీవద్ద ఉంచుకోండి.
- ఇంటిలో వెండిని పాతిపెట్టండి.
- నూతన వస్త్రాలను ధరించేముందు, వాటిపై నదినీటిని చిలకాలి.

**దశమ భావంలో బుధుడు :-**

- ప్రతిరోజు భుజించే ఆహారంలో ఒక పిడికెడు కాకికి పెట్టండి.
- అమ్మవారి ప్రసాదంగా చక్రపొంగలిని పంచండి. ఈవిధంగా 32 రోజులు వరుసగా చేయండి.
- మాంసాహారం తినవద్దు.
- మద్యపానం మానండి.

**ఏకాదశ భావంలో బుధుడు :-**

- వెండిగొలుసును ధరించండి.
- ఆకుపచ్చరంగును ఉపయోగించండి.
- వెడల్పాటి ఆకులుండే మొక్కలను పెంచకండి.
- ప్రతిరోజు దుర్గాస్తుతి చేయండి.

**ద్వాదశ భావంలో బుధుడు :-**

- ప్రతిదినం కుంకుమని ధరించండి.
- క్రొత్త ఖాళీకుండను ప్రవహించే నీటిలో వేయండి.
- ప్రతిదినం గుడికి వెళ్ళండి.
- కుక్కలను పెంచండి.
- వరుసగా 7 బుధవారాలు పెసరగుగ్గిళ్ళను పిల్లలకు పంచండి.

# 84. బుధహోర

**బుధహోర :-**

*బుధహోరకు అధిపతి బుధుడు. బుధవారంనాడు, లేదా ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములున్న రోజులలో బుధహోర సమయంలో బుధుని ప్రభావం అత్యధికం.

కాగితం, పుస్తకాలు, గోధుమలు, వేరుశెనగ, నువ్వులు వంటి నూనె తీసే విత్తనాలు, ఉల్లి, ఆకుపచ్చరాయి, గడియారములు, టెలిస్కోపు, మైక్రోస్కోపు మొదలగు వాటితో సంబంధించిన పనులకు, వాటిని ఉపయోగించేవారికి బుధహోర అనుకూల సమయం.

విద్యా సంస్థలలో బుధహోరలో ప్రవేశించిన విద్యార్థులు విద్యలో రాణిస్తారు.

ముఖ్యమైన డాక్యుమెంట్లు వ్రాసుకొనుటకు బుధహోర ఉత్తమము.

మంగళవారం బుధహోర ఎడిటర్లు, పబ్లిషర్లు, పుస్తకవిక్రేతలు, ప్రింటర్లు, ప్రెస్సు యజమానులు మొదలగువారికి అనుకూలమైన సమయం.

బుధవారం బుధహోర ముఖ్యంగా దినపత్రికలు, పంచాంగములు, రాయబారాలు, ఏజెన్సీ, రిప్రజెంట్లు, బ్రోకర్లు, వేలంపాటలు ప్రారంభించుటకు మిక్కిలి అనుకూల మైనది. కమ్యూనికేషన్స్, ఇంజనీరింగ్‌కు సంబంధించిన పనులు, బాండ్లు, షేర్లు, లాటరీ టికెట్లు కొనుటకు ఇది శుభసమయం.

గురువారం బుధహోరలో ఉపన్యసించిన అందరినీ ఆకట్టుకొంటుంది. ఉపాధ్యాయులు, ఆడిటర్లు, గణితశాస్త్రజ్ఞులు, ఎకౌంటెంట్లుకు గురువారంనాటి బుధహోర అనుకూల సమయం.

శుక్రవారంనాడు బుధహోర చిత్రకారులకు, నర్తకులకు అనుకూల సమయం.

ఫోర్జరీకి శనివారం అనుకూలం.

విష్ణువును పూజించుట మంచిది.

**బుధహోర సమయం :-**

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయ సమయం నుండి హోర సమయమును లెక్కిస్తారు. హోరకాలప్రమాణం ఒక గంట.

సూర్యోదయ, సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింద సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు | రాత్రి |
|---|---|---|
| ఆదివారం | 8-9, 3-4 | 10-11, 5-6 |
| సోమవారం | 12-1 | 7-8, 2-3 |
| మంగళవారం | 9-10, 4-5 | 11-12 |
| బుధవారం | 6-7, 1-2 | 8-9, 3-4 |
| గురువారం | 10-11, 5-6 | 12-1, |
| శుక్రవారం | 7-8, 2-3 | 9-10, 4-5 |
| శనివారం | 11-12 | 6-7, 1-2 |

# 85. ధారణం

**బుధగ్రహదోష నివారణకు రత్నధారణ :-**

పరీక్షలలో తప్పుట, ఆర్థికపరమైన ఇబ్బందులు, అనవసరప్రయాణాలు కలుగుతున్నపుడు పచ్చను ధరిస్తారు. నరాల బలహీనత, రక్తహీనత, గుండెజబ్బు, మతిమరపు కలిగినవారు పచ్చను ధరించుట ఉత్తమము.

**మరకతము (పచ్చ) :-**

బుధునికి ధరించవలసినది పచ్చ.

బుధవారమున పూజించిన బుధయంత్రముపై ఆకుపచ్చని వస్త్రము నుంచి, దానిపై పచ్చను వుంచాలి. గరిక చిగుళ్ళతో గణపతి మూలమంత్రమును జపిస్తూ పూజించాలి. పచ్చపెసల గుగ్గిళ్ళు లేదా కట్టెపొంగలిని నైవేద్యం పెట్టాలి. ఈ విధంగా 14 రోజులు పూజించాలి. (బుధవారం రాత్రిపూట ఉపవాసం వుండి శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం చేయాలి.)

తరువాత పచ్చను ధరించాలి.

వచ్చును ధరించలేనివారు గ్రీన్ జిర్కాన్, గ్రీన్ జేడ్, పెరిడాట్ వంటి ఉపరత్నములను ధరించవచ్చును.

ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి జన్మనక్షత్రములైనవారు, మిధునం, కన్యలు లగ్నంగా గలవారు, మిధున, కన్యరాశులు జన్మరాశులు గలవారు బుధునికి సంబంధించిన రత్నములను ధరించవచ్చును.

**బుధగ్రహదోష నివారణకు రుద్రాక్షధారణ :-**

బుధగ్రహం అనుకూలంగా లేనివారు చతుర్ముఖ రుద్రాక్షను ధరించవచ్చును.

**చతుర్ముఖ రుద్రాక్ష:-**

1. దీనిని బ్రహ్మకు ప్రతిరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన జ్ఞాపకశక్తి పెరుగును.
3. విద్యార్థులకు ఇది ఉపయుక్తమైనది.
4. రుద్రాక్షయందు నాలుగు ధారలుంటాయి.

## బుధ గ్రహానుగ్రహం కోసం కవచధారణ

ఒక రాగిరేకు ఇరువైపుల క్రింది యంత్రాలను చెక్కించాలి.

| పది | ఐదు | రెండు |
|---|---|---|
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |

| పదకొండు | ఆరు | పదమూడు |
|---|---|---|
| పన్నెండు | పది | ఎనిమిది |
| ఏడు | పదునాలుగు | తొమ్మిది |
| ఏడు | రెండు | తొమ్మిది |
| ఎనిమిది | ఆరు | నాలుగు |
| మూడు | పది | ఐదు |

ఈ యంత్రమును "ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బుధాయ నమః" అను మంత్రమును 1,22,000 జపిస్తు పూజించాలి. తరువాత దానిని లాకెట్‌గా ధరించిన సంగీత కళలో ప్రావీణ్యము, వ్యాపారంలో అభివృద్ధి కలుగుతాయి.

## 86. దానం

1. బుధమహాదశలో బుధఅంతర్దశకు - లక్ష్మీనారాయణప్రతిమ
2. బుధమహాదశలో రవి అంతర్దశకు - సూర్య ప్రతిమ
3. బుధమహాదశలో చంద్ర అంతర్దశకు - తెల్లని ఆవు ప్రతిమ
4. బుధమహాదశలో కుజ అంతర్దశకు - ఎద్దు ప్రతిమ
5. బుధమహాదశలో గురు అంతర్దశకు - బంగారం
6. బుధమహాదశలో శుక్ర అంతర్దశకు - వెండి
7. బుధమహాదశలో శని అంతర్దశకు - గేదెప్రతిమ
8. బుధమహాదశలో రాహు అంతర్దశకు - మేక ప్రతిమ
9. బుధమహాదశలో కేతు అంతర్దశకు - గేదె ప్రతిమ

## 87. పారాయణం

క్రింది స్తోత్రములలో ఒకదానిని ప్రతిదినం పారాయణ చేస్తే బుధగ్రహాను గ్రహం పొందవచ్చును.

## పారాయణ స్తోత్రాలు

1. నారాయణస్తోత్రం/విష్ణుసూక్తం
2. పురుషసూక్తం/దశావతార స్తోత్రం
3. వేంకటేశ్వర శతనామావళి/బుధకవచం
4. వేంకటేశ్వర ప్రపత్తి/మంగళాశాసనం/గోవిందనామాలు
5. వేంకటేశ్వర వజ్రకవచస్తోత్రం/వేంకట శరణాగతి
6. నారాయణకవచం/ సూక్తం/హృదయం
7. సత్యనారాయణ వ్రతం/విష్ణు సహస్రనామస్తోత్రం
8. బుధగ్రహమంగళాష్టకం/బుధాష్టోత్తర శతనామస్తోత్రం
9. బుధ అష్టోత్తరశత నామావళి/లక్ష్మీ నరసింహ కరావలంబం
10. వేంకటేశ్వర సుప్రభాతం/వేంకట-కరావలంబస్తోత్రం
11. నృసింహసహస్రనామం/నృసింహకవచం
12. విష్ణు స్తోత్రం/నృసింహస్తోత్రం/బుధకవచం.

## రామాయణ పారాయణ

1. బుధ మహాదశలో బుధ అంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : బాలకాండ 29 సర్గ
నైవేద్యం : తాంబూలం/ఆకుపచ్చ అరటి
2. బుధ మహాదశలో రవి అంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : యుద్ధకాండ 94వ సర్గ
నైవేద్యం : చామ/క్యారట్ దుంపలు
3. బుధ మహాదశలో చంద్ర అంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : అయోధ్యకాండ 117 సర్గ
నైవేద్యం : పాలు/పాయసం
4. బుధ మహాదశలో గురు అంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : అయోధ్యకాండ 74వ సర్గ
నైవేద్యం : అరటిపండ్లు/పనసతొనలు
5. బుధ మహాదశలో శుక్ర అంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : అరణ్యకాండ 9, 10 సర్గలు
నైవేద్యం : నల్లద్రాక్ష/నేరేడు
6. బుధ మహాదశలో శని అంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : యుద్ధకాండ 28 సర్గ
నైవేద్యం : ఎండుద్రాక్ష/తేనె/ఖర్జూరము.
9. బుధ మహాదశలో కుజఅంతర్ దశ జరుగు కాలమున
పారాయణ : సుందరకాండ 29వ సర్గ
నైవేద్యం : బెల్లం/కందిపప్పు పొంగలి.

# 88. సందర్శనం

బుధగ్రహానుగ్రహం పొందాలనుకున్నవారు క్రింద సూచించిన క్షేత్రములను తరచు సందర్శించాలి.

## దర్శించదగిన పుణ్యక్షేత్రాలు

★ బుధగ్రహదోష నివృత్తికి శ్రీవిష్ణు, నారసింహ, శ్రీవేంకటేశ్వర, రంగనాథ క్షేత్ర సందర్శనం చెప్పబడినది.

1. తూర్పుగోదావరిజిల్లా అమలాపురంలో గల భూసమేత శ్రీ వేంకటేశ్వరుడు.
2. తూర్పుగోదావరిజిల్లా వాడపల్లిలో గల వేంకటేశ్వరస్వామి.
3. తూర్పుగోదావరిజిల్లా 'కాళ్ల'యందుగల శ్రీ వేంకటేశ్వరుడు.
4. తూర్పుగోదావరిజిల్లా 'ర్యాలి' యందున్న జగన్మోహిని స్వామి.
5. తూర్పుగోదావరిజిల్లా పిఠాపురంలో గల కుంతీమాధవస్వామి.
6. తూర్పుగోదావరిజిల్లా అప్పనపల్లిలోని బాల బాలాజీ స్వామి.
7. తూర్పుగోదావరిజిల్లా అన్నవరంలోని శ్రీ సత్యనారాయణస్వామి.
8. తూర్పుగోదావరిజిల్లా పలివెలలో ఉమాసమేత కొప్పేశ్వరస్వామి.
9. పశ్చిమ గోదావరిజిల్లా లోని పాలకొల్లు అష్టభుజవిష్ణువు.
10. పశ్చిమ గోదావరిజిల్లా ద్వారకాతిరుమల శ్రీవేంకటేశ్వరుడు.
11. కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం - ఆంధ్రమహావిష్ణువు.
12. ఖమ్మంజిల్లా జమలాపురం శ్రీ వేంకటేశ్వరుడు
13. ఖమ్మంజిల్లా అన్నపురెడ్డిపల్లెలోని శ్రీవేంకటేశ్వరుడు
14. హైదరాబాద్‌లోని ప్రసిద్ధ బిర్లామందిర్ (బాలాజీ)
15. నల్గొండజిల్లా పానుగల్లు - పచ్చల రామేశ్వరుడు.
16. నెల్లూరు జిల్లా నెల్లూరు (తల్పగిరి) రంగనాథస్వామి
17. గుంటూరుజిల్లా నందివెలుగు నందిజ్యోతిష్పురుషవిష్ణు
18. కర్నూలు జిల్లా యాగంటి-అర్ధనారీశ్వరస్వామి.
19. చిత్తూరుజిల్లా నారాయణవనం-శ్రీవేంకటేశ్వరుడు.

★ 101 దివ్యతిరుపతులు, 8 స్వయంవ్యక్త విష్ణుక్షేత్రాలు, పంచనారసింహ క్షేత్రాలు, అంతర్వేది, ఉండవల్లిగుహ, ఉదయగిరి, సింగరాయకొండ, మాలకొండ, అగిరిపల్లి కదిరి, తమిళనాడు (ఘటికాచలం)లలో నరసింహస్వామి.

★ దశావతారక్షేత్రాలు మరియు స్థానికంగా ఉన్నవి ఇటీవలికాలంలో నిర్మిత/ప్రతిష్ఠితమయిన విష్ణు క్షేత్రాలు.

## మన రాష్ట్రంలోని నారసింహక్షేత్రాలు

1. ర్యాలి (జగన్మోహిని) :- తూర్పుగోదావరి జిల్లాలో రాజమండ్రికి 24కి.మీ రావులపాలెం నుంచి 10కి.మీ దూరం. ఈ క్షేత్రంలో చెన్నకేశవస్వామి జగన్మోహిని దర్శనం గ్రహ దోష నివారకం. విగ్రహం పాదాలక్రింద నీరు ఊరుతూన్నట్లుగా ఉంటుంది. ఈ విగ్రహానికి ఒకవైపు పురుషమూర్తి ఇంకోవైపు స్త్రీమూర్తి ఉండేలా మల్చారు. ఈ ఆలయానికి దగ్గరలోనే కమండలేశ్వరస్వామి ఆలయం కూడా కలదు.

★ అహోబిలం ఎగువ నుండి దిగువ అహోబిలం వరకు గల చుట్టుప్రక్కల ప్రాంతాన్ని (ఐదుక్రోసుల దూరం) నవనారసింహ విహారస్థలం అంటారు. వీరు 1. ప్రహ్లాద వరద నారసింహ 2. ఛత్రవట నారసింహ 3. కరాడ, 4. యోగానంద 5. సుత 6. క్రోధ 7. అలోల 8. జ్వాలా 9. పవన నారసింహమూర్తులు. వీరి దర్శనం సర్వపాపహారం అని పురాణోక్తి, దుష్టగ్రహపీడ తొలగించుస్వామి.

**సింహాచలం :** శ్రీవరాహనారసింహమూర్తి వెలసినట్టి మహాపుణ్యక్షేత్రం. విశాఖపట్నానికి చేరువలో ఉంది. ఇక్కడనుంచి సిటీబస్సులు కూడా గలవు. ఇక్కడ కప్పస్తంభం ప్రత్యేకత. ఈ స్తంభం దేవాలయంలోపల ప్రారంభంలోనే కనిపిస్తుంది. రాతి స్తంభం దీనికి నమస్కరించుకుని మనసులోనే జరగవలసినపని తలచుకొని కౌగలించుకున్నచో అనుకున్నవి నెరవేరతాయి. దీని నిమిత్తం దేవస్థానానికి కప్పం (నిర్ణీత రుసుం) చెల్లించాలి. కనుకనే దీనికి కప్పంస్తంభం అనే పేరు వచ్చింది. దీర్ఘవ్యాధి పీడితులు, సంతానార్థులు ఈ స్తంభానికి కప్పం చెల్లించి కౌగలించుకుంటారు. ఇంకా గ్రహపీడా నివారణ కోరువారరు ప్రత్యేకంగా ఏకాదశి రోజున కనిపిస్తారు.

**యాదగిరిగుట్ట:-** నల్గొండజిల్లాలో ఉన్న శ్రీలక్ష్మీనారసింహ క్షేత్రము. హైదరాబాద్ నుంచి బస్సు సౌకర్యం విరివిగా ఉన్నది. అమ్మవారు ఆండాళ్. మండలం రోజులపాటు స్వామివారికి ప్రదక్షిణలు చేస్తే, సర్వబాధలు తొలగిపోయి ప్రశాంతత చేకూరుతుందని నమ్మకం. నిజదీక్షాపరులకు 16రోజులకే స్వామివారు స్వప్నమున సాక్షాత్కరిస్తారని, సమస్యలకు మార్గాంతరం సూచిస్తారని ప్రతీతి.

శ్రీలక్ష్మీనారసింహస్వామివారు కొండగుహలో వెలిశారు. మంగపల్లి ఆర్.ఎస్ నుంచి 7 కి.మీ. భువనగిరి రైల్వేస్టేషన్‌నుంచి దిగి వెళ్ళవచ్చు! స్వామివారు పంచనారసింహుడిగా ప్రసిద్ధుడు. 1. జ్వాలానారసింహ 2. గండభేరుండ 3. యోగానంద 4. ప్రహ్లాదవరద నారసింహ 5. ఉగ్రలక్ష్మీ నారసింహ అనే పంచమూర్తులు. ఇక్కడ కొండదిగువ నరసింహస్వామి ఆలయం గలదు. స్వప్నంలో సాక్షాత్కరించే నిక్కమైన స్వామి.

**మంగళగిరి :-** గుంటూరు జిల్లాలోని ఈ పుణ్యక్షేత్రంలో సాలగ్రామ నారసింహ (పానకాలస్వామి)గా ప్రసిద్ధి చెంది వున్నాడు. విజయవాడనుంచి సిటీబస్సులో ఇక్కడకు చేరుకోవచ్చు. కొండక్రింద స్వామిని పన్నా నారసింహస్వామి అంటారు. ఈ క్షేత్రంలో స్వామివారికి రెండు ఆలయాలున్నాయి. అతి ఎత్తైన గోపురం గల దేవాలయం. స్వామివారు ధర్మరాజుచేత ప్రతిష్ఠించబడినట్లుగా ప్రతీతి. దిక్కుల వైపుగాక నైరృతిమూలకు ముఖంగల స్వామి.

**వేదాద్రి:-** కృష్ణానదీ తీరంలో వేంచేసి వున్న వేదాద్రి నారసింహుని దర్శించడానికి జగ్గయ్యపేట (కృష్ణాజిల్లా) నుంచి 15 కి.మీ ఇక్కడ పంచనారసింహులు వెలసి ఉన్నారు. స్వామి యోగానంద నారసింహుడు. ఇక్కడి స్వామిని పూజిస్తే పోయిన పంచప్రాణాలు తిరిగి వస్తాయని ఒక ఐతిహ్యం వాడుకలో ఉంది.

**అహోబిలం:-** ఇక్కడ కూడా రెండు ఆలయాలున్నాయి. కొండదిగువ స్వామిని ప్రహ్లాద నారసింహుడని, కొండపైన స్వామిని 'పంచక్రోశ' నారసింహుడని అంటారు. కొండ క్రింది స్వామివారికి 10 చేతులున్నాయి. ఇక్కడ నవ విధ నారసింహమూర్తులను ఒకే ప్రాంతమున సందర్శించగలం. కర్నూలు ఆళ్లగడ్డ నుంచి బస్సులు ఉన్నాయి.

**అంతర్వేది:-** గోదావరి నది సముద్రంలో సంగమించే స్థలం. యజ్ఞవేది (సుదర్శన) లక్ష్మీ నారసింహుడిగా ప్రసిద్ధుడు.

**కొరవి:-** వరంగల్‌జిల్లాలో వరంగల్ నుండి మహబూబాబాద్ నుండి కొరవి చేరవచ్చు. వీరభద్ర, భద్రకాళి గుడులతో చేరి వున్నది.

**కోరుకొండ:-** తూర్పుగోదావరి జిల్లాలో రాజమండ్రికి 20 కి.మీ గ్రామానికి 5కి.మీ. దూరమున గల కొండపై వెలసి వున్నాడు. సాత్విక (పారిజాత) నారసింహుడుగా ప్రసిద్ధి. కొండక్రింద లక్ష్మీనారసింహుడున్నాడు.

**వాడపల్లి:-** దేవరకొండ నుండి మిర్యాలగూడెం మీదుగా చేరాలి. నల్గొండ జిల్లా. ఇక్కడ నారసింహవిగ్రహానికి ఎదురుగా ఉండే దీపాల్లో ముక్కుకి ఎదురుగాగల దీపం కదుల్తుంది. మిగిలినవి కదలవు. స్వామివారి ఊపిరి అని నమ్మకం. సుప్రసిద్ధ నారసింహక్షేత్రం.

**ధర్మపురి:-** కరీంనగర్‌జిల్లా జగిత్యాల తాలుకాలో ఉంది. స్వామి ఉగ్రనార సింహుడు. ముఖానికి నిత్యచందనపు పూత ఉంటుంది. గోదావరి నదీ తీరం. ఆలయానికి ఎదురుగా ఉన్న కోనేరును 'ధర్మకుండం' అంటారు. ప్రసిద్ధ పౌరాణిక స్థలం. పాత నరసింహస్వామికి, కొత్త నరసింహస్వామికి గుడులున్నాయి. జగిత్యాల నుంచి 48కి.మీ (బస్సులో).

**పెంచలకోన:-** నెల్లూరుజిల్లాలో గల ఈ క్షేత్రంలో నారసింహస్వామిని - అమ్మవారు చెంచులక్ష్మిని దర్శించడానికి నెల్లూరు నుంచి 75 కి.మీ. (బస్సులో) రాపూరు నుంచి 30 కి.మీ. శనివారం మాత్రమే పూజ. సోమశిల ప్రాజెక్ట్ దగ్గరలోనే.

**ఉదయగిరి:-** నెల్లూరు జిల్లాలోనే నెల్లూరుకు 7కి.మీ దూరమున గల నారసింహ క్షేత్రం. పెన్నా నదీతీరం. స్వామివారు ఉగ్రనారసింహుడు. నదికి ఆవల కామాక్షీ ఆలయం.

**కదిరి:-** అనంతపురం జిల్లాలో ఉన్న జ్వాలా నారసింహస్వామిని సందర్శించవచ్చు. ఆలయం చాలా పెద్దది.

# 89. బుధ గ్రహ అర్చనం

బుధ గ్రహదోషమున్న బుధగ్రహజపంను తగు సంఖ్యలో చేయాలి. బుధగ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| ౬ | ౫ | ౯ | ౧ | ౨ | ౩ | ౪ | ౭ | ౮ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౪ | ౭ | ౮ | ౬ | ౫ | ౯ | ౧ | ౨ | ౩ |
| ౧ | ౨ | ౩ | ౪ | ౭ | ౮ | ౬ | ౫ | ౯ |
| ౮ | ౪ | ౭ | ౯ | ౬ | ౫ | ౩ | ౧ | ౨ |
| ౩ | ౧ | ౨ | ౮ | ౪ | ౭ | ౯ | ౬ | ౫ |
| ౯ | ౬ | ౫ | ౩ | ౧ | ౨ | ౮ | ౪ | ౭ |
| ౨ | ౩ | ౧ | ౭ | ౮ | ౪ | ౫ | ౯ | ౬ |
| ౫ | ౯ | ౬ | ౨ | ౩ | ౧ | ౭ | ౮ | ౪ |
| ౭ | ౮ | ౪ | ౫ | ౯ | ౬ | ౨ | ౩ | ౧ |



## బుధ యంత్రము

హం చం

రం కం

అం క్రాం క్రోం

లం హాం రం యం వం

షం టం

ఓం చంద్రాత్మజాయ విద్మహే బుద్ధి ప్రదాయ

టం ఊం

శ్రాం

లం లం

వం తం

ఒగ్లా ఒగ్లా

# బుధగ్రహ జపము

**బుధ మంత్రం :**

ఉద్బుధ్య స్వేత్యస్య మంత్రస్య ప్రస్కణ్వ (నారాయణ) ఋషిః, బుధగ్రహో దేవతా, త్రిష్టుప్ ఛందః, యజమానస్య (మమ) అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత బుధగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే బుధగ్రహ మూలమంత్ర జపేవినియోగః.

**కరన్యాసము :**

ఓం ఉద్బుధ్యస్వాగ్నే - అంగుష్ఠాభ్యాం నమః
ఓం ప్రతిజాగృహ్యేనం - తర్జనీభ్యాం నమః
ఓం ఇష్టాపూర్తే సగ్ంసృజేథామయంచ - మధ్యమాభ్యాం నమః
ఓం పునః కృణ్వగ్గ్ స్త్వా - అనామికాభ్యాం నమః
ఓం పితరం యువానం - కనిష్ఠికాభ్యాం నమః
ఓం అన్వాతాగ్ంసీత్వయి తంతుమేతమ్ - కరతలకరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసము :**

ఓం ఉద్బుధ్యస్వాగ్నే - హృదయాయ నమః
ఓం ప్రతిజాగృహ్యేనం - శిరసే స్వాహా
ఓం ఇష్టాపూర్తే సగ్ంసృజేథామయంచ - శిఖాయైవషట్
ఓం పునః కృణ్వగ్గ్ స్త్వా - కవచాయ హుం
ఓం పితరం యువానం - నేత్రత్రయాయవౌషట్
ఓం అన్వాతాగ్ంసీత్వయి తంతుమేతమ్ - అస్త్రాయఫట్

భూర్భువస్సువరో మితి దిగ్బంధః

**ధ్యానమ్ :**

ప్రియంగుకలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధం ।
సౌమ్యం సత్త్వగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. రం అగ్న్యాత్మనే దీపం దర్శయామి. వం అమృతాత్మనే అమృతోపహార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

**అధిదేవత : (విష్ణుః)**

ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదమ్ సమూఢ మస్య పాగ్ంసురే

**ప్రత్యధి దేవత: (నారాయణః)**

ఓం సహస్రశీర్షా పురుషః। సహస్రాక్షస్సహస్రపాత్ ।
సభూమిం విశ్వతో వృత్వా। అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥
అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత బుధగ్రహః సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు.

**మూలమంత్రము :-**

ఓం ఉద్బుధ్య స్వాగ్నే ప్రతిజాగృహ్యేన మిష్టాపూర్తే సగ్‌ం సజేథా మయంచ
పునః కృణ్వగ్గ్స్త్వాపితరం యువాన మన్వాతాగ్‌ం సీత్వయితంతుమేతమ్ ॥

**బుధగ్రహ జపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు ఆకుపచ్చనిరంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై రాగితో చేసిన బుధునిప్రతిమను లేదా బుధయంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేన ప్రతిమాశోధవాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్‌ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవః।
మాధ్వీ ర్నస్సం త్వోషధీః। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్‌ం రజః।
మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్‌ం అస్తు సూర్యః।
మాధ్వీర్గావో భవంతు నః। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాత్స్థేయానస్థేయు సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।

యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః॥
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపముపైకి పంచలోకపాలకులను, అష్టదిక్పాలకులను, ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయాపాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు ఆయాస్థానములలో ఒక తమలపాకును, వక్కను, ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ ఉండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరిః ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
జ్యేష్టరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం

గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

2. ఓం బ్రహ్మదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం

బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదథే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః। ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.

## దిక్పాలకులు

**ఇంద్రః :- (1-7-10 మం) :-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః :- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః :- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్ఋతిః-** మోషుణః పరాపరా నిర్‌ఋతిర్దుర్హణావధీత్। పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ఋతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)

ఇమంమే వరుణ శ్రుధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। ఆవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

కుబేరః :-

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాసుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।
సాదన్యం విదత్యాగ్ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుబేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఈశానః :-

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

ఊర్ధ్వపురుషః :-

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం- 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవానృక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాస్తుపురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

# త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

**బ్రహ్మ:-**

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం,
శ్యేనో గృధ్రాణాగ్ స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్,

**సరస్వతీ :-**

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ, ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)**

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం, సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**లక్ష్మీ :-**

సక్తుమివ తిత ఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత,
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**రుద్ర:- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)**

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే, వో చేమశం తమగ్ం హ్రాదే॥
రుద్రమావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**గౌరీ :-** గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ,
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి, స్థాపయామి, పూజయామి॥

**అశ్వనీ దేవతా :-**

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్, విశ్వాపరిప్రియా భువద ధద్వితా॥
ఆదిత్ప్రత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్, పరోయదిధ్యతే దివా॥
అశ్వనీ దేవతామావాహయామి, స్థాపయామి, పూజయామి॥
ఏషోఉషా అపూర్వావ్యుచ్ఛతి ప్రియాదివః, స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి, స్థాపయామి, పూజయామి॥

గరుడః :-

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్స్తోమ

ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ

యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్గ్ం స్యంగాని ధిష్ణియా

శ్శఫా యజూగ్ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥

గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః :-

ధన్వనాగా ధన్వనాఽఽ జిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।

ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥

ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఇంద్రాగ్నీం :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।

గ్రాహిర్జ గ్రాహ యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥

ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్ఋతి: యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।

తమాహరామి నిర్ఋతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥

నిర్ఋతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

(శత్రుఫలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం దత్తాం వరుణశ్చ మన్యుః॥

భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥

మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విశాఖా నక్షత్రమ్ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।

తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు

నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ।

విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥

విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।

ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

**సామవేదము :-**

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
విహోతానథ్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

**అధర్వణ వేదము :-**

శన్నోదేవీ రభిష్ఠయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అధర్వణ వేదాయ నమః॥
అధర్వణ వేదమావాహయామి। పూజయామి॥

# ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

దుర్గా :- ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః।
నసః పర్ష దతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గణపతి :- ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

క్షేత్రపాలకుడు:- క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనోమృదాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అభయంకరుడు:- యత ఇంద్ర భయా మహేతతోనో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥

స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్వస్తిదా అభయంకరః॥
ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

జాతకుని జన్మనక్షత్రమును ఆహ్వానించాలి.

తరువాత బుధునికి సంబంధించిన ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములను ఆహ్వానించాలి.

ఆశ్రేష:-

ఇదగ్ం సర్పేభ్యో హవిరస్తు జుష్టం। ఆశ్రేషా యేషామనుయంతి చేతః।
యే అంతరిక్షం పృథివీం క్షియంతి। తేనస్సర్పాసోహవమాగమిష్ఠాః।
యే రోచనే సూర్యస్యాపి సర్పాః। యే దివం దేవీమను సంచరతి।
యేషా మాశ్రేషా అనుయంతి కామమ్। తేభ్యస్సర్పేభ్యో మధుమజ్జుహోమి॥
ఆశ్రేషా నక్షత్ర దేవతాం సర్పం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

**జ్యేష్ఠ:-**

ఇంద్రో జ్యేష్ఠా మను నక్షత్రమేతి। యస్మిన్వృత్రం వృత్రతూర్యే తతార

తస్మిన్వయ మమృతం దుహానాః। క్షుధంతరేమ దురితం దురిష్టిమ్।

పురందరాయ వృషభాయ ధృష్ణవే। ఆషాఢాయ సహమానాయ మీఢుషే

ఇంద్రాయ జ్యేష్ఠా మధుమద్దుహానా। ఉరుం కృణోత్తు యజమానాయ లోకమ్॥

జ్యేష్ఠా నక్షత్ర దేవతాం ఇంద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు, దానిపైవక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

**రేవతి :-**

పూషారేవత్యన్వేతి పంథామ్। పుష్టిపతి పశుపావాజబస్త్యౌ।

ఇమాని హవ్యా ప్రయతా జుషాణా। సుగైర్నోయానై రుపయాతాం యజ్ఞమ్।

క్షుద్రాన్ పశూన్ రక్షతు రేవతీ నః। గావో నో అశ్వాగ్ం అన్వేతు పూషా।

అన్నగ్ం రక్షంతా బహుధా విరూపమ్। వాజగ్ం సనుతాం యజమానాయ యజ్ఞమ్॥

రేవతీ నక్షత్ర దేవతాం పూషాణమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు, దానిపైవక్క, ఖర్జూరపండు, దక్షిణంగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

(ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, నాణెమును ఉంచి నమస్కరించాలి.)

**బుధః:-** ఉద్బుధ్యస్వేత్యస్య మంత్రస్య నారాయణ ఋషిః। బుధగ్రహో దేవతా। త్రిష్టు ప్ఛందః। (మమ) యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత బుధగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే బుధ గ్రహారాధనే వినియోగః॥

**ధ్యానం:-** ఉదఙ్ముఖో మాగధజో హరిస్థ శ్చాత్రేయగోత్రశ్శర మండలస్థః।
సఖడ్గ చర్మోరు గదాధరోఙ్గస్త్వీశాన భాగే వరదస్సుప్రీతః॥
పీతాంబర పీతవపుః కిరీటీ చతుర్భుజో దండధరశ్చ సౌమ్యః।
చర్మాసి ధృత్సోమసుతస్సు మేరు స్సింహాధిరూఢో వరదో బుధశ్చ॥

మంత్రం :- ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహ్యే నమిష్టా పూర్తే సగ్ం సృజేథా మయంచ।
పునః కృణ్వగ్ స్త్వా పితరం యువా నమన్వాతాగ్ం సీత్వయి తంతుమేతమ్॥
ఓం భూర్భువస్సువః॥ బుధగ్రహేహాగచ్ఛ। బుధగ్రహం, పీతవర్ణం, పీతగంధం, పీతపుష్పం, పీతమాల్యాంబరధరం, పీతచ్ఛత్ర ధ్వజరథ పతాకాది శోభితం, దివ్యరథ సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, సింహవాహనం, ఉదఙ్ముఖం, మగధ దేశాధిపతిం, చతుర్భుజం, ఖడ్గ చర్మాంబరధరం, అత్రేయ సగోత్రం, సౌమ్య సంవత్సర భాద్రపద శుక్ల ఏకాదశ్యా ముత్తరా ఫల్గుణీ నక్షత్రజాతం, కన్యా మిథున రాశ్యాధిపతిం, సౌమ్యవాసర ప్రయుక్తం, కిరీటినం, సుఖాసీనం, పత్నీపుత్ర పరివారసమేతం, గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్య ఈశాన్య దిగ్భాగే, బాణాకార మండలే, బుధగ్రహ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అధిదేవత విష్ణుః :- (ఋ-1మం-22సూ-17మంత్రం)**

మంత్రం:- ఇదం విష్ణుర్విచక్రమేత్రేథా నిదధే పదమ్। సమూఢ మస్యపాగ్ం సురే॥
బుధగ్రహాధి దేవతాం విష్ణుం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం బుధగ్రహస్య దక్షిణతః విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధి దేవత- నారాయణః (ఋ-10మం-**

మంత్రం:- సహస్ర శీర్షా పురుషః। సహస్రాక్ష స్సహస్రపాత్।
సభూమిం విశ్వతోవృత్వా। అత్యతిష్ఠద్దశాంగులమ్॥
బుధగ్రహ ప్రత్యధి దేవతాం నారాయణం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం బుధగ్రహస్య ఉత్తరతః నారాయణ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత బుధగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

నైవేద్యం :- (పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంభృతం సఫలం దేవగృహ్యాతాం సర్వదేవతా:॥

ఓం భూర్భువస్సువ: భర్గోదేవస్య ధీమహి। ధియోయోన: ప్రచోదయాత్, సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి। తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం, "ధాతా పురస్తాద్యముదాజహార శక్ర: ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్ర:।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్య: పన్దా: అయనాయ విద్యతే॥

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
   విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥
2. విశ్వత: పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
   విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥
3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
   నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥
4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణ: పర:।
   నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణ: పర:॥
5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణ: పర:।
   యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థ్సితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మిన్ద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః।
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽ ధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయనతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యోఽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యోఽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

28. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥
29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥
30. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥
31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥
32. యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥
33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।
ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥
34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।
త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥
35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥
36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥
37. తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥
38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥
39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత బుధగ్రహ దేవతాభ్యోనమః। దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారం:-** బుధగ్రహ దేవతాభ్యో నమః। ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోళికామారోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునఃనీరాజనం:-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మా పాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యధాశరణం నాస్తి
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యాభావేన రక్షరక్ష మహేశ్వర॥

బుధగ్రహదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోఽచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

**ఉద్వాసన:-** "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేహనాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

బుధగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటప ములో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శ్రీ బుధగ్రహ దేవతా స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజ చేసి తరువాత బుధగ్రహజపము చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటే "మమ" అని చెప్పాలి. "యాజమానస్య" అని చెప్పకూడదు. ఒకరు మరొకరికోసం జపం చేస్తుంటే "యాజమానస్య" అని చెప్పాలి. "మమ" అని చెప్పకూడదు.

**బుధుడు :-**

ఉద్బుధ్యస్వైతస్య మంత్రస్య। నారాయణ ఋషిః।
బుధగ్రహో దేవతా। త్రిష్టుప్ఛందః॥

(మమ)యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత బుధగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే బుధగ్రహ మంత్రజపం కరిష్యే.

**కరన్యాసము :-**

ఉద్బుధ్యస్వాగ్నే - అంగుష్ఠాభ్యాన్నమః.
ప్రతిజాగృహ్యేనం - తర్జనీభ్యాన్నమః.
ఇష్టాపూర్తేసగ్ం సృజేథాం - మధ్యమాభ్యాన్నమః.
అయంచ - అనామికాభ్యాన్నమః.
పునః కృణ్వగ్‌స్త్వాపితరం యువానం - కనిష్ఠికాభ్యాన్నమః.
అన్వాతాగ్ంసీ త్వయి తంతుమేతం- కరతల కరపృష్ఠాభ్యాన్నమః.

**హృదయాదిన్యాసము :-**

ఉద్బుధ్యస్వాగ్నే - హృదయాయ నమః.
ప్రతి జాగృహ్యేనం - శిరసేస్వాహా.

ఇష్టాపూర్తే సగ్ం సృజేథాం - శిఖాయై వషట్.
అయంచ - కవచాయ హుం.
పున: కృణ్వగ్గ్స్త్వా పితరం యువానం - నేత్రత్రయాయవౌషట్.
అన్వాతాగ్ంసీ త్వయి తంతుమేతం - అస్త్రాయ ఫట్.

భూర్భువస్సువరోమితి దిగ్బంధ:

**ధ్యానం:-**

ఉధఙ్ముఖో మాగధజో హరిస్థశ్చాత్రేయ గోత్రశ్శర మండలస్థ:।
సఖడ్గ చర్మోరు గదాధరోజ్ఞ స్త్వీశానభాగే వరదస్సుప్రీత:॥

**మూలమంత్రం:-**

ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యేన మిష్టాపూర్తే సగ్ం సృజేథామయంచ।
పున: కృణ్వగ్గ్స్త్వా పితరం యువాన మన్వాతాగ్ంసీ త్వయి తంతుమేతం॥

**అధిదేవతా :-**

ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూఢ మస్యపాగ్ం సురే॥

**ప్రత్యధి దేవతా :-**

సహస్ర శీర్షా పురుష: సహస్రాక్ష స్సహస్రపాత్।
సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగుళమ్॥

(అని చెప్పిన తర్వాత మూలమంత్రాన్ని 17,000 జపించి తర్వాత మళ్ళీ ఒకసారి అధిదేవతా, ప్రత్యధి దేవతా మంత్రాలను చెప్పి)

"(మమ) యజమానస్య బుధగ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు".

(అని చెప్పి ఉద్ధరణితో నీళ్ళను పళ్ళెములో వదలాలి.)

**బుధగ్రహ మంత్ర తర్పణము :-**

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతి పూజ చేయాలి. (ఇచట సంకల్పంలో 'జలతర్పణం కరిష్యామి అని చెప్పుకోవాలి.)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి. తర్పణం చేయుటకు ఒకపాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మన ముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

బుధగ్రహముకు సంబంధించిన "ధ్యానము"ను ఏకాగ్రతగా స్మరించాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని, బుధగ్రహ మంత్రమును చదవాలి. తరువాత "బుధాయ తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని గ్రహ అధిదేవత మంత్రమును చదివి "బుధగ్రహస్య అధిదేవతాః తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని గ్రహ ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత "బుధ గ్రహస్య ప్రత్యధిదేవతా : తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 1700 సార్లు తర్పణము చేయాలి. మరల గ్రహం అధిదేవత ప్రత్యధిదేవత మంత్రములను చదవాలి తరువాత

"బుధగ్రహ ప్రసాదేనమమ ఆరోగ్య సిద్ధిరస్తు సర్వాభీష్టసిద్ధిరస్తు" అని నీటిని పళ్ళెములో ధారపోయాలి.

జాతకుడు స్వయంగా మంత్రం చదువుతున్నపుడు "మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ" స్థానంలో యాజమానస్య" అని చెప్పాలి.

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత. ప్రత్యధిదేవతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత ఆశ్లేష, జ్యేష్ట, రేవతి నక్షత్రములకు హోమం చేయాలి.

ఆశ్రేషా : సర్పేభ్య స్స్వాహా । ఆశ్రేషాభ్యస్స్వాహా॥ దందశూకేభ్య స్స్వాహా ॥
అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత ఆశ్రేషాయైదం న మమ ॥ (108 సార్లు)

జ్యేష్ఠా : ఇంద్రాయస్వాహా॥ జ్యేష్ఠాయస్వాహా ॥ అభిజిత్యై స్వాహా ॥
అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత ఆశ్రేషాయైదం న మమ ॥ (108 సార్లు)

రేవతీ : పూష్ణేస్వాహా॥ రేవత్యైస్వాహా । పశుభ్యస్స్వాహా ॥
దేవతా ప్రత్యధి దేవతా సహిత రేవత్యై ఇదం న మమ ॥ (108 సార్లు)

ప్రతి నక్షత్రమునకు 108సార్లు హోమం చేయాలి. తరువాత బుధగ్రహముకు 'హోమం' చేయాలి. బుధగ్రహ మంత్రమును దాని అధిదేవత, ప్రత్యధిదేవత

మంత్రములను వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి ఉత్తరేణి, పెసలు, ఆవునేయి హోమంలో వేయాలి. ఈ విధంగా 170 సార్లు మూలమంత్రము, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత్, ప్రాయశ్చిత్త హోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము, ఆగ్రహమునకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన, మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధన చేసి పెద్దల ఆశీర్వాదమును పొందాలి.

బుధగ్రహహోమంలో మార్జన 17సార్లు చేయాలి. కనీసం 17గురికి భోజనం పెట్టాలి.

## 90. స్మరణం

గ్రహజపం చేయలేనివారు, బుధగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు ఈ క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

## బుధగ్రహానికి జపమంత్రాలు

1. ఓం ఐం శ్రీం బుధాయ నమః
2. ఓం హ్రాం క్రోం ఐం గ్రహనాథాయ బుధాయ
3. ఓం హ్రాం క్రీం ఐం గ్రహనాథాయ నమః బుధాయ స్వాహా
4. ఓం నమోనారాయణాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ
5. ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బుధాయ స్వాహా/నమః
6. ఓం గం గణపతయే/శ్రీమహాగణాధిపతయే నమః
7. హ్రీం శ్రీం సౌమ్య సర్వాన్ కామాన్ పూరయస్వాహా
8. ఓం శ్రీం శుభకరాయ, సౌం సౌమ్యగుణాయ హ్రీం బుధాయ స్వాహా.
9. ఓం బుం బుధాయ నమః
10. ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం క్లీం ఐం సౌం ఔం ఓం బుధాయనమః
11. ఓం అం హ్రీం క్రోం శ్రీం హ్రీం క్లీం ద్రీం బ్లూం చంద్రపుత్రాయ స్వాహా
12. సింహారూఢం చతుర్భుజం ఖడ్గం చర్మ గదాధరం ।
    సోమపుత్రం మహాసౌమ్యం ధ్యాయేత్ సర్వార్థ సిద్ధిదం ॥

# బుధగాయత్రి-మంత్రములు

1. ఆత్రేయాయ విద్మహే - ఇందు పుత్రాయ ధీమహి
   తన్నో బుధః ప్రచోదయాత్ ॥
2. క్షీర పుత్రాయ విద్మహే - రోహిణీ పుత్రాయ ధీమహి
   తన్నో బుధః ప్రచోదయాత్ ॥
3. సోమాత్మజాయ విద్మహే - ఇందుపుత్రాయ ధీమహి
   తన్నస్సౌమ్యః ప్రచోదయాత్ ॥
4. ఓం గజధ్వజాయ విద్మహే సుఖహస్తాయ ధీమహిః
   తన్నస్సౌమ్యః ప్రచోదయాత్ ॥
5. ఓం వక్రతుండాయ విద్మహే ఏకదంతాయ ధీమహి ।
   తన్నో దంతి ప్రచోదయాత్ ॥

**అనుకూల సమయాలు :-**

బుధుని అనుగ్రహం పొందాలనుకునేవారు బుధ గ్రహజపం, హోమంచేసి, సమారాధన చేయుట ఉత్తమము. ఆవిధంగా చేయలేనివారు బుధునికోసం సూచించిన ఏ మంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది. అదేవిధంగా బుధుని స్తోత్రము చేయాలి.

బుధునకు అనుకూలమైన వారము బుధవారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యంలోని నక్షత్రములు ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతిలున్న దినములు కూడ అనుకూలమైనవే. పంచమి, పూర్ణిమ, ఏకాదశి బుధునకు అనుకూలించు తిథులు. ముఖ్యంగా శ్రావణ శుక్ల పంచమి, వైశాఖ పౌర్ణిమ, భాద్రపద శుక్ల ఏకాదశి ఉత్తమమైనవి. ఈ సమయాలలో ప్రత్యేకంగా బుధుని పూజించుట శుభకరము.

విజయదశమి, సత్యనారాయణవ్రతము భక్తిశ్రద్ధలతో చేసిన బుధుడు అనుగ్రహిస్తాడు. బుధవార వ్రతం చేసిన మంధబుద్ధి తొలగును.

బుధుని పూజించునపుడు దీపారాధనకు ఆకుపచ్చరంగు వస్త్రంతో చేసిన వత్తిని వాడుట ఉత్తమం. పూజకు పులిహోర, వడపప్పు, క్షీరాన్నం, పులగం, గుగ్గిళ్ళును ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలకు, పేదవారికి పెసలు, కంచుపాత్రలు, ఆకుపచ్చని వస్త్రములు, ఆకుకూరలు, కలములు, పుట్టగొడుగులు వంటి బుధునికి సంబంధించిన ద్రవ్యములు దానం చేయాలి.

ప్రతిదినం దేవీభాగవతం, విష్ణుసహస్రనామావళి చదవాలి.

# 91. ఆరాధనం

క్రింద సూచించిన స్తోత్రములలో ఒకదానిని ప్రతిదినం పఠించిన బుధగ్రహాను గ్రహం పొందవచ్చును.

## బుధగ్రహస్తోత్రం

అస్య శ్రీబుధస్తోత్ర మంత్రస్య వసిష్ఠఋషి:, త్రిష్టుప్ఛంధ: శ్రీబుధో దేవతా బుధగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగ: బా మిత్యాది షడంగన్యాస: భూర్భువస్సు వరోమితి దిగ్బంధ:.

**ధ్యానం :**

బుధశ్చతుర్భిర్వరదాభయాసి గదా
వహంతం వరదం ప్రశాంతమ్ ।
పీతప్రభం చంద్రసుతం సురాద్యం
సింహేనిషణ్ణం బుధామాశ్రయామి
పీతాంబర: పీతవపు: కిరీటీ చ చతుర్భుజ:
పీతధ్వజపతాకీ చ రోహిణీ గర్భసంభవ: ।
ఈశాన్యాదిషు దేశేషు బాణాసన ఉదఙ్ముఖ:
నాథో మగధదేశస్య మంత్రో మంత్రార్థతత్వవిత్
సుఖాసన: కర్ణికారో జైత్రశ్చాత్రేయ గోత్రవాన్
భరద్వాజ ఋషిప్రఖ్యై ర్జ్యోతిర్మండలమండిత: ।
అధిప్రత్యధి దేవాభ్యామన్వితో గ్రహమండలే
ప్రవిష్టస్సూక్ష్మ రూపేణ సమస్తవరదస్సుఖీ
సదా ప్రదక్షిణం మేరో:కుర్వాణ: కామరూపవాన్
అసిదండౌ చ బిభ్రాణ: సంప్రాప్తసుఫలప్రద:
కన్యాయామిథునస్యాపి రాశేరధిపతిర్బ్యయో:
ముద్గధాన్యప్రదో నిత్యం మర్త్యామర్త్య సురార్చిత:

**ఫలశ్రుతి :**

యస్తు సౌమ్యేన మనసా స్వమాత్మానం ప్రపూజయేత్
తస్య వశ్యో భవేన్నిత్యం సౌమ్యనామధరో బుధ:
బుధస్తోత్రమిదం గుహ్యం వసిష్ఠేనోదితం పురా
దిలీపాయచ భక్తాయ యాచమానాయ భూభృతే ॥

యః పఠేదేకవారంవా సర్వాభీష్టమవాప్నుయాత్
స్తోత్ర రాజమిదం పుణ్యం గుహ్యాద్గుహ్యతమం మహత్ ॥
ఏకవారం ద్వివారంవా త్రివారం యః పఠేన్నరః
తస్యాపస్మారకుష్ఠాదీ వ్యాధిబాధానవిద్యతే
సర్వగ్రహాకృతాపీడా పఠితే-స్మి న్నవిద్యతే
కృత్రిమౌషధదుర్మంత్రం కృత్రిమాదినిశాచరైః
యద్యద్భయం భవేత్తత్ర పఠితేస్మిన్ నవిద్యతే
ప్రతిమా యాచస్వర్ణేన లిఖితా తు భుజాష్టకా
ముద్గధాన్యోపరిన్యస్తపీతవస్త్రాన్వితే ఘటే
విన్యస్య విధినా సమ్యక్ మాసమేకం నిరంతరం
యే పూజయంతి తే యాంతి దీర్ఘమాయుః ప్రజాధనమ్
ఆరోగ్యం భస్మగుల్మాది సర్వవ్యాధి వినాశనమ్
యం యం కామయతే సమ్యక్ తత్తదాప్నోత్యసంశయః

ఇతి శ్రీస్కాందే పురాణే బుధస్తోత్రం సంపూర్ణమ్

## బుధ అష్టోత్తర శతనామస్తోత్రం

బుధోబుధార్చిత సౌమ్యసౌమ్యః చిత్తశ్శుభప్రదః ।
దృఢవ్రతో దృఢఫలశ్శ్రుతిజాలప్రబోధకః ॥ 1
సత్యవాసస్సత్యవచాః శ్రేయసాం పతిరవ్యయః ।
సోమజ స్సుఖద శ్శ్రీమాన్ సోమవంశప్రదీపకః ॥ 2
వేదవిద్వేదతత్త్వజ్ఞో వేదాంతజ్ఞాన భాస్వరః ।
విద్యావిచక్షణవిభు ర్విద్వత్ప్రీతికరో ఋజుః ॥ 3
విశ్వానుకూల సంచారీ విశేష వినయాన్వితః ।
వివిధాగమసారజ్ఞో వీర్యవద్విగత జ్వరః ॥ 4
త్రివర్గఫలదోనంత స్త్రిదశాధిపపూజితః ।
బుద్ధిమద్బహుశాస్త్రజ్ఞో బలీ బంధవిమోచకః ॥ 5
వక్రాతివక్రగమనో వాసవో వసుధాధిపః ।
ప్రసాదవదనో వంద్యో వరేణ్యో వాగ్విలక్షణః ॥ 6
సత్యవాక్ సత్యసంకల్పస్సత్యబంధుస్సదాదరః ।
సర్వరోగ ప్రశమనస్సర్వమృత్యు నివారకః ॥ 7

వాణిజ్యనిపుణో వశ్యో వాతాంగీ వాతరోగహృత్ ।
స్థూలస్థైర్యగుణాధ్యక్షః స్థూలసూక్ష్మాదికారణః ॥ 8
అప్రకాశః ప్రకాశాత్మా ఘనో గగన భూషణః ।
విధివూజ్యో విశాలాక్షో విద్వజ్జనమనోహరః ॥ 9
చారుశీలః స్వప్రకాశశ్చపలశ్చ జితేంద్రియః ।
ఉదఙ్ముఖో మఖాసక్తో మగధాధిపతిర్హరః ॥ 10
సౌమ్యవత్సరసంజాతస్సోమ ప్రియకరస్సుఖీ ।
సింహాధిరూఢస్సర్వజ్ఞ శ్శిఖివర్ణ శ్శివంకరః ॥ 11
పీతాంబరః పీతవపుః పీతచ్ఛత్రధ్వజాంచితః
ఖడ్గ చర్మధరః కార్యకర్తా కలుషహారకః ॥ 12
ఆత్రేయగోత్ర జోఽ త్యంతవినయో విశ్వపావనః ।
చాంపేయపుష్పసంకాశ శ్చారణశ్చారుభూషణః ॥ 13
వీతరాగో వీతభయో విశుద్ధ కనకప్రభః ।
బంధుప్రియో బంధుముక్తో బాణమండలసంశ్రితః ॥ 14
అర్కేశాన ప్రదేశ స్తర్కశాస్త్ర విశారదః
ప్రశాంతః ప్రీతిసంయుక్తః ప్రియకృత్ ప్రియభాషణః ॥ 15
మేధావీ మాధవాసక్తో మిథునాధిపతిస్సుధీః
కన్యారాశి ప్రియః కామప్రదో ఘన ఫలావయః ॥ 16
బుధస్యైవం ప్రకారేణ-నామ్నామష్టోత్తరం శతమ్

## బుధ స్తుతి

ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యే సమిష్టా పూర్తే సగ్ం సృజే
థామయం చ పునః కృణ్వగ్ స్త్వాపితరం యువాన
మన్వాతాగ్ం । సీత్వ యితం తు మేతం ॥

## 92. అభినందనం

క్రింది నామములతో బుధ గ్రహయంత్రమును తరచు పూజించిన గ్రహానుగ్రహం కలుగుతుంది.

# బుధ అష్టోత్తర శతనామావళి

ధ్యానమ్: ప్రియంగుకలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధం ।
సౌమ్యం సత్త్వగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్

**ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర నమః అని చదువుకొనవలెను.**

ఓం బుధాయ నమః
బుధార్చితాయ
సౌమ్యాయ
సౌమ్యచిత్తాయ
శుభప్రదాయ
దృఢవ్రతాయ
దృఢఫలాయ
శ్రుతిజాలప్రబోధకాయ
సత్యవాసాయ
సత్యవచసే 10
శ్రేయసాంపతయే
అవ్యయాయ
సోమజాయ
సుఖదాయ
శ్రీమతే
సోమవంశప్రదీపకాయ
వేదవిదే
వేదతత్త్వజ్ఞాయ
వేదాంతజ్ఞానభాస్వరాయ
విద్యావిచక్షణవిభవే 20
విద్వత్ప్రీతికరాయ
ఋజవే
విశ్వానుకూలసంచారిణే
విశేషవినయాన్వితాయ
వివిధాగమసారజ్ఞాయ
వీర్యవతే
విగతజ్వరాయ
త్రివర్గఫలదాయ
అనంతాయ
త్రిదశాధిపపూజితాయ 30
బుద్ధిమతే
బహుశాస్త్రజ్ఞాయ
బలినే
బంధవిమోచనాయ
వక్రాతివక్రగమనాయ
వాసవాయ
వసుధాధిపాయ
ప్రసాదవదనాయ
వంద్యాయ
వరేణ్యాయ 40
వాగ్విలక్షణాయ
సత్యవతే
సత్యసంకల్పాయ
సత్యసంధాయ
సదాదరాయ
సర్వరోగప్రశమనాయ
సర్వమృత్యునివారకాయ
వాణిజ్యనిపుణాయ
వశ్యాయ
వాతాంగినే 50
వాతరోగహృతే
స్థూలాయ
స్థైర్యగుణాధ్యక్షాయ
స్థూలసూక్ష్మాదికారణాయ
ప్రకాశాయ
ప్రకాశాత్మనే
ఘనాయ
గగనభూషణాయ
విధిస్తుత్యాయ
విశాలాక్షాయ 60
విద్వజ్జనమనోహరాయ
చారుశీలాయ
స్వప్రకాశాయ
చపలాయ
చలితేంద్రియాయ
ఉదఙ్ముఖాయ
మఖాసక్తాయ
మగధాధిపతయే
హరయే
సౌమ్యవత్సరసంజాతాయ 70
సోమప్రియకరాయ
మహతే
సింహాధిరూఢాయ
సర్వజ్ఞాయ
శిఖివర్ణాయ
శివంకరాయ
పీతాంబరాయ
పీతవపుషే

| | | |
|---|---|---|
| పీతచ్ఛత్రధ్వజాంచితాయ | వీతరాగాయ | ప్రియకృతే |
| ఖడ్గచర్మధరాయ 80 | వీతభయాయ 90 | ప్రియభాషణాయ 100 |
| కార్యకర్త్రే | విశుద్ధజనకప్రదాయ | మేధావినే |
| కలుషహారకాయ | బంధుప్రియాయ | మాధవాసక్తాయ |
| అత్రేయగోత్రజాయ | బంధుముక్తాయ | మిథునాధిపతయే |
| అత్యన్తవినయాయ | బాణమండలసంశ్రితాయ | సుధియే |
| విశ్వపావనాయ | అర్కేశానప్రదేశస్థాయ | కన్యారాశిప్రియాయ |
| చాంపేయపుష్పసంకాశాయ | తర్కశాస్త్రవిశారదాయ | కామప్రదాయ |
| చారణాయ | ప్రశాంతాయ | ఘనఫలాశయాయ |
| చారుభూషణాయ | ప్రీతిసంయుక్తాయ | బుధగ్రహాయ నమః |

## 93. అభినుతి

బుధగ్రహానుగ్రహం కోసం క్రింద బుధకవచం సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి.

## బుధకవచం

ఓం అస్య శ్రీ బుధ కవచస్తోత్ర మహామంత్రస్య కాత్యాయన ఋషిః, అనుష్టుప్ ఛందః, బుధోదేవతా, యంబీజమ్, క్లీం శక్తిః, ఊం కీలకమ్, మమ బుధ గ్రహప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః. బాం అంగుష్ఠాభ్యాం నమః, బీం తర్జనీభ్యాం నమః, బూం మధ్యమాభ్యాం నమః, బః కరతలకరపృష్ఠాభ్యాం నమః, ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సు వరోమితి దిగ్బంధః,

**ధ్యానమ్ :**

బుధః పుస్తకహస్తశ్చ కుంకుమస్య సమద్యుతిః
బుధం జ్ఞానమయం సర్వం కుంకుమాభం చతుర్భుజమ్ ॥
ఖడ్గశూలగదాపాణిం వరదాంకితముద్రితమ్
పీతాంబరధరం దేవం పీతమాల్యాను లేపనమ్
వజ్రాద్యాభరణం చైవ కిరీట మకుటోజ్జ్వలమ్
శ్వేతాశ్వరథమారూఢం మేరుంచైవ ప్రదక్షిణమ్
బుధః పుస్తకహస్తశ్చ కుంకుమస్య సమద్యుతిః
పీతాంబరధరః పాతు పీతమాల్యాను లేపనమ్

బుధః పాతు శిరోదేశం సౌమ్యః పాతు చ ఫాలకమ్
నేత్రే జ్ఞానమయః పాతు శ్రుతీ పాతు శశిసుతః
ఘ్రాణం గంధధరః పాతు భుజౌ పుస్తకభూషితః
మధ్యం పాతు సురారాధ్యః పాతు నాభిం ఖగేశ్వరః
కటిం కాలాత్మజః పాతు ఊరూ పాతు సురేశ్వరః
జానునీ రోహిణీసూనుః పాతు జంఘే ఫలప్రదః
పాదౌ బాణాసనః పాతు పాతు సౌమ్యోఽఖిలం వపుః

ఫలశ్రుతి

ఏషోఽపి కవచః పుణ్యః సర్వోపద్రవశాంతిదః
సర్వరోగప్రశమనః సర్వదుఃఖ నివారకః ॥
ఆయురారోగ్య శుభదం పుత్రపౌత్రప్రవర్ధనం
యః పఠేత్కవచం దివ్యంశ్రుణు యాద్వాసమాహితః
సర్వాన్ కామానవాప్నోతి దీర్ఘమాయుశ్చవిందతి ॥

# 94. అభివందనం

బుధగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి బుధగ్రహదేవతను కీర్తించండి.

## బుద్ధావతార స్తుతి

(దశావతారాల్లో పరమాత్మాంశ బుధగ్రహం-బుద్ధావతారం)

నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదాన్ప హరే ॥
దానవపతి మానపహర త్రిపుర విజయ మర్దన రూప
బౌద్ధ జ్ఞానద బుద్ధ నమోభక్తం తే పరిపాలయమాం

## బుధగ్రహ మంగళాష్టకం

శ్లో॥ సౌమ్యః పీత ఉదఙ్ముఖ స్సమిద పామార్గోత్రి గోత్రోద్భవో
బాణేశాన దిశస్సుహృద్రవిసుతశ్శేషాస్సమాశ్శీతగోః
కన్యాయుగ్మ పతిర్దశాష్ట చతురష్షట్ నేత్రగ శ్శోభనః
విష్ణుర్దైవ్యధిదేవతే మగధపః కుర్యాత్ సదామంగళం ॥

# బుధగ్రహ స్తోత్ర కీర్తన

రచన : ముత్తుస్వామి దీక్షితులు

రాగం : నాటకురంజి  మిశ్రగతి  జంపె తాళం

పల్లవి : బుధ మాశ్రయామి సతతం - సురవినుతం
చంద్రతారానుతం ॥బుధ॥

అనుపల్లవి : బుధజనైర్వేదితం భూసురై ర్మోదితం
మధురం కవితాప్రదం మహనీయ సంపదం

చరణం 1 : కుంకుమ సమద్యుతిం గురుగుహ ముదాకృతిం
కుజవైరిణం-మణి మకుట హార కేయూర కంకణాది ధరణం ॥బుధ॥

చరణం 2 : కమనీయతర మిధున కన్యాధిపం పుస్తక కరం నపుంసకం
కింకరజన మహితం కిల్బిషాది రహితం
శంకర భక్తహితం - సదానంద సహితం ॥బుధ॥

ఉద్మఙ్ముఖో - మాగధజోహరి స్థశ్చాత్రేయ గోత్రశ్శర మండలస్థ
సఖడ్గ చర్మోరు గదాధరోంగ స్త్వీశాన భాగే వరద స్సుప్రీత: ॥

## బుధగ్రహానుగ్రహం కోసం ప్రత్యేకస్తోత్రం

## శ్రీనృసింహాష్టకమ్

ధ్యాయామి నారసింహాఖ్యం బ్రహ్మ వేదాంత గోచరం
భవాబ్ధి తరణోపాయం శంఖ చక్ర ధరం పదమ్
లీలాం రమాం చ పరిభూయ కృపారసేన స్తంభే స్వశక్తి మనఘాం వినిధాయ దేవీం
ప్రహ్లాద రక్షణ విధాయవతీ కృపా తే శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥1
ఇంద్రాది దేవ నికరస్య కిరీటకోటి ప్రత్యుప్తరత్న ప్రతిబింబిత పాదపద్మ ।
కల్పాంతకాల ఘనగర్జనతుల్య నాద శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥ 2
ప్రహ్లాద ఈడ్య ప్రళయార్క సమానవక్త్ర హుంకార నిర్జిత నిశాచర బృందనాథ ।
శ్రీనారదాది మునిసంఘ సుగీయమాన శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥3
రాత్రించరా-ద్రిజఠరాత్పరిస్రంస్యమాన రక్తం నిపీయ పరికల్పిత సాంత్రమాల ।
విద్రావి తా-ఖిలసురోగ్ర నృసింహరూప శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥4
యోగీంద్ర యోగ పరిరక్షక దేవదేవ దీనార్తిహారి విభవాగమ గీయమాన ।
మాం వీక్ష్య దీన మశరణ్య మగణ్యశీల శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥5

ప్రహ్లాద శోక వినివారణ భద్రసింహ నక్తంచరేంద్ర మదఖండన వీరసింహ ।
ఇంద్రాది దేవజన సన్నుత పాదపద్మ శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥6
తాపత్రయాబ్ధి పరిశోషణ బాడబాగ్నే తారాధిప ప్రతినిభానన దానవారే ।
శ్రీరాజరాజ వరదాఖిల లోకనాథ శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥ 7
జ్ఞానేన కేచి దవలంబ్య పదాంబుజం తే కేచి త్సుకర్మ నికరేణ పరే చ భక్త్యా ।
ముక్తిం గతాః ఖలు జనా కృపయా మురారే శ్రీనారసింహ పరిపాలయ మాం చ భక్తమ్ ॥8

# 95. యంత్రస్థాపనం

## 1. బుధగ్రహానుగ్రహం కోసం

ఒక రాగిరేకును ఇరువైపుల క్రింది యంత్రమును రాయించి, దానిని పూజించాలి.

| | | |
|---|---|---|
| 9 | 4 | 11 |
| 10 | 8 | 6 |
| 5 | 12 | 7 |

| | | |
|---|---|---|
| 9 | 10 | 5 |
| 4 | 8 | 12 |
| 11 | 6 | 7 |

పై యంత్రమును " ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బుధాయ నమః" అను మూలమంత్రమును 1,53,000 సార్లు జపిస్తూ పూజించాలి.

## 2. బుధయంత్రం (భృగు సంహిత)

ఈ క్రింది యంత్రమును రాగిరేకు లేదా కంచులో చేసిన రేకుపై చెక్కించి దానిని "ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బుధాయనమః" అను మంత్రమును 5 లక్షల సార్లు జపిస్తూ పూజించాలి. బంధువుల అభిమానం, వ్యాధినివారణ, బుద్ధి మాంద్యము తొలగుటకు ఈ యంత్రము ఉపయోగించును.



# 96. గురువు - ఒక వీక్షణ

1. ఇతరనామాలు - జీవ, అంగీరస, వాచస్పతి, మంత్రి, దేవేజ్యుడు
2. లింగము - పురుషగ్రహము
3. జాతి - బ్రాహ్మణ జాతి
4. రంగు - పసుపుపచ్చ
5. తత్త్వము - ఆకాశతత్త్వము
6. గ్రహస్వభావము - శుభగ్రహం
7. స్వభావము - మృదుస్వభావం
8. గుణము - సత్వగుణము
9. రుచులు - తీపి
10. గ్రహోదయము - ఉభయ
11. జీవులు - ద్విపాది
12. గ్రహస్థానము - ధనాగారము
13. ఆధిపత్యదిక్కు - ఈశాన్యము
14. జలభాగం - జల
15. ఆత్మాధికారకత్వం - జ్ఞానము
16. పాలనశక్తులు - మంత్రి
17. శరీరధాతువు - క్రొవ్వు
18. లోహధాతువు - బంగారం
19. కుటుంబ సభ్యుడు - పుత్రులు
20. గ్రహరూపవర్ణం - పసుపురంగు
21. గ్రహపీడ - ఆర్థిక ఇబ్బందులు, పుత్రులవలన బాధలు
22. గ్రహవర్గం - గురు
23. గృహభాగములు - పూజగది, ధనమును దాయు ప్రదేశములు
24. కాల బలము - పగలు బలవంతుడు
25. దిగ్బలము - లగ్నంలో బలవంతుడు
26. ఆధిపత్యకాలము - మాసము
27. స్వక్షేత్రము - ధనస్సు, మీనము
28. శత్రుక్షేత్రము - మిథునము, కన్య
29. మిత్రక్షేత్రము - మేషము, వృషభము, తుల, వృశ్చికము సింహము

30. విషమక్షేత్రము - .....
31. సమక్షేత్రము - మేషము, వృషభము, ధనస్సు మకరము
32. ఉచ్ఛరాశి - కర్కాటకము
33. నీచరాశి - మకరము
34. మూల త్రికోణము - ధనస్సు
35. పరమ ఉచ్ఛ - కర్కాటకంలో 5వ డిగ్రీ
36. పరమ నీచ - మకరంలో 5వ డిగ్రీ
37. మిత్ర గ్రహాలు - రవి, చంద్రుడు, కుజుడు
38. శత్రుగ్రహాలు - బుధుడు
39. సమగ్రహాలు - శని
40. వ్యధా గ్రహము - చంద్రుడు
41. నైసర్గిక బలగ్రహము - శుక్రుడు
42. దిన చలనం - 4నుండి 5 నిమిషాలు
43. రాశిలో గ్రహం ఉండే కాలం - 1 సంవత్సరం
44. రాశిలో ఫలమిచ్చేభాగం - రాశిలో మధ్యభాగం
45. గ్రహ ప్రకృతి - శ్లేష్మము
46. ఋతువు - హేమంతఋతువు
47. దిగ్బలము - తూర్పున బలవంతుడు
48. సూచించు ఎత్తు - పొడుగు
49. సూచింపబడే వయస్సు - 30 సంవత్సరాలు
50. సూచించు ప్రాంతాలు - గోదావరి నుండి వింధ్యపర్వంతం వరకు గల ప్రాంతాలు
51. నివాస ప్రాంతం - నగరప్రాంతములు
52. సూచించబడే శరీరా - కాలేయము, గాల్‌బ్లాడర్, పాంక్రియాస్ వయవము
53. సూచించే శరీర వ్యాధులు - కాన్సర్, వ్రణములు, కామెర్లు, కాలేయముకు సంబంధించిన వ్యాధులు
54. గోచారరీత్యా శుభస్థానములు - 2,5,7,9,11
55. గోచారరీత్యా అశుభస్థానములు - 1,3,4,6,8,10,12
56. గోచారరీత్యా వేధస్థానములు - 3,4,8,10,12
57. గ్రహదశా కాలము - 16 సంవత్సరములు

| | | | |
|---|---|---|---|
| 58. | జీవన కారకత్వము | - | భాగ్యకారకుడు |
| 59. | సంబంధించిన నక్షత్రాలు | - | పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర |
| 60. | సూచించు వృక్షజాలి | - | వటవృక్షములు |
| 61. | సూచించు ధాన్యం | - | శనగలు |
| 62. | సూచించు పండ్లు | - | పనసపండ్లు, తీయని గుమ్మడికాయలు |
| 63. | సూచించు పక్షులు | - | హంస, పావురము |
| 64. | సూచించు జంతువులు | - | సింహము, ఏనుగు |
| 65. | సూచించు ఇతర ద్రవ్యములు | - | పసుపు |
| 66. | సంబంధించిన సమిధ | - | రావి |
| 67. | సంబంధించిన మూలిక | - | రావి, అరటివేరు |
| 68. | సూచించు వస్త్రము | - | వాడిన వస్త్రములు |
| 69. | దేవవర్గము | - | వైష్ణవ |
| 70. | గ్రహగోత్రము | - | అంగీరస |
| 71. | వేదములు | - | ఋగ్వేదము |
| 72. | శుభత్వం | - | పూర్ణశుభుడు |
| 73. | అవతారం | - | వామనావతారము |
| 74. | గ్రహస్వరూపం | - | రాగిజుట్టు, గచ్చునికన్నులు కలిగి రుద్రాక్షమాలలు, దండలు, కమండలము ధరించును. |
| 75. | గ్రహ స్వరూప వర్ణం | - | తెల్లని పచ్చని కాంతి |
| 76. | గ్రహారూఢ వాహనం | - | సింహవాహనం |
| 77. | పూజార్థం గ్రహ ప్రతిమకు వాడవలసినది | - | బంగారం |
| 78. | గ్రహప్రీతికి నైవేద్యం | - | దధ్యోదనము (పెరుగుకలిపిన అన్నం) |
| 79. | అధిష్ఠాన దేవత | - | బ్రహ్మ |
| 80. | అధిదేవత | - | బ్రహ్మ |
| 81. | ప్రత్యధిదేవత | - | ఇంద్రుడు |
| 82. | గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు | - | పోతులూరి వీరబ్రహ్మంగారి ఆరాధన, దత్తజయంతి |
| 83. | చేయవలసిన ప్రసాదము | - | లడ్లు, శనగల గుగ్గిళ్ళు |
| 84. | దోష నివారణకు దక్షిణ | - | వస్త్రములు |
| 85. | ప్రీతికరమైన తిథి | - | ఆషాఢ పూర్ణిమ |
| 86. | ఆచరించవలసిన వ్రతము | - | అనఘావ్రతం |

87. పారాయణ చేయవలసిన పురాణాలు - వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర, గురుచరిత్ర
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - గురుగ్రహ అష్టోత్తర శతనామావళి
89. పారాయణ చేయవలసిన సహస్రనామావళి - శివ సహస్ర నామావళి
90. ఆచరించవలనసిన దీక్ష - సాయిదీక్ష, బ్రహ్మంగారి దీక్ష
91. ధరించవలసిన మాల - గంధ మాల
92. ధరిచవలసిన రత్నము - పుష్యరాగం
93. ధరించవలసిన రుద్రాక్ష - పంచముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - బ్రహ్మంగారి గుడి, సాయిబాబా, రాఘవేంద్రస్వామి దేవాలయాలు
95. చేయవలసిన పూజలు - బ్రహ్మంగారి ఆరాధన
96. దానంచేయవలసిన ద్రవ్యములు - శనగలు, పసుపురంగు వస్త్రములు, పసుపు, బంగారం.
97. గ్రహజప సంఖ్య - 16,000
98. హోమముకు వాడు సమిధ - రావి
99. నవగ్రహమండపంలో గ్రహఆసనం - దీర్ఘచతురస్రాకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 5,7,9 రాశులు
101. గ్రహసంఖ్య - 3
102. గ్రహం సూచించు వారం - గురువారం
103. సూచించు సమయం - సూర్యోదయ కాలం నుండి ఉదయం 8 గంటల వరకు
104. ప్రతినిధి గ్రహాలు - రవి+బుధ
105. గ్రహం బలంగా ఉంటే ఫలితం - సమాజంలో గౌరవం, ధనలాభం
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - ధననష్టం, పరువు నష్టం.
107. తండ్రి - బ్రహ్మ (మానసపుత్రుడు)
108. తల్లి - ....
109. భార్య - తార
110. సూచించు లోహములు - బంగారం
111. గ్రహప్రభావితుల మనఃస్థితి - సాత్వికస్వభావం
112. భావకారకత్వం - సంపాదన, కీర్తి
113. గ్రహదృష్టి - కటాక్ష
114. గ్రహమునకు గుర్తు - ♃
115. సంబంధించిన వృత్తి - విద్య

116. గ్రహజన్మ సంవత్సరం - సౌమ్య
117. జన్మమాసం - ఆశ్వయుజము
118. జన్మతిథి - శుక్ల ద్వాదశి
119. జన్మనక్షత్రం - ధనిష్ఠ
120. ఆధిపత్యం వహించుదేశం - సింధుద్వీపం
121. గ్రహఋషి - గృత్సమదుడు
122. గ్రహ ఛందస్సు - త్రిష్టుప్
123. పుట్టినవారం - గురువారం

**సంబంధించిన వస్తువులు, పనులు :-**

శనగలు, పనసపళ్ళు, తీయని గుమ్మడికాయలు, పసుపు, రావి, సింహము, ఏనుగులు, రథము, బ్రాహ్మణులు, గురువు, స్నేహితులు, దేవాలయములు, పుణ్యక్షేత్రములు, హోమము, శివపూజ, గురుపూజ, పుష్యరాగం, బంగారం, పుస్తకాలు, పసుపురంగు వస్త్రం.

## 97. ఖగోళశాస్త్ర పరంగా గురువు

సూర్యుని నుండి అయిదవగ్రహంగా ఉండే గ్రహం గురువు. గురుగ్రహమును బృహస్పతి అని పిలుస్తారు. రోమన్‌ల ప్రకారం గురువు దేవతలకు రాజు. ఒలింపస్ పాలకుడు రక్షకుడు గ్రీకుల ప్రకారం జ్యూస్. క్రోనస్ (శని) కుమారుడు జ్యూస్.

గురుగ్రహం ద్రవ్యరాశి $1.90 \times 10^{27}$ కి.గ్రా ఇది భూమి పరిమాణంకు 1303 రెట్లు ఉంటుంది. సూర్యునినుండి 7,7,80,00,000 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. గురు గ్రహ మధ్యరేఖ పొడవు 1,42,984 కిలోమీటర్లు ఉంటుంది. సూర్యుని చుట్టూ పరిభ్రమించుటకు పట్టు సమయం $3.74 \times 10^{8}$ సెకన్లు.

సూర్యుడు, చంద్రుడు, శుక్రుడు తరువాత ఆకాశంలో కాంతివంతమైనది గురుగ్రహమే. 1610 సంవత్సరంలో గెలీలియో దీనిని గమనించాడు. గురువు ఉపరితలమంతా వాయువులతో నిండి ఉంటుంది. గురుగ్రహము 90% హైడ్రోజన్, 10% హీలియం, మిథేన్, నీరు, అమ్మోనియా, రాళ్ళను కలిగి ఉన్నది. గురుగ్రహ అంతర్భాగంలో భూమి ద్రవ్యరాశికి దాదాపు 15 రెట్లున్న శిలలు ఉండవచ్చు. అని శాస్త్రజ్ఞుల అంచనా. దీనిపై ద్రవరూపంలోని హైడ్రోజన్ ఉంటుంది.

గురుగ్రహం ఉపరితలంపై రంగుల వలయాలు ఉంటాయి.

కాంతివంతమైన రంగులున్న పట్టీలను జోన్స్ అని, నల్లనివాటిని బెల్ట్స్ అని అంటారు. దీని ఉపరితలంపై గాలులు గంటకు 640 కిలోమీటర్ల వేగంతో వీస్తుంటాయి.

1973లో మొదటిసారి పయొనీర్ 10 గురుగ్రహాన్ని సందర్శించిరది. తరువాత పయొనీర్ 11,వాయేజర్1, వాయేజర్ 2, యులిసిస్, గెలీలియో మొదలగు రోవర్స్ గురుగ్రహాన్ని పరిశీలించినవి. హబుల్ స్పేస్ టెలిస్కోపు ద్వారా దీనిని పరిశీలిస్తున్నారు.

గురు గ్రహంపై అనేక మచ్చలు ఉన్నవి. దానిలో గ్రేట్ రెడ్ స్పాట్ (G.R.S) ను 300 సంవత్సరాలనుండి గమనిస్తున్నారు. ఇది దీర్ఘవృత్తాకారంలో 12,000 కి.మీ. నుండి 25,000 కి.మీ వరకు వ్యాపించి ఉంటుంది.

గురుగ్రహం సూర్యుని నుండి గ్రహించే ఉష్ణము కంటె ఎక్కువ వేడిని అంతరిక్షంలోకి విడుదల చేస్తున్నది. దీని అంతర్భాగంలో 20,000 డిగ్రీల కెల్విన్ ఉష్ణోగ్రత ఉంటుంది.

భూ అయస్కాంతక్షేత్రం కంటె గురు అయస్కాంత క్షేత్రం చాల శక్తివంతమైనది. దీని ప్రభావం శని కక్ష్య వరకు ఉంటుంది. శనిగ్రహంకు ఉన్న వలయాల మాదిరిగా గురు గ్రహానికి వలయాలు ఉన్నవి. ఇవి చిన్న చిన్న శిలలతో కూడి ఉంటుంది. "షూమేకర్-లెవీ9" అనే తోకచుక్క జూలై 1994లో గురుగ్రహాన్ని ఢీ కొట్టినది.

రాత్రిపూట గురుగ్రహం ఆకాశంలో ఒక నక్షత్రంవలె కనిపిస్తుంది. దీనికి ముఖ్యంగా 16 ఉపగ్రహములు ఉన్నవి. అవి మెటిస్, అడ్రెస్టా, అమాల్థియా, థేబ్, అయొ, యూరోపా, గానిమెడి, కలిస్టో, లెడా, హిమలియా లిసిథియా, ఎలర, అనాంకె, కార్మె, పసిఫె, సినోప్.

## 98. పురాణాల పరంగా గురువు

గురువు పీతవర్ణపు దేహకాంతి కలవాడు. నాలుగు భుజములు కలవాడు. చేతిలో దండము, కమండలము, రుద్రాక్షమాల ధరించును. సింహమును వాహనముగా కలవాడు. ఇతనికి జీవ, అంగీరస, వాచస్పతి, మంత్రి, దేవేజ్యుడు అను పేర్లు కలవు.

మరీచి ప్రజాపతి పుత్రిక సురూప. ఈమెను అంగీరస మహర్షికి ఇచ్చాడు. వీరికి అంగీరసనామ సంవత్సరం వైశాఖశుద్ధ ఏకాదశి తిథియందు ఉత్తర ఫల్గుణి నక్షత్రంలో బృహస్పతి జన్మించాడు. ఈ దేవతల గురువుకు మరో ప్రజాపతి పుత్రిక 'తార' భార్య అయింది. ఇంద్రునికి అన్ని విధాలా తోడ్పడడం-అత్యవసర సమయంలో సలహాలివ్వడం బృహస్పతి విధులు.

# 99. జ్యోతిష్యశాస్త్రపరంగా గురుడు

గురుడు పురుష గ్రహము. ఇతను రుచులలో తీపిని, రంగులలో పసుపు పచ్చను సూచించును. ఇతను బ్రాహ్మణజాతికి చెందినవాడు. అధిదేవత బ్రహ్మ. గురుడు 30 సంవత్సరముల వయస్సు కలవారిని సూచించును. ఇతను స్థూలకాయులు, కపిల వర్ణపు వెంట్రుకలు, కండ్లు కలవారిని సూచించును. ఇతను కఫతత్వము కలవాడు. హేమంత ఋతువును సూచించును. ఆకాశతత్వము కలిగి ఈశాన్యదిశను సూచించును. లోహములలో బంగారమును, రత్నములలో పుష్యరాగమును సూచించును. ఈ గ్రహసంఖ్య3. లగ్నములో దిగ్బలమును పొందును.

గోదావరినుండి వింధ్యపర్వతం వరకు ఇతని దేశంగా జాతకపారిజాతం తెలుపుతున్నది.

గురుడు పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రములకు అధిపతి. శరీరావయవములలో కాలేయము, గాల్‌బ్లాడర్, పేంక్రియాస్‌లను సూచించును. గురుడు ధనస్సు, మీనరాశులకు అధిపతి. ఇతనికి ఉచ్ఛరాశి కర్కాటకం. నీచరాశి మకరం. కర్కాటకంలో 5వడిగ్రీ ఇతనికి పరమోచ్ఛ. అలాగే మకరంలో 5వ డిగ్రీ పరమనీచ. ఇతనికి రవి, చంద్ర, కుజులు స్నేహితులు. బుధ, శుక్రులు శత్రువులు శని సముడు. గురుగ్రహదశ 16 సంవత్సరములు.

**గురుడు ప్రభావం :-**

లావుకు తగ్గ పొడవును కలిగి మంచి ఆకారము కలిగినవారై వుంటారు. వీరికి ఆహారము, వస్త్రము, సౌఖ్యములకు కొదువ వుండదు. సంప్రదాయముల పట్ల నమ్మకము, దైవభక్తివుంటాయి. పండితులు, చట్టము, ధర్మము అంటే గౌరవము. విద్యా సంస్థలతో సంబంధము కలిగియుంటారు. కంఠధ్వని చక్కగా వుంటుంది. విశాలమైన కనులు, నుదురు కలిగి యుంటారు.

అజీర్ణవ్యాధులు, శరీరము బరువుపెరుగుట వంటి అనారోగ్యములు కలుగవచ్చును.

దేవాలయములు, L.I.C బ్యాంకు, వంటి సంస్థలలో రాణిస్తారు. న్యాయశాస్త్రంలో ప్రవీణులు కాగలరు.

**కారకత్వములు :-**

గురుడు ధనకారకుడు. జ్యేష్టసోదరుడు, పుత్రులు, సంతానం, ముత్తాత, విశేష బంధువులు, మంత్రి, యజ్ఞము, గౌరవము, దైవభక్తి వేదములు, శాస్త్రములు, వేదాంతము, దానధర్మములు, బుద్ధి, సత్యము, ఆచారము కలిగియుండుట, బంగారము, వైఢూర్యము సంస్కృతభాష, శబ్దములను సూచించును. బ్యాంకులు, ఖజానాలు, న్యాయస్థానములు, న్యాయమూర్తులు, దేవాలయములు, విద్యాలయములు, అధ్యాపకులు, బోధకులు, మఠాధికారులు, మతసంస్థలు, ఆర్థికవ్యవహారములను సూచించును. కాలేయము, కాలేయమునకు సంబంధించిన వ్యాధులు, కాన్సర్ వ్యాధులను సూచించును. నెయ్యి, నూనె, క్రొవ్వు, వెన్న, శనగలు, దబ్బకాయలు, పనసకాయలను సూచించును. పావురము, హంసలు, గుర్రములు, ఏనుగులను సూచించును.

పుస్తకములు, కళాశాలలు, వైద్యులు, లాయర్లు, బిషప్‌లు, చర్చి, పదవి, కరుణ, సంతోషము, పెట్టుబడి, అభివృద్ధి, ఐశ్వర్యము, పూజారులు, ఉపాసన, విదేశీయులు, భవిష్యత్తు, బహుమతులు, ఆచారాలు, బ్యాంకులు, ధనుర్విద్య, రేసులు, టైటిల్స్, వేదాంతము, చెల్లింపులు, నిజాయితీ, క్రమబద్ధము ఉన్మాదములను సూచించును.

**గురుడు సూచించు విద్యలు :-**

గురుడు బోధించేవారిని అనగా ఉపాధ్యాయులనుండి ప్రొఫెసర్ల వరకు సూచించును. బ్యాంకులు, అర్థికశాస్త్రము, ధనము, బంగారము, సంస్కృతభాష, పురాణాలు, నోట్లముద్రణ వేదాంతములను సూచించును.

**గురుడు సూచించు వ్యాధులు :-**

మధుమేహవ్యాధి, కాలేయము, గాల్‌బ్లాడర్‌కు సంబంధించిన వ్యాధులు, బోదకాలు, శరీరంలో నీరు చేరుట, విస్పంతానం, కాన్సర్‌లను గురువు సూచించును. గురుడు చంద్రునితో కలసి గర్భాశయముకు సంబంధించిన ఇబ్బందులు, గర్భాశయ కాన్సర్ శుక్రునితో కలసి మధుమేహవ్యాధి, విచిత్రమైన సెక్సుకోరికలు, అసహజంగా పెరిగే శరీరాంగములును సూచించును. రవితో కలసి లుకేమియా, విపరీతంగా కొలొస్ట్రాల్ ఏర్పడుట, మూత్రపిండముల వ్యాధి, లివర్‌కు సంబంధించిన వ్యాధులు, పచ్చకామెర్లు, కఫంచేరుట, అతిమూత్రవ్యాధిని, సూచించును. విపరీతమైన ఆకలి, అజీర్ణము, అతికాయములను కూడ గురుడు సూచించును.

**గురుడు సూచించు వృత్తి వ్యాపారాలు :-**

న్యాయవాదులు, న్యాయమూర్తులు, బోధకులు, ఉపాధ్యాయులు, సామాజిక రచయితలు, మతప్రవక్తలు, పురోహితులు, ప్రభుత్వోద్యోగులలో ఉన్నతస్థానం పొందుతారు, సంఘంలో ఉన్నతస్థానంలో పేరు పొందువారు, మతప్రచారకులు, రవి లేదా చంద్రులతో కూడిన రాజకీయాలు, బ్యాంకు వ్యవహారములు, అధ్యక్షులు, మేయరు, కౌన్సిలర్, పార్లమెంటుమెంబరు, శాసనసభ్యులును సూచించును. కుజునితో కలసి ఏదైనా పరిశ్రమకు డైరక్టరు, మేనేజరు, మేనేజింగ్ డైరక్టర్ అను సూచించును. బుధునితో కలసి విదేశీభాషలు, ఎగుమతులు, దిగుమతులు, సివిల్ ఇంజనీరింగ్‌లను సూచించును.

## ద్వాదశ లగ్నాలలో గురుడు - ఫలితాలు

**మేషం లగ్నమైతే**

- మేష లగ్నమై లగ్నంలో గురుడున్న దేహదారుఢ్యము, సుఖం, ధనం, ప్రతిష్ఠ కలుగును.
- 2 వ స్థానంలో గురుడున్న ధనలాభం, కలుగును.
- 3 వ స్థానంలో గురుడున్న బంధువులతో విభేదాలు, అశాంతి కలుగును.
- 4 వ స్థానంలో గురుడున్న విద్య, వాహనం, ముద్రాధికారములు కలుగును.
- 5 వ స్థానంలో గురుడున్న సంతాన లాభము, ఉద్యోగము కలుగును.
- 6 వ స్థానంలో గురుడున్న ఋణము, శత్రువులు, కష్టనష్టములు కలుగును.
- 7 వ స్థానంలో గురుడున్న గుణవతి యగు భార్య లభించును.
- 8 వ స్థానంలో గురుడున్న మొదట సుఖము కలుగును, తరువాత కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో గురుడున్న పితృసౌఖ్యము, విశేష భాగ్యమును కలుగును.
- 10 వ స్థానంలో గురుడున్న పిత్రార్జిత నష్టము, అప్పు కలుగును.
- 11 వ స్థానంలో గురుడున్న న్యాయార్జితము, కీర్తి, అధికారము, ధనవృద్ధియు కలుగును.
- 12 వ స్థానంలో గురుడున్న శుభకార్యములు, ధర్మకార్యములు, తీర్థయాత్రలు మొదలగునవి జరుగును.

**వృషభం లగ్నమైతే**

- వృషభం లగ్నమై 1 వ స్థానంలో గురుడు వుంటే జాతకుడు మంచి విద్యావంతుడు, అందగాడు.
- 2 వ స్థానములో గురుడు వుంటే జాతకుడు తక్కువ ధనము కూడబెట్టును. పెద్ద కుటుంబము కలవాడై ఉండును.

- 3 వ స్థానములో గురుడు వుంటే జాతకునకు పేరు ప్రతిష్ఠలు కల సోదరులు ఉంటారు. వారి వలన ఈ జాతకునికి ధనము లభించును.
- 4 వ స్థానములో గురుడు వుంటే జాతకునికి తల్లి ప్రేమ, విద్య, భూమి తక్కువగా వుండును.
- 5 వ స్థానములో గురుడు వున్నట్లయితే జాతకునికి అధిక సంతానం కలుగును. బాగా ధనం సంపాదించువాడు అవుతాడు.
- 6 వ స్థానములో గురువు వుంటే జాతకునికి విరోధులు, రోగాలు కొంచెం ఎక్కువగా ఉండును. అప్పులు చేయును.
- 7 వ స్థానములో గురుడు వుంటే జాతకునికి అనుకూలవతియైన అందమైన భార్య లభించును.
- 8 వ స్థానములో గురుడు వుంటే జాతకుడు ధనవంతుడు, ఎక్కువ ఆయుస్సు కలవాడు.
- 9 వ స్థానములో గురుడు వుంటే జాతకునికి శరీర బాధల వల్ల డబ్బు ఖర్చు అవుతుంది.
- 10 వ స్థానములో గురుడు వుంటే జాతకుడు ఉపాధ్యాయునిగా పనిచేస్తూ జీవనాన్ని గడుపువాడు.
- 11 వ స్థానములో గురుడు వుంటే జాతకుడు న్యాయంగా డబ్బు సంపాదించును.
- 12 వ స్థానములో గురుడు వుంటే జాతకునికి సంపాదన తక్కువగా వుండి, ఖర్చులు ఎక్కువగా ఉండును.

**మిథునం లగ్నమైతే**

- మిథునం లగ్నమై లగ్నంలో గురుడున్న ఆరోగ్యము, కీర్తి కలుగును. పరోపకారి అవుతాడు.
- 2 వ స్థానంలో గురుడున్న విశేషధనలాభం, ఇతని పాప గ్రహాభుక్తియందు మరణం సంభవించును.
- 3 వ స్థానంలో గురుడున్న బాల్యంలో ఈ దశవస్తే ఆ దశలో బాలారిష్టం కలుగును.
- 4 వ స్థానంలో గురుడున్న మాతృసౌఖ్యము, భూమి, విద్య, వాహనము లభించును పేరుప్రఖ్యాతులు పొందును.
- 5 వ స్థానంలో గురుడున్న పుత్రసంతానం ఉంటుంది. భూమి, ధనము లభించును.

- 6 వ స్థానంలో గురుడున్న భార్య వలన బాధలు, అప్పు, అనారోగ్యం కలుగును.
- 7 వ స్థానంలో గురుడున్న అనారోగ్యం, స్థూలకాయురాలైన భార్య లభించును.
- 8 వ స్థానంలో గురుడున్న కుటుంబసుఖం లేకపోవుట, ఉద్యోగము యందు ఆటంకములు ఏర్పడుట కలుగును.
- 9 వ స్థానంలో గురుడున్న తండ్రికి ఆరోగ్యము కలుగును. పిత్రార్జితం లభించును.
- 10 వ స్థానంలో గురుడున్న ఆచారవంతుడు, యజ్ఞయాగాలు నిర్వహించును.
- 11 వ స్థానంలో గురుడున్న విశేష ధనలాభం, జ్యేష్ఠసోదరునకు భాగ్యము కలుగును.
- 12 వ స్థానంలో గురుడున్న మంచి కార్యములకు ధనం ఖర్చు పెట్టును.

**కర్కాటకం లగ్నమైతే**

- కర్కాటక లగ్నమై లగ్నంలో గురుడున్న సుఖము, ధనము, కీర్తి లభించును.
- 2 వ స్థానంలో గురుడున్న విశేషధనప్రాప్తి, సంఘంలో పేరు ప్రఖ్యాతులు కలుగును.
- 3 వ స్థానంలో గురుడున్న సోదరుల సహకారం, సామాన్యజీవనం కలుగును.
- 4 వ స్థానంలో గురుడున్న విద్య, భూమి, వాహన యోగం కలుగును.
- 5 వ స్థానంలో గురుడున్న పుత్రులు, ధనము కలుగును.
- 6 వ స్థానంలో గురుడున్న ధనవ్యయం, సాధారణ జీవనం కలుగును.
- 7 వ స్థానంలో గురుడున్న తండ్రికి నష్టము, పిత్రార్జిత ధనం వ్యయం కలుగును.
- 8 వ స్థానంలో గురుడున్న పితృసౌఖ్యం తక్కువ. ధనరాబడి ఉంటుంది.
- 9 వ స్థానంలో గురుడున్న పిత్రార్జితమైన ఆస్తి లభించును.
- 10 వ స్థానంలో గురుడున్న యజ్ఞములు చేయును.
- 11 వ స్థానంలో గురుడున్న ధర్మవర్తనం, ధనార్జన కలుగును.
- 12 వ స్థానంలో గురుడున్న ధర్మకార్యములు నిర్వహించును. పిత్రార్జితమగు ఆస్తిని ఖర్చుచేయును.

### సింహం లగ్నమైతే

- సింహలగ్నమై లగ్నములో గురుడు ఉన్న సుఖ దుఃఖములు రెండును కలుగును.
- 2 వ స్థానంలో గురుడు ఉన్న ధనము, ఋణము కలుగును.
- 3 వ స్థానంలో గురుడు ఉన్న సోదరులు ఎక్కువగా ఉంటారు.
- 4 వ స్థానంలో గురుడు ఉన్న భూమిని సంపాదించి తరువాత అమ్మును.
- 5 వ స్థానంలో గురుడు ఉన్న అతికష్టం వల్ల పుత్రసంతానం నిలుచును.
- 6 వ స్థానంలో గురుడు ఉన్న అష్టకష్టాలు కలుగును.
- 7 వ స్థానంలో గురుడు ఉన్న మంచి భార్య వచ్చును. కాని రోగముతో బాధ పడును.
- 8 వ స్థానంలో గురుడు ఉన్న పెద్ద కుటుంబం కలవాడై ఉండును.
- 9 వ స్థానంలో గురుడు ఉన్న ఆయురారోగ్యములు సంపూర్ణంగా కలుగును.
- 10 వ స్థానంలో గురుడు ఉన్న కీర్తి ధనము కలుగును.
- 11 వ స్థానంలో గురుడు ఉన్న స్వతంత్ర జీవనం చేయును.
- 12 వ స్థానంలో గురుడు ఉన్న ఆదాయం తక్కువ. వ్యయం ఎక్కువగా వుండును.

### కన్యలగ్నమైతే

- కన్య లగ్నమై లగ్నంలో గురుడున్న ధనము, సుఖము, ఆయుర్దాయము కలుగును.
- 2 వ స్థానములో గురుడున్న మొదట సుఖము కలుగును. తరువాత మరణభయము కలుగును.
- 3 వ స్థానంలో గురుడున్న సుఖహీనము, బాల్యమున బాలారిష్టములు కలుగును.
- 4 వ స్థానంలో గురుడున్న మాతృసౌఖ్యము, వాహన సౌఖ్యము, భూలాభము కలుగును.
- 5 వ స్థానంలో గురుడున్న అష్ట కష్టములు కలుగును.
- 6 వ స్థానములో గురుడున్న సామాన్య జీవనము, పిత్రార్జిత ధనవ్యయము కలుగును.
- 7 వ స్థానములో గురుడున్న మంచి భార్య లభించును. భార్యకు అనారోగ్యము కలుగును.

- 8 వ స్థానంలో గురుడున్న సుఖహీనం, కుటుంబవృద్ధి, ధనహీనము కలుగును.
- 9 వ స్థానములో గురుడున్న పిత్రార్జితము లభించును. తండ్రికి దీర్ఘాయుర్దాయము కలుగును.
- 10 వ స్థానములో గురుడున్న శుభకార్యములు, కీర్తి కలుగును.
- 11 వ స్థానములో గురుడున్న భాగ్యం కలుగును.
- 12 వ స్థానములో గురుడున్న సుఖహీనము కలుగును.

**తుల లగ్నమైతే**

- తులాలగ్నమై లగ్నంలో గురుడున్న అనారోగ్యము కలుగును. ఇతరులచే ద్వేషింపబడతారు.
- 2 వ స్థానంలో గురుడున్న ఋణము, అనారోగ్య సమస్యలు కలుగును.
- 3 వ స్థానంలో గురుడున్న సహోదరుల సహకారం ఉంటుంది.
- 4 వ స్థానంలో గురుడున్న సుఖము దుఃఖము సమానంగా కలుగును. శతృభయము, స్వల్పంగా భూమి వలన లాభము కలుగును.
- 5 వ స్థానంలో గురుడున్న కుటుంబ సుఖము, కార్యసాఫల్యానుకూలత, సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానంలో గురుడున్న అశాంతి, అనారోగ్యం, ఆర్థిక సమస్యలు కలుగును.
- 7 వ స్థానంలో గురుడున్న కుటుంబంలో అనారోగ్య సమస్యలు, చికాకు కలుగును.
- 8 వ స్థానంలో గురుడున్న కుటుంబ సుఖము, సంతానమెక్కువ, దరిద్రం కలుగును.
- 9 వ స్థానంలో గురుడున్న ఆస్తి వివాదముల పరిష్కారం, ధన లాభం కలుగును.
- 10 వ స్థానంలో గురుడున్న డాంబికపరత్వం, అచారములు, ప్రయాణాలు, ధనవ్యయం కలుగును.
- 11 వ స్థానంలో గురుడున్న చెడుపనులు, ధనరాబడి, భూమికొనుగోలు చేయుట కలుగును.
- 12 వ స్థానంలో గురుడున్న ధనవ్యయం, కార్యహాని కలుగును.

**వృశ్చికం లగ్నమైతే**

- వృశ్చికలగ్నమై లగ్నంలో గురుడున్న ధనలాభం, విద్య, కీర్తి పెరుగును.
- 2 వ స్థానంలో గురుడున్న ధనలాభం, సమావేశముల నిర్వహణ, గౌరవము కలుగును.

- 3 వ స్థానంలో గురుడున్న దరిద్రం కలుగును.
- 4 వ స్థానంలో గురుడున్న విద్య, భూలాభం, మాతృసౌఖ్యము కలుగును.
- 5 వ స్థానంలో గురుడున్న కుటుంబ వృద్ధి, ధనలాభం కలుగును.
- 6 వ స్థానంలో గురుడున్న హెచ్చు సంతానం, ఋణము కలుగును.
- 7 వ స్థానంలో గురుడున్న గుణవతి అయిన కళత్రము, కళత్ర సంబంధమున ఆస్తి లాభం కలుగును.
- 8 వ స్థానంలో గురుడున్న సుఖహీనుడు, ధనహీనుడు అగును.
- 9 వ స్థానంలో గురుడున్న విశేష భాగ్యము కలుగును.
- 10 వ స్థానంలో గురుడున్న సదాచార ప్రవర్తన, కీర్తి కలుగును.
- 11 వ స్థానంలో గురుడున్న ధనలాభము, కోర్టు వివాదం పరిష్కారం.
- 12 వ స్థానంలో గురుడున్న అనేక సత్కార్యములు చేయుట, ఋణబాధ సంభవించును.

**ధనుస్సు లగ్నమైతే**

- ధనుస్సు లగ్నమైన లగ్నములో గురుడు వున్న బహుస్త్రీసాంగత్యం, సుఖం, ధనం, శాంతి కలుగును.
- 2 వ స్థానంలో గురుడు ఉన్న సంతానం వలన బాధలు, సుఖహీనము, ప్రయాణాలు, విదేశ వాసములు కలుగును.
- 3 వ స్థానంలో గురుడు ఉన్న సోదరీవృద్ధియును, సామాన్య భాగ్యము కలుగును.
- 4 వ స్థానంలో గురుడు ఉన్న తల్లితండ్రుల ప్రేమ, పాండిత్యము, భూలాభము కలుగును.
- 5 వ స్థానంలో గురుడు ఉన్న మేధావి. సంతానము, అధికారుల అభిమానం, మంత్రోపాసన, విద్యాధనం కలుగును.
- 6 వ స్థానంలో గురుడు ఉన్న అనారోగ్యం, ఋణములు కలుగును.
- 7 వ స్థానంలో గురుడు ఉన్న స్థూలశరీరము గల సుకళత్రము, సుఖము, ధనము కలుగును.
- 8 వ స్థానంలో గురుడు ఉన్న అల్పాయుర్దాయము, కష్ట జీవనము కలుగును.
- 9 వ స్థానంలో గురుడు ఉన్న భాగ్యము, పితృసౌఖ్యము, ధనలాభం, కార్యసిద్ధి, కీర్తి, సత్యవాక్కులు కలుగును.

- 10 వ స్థానంలో గురుడు ఉన్న ఖ్యాతి, సదాచారము, మంచి వృత్తి వలన జీవనము, గౌరవము, సుఖము కలుగును.
- 11 వ స్థానంలో గురుడు ఉన్న న్యాయధనార్జనము, ప్రభుత్వోద్యోగం, పిత్రార్జితధనము, ధర్మము కలుగును.
- 12 వ స్థానంలో గురుడు ఉన్న ధనవ్యయము, పనులకు అటంకములు కలుగును.

**మకరం లగ్నమైతే**

- మకరలగ్నమై 1 వ స్థానమున గురుడు నీచమైన స్థానములో వుండుటచే నీచమైన జీవితాన్ని అనుభవించును. కావి గురునకు నీచ భంగం కలిగితే అధిక ధనవంతుడు అగును. సుఖవంతోషకరమైన జీవితాన్ని అనుభవించును.
- 2 వ స్థానమున గురుడువున్న కుటుంబవృద్ధి కలిగి ధనవంతుడు అవుతాడు. సుఖ ప్రదమైన జీవితం అనుభవించును.
- 3 వ స్థానమున గురుడు వున్న అధిక సోదరులు ఉంటారు. ధనవంతుడు అవుతాడు.
- 4 వ స్థానమున గురుడు వున్న భూమి, గృహము, వాహనము వుండును. విద్యావంతుడు.
- 5 వ స్థానమున గురుడువున్న అధిక సంతానం, సంతానం వలన నష్టము కలుగును.
- 6 వ స్థానమున గురుడు వున్న రోగాలు, ఋణాలు అధికంగా ఉండును. కష్టములతో కూడిన జీవితం అనుభవించును.
- 7 వ స్థానమున గురుడున్న స్థూలకాయురాలైన భార్య లభించును. ధనంఖర్చు చేయును. సామాన్య జీవితాన్ని గడుపును.
- 8 వ స్థానమున గురుడు వున్న పెద్దకుటుంబము, దరిద్రము కలుగును.
- 9 వ స్థానమున గురుడున్న సామాన్యమైన జీవితాన్ని అనుభవించును. పితృసౌఖ్యము అధికంగా ఉండును.
- 10 వ స్థానమున గురుడు వున్న స్వతంత్రంగా జీవించును. పేరు ప్రతిష్ఠలు గలవాడు. సామాన్య జీవితాన్ని గడుపును.
- 11 వ స్థానమున గురుడు వున్న న్యాయమైనవృత్తి వలన ధనార్జన చేయును.
- 12 వ స్థానమున గురుడు వున్న సుఖము, శాంతి, ధర్మ ప్రవర్తన కలుగును.

**కుంభం లగ్నమైతే**

- కుంభలగ్నమై లగ్నమందు గురుడున్న సుఖము, ధనము, శాంతి స్థూలశరీరము, పొందును.
- 2 వ స్థానమున గురుడున్న సుఖము, ధనము, శాంతి, పొందును.
- 3 వ స్థానమున గురుడున్న సామాన్య జీవనం, సోదర అభివృద్ధి పొందును.
- 4 వ స్థానమున గురుడున్న విద్య, భూమి, సుఖము, ధనము, శాంతి, తల్లి దీర్ఘాయువును పొందును.
- 5 వ స్థానమున గురుడున్న సుఖము, ధనము, శాంతి, కార్యసిద్ధి సంతాన అభివృద్ధిని పొందును.
- 6 వ స్థానమున గురుడున్న వ్యవహారంలో చిక్కులు, అశాంతి పొందును. ధనం ఖర్చగును.
- 7 వ స్థానమున గురుడున్న మంచిభార్య, సుఖజీవనమును పొందును.
- 8 వ స్థానమున గురుడున్న డబ్బు ఖర్చు అగును. వ్యవహారంలో చిక్కులు, అశాంతి కలుగును.
- 9 వ స్థానమున గురుడున్న ధనలాభము-కార్యసిద్ధి కలుగును. తండ్రి సంపాదించినది, తాను సంపాదించినది వృద్ధి పొందును.
- 10 వ స్థానమున గురుడున్న స్వతంత్ర విద్య వలన జీవనం, కీర్తి సంఘంలో గౌరవం, సుఖము, ధనము లభించును.
- 11 వ స్థానమున గురుడున్న భూమి, ధనలాభం, కార్యసిద్ధి న్యాయార్జితము, మిశ్రమ ఫలము కలుగును.
- 12 వ స్థానమున గురుడున్న వ్యవహారంలో చిక్కులు, అశాంతి, సంతాన విచారము, డబ్బు ఖర్చు అగుట, కష్టములు సంభవించును.

**మీనం లగ్నమైతే**

మీనం లగ్నమై లగ్నంలో గురుడు ఉన్న విద్య వినయము, ధనము, ఆరోగ్యము, కీర్తి కలుగును.

- 2 వ స్థానంలో గురుడు ఉన్న ధన లాభము, అనారోగ్యము కలుగును.
- 3 వ స్థానంలో గురుడు ఉన్న శత్రువులు, అనారోగ్యము ఋణము, సోదరులను పొందును.

- 4 వ స్థానంలో గురుడు ఉన్న విద్య, భూలాభము కలుగును. తల్లికి దీర్ఘాయుర్దాయము ఉండును.
- 5 వ స్థానంలో గురుడు ఉన్న విద్యావంతుడు, పండితుడు. పుత్రుల వలన కీర్తి కలుగును.
- 6 వ స్థానంలో గురుడు ఉన్న అనారోగ్యము, ఋణము, అశాంతి కలుగును.
- 7 వ స్థానంలో గురుడు ఉన్న గుణవతి అగు భార్య, స్త్రీ సౌఖ్యము, అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానంలో గురుడు ఉన్న దరిద్రము, కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో గురుడు ఉన్న భూలాభము, పూర్వుల ఆస్థి లభించును. ధన సంపాదన ఉంటుంది.
- 10 వ స్థానంలో గురుడు ఉన్న సదాచారము, వృత్తిలో ఖ్యాతి, గౌరవము, సంఘంలో కీర్తి కలుగును.
- 11 వ స్థానంలో గురుడు ఉన్న సుఖహీనము అశాంతి కలుగును.
- 12 వ స్థానంలో గురుడు ఉన్న ప్రయాణాలకు, పుణ్యకార్యములకు ధనవ్యయము జరుగును.

## వివిధభావాలలో గురువు - ఫలితాలు

- గురుడు లగ్నంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు. శాస్త్రములు తెలిసిన వాడు. ధనవంతుడు అధికారుల అభిమానం పొందువాడు. లావుగా ఉంటాడు.
- గురుడు ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు వాక్చాతుర్యము కలవాడు. తనమాటలతో ఇతరులను మెప్పించును. సుఖంగా, సంతోషంగా జీవిస్తాడు. కాని వృద్ధాప్యమున ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటాడు.
- గురుడు తృతీయభావంలో ఉంటే జాతకుడు దయలేనివాడు. కఠినంగా ప్రవర్తిస్తాడు. బలహీనమైన శరీరం కలవాడు.
- గురుడు చతుర్థభావంలో ఉంటే జాతకునకు బంధుప్రేమ ఎక్కువ. స్నేహితులు ఉంటారు. వాహనములను కలిగి ఉంటాడు.
- గురుడు పంచమభావంలో ఉంటే జాతకుడు మాటకారి. పుత్రులవలన గౌరవం పొందుతాడు. స్నేహితులను కలిగి ఉంటాడు.
- గురుడు షష్టమ భావంలో ఉంటే, అది గురునకు శుభరాశి అయితే శత్రువులను జయిస్తాడు. అశుభస్థానమైతే శత్రుభయం ఉంటుంది.

- గురుడు సప్తమభావంలో ఉంటే జాతకుడు ధనము, కీర్తి సంపాదిస్తాడు. కవి, ఉపన్యాసకుడు. కార్యనిర్వహణ సామర్థ్యము కలవాడు. అందమైన భార్య లభిస్తుంది.
- గురుడు అష్టమభావంలో ఉంటే జాతకుడు బలహీనంగా ఉంటాడు. గ్రహణశక్తి తక్కువ. ఏపనిని చురుకుగా చేయలేడు. ప్రయాణాలు ఎక్కువగా చేస్తాడు. సాధారణ జీవితం గడుపుతాడు.
- గురుడు నవమభావంలో ఉంటే జాతకుడు ఆస్తిపరుడు. సంఘంలో గౌరవం పొందుతాడు. దైవకార్యాలు చేస్తాడు. అధికారుల అభిమానం పొందుతాడు.
- గురుడు దశమభావంలో ఉంటే జాతకునికి కుటుంబసౌఖ్యం ఉంటుంది. ధనార్జన ఉంటుంది. వాహనాలలో తిరుగుతుంటాడు.
- గురుడు ఏకాదశ భావంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు, సంపాదన పరుడు. ఉత్తమగుణములు కలవాడు. పలువురి మన్ననలను పొందుతాడు.
- గురుడు ద్వాదశ భావంలో ఉంటే జాతకుడు ఆవేశపరుడు. తొందరపాటు వలన సమస్యలు తెచ్చుకుంటాడు. బుద్ధిహీనుడు.

**గురుడు కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- అనవసరవ్యయం అధికమవుతుంది.
- అప్పులు చేయవలసి వస్తుంది.
- కుటుంబ సభ్యులకు తరచు ప్రమాదములు, భయాందోళనలు కలుగుతాయి.
- సంతానంలో కనీసం ఒకరి చదువయినా ఆగిపోతుంది. లేదా విద్యలో ఉత్తీర్ణుడు కాలేడు.
- ఇంటిలో దైవకార్యాలు (పూజలు, నోములు వగైరా జరగవు.)

పై సంఘటనలలో ఏది జరిగినా గురువు చెడు ప్రభావ ఫలితమేనని గ్రహించాలి. దోషనివారణకు క్రింది పరిక్రియలను చేయాలి.

**గురుడు శాంతించుటకు చేయవలసిన కార్యాలు :-**

- పెద్దలను గౌరవించండి. వారి ఆశీస్సులను పొందండి.
- ప్రతిరోజు శివాలయంకు వెళ్ళండి. మీ ఇంటికి ఈశాన్య దిశలో ఉన్న శివాలయమయితే ఇంకా బాగుంటుంది.
- ఇంటిలో వాయువ్యమూలలో ఇత్తడితో చేసిన దేవుని విగ్రహాన్ని ఉంచండి.

- ఇంటిలో ఈశాన్యం వైపు విశాలంగా ఉండాలి. అచట ఏదైనా చెట్లు ఉంటే తీసేయండి.
- బంగారపు ఉంగరంలో కనకపుష్యరాగంను పొదిగి, కుడిచేతి వేలుకు ధరించండి.
- ఇంటిలో నైరుతిమూలలో మనీప్లాంటును పాకనీయండి.

# వివిధభావాలలో గురువు - పరిహారక్రియలు

**లగ్నంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- పెసలు దానం చేయండి.
- పేదవానికి తెల్లని బట్టలు దానం చేయండి.
- ఆవును పెంచండి.
- ఎవరివద్ద ఏ వస్తువు ఉచితంగా తీసుకోవద్దు.

**ద్వితీయ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిశుక్రవారం ఒకరికి భోజనం పెట్టండి. ఈ విధంగా 12వారాలు చేయండి.
- వరుసగా 30 రోజులు పుట్టలో పాలుపోయండి.
- వరుసగా 21 రోజులు పేదపిల్లలకు పాలు పంచండి.

**తృతీయ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- బంధువులకు సాయపడండి
- కుటుంబ సభ్యులకు సహకరించండి
- చిన్నపిల్లలకు శనగగుగ్గిళ్ళు పంచండి.
- ప్రతిదినం దుర్గాస్తోత్రం చేయండి.

**చతుర్థ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు దేవాలయముకు వెళ్ళండి.
- ప్రతిరోజు ఉదయం రావిచెట్టుకు నీరు పోయండి.
- పెద్దలను గౌరవించండి.
- వరుసగా 48 రోజులు గోవుకు ఆహారం పెట్టండి.
- వరుసగా 21 రోజులు పిల్లలకు శనగపప్పు పంచండి.

**పంచమ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- నిజాయితీగా ఉండండి.
- వరుసగా 30 రోజులు సాయిబాబా చావడి తుడవండి.
- సాధ్యమైనంతవరకు అప్పు చేయవద్దు.
- శివాలయముకు మినుములు సమర్పించండి.

**షష్ఠమ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- తండ్రిని విడువకండి. మీతోపాటే ఆయనను ఉంచుకోండి.
- బంగారపు ఉంగరం ధరించండి.
- ప్రతిరోజు కుంకుమ ధరించండి.
- ఆలయ పూజారికి పసుపురంగు వస్త్రం సమర్పించండి.
- సాయిబాబా గుడికి శనగగుగ్గిళ్ళు ప్రసాదంగా సమర్పించండి.

**సప్తమ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- పసుపురంగు వస్త్రాలను ధరించవద్దు.
- సాధువులు, సన్యాసులకు దూరంగా ఉండండి.
- కుటుంబ బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించండి.
- పరస్త్రీలతో పరిచయం సమస్యలను తెస్తుంది.

**అష్టమ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- సాయిబాబా గుడికి కర్పూరం సమర్పించండి.
- పేదవారికి పెరుగు, నెయ్యి దానంగా ఇవ్వండి.
- మూడు మంగళవారాలు వరుసగా పేదలకు భోజనం పెట్టండి.
- ప్రతిరోజు రావిచెట్టుకు నీరు పోయండి.

**నవమ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 39 రోజులు శనగగుగ్గిళ్ళు పంచిపెట్టండి.
- వరుసగా 48 రోజులు పవిత్రనదిలో స్నానం చేయండి.
- పుణ్యక్షేత్రాలను దర్శించండి.
- పగడం, కెంపు, ముత్యం పొదిగిన వెండి ఉంగరాన్ని ధరించండి.

**దశమ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు ఒక రాగినాణెంను ప్రవహించే నీటిలో వేయండి. ఈ విధంగా వరుసగా 39 రోజులు చేయండి.
- ప్రతిరోజు నుదుటిపై కుంకుమ ధరించండి.
- ప్రతి సోమవారం బియ్యం దానం చేయండి. ఈ విధంగా వరుసగా 3 వారాలు చేయండి.

**ఏకాదశ భావంలో గురువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- తండ్రిని గౌరవించండి. ప్రతిరోజు ఆయన ఆశీర్వాదం పొందండి.
- రాగి కంకణం లేదా రాగిగాజు ధరించండి.

- ప్రతిరోజు రావిచెట్టుకు నీరుపోయండి.
- బంగారపు గొలుసును ధరించండి.
- పసుపురంగు వస్త్రం ధరించండి.

**ద్వాదశ భావంలో గురుపు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిదినం కుంకుమ ధరించండి.
- ప్రతిరోజు దేవాలయముకు వెళ్ళండి.
- రావి చెట్టుకు నీరుపోయండి.
- సాధువులను ఆదరించండి.
- అబద్ధాలు చెప్పవద్దు.
- మాంసాహారం భుజించవద్దు. మద్యపానం చేయవద్దు.

## 100. గురుహోర

గురుహోరకు అధిపతి గురుడు. గురువారం లేదా పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రములున్న రోజులలో గురుని ప్రభావం ఎక్కువగా వుంటుంది. ఆనాటి గురుహోర సమయంలో గురువు ప్రభావం ఎక్కువగా వుంటుంది.

బంగారం, వెండి వ్యాపారం ప్రారంభించుటకు, బ్యాంకులో ఎకౌంట్ ప్రారంభించుటకు, ఏదైనా బ్యాంకు మేనేజరును మీ వ్యాపార విషయంగా కలుసుకోవటానికి గురువారం నాటి గురుహోర సమయం చాలా అనుకూలమైనది. అంతేకాదు గురువారం రోజు గురుహోర సమయంలో వేదాలు, తత్త్వ శాస్త్రము, న్యాయము, అర్థికశాస్త్రము, జ్యోతిష్యశాస్త్రము మొదలగు వాటిని నేర్చుకొనుటను ప్రారంభించిన ఆయా విషయాలను బాగా ఆకళింపు చేసుకోగలుగుతారు. వాటికి సంబంధించిన పుస్తకాలను గురువారం నాటి గురుహోర సమయంలో కొంటే మంచిది.

ఇంటికి శంఖుస్థాపన శుక్రవారం నాటి గురుహోరలో చేయుట మంచిది. అలాగే ఏదైనా వాహనాలను కొనటానికి కూడా శుక్రవారం గురుహోర ఉత్తమం.

రిఫ్రిజిరేటర్లు కొనటానికి శనివారం గురుహోర ఉత్తమమైనది. ఈ సమయంలో ఏదైనా పాలసీ తీసుకుంటే లాభదాయకం.

'హాస్పిటల్' కోసం శంకుస్థాపన చేయుటకు ఆదివారం గురుహోర అనుకూలమైన సమయం.

'మంత్రి'గా పదవీస్వీకరణకు ఈ సమయం అనుకూలమైనది.

ఓడలు, పెట్రోలు వంటి వాటిమీద పెట్టుబడులు పెట్టటానికి సోమవారం గురుహోర అనుకూలం.

పరిశ్రమలకు సంబంధించిన, లేదా రక్షణ వ్యవస్థకు సంబంధించిన నిర్మాణాలకు మంగళవారం గురుహోర అనుకూలం.

విద్యారంగముకు సంబంధించిన ఉద్యోగములలో చేరుటకు, విమాన ప్రయాణాలకు సోమవారం గురుహోర అనుకూలమైనది.

సంతానం లేని దంపతులు గురువారం రాత్రి గురు హోరలో సంభోగించండి. ఫలితం వుంటుంది.

దేవాలయ నిర్మాణాలకు, కళాశాలలు, గ్రంథాలయాలు, బ్యాంకులు, పశు గణాభివృద్ధి సంస్థలు ప్రారంభించుటకు గురుహోర అనుకూల సమయము.

**గురుహోర సమయం :-**

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయం నుండి హోర సమయమును లెక్కిస్తారు. హోరకాలప్రమాణం ఒక గంట.

సూర్యోదయ, సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింద సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు | రాత్రి |
|---|---|---|
| ఆదివారం | 11-12, | 6-7, 1-2 |
| సోమవారం | 8-9, 3-4 | 10-11, 5-6 |
| మంగళవారం | 12-1 | 7-8, 2-3 |
| బుధవారం | 9-10, 4-5 | 11-12 |
| గురువారం | 6-7, 1-2 | 8-9, 3-4 |
| శుక్రవారం | 10-11, 5-6 | 12-1, |
| శనివారం | 7-8, 2-3, | 9-10, 4-5. |

# 101. ధారణం

## గురుగ్రహదోషనివారణకు రత్నధారణ

వృత్తిపరమైన ఇబ్బందులు, సంతానహీనత, సంఘంలో గుర్తింపు లేకపోవుట వంటి సమస్యల పరిష్కారముకు పుష్యరాగం ధరిస్తారు. గ్యాస్, స్థూలకాయము కలవారు పుష్యరాగమును ధరించుట ఉత్తమము.

**పుష్యరాగం :-**

గురువుకు ధరించవలసినది పుష్యరాగం.

గురువారంనాడు లేత పసుపురంగుగల వస్త్రంపై శనగల నుంచి, దానిపై పుష్యరాగాన్ని వుంచి 'శక్తిపంచాక్షరీ' మంత్రమును జపిస్తూ పూజించాలి. శనగగుగ్గిళ్ళు, చక్కెరపొంగలి లేదా పూర్ణాలు నైవేద్యం పెట్టాలి. 12 రోజులు ఈ విధంగా పూజించి తరువాత పుష్యరాగం ధరించాలి.

పుష్యరాగం ను ధరించలేనివారు ఎల్లో టూర్మోలిన్, ఎల్లో జిక్రాన్ వంటి ఉపరత్నములను ధరించవచ్చును.

పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర జన్మనక్షత్రములైనవారు, ధనుస్సు, మీనం లగ్నంగా కలవారు, ఆరాశులు జన్మరాశులుగా గలవారు, గురుదశ జరుగుతున్న వారు గురునికి సంబంధించిన రత్నములను ధరించవచ్చును.

**గురుగ్రహదోష నివారణకు రుద్రాక్షధారణ :-**

గురుగ్రహం అనుకూలంగా లేనివార్పుంచముఖి లేదా దశముఖి రుద్రాక్షను ధరించవచ్చు.

**పంచముఖ రుద్రాక్ష:-**

దీనిని శివుని రుద్రరూపంగా చెపుతారు. 2. దీనిని ధరించుట వలన శివానుగ్రహం పొందుతారు. 3. రుద్రాక్షయందు అయిదు ధారలుంటాయి.

**దశముఖ రుద్రాక్ష:-**

1. దీనిని విష్ణుమూర్తి స్వరూపంగా చెపుతారు.
2. దీనిని ధరించుట వలన మానసిక రుగ్మతలు పోతాయి.
3. రాజకీయ రంగంలో పేరు పొందుతారు.
4. రుద్రాక్షయందు పది ధారలుంటాయి.

# గురుగ్రహానుగ్రహం కోసం కవచధారణ

ఒక రాగిరేకుకు ఇరువైపుల క్రింది యంత్రమును చెక్కించాలి.

| పది | ఐదు | పన్నెండు |
|---|---|---|
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |
| పది | పదకొండు | ఆరు |
| ఐదు | తొమ్మిది | పదమూడు |
| పన్నెండు | ఏడు | ఎనిమిది |

| పది | ఐదు | పన్నెండు |
|---|---|---|
| పదకొండు | తొమ్మిది | ఏడు |
| ఆరు | పదమూడు | ఎనిమిది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |
| పది | పదకొండు | ఆరు |
| ఐదు | తొమ్మిది | పదమూడు |
| పన్నెండు | ఏడు | ఎనిమిది |

ఈ యంత్రమును "ఓం గ్రాం గ్రీం గ్రౌం సః బృహస్పతయే నమః" అను మంత్రమును 1,17,000 సార్లు జపిస్తూ పూజించాలి. తరువాత దానిని లాకెట్‌గా ధరించిన సంతానం, విద్య, వ్యాపారం మొదలగు అన్ని విషయాలలో శుభం కలుగుతుంది.

## 102. దానం

1. గురు మహాదశలో గురు అంతర్దశా కాలమున - బంగారుప్రతిమ
2. గురు మహాదశలో రవి అంతర్దశా కాలమున - ఛాగ దానం
3. గురు మహాదశలో చంద్ర అంతర్దశా కాలమున - డేగప్రతిమ
4. గురు మహాదశలో కుజ అంతర్దశా కాలమున - సువర్ణ దానం
5. గురు మహాదశలో బుధ అంతర్దశా కాలమున - మకర ప్రతిమ
6. గురు మహాదశలో శుక్ర అంతర్దశా కాలమున - లక్ష్మీనారాయణ రూపు
7. గురు మహాదశలో శని అంతర్దశాకాలమున - కృష్ణజింక ప్రతిమ
8. గురు మహాదశలో రాహు అంతర్దశా కాలమున - మహిష ప్రతిమ
9. గురు మహాదశలో కేతు అంతర్దశాకాలమున - మేకప్రతిమ

రాగి/బంగారం రేకుపై ప్రతిమ గీయించి దానం ఇవ్వవచ్చు!

# 103. పారాయణం

గురుగ్రహానుగ్రహం కోసం ఈ క్రింది స్తోత్రములలో ఒకదానిని నిత్యం పఠించాలి.

1. పంచాక్షరీ జపం-'ఓం నమః శివాయః'
2. రుద్రసూక్తం/నమకం/చమకం/దత్తశ్లోకం
3. గురు అష్టోత్తర శతనామావళి/దక్షిణామూర్తి స్తోత్రం
4. గురుమంగళాష్టకం/గురు కవచ స్తోత్రం
5. శ్రీసత్యదత్తవ్రతం/దత్తస్తోత్రం/దత్తమాలామంత్రం
6. దత్తస్తవం/దత్త అష్టోత్తరం/దత్తాత్రేయస్తోత్రం
7. దత్తస్తవం/దత్త అష్టోత్తరం/దత్తాత్రేయస్తోత్రం
8. దక్షిణామూర్తివర్ణమాలా స్తోత్రం/గురుజపం
9. గురుగ్రహ స్తోత్రం/గురుచరిత్ర పారాయణం
10. (నమ్మినవారికి) సాయి చరిత్ర పారాయణ/సాయిస్తుతి
11. అవధూత చరిత్ర పారాయణము/భక్తవిజయం
12. శివసంబంధ స్తోత్రాలు/స్తుతులు/గురుగాయత్రీజపం

## రామాయణ పారాయణ

1. గురు మహాదశలో గురు అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : అరణ్యకాండ 5వ సర్గ
   నైవేద్యం : అరటిపళ్ళు
2. గురు మహాదశలో బుధ అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : బాలకాండ 16వ సర్గ
   నైవేద్యం : ఆకుపచ్చ ఫలాలు, తాంబూలం.
3. గురు మహాదశలో శుక్ర అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : బాలకాండ 77వ సర్గ
   నైవేద్యం : ఆకుపచ్చఫలాలు/తాంబూలం
4. గురు మహాదశలో శని అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : అయోధ్యకాండ 16వ సర్గ
   నైవేద్యం : నల్లద్రాక్ష/నేరేడు

5. గురు మహాదశలో రాహు అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : అరణ్యకాండ 74వ సర్గ
   నైవేద్యం : ఎండుద్రాక్ష/తేనె
6. గురు మహాదశలో కేతు అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : సుందరకాండ 61-62 సర్గలు
   నైవేద్యం : ఖర్జూరం/కొబ్బరి
7. గురు మహాదశలో రవి అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : కిష్కింధాకాండ 40వ సర్గ
   నైవేద్యం : చేమ/క్యారట్ దుంపలు
8. గురు మహాదశలో చంద్ర అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : కిష్కింధాకాండ 60-63 సర్గలు
   నైవేద్యం : పాలు/పొంగలి.
9. గురు మహాదశలో కుజ అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : బాలకాండ 5వ సర్గ
   నైవేద్యం : బెల్లం/కందిపప్పు పొంగలి.

## 104. సందర్శనం

## దర్శించవలసిన క్షేత్రాలు

1. తూర్పుగోదావరిజిల్లా మందపల్లిలో బ్రహ్మేశ్వరస్వామి.
2. తూర్పుగోదావరిజిల్లా కోటిపల్లిలోని కోటిలింగేశ్వరాలయం.
3. తూర్పుగోదావరిజిల్లా పిఠాపురంలోని దత్తాత్రేయస్వామి
4. గుంటూరుజిల్లా అమరావతి - అమరా రామము
5. గుంటూరుజిల్లా చేబ్రోలు - బ్రహ్మదేవుడు
6. గుంటూరుజిల్లా కోటప్పకొండ - త్రికూటేశ్వరుడు
7. శ్రీకాకుళంజిల్లా శ్రీముఖలింగం-ముఖలింగేశ్వరుడు
8. కర్నూలు జిల్లా పంచలింగాల - పంచలింగేశ్వరుడు
9. కర్నూలు జిల్లా బ్రహ్మగుండం - బ్రహ్మేశ్వరుడు
10. వరంగల్లుజిల్లా - వరంగల్లు - పంచలింగేశ్వరుడు
11. కరీంనగర్ జిల్లా - ధర్మపురి - క్షేత్రం

12. మహబూబ్‌నగర్‌జిల్లా - అలంపురం - వామనావతారం
13. ఖమ్మంజిల్లా - రావిగూడెం - కేదారేశ్వర స్వామి
14. ప్రకాశంజిల్లా - కందుకూరు - బ్రహ్మేశ్వరుడు
15. ప్రకాశంజిల్లా - మొగిలిచర్ల - దత్తాత్రేయస్వామి

## అష్టాదశ(18) దత్త క్షేత్రాలు

1. **మాణిక్‌నగర్:-** ఇక్కడ ప్రసిద్ధ యోగ పురుషుడు మాణిక్‌ప్రభు మహరాజ్ సమాధి ఉన్నది. హైదరాబాద్ గుల్బర్గా పోవుదారిలో హుమ్నాబాద్‌కు ఒక కి.మీ దూరాన ఈ మాణిక్ నగర్ ఉంది.
2. **షేగాం:-** ఇక్కడ ప్రసిద్ధయోగ మహారాజ్ గజ్యాన్‌జీ సమాధి గలదు. మహారాష్ట్రలోని నాగపూర్ పట్టణానికి దగ్గర్లో గల షేగాం సంస్థానం దర్శించడం గొప్ప అనుభూతి.
3. **అక్కల్‌కోట్:-** చెన్నయ్‌నుండి ముంబయ్ నుండి రైలు సౌకర్యం గల ఈ అక్కల్‌కోట్ సంస్థానంలో స్వామి మహారాజ్ సిద్ధి పొందిన స్థలం తప్పక దర్శించదగ్గది. షోలాపూర్ నుంచి ఇక్కడకు బస్సులున్నాయి కూడా.
4. **నరేశ్వర్:-** శ్రీరంగావధూతస్వామి వారి తపోభూమి ఇది. గుజరాత్ రాష్ట్రంలోని బరోడా మియాగావ్ మార్గంలోని నరేశ్వర్ రోడ్ స్టేషన్ వద్ద దిగి ఇక్కడకు చేరచ్చు.
5. **షిర్డీ:-** శ్రీ షిర్డీసాయి సంచరించినచోటు. సాయిసమాధిని, మందిరాన్ని దర్శించవచ్చు. ఇక్కడకు సమీపంలో లెండివనంలో దత్త విగ్రహం గలదు.
6. **గరుడేశ్వర్:-** బరోడా, రాజ్‌పిప్లా నుండి బస్సులున్నాయి. గుజరాత్ రాష్ట్రంలో బరోడాజిల్లాలో నర్మదా తీరాన గల ఈ వాసుదేవానంద సరస్వతి సమాధి దర్శనీయం.
7. **నాసిక్:-** రెండో గాణుగాపూర్‌గా ప్రసిద్ధిచెందిన ఈ ప్రదేశంలో ఏకముఖదత్త విగ్రహం గలదు.
8. **సాకోరి:-** షిర్డీనుండి 5.కి.మీ. ఇక్కడకూడ ఏకముఖదత్తమూర్తి.
9. **భూగిరి:-** ఈ గిరి శిఖరం పురాతన దత్తమందిరం రాజస్థాన్‌లోని భూగిర్ వద్ద గలదు.

10. **గిర్నార్**:- గుజరాత్ రాష్ట్రంలోని జునాఘడ్‌లో పదివేల మెట్లు గల గొప్ప దత్త క్షేత్రం కొండపైన గలదు. ఈ కొండ శిఖరాన దత్తపాదుకలున్నాయి. అలహాబాద్ నుంచి రైలు మార్గం ఉంది.

11. **పిఠాపురం** :- మన రాష్ట్రంలోని విజయవాడ-విశాఖపట్నం మార్గంలో సామర్లకోటకు 12 కి.మీ దూరంలో ఉన్న పిఠాపురం గొప్పదత్తక్షేత్రం. ఇక్కడ శ్రీపాదశ్రీవల్లభులు జన్మించారు.

12. **గోకర్ణం**:- శ్రీపాద శ్రీవల్లభులు తపస్సు చేసిన ప్రదేశం. కర్ణాటకలో హుబ్లీ నుండి బస్సు ద్వారా ఇక్కడకు రావచ్చు.

13. **కురువపురం** :- శ్రీపాద శ్రీవల్లభులు తపస్సు చేసిన మరొక పవిత్రస్థలి. రాయచూర్ నుండి రైలు/బస్సు ఉంది.

14. **మాహూర్‌ఘడ్** :- పరశురామస్వామి (దత్తావతారం) సాక్షాత్కారం పొందిన స్థలం. హైదరాబాద్ నుండి నిజామాబాద్ మీదుగా ఇక్కడకు నేరుగా బస్సులున్నాయి.

15. **కరంజనగర్** :- ఇది నృసింహసరస్వతి స్వామి జన్మస్థలం. మహారాష్ట్రలోని అకోలా జిల్లాలో ఉంది. నాగపూర్ మన్మాడ్ లైన్‌లో ముర్తాజాపూర్ నుండి 20కి.మీ అకోపూర్-మన్మాడ్‌లైన్‌లో ముర్తుజాపూర్ నుండి 20కి.మీ అకోలా నుంచి బస్సులున్నాయి.

16. **గాణగాపూర్** :- నృసింహభారతి రెండు పుష్కరాల కాలం ఉన్న స్థలం. కర్నాటకలో గుల్‌బర్గాకు చెందిన ఇక్కడకు చేరడానికి బెల్గాం, షోలాపూర్‌ల నుంచి బస్సు సౌకర్యం ఉన్నది.

17. **నర్సోబావాడి**:- ఇది కూడా నృసింహ సరస్వతి తపోభూమిగా పరిగణించాలి. కొల్హాపూర్ సంగ్లీలైన్ జైసింగ్‌పూర్ స్టేషన్‌కు 30కి.మీ.

18. **ఔదుంబర్** :- ఇది సంగ్లీ (కర్నాటక) జిల్లాలో ఉంది. కొల్హాపూర్ నుంచి బస్సు, పూణేనుంచి రైలు కలదు. ఇక్కడ దత్తపాదుకలు ప్రతిష్ఠించబడ్డాయి.



# వామనావతార క్షేత్రములు

"ఇంతింతై వటుడింతయై మరియు తానింతై నభోవీధిపై
నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై"

వామనావతార ఘట్టాన్ని స్తుతించే ఈ పద్యం భాగవతంలోనిది. దుష్ట రక్షణార్థం గాక, ఇంద్రునికి తిరిగి స్వర్గం ఇప్పించడానికే విష్ణువు ఈ అవతారం ధరించడ మన్నది జరిగింది. ఈ అవతారం స్ఫురింప చేసే క్షేత్రరాజములు ఇవి :

**1. కాంచీపురం :-** తమిళనాడులో ఉంది ఒకపాదం పైకెత్తబడినట్లుగా గల వల్లని పెద్దవిగ్రహం కలదు.

**2. అలంపురం :-** మన రాష్ట్రంలోనే మహబూబ్ నగర్ జిల్లాలో ఉంది. ఇక్కడి జోగులాంబాలయములో ఈ అవతార ఘట్టాన్ని చూడొచ్చు!

**3. మధుర :** ఉత్తరాదిన ఉన్న ఈ శ్రీకృష్ణజన్మస్థలంలో వామనావతార విగ్రహంతో పాటు బలి, శుక్రాచార్యుల విగ్రహాలు కూడ గలవు.

**4. తిరుక్కోయిల్ :** తమిళనాడులోని దక్షిణ ఆర్కాడ్ జిల్లాలో గల ఈ వామనావతారం 'ఉలగలంత పెరుమాళ్'స్వామిగా ప్రసిద్ధమైనది.

**5. ఖాట్మాండ్ :** నేపాల్ రాజధానిలో గల ఈ వామనావతార మందిరం చేరువలో బాలాజీ, త్రిశూల్ మందిర్‌లు త్రిపురేశ్వర మందిరాలు కూడా దర్శించ గలం.

★ ఇంకా బాదామి (కర్నాటక) మీర్జాపూర్ (ఉత్తరప్రదేశ్) ఖజురహో (మధ్యప్రదేశ్) లలో కూడా క్షేత్రాలున్నాయి.



# 105. గురుగ్రహ అర్చనం

గురుగ్రహదోషమున్న గురు గ్రహజపంను తగుసంఖ్యలో చేయాలి. గురుగ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౧ | ౩ | ౫ | ౭ | ౬ | ౪ | ౮ | ౯ |
| ౪ | ౮ | ౯ | ౨ | ౧ | ౩ | ౫ | ౭ | ౬ |
| ౫ | ౭ | ౬ | ౪ | ౮ | ౯ | ౨ | ౧ | ౩ |
| ౬ | ౫ | ౭ | ౯ | ౪ | ౮ | ౩ | ౨ | ౧ |
| ౩ | ౨ | ౧ | ౬ | ౫ | ౭ | ౯ | ౪ | ౮ |
| ౯ | ౪ | ౮ | ౩ | ౨ | ౧ | ౬ | ౫ | ౭ |
| ౮ | ౯ | ౪ | ౧ | ౩ | ౨ | ౭ | ౬ | ౫ |
| ౭ | ౬ | ౫ | ౮ | ౯ | ౪ | ౧ | ౩ | ౨ |
| ౧ | ౩ | ౨ | ౭ | ౬ | ౫ | ౮ | ౯ | ౪ |



## గురు యంత్రము

హం చం

రం కం

అం హ్రాం క్రోం

లంహాంరంయంవం

ఖం టం

లం అం

ఠం ఈం

ఓం ఐం ఓం సురగురో అభీష్టం యచ్ఛయచ్ఛయ మమ

# గురుగ్రహ మంత్రజపం

**గురు మంత్రం :-**

బృహస్పతే అతియదర్యేత్యస్య మంత్రస్య మంత్రస్య గృత్సమదఋషిః బృహస్పతిర్దేవతా-త్రిష్టుప్ఛందః-అధిదేవతా ప్రత్యధిదేవతాస హితబృహస్పతి గ్రహప్రసాదసిద్ధ్యర్థం బృహస్పతి మహామంత్రజపం కరిష్యే

**కరన్యాసము :-**

ఓం బృహస్పతే అతియ దర్యో అర్హాత్ - అంగుష్ఠాభ్యాం నమః
ద్యుమల్విభాతి - తర్జనీభ్యాం నమః
క్రతుమజ్జనేషు - మధ్యమాభ్యాం నమః
యద్దీదయచ్ఛవసర్త - అనామికాభ్యాం నమః
ఋతప్రభాతి తదస్మాసు - కనిష్ఠికాభ్యాం నమః
ద్రవిణంధేహిచిత్రమ్ - కరతలకరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసము :-**

ఓం బృహస్పతే అతియదర్యో అర్హాత్ - హృదయాయ నమః
ద్యుమద్విభాతి - శిరసేస్వాహా
క్రతుమజ్జనేషు - శిఖాయైవషట్
యద్దీదయచ్ఛవసర్త - కవచాయహుం
ప్రభాతతదస్మాసు - నేత్రత్రయాయవౌషట్
ద్రవిణంధేహి చిత్రం - అస్త్రాయఫట్

**ధ్యానమ్ :-**

దేవానాం చ ఋషీణాంచ గురుం కాంచనసన్నిభం
బుద్ధిమంతంత్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥

**అధిదేవత :-**

బ్రహ్మజజ్ఞానం ప్రథమంపురస్తాద్విసీమతిస్సురుచోవేన ఆవః
సబుధ్నియా ఉపమా అస్య విష్ఠాస్సతస్యయోనిమసతశ్చవివః ॥

**ప్రత్యధిదేవతా -**

ఇంద్రంవోవిశ్వతస్పరి హవామహేజ నేభ్యః అస్మాకమస్తు కేవలః

**మంత్రము :-**

బృహస్పతే అతియదర్యోఅర్హాద్ద్యుమద్విభాతిక్రతుమజ్జనేషు
యద్దీదయచ్ఛసర్త ప్రభాత తదస్మాసు ద్రవిణం దేహిచిత్రమ్

**గురుగ్రహ మంత్ర జపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు పసుపురంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై బంగారంతో చేసిన గురువిగ్రహమును లేదా గురుయంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేవ ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరై: శర్కరేణ ఫలైస్సహ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తత:॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజిన:॥
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభి:॥
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవ:।
మాధ్వీ ర్నస్సం త్వోషధీ:। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజ:।
మధుద్యౌరస్తు న: పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్య:।
మాధ్వీర్గావో భవంతు న:। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమిహోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవ:
పరిగృహీతాస్తస్మాచ్ఛ్రేయానస్థేయ సోనోపహరతే త్రిసప్తాభి: పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హన:। ఉశతీరివ మాతర:।
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచన:॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపము పైకి పంచాలోకపాలకులను, అష్టదిక్పాలకులను ఉపగ్రహాదిదేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు, ఆయా స్థానములలో ఒక తమలపాకును, వక్కను ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ వుండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరి: ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయ స్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

2. ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాప యామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.

## దిక్పాలకులు

**ఇంద్రః :- (1-7-10 మం) :-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః :- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః :- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్ఋతిః-** మోషుణః పరాపరా నిర్ఋతిర్దుర్హణావధీత్। పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ఋతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)**

ఇమంమే వరుణ శృధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)**

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। ఆవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

కుభేరః :-

సోమోధేనుగ్‌ం సోమో అర్వంత మాసుగ్‌ం సోమోవీరం కర్మణ్యం దదాతు,
సాదన్యం విదత్ప్యగ్‌ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఈశానః :-

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్,
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

ఊర్ధ్వపురుషః :-

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వాయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం - 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవాన్నృక్షరా నివేశినీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాస్తుపురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుషు మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

బ్రహ్మ :-

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామ్రుషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్‌స్వధి తిర్వనానాగ్‌ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణుః:- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీః:-

నక్తుమివ తిత ఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః:- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరీ:- గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా:-

ప్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ధద్వితా॥
అదిత్రుత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతె దివా॥
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఏషేఉషా అపూర్వ్యావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గరుడః:-

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్తోమ
ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ
యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్గ్ం స్యంగాని ధిష్ణియా
శ్శఫా యజూగ్ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥
గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః:-

ధన్వనాగా ధన్వనాఽఽ జిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।
ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥
ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఇంద్రాగ్నీం :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)**

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।
గ్రాహిర్జ గ్రాహ యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥
ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్ఋతి:** యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।
తమాహరామి నిర్ఋతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥
నిర్ఋతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**(శత్రుఫలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)**

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తా వరుణశ్చ మన్యుః।
భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥
మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విశాఖా నక్షత్రమ్ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।
తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।
నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ।
విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥
విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥
మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

యజుర్వేదము :-

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

సామవేదము :-

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
నిహోతానత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

అధర్వణ వేదము :-

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అధర్వణ వేదాయ నమః॥
అధర్వణ వేదమావాహయామి। పూజయామి॥

## ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

దుర్గా :- ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః।
నః పర్ష దతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గణపతి :- ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

క్షేత్రపాలకుడు :- క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనోమృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అభయంకరుడు :- యత ఇంద్ర భయామహే తతోనో అభయం కృధి।
మఘువన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః॥

ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

తరువాత గురువుకు సంబంధించిన నక్షత్రములు పునర్వసు, విశాఖ, పూర్వాభాద్రలను ఆహ్వానించాలి.

**పునర్వసు:-**

పునర్నోదేవ్యదితి స్పృణోతు। పునర్వసూ నః పున రేతాం యజ్ఞమ్।

పునర్నోదేవా అభియంతు సర్వే। పునః పునర్వోహవిషా యజామః।

ఏవా న దేవ్యదితి రనర్వా। విశ్వస్య భర్త్రీజగతః ప్రతిష్ఠా।

పునర్వసూ హవిషా వర్ధయంతీ। ప్రియం దేవానా మప్యేతు పాథః॥

పునర్వసూ నక్షత్ర దేవతాం అదితిం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును వుంచి నమస్కరించాలి.

**విశాఖ:-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం తద్విశాఖే।

తన్నోదేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చాత్పురస్తాదభయన్నో అస్తు।

నక్షత్రాణామధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ।

విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధన్నుదతా మరాతిమ్॥

విశాఖా నక్షత్ర దేవతే ఇంద్రాగ్నీ ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు దానిపై వక్క, ఖర్జూరపండు, దక్షిణంగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

**పూర్వాభాద్ర:-**

అజ ఏకపాదుదగాత్పురస్తాత్। విశ్వా భూతాని ప్రతిమోదమానః।

తస్యదేవాః ప్రసవం యంతి సర్వే। ప్రోష్ఠపదాసో అమృతస్యగోపాః।

విభ్రాజమానస్సమిధాన ఉగ్రః। అంతరిక్ష మరుహదగంద్యామ్।

తగ్ం సూర్యం దేవ మజమేకపాదం। ప్రోష్ఠపదాసో అనుయంతి సర్వే॥

పూర్వాభాద్ర నక్షత్ర దేవతా మజమేకపాద మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకు, దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

(ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, నాణెమును ఉంచి నమస్కరించాలి.)

**బృహస్పతిః (గురుః):- (ఋ-2మా-23సూ.15మం)**

బృహస్పతే అతియదర్యేత్యస్య మంత్రస్య గృత్సమద ఋషిః బృహస్పతి గ్రహో దేవతా। త్రిష్టుప్ఛందః। (మమ) యజమానస్యాధి దేవతా ప్రత్యధి దేవతా సహిత బృహస్పతి గ్రహ ప్రసాద సిద్ధ్యర్థే బృహస్పతి గ్రహారాధనే వినియోగః.

ధ్యానం:- సౌమ్యే సుదీర్ఘే చతురస్రపీఠే రథేఽంగిరాః పూర్వముఖ స్వభావః।
దండాక్షమాలా జలపాత్రధారీ సింధ్వాఖ్యదేశే వరదస్సురేశః॥
స్వర్ణవపుః కిరీటీ చతుర్భుజో దేవగురుః ప్రశాంతః। తథాఽస్మి దండంచ కమండలుంచ తథాక్షసూత్రం వరదోఽస్తు మహ్యమ్॥

మంత్రం:- బృహస్పతే అతియదర్యో అర్హాద్ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు।
యద్దీదయచ్ఛవసర్త ప్రజాత తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్॥

ఓం భూర్భువస్సువః॥ బృహస్పతి గ్రహేహాగచ్ఛ। బృహస్పతి గ్రహం, కనకవర్ణం, కనకగంధం, కనకపుష్పం, కనక మాల్యాంబరధరం, కనకచ్ఛత్రధ్వజ పతాకాది శోభితం, దివ్యరథ సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, పూర్వాభిముఖం, పద్మాసనస్థం, చతుర్భుజం, దండాక్షమాలాధారిణం, సింధుద్వీప దేశాధిపతిం, ఆంగీరసగోత్రం, సౌమ్య సంవత్సరాశ్వయుజమాస శుక్ల ద్వాదశ్యాం ధనిష్ఠానక్షత్రజాతం, ధనుర్మీనరాశ్యాధిపతిం, గురువా ప్రయుక్తం, కిరీటినం, సుఖాసీనం, పత్నీపుత్ర పరివార సమేతం గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్యోత్తర దిగ్భాగే, దీర్ఘచతురస్ర మండలే, బృహస్పతి గ్రహమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అధిదేవత - బ్రహ్మా:-**

మంత్రం:- బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్వి సీమతస్సురుచో వేన ఆవః।
సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠా స్సతశ్చయోనిమసతశ్చవివః॥

బృహస్పతి గ్రహాధి దేవతాం బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం బృహస్పతి గ్రహస్య దక్షిణతః బ్రహ్మాణమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధిదేవత - ఇంద్రః :- (ఋ-1మం-7సూ-10మంత్రం)**

**మంత్రం :-** ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః॥

బృహస్పతి గ్రహ ప్రత్యధిదేవతాం ఇంద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బృహస్పతి గ్రహస్య ఉత్తరతః ఇంద్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత గురుగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

**నైవేద్యం:-(పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)**

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంభృతం సఫలం దేవగృహ్యతాం సర్వదేవతాః॥

ఓం భూర్భువస్సువః భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి। తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం, "ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః। తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థాః అయనాయ విద్యతే।

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥

5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।
యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః।
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽ ధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయనతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యోఽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యోఽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

28. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

30. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

32. యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥

33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।
ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥

34\. వాతాద్విష్ణోర్బల మాహుః అక్షరా దీప్తిరుచ్యతే।
త్రిపదాద్ధారయద్దేవః యద్విష్ణోరేకముత్తమమ్॥

35\. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥

36\. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః దివీవ చక్షురాతతమ్॥

37\. తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥

38\. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

39\. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత గురుగ్రహ దేవతాభ్యోనమః దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారంః-** గురుగ్రహ దేవతాభ్యో నమః ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోళికామారోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునఃనీరాజనం:-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యధాశరణం నాస్తి
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥

గురుగ్రహదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనాము నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోఽచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

ఉద్వాసన:- "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేవానాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

గురుగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటప ముతో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత గురుగ్రహ దేవతా సుప్రీత సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥ గణపతిపూజ చేసి

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజ చేసి తరువాత కుజగ్రహజపము చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటుంటే "మమ" అని చెప్పాలి. "యాజమానస్య" అని చెప్పకూడదు. ఒకరు మరొకరికోసం జపం చేస్తుంటే "యాజమానస్య" అని చెప్పాలి. "మమ" అని చెప్పకూడదు.)

గురుగ్రహ జపం :-

బృహస్పతే అతియదర్యేత్యస్య మంత్రస్య। గృత్సమద ఋషిః।
బృహస్పతిగ్రహో దేవతా। త్రిష్టుప్ఛందః।
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత బృహస్పతి గ్రహ ప్రసాదేన (మమ) యజమానస్య సర్వాభీష్ట సిద్ధ్యర్థం బృహస్పతి మంత్రజపం కరిష్యే.

**కరన్యాసము :-**

బృహస్పతే అతియదర్యో అర్హాత్ - అంగుష్ఠాభ్యాన్నమః.
ద్యుమద్విభాతి - తర్జనీభ్యాన్నమః.
క్రతుమజ్జనేషు - మధ్యమాభ్యాన్నమః.
యద్దీదయచ్ఛవసర్త - అనామికాభ్యాన్నమః.
ప్రభాత తదస్మాసు - కనిష్ఠికాభ్యాన్నమః.
ద్రవిణం దేహిచిత్రం - కరతల కరపృష్ఠాభ్యాన్నమః.

**హృదయాదిన్యాసము :-**

బృహస్పతే అతియదర్యో అర్హాత్ - హృదయాయ నమః
ద్యుమద్విభాతి - శిరసేస్వాహా.
క్రతు మజ్జనేషు - శిఖాయై వషట్.
యద్దీ దయచ్ఛవసర్త - కవచాయ హుం.
ప్రభాత తదస్మాసు - నేత్రత్రయాయ వౌషట్.
ద్రవిణం దేహిచిత్రం - అస్త్రాయ ఫట్.

భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

**ధ్యానం :-**

సౌమ్యే సుదీర్ఘే చతురస్రపీఠే రథేంగిరాః ఉదఙ్ముఖ స్వభావః ।
దండాక్షమాలా జలపాత్రధారీ సింధ్వాఖ్యదేశే వరదస్సురేశః ॥

**మంత్రం :-**

బృహస్పతే అతియదర్యో అర్హాద్ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు ।
యద్దీదయచ్ఛ వసర్త ప్రభాత తదస్మాసు ద్రవిణం దేహి చిత్రమ్ ॥

**అధిదేవతా (బ్రహ్మ) :-**

బ్రహ్మజ జ్ఞానం ప్రథమం పురస్తాద్విసీ మతస్సురుచోవేన ఆవః ।
సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠా స్సతశ్చయోని మసతశ్చ వివః ॥

**ప్రత్యధిదేవతా (ఇంద్ర) :-**

ఇంద్ర వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః
అస్మాకమస్తు కేవలః ॥

(అని చెప్పిన తర్వాత మూల మంత్రాన్ని 16,000 జపము చేసి తర్వాత మళ్ళీ ఒకసారి అధిదేవతా ప్రత్యధిదేవతా మంత్రాలను చెప్పి)

(మమ) యాజమానస్య బృహస్పతి గ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు.

(అని చెప్పి ఉద్ధరణితో నీళ్ళను పళ్ళెములో వదలాలి.)

# గురుగ్రహ మంత్ర తర్పణము

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతి పూజ చేయాలి. (ఇచట సంకల్పంలో జలతర్పణం కరిష్యామి అని చెప్పుకోవాలి)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి.

తర్పణము చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మన ముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

గురు గ్రహముకు సంబంధించిన "ధ్యానము"ను ఏకాగ్రతగా స్మరించాలి.

ఉద్ధరణిలోకి నీటిని తీసుకొని, గురుగ్రహ మంత్రమును చదవాలి. తరువాత "గుర్వాయ తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి. ఉద్ధరిణిలో నీటిని తీసుకొని తరువాత గ్రహ అధిదేవతా మంత్రమును చదివి "గురుగ్రహస్య అధిదేవతా: తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరణిలోకి నీటిని తీసుకొని ప్రత్యధి దేవత మంత్రమును చదవాలి. తరువాత "గురుగ్రహస్య ప్రత్యధిదేవతా తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 1600 సార్లు తర్పణము చేయాలి. మరల గ్రహ అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను చదవాలి.

"గురు గ్రహ ప్రసాదేనమమ ఆరోగ్యసిద్ధిరస్తు సర్వాభీష్ట సిద్ధిరస్తు" అని నీటిని పళ్ళెములో ధారపోయాలి

జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు "మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ" స్థానంలో "యాజమానస్య" అని చెప్పాలి.

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత, ప్రత్యధిదేతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రములకు హోమం చేయాలి.

పునర్వసు : అదిత్యై స్వాహా᳚ పునర్వసుభ్యాగ్ం స్వాహా᳚

భూత్యై స్వాహా᳚ ప్రజాపత్యై స్వాహా᳚ ॥

భూత్యై స్వాహా᳚ ప్రజాపత్యై స్వాహా᳚ ॥ పునర్వసుభ్యాగ్స్మైదం నమమ ॥ (108 సార్లు)

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత పునర్వసుభ్యాగ్స్మైదం నమమ

విశాఖ : ఇంద్రాగ్నిభ్యాగ్ంస్వాహా । విశాఖాభ్యాగ్ంస్వాహా । త్రైష్ఠ్యాయస్వాహా । అభిజిత్యైస్వాహా ॥

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత విశాఖాభ్యాగ్ం స్వాహేదం న మమ॥ (108 సార్లు)

పూర్వాభాద్ర: అజాయైక పదేస్వాహా । ప్రోష్ఠ పదేభ్య స్వాహా

తేజసేస్వాహా, బ్రహ్మవర్చసాయ స్వాహా ॥

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత పూర్వాభాద్రాభ్యైదం నమమ ॥ (108 సార్లు)

ప్రతి గ్రహమునకు హోమం చేయాలి. గురుగ్రహ మంత్రమును దాని అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి శనగలు, రావి పుల్లలు, ఆవునేయి హోమంలో వేయాలి. ఈ విధంగా 160సార్లు గురు మూలమంత్రము, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు, ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత, ప్రాయశ్చిత్త హోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము, ఆగ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన, మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధన చేసి పెద్దల ఆశీర్వాదమును పొందాలి.

గురుగ్రహ హోమంలో మార్జన 16 సార్లు చేయాలి. కనీసం 16 మందికి భోజనం పెట్టాలి.

## 106. స్మరణం
## గురుగ్రహ మంత్రాలు (జపం)

గ్రహజపం చేయులేనివారు, గురుగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

1. ఓం ఐం హ్రీం శ్రీం క్లీం ఐం సౌఃగ్రైం గురవే నమః
2. ఓం హ్రీం శ్రీం బ్లీం ఐం గ్లౌం గ్రహాధిపతయే బృహస్పతయే వీం ఠః శ్రీం ఠః స్వాహా.
3. ఓం ఐం క్లీం బృహస్పతయే నమః
4. ఓం ఐం ఓం సురగురో అభీష్టం యచ్ఛ యచ్ఛ స్వాహా
5. ఓం బృం బృహస్పతయే నమః
6. ఓం గ్రాం గ్రీం గ్రౌం బృహస్పతయే నమః
7. ఓం జాం జీం జూం సం బృహస్పతయే నమః
8. ఓం కం లం ఈం ఏం బృహస్పతి గ్రహాయ హ్రీం సర్వారిష్టాన్నాశయ

నాశయ స్వాహా ఐం ఓం.

9. ఓం ఐం హ్రీం సురగురో అభీష్టం యచ్ఛ యచ్ఛ శ్రీం శ్రీం ఐశ్వర్యం దేహి దేహి స్వాహా.

## గురుగాయత్రీ మంత్రాలు

1. ఓం వృషభధ్వజాయ విద్మహే క్రుణి హస్తాయ
   ధీమహి। తన్నో గురుః ప్రచోదయాత్ ॥
2. ఓం సురాచార్యాయ విద్మహే, వాచస్పత్యాయ
   ధీమహి। తన్నో గురుః ప్రచోదయాత్ ॥
3. ఓం ఆంగీరసాయ విద్మహే, దివ్యదేహాయ
   ధీమహి। తన్నో గురుః ప్రచోదయాత్।
4. ఓం గురుదేవాయ విద్మహే, పరబ్రహ్మణే
   ధీమహి। తన్నో గురుః ప్రచోదయాత్ ॥

5 శివుని జపించినా గురువు (బృహస్పతి)ని జపించినట్లే కనుక ఓం నమః శివాయ, ఓం శిం శివాయ నమః.

## గురుఅష్టోత్తర శతనామావళి

దేవానాం చ ఋషీణాంచ గురుం కాంచనసన్నిభం
బుద్ధిమంతంత్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోపహార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

**అనుకూల సమయం :-**

గురుని అనుగ్రహం పొందాలనుకువారు గురుగ్రహ జప హోమం చేసి, సమారాధన చేయుట ఉత్తమము. ఆ విధంగా చేయలేనివారు గురునికోసం సూచించిన ఏ మంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది. అదేవిధంగా గురుని స్తోత్రము చేయాలి.

గురునకు అనుకూలమైన వారము గురువారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యంలోని నక్షత్రాలు పునర్వసు, విశాఖ, పూర్వాభాద్రలున్న దినములు అనుకూలమైనవే. పూర్ణిమ, ద్వాదశి గురువుకు అనుకూలించు తిధులు. ముఖ్యంగా ఆషాఢ పౌర్ణమి, ఆశ్వయుజ శుక్ల ద్వాదశి ఉత్తమమైనవి. ఈ సమయాలలో ప్రత్యేకంగా గురుని పూజించుట శుభకరము.

దత్తజయంతి, బ్రహ్మంగారి ఆరాధన భక్తిశ్రద్ధలతో జరిపిన గురుని అనుగ్రహం కలుగుతుంది. అనఘావ్రతం, గురువారవ్రతం జరిపిన ధనలాభం కలుగుతుంది.

గురుని పూజించునపుడు దీపారాధనకు పసుపురంగు వస్త్రంతో చేసిన వత్తిని వాడుట ఉత్తమం. పూజకు లడ్లు, మైసూరుపాకం, శనగగుగ్గిళ్ళును ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలు లేదా పేదవారికి మామిడిపండ్లు, జామపండు, పనసపళ్ళు, శనగలు, తీయని గుమ్మడికాయలు, పసుపు, పుస్తకాలు, పసుపురంగు వస్త్రములు వంటి గురునికి సంబంధించిన ద్రవ్యములు దానం చేయాలి.

ప్రతిరోజు వీరబ్రహ్మేంద్రస్వామి చరితము, గురుచరిత్ర, శివసహస్ర నామావళి పఠించాలి.

# 107. ఆరాధనం

## గురుగ్రహ స్తోత్రం

క్రింది స్తోత్రములలో ఒకదానిని ప్రతిదినం పఠించిన గురుగ్రహానుగ్రహం పొందవచ్చును.

**శ్రీభగవానువాచ :-**

బృహస్పతిస్సురాచార్యోదయావాన్ శుభలక్షణః
లోకత్రయగురుశ్శ్రీమాన్ సర్వజ్ఞస్సర్వకోవిదః
సర్వేశః సర్వదాభీష్టః సర్వజిత్ సర్వపూజితః,
అక్రోధనో మునిశ్రేష్ఠో నీతికర్తా గురుఃపితా
విశ్వాత్మా విశ్వకర్తా చ విశ్వయోని రయోనిజః
భూర్భువస్సువరోంచైవ భర్తా చైవ మహాబలః

**ఫలశ్రుతి :-**

పంచవింశతినామాని పుణ్యాని నియతాత్మనా
నందగోప గృహాసీన విష్ణునా కీర్తితాని వై
ప్రాతరుత్థాయ పఠితాఽఽ ఽవర్తయేత్సుసమాహితః
విపరీతోఽపి భగవాన్ ప్రీతస్తస్య బృహస్పతి
యశ్శృణోతి గురుస్తోత్రం చిరంజీవీ నసంశయః
గోసహస్ర ఫలం తస్య విష్ణుర్వచనమబ్రవీత్
బృహస్పతికృతా పీడా న కదాచిద్భవిష్యతి

ఇతి శ్రీ విష్ణుధర్మోత్తరపురాణే బృహస్పతిస్తోత్రం సంపూర్ణమ్

# గురుగ్రహ అష్టోత్తర శతనామస్తోత్రమ్

గురుర్గుణవరో గోప్తా గోచరో గోపతిప్రియః ।
గుణీ గుణవతాం శ్రేష్ఠో గురూణాం గురురవ్యయః ॥ 1

జేతా జయంతో జయదో జీవోఽనంతో జయావహః ।
అంగీరసో-ధ్వరాసక్తోవివిక్తోఽధ్వరకృత్పరః ॥ 2

వాచస్పతి ర్వశీ వశ్యోవరిష్ఠో వాగ్విచక్షణః ।
చిత్తశుద్ధికర శ్రీమాన్ చైత్ర శ్చిత్రశిఖండిజః ॥ 3

బృహద్రథోబృహద్భానుః బృహస్పతిరభీష్టదః ।
సురాచార్యస్సురారాధ్యస్సుర కార్యహితంకరః ॥ 4

గీర్వాణపోషకో ధన్యో గీష్పతిర్గిరిశో-నఘః ।
ధీవరో ధిషణో దివ్యభూషణో దేవపూజితః ॥ 5

ధనుర్ధరోదైత్య హన్తా దయాసారో దయాకరః ।
దారిద్ర్యనాశకో ధన్యో దక్షిణాయనసంభవః ॥ 6

ధనుర్మీనాధిపో దేవో ధనుర్బాణధరోహరిః ।
అంగీరసాబ్దసంజాత ఆంగీరసకులోద్భవః ॥ 7

సింధుదేశాధిపోధీ మాన్స్వర్ణ వర్ణశ్చతుర్భుజః
హేమాంగదో హేమవపు ర్హేమ భూషణ భూషితః ॥ 8

పుష్యనాథః పుష్యరాగ మణిమండన మండితః ।
కాశపుష్ప సమానాభః కలిదోష నివారకః ॥ 9

ఇంద్రాధిదేవో దేవేశో దేవతాభీష్టదాయికః ।
అసమాన బలస్సత్త్వగుణ సంపద్విభాసురః ॥ 10

భూసురా భీష్టదో భూరియశః పుణ్యావివర్ధనః ।
ధర్మరూపో ధనాధ్యక్షో ధనదో ధర్మపాలనః ॥ 11

సర్వవేదార్థ తత్వజ్ఞ సర్వాపద్వినివారకః ।
సర్వపాపప్రశమన స్స్వమతాను గతామరః ॥ 12

ఋగ్వేద పారగో ఋక్షరాశి మార్గ ప్రచారకః ।
సదానంద స్సత్యసంధ స్సత్యసంకల్పమానసః ॥ 13

సర్వాగమజ్ఞ స్సర్వజ్ఞో సర్వవేదాంత విద్వరః ।
బ్రహ్మపుత్రో బ్రాహ్మణేశో బ్రహ్మవిద్యావిశారదః ॥ 14

సమానాధిక నిర్ముక్త స్సర్వలోక వశం వద: ।
స సురాసుర గంధర్వ వందిత స్సత్యభాషణ: ॥ 15
నమస్సురేంద్ర వంద్యాయ దేవాచార్యాయతే నమ:
నమస్తే నంత సామర్థ్య వేద సిద్ధాంత పారగ: ॥ 16

## శ్రీబృహస్పతి (గురు) స్తుతి

సదానంద నమస్తేస్తు నమ: పీడాహరాయ చ ।
నమో వాచస్పతే తుభ్యం నమస్తే పీత వాససే ॥ 1
నమోఽ ద్వితీయరూపాయ లంబ కూర్చాయతే నమ: ।
నమ: ప్రహృష్టనేత్రాయ విప్రాణాం పతయే నమ: ॥ 2
నమో భార్గవ శిష్యాయ విపన్నహిత కారిణే ।
నమస్తే సుర సైన్యానాం విపత్తి త్రాణ హేతవే ॥ 3
బృహస్పతి స్సురాచార్యో దయావాన్ శుభలక్షణ: ।
లోకత్రయ గురు: శ్రీమాన్ సర్వవస్సర్వతో విభు: ॥ 4
సర్వేశ స్సర్వదాహృష్ట స్సర్వగ స్సర్వ పూజిత: ।
అక్రోధనో మునిశ్రేష్ఠో నీతి కర్తా జగత్పితా ॥ 5
విశ్వాత్మా విశ్వకర్తాచ విశ్వయోని రయోనిజ: ।
భూర్భువో ధనదాతా చ భర్తా జీవో మహాబల: ॥ 6
బృహస్పతి స్సురాచార్యో దేవాసుర ప్రపూజిత: ।
ఆచార్యో దానవారిశ్చ సురమంత్రీ పురోహిత: ॥ 7
కాలజ్ఞ: కాలఋగ్వేత్తా చిత్త గశ్చ ప్రజాపతి: ।
విష్ణు: కృష్ణ స్తథా సూక్ష్మ: ప్రతిదేవో జ్జ్వలగ్రహ: ॥ 8
బృహస్పతి: కాశ్యపేయో దయావాన్ శుభలక్షణ: ।
అభీష్ట ఫలద: శ్రీమాన్ శుభగ్రహ నమోస్తుతే ॥ 9

గురుశ్లోకం : దేవానాం చ ఋషీణాం చ గురుం కాంచన సన్నిభం ।
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం ॥

## గురు ధ్యానం

1. వరాక్ష మాలాం దండం చ కమండలధరం విభుం
పుష్యరాగాంకితం పీతం వరదం భావయేత్ గురుం ॥

2. బృహస్పతే అతియదర్యో అర్హాద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు ।
యద్దీద యచ్ఛవ సర్తప్రజాత తదస్మా సుద్రవిణం ధేహిచిత్రం ॥

# 108. అభినందనం

క్రింది నామములతో గురు గ్రహయంత్రమును తరచు పూజించిన గురుగ్రహానుగ్రహం కలుగుతుంది.

**ప్రతినామమునకు ముందు 'ఓం' అని చివర 'నమః' అని చదువుకొనవలెను.**

| | | |
|---|---|---|
| ఓం గురవే నమః | చిత్తశుద్ధికరాయ | ధన్యాయ |
| గుణవరాయ నమః | శ్రీమతే | ధక్షిణాయనసంభవాయ |
| గోప్త్రే | చైత్రాయ | ధనుర్మీనాధిపాయ |
| గోచరాయ | చిత్రశిఖండిజాయ | దేవాయ |
| గోపతిప్రియాయ | బృహద్రథాయ | ధనుర్బాణధరాయ |
| గుణినే | బృహద్భానవే | హరయే |
| గుణవతాంశ్రేష్ఠాయ | బృహస్పతయే | అజ్గీరసాబ్దసంజాతాయ |
| గురూణాంగురవే | అభీష్టదాయ | అజ్గీరసకులోద్భవాయ |
| అవ్యయాయ | సురాచార్యాయ | సిన్ధుదేశాధిపాయ |
| జైత్రే | సురారాధ్యాయ | ధీమతే |
| జయంతాయ | సురకార్యహితంకరాయ | స్వర్ణవర్ణాయ |
| జయదాయ | గీర్వాణపోషకాయ | చతుర్భుజాయ |
| జీవాయ | ధన్యాయ | హేమాంగదాయ |
| అనంతాయ | గీష్పతయే | హేమవపుషే |
| జయావహాయ | గిరిశాయ | హేమభూషణభూషితాయ |
| అంగీరసాయ | అనఘాయ | పుష్యనాథాయ |
| అధ్వరాసక్తాయ | ధీవరాయ | పుష్యరాగమణిమణ్డన |
| వివిక్తాయ | ధిషణాయ | మణ్డితాయ |
| అధ్వర్యకృతే | దివ్యభూషణాయ | కాశపుష్పసమానాభాయ |
| పరాయ | దేవపూజితాయ | కలిదోషనివారకాయ |
| వాచస్పతయే | ధనుర్ధరాయ | ఇన్ద్రాధిదేవాయ |
| వశినే | దైత్యహంత్రే | దేవేశాయ |
| వశ్యాయ | దయాసారాయ | దేవతాభీష్టదాయకాయ |
| పరిష్ఠాయ | దయాకరాయ | అసమానబలాయ |
| వాగ్విచక్షణాయ | దారిద్ర్యనాశకాయ | సత్త్వగుణసమ్పద్విభాసురాయ |

భూసురాభీష్టదాయ
భూరియశసే
పుణ్యవివర్ధనాయ
ధర్మరూపాయ
ధనాధ్యక్షాయ
ధనదాయ
ధర్మపాలనాయ
సర్వవేదార్థతత్వజ్ఞాయ
సర్వాపద్వినివారకాయ
సర్వపాపప్రశమనాయ
స్వమతానుగతామరాయ
ఋగ్వేదపారగాయ
ఋక్షరాశిమార్గప్రచారకాయ
సదానన్దాయ
సత్యసఙ్కల్పమానసాయ
విశ్వాత్మనే
విశ్వకర్త్రే
విశ్వయోనయే
అయోనిజాయ
భూర్భువాయ
ధనదాత్రే
భర్త్రే
జీవాయ
మహాబలాయ
బృహస్పతయే
కాశ్యపేయాయ
దయావతే
శుభలక్షణాయ
అభీష్టఫలదాయ
శ్రీమతే
శుభగ్రహాయ
బృహస్పతయే
సురాచార్యాయ
దేవాసురసుపూజితాయ
ఆచార్యాయ
దానవారయే
సురమన్త్రిణే
పురోహితాయ
కాలజ్ఞాయ
కాలఋగ్వేత్రే
చిత్తగాయ
ప్రజాపతయే
విష్ణవే
కృష్ణాయ
సూక్ష్మాయ
ప్రతిదేవోజ్జ్వలగ్రహాయ
శ్రీబృహస్పతయే

## 109. అభినుతి

గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. గురుగ్రహదేవతను కీర్తించండి.

## గురుగ్రహ కవచం

అస్య శ్రీబృహస్పతికవచస్తోత్ర మహామంత్రస్య ఈశ్వర ఋషిః, అనుష్టుప్ ఛందః, బృహస్పతిర్దేవతా, అంబీజం, శ్రీం శక్తిః, క్లీం కీలకం, మమబృహస్పతి ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః గాంఅంగుష్ఠాభ్యాం నమఃగీం తర్జనీభ్యాం నమః, గూం మధ్యమాభ్యాం నమః, గైం అనామికాభ్యాం నమః, గౌంకనిష్ఠి కాభ్యాం నమః , గః కరతలకరపృష్ఠాభ్యాం నమః, ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సు వరోమితి దిగ్బంధః,

**ధ్యానమ్ :-**

తప్తకాంచనవర్ణాభం చతుర్భుజసమన్వితం ।
దండాక్షసూత్ర మాలాంచ కమండలు వరాన్వితమ్ ॥

పీతాంబరధరం దేవంపీత గంధానులేపనం ।
పుష్పరాగమయం భూష్ణుం విచిత్రమకుటోజ్జ్వలమ్ ॥ 2
స్వర్ణా శ్వరథమారూఢం పీతధ్వజసుశోభితం ।
మేరుం ప్రదక్షిణం కృత్వా గురుదేవం సమర్చయేత్ ॥ 3
అభీష్టవరదం దేవం సర్వజ్ఞం సురపూజితం ।
సర్వకార్యార్థసిద్ధ్యర్థం ప్రణమామి గురుం సదా ॥ 4
బృహస్పతిశ్శిర: పాతులలాటం పాతుమేగురు: ।
కర్ణౌ సురగురు:పాతు నేత్రే మే-భీష్టదాయక: ॥ 5
నాసాం పాతు సురాచార్యో జిహ్వాం మే వేదపారగ: ।
ముఖం మే పాతు సర్వజ్ఞో భుజౌపాతు శుభప్రద: ॥ 6
కరౌవజ్రధర: పాతు పక్షౌ మే పాతు గీష్పతి: ।
స్తనౌ మే పాతు వాగీశ: కుక్షిం మే శుభలక్షణ: ॥ 7
నాభింపాతు సునీతిజ్ఞ: కటిం మే పాతు సర్వద: ।
ఊరూ మే పాతు పుణ్యాత్మా జంఘే మే జ్ఞానద: ప్రభు: ॥ 8
పాదౌ మే పాతు విశ్వాత్మాసర్వాంగం సర్వదాగురు: ।
య ఇదం కవచం దివ్యం త్రిసంధ్యాసు పఠేన్నర: ॥ 9
సర్వాన్‌కామానవాప్నోతి సర్వత్ర విజయీ భవేత్ ।
సర్వత్ర పూజ్యోభవతి వాక్పతేశ్చ ప్రసాదత: ॥ 10

ఇతి బ్రహ్మవైవర్తపురాణే ఉత్తరఖండే బృహస్పతికవచ: సంపూర్ణ:

## 110. అభివందనం

గురుగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. గురు గ్రహదేవతను కీర్తించండి.

## వామనావతార స్తుతి

నామస్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదానృహరే ॥
భవబంధన హర వితతమతే పాదోదక విహతాఘతతే ।
వటుపటు వేష మనోజ్ఞ నమోభక్తం తే పరిపాలయమాం ॥

## గురుగ్రహ మంగళాష్టకం

జీవశ్చాంగిరస గోత్ర జోత్తరముఖో దీర్ఘోత్తరా శాస్థిత: ।
పీతోశ్వత్థసమిచ్చ సింధుజనితశ్చాపోఽథమీనాధిప:
సూర్యేందు క్షితిజా:ప్రియా: బుధ సితౌ శత్రూసమాశ్చాపరే
సప్తద్వేనవపంచమేశుభకర: కుర్యాత్సదా మంగళం ॥

## గురుగ్రహస్తోత్ర కీర్తన

రచన : ముత్తుస్వామి దీక్షితార్

రాగం : అఠాణా త్రిశ్రగతి తాళం : త్రిపుట

పల్లవి : బృహస్పతే - తారాపతే బ్రహ్మజాతే - నమోస్తుతే ॥బృహ॥

అనుపల్లవి : మహాబలవిభో గీష్పతే మంజు ధనుర్మీనాధిపతే
మహేంద్రా ద్యుపాసితా కృతే మాధవాది వినుత ధీమతే ॥బృహ॥

1.చరణం : సురాచార్యవర్య వజ్రధర శుభలక్షణ జగత్త్రయ గురో
జరాది వర్జితా క్రోధ కచ జనకాశ్రిత జన కల్పతరో ॥బృహ॥

2 చరణం : పురారి గురు గుహ సంమోదిత పుత్రకారక దీనబంధో
పరాది చత్వారి వాక్ స్వరూప ప్రకాశక దయాసింధో ॥బృహ॥

3 చరణం : నిరామయాయ నీతి కర్త్రే నిరంకుశాయ విశ్వభర్త్రే
నిరంజనాయ భువన భోక్త్రే నిరంశాయ సుఖప్రదాత్రే ॥బృహ॥

# 111. గురుగ్రహానుగ్రహం కోసం ప్రత్యేక స్తోత్రాలు

## శ్రీ శివనవరత్న స్తవః (శ్రీబృహస్పతికృతః)

నమో హరాయ దేవాయ మహామాయాయాతి శూలినే ।
తాపసాయ మహేశాయ తత్త్వజ్ఞాన ప్రదాయినే ॥ 1

నమో మౌంజాయ శుద్ధాయ నమః కారుణ్య మూర్తయే ।
నమో దేవాదిదేవాయ నమో వేదాంత దాయినే ॥ 2

నమః పరాయ రుద్రాయ సుపారాయ నమోనమః ।
విశ్వమూర్తే మహేశాయ విశ్వధారాయ తే నమః ॥ 3

నమో భక్త భవచ్ఛేద కారణా యామలాత్మనే ।
కాలకాలాయ కాలాయ కాలాతీతాయ తే నమః ॥ 4

జితేంద్రియాయ నిత్యాయ జిత క్రోధాయ తే నమః ।
నమః పాషండ భంగాయ నమః పాపహరాయ తే ॥ 5

నమః పర్వత రాజేంద్ర కన్యకా పతయే నమః ।
యోగానందాయ యోగాయ యోగినాం పతయే నమః ॥ 6

ప్రాణాయామ పరాణాంతు ప్రాణరక్షాయ తే నమః ।
మూలాధారే ప్రవిష్టాయ మూలదీపాత్మనే నమః ॥ 7

నాభికందే ప్రవిష్టాయ నమో హృద్దేశ వర్తినే ।
సచ్చిదానంద పూర్ణాయ నమ స్సాక్షా త్పరాత్మనే ॥ 8

నమశ్శివాయాద్భుత విక్రమాయ తే నమశ్శివా యద్భుత విగ్రహాయ తే।
నమ శ్శివా యాఖిల నాయకాయ తే నమశ్శివా యామృత హేతవే నమః 9

## 112. యంత్రస్థాపనం

గురుగ్రహానుగ్రహం కోసం

ఒక రాగిరేకుకు ఇరువైపుల క్రింది యంత్రమును వ్రాయించి, దానిని పూజించాలి.

| | | |
|---|---|---|
| 10 | 5 | 12 |
| 11 | 9 | 7 |
| 6 | 13 | 8 |

| | | |
|---|---|---|
| 10 | 11 | 6 |
| 5 | 9 | 13 |
| 12 | 7 | 8 |

పై యంత్రమును "ఓం గ్రాం గ్రీం గ్రౌం ఐం సః బృహస్పతయే నమః" అను మూలమంత్రమును 30,000 సార్లు జపిస్తూ పూజించాలి.

**బీజాక్షర సహిత గురు యంత్రం :-**

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై చెక్కించి, దానిని "ఓం బృం బృహస్పతయే నమః" అను మంత్రమును 3 లక్షల సార్లు జపిస్తూ పూజించాలి. ఆరోగ్యం కొరకు, పీడలు తొలగించుటకు, ధనప్రాప్తికోసం ఈ యంత్రము ఉపయోగపడుతుంది.




## గురుయంత్రం (భృగు సంహిత)

ఈ క్రింది యంత్రాన్ని రాగిరేకుపై చెక్కించి, దానిని "ఓం గ్రాం గ్రీం గ్రౌం సః బృహస్పతయే నమః" అను మంత్రమును 30,000 సార్లు జపిస్తూ పూజించాలి. దీనిని స్థాపించిన వ్యాపారంలో లాభం కుటుంబంలో సుఖశాంతులు లభిస్తాయి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 15 | 28 | 29 | 30 | 32 | 31 | |
| 14 | 6 | 13 | 10 | 16 | 17 | 27 |
| 11 | 22 | 1 | 9 | 21 | [illegible] | |
| 23 | 5 | 4 | 12 | 2 | 7 | 20 |
| 26 | 24 | 25 | 3 | 18 | 19 | |

# 113. శుక్రుడు - ఒక వీక్షణ

| | | | |
|---|---|---|---|
| 1. | ఇతరనామాలు | - | కావ్యుడు, సితుడు, భృగు సుతుడు, దానవా చార్యుడు, ఉశనుడు |
| 2. | లింగము | - | స్త్రీ గ్రహము |
| 3. | జాతి | - | బ్రాహ్మణ జాతి |
| 4. | రంగు | - | తెలుపు |
| 5. | తత్త్వము | - | జలతత్త్వము |
| 6. | గ్రహస్వభావము | - | శుభగ్రహము |
| 7. | స్వభావము | - | లఘుస్వభావం |
| 8. | గుణము | - | రజోగుణము |
| 9. | రుచులు | - | పులుపు |
| 10. | గ్రహోదయము | - | శీర్ష |
| 11. | జీవులు | - | ద్విపాది |
| 12. | గ్రహస్థానము | - | శయనాగారము |
| 13. | ఆధిపత్యదిక్కు | - | ఆగ్నేయము |
| 14. | జలభాగం | - | జల |
| 15. | ఆత్మాధికారకత్వం | - | కామము |
| 16. | పాలనశక్తులు | - | మంత్రి |
| 17. | శరీరధాతువు | - | వీర్యము |
| 18. | లోహధాతువు | - | బంగారము |
| 19. | కుటుంబ సభ్యుడు | - | భార్య |
| 20. | గ్రహరూపవర్ణం | - | ధవళవర్ణం |
| 21. | గ్రహపీడ | - | సుఖరోగాలు |
| 22. | గ్రహవర్గం | - | శని |
| 23. | గృహభాగములు | - | పడకగది, తోట |
| 24. | కాల బలము | - | పగలు బలవంతుడు |
| 25. | దిగ్బలము | - | చతుర్థభావము |
| 26. | ఆధిపత్యకాలము | - | పక్షము |

27. స్వక్షేత్రము - వృషభము, తుల
28. శత్రుక్షేత్రము - కర్కాటకం, సింహం
29. మిత్రక్షేత్రము - మిథునం, మకరం, కుంభం
30. విషమక్షేత్రము - .....
31. సమక్షేత్రము - మేషము, మీనము
32. ఉచ్ఛరాశి - మీనం
33. నీచరాశి - కన్య
34. మూల త్రికోణము - తులలో 10వ డిగ్రీ వరకు
35. పరమ ఉచ్ఛ - మీనంలో 27వ డిగ్రీ
36. పరమ నీచ - కన్యలో 27వ డిగ్రీ
37. మిత్ర గ్రహాలు - బుధుడు, శని
38. శత్రుగ్రహాలు - రవి, చంద్రుడు
39. సమగ్రహాలు - కుజుడు, గురుడు
40. వ్యర్థ గ్రహము - బుధుడు
41. నైసర్గిక బలగ్రహము - కుజుడు
42. దిన చలనం - 1 డిగ్రీ
43. రాశిలో గ్రహం ఉండే కాలం - 1 నెల
44. రాశిలో ఫలమిచ్చేభాగం - రాశిలోమధ్య భాగం
45. గ్రహ ప్రకృతి - శ్లేష్మ, వాత తత్త్వములు
46. ఋతువు - వసంతఋతువు
47. దిగ్బలము - ఉత్తరమున బలవంతుడు
48. సూచించు ఎత్తు - మధ్యమము
49. సూచింపబడే వయస్సు - 7 సంవత్సరాలు
50. సూచించు ప్రాంతాలు - కృష్ణానది నుండి గోదావరి నది వరకు గల ప్రాంతాలు
51. నివాస ప్రాంతం - తోటలు, పచ్చని ప్రాంతాలు

52. సూచించబడే శరీరా - మూత్రపిండములు, సంతానోత్పత్తి వ్యవస్థ, అండము, వీర్యము
53. సూచించే శరీర వ్యాధులు - సుఖవ్యాధులు, సుగర్, టాన్సిల్స్, మూత్రపిండాల వ్యాధి, గడబిళ్ళల వ్యాధి
54. గోచారరీత్యా శుభస్థానములు - 3,6,11
55. గోచారరీత్యా అశుభస్థానములు - 1,2,4,5,7,8,9,10,12
56. గోచారరీత్యా వేధస్థానములు - 5,9,12
57. గ్రహదశా కాలము - 20 సంవత్సరములు
58. జీవన కారకత్వము - దాంపత్యం, స్త్రీ సౌఖ్యం
59. సంబంధించిన నక్షత్రాలు - పుబ్బ, పూర్వాషాఢ, భరణి
60. సూచించు వృక్షజాతి - పూల చెట్లు
61. సూచించు ధాన్యం - బొబ్బర్లు
62. సూచించు పండ్లు - అరటి
63. సూచించు పక్షులు - నెమలి, చిలుక
64. సూచించు జంతువులు - ఆవు, ఎద్దు, తెల్లని అశ్వము
65. సూచించు ఇతర ద్రవ్యములు - పంచదార, ఏలకులు, పాలు, పెరుగు, కర్పూరము, పూలు
66. సంబంధించిన సమిధ - మేడి
67. సంబంధించిన మూలిక - మేడి, ములువెంపలి
68. సూచించు వస్త్రము - చిరగని, దృఢమైన వస్త్రము
69. దేవవర్గము - శైవ
70. గ్రహగోత్రము - భార్గవ
71. వేదములు - యజుర్వేదము
72. శుభత్వం - పూర్ణ పాపి
73. అవతారం - పరశురామావతారము
74. గ్రహస్వరూపం - వంకీల జుట్టు, అందమైన కన్నులు కలవాడు, రుద్రాక్షమాలలు, దండములు, కమండలము ధరించినవాడు.
75. గ్రహ స్వరూప వర్ణం - ధవళవర్ణం
76. గ్రహారూఢ వాహనం - రథం

77. పూజార్థం గ్రహ ప్రతిమకు వాడవలసినది - వెండి
78. గ్రహప్రీతికి నైవేద్యం - నేయి కలిపిన అన్నము
79. అధిష్ఠాన దేవత - లక్ష్మీదేవి
80. అధిదేవత - ఇంద్రాణి
81. ప్రత్యధిదేవత - ఇంద్రమరుత్వంతుడు
82. గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు - దీపావళి
83. చేయవలసిన ప్రసాదము - అలచంద గుగ్గిళ్ళు, పటికబెల్లం
84. దోష నివారణకు దక్షిణ - అశ్వము
85. ప్రీతికరమైన తిథి - వైశాఖ శుక్ల తదియ
86. ఆచరించవలసిన వ్రతము - వరలక్ష్మీవ్రతం
87. పారాయణ చేయవలసిన పురాణాలు - వెంకటేశ్వర పురాణం శ్రీనివాస కళ్యాణం
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - శుక్రగ్రహ అష్టోత్తర శతనామావళి
89. పారాయణ చేయవలసిన సహస్రనామావళి - లక్ష్మీదేవి సహస్రనామావళి
90. ఆచరించవలసిన దీక్ష - శ్రీనివాసదీక్ష
91. ధరించవలసిన మాల - తామర మాల
92. ధరిచవలసిన రత్నము - వజ్రము
93. ధరించవలసిన రుద్రాక్ష - షణ్ముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - లక్ష్మీదేవి ఆలయం
95. చేయవలసిన పూజలు - వరలక్ష్మీవ్రతం
96. దానంచేయవలసిన ద్రవ్యములు - బొబ్బర్లు
97. గ్రహజప సంఖ్య - 20,000
98. హోమముకు వాడు సమిధ - మేడి
99. నవగ్రహమండపంలో గ్రహఆసనం - పంచకోణాకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 7వ రాశి.
101. గ్రహసంఖ్య - 9

102. గ్రహం సూచించు వారం - శుక్రవారం
103. శుభసమయం - అపరాహ్ణ సమయం
104. ప్రతినిధి గ్రహాలు - రాహు+కేతు
105. గ్రహం బలంగా ఉండే ఫలితం - స్త్రీ సౌఖ్యం, దాంపత్య సౌఖ్యం
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - పరస్త్రీ వ్యామోహం
107. తండ్రి - భృగువు
108. తల్లి - ఉష
109. భార్య - ఉర్జస్వణి
110. సూచించు లోహములు - వెండి
111. గ్రహప్రభావితుల మనఃస్థితి - శాంతము
112. భావకారకత్వం - కామము
113. గ్రహదృష్టి - కటాక్షదృష్టి
114. గ్రహమునకు గుర్తు - ♀
115. సంబంధించిన వృత్తి - విద్య
116. గ్రహజన్మ సంవత్సరం - మన్మథ
117. జన్మమాసం - శ్రావణం
118. జన్మతిథి - శుక్లదశమి
119. జన్మనక్షత్రం - పుష్యమి
120. ఆధిపత్యం వహించుదేశం - భోజకటకప్రదేశం
121. గ్రహఋషి - భరద్వాజుడు
122. గ్రహ ఛందస్సు - త్రిష్టుప్
123. పుట్టినవారం - శుక్రవారం

**సంబంధించిన వస్తువులు, పనులు :-**

బొబ్బర్లు, పాలు, పెరుగు, వెన్న, పంచదార, ఏలకులు, మిఠాయిలు, పూలు, సుగంధ ద్రవ్యములు, వెండి, బంగారం, సంగీతసాధనాలు, నృత్యకళాకారులు, గాయకులు, తెల్లటి గొడుగు, కర్పూరము, వజ్రము, అన్నదానం, లక్ష్మీదేవి ఆరాధన, రెడీమేడ్ వస్త్రాలు.

## 114. ఖగోళశాస్త్రపరంగా శుక్రుడు

శుక్రుడు సూర్యుని నుండి రెండవ గ్రహము, సూర్యుని కక్ష్య దాదాపు వృత్తాకారముగా ఉండును.

గ్రీకు ప్రజల ప్రకారము శుక్ర గ్రహాన్ని "అఫ్రొడైట్ (Aphrodite) అని పిలుస్తారు.

శుక్ర గ్రహము అందానికి, ప్రేమకు దేవతగా వారి నమ్మకం.

శుక్రగ్రహం ద్రవ్యరాశి సుమారు $4.869\times10^{24}$ కిలోగ్రాములు ఉంటుంది. ఇది భూమి పరిమాణంలో 9/10 వ వంతు. దీని కక్ష్య పొడవు సుమారు 10,82,00,000 కిలో మీటర్లు ఉంటుంది. శుక్ర గ్రహ వ్యాసము సుమారు 12,103.6 కిలోమీటర్లు సూర్యుని చుట్టూ పరిభ్రమించుటకు దీనికి సుమారు $1.94\times10^{7}$ సెకన్లు సమయం పడుతుంది.

శుక్రగ్రహము ఎంతో పురాతన కాలము నుంచి మనకు తెలుసు. సూర్య చంద్రుల తరువాత ఎక్కువ ప్రకాశముగా ఉండేది ఈ శుక్రగ్రహము.

శుక్ర గ్రహాన్ని రెండు రకాలుగా విడదీసారు. 1. ఇయోస్ఫరస్(Eosphorous) - పగటి నక్షత్రము 2. హెస్పరస్ (Hesperus) సాయంత్రపు నక్షత్రము.

శుక్రగ్రహము భూమి కన్నా కొంచెం చిన్న గ్రహము (95% భూమివ్యాసము, 80% భూమి ద్రవ్యరాశి) దీనిని భూమి చెల్లెలుగా పరిగణించవచ్చును. ఎందుకనగా భూమి మరియు శుక్రగ్రహాల సాంద్రత మరియు రసాయన మిళితములు అన్నీ దాదాపు ఒకటే.

శుక్రగ్రహ వాతావరణంలో దాని ఉపరితలం మీద 90 అట్మాస్ఫియర్ల పీడనం ఉంటుంది. దీని వాతావరణంలో ఎక్కువగా కార్బన్‌డైఆక్సైడ్ ఉంటుంది. కొన్ని కిలోమీటర్ల మందముతో సల్ఫ్యూరిక్ యాసిడ్ పొరలు పొరలుగా ఉండును. ఈ పొరలు వలన "గ్రీన్‌హౌస్ ఎఫెక్ట్" కలుగును. దీనివలన శుక్రగ్రహం ఉష్ణోగ్రత సుమారు $400^0$ కెల్విన్ నుండి $740^0$ కెల్విన్ వరకు ఉండును.

శుక్రగ్రహ ఉపరితలంలో సుమారు గంటకు 340 కిలోమీటర్ల వేగంతో గాలులు వీస్తుంటాయి.

శుక్రగ్రహములో ఉండే నీరు మొత్తము సూర్యుని ఉష్ణోగ్రత వలన ఆవిరి అయిపోయినది.

శాస్త్రజ్ఞుల పరిశోధన ప్రకారము శుక్రగ్రహ ఉపరితలం చాలావరకు లావాతో నిండి ఉన్నది. దీనిమీద చాలా పెద్ద పెద్ద అగ్నిపర్వతాలు కలవు.

ఉదాహరణకు సిఫ్‌మన్స్ (Sif Mons)

శుక్రగ్రహము ఎన్నో ఎత్తు పల్లాలతో కూడి ఉన్నది. ముఖ్యంగా దీని మీద రెండు ఎత్తైన ప్రదేశాలు కలవు. అవి 1. ఉత్తరభాగంలోని ఇష్ఫార్ భాగము (Ishfar Terra)

2. మధ్యరేఖ పొడవుగా ఉండే అఫ్రొడైట్

(Aphrodite Terra)

శుక్రగ్రహ అంతర్భాగము దాదాపు భూమి వలెనే ఉండును. శుక్రగ్రహము యొక్క కేంద్రము 3000 Km పొడవునా, కరిగిన ఇనుము మరియు ద్రవరూపంలో ఉండే శిలలను కలిగి ఉండును.

శుక్రగ్రహమునకు అయస్కాంతక్షేత్రము లేదు. మరియు దీనికి ఎటువంటి ఉపగ్రహములు లేవు.

శుక్రగ్రహమును ఎటువంటి టెలిస్కోపు సహాయం లేకుండా చూడవచ్చును. 2004, June 8న శుక్రగ్రహము భూమి మరియు సూర్యుని కక్ష్యల మధ్య గుండా పోయినది. దీనివలన సూర్యుని మీద నల్లని మచ్చలుగా కనిపించాయి దీనినే "Transit of Venus అని అందురు. ఇటువంటిది ఇదివరకు 1882లో గమనించారు. దీనిని చూడాలంటే మరల ఇది 2012, తరువాత 2117న చూడవచ్చును.

## 115. పురాణాల పరంగా శుక్రుడు

శుక్రుడు ధవళవర్ణపు శరీరకాంతి కలవాడు. నాలుగుభుజములు కలిగిన వాడు. నాలుగుభుజములు కలిగినవాడు. చేతిలో రుద్రాక్షమాల, కమండలము, దండములను ధరించును. రథమును అధిరోహించును. ఇతనికి కావ్యుడు, సితుడు, భృగుసుతుడు, దానవాచార్యుడు, ఉశనుడు, అను పేర్లు కలవు.

హిరణ్యకశిపుని కుమార్తె ఉష. భృగుమహర్షిని పెండ్లాడిన ఈమెకు ఒక కొడుకు జనించాడు. అతడిపేరు 'ఉశనుడు'.

శ్రీకృష్ణునిచే అనుగ్రహించబడిన కుచేలుడికి అపార ధన సంపత్తులు ప్రాప్తించడంతో అవి అపహరించబూనాడు ఉశనుడు. అది పరమేశ్వరునకు కోపం తెప్పించడంతో, శివుడాతనిని చంపుటకు ఉద్యుక్తుడైనాడు. దీంతో ఉశనుడు తన తపశ్శక్తివల్ల సాక్షాత్తు పరమశివుని ఉదరంలో తిష్ఠవేసి, ఈశ్వరుని స్తుతించసాగాడు.

బోళాశంకరునికి ఏం చెయ్యడానికీ పాలుబోక, శుక్రుడికి అభయం ఇచ్చి బైటకు రమ్మన్నాడు. అలా శుక్రుడు శివుని శిశ్నంలోంచి శుక్రరూపంలో బైటికి వచ్చాడు. పేరు సార్థకమై నిలబడిపోయింది.

మన్మథ సంవత్సర చైత్ర శుద్ధంలో మఘనక్షత్రం ఏకాదశి తిథియందుండగా శివుడాతని స్తుతికి మెచ్చి ధనవీర్యాలకు శుక్రుడిగా అవతరించాడు ఉశనుడు. శివుడాతని (అధిపతిని) చేసి గ్రహమండలంలో స్థానం అధిపతిగాను రాక్షసులకు గురువుగాను కల్పించాడు. ఏకాక్షి. అక్షమాల కమండలధారి.

శుక్రాచార్యుడు దానవకుల పురోహితుడు. శుక్రాచార్యుడు అసురుల అభ్యున్నతికై నేటివరకూ ఎవ్వరూ చేయలేనంత కఠోరమైన తపస్సు చేశాడు. ఈ తపస్సుతో పరమశివుని మెప్పించి, యుద్ధంలో దేవతలను జయించ గల శక్తిని, మృత్యుంజయ వరాన్ని పొందాడు.

శుక్రుడు సంపదలకేకాక ఔషధులు, మంత్రము, రసాలకూ అధిపతి. ఆయన శక్తి సామర్థ్యాలు అద్భుతం. ఇతడు తన సమస్త సంపదల్ని తన దానవ శిష్యుల కప్పగించి స్వయంగా తపోజీవనాన్ని స్వీకరించాడు.

బ్రహ్మప్రేరణతో శుక్రుడు గ్రహమై మూడు లోకాలను కాపాడసాగాడు. అప్పుడప్పుడు వానలను, అనావృష్టిని, భయాభయాలను ప్రసాదిస్తూ ప్రాణుల యోగక్షేమాల్ని చూసే కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ ఉంటాడు.

ఈయన గ్రహరూపంలో బ్రహ్మసభలో కొలువై వుంటాడు. ప్రాణులకు అనుకూలగ్రహం శుక్రుడు. వర్షాలను నిరోధించే గ్రహాలను శాంతపరుస్తూ ఉంటాడు.

శుక్రుడు, వృషభం మరియు తులారాశులకు అధిపతి. వీరి మహర్దశ ఇరవై సంవత్సరముల కాలం.

## 116. జ్యోతిష్యపరంగా శుక్రుడు

శుక్రుడు స్త్రీగ్రహం. ఇతను రుచులలో పులుపును, రంగులలో తెలుపు రంగును సూచించును. ఇతను బ్రాహ్మణ జాతికి చెందినవాడు. అధిదేవత ఇంద్రాణి, 7 సంవత్సరముల వయస్సు కలవారిని సూచించును. మనోహరమైన శరీరము, వల్లని వెంట్రుకలు కలవారిని, అందమైన వారిని సూచించును. ఇతను శ్లేష్మ, వాత తత్త్వమును సూచించును. జలతత్త్వము కలిగి ఆగ్నేయదిక్కును సూచించును. రత్నములలో వజ్రమును సూచించును. లోహములలో బంగారమును సూచించును. వసంతఋతువును సూచించును. ఈ గ్రహసంఖ్య 9. చతుర్థభావంలో దిగ్బలము పొందును. రజోగుణప్రధానమైన గ్రహము. కృష్ణానది నుండి గోదావరి వరకు ఇతని దేశంగా జాతక పారిజాతం సూచించును.

శుక్రుడు పుబ్బ, పూర్వాషాఢ, భరణి నక్షత్రములకు అధిపతి. శరీరావయవములలో మూత్రపిండములు, అండములు, వీర్యము, సంతానోత్పత్తి వ్యవస్థను సూచించును. శుక్రుడు వృషభము, తుల రాశులకు అధిపతి. తులలో 10వ డిగ్రీవరకు మూల త్రికోణము. ఇతనికి ఉచ్చరాశి మీనం. నీచరాశి కన్య. మీనంలో 27వడిగ్రీ పరమోచ్ఛ. కన్యలో 27వ డిగ్రీ పరమనీచ. ఇతనికి బుధశనులు స్నేహితులు. రవి, చంద్రులు శత్రువులు. కుజ, గురులు సములు. శుక్రదశ 20 సంవత్సరాలు.

**శుక్రుడు ప్రభావం :-**

అందమైనవారు, శరీరసౌష్టవం కలిగినవారు, సామాన్యంగా వీరికి బట్టతల యుండదు. సంగీతం అంటే ఆసక్తి ఎక్కువ. లలితకళలంటే ప్రీతి. జనాకర్షణ ఎక్కువ వీరికి సౌకుమార్యంచేత జనాకర్షణ వుంటుంది. ధనము, ఆహారము, గృహము సుఖములకు లోటు వుండదు. స్త్రీలోలత్వమును అదుపులో వుంచుకోవాలి. వీరు నటులు, గాయకులు.

వస్త్రములు, అలంకార సామగ్రి, పూలు వంటి వాణిజ్యమున రాణిస్తారు. రక్తపోటు, రక్తసంబంధమైన వ్యాధులు సుఖవ్యాధులు కలుగవచ్చు.

**కారకత్వములు :-**

శుక్రుడు కళత్ర కారకుడు. శారీరక సుఖము, యౌవనము, సౌందర్యము, రాజసము, వినోదములు, రతిక్రీడలు, జలవిహారము, స్త్రీ, ఐశ్వర్యము, భూషణములు, నాటకము, మన్మధుడు, భరతనాట్యము, కామము, వీర్యము, కావ్యరచరన, సంగీతము, వాహనములు, వస్త్రములు, శయనించు గది, వివాహము, గర్వము, తెల్లని వస్త్రములు, వాద్యముల సమ్మేళనం, సుగంధ ద్రవ్యములు, గౌరి, లక్ష్మీదేవి ఆలయములు, క్రీడాస్థలములు, పాలసరఫరా కేంద్రములు, పాలు, పాలకు సంబంధించిన వస్తువులు విక్రయించువారు, వస్త్రములను తయారు చేయు సంస్థలు, సౌందర్యసాధనములు, అలంకార ద్రవ్యములు, పరిమళద్రవ్యములు, వాటిని తయారు చేయు సంస్థలు, పెట్రోలు వాహనములు, వెండి, రత్నములను సూచించును. చెఱకురసము, తీయని పానీయములు బొబ్బర్లు, నిమ్మ, నారింజ, చింత మొదలగు వానిని సూచించును. అతిమూత్రవ్యాధి, చర్మవ్యాధి, కంటిరోగము గొంతుకు సంబంధించిన వ్యాధులు, సుఖవ్యాధులు, చర్మవ్యాధులను సూచించును.

శిల్పి, దర్జీ, స్త్రీ బ్యుటీషియన్, స్వీట్లు తయారు చేయువారు, స్నేహితులు, బహుమతులు, హనీమూన్, విలాసాలు, వినోదాలు, శృంగారము, ప్రేమ, ఆభరణాలు, రెడిమేడ్‌దుస్తులు, పంచదార, ఆనందమును అనుభవించుట, కాస్మెటిక్స్, పూలు, అలంకరణ, గృహాలంకరణ సాధనాలు, లౌక్యము, స్నేహము, లాభము, ఒప్పందము, ప్రేమ, అనురాగము, మమకారము, లలితకళలు, అందము, ఆకర్షణ, కేశాలంకరణ, సంగీతము, సాంస్కృతిక కార్యక్రమాలు, దానములు, పొగడ్తలు, పెళ్ళి, తెలివితేటలను సూచించును.

**శుక్రుడు సూచించు విద్యలు :-**

శుక్రుడు లలితకళలు, కావ్యములు, రసాయనశాస్త్రము, ఫొటోగ్రఫీ, సెక్స్‌సైన్స్‌లను సూచించును. గురుబుధులతోకలసి రేడియో, ట్రాన్సిస్టర్, టేపురికార్డర్, వైర్‌లెస్‌లు, వాటికి సంబంధించిన కోర్సులు, టెక్స్‌టైల్స్, సుగంధ ద్రవ్యములు, అలంకార సామగ్రి, వాటి తయారీకి సంబంధించిన నైపుణ్యము, టైలరింగ్, పెయింటింగ్ లను సూచించును. శుక్రుడు, కుజుడు, బుధుడు, చంద్రుడు కలసి ఆటోమొబైల్ ఇంజనీరింగ్, గోల్డ్‌స్మిత్‌లను సూచించును.

**శుక్రుడు సూచించు వ్యాధులు :-**

సుఖరోగాలు, కంటిజబ్బులు మూత్రంలో ఆల్బుమిన్ పోవుట, స్త్రీలకు సంబంధించిన తెల్లబట్ట, పసుపుబట్ట, ఋతుక్రమం సరిగాలేకపోవుట, అండము అండాశయములకు కలిగే జబ్బులు మొదలగు అన్నిరకాల వ్యాధులను శుక్రుడు సూచించును. కుజునితో కలసి గొంతునొప్పి, గొంతువాపు, టాన్సిల్స్, గొంతు కాన్సర్ మొదలగు గొంతుకు సంబంధించిన వ్యాధులను, శనితో కలసి మితిమీరిన సంభోగం వలన కలిగే వ్యాధులను, బుధునితో కలసి నపుంసకత్వం, కొజ్జాలతో సంభోగం, అసహజమైన శృంగార చేష్టలు, చర్మవ్యాధులు, మధుమేహంలను సూచించును. శుక్రుడు రాహువుతో కలసి సెక్స్‌వలన కలిగే అంటురోగాలను, కేతువుతో కలసి అసహజమైన సెక్స్ వలన కలిగే ఇబ్బందులను నిస్సంతానాన్ని, శని; రాహువుతో కలసి ఎయిడ్స్ వ్యాధిని, గురువు, రాహువుతో కలసి యుటిరస్ కాన్సర్, సెర్విక్స్ కాన్సర్‌ను సూచించును.

**శుక్రుడు సూచించు వృత్తి వ్యాపారాలు :-**

సుగంధద్రవ్యములు, పట్టువస్త్రములు అమ్మువారు, చాక్లెట్లు తయారు చేయువారు, హోటల్ వ్యాపారం, వాహనములు, పంచదార, ఉప్పులను అమ్మువారు, పాలు, నెయ్యి, రాగి అభ్రకం, గాజు, ఫాన్సీవస్తువులు, గంధపునూనె, రసాయనాలు, ప్లాస్టిక్, కలప, రబ్బరులతో కూడిన వ్యాపారాలు చేయువారిని శుక్రుడు సూచించును. సినిమా డైరక్టర్, మేకప్‌మేన్, నటులు, పాటలు పాడువారు, సంగీత విద్వాంసులు, చిత్రకారులు, ఫొటోగ్రాఫర్లు, నిర్మాతల, ను సూచించును. పెట్రోలుబంకు, కార్లు, విమానాలు, లారీలు, రైలు, టాక్సీ, ఆటోమొబైల్ సినిమా పశువులు, ఆహారములకు సంబంధించిన సంస్థలను, వాటిలో పనిచేయువారిని సూచించును.

# ద్వాదశ లగ్నాలలో శుక్రుడు - ఫలితాలు

**మేషరాశి లగ్నమైతే**

- మేషలగ్నమై లగ్నమున శుక్రుడున్న భోగభాగ్యములు, విద్యాధనము లభించును.
- 2 వ స్థానమున శుక్రుడున్న ధనం లభించును.
- 3 వ స్థానమున శుక్రుడున్న సోదరీ సోదరులు ఉంటారు.
- 4 వ స్థానమున వాహనం, అధికారం, సుఖం లభించును. మాతృ సౌఖ్యం కలుగును.
- 5 వ స్థానమున శుక్రుడున్న స్త్రీ సంతానం, భాగ్యము కలుగును.
- 6 వ స్థానమున శుక్రుడున్న అనారోగ్యం, కళత్రనష్టము, ధనహీనము కలుగును.
- 7 వ స్థానమున శుక్రుడున్న అందమైన భార్య, నీచస్త్రీ సాంగత్యము కలుగును.
- 8 వ స్థానమున శుక్రుడున్న భార్యతో విభేదాలు కలుగును.
- 9 వ స్థానమున శుక్రుడున్న స్త్రీ ధనము లభించును. కార్యసిద్ధి, ఆనందం, సుఖము లభించును.
- 10 వ స్థానమున శుక్రుడున్న శుభకరమైన కార్యములు నిర్వహించును
- 11 వ స్థానమున శుక్రుడున్న న్యాయవర్తనుడు, ధనార్జన కలవాడు.
- 12 వ స్థానమున శుక్రుడున్న ప్రయాణాలు, పుణ్యక్షేత్ర దర్శనం, అధికారులచే సన్మానం కలుగును.

**వృషభం లగ్నమైతే**

- వృషభ లగ్నమై 1 వ స్థానములో శుక్రుడు వుంటే అలాంటి జాతకుడు పొట్టిగా వుండి, తెలివైన వాడు, సంగీతం సాహిత్యము తెలిసినవాడు అవుతాడు.
- 2 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకుడు తక్కువ ధనము కలవాడై ఉంటాడు.
- 3 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకునకు ఎక్కువ అదృష్టవంతు రాళ్ళయిన అక్కా చెల్లెళ్ళు ఉంటారు.
- 4 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకుడు విద్య, వాహనము, ధనము, భూమిని సంపాదించును.

- 5 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకుని భార్య రోగములతో బాధపడును.
- 6 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకుడు అప్పుచేసి భూమిని కొనును.
- 7 వ స్థానములో శుక్రుడు వుంటే స్త్రీ వ్యామోహం కలవాడు.
- 8 వ స్థానములో శుక్రుడు వుంటే అనారోగ్యము, అధికధనవ్యయం కలుగును.
- 9 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకునికి ధనము ఎక్కువగా వుండి, పేరు ప్రతిష్ఠలు గల ఉద్యోగం చేయువాడు అవుతాడు.
- 10 వ స్థానంలో శుక్రుడు వుంటే జాతకుడు వ్యవసాయం చేస్తే అధిక లాభం వచ్చి ఎక్కువగా ధనము లభించును.
- 11 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకునికి మొదట ధనము లభించినా తర్వాత అప్పులు చేయును.
- 12 వ స్థానములో శుక్రుడు వుంటే జాతకునికి శరీర బాధలు ఉండును. అంతేకాక మంచి పనులు చేయుట వలన అప్పులు పాలవుతాడు.

**మిథునం లగ్నమైతే**

- మిథునలగ్నమై లగ్నంలో శుక్రుడున్న బుద్ధి, వినయము కలవాడు, కవిత్వం చెప్పువాడు.
- 2 వ స్థానంలో శుక్రుడున్న ధనలాభము, సంగీత సాహిత్యముల యందు ఆసక్తి కలవాడు. మధురంగా మాట్లాడును.
- 3 వ స్థానంలో శుక్రుడున్న సుఖదుఃఖములు సమానంగా ఉండును.
- 4 వ స్థానంలో శుక్రుడున్న సంతానం వలన బాధలు, భార్యకు అనారోగ్యం కలుగును.
- 5 వ స్థానంలో శుక్రుడున్న స్త్రీ సంతానం ఎక్కువ.
- 6 వ స్థానంలో శుక్రుడున్న సంపాదించిన ధనమంతయు ఖర్చు అగును.
- 7 వ స్థానంలో శుక్రుడున్న గుణవంతురాలైన భార్య, స్త్రీ వ్యామోహము, మనోవికారం కలుగును.
- 8 వ స్థానంలో శుక్రుడున్న కుటుంబ సుఖము, సంపాదన తక్కువ, ఖర్చు ఎక్కువ ఉంటాయి.
- 9 స్థానంలో శుక్రుడున్న పిత్రార్జిత ధనం లభించును. ధనలాభం కలుగును.
- 10 వ స్థానంలో శుక్రుడున్న సంతానం, అధికారుల చేత సన్మానం, అధికారం, ధనం లభించును.

- 11 వ స్థానంలో శుక్రుడున్న ధనలాభం, స్వార్జితం కలుగును.
- 12 వ స్థానంలో శుక్రుడున్న పరోపకారము చేయును, ఆధ్యాత్మిక కార్యములు నిర్వహించును. తండ్రి సంపాదించిన ఆస్తి ఖర్చు అగును.

**కర్కాటకం లగ్నమైతే**

- కర్కాటకము లగ్నమై లగ్నంలో శుక్రుడున్న విద్య, కవిత్వంలలో రాణించును. భోగభాగ్యములు కలుగును.
- 2 వ స్థానంలో శుక్రుడున్న సంగీత జ్ఞానము, సాహిత్యంలో ప్రవేశము కలుగును.
- 3 వ స్థానంలో శుక్రుడున్న ధననష్టము, కష్టములు కలుగును.
- 4 వ స్థానంలో శుక్రుడున్న మాతృసౌఖ్యం, ధనలాభం కలుగును. విద్యావంతుడగును.
- 5 వ స్థానంలో శుక్రుడున్న స్త్రీ సంతానం, ధనలాభం కలుగును.
- 6 వ స్థానంలో శుక్రుడున్న సుఖహీనం, ఋణబాధలు కలుగును.
- 7 వ స్థానంలో శుక్రుడున్న మంచిభార్య, శరీరబాధలు లభించును.
- 8 వ స్థానంలో శుక్రుడున్న తండ్రి సంపాదించిన ధనం వ్యయమగును.
- 9 వ స్థానంలో శుక్రుడున్న పిత్రార్జితం లభించును.
- 10 వ స్థానంలో శుక్రుడున్న అధికారం, ఉద్యోగం లభించును.
- 11 వ స్థానంలో శుక్రుడున్న ధర్మవర్తనం, ధన రాబడి కలుగును.
- 12 వ స్థానంలో శుక్రుడున్న శుభకార్యములు నిర్వహించును.

**సింహం లగ్నమైతే**

- సింహలగ్నమై లగ్నంలో శుక్రుడున్న కుటుంబ గౌరవాన్ని పెంచును. భాగ్యవంతుడు అగును.
- 2 వ స్థానమున శుక్రుడున్న కుటుంబ నష్టము, సుఖహీనము కలుగును.
- 3 వ స్థానమున శుక్రుడున్న దీర్ఘాయుర్దాయము కలుగును. సంతానం కలుగును.
- 4 వ స్థానమున శుక్రుడున్న విద్య, వాహనము, సుఖము, స్త్రీ వ్యామోహము కలుగును.
- 5 వ స్థానమున శుక్రుడున్న స్త్రీ సంతానం, కీర్తి, సుఖము, భాగ్యము కలుగును.
- 6 వ స్థానమున శుక్రుడున్న శత్రువుల వలన బాధలు, చికాకులు, ఋణబాధలు కలుగును.

- 7 వ స్థానమున శుక్రుడున్న శరీరబాధలు, సామాన్యజీవనము కలుగును.
- 8 వ స్థానమున శుక్రుడున్న విలాసవంత జీవితం కలుగును.
- 9 వ స్థానమున శుక్రుడున్న తండ్రివలన ఆస్తి, సామాన్య జీవనం కలుగును.
- 10 వ స్థానమున శుక్రుడున్న సుఖదుఃఖములు సమానముగా ఉండును.
- 11 వ స్థానమున భూమి, ధనము, విద్య లభించును. కార్యసిద్ధి కలుగును.
- 12 వ స్థానమున మంచిపనులకు ధనము వ్యయము చేయును.

**కన్య లగ్నమైతే**

- కన్యలగ్నమై లగ్నంలో శుక్రుడున్న ధనము, సుఖము, కార్యసిద్ధి కలుగును.
- 2 వ స్థానంలో శుక్రుడున్న ధనము, కుటుంబ సుఖము, వాచాలత కలుగును.
- 3 వ స్థానంలో శుక్రుడున్న ధనము, సుఖము, సామాన్య జీవనము కలుగును.
- 4 వ స్థానంలో శుక్రుడున్న విద్య, భూమి లభించును.
- 5 వ స్థానములో శుక్రుడున్న భోగభాగ్యములు, పేరు పొందు సంతానం కలుగును.
- 6 వ స్థానంలో శుక్రుడున్న సుఖహీనము, ఋణము కలుగును.
- 7 వ స్థానంలో శుక్రుడున్న గుణవతియగు భార్య లభించును. భూమి, ధనము కలుగును.
- 8 వ స్థానములో శుక్రుడున్న సుఖహీనము, పెద్దకుటుంబము, ధనహీనము కలుగును.
- 9 వ స్థానములో శుక్రుడున్న పిత్రార్జిత ధనము, భోగభాగ్యములు కలుగును.
- 10 వ స్థానములో శుక్రుడున్న సత్కార్యములు చేయును. కీర్తి కలుగును.
- 11 వ స్థానములో శుక్రుడున్న న్యాయవర్తనము, ధనార్జన కలదు.
- 12 వ స్థానములో శుక్రుడున్న సుఖహీనము, ధనవ్యయము కలుగును.

**తుల లగ్నమైతే**

- తులా లగ్నమై లగ్నములో శుక్రుడున్న సుఖము సామాన్యంగా ఉంటుంది. కీర్తి గడించును.
- 2 వ స్థానంలో శుక్రుడున్న ధనలాభము, ధనవ్యయము కలుగును.
- 3 వ స్థానంలో శుక్రుడున్న అధిక ధనవ్యయం అగును. కృషివలన అభివృద్ధి పొందుతారు.

- 4 వ స్థానంలో శుక్రుడున్న విద్యావంతుడు కాకపోయినా అధికారం కలుగును.
- 5 వ స్థానంలో శుక్రుడున్న స్త్రీ సౌఖ్యము, కార్యలాభము, ఆటంకములు కలుగును.
- 6 వ స్థానంలో శుక్రుడున్న బాల్యమందు బాలారిష్టములు కలుగును.
- 7 వ స్థానంలో శుక్రుడున్న అనారోగ్యము, కుటుంబసుఖం, మనశ్శాంతి కలుగును.
- 8 వ స్థానంలో శుక్రుడున్న మంచికార్యములకు ధనవ్యయం చేయును. సంఘంలో కీర్తి గడించును.
- 9 వ స్థానంలో శుక్రుడున్న సుఖ దుఃఖములు సమానంగా ఉంటాయి.
- 10 వ స్థానంలో శుక్రుడున్న వ్యవసాయదారుడు అవుతాడు. అనుకూలవతి అయిన భార్య లభించును.
- 11 వ స్థానంలో శుక్రుడున్న నీచకార్యములు, ధనసంపాదన కలుగును.
- 12 వ స్థానంలో శుక్రుడున్న సత్కార్యములు చేయును. ధనవ్యయం జరుగును.

**వృశ్చికం లగ్నమైతే**

- వృశ్చిక లగ్నమై లగ్నంలో శుక్రుడున్న స్త్రీవ్యామోహం కలుగును.
- 2 వ స్థానంలో శుక్రుడున్న అనారోగ్యం, కుటుంబ వృద్ధి కలుగును.
- 3 వ స్థానంలో శుక్రుడున్న సోదరి వలన ధనలాభం కలుగును.
- 4 వ స్థానంలో శుక్రుడున్న శాస్త్ర పాండిత్యం, అధికార గౌరవం కలుగును.
- 5 వ స్థానంలో శుక్రుడున్న కళత్రం వల్ల ధనలాభము కలుగును.
- 6 వ స్థానంలో శుక్రుడున్న భార్యకు అనారోగ్యం కలుగును.
- 7 వ స్థానంలో శుక్రుడున్న గుణవతియగు భార్య లభించును.
- 8 వ స్థానంలో శుక్రుడున్న ధనవ్యయము కలుగును.
- 9 వ స్థానంలో శుక్రుడున్న విశేషభాగ్యము కలుగును.
- 10 వ స్థానంలో శుక్రుడున్న దైవపూజ, ఆచారం, పేరుప్రతిష్ఠలు కలుగును.
- 11 వ స్థానంలో శుక్రుడున్న ధనవ్యయము కలుగును. భార్యవలన బాధలు కలుగును.
- 12 వ స్థానంలో శుక్రుడున్న సత్కార్యములు చేయుట, ఖ్యాతి గడించుట జరుగును.

**ధనుస్సు లగ్నమైతే**

- ధనుస్సు లగ్నమై లగ్నములో శుక్రుడు ఉన్న పాండిత్యము, కవిత్వము, అనారోగ్యం కలుగును.
- 2 వ స్థానంలో శుక్రుడు ఉన్న స్త్రీ సంతానము, స్వల్పధనము, సంగీత సాహిత్య ప్రవేశము కలుగును.
- 3 వ స్థానంలో శుక్రుడు ఉన్న సోదరీవృద్ధి, సామాన్య భాగ్యము లభించును.
- 4 వ స్థానంలో శుక్రుడు ఉన్న విద్య, వినయము, మాతృసౌఖ్యము, భూలాభము.
- 5 వ స్థానంలో శుక్రుడు ఉన్న సంతానము, పరస్త్రీ సాంగత్యము కలుగును.
- 6 వ స్థానంలో శుక్రుడు ఉన్న దాయాదుల ఆస్తి లభించును. శత్రువుల వలన బాధలు కలుగును.
- 7 వ స్థానంలో శుక్రుడు ఉన్న స్త్రీ వ్యామోహము, అందమైన భార్య, విద్య, వినయము కలవాడు.
- 8 వ స్థానంలో శుక్రుడు ఉన్న పెద్ద కుటుంబం, ధనహీనత కలుగును.
- 9 వ స్థానంలో శుక్రుడు ఉన్న పితృసౌఖ్యము, భాగ్యము కలుగును.
- 10 వ స్థానంలో శుక్రుడు ఉన్న కళత్ర విచారము, ఋణము కలుగును.
- 11 వ స్థానంలో శుక్రుడు ఉన్న న్యాయవర్తనులు, ధనం సంపాదించును. కోర్టుదావాలలో ధనం కలుగును.
- 12 వ స్థానంలో శుక్రుడు ఉన్న శుభకార్యములకు ధనం ఖర్చగును. సంసార సుఖం తక్కువ ఉండును.

**మకరం లగ్నమైతే**

- మకర లగ్నమై లగ్నమున శుక్రుడున్న స్త్రీలపై ప్రేమ, బహుస్త్రీ సంగమం.
- 2 వ స్థానమున శుక్రుడున్న ధనము, కీర్తి, సుఖము లభించును.
- 3 వ స్థానమున శుక్రుడున్న భోగభాగ్యములు, లోభత్వము కలుగును.
- 4వ స్థానములో శుక్రుడున్న మాతృసౌఖ్యం, విద్య, వాహనసౌఖ్యం లభించును.
- 5 వ స్థానములో శుక్రుడున్న సంతానం, సామాన్య జీవనం కలుగును.
- 6 వ స్థానములో శుక్రుడున్న స్త్రీ సుఖం, అనారోగ్యం కలుగును.
- 7 వ స్థానములో శుక్రుడున్న పరస్త్రీలపై ఆసక్తి కలవాడు.

- 8 వ స్థానములో శుక్రుడున్న అధికారుల అభిమానం, నీచస్త్రీ సాంగత్యం పొందును.
- 9 వ స్థానములో శుక్రుడున్న దైవభక్తి, భోగము కలవాడు. యుక్తిపరుడు.
- 10 వ స్థానములో శుక్రుడున్న సరియగు పని ఉండదు.
- 11 వ స్థానములో శుక్రుడున్న విద్యావంతుడు, ధనవంతుడు.
- 12 వ స్థానములో శుక్రుడున్న విద్యావంతుడు. లోభి, స్త్రీలపై ఆసక్తి కలవాడు.

**కుంభం లగ్నమైతే**

- కుంభ లగ్నమై లగ్నమందు శుక్రుడున్న సంఘంలో గౌరవం, సుఖము, ధనము, విద్యా వినయ సంపన్నము, భాగ్య లాభం, యోగ్యత కలుగును.
- 2 వ స్థానమున శుక్రుడున్న భూమి, ధనలాభం, కార్యసిద్ధి, వాక్చాతుర్యము, సుఖము, శాంతి కలుగును.
- 3 వ స్థానమున శుక్రుడున్న శుక్రదశలో యోగహీనము, సోదరీల సహాయము వల్ల జీవనము కలుగును.
- 4 వ స్థానమున శుక్రుడున్న శుక్రదశలో భూలాభము, వాహనము, ముద్రాధికారం, గొప్ప ఉద్యోగము, సుఖము, ధనము, శాంతి కలుగును.
- 5 వ స్థానమున శుక్రుడున్న శుక్రదశలో భూమి, ధనం, కార్యసిద్ధి, స్త్రీ సంతానము, స్వతంత్ర విద్య వలన జీవనము కలుగును.
- 6 వ స్థానమున శుక్రుడున్న శుక్రదశలో వ్యవహారములలో చిక్కులు, అశాంతి, శత్రువులు, రోగాలు, అప్పులు కల్గును.
- 7 వ స్థానమున శుక్రుడున్న మంచిభార్య, భార్యవలన ధనలాభం, సుఖం, శాంతి కలుగును.
- 8 వ స్థానమున శుక్రుడున్న భార్య వలన బాధ, సంతాన విచారం, మధ్య మధ్య వ్యవహారంలో చిక్కులు, అశాంతి కలుగును.
- 9 వ స్థానమున శుక్రుడున్న భూ, ధనలాభం, కార్యసిద్ధి, సంఘంలో గౌరవం, కలుగును.
- 10 వ స్థానమున శుక్రుడున్న శుక్రదశలో సుఖం, ధనం, శాంతి, రాజసన్మానం, విద్య వలన స్వతంత్ర జీవనం కలుగును.
- 11 వ స్థానమున శుక్రుడున్న సుఖం, శాంతి, న్యాయ ధనార్జనము కలుగును.
- 12 వ స్థానమున శుక్రుడున్న ధర్మకార్యములు, దాతృత్వం, సామాన్య జీవనం కలుగును.

- కుంభలగ్నమున శుక్రుడు వాహన భాగ్యాధిపతి అగుటచే కేంద్రకోణముల యందు ఉన్న సంఘంలో గౌరవం, సుఖము, ధనమును ఇచ్చును.
- కుంభలగ్నమున శుక్రుడు వాహన భాగ్యాధిపతి అగుటచే తృతీయ షష్ఠాష్టమముల యందు ఉన్న మధ్య మధ్య వ్యవహారంలో చిక్కులు, అశాంతి కలుగును.

**మీనం లగ్నమైతే**

- మీన లగ్నమై లగ్నములో శుక్రుడున్న విద్య, వినయము, సంపద, సుఖము లభించును.
- 2 వ స్థానంలో శుక్రుడున్న ధనసంపాదన, కుటుంబవృద్ధి, ధనవ్యయం కలుగును.
- 3 వ స్థానంలో శుక్రుడున్న అక్కచెల్లెండ్రు ఉంటారు.
- 4 వ స్థానంలో శుక్రుడున్న విద్య, భూమి, వాహనము, మాతృసౌఖ్యము లభించును.
- 5 వ స్థానంలో శుక్రుడున్న సుఖము, దుఃఖము రెండును ఏర్పడును. సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానంలో శుక్రుడున్న స్వజనులతో కలహం, అశాంతి కలుగును.
- 7 వ స్థానంలో శుక్రుడున్న అనారోగ్యం, సోదరునకు దూరమగుట జరుగును.
- 8 వ స్థానంలో శుక్రుడున్న దీర్ఘాయుర్దాయము, అభివృద్ధి, కార్యసిద్ధి కలుగును.
- 9 వ స్థానంలో శుక్రుడున్న భార్య గయ్యాళి అవుతుంది.
- 10 వ స్థానంలో శుక్రుడున్న డాంబిక ఆచారము, అధికారులచే సన్మానం కలుగును.
- 11 వ స్థానంలో శుక్రుడున్న ధనలాభము కలుగును.
- 12 వ స్థానంలో శుక్రుడున్న పుణ్యకార్యములు, తీర్థయాత్రలు చేయును.

## వివిధ భావాలలో శుక్రుడు - ఫలితములు

- శుక్రుడు లగ్నంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు. సాహిత్యంలో కృషిచేస్తాడు. అందమైనవాడు. ధనసంపాదన కలవాడు. స్త్రీ వ్యామోహం కలవాడు.
- శుక్రుడు ద్వితీయభావంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు, ధనవంతుడు, వాహనములలో తిరుగువాడు. స్త్రీధనము లభించును.

- శుక్రుడు తృతీయభావంలో ఉంటే జాతకుడు కృశించిన శరీరం కలవాడు. ఆర్థిక ఇబ్బందులు పడతాడు. స్త్రీ వ్యామోహంతో దుర్మార్గమైన పనులు కూడ చేస్తాడు.
- శుక్రుడు చతుర్థ భావంలో ఉంటే జాతకుడు ఆస్తిపరుడు. అధికారం కలిగి ఉంటాడు. అందమైన భవనాలలో నివసిస్తాడు.
- శుక్రుడు పంచమభావంలో ఉంటే జాతకుడు ధనవంతుడు. ఇతనికి కుమార్తెలు ఉంటారు.
- శుక్రుడు షష్టమ భావంలో ఉంటే జాతకుడు తెలివైనవాడు. శాస్త్రములు తెలిసినవాడు. శత్రువులు ఉంటారు.
- శుక్రుడు సప్తమ భావంలో ఉంటే జాతకుడు అందంగా ఉంటాడు. ఇద్దరు భార్యలను కలిగి ఉంటాడు. పుత్రసంతానం ఉంటుంది.
- శుక్రుడు అష్టమభావంలో ఉంటే జాతకుడు సాధారణ జీవితం గడుపుతాడు. కుటుంబ సభ్యులు సహకరించరు. మద్యపానము చేస్తాడు.
- శుక్రుడు నవమభావంలో ఉంటే జాతకుడు ఉత్తమగుణములను కలిగి ఉంటాడు. పెద్దలను గౌరవిస్తాడు. తీర్థయాత్రలు చేస్తాడు. ధనమును సంపాదిస్తాడు.
- శుక్రుడు దశమ భావంలో ఉంటే జాతకుడు సాంప్రదాయములను గౌరవిస్తాడు. సంఘంలో గుర్తింపు పొందుతాడు. ధనవంతుడు.
- శుక్రుడు ఏకాదశ భావంలో ఉంటే జాతకుడు శరీర సౌష్టవం కలిగి ఆకర్షింప బడతాడు. లలిత కళలలో ప్రావీణ్యం కలిగి ఉంటాడు. ఉద్యోగి. దూర ప్రాంతాలకు ప్రయాణిస్తుంటాడు. స్త్రీవలన ధనలాభం ఉంటుంది.
- శుక్రుడు ద్వాదశభావంలో ఉంటే జాతకుడు దయలేనివాడు. అవసరమైతే నీచకార్యాలు చేస్తాడు. నమ్మదగినవాడు కాదు.

**శుక్రుడు కోపగిస్తే జరిగే పరిహారక్రియలు :-**

- భార్యకు దూరంగా జీవించవలసి ఉంటుంది.
- భార్యకు అనారోగ్యం కలుగుతుంది.
- వాహనములు తరచు చెడిపోతాయి.
- పంచదార, పాలువంటి పదార్థాలతో చేసే వ్యాపారం హఠాత్తుగా పడిపోతుంది.

పై సంఘటనలలో ఏది జరిగినా శుక్రుడు చెడు ఫలితాలను ఇస్తున్నట్లు గ్రహించాలి. దోషనివారణకు క్రింది పరిహారక్రియలను చేయాలి.

**శుక్రుడు శాంతించుటకు చేయవలసిన పరిహారక్రియలు :-**

- ప్రతిరోజు ఉదయాన భక్తిపాటలు వినండి.
- సమయం చిక్కినపుడల్లా సంగీతం వినండి.
- భార్య తెల్లని వస్త్రములు ధరించాలి.
- వజ్రమును ధరించండి.
- లక్ష్మీదేవిని ఆరాధించండి.
- ఇంటిలో ఆగ్నేయంలో శుక్రయంత్రాన్ని ప్రతిష్టించండి.

## వివిధ భావాలలో శుక్రుడు - పరిహార క్రియలు

**లగ్నంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- తినే ఆహారంలో కొంతభాగం కుక్కలకు, కాకులకు పెట్టండి.
- బెల్లం తినకండి.
- నల్లని ఆవుకు ప్రతిరోజు ఆహారం వేయండి.

**ద్వితీయ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- లక్ష్మీదేవి ఆలయానికి 900 గ్రాముల ఆవునేయి ఇవ్వండి.
- పేదవారికి టమోటాలు ఇవ్వండి.
- విలాసవస్తువులను కొనకండి. నిరాడంబరంగా ఉండండి.

**తృతీయ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 9 రోజులు ఎవరికైనా పెరుగును ఉచితంగా ఇవ్వండి.
- వీధి పిల్లలకు వెన్న పెట్టండి.
- లక్ష్మీదేవి పూజ చేయండి.

**చతుర్థ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఒక చిన్న మట్టిపాత్రలో తేనెనుపోసి, దానిని ఇంటికప్పుపైన భద్రపరచండి.
- వరుసగా 45 రోజులు వీధిపిల్లలకు శనగలు పంచండి.
- ప్రతిరోజు లక్ష్మీస్తోత్రం చేయండి

**పంచమ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 27 రోజులు వీధిపిల్లలకు క్షీరాన్నం పెట్టండి.
- వరుసగా 9 ఆదివారాలు లక్ష్మీదేవి ఆలయంలో చక్రపొంగలి ప్రసాదంగా సమర్పించండి.
- వజ్రమును ధరించండి.

**షష్ఠమ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- జాతకుని భార్య ఒక తెల్లనిరాయికి గంధం పూసి దానిని నీటిలో వేయాలి. ఈ విధంగా వరుసగా 9 శుక్రవారాలు చేయాలి.
- భార్యకాళ్ళకు తప్పనిసరిగా చెప్పులు వాడాలి. ఇంటిలోనైనా వట్టి పాదాలతో నడువరాదు.
- ఒక వెండిగోళీని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోవాలి.

**సప్తమ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు తల్లిదండ్రులకు నమస్కరించి, వారి ఆశీస్సులు పొందండి.
- ఒక శుక్రవారంనాడు, దేవి ఆలయంకు ఇత్తడిపాత్రను సమర్పించండి.
- వరుసగా 45 రోజులు ప్రవహించే నీటిలో ఒక నీలిరంగు పూవును వేయండి.
- లక్ష్మీదేవిని పూజించండి.

**అష్టమ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఉచితంగా దేనినీ తీసుకోవద్దు.
- ప్రతిరోజు ఆవుకు ఆహారం పెట్టండి.
- వరుసగా 45 రోజులు గోధుమపిండి, బెల్లం కలిపిన ఉండలు పంచండి.
- ప్రతి శుక్రవారం లక్ష్మీదేవికి పాయసం ప్రసాదంగా సమర్పించండి.

**నవమ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు ఆవుకు ఆహారం పెట్టండి.
- ఇంటివద్దనున్న చెట్టు మొదట్లో ఒక వెండి బిళ్ళను పాతండి.
- వెండి ఉంగరం ధరించండి.
- ఒక చిన్న వెండిపాత్రలో తేనెను పోసి దానిని ఇంటిపునాదిలో పాతండి.

**దశమ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- లక్ష్మీదేవి ఆలయానికి నువ్వులనూనెను సమర్పించండి.
- మద్యపానం మానండి. మాంసాహారం తినకండి.
- వరుసగా 45 రోజులు నువ్వులు, బెల్లం కలిపిన ఉండలు పిల్లలకు పంచాలి.

**ఏకాదశ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 45 రోజులు ప్రవహించే నీటిలో నూనె వేయండి.
- లక్ష్మీదేవి ఆలయానికి నువ్వులనూనె సమర్పించండి.

- వరుసగా 9 శనివారాలు నూనెను దానం చేయాలి.
- వరుసగా 36 రోజులు పిల్లలకు మూజీడీలు పంచండి.

**ద్వాదశ భావంలో శుక్రుడు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఆవును పెంచండి.
- ప్రతిరోజు ఆవునెయ్యితో దీపారాధన చేయండి.
- భార్యచేత నీలంరంగుపూలను పాతిపెట్టించండి.

## 117. శుక్రహోర

**శుక్రహోర :-**

శుక్రహోరకు అధిపతి శుక్రుడు. శుక్రవారం లేదా చంద్రుడు భరణి, పూర్వఫల్గుణి, పూర్వాషాఢ నక్షత్రములలో సంచరిస్తున్నపుడు శుక్రహోర సమయంలో శుక్రుని ప్రభావం ఎక్కువగా వుంటుంది.

శుక్రహోర కఠినహృదయాలు సైతం కరుణ, ప్రేమతో నిండే సమయం. ఈ సమయంలో మీ మిత్రునికో, మిత్రురాలుకో, భార్యకో, భర్తకో ప్రియునికో, ప్రియురాలికో ఉత్తరాలు వ్రాయండి. ఆ ఉత్తరాలు ఎదుటివారిని ఆకర్షిస్తాయి.

ఎవరైనా కోపిష్ఠి, మూర్ఖుడు, కఠినుడు అయిన వ్యక్తిని కలవటానికి 'శుక్రహోర'ను ఎన్నుకోండి. ఆ సమయంలో ఆ వ్యక్తి మీరు చెప్పిన విషయాన్ని సహనంతో వింటాడు. మీకు శాంతంగా సమాధానం యిస్తాడు.

పెళ్ళిచూపులకు శుక్రహోర సమయం ఉత్తమం. నగలు, పట్టుచీరలు, రత్నాలు, గంధము, గ్లాసు సుగంధ ద్రవ్యములు మొదలైన అలంకారవస్తువులు కొనుటకు శుక్రహోర ఉత్తమమైనది.

ఏదైనా వాహనం కొనుటకు శుక్రవారంనాటి శుక్రహోర అత్యుత్తమమైనది. సినిమాథియేటర్లు, స్టూడియోలు, ఫోటో స్టూడియోలు, సంగీత కళాశాలలు, పాఠశాలలు, కళాశాలలు శుక్రవారం శుక్రహోరలో ప్రారంభించుట శుభదాయకం.

తోళ్ళు, చర్మముతో కూడిన పరిశ్రమలు లేదా సంస్థలు, అనాథ సంక్షేమ గృహాలు మొదలగు వాటిని ప్రారంభించుటకు శనివారం శుక్రహోర అనుకూల సమయం.

పాడిపరిశ్రమ (మిల్క్‌డైరీ) ప్రారంభించుటకు సోమవారం నాటి శుక్రహోర అనుకూల సమయం.

బియ్యం వ్యాపారం చేయటానికి మంగళవారం శుక్రహోర శుభసమయం.

బిస్కట్లు, చాక్లెట్లు, పండ్లు, పూలు, కూరగాయలు, సిల్కుచీరలు, స్త్రీల అలంకరణ సామగ్రి, మందుల వ్యాపారాలు ప్రారంభించుటకు బుధవారం శుక్రహోర సరియైన సమయం. ఈ సమయంలో 'హనీమూన్' కూడా ఆనందదాయకం.

తల్లి, పిల్లల హాస్పిటల్, పశువుల ఆసుపత్రి, ఆదాయపుపన్నుశాఖ, న్యాయం, కోర్టువంటి వాటికి సంబంధించిన ఆఫీసులను ప్రారంభించటానికి (లేదా) ఈ శాఖలలో ఉద్యోగంలో చేరటానికి గురువారం శుక్రహోర శుభసమయం.

దేవి ప్రార్థన శుభాన్ని కలుగజేస్తుంది.

**శుక్రహోర సమయం :-**

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయ సమయం నుండి హోర సమయమును లెక్కిస్తారు. హోరకాల ప్రమాణం ఒక గంట.

సూర్యోదయ సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింద సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు | రాత్రి |
|---|---|---|
| ఆదివారం | 7-8, 2-3 | 9-10, 4-5 |
| సోమవారం | 11-12 | 6-7, 1-2 |
| మంగళవారం | 8-9, 3-4 | 10-11, 5-6 |
| బుధవారం | 12-1 | 7-8, 2-3 |
| గురువారం | 9-10, 4-5 | 11-12 |
| శుక్రవారం | 6-7, 1-2 | 8-9, 3-4 |
| శనివారం | 10-11, 5-6 | 12-1 |

# 118. ధారణం

## శుక్రగ్రహ దోష నివారణకు రత్న ధారణం

స్త్రీసౌఖ్యం లేనివారు, సెక్స్ సమస్యలతో బాధపడేవారు వజ్రమును ధరిస్తారు. సుఖవ్యాధులు, ఫ్రిజిడిటీ కలవారు వజ్రమును ధరించుట ఉత్తమము.

**వజ్రము :-**

శుక్రునికి ధరించవలసినది వజ్రము.

శుక్రగ్రహయంత్రముపై వజ్రము నుంచి, శుక్రగ్రహ మంత్రము, మహాలక్ష్మీ మూలమంత్రముతో కుంకుమపూజ చేయాలి. పాయసం నైవేద్యంగా పెట్టాలి. ఈ విధంగా 16 రోజులు పూజించి తరువాత ముత్తయిదువలకు పసుపు కుంకుమలతో వస్త్రములను పెట్టి తాంబూలమిచ్చి సత్కరించాలి. తరువాత శుక్రవారంనాడు పౌర్ణమి లేదా శుద్ధ త్రయోదశినాడు శుక్ర నక్షత్రం కలసినపుడు లేదా శుభనక్షత్రం కలసినపుడు లేదా శుభనక్షత్రం వున్నపుడు సాయం సంధ్యాసమయంలో వజ్రాన్ని ధరించాలి.

వజ్రమును ధరించలేనివారు వైట్ టూర్మోలిన్, వైట్ సఫైర్ వంటి ఉపరత్నములను ధరించవచ్చు.

భరణి, పుబ్బ, పూర్వాషాఢ జన్మనక్షత్రములైనవారు, వృషభం, తులరాశులు లగ్నముగా లేదా జన్మరాశులుగా కలవారు, శుక్రదశ జరుగుతున్నవారు శుక్రునికి సంబంధించిన రత్నములను ధరించవచ్చును.

**శుక్రగ్రహ దోష నివారణకు రుద్రాక్ష ధారణ :-**

శుక్రగ్రహం అనుకూలంగా లేకపోతే సప్తముఖి రుద్రాక్షను ధరించవచ్చు.

**సప్తముఖి రుద్రాక్ష:-**

1. దీనిని లక్ష్మీ స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించిన వానికి లక్ష్మీకటాక్షం కలుగుతుంది.
3. వ్యాపార ఉద్యోగాలలో అభివృద్ధి పొందుతారు.
4. రుద్రాక్షయందు ఏడు ధారలుంటాయి.

# శుక్రగ్రహానుగ్రహం కోసం కవచధారణ

ఒక రాగిరేకుకు ఇరువైపులా క్రింది యంత్రమును చెక్కించాలి.

| పన్నెండు | ఏడు | పదునాలుగు |
|---|---|---|
| పదమూడు | పదకొండు | తొమ్మిది |
| ఎనిమిది | పదిహేను | పది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |
| పదకొండు | ఆరు | పదమూడు |
| పన్నెండు | పది | ఎనిమిది |
| ఏడు | పదునాలుగు | తొమ్మిది |

| పదకొండు | ఆరు | పదమూడు |
|---|---|---|
| పన్నెండు | పది | ఎనిమిది |
| ఏడు | పదునాలుగు | తొమ్మిది |
| పన్నెండు | ఏడు | నాలుగు |
| పదమూడు | పదకొండు | తొమ్మిది |
| ఎనిమిది | పదిహేను | పది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |

ఈ యంత్రమును "ఓం ద్రాం ద్రీం ద్రౌం సః శుక్రాయనమః" అను మంత్రమును 1,08,000 సార్లు జపిస్తూ పూజించాలి. తరువాత దీనిని లాకెట్‌గా ధరించిన వివాహ ప్రాప్తి కలుగుతుంది.

## 119. దానం

1. శుక్రదశ - శుక్ర అంతర్దశలో - తెల్ల ఆవును దానమీయాలి
2. శుక్రదశ - రవి అంతర్దశలో - మేకను దానమీయాలి
3. శుక్రదశ - చంద్ర అంతర్దశలో - మృగము (లేడి)ను దానమీయాలి
4. శుక్రదశ - కుజ అంతర్దశలో - ఎద్దును దానమీయాలి.
5. శుక్రదశ - రాహు అంతర్దశలో - గుమ్మడిపండును దానమీయాలి.
6. శుక్రదశ - గురు అంతర్దశలో - గుమ్మడిపండును దానమీయాలి.
7. శుక్రదశ - శని అంతర్దశలో - గేదెను దానమీయాలి.
8. శుక్రదశ - బుధ అంతర్దశలో - లక్ష్మీనారాయణ ప్రతిమను దానమియ్యాలి
9. శుక్రదశ - కేతు అంతర్దశ - దుర్గాప్రతిమను దానమీయాలి.

శుక్రదశా కాలములో వెండిగిన్నెను దానమిచ్చుట శుభప్రదము.

# 120. పారాయణం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన శుక్ర గ్రహానుగ్రహం పొందవచ్చును.

## పారాయణ స్తోత్రాలు

1. శుక్రగ్రహాష్టోత్తర శతనామ స్తోత్రం/నామావళి.
2. లక్ష్మి సహస్ర నామ స్తోత్రం/నామావళి.
3. మహాలక్ష్మిస్తోత్రం/కనకధారాస్తవం.
4. మహాలక్ష్మి సహస్రనామావళి.
5. వైభవలక్ష్మి/సంతోషిమాత వ్రతాలు.
6. లక్ష్మిహృదయ స్తోత్రం/అష్టలక్ష్మి స్తోత్రం
7. శుక్రస్తోత్రం/శ్రీస్తోత్రం
8. లక్ష్మి ద్వాదశనామస్తోత్రం.
9. శ్రీమహాలక్ష్మి అష్టోత్తరం.
10. శ్రీ లక్ష్మి గాయత్రి/లక్ష్మి స్తవం
11. మహాలక్ష్మి గాయత్రి/లక్ష్మిస్తవం
12. శుక్రగ్రహ కవచం/శుక్రగ్రహ మంగళాష్టకం.

## రామాయణ పారాయణ

★ శుక్రమహాదశలో-బాలకాండ 73 సర్గ పారాయణ, పరశురామపూజ, పటిక బెల్లం నైవేద్యం. ఇది శుక్రమహాదశ జరుగుతూన్న సమయంలో ఎపుడైనా నిర్వర్తించ వలసింది.

1. శుక్ర మహాదశలో రవి అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : బాలకాండ 67 సర్గ
   నైవేద్యం : క్యారెట్, చేమ దుంపలు.
2. శుక్రమహాదశలో చంద్ర అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : 87, 88, 89, 90 సర్గలు
   నైవేద్యం : పరమాన్నం, పాలు
3. శుక్ర మహాదశలో కుజ అంతర్దశ జరుగు కాలమున
   పారాయణ : అయోధ్యాకాండ 115 సర్గలు
   నైవేద్యం : కందిపప్పు పొంగలి/బెల్లం

4. శుక్ర మహాదశలో బుధ అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : ఉత్తరకాండ 6, 7, 8 సర్గలు
నైవేద్యం : ఆకుపచ్చ అరటిపళ్ళు
5. శుక్రమహాదశలో గురు అంతర్దశ జరుగు కాలమున
పారాయణ : బాలకాండ 14 సర్గ
నైవేద్యం : అరటిపళ్లు (పచ్చనివి)
6. శుక్రమహాదశలో శని అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : యుద్ధకాండ 102 సర్గ
నైవేద్యం : నల్లద్రాక్ష/నేరేడు.
7. శుక్రమహాదశలో శుక్ర అంతర్దశ జరుగు కాలమున
పారాయణ : సుందరకాండ 33, 34, 35, 36 సర్గలు
నైవేద్యం : పటిక బెల్లం
8. శుక్రమహాదశలో రాహు అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : అరణ్యకాండ 4 సర్గ
నైవేద్యం : ఎండుద్రాక్ష/తేనె
9. శుక్ర మహాదశలో కేతు అంతర్దశ జరుగు కాలమున
పారాయణ : యుద్ధకాండ 20 సర్గ
నైవేద్యం : నారికేళం/ఖర్జూరం

# 121. సందర్శనం

## దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు

★ శుక్రగ్రహ దోషనివృత్తికి శ్రీలక్ష్మీదేవి, పరశురామ ఆలయాలను సందర్శించవచ్చు.

1. కొల్హాపురం (కర్నాటక)లో మహాలక్ష్మి ఆలయం
2. ముంబై (మహారాష్ట్రం)లోని మహాలక్ష్మి ఆలయం.
3. తమిళనాడులోని అష్టలక్ష్మి ఆలయాలు మూడు.
4. భువనేశ్వర్ (ఒరిస్సా)లోని పరశురామాలయం.
5. నంజనగూడ (కర్నాటక)లోని పరశురామ విగ్రహాలు.
6. చిప్లూన్ (మహారాష్ట్ర)లోని మూడు పరశురామవిగ్రహాలు.
7. తమిళనాడు, కంచనూర్ దేవాలయం.

8. రంగారెడ్డిజిల్లా సికింద్రాబాద్ వాసవీకాలనీ వద్ద 8 లక్ష్మీ అమ్మవార్లు.
9. నెల్లూరుజిల్లా పెంచలకోన - చెంచులక్ష్మి
10. గుంటూరుజిల్లా మాచర్ల - ఆదిలక్ష్మి
11. కృష్ణాజిల్లా వేదాద్రి - శ్రీలక్ష్మీదేవి
12. ప.గో.జిల్లా పెనుగొండ శ్రీలక్ష్మీదేవి
13. తూ.గో.జిల్లా అంతర్వేది - రాజ్యలక్ష్మి
14. చిత్తూరు జిల్లా తిరుచానూరు - పద్మావతి (లక్ష్మి)
15. విశాఖపట్నం - నగరం మధ్యలో - కనక మహాలక్ష్మి
16. విశాఖపట్నం దేవీపురంవద్ద లలితా పరమేశ్వరి (లక్ష్మి)
17. ముంబైకి 80 కి.మీ వజ్రేశ్వరి ఆలయందరి-పరశురాముడు.
18. గుడిమల్లం (చిత్తూరుజిల్లా) పరశురాముడు.

## శ్రీలక్ష్మి దివ్యసన్నిధానములు

అష్టలక్ష్ములనగా ఆది, ధైర్య, విజయ, గజ, ధాన్య, ధన, సంతాన, సౌభాగ్య లక్ష్ములు. వీరికి అందరికీ ఒకేచోట ఆలయాలు తమిళనాడు మూడు ప్రాంతాలలో ఉన్నాయి. లక్ష్ములందర్నీ ఒకేచోట దర్శించుకోవాలనుకునేవారికి గొప్ప అవకాశం.

**1.తిరువణ్ణామలై:** స్వామివారు అరుణాచలేశ్వర్. అమ్మవారు అరుణాచలేశ్వరి. స్వామివారు తేజోలింగరూపుడు. మంటపస్తంభాలపై అష్టలక్ష్మీ విగ్రహాలున్నాయి.

**2.కుంభకోణం:**స్వామివారు ఆదికుంభేశ్వరుడు. అమ్మవారు మంగళాంబిక. లింగంపై భాగం కుండమూతివలె ఉంటుంది. ఆలయ ఆవరణలో అష్టలక్ష్మీ రూపాలున్నాయి.

**3.చెన్నయ్:** నగరంలోనే బంగాళాఖాతం తీరములో వెలసిన మూడంతస్తుల దేవాలయం బీసెంట్‌నగర్ తిరువార్మయూర్ బీచ్‌లో ఉంది. చుట్టూ ప్రదక్షిణగా మెట్లెక్కుతూ అష్టలక్ష్ములను దర్శించాలి.

**4.కొల్హాపూర్:** మహారాష్ట్రలో గల కొల్హాపూర్‌లోని గొప్ప మహాలక్ష్మి మందిరం గలదు. పూనానుండి గోవా వెళ్ళే రైలు మార్గంలో ఉంది. పన్వాల్‌నుండి 18 కి.మీ. షోలాపూర్ నుంచి బస్సు/ట్రైన్ సదుపాయాలున్నాయి. ఇది 18 శక్తిపీఠ క్షేత్రాల్లో ఒకటి. పసుపుపచ్చని రంగులో ఉండే మూర్తి.

**5.విశాఖపట్నం:** పట్టణం మధ్యలోనే ఉన్న కనకమహాలక్ష్మి సత్యప్రామాణికం గల లక్ష్మీఅమ్మవారు ప్రసిద్ధి. ఇక్కడ శుక్రవారం గాక, గురువారం పూజలు.

# 122. శుక్ర గ్రహ అర్చనం

శుక్రగ్రహదోషమున్న శుక్రగ్రహజపంను తగు సంఖ్యలో చేయాలి. శుక్రగ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౩ | ౨ | ౫ | ౬ | ౪ | ౭ | ౮ | ౯ | ౧ |
| ౮ | ౯ | ౧ | ౩ | ౨ | ౫ | ౬ | ౪ | ౭ |
| ౬ | ౪ | ౭ | ౮ | ౯ | ౧ | ౩ | ౨ | ౫ |
| ౫ | ౩ | ౨ | ౧ | ౮ | ౯ | ౭ | ౬ | ౪ |
| ౧ | ౮ | ౯ | ౭ | ౬ | ౪ | ౫ | ౩ | ౨ |
| ౭ | ౬ | ౪ | ౫ | ౩ | ౨ | ౧ | ౮ | ౯ |
| ౯ | ౧ | ౮ | ౨ | ౫ | ౩ | ౪ | ౭ | ౬ |
| ౪ | ౭ | ౬ | ౯ | ౧ | ౮ | ౨ | ౫ | ౩ |
| ౨ | ౫ | ౩ | ౪ | ౭ | ౬ | ౯ | ౧ | ౮ |



## శుక్ర యంత్రము

హం చం

రం కం

లంహాం రంయంవం

షంటం

అంక్రాం క్రీం క్రౌం

ఓం శ్వేత వృషాజ్యాయ విద్మహే భార్గవ ప్రదాయ

లం లం

ఠం థం

# జపమంత్రము

**మంత్రము :-**

శుక్రంతే అన్యదిత్యస్యమంత్రస్య భరద్వాజ ఋషిః. శుక్ర గ్రహో దేవతా త్రిష్టుప్ ఛందః యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత శుక్ర గ్రహ ప్రసాద సిద్ధ్యర్థేం శుక్ర గ్రహమంత్ర జపం కరిష్యే.

**కరన్యాసము :-**

శుక్రంతే అన్యత్ - అంగుష్ఠాభ్యాం నమః
యజతంతే అన్యత్ - తర్జనీభ్యాం నమః
విష్ణురూపే అహనీద్యౌరివాసి - మధ్యమాభ్యాం నమః
విశ్వాహిమాయా - అనామికాభ్యాం నమః
అవసిస్వధానః - కనిష్ఠికాభ్యాం నమః
భద్రాతే పూషన్నిహరాతిరస్తు - కరతలకరపృష్ఠాభ్యాం నమః
భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**అంగన్యాసము :-**

శుక్రంతే అన్యత్ - హృదయాయ నమః
యజతంతే అన్యత్ - శిరసేస్వాహా
విష్ణురూపేఅహనీద్యౌరివాసి - శిఖాయైవషట్
విశ్వాహిమాయా - కవచాయహుం
అవసిస్వధానః - నేత్రత్రయాయవౌషట్
భద్రాతేపూషన్నిహరాతిరస్తు - అస్త్రాయఫట్

**ధ్యానమ్ :-**

జటిలం సాక్ష సూత్రంచ - వరదండ కమండలుం ।
శ్వేత వస్త్రా వృతం శుక్రం - ధ్యాయేత్ దానవ పూజితం ॥
హిమకుందమృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్రప్రవక్తారంభార్గవం ప్రణమామ్యహమ్ ॥

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోపహార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

**అధిదేవత ( ఇంద్రాణి ) :-**

ఓం ఇంద్రాణీ మాసునారిషుపత్నీ మహమశ్రవమ్
నహ్యాస్యా అపరంచన జరసామరతే పతి:

**ప్రత్యధిదేవతా :-**

ఇంద్రమరుత్వ ఇహపాహిసోమం యథాశార్యతే అపిబస్సుతస్య
తవప్రణీతీ తవశూర శర్మన్నా వివాసంతు కవయస్సు యజ్ఞా:

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత శుక్రగ్రహ: సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు.

**మూలమంత్రము :-**

ఓం శుక్రతే అన్యల్ విష్ణు రూపే అహనిద్యేరివాసి
విశ్వాహి మాయా అవసిస్వధానో భద్రాతే పూషన్నిహరాతిరస్తు ॥

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు ఆకాశనీలంరంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై వెండితో చేసిన శుక్రప్రతిమను లేదా శుక్ర యంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేవ ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరై: శర్కరేణ ఫలైస్సహ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తత:॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజిన:।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభి:॥
మధువాతాఋుతాయ తే మధు క్షరంతి సింధవ:।
మాధ్వీ ర్నస్సం త్వోషధీ:। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజ:।
మధుద్యౌరస్తు న: పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్య:।
మాధ్వీర్గావో భవంతు న:। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవ:

పరిగృహీతాస్తస్మాత్త్స్రియానష్టేయ సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః।
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపము పైకి పంచాలోకపాలకులను, అష్టదిక్పాలకులను ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు, ఆయా స్థానములలో ఒక తమలపాకును, వక్కను ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ వుండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరిః ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః॥ ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

*గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.*

## దిక్పాలకులు

**ఇంద్రః:-(1-7-10 మం):-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః॥ అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః:- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః:-(ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్ఋతిః- మూషుణః పరాపరా నిర్ఋతిర్దుర్హణావధీత్. పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ఋతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)

ఇమంమే వరుణ శృధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। ఆవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

కుభేరః :-

సోమోధేమగ్ం సోమో అర్వంత మాసుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।
సాదన్యం విదత్యగ్ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఈశానః :-

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

ఊర్ధ్వపురుషః :-

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం- 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవానృక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాస్తు పురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ త్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

# త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

బ్రహ్మ:-

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్ స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీ :-

సక్తుమివ తితఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః:- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరి:-గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా :-

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ద్విరా॥
ఆదిత్ప్రత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతె దివా॥
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఏషోఉషా అపూర్వ్యావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**గరుడః :-**

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్తోమ

ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌ

యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్గ్ంస్యంగాని ధిష్ణియా

శ్శఫా యజూగ్ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥

గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ధన్వంతరిః :-**

ధన్వనాగా ధన్వనాఽఽజిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।

ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥

ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఇంద్రాగ్నీం :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)**

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।

గ్రాహిర్జ గ్రాహ యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥

ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్భతి :** యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।

తమాహరామి నిరృతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥

నిర్భతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**(శత్రుభలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)**

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తా వరుణశ్చ మన్యుః।

భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥

మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విశాఖా నక్షత్రమ్ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।

తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।

నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోప్తా।
విషూచ శ్శత్రూ నపబాధమానా। అపక్షుధం నుదతా మరాతిమ్॥
విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥
మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

**సామవేదము :-**

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
విహోతానత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

**అధర్వణ వేదము :-**

శన్నోదేవీ రభిష్ఠయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అధర్వణ వేదాయ నమః॥
అధర్వణ వేదమావాహయామి। పూజయామి॥

## ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

**దుర్గా :-** ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః।
నసః పర్‌ష దతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**గణపతి :-** ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**క్షేత్రపాలకుడు:-** క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వా సనోమృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అభయంకరుడు:-** యత ఇంద్ర భయా మహేతతోనో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్వస్తిదా అభయంకరః॥
ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

| జాతకుని జన్మనక్షత్రమును ఆహ్వానించాలి. |
|---|

తరువాత శుక్రునికి సంబంధించిన నక్షత్రములు పుబ్బ, పూర్వాషాఢ, భరణిలను ఆహ్వానించాలి.

**పూర్వఫల్గుణి (పుబ్బ) :-**

గవాంపతిః ఫల్గుణీ నామసిత్వమ్। తదర్యమన్వరుణ మిత్రచారు।
తం త్వాపయుగ్ం సవితారగ్ం సనీనామ్। జీవా జీవంతముప సంవిశేమ।
యే నేమా విశ్వాభువనాని సంజితా। యస్యదేవా అనుసంయంతి చేతః।
అర్యమా రాజా జరస్తు విష్మాన్। ఫల్గుణీ వామృషభో రోరవీతి॥
పూర్వఫల్గుణీ దేవతాం సూర్యం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

**పూర్వాషాఢ :-**

యాదివ్యా ఆపః పయసా సంబభూవుః। యా అంతరిక్ష ఉతపార్థివీర్యాః।
యాసామాషాఢా అనుయంతి కామమ్। తాన ఆపశ్శగ్ంస్యోనా భవంతు।

యాశ్చ కూప్యాయాశ్చ నాద్యాస్సముద్రియాః। యాశ్చవైశంతీ రుతప్రాసచీర్యాః।
యాసా మషాఢా మధు భక్షయంతి। తాన ఆపశ్శగ్గ్ం స్యోనా భవంతు॥
పూర్వాషాఢా నక్షత్ర దేవతా ఆప ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

భరణీ :-

అపపాప్మానం భరణీర్భరంతు। తద్యమో రాజా భగవాన్ విచష్టామ్।
లోకస్యరాజా మహతో మహాన్ హి। సుగన్నః పంథా మభయం కృణోతు।
యస్మిన్నక్షత్రేయమ ఏతి రాజా। యస్మిన్నేనమభ్యషించంతదేవాః।
తదస్య చిత్రగ్ం హవిషా యజామ। అపపాప్మానం భరణీర్భరంతు॥
భరణీ నక్షత్ర దేవతాం యమమావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ధనిష్ఠా నక్షత్ర దేవతా వసూనావాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకు, దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

(ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, నాణెమును ఉంచి నమస్కరించాలి.)

శుక్ర:- శుక్రం తే అన్యదిత్యస్య మంత్రస్య భరద్వాజ ఋషిః। శుక్రగ్రహోదేవతా। త్రిష్టుప్ఛందః। (మమ) యజమానస్యాధి దేవతా ప్రత్యధి దేవతా సహిత శుక్రగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే శుక్రగ్రహారాధనే వినియోగః

ధ్యానం:- ప్రాచ్యాం భృగుర్భోజ కటప్రదేశస్స భార్గవః పూర్వముఖ స్వభావః।
నపంచకోణేశ రథాధిరూఢో దండాక్షమాలా వరదోఽంబుపాత్రః॥
శ్వేతవపుః కిరీటీ చతుర్భుజో దైత్యగురుః ప్రశాన్తః।
తథాఽసి దండం చ కమండలుంచ తథాక్షసూత్రం వరదోఽస్తు మహ్యామ్॥

మంత్రం:- శుక్రం తే అన్యద్యజతం తే అన్యద్విషురూపే అహనీద్యౌరి వాసి।
విశ్వాహి మాయా అవసి స్వధావో భద్రాతే పూషన్నిహరాతిరస్తు॥

(ఓం భూర్భువస్సువః॥ శుక్రగ్రహేహాగచ్ఛ। శుక్రగ్రహం శ్వేతవర్ణం, శ్వేతగంధం, శ్వేతపుష్పం, శ్వేతమాల్యాంబరధరం, శ్వేతచ్ఛత్రధ్వజ పతాకాది శోభితం దివ్యరథ సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, పూర్వాభిముఖం, పద్మాసనస్థం, చతుర్భుజం,

దండాక్షమాలా జటావల్కల ధారిణం, కాంభోజదేశాధిపతిం, భార్గవ సగోత్రం, మన్మథ సంవత్సర శ్రావణ శుక్ల దశమ్యాం పుష్యమీ నక్షత్రజాతం, తులా వృషభరాశ్యాధిపతిం, భృగువార ప్రయుక్తం, కిరీటినం,) సుఖాసీనం పుత్ర పరివార సమేతం గ్రహమండలే ప్రవిష్ట మస్మిన్నధికరణే సూర్యగ్రహస్య ప్రాగ్భాగే, పంచకోణాకార మండలే, శుక్రగ్రహ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అధిదేవత - ఇంద్రాణీ :- (ఋ-10మం-86సూ-11 మంత్రం)**

మంత్రం:- ఇంద్రాణీ మాసునారిషు సుపత్నీ మహమశ్రవమ్।

నహ్యస్యా అపరంచ న జరసా మరతే పతిః॥

శుక్రగ్రహాధి దేవతా మింద్రాణీం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తిం పుత్ర పరివార సమేతాం శుక్ర గ్రహస్య దక్షిణతః ఇంద్రాణీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధిదేవత - ఇంద్రమరుత్వంతః:-**

మంత్రం:- ఇంద్ర మరుత్వ ఇహపాహి సోమం యథా శార్యాతే అపిబస్సుతస్య।

తవ ప్రణీతీ తవ శూరశర్మన్నా వివాసంతి కవయస్సు యజ్ఞాః॥

శుక్రగ్రహ ప్రత్యధి దేవతాం ఇంద్ర మరుత్వంతం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివారసమేతం శుక్రగ్రహస్య ఉత్తరతః ఇంద్ర మరుత్వంత మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శుక్రగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

నైవేద్యం:-(పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంఘృతం సఫలం దేవగృహ్యతాం సర్వదేవతాః॥

ఓం భూర్భువస్సువః భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, మహానైవేద్యం సమర్పయామి।

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి। తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

# మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం, "ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థాః అయనాయ విద్యతే॥

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥

5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।
యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః।
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽ ధిపతిర్బ్రహ్మ శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయనతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యోఽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యోఽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

28. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

30. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।

ఆపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

32. యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥

33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।

ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥

34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।

త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥

35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।

బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥

36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥

37. తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥

38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।

ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శుక్రగ్రహ దేవతాభ్యోనమః। దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారం:-** శుక్రగ్రహ దేవతాభ్యో నమః। ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోళికామారోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునః నీరాజనం:-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము, చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపోஉహం పాపకర్మాஉహం పాపాత్మా పాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యథాశరణం నాస్తి,
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥

శుక్రగ్రహదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోஉచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

ఉద్వాసన:- "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేవానాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

శుక్రగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటప ములో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శ్రీ శుక్రగ్రహ దేవతా స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజ చేసి తరువాత శుక్రగ్రహజపము చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటుంటే "మమ" అని చెప్పాలి. "యాజమానస్య" అని చెప్పకూడదు. ఒకరు మరొకరికోసం జపం చేస్తుంటే "యాజమానస్య" అని చెప్పాలి. "మమ" అని చెప్పకూడదు.)

**శుక్రుడు :-**

శుక్రం తే అన్యదిత్యస్య మంత్రస్య, భరద్వాజ ఋషిః।

శుక్రగ్రహో దేవతా। త్రిష్టుప్ఛందః॥

యజమానస్య (మమ) అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శుక్రగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే శుక్రగ్రహ మంత్రజపం కరిష్యే।

**కరన్యాసము :-**

| | | |
|---|---|---|
| శుక్రం తే అన్యత్ | - | అంగుష్ఠాభ్యాన్నమః. |
| యజతం తే అన్యత్ | - | తర్జనీభ్యాన్నమః. |
| విషురూపే అహని | - | మధ్యమాభ్యాన్నమః. |
| ద్యౌరివాసి | - | అనామికాభ్యాన్నమః. |
| విశ్వాహి మాయా అవసి స్వధావః | - | కనిష్ఠికాభ్యాన్నమః. |
| భద్రాతే పూషన్నిహారాతిరస్తు | - | కరతల కరపృష్ఠాభ్యాన్నమః. |

**హృదయాదిన్యాసము :-**

| | | |
|---|---|---|
| శుక్రం తే అన్యత్ | - | హృదయాయ నమః. |
| యజతంతే అన్యత్ | - | శిరసేస్వాహా. |
| విషురూపే అహని | - | శిఖాయై వషట్. |
| ద్యౌరివాసి | - | కవచాయ హుం. |
| విశ్వాహి మాయాఅవసి స్వధావః | - | నేత్రత్రయాయ వౌషట్. |
| భద్రాతేపూషన్నిహారాతిరస్తు | - | అస్త్రాయ ఫట్. |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

**ధ్యానం:-**

ప్రాచ్యాం భృగుర్భోజ కటప్రదేశస్సభార్గవః పూర్వముఖ స్స్వభావః॥
పంచ కోణేశ రథాధిరూఢో దండాక్షమాలా వరదోఽంబు పాత్రః॥

**మంత్రం :-**

శుక్రం తే అన్యద్యజతం తే అన్యద్విషురూపే అహనీద్యౌరివాసి ।
విశ్వాహిమాయా అవసి స్వథావో భద్రాతే పూషన్నిహరాతిరస్తు ॥

**అధిదేవతా :-**

ఇంద్రాణీ మాసు నారిషు సుపత్నీ మహమశ్రవమ్ ।
నహ్యస్యా అపరంచ న జరసా మరతే పతిః ॥

**ప్రత్యధిదేవతా :-**

ఇంద్ర మరుత్వ ఇహ పాహి సోమం యథా శార్యతే అపిబస్సుతస్య ।
తవ ప్రణీతి తవశూర శర్మన్నా వివాసంతి కవయస్సుయజ్ఞాః ॥

అని ఒకసారి చెప్పాలి. తరువాత మంత్రమును 20,000 సార్లు జపించాలి.

**మంత్రం :-**

శుక్రం తే అన్యద్యజతం తే అన్యద్విషురూపే అహనీద్యౌరివాసి ।
విశ్వాహిమాయా అవసి స్వథావో భద్రాతే పూషన్నిహరాతిరస్తు ॥

(20,000 సార్లు)

తరువాత అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రాలను ఒక్కొక్కసారి చెప్పాలి.

తరువాత

"యాజమానస్య (మమ) శుక్రగ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు

(అని చెప్పి ఉద్ధరిణితో నీళ్ళను వదలాలి.)

**శుక్రగ్రహ మంత్ర తర్పణము :-**

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము గణపతి పూజ చేయాలి. ఇచట సంకల్పంలో 'జలతర్పణం కరిష్యామి' అని చెప్పుకోవాలి.)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి.

తర్పణము చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మన ముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

శుక్రగ్రహముకు సంబంధించిన "ధ్యానము"ను ఏకాగ్రతగా స్మరించాలి. ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని, శుక్రగ్రహ మంత్రమును చదవాలి. తరువాత "శుక్రాయ తర్పయామి నమః" తరువాత ఉద్ధరిణిలోకి తీసుకొని గ్రహ అధిదేవత

మంత్రమును చదివి" శుక్రగ్రహస్య అధిదేవతా : తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి. అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత "శుక్రగ్రహస్య ప్రత్యధిదేవతా: తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 200 సార్లు తర్పణము చేయాలి.

మరల గ్రహ అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను చదవాలి.

తరువాత

"శుక్రగ్రహ ప్రసాదేన మమ ఆరోగ్యసిద్ధిరస్తు, సర్వాభీష్ట సిద్ధిరస్తు" అని నీటిని పళ్ళెములో ధార పోయాలి.

(జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు 'మమ' చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నప్పుడు "మమ" స్థానంలో "యజమానస్య" అని చెప్పాలి)

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత, ప్రత్యధిదేవతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత భరణి, పుబ్బ, పూర్వాషాఢ, నక్షత్రములకు హోమం చేయాలి.

**పూర్వఫల్గుణీ (పుబ్బ) :-** అర్యమ్ణే స్వాహా॥ ఫల్గునీభ్యాగ్ం స్వాహా । పశుభ్య స్వాహా ।
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత ఫల్గుణీభ్యాగ్ంమైదం న మమ ॥
(108 సార్లు)

**పూర్వాషాఢా:-** విశ్వేభ్యోదేవేభ్యస్స్వాహా॥ అషాఢభ్యస్స్వాహా॥ ।
అనపజయ్యాయస్వాహా॥ । జిత్యైస్స్వాహా॥ ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత అషాఢాభ్యః ఇదం న మమ॥ (108 సార్లు)

**భరణీ:-** యమాయస్వాహా॥ అపభరణీభ్యస్స్వాహా॥ రాజ్యాయస్వాహా॥ అభిజిత్యైస్వాహా॥ ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత భరణీభ్యః ఇదం న మమ॥ (108 సార్లు)

ప్రతి నక్షత్రమునకు 108 సార్లు హోమం చేయాలి. తరువాత గ్రహముకు హోమం చేయాలి. గ్రహమంత్రమును, దానిఅధిదేత, ప్రత్యధిదేవత మంత్రము లను

వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి మేడిపుల్లలు, ఆవునేయి, బొబ్బర్లు హోమంలో వేయాలి. ఈ విధంగా శుక్రగ్రహ మూలమంత్రము, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు, ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత్, ప్రాయశ్చిత్తహోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము, ఆ గ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన, మంటప దానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధన చేసి పెద్దల ఆశీర్వాదమును పొందాలి. శుక్రగ్రహ హోమంలో మార్జన 20 సార్లు చేయాలి. కనీసం 20మందికి భోజనం పెట్టాలి.

## 123. స్మరణం

శుక్రగ్రహజపం చేయలేనివారు, శుక్రగ్రహ అనుగ్రహం పొందాలనుకొనేవారు ఈ క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

### శుక్రగ్రహ మంత్రములు

1. ఓం హ్రీం శ్రీం శుక్రాయ నమః ।
2. ఓం ఐం జం గం గ్రహేశ్వరాయ శుక్రాయ నమః ।
3. ఓం ఏం జం గీం గ్రహేశ్వరాయ శుక్రాయ స్వాహా ।
4. ఓం షుం శుక్రాయ నమః ।
5. ఓం ద్రాం ద్రీం ద్రౌం సః శుక్రాయ నమః ।
6. ఓం వస్త్రం మే దేహి శుక్రాయ నమః ।
7. ఓం శ్రీం హ్రీం క్లీం మహాలక్ష్మ్యై నమః ।
8. ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం క్లీం ఐంసౌః శ్రీం శుక్రాయ నమః ।
9. ఓం శ్రీం ద్రాం ద్రీం క్లీం బ్లూం శుక్రగ్రహాయస్వాహా
10. ఓం హ్రీం క్లీం శ్రీ కామాయ కామప్రదాయ శ్రీం క్లీం హ్రీం కవయే నమః ।
11. ఓం శాం శీం శూం దైత్యగురో సర్వాన్
    కామాన్ పూరయ పూరయ స్వాహా ।

### శుక్రగ్రహ గాయత్రీ మంత్రాలు

1. ఓం రాజ రూపాయ విద్మహే - భృగు
   సుతాయ ధీమహి తన్నశ్శుక్రః ప్రచోదయాత్ ॥

2. ఓం అశ్వధ్వజాయ విద్మహే-ధనుర్హస్తాయ
   ధీమహి: తన్నశ్శుక్రః ప్రచోదయాత్ ॥
3. మహా దేవ్యై చ విద్మహే విష్ణుపత్నైచ
   ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥
4. భార్గవాయ విద్మహే దానవార్చితాయ
   ధీమహి తన్నశ్శుక్రః ప్రచోదయాత్ ॥
5. భృగు జయాయ విద్మహే దివ్య దేహాయ ।
   ధీమహి తన్నశ్శుక్రః ప్రచోదయాత్ ।

**అనుకూల సమయాలు :-**

శుక్రుని అనుగ్రహం పొందాలనుకునేవారు శుక్రగ్రహజపం, హోమంచేసి, సమారాధన చేయుట ఉత్తమము. ఆ విధంగా చేయలేనివారు శుక్రునికోసం సూచించిన ఏ మంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది. అదేవిధంగా శుక్రుని స్తోత్రము చేయాలి.

శుక్రునకు అనుకూలమైన వారము శుక్రవారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యంలోని నక్షత్రములు భరణి, పుబ్బ, పూర్వాషాఢలున్న దినములు కూడ శుక్రునకు అనుకూలమైనవే. తదియ, దశమి శుక్రునకు అనుకూలించు తిథులు. ముఖ్యంగా వైశాఖ శుద్ధ తదియ, శ్రావణ శుద్ధ దశమి ఉత్తమమైనవి ఈ సమయాలలో ప్రత్యేకంగా శుక్రుని పూజించుట శుభకరము.

వరలక్ష్మీవ్రతము, దీపావళి పండుగలను భక్తిశ్రద్ధలతో జరిపిన శుక్రుడు అనుగ్రహిస్తాడు.

శుక్రుని పూజించునపుడు దీపారాధనకు ఆకాశనీలం రంగు వస్త్రముతో చేసిన వత్తిని వాడుట ఉత్తమము. పూజకు పటికబెల్లం, అలచందలగుగ్గిళ్ళను ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలు లేదా పేదవారికి అరటిపండ్లు, పాలు, పెరుగు, వెన్న, పంచదార, మిఠాయిలు, బొబ్బర్లు, రెడీమేడ్ వస్త్రములు వంటి శుక్రునికి సంబంధించిన ద్రవ్యములను దానం చేయాలి.

ప్రతిరోజు వెంకటేశ్వర పురాణం, లక్ష్మీదేవి సహస్రనామావళి పఠించాలి.

## 124. ఆరాధనం

క్రింది స్తోత్రములలో ఏదో ఒక దానిని ప్రతిదినం పఠించిన శుక్ర గ్రహానుగ్రహం పొందవచ్చు.

# శుక్ర స్తోత్రమ్

శృణ్వంతు మునయస్సర్వే శుక్రస్తోత్రమిదం శుభం ।
రహస్యం సర్వభూతానాం శుక్ర ప్రీతికరం పరమ్ ॥
యేషాం సంకీర్త నైర్నిత్యం సర్వాన్కామానవాప్నుయాత్ ।
తాని శుక్రస్యనామాని కథయామి శుభానిచ
శుక్రశ్శుభగ్రహశ్శ్రీమాన్ వర్షకృద్వర్షవిఘ్నకృత్
తేజోనిధిర్జ్ఞానదయా యోగీ యోగవిదాం వరః ॥
దైత్య సంజీవనశ్రాంతో దైత్యనేత్రోశనాఃకవిః
నీతికర్తా గ్రహాధీశో విశ్వాత్మా లోకపూజితః
శుక్లమాల్యాంబరధరః శ్రీచందనసమప్రభః ।
అక్షమాలాధరః కావ్యస్తపోమూర్తిర్ధనప్రదః

ఫలశ్రుతి :-

చతుర్వింశతినామాని అష్టోత్తరశతం యథా
దేవస్యాగ్రే విశేషేణ పూజాం కృత్వా విధానతః
య ఇదం పఠతి స్తోత్రం భార్గవస్య మహాత్మనః
విషమస్థో-పి భగవాన్ తుష్టస్స్యాన్నాత్ర సంశయః
స్తోత్రం భృగోరిదమనంతగుణప్రదం యో
భక్త్యా పఠేత మనుజో నియతశ్శుచిస్సన్
ప్రాప్నోతి నిత్యమతులాం శ్రియమిప్సితార్థాన్
రాజ్యం సమస్తధనధాన్య యుతం సమృద్ధిమ్ ॥

# శుక్రగ్రహ అష్టోత్తర శతనామావళీ స్తోత్రమ్

శుక్రశ్శుచి శ్శుభగుణో శుభపద శ్శుభలక్షణః
శోభనాక్ష శ్శుభ్రరూపశ్శుద్ధస్ఫటికభాస్వరః
దీనార్తిహారకో దైత్యగురుర్దేవాభినందితః
కావ్యాసక్తః కామపాలః కవిః కల్యాణదాయకః
భద్రమూర్తి ర్భద్రగుణో భార్గవో భక్తపాలనః
భోగదో భువనాధ్యక్షో భుక్తిముక్తిఫలప్రదః
చారుశీలశ్చారురూప శ్చారుచంద్రనిభాననః
నిధిర్నిఖిలశాస్త్రజ్ఞో నీతివిద్యాధురంధరః

సర్వలక్షణసంపన్న స్సర్వావగుణవర్జిత:
సమానాధిక నిర్ముక్తస్సకలాగమపారగ:
భృగుర్భోగకరో భూమీసురపాలనతత్పర:
మనస్వీ మానదో మాన్యో మాయాతీతో మహాశయ:
బలిప్రసన్నో భయదో బలీ బలపరాక్రమ:
భవపాశపరిత్యాగో బలిబంధవిమోచక:
ఘనాశయో ఘనాధ్యక్షో కంబుగ్రీవ:కళాధర:
కారుణ్యరససంపూర్ణ: కల్యాణగుణవర్ధన:
శ్వేతాంబర శ్వేతవపుశ్చతుర్భుజసమన్విత:
అక్షమాలాధరోఽచింత్య అక్షీణగుణభాసుర:
నక్షత్రగణసంచారో నయనో నీతిమార్గద:
వర్షప్రదో హృషీకేశో క్లేశనాశకర: కవి:
చింతితార్థప్రదశ్శాంతమతి శ్చిత్తసమాధికృత్
ఆధివ్యాధిహరో భూరివిక్రమ: పుణ్యదాయక:
పురాణపురుష: పూజ్య: పురుహూతాదిసన్నుత:
అజేయోవిజితారాతి: వివిధాభరణోజ్జ్వల:
కుందపుష్పప్రతీకాశో మందహాసో మహామతి:
ముక్తాఫలసమానాభో ముక్తిదో మునిసన్నుత:
రత్నసింహాసనారూఢో రథస్థోరజతప్రభ:
సూర్యప్రాగ్దేశ సంచార స్సురశత్రు సుహృత్కవి:
తులావృషభరాశీశో దుర్ధరో ధర్మపాలక:
భాగ్యదో భవ్యచారిత్రో భవపాశవిమోచక:
గౌడదేశేశ్వరో గోప్తా గుణీ గుణ విభూషణ:
జ్యేష్ఠానక్షత్ర సంభూతో జ్యేష్ఠ: శ్రేష్ఠ: శుచిస్మిత:
అపవర్గప్రదోఽనంత స్సంతానఫలదాయక:
సర్వైశ్వర్యప్రద స్సర్వగీర్వాణగణసన్నుత:

ఇతి శుక్రాష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణమ్

## 125. అభివందనం

క్రింది నామములతో శుక్రగ్రహయంత్రమును తరచు పూజించిన గ్రహానుగ్రహం కలుగుతుంది.

# శుక్రగ్రహ అష్టోత్తర శతనామావళి

ధ్యానమ్ :-

హిమకుందమృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్రప్రవక్తారంభార్గవం ప్రణమామ్యహమ్ ॥

**(ప్రతి నామమునకు ముందు 'ఓం' అని చివర 'నమః' అని చదువుకొనవలెను.)**

ఓం శుక్రాయ నమః
శుచయే
శుభగుణాయ
శుభదాయ
శుభలక్షణాయ
శోభనాక్షాయ
శుభ్రరూపాయ
శుద్ధస్ఫటికభాస్వరాయ
దీనార్తిహారకాయ
దైత్యగురవే
దేవాభినందితాయ
కావ్యాసక్తాయ
కామపాలాయ
కవయే
కల్యాణదాయకాయ
భద్రమూర్తయే
భద్రగుణాయ
భార్గవాయ
భక్తపాలనాయ
భోగదాయ
భువనాధ్యక్షాయ
భుక్తిముక్తిఫలప్రదాయ
చారుశీలాయ
చారురూపాయ
చారుచంద్ర నిభాననాయ
నిధయే
నిఖిలశాస్త్రజ్ఞాయ
నీతివిద్యాధురంధరాయ
సర్వలక్షణసంపన్నాయ
సర్వావగుణవర్జితాయ
సమానాధిక నిర్ముక్తాయ
సకలాగమపారగాయ
భృగవే
భోగకరాయ
భూమీసురపాలనతత్పరాయ
మనస్వినే
మానదాయ
మాన్యాయ
మాయాతీతాయ
మహాశయాయ
బలిప్రసన్నాయ
అభయదాయ
బలినే
బలపరాక్రమాయ
భవపాశపరిత్యాగాయ
బలిబంధవిమోచనాయ
ఘనాశయాయ
ఘనాధ్యక్షాయ
కంబుగ్రీవాయ
కళాధరాయ
కారుణ్యరససంపూర్ణాయ
కల్యాణగుణవర్ధనాయ
కవయే
శ్వేతాంబరాయ
శ్వేతవపుషే
చతుర్భుజసమన్వితాయ
అక్షమాలాధరాయ
అచింత్యాయ
అక్షీణగుణభాసురాయ
నక్షత్రగణసంచారాయ
నయదాయ 60
నీతిమార్గదాయ
వర్షప్రదాయ
హృషీకేశాయ
క్లేశనాశకరాయ
కవయే
చిన్తితార్థప్రదాయ
శాన్తిమతే
చిత్తసమాధికృతే
ఆధివ్యాధిహరాయ
భూరివిక్రమాయ
పుణ్యదాయకాయ
పురాణపురుషాయ
పూజ్యాయ
పురుహూతాదిసన్నుతాయ
అజేయాయ
విజితారాతయే
వివిధాభరణోజ్జ్వలాయ
కుందపుష్ప ప్రతీకాశాయ
మన్దహాసాయ
మహామతయే
ముక్తాఫలసమానాభాయ
ముక్తిదాయ

| | | |
|---|---|---|
| మునిసన్నుతాయ | ధర్మపాలనాయ | జ్యేష్ఠాయ |
| రత్నసింహాసనారూఢాయ | భాగ్యదాయ | శ్రేష్ఠాయ |
| రథస్థాయ | భవ్యచారిత్రాయ | శుచిస్మితాయ |
| రజితప్రదాయ | భవబన్ధవిమోచాయ | అపవర్గప్రదాయ |
| సూర్యప్రాగ్దేశసంచారాయ | గౌడదేశేశ్వరాయ | అనన్తాయ |
| సురశత్రుసుహృదే | గోప్త్రే | సన్తానఫలదాయకాయ |
| కవయే | గుణినే | సర్వైశ్వర్య ప్రదాయ |
| తులావృషభరాశీశాయ | గుణవిభూషణాయ | సర్వగీర్వాణసన్నుతాయ |
| దుర్ధరాయ | జ్యేష్ఠానక్షత్రసంభూతాయ | శ్రీశుక్రాయ |

## 126. అభినుతి

గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. శుక్ర గ్రహదేవతను కీర్తించండి.

## శుక్రకవచం

ఓమ్, అస్య శ్రీశుక్రకవచస్తోత్రమహామంత్రస్య భరద్వాజ ఋషిః, అనుష్టుప్ ఛందః, భగవాన్ శుక్రోదేవతా, అంబీజం, గంశక్తిః, వం కీలకం, మమశుక్ర గ్రహప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః, భాం అంగుష్ఠాభ్యాం నమః, భీం తర్జనీభ్యాం నమః, భూం మధ్యమాభ్యాం నమః, భైం అనామికాభ్యాం నమః, భౌం కనిష్ఠి కాభ్యాం నమః, భః కరతలకరపృష్ఠాభ్యాం నమః, ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సువరోమితి దిగ్బంధః,

ధ్యానమ్ :-

శుక్రం చతుర్భుజం దేవం అక్షమాలా కమండలుం ।
దండహస్తం చ వరదం భానుజ్వాలాజ్ఞశోభితమ్ ॥
శుక్లాంబరం శుక్లమాల్యం శుక్లగంధానులేపనం ।
వజ్రమాణిక్యభూషాఢ్యం కిరీటమకుటో జ్జ్వలమ్ ॥
శ్వేతాశ్వరథమారూఢం మేరుం చైవ ప్రదక్షిణం ।
మృణాళకుందేందు పయోహిమప్రభం సితాంబరం స్నిగ్ధవళక్షమాలినమ్ ॥
సమస్త శాస్త్రశ్రుతితత్వదర్శినం ధ్యాయేత్కవింవాంఛితవస్తుసంపదే
శిరో మే భార్గవః పాతు ఫాలం పాతు గ్రహాధిపః ॥
నేత్రేదైత్యగురుః పాతుశ్రోత్రే శ్రీచందనద్యుతిః ।
పాతు మే నాసికాం కావ్యో వదనం దైత్యవందితః ॥
రసనాముశనాః పాతు కర్ణం శ్రీకంఠభక్తిమాన్ ।
భుజౌ తేజోనిధిఃపాతు వక్షో యోగవిదాం వరః ॥

అక్షమాలాధరో రక్షేత్ కుక్షిం మే చక్షపాకర: ।
కటిం మే పాతు విశ్వాత్మాసక్థినీ సర్వపూజిత: ॥
జానునీతు భృగు: పాతుజంఘేమేమహాలాంవర: ।
గుల్ఫౌ గుణనిధి: పాతు పాదౌ మే పాండురాంబర: ॥
సర్వాణ్యంగాని మే పాతు శుక్ర: కవిరహర్నిశమ్,
య ఇదం కవచం దివ్యం పఠేచ్ఛ్రద్ధయాన్విత:,
న తస్య జాయతే పీడా భార్గవస్య ప్రసాదత:.

ఇతి శ్రీస్కాందే మహాపురాణే శంకర సంహితాయాం శుక్రకవచ:

## 127. అభివందనం

శుక్రగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. శుక్ర గ్రహదేవతలను కీర్తించండి.

## పరశురామావతార స్తుతి

నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే, కృష్ణహరే తవనామ వదామి సదాప్ప హరే ॥
క్షితిపతి వంశక్షయకర మూర్తే క్షితిపతికర్తా హరిహర మూర్తే
భృగుకులరామ పరేశనమో భక్తం తే పరిపాలయమాం
(శుక్రగ్రహ పరమాత్మాంశ - పరశురామావతారం)

## శుక్రగ్రహ మంగళాష్టకం

శ్లో॥ జటిలం సాక్ష సూత్రంచ - వరదండ కమండలుం ।
శ్వేత వస్త్రా వృతం శుక్రం - ధ్యాయేత్ దానవ పూజితం ॥
శుక్రో భార్గవ గోత్రజ స్సిత రుచి: పూర్వాముఖ: పూర్వదిక్
పాంచాలస్థవృషస్తులాధిపమహారాష్ట్రాధిపాదుంబర:
ఇంద్రాణీ మఘవాచ సౌమ్య రవిజో మిత్రోర్క చంద్రా వరీ
షష్ఠత్రిర్దశవర్జితే భృగుసుత: కుర్యాత్సదామంగళం ॥

## శుక్రగ్రహ స్తోత్ర కీర్తన

రచన : శ్రీముత్తుస్వామి దీక్షితార్

పల్లవి :శ్రీ శుక్రం భగవంతం చింతయామి । ॥శ్రీ శుక్ర॥
సతతం సకల తత్వజ్ఞం
అనుపల్లవి : హే శుక్ర భగవన్ మాం ఆశు
పాలయ వృష తులాధీశ-దైత్య

హితోపదేశ-కేశవ కటాక్షైక నేత్రం
కిరీట ధరం-ధవళ గాత్రం ॥శ్రీ శుక్ర॥

చరణం 1 : వింశతి వత్సరోడు దశావిభాగ మష్టవర్గం
కవిం కళత్ర కారకం రవి నిర్జర గురువైరిణం
నవాంశ హోర్ద్రేక్కాణాది వర్గోత్త
మావసరసమయే-వక్రోచ్చ నీచ స్వక్షేత్ర
వర కేంద్ర మూల త్రికోణం ॥శ్రీ శుక్ర॥

చరణం 2 : త్రింశాంశ షష్ట్యం శైరావతాంశ గోపురాంశ
రాజయోగ కారకం-రాజ్యప్రదం
గురు గుహ ముదం ॥శ్రీ శుక్ర॥

# 128. శుక్రగ్రహానుగ్రహంకై ప్రత్యేకస్తోత్రం

## శ్రీ మహాలక్ష్మ్యష్టకమ్(ఇంద్రకృతమ్)

ఇంద్ర ఉవాచ :-

నమస్తేఽస్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే ।
శంఖ చక్ర గదా హస్తే మహాలక్ష్మి నమోఽస్తుతే ॥
నమస్తే గరుడారూఢే డోలాసుర భయంకరి ।
సర్వ పాపహరే దేవి మహాలక్ష్మి నమోఽస్తుతే ॥ 2
సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్టభయంకరి ।
సర్వదుఃఖ హరే దేవి మహాలక్ష్మి నమోఽస్తుతే 3
సిద్ధి బుద్ధి ప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయిని ।
మంత్రమూర్తే సదా దేవి మహాలక్ష్మి నమోఽస్తుతే ॥ 4
ఆద్యంతరహితే దేవి ఆదిశక్తి మహేశ్వరి ।
యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి నమోఽస్తుతే ॥ 5
స్థూల సూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోదరే ।
మహా పాపహరే దేవి మహాలక్ష్మి నమోఽస్తుతే ॥ 6
పద్మాసన స్థితే దేవి పరబ్రహ్మ స్వరూపిణి ।
పరమేశి జగన్మాత ర్మహాలక్ష్మి నమోఽస్తుతే ॥ 7
శ్వేతాంబర ధరే దేవి నానాలంకార భూషి తే ।
జగత్స్థితే జగన్మాత ర్మహాలక్ష్మి నమోఽస్తుతే ॥ 8
మహాలక్ష్మ్యష్టకం స్తోత్రం యః పఠే ద్భక్తిమాన్నరః ।
సర్వసిద్ధి మవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా ॥ 9

ఏకకాలే పఠేన్నిత్యం మహాపాప వినాశనం ।
ద్వికాలం యః పఠేన్నిత్యం ధనధాన్య సమన్వితః ॥ 10
త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రు వినాశనం ।
మహాలక్ష్మీ ర్భవేన్నిత్యం ప్రసన్నా వరదా శుభా ॥ 11

## 129. యంత్రస్థాపనం

**శుక్ర గ్రహానుగ్రహం కోసం :-**

ఒక రాగిరేకుకు ఇరువైపులా క్రింది యంత్రమును రాయించి, పూజించాలి.

| 11 | 6 | 13 |
|---|---|---|
| 12 | 10 | 8 |
| 7 | 14 | 9 |

| 11 | 12 | 7 |
|---|---|---|
| 6 | 10 | 14 |
| 13 | 8 | 9 |

పై యంత్రమును "ఓం ద్రాం ద్రీం ద్రౌం సః శుక్రాయ నమః" అను మూలమంత్రమును 20,000 సార్లు జపిస్తూ, పూజించాలి.

**శుక్రయంత్రం (మంత్రమహార్ణవం) :-**

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై చెక్కించి, దానిని "ఓం ద్రాం ద్రీం ద్రౌం సః శుక్రాయనమః" అనుమూల మంత్రమును 2 లక్షల సార్లు జపిస్తూ పూజించాలి. స్త్రీ సౌఖ్యం, దాంపత్యసుఖం, కళాకారునిగా అభివృద్ధికోసం ఈ యంత్రము ఉపయోగపడుతుంది.



# 130. శని - ఒక వీక్షణ

1. ఇతరనామాలు - మందుడు, పంగు, సౌరి
2. లింగము - నపుంసకగ్రహము
3. జాతి - శూద్రజాతి
4. రంగు - నలుపు, నీలము
5. తత్త్వము - వాయు తత్త్వము
6. గ్రహస్వభావము - పాపగ్రహము
7. స్వభావము - తీక్షణస్వభావం
8. గుణము - తమోగుణము
9. రుచులు - వగరు
10. గ్రహోదయము - పృష్ఠ
11. జీవులు - చతుష్పాది
12. గ్రహస్థానము - దిబ్బప్రాంతాలు
13. అధిపత్యదిక్కు - పడమర
14. జలభాగం - నిర్జల
15. ఆత్మాధికారకత్వం - దుఃఖము
16. పాలనశక్తులు - సేవకుడు
17. శరీరధాతువు - నరములు
18. లోహధాతువు - ఇనుము, ఉక్కు
19. కుటుంబ సభ్యుడు - పరిచారకులు, రోగులు
20. గ్రహరూపవర్ణం - నీలము
21. గ్రహపీడ - కాళ్ళనెప్పులు
22. గ్రహవర్గం - శని
23. గృహభాగములు - టాయిలెట్స్, పాడుపెట్టిన ఇళ్ళు
24. కాల బలము - రాత్రి బలవంతులు
25. దిగ్బలము - పడమర దిక్కున బలవంతుడు
26. అధిపత్యకాలము - సంవత్సరము
27. స్వక్షేత్రము - మకరం, కుంభం
28. శత్రుక్షేత్రము - కర్కాటకము, సింహము
29. మిత్రక్షేత్రము - వృషభము, మిధునము, కన్య
30. విషమక్షేత్రము - .....

31. సమక్షేత్రము - ధనస్సు, మీనము
32. ఉచ్చరాశి - తుల
33. నీచరాశి - మేషం
34. మూల త్రికోణము - కుంభంలో 20 డిగ్రీలవరకు
35. పరమ ఉచ్చ - తులలో 20వ డిగ్రీ
36. పరమ నీచ - మేషంలో 20వ డిగ్రీ
37. మిత్ర గ్రహాలు - బుధుడు, శుక్రుడు
38. శత్రుగ్రహాలు - రవి, చంద్రుడు, కుజుడు
39. సమగ్రహాలు - గురుడు
40. వ్యథా గ్రహము - కుజుడు
41. నైసర్గిక బలగ్రహము - కుజుడు
42. దిన చలనం - సుమారుగా 2 నిమిషాలు
43. రాశిలో గ్రహం ఉండే కాలం - 2 1/2 సంవత్సరాలు
44. రాశిలో ఫలమిచ్చేభాగం - రాశిలో చివరిభాగం
45. గ్రహ ప్రకృతి - వాత తత్త్వము
46. ఋతువు - శిశిర ఋతువు
47. దిగ్బలము - సప్తమ భావము
48. సూచించు ఎత్తు - పొడుగు
49. సూచింపబడే వయస్సు - 100 సంవత్సరాలు
50. సూచించు ప్రాంతాలు - గంగానది నుండి హిమాలయముల వరకు గల ప్రాంతాలు
51. నివాస ప్రాంతం - పురాతన ప్రదేశములు, పాడుబడిన స్థలములు
52. సూచించబడే శరీరావయవములు - ఎముకలు, క్లోమము, విసర్జనావయవములు
53. సూచించే శరీర వ్యాధులు - అమీబియాస్, అజీర్ణము, ఎముకలు చిట్లుట, జలుబు, దంతవ్యాధులు, బోదకాలు, పక్షవాతము, దీర్ఘకాల వ్యాధులు
54. గోచారరీత్యా శుభస్థానములు - 3,6,11
55. గోచారరీత్యా అశుభస్థానములు - 1,2,4,5,7,8,9,10,12
56. గోచారరీత్యా వేధస్థానములు - 5,9,12
57. గ్రహదశా కాలము - 19 సంవత్సరములు

58. జీవన కారకత్వము - ఆయుః కారకుడు, రోగకారకుడు
59. సంబంధించిన నక్షత్రాలు - పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర
60. సూచించు వృక్షజాతి - నీరసవృక్షములు
61. సూచించు ధాన్యం - మినుములు
62. సూచించు పండ్లు - నేరేడు
63. సూచించు పక్షులు - పికము
64. సూచించు జంతువులు - గేదెలు, కుక్కలు
65. సూచించు ఇతర ద్రవ్యములు - నువ్వులు, నూనె
66. సంబంధించిన సమిధ - జమ్మి
67. సంబంధించిన మూలిక - జమ్మి, దర్భలు
68. సూచించు వస్త్రము - చిరిగిన వస్త్రములు
69. దేవవర్గము - శైవ
70. గ్రహగోత్రము - కాశ్యప
71. వేదములు - ......
72. శుభత్వం - పూర్ణపాపి
73. అవతారం - కూర్మావతారం
74. గ్రహస్వరూపం - గచ్చకన్నులు, బిరుసైన వెంట్రుకలు కలిగి బక్కపలుచగా ఉండును. నాలుగు భుజములు కలిగి ధనుర్బాణములు, శూలము ధరించినవాడు.
75. గ్రహ స్వరూప వర్ణం - నీల కాంతి
76. గ్రహారూఢ వాహనం - గ్రద్ధ
77. పూజార్థం గ్రహ ప్రతిమకు వాడవలసినది - లోహము
78. గ్రహప్రీతికి నైవేద్యం - నువ్వులపిండి కలిపిన అన్నం
79. అధిష్ఠాన దేవత - భైరవుడు
80. అధిదేవత - యముడు
81. ప్రత్యధిదేవత - ప్రజాపతి
82. గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు - అయ్యప్పస్వామి జయంతి
83. చేయవలసిన ప్రసాదము - ద్రాక్షరసం, చిమ్మిరిఉండలు
84. దోష నివారణకు దక్షిణ - కపిలగోవు

85. ప్రీతికరమైన తిథి - జ్యేష్ఠ శుక్ల ద్వాదశి, మార్గశిర శుక్ల అష్టమి
86. ఆచరించవలసిన వ్రతము - శనీశ్వరవ్రతం
87. పారాయణ చేయవలసిన పురాణాలు - కూర్మపురాణం
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - శనిగ్రహ అష్టోత్తర శతనామావళి
89. పారాయణ చేయవలసిన సహస్రనామావళి - వెంకటేశ్వర సహస్ర నామావళి
90. ఆచరించవలనసిన దీక్ష - అయ్యప్ప స్వామి దీక్ష
91. ధరించవలసిన మాల - ఎఱ్ఱ చందనమాల
92. ధరించవలసిన రత్నము - నీలమణి
93. ధరించవలసిన రుద్రాక్ష - చతుర్దశముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - శనీశ్వర ఆలయం, ఆంజనేయ స్వామి దేవాలయం, శివాలయం.
95. చేయవలసిన పూజలు - శనీశ్వర వ్రతం, సత్యనారాయణ పూజ, అయ్యప్ప పూజ.
96. దానంచేయవలసిన ద్రవ్యములు - నువ్వులు, అవాలు, నల్లద్రాక్ష
97. గ్రహజప సంఖ్య - 19,000
98. హోమముకు వాడు సమిధ - జమ్మి
99. నవగ్రహమండపంలో గ్రహాఆసనం - ధనుస్సు ఆకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 3,7,10 రాశులు
101. గ్రహసంఖ్య - 8
102. గ్రహం సూచించు వారం - శనివారం
103. శుభ సమయం - సంధ్యా సమయం, రాత్రి
104. ప్రతినిధి గ్రహాలు - శుక్ర+బుధ, కుజ+బుధ
105. గ్రహం బలంగా ఉండే ఫలితం - అనుకున్న పనులు సాధిస్తా, మనశ్శాంతిని కలిగి ఉంటారు.
106. గ్రహం బలహీనంగా ఉండే ఫలితం - అన్ని పనులకు ఆటంకాలు కలిగి చికాకు కలుగుతూ ఉంటుంది.
107. తండ్రి - సూర్యుడు
108. తల్లి - ఛాయ
109. భార్య - జ్యేష్ఠాదేవి

| | | |
|---|---|---|
| 110. | సూచించు లోహములు | - ఇనుము, సీసము |
| 111. | గ్రహప్రభావితుల మనఃస్థితి | - స్థిర చిత్తము |
| 112. | భావకారకత్వం | - మూర్ఖత్వము, బద్ధకము |
| 113. | గ్రహదృష్టి | - అధోదృష్టి |
| 114. | గ్రహమునకు గుర్తు | - |
| 115. | సంబంధించిన వృత్తి | - నూనెలు, ఇనుము, ఫిజీషియన్ |

# 131. ఖగోళశాస్త్ర పరంగా శని

సూర్యుని నుండి ఆరవగ్రహంగా ఉండే గ్రహం శని. శనిగ్రహమును "శాటర్న్" అంటారు. రోమన్ పురాణ కథలలో శాటర్న్ వ్యవసాయ సంబంధమైన దైవము. శనిగ్రహమును గ్రీకులు 'క్రోనస్' అని పిలిచేవారు. సాటర్‌డే (శనివారం) ఈ శనిగ్రహం ద్వారానే ఏర్పడింది.

శనిగ్రహం ద్రవ్యరాశి $5.67\times10^{26}$ కిలోగ్రాములు. భూమి పరిమాణం కంటె 736 రెట్లు పెద్దది. సూర్యుని నుండి 142,70,00,000 కిలోమీటర్ల దూరంలో ఉన్నది. ఇది సూర్యుని చుట్టు తిరుగుటకు 29 సంవత్సరాల 6 నెలల సమయం పడుతుంది. తన చుట్టు తాను తిరుగుటకు 10 గంటల 23 నిమిషాలు పడుతుంది. శని సూర్యుని చుట్టు గంటకు 9.66 కిలోమీటర్ల వేగంతో తిరుగుతుంది. శని సూర్యుని చుట్టూ తిరిగి వచ్చుటకు 10,750 రోజులు పడుతుంది. శనిగ్రహ మధ్యరేఖ వ్యాసం 1,20,536 కిలోమీటర్లు. సూర్యకుటుంబంలో గురువు తరువాత శని గ్రహమే పెద్దది. శని ఉపరితల సాంద్రత, నీటి సాంద్రత కంటె తక్కువ అందువలన శనిగ్రహం నీటిలో తేలుతుంది.

శని ఉపరితలమంతా వాయువులతో నిండి ఉంటుంది. అంతర్భాగం మాత్రం రాళ్ళు, మంచు కలసి గట్టిగా ఉంటుంది. శని అంతర భాగంలో 11,726 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత ఉంటుంది. ఉపరితలంపైన మాత్రం - 140 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత ఉంటుంది.

శని ఉపరితలంపై గంటకు 1116 కిలోమీటర్లు వేగంతో గాలులు వీస్తాయి. శనిగ్రహం చుట్టు వలయాలు ఉంటాయి. ఈ వలయాలలో ఇసుక పరిమాణం నుంచి పర్వత పరిమాణం వరకు గల గ్రహ శకలాలు ఉంటాయి. ఈ వలయాలు 1 కిలోమీటరు మందంతో 2,50,000 కిలోమీటర్లు వ్యాసం కలిగి ఉంటాయి.

శనికి దాదాపుగా 30 ఉపగ్రహాల వరకు కలవు.

# 132. పురాణాల పరంగా శని

శని నీలకాంతితో మెరియు శరీర కాంతి కలవాడు. నాలుగు భుజములు కలవాడు. ధనుర్బాణములు, శూలమును ధరించువాడు. గ్రద్దను వాహనముగా అధిరోహించును. ఇతనికి మందుడు, పంగు, సౌరి అను పేర్లు కలవు.

త్వష్ట ప్రజాపతి తన కూతురైన సంజ్ఞాదేవిని, సూర్యునికి ఇచ్చి వివాహం చేయగా, ఆమె సూర్యకిరణ ప్రతాపాగ్నికి తట్టుకోలేక కొంతకాలం పుట్టింట గడిపి వద్దామని నిశ్చయించుకొని, తనకు బదులుగా తన ప్రతిరూపం అయిన ఛాయను సృజించి, భర్తవద్ద ఉంచింది.

ఆ విషయ తెలియని సూర్యుడు తన భార్యగా ఛాయాదేవి యందు ఒక కుమారుడిని కన్నాడు. శనైశ్చరుడితడే! మాఘకృష్ణపక్ష చతుర్దశియందు విభవనామ సంవత్సరంలో ధనిష్ఠా నక్షత్రాన జన్మించాడు. విష్ణుమూర్తికి తోడల్లుడుగా, యమధర్మరాజుకు సోదరుడుగా, యమునకు కూడ అన్నగా, గ్రహాలలో యువరాజుగా శనికి ఒక ప్రత్యేకత ఉంది.

భారతదేశాన్ని పాలించిన షట్చక్రవర్తులు హరిశ్చంద్ర, సగర, నల, పురుకుత్స, పురూరవ, కార్త వీర్యార్జునులను శని ముప్పుతిప్పలు పెట్టినా, చివరకు వారిని అనుగ్రహించి ముదము చేకూర్చాడు. కనుకనే యెంతటివారినైనను శని వదలడు అనేమాట సార్ధకం అయింది.

# 133. జ్యోతిష్యశాస్త్ర పరంగా శని

**లక్షణాలు :-**

శని నపుంసకగ్రహము. ఇతను రుచులలో వగరును, రంగులలో నలుపు, నీలములను సూచించును. ఇతను శూద్ర జాతికి చెందినవాడు. అధిదేవత యముడు. ముసలివారిని సూచించును. సన్నని, పొడుగైన వారిని సూచించును. ఇతను వాత తత్త్వమును సూచించును. వాయు తత్త్వము కలిగి పడమర దిక్కును సూచించును. శని శిశిర ఋతువును సూచించును. లోహములలో ఇనుము, ఉక్కును, రత్నములలో నీలమును సూచించును. ఈ గ్రహసంఖ్య 8. సప్తమ భావంలో దిగ్బలము పొందును. ఇతను తమోగుణ ప్రధానుడు. గంగానది నుండి హిమాలయముల వరకు ఇతనిదేశంగా జాతక పారిజాతము సూచించును.

శని పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములకు అధిపతి. శరీరావయవములలో ఎముకలు, క్లోమము, విసర్జనావయవములను సూచించును.

శని మకరం, కుంభం రాశులకు అధిపతి. ఇతనికి ఉచ్ఛరాశి తుల. నీచరాశి మేషం. తులలో 20వ డిగ్రీ ఇతనికి పరమోచ్ఛ. మేషంలో 20వ డిగ్రీలో పరమనీచ. ఇతనికి బుధ, శుక్రులు స్నేహితులు, రవి, చంద్ర, కుజులు శత్రువులు. గురుడు సముడు.

**శని ప్రభావం :-**

సన్నగా, పొడవుగా వుంటారు. కన్నులు గుంటలు పడి వుండవచ్చు. అనుమానం ఎక్కువ. ఒంటరితనాన్ని కోరుకుంటారు. ఆకలి తక్కువగా ఉంటుంది. మూఢాచారపరులు కష్టజీవులు. దీర్ఘకోపము, దీర్ఘాలోచన ఎక్కువ. నడక, ఆలోచన మందంగా వుంటాయి.

వాతము, అజీర్ణము, శ్వాసకోశవ్యాధులు ఉండవచ్చును.

కార్మికశాఖ, ఆరోగ్యశాఖ, పరిశోధనాశాఖ, మారిటోరియంలలో రాణిస్తారు.

**కారకత్వములు :-**

శని ఆయుః కారకుడు. ఆటంకములు, వ్యాధులు, కష్టములు, విరోధము, బాధలు, దుఃఖము, నౌకరీ, దురాచారము, మూర్ఖత్వము, బంధనము, జూదము, కారాగారము, మద్యపానము, అంగవైకల్యము, మూర్ఛరోగము, బ్లాక్ మార్కెట్, అన్యాయంతో ధనార్జన, జీవహింస, అవమానము, రాజదండన, బద్ధకము, క్షుద్రశక్తులు, అప్పులు, మృత్యుదేవతారాధన, బంధువులచే తిరస్కారములను సూచించును. అందవిహీనులు, చండాలురు, నపుంసకులు, అక్రమ సంతానము, సేవకులు, నీచులు, వంటవారు, పురాతన భవనములు, పురాతన వస్తువులు, పురాతన వస్తు శాఖ, సొరంగాలు, గుహలు, చలిప్రదేశములు, నువ్వుల నూనె, గానుగ, నూనె దుకాణములను సూచించును. నువ్వులు, ఉల్లి, వేరుశెనగ, బంగాళాదుంపలు, రాగులు, జొన్నలు, మినుములు, దున్నపోతు, గాడిద, ఒంటె, కోడి, బొగ్గు, తారు, నల్లమందు, కిరోసిన్, ఎముకలు, వెంట్రుకలు, దంతములును సూచించును. కలప, తోలు పరిశ్రమలను సూచించును.

ఆలస్యము, పొదుపు, దుఃఖము, ఆటంకములు, దురదృష్టము, సరిహద్దులు, దహనకార్యక్రమములు, అపవాదు, పదవీవిరమణ, నిర్మాణము, శాస్త్రీయ దృక్పథం కలవారు, ఒంటరితనం, పురాతత్వశాస్త్రం, గనులు, బ్రిడ్జి, ధ్వని, చర్మము, ఆనకట్టలు, పిరికివారు, ఎముకలు, రాళ్ళు, రాగి, మంచు, ఆస్తి, ఆపద, అనుమానము, అననుకూలత, ఆందోళన, సిరామిక్స్, వినయము, మట్టిని సూచించును.

**శని సూచించు విద్యలు :-**

శని ఖనిజములు, బొగ్గుగనులు, పురాతన వస్తుసేకరణ, గనులు, భూగర్భశాస్త్రము, జ్యోతిష్యము, ఇంగ్లీషుభాష, ఫ్రిజ్‌ల తయారీ, ఆర్థోపెడిక్స్‌లను సూచించును.

**శని సూచించు వ్యాధులు :-**

వాత సంబంధమైన జబ్బులను శని కలిగిస్తాడు. కీళ్ళవాతం, పక్షవాతం, అవయవాలు బలహీనపడి పనిచేయకపోవటం, నొప్పులును సూచించును. కిడ్నీ, లివరు ఇతర ప్రాంతాలలో రాళ్ళు ఏర్పడుట, బ్రోంకైటీస్, క్షయ, దగ్గు, ఆస్తమా, న్యుమోనియా వంటి ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులను సూచించును. ఎముకలు విరిగిపోవుట, ఎముకల జాయింట్లు అరిగిపోవుట, ఎముకల కాన్సర్ వంటి ఎముకలకు సంబంధించిన వ్యాధులను, గజ్జి, తామర వంటి చర్మ వ్యాధులను, వెంట్రుకలు తెల్లబడటం, రాలిపోవటం, గోళ్ళు పుచ్చిపోవటం లను శని సూచించును. అజీర్ణము, అంధత్వం, కోమా, నడవలేనిస్థితి, ఏపనిని చేయలేని స్థితి, డ్రగ్స్‌కు బానిసకావటం, ఫ్రిజిడిటీ, నపుంసకత్వములను సూచించును. చంద్రునితో కలసి కంటిలో కాటరాక్ట్ (శుక్లాలు) ను, మతిభ్రమణం, గర్భాశయ వ్యాధులు, ప్రసవం సక్రమంగా జరగకపోవడం, పిచ్చి, మూర్ఛ, సన్నిపాత జ్వరం, గుండె నొప్పి, తలనొప్పి, కండరాలనొప్పి, అతిదాహం, నీరసం, బద్ధకం, శరీరావయవములు మొద్దుబారటం లేదా చచ్చుబడటం వంటివాటిని సూచించును. గురునితో కలసి జీర్ణక్రియ సరిగా లేకపోవుట, కాలేయ వ్యాధులను, రవితో కలసి రక్తం చెడిపోవుట, కుడికంటికి సంబంధించిన వ్యాధులును, బుధునితో కలసి నత్తి మాటలు రాకపోవటం, నాలుకమొద్దుబారటం, మెదడు మొద్దుబారటం, చెవికి సంబంధించిన రోగాలు. చెవుడు, కుజునితో కలసి కండరాల నొప్పి, కండరాల జబ్బులను, శుక్రునితో కలసి గొంతునొప్పి, టాన్సిల్స్ వాయుట, అమీబియాస్, విరోచనాలు, పైల్సు పిస్టులా మొదలగు రోగాలను, రాహువుతో కలసి విషప్రయోగం, వైరస్ వలన కలిగే వ్యాధులు, కేతువుతో కలసి అధికరక్తపోటును సూచించును.

శని రోగకారకుడు, మరణ కారకుడు.

శని ఏ జబ్బునైనా త్వరగా తగ్గనీయడు.

**శని సూచించు వృత్తి వ్యాపారాలు :-**

జైలర్, పోలీసు, వాచ్‌మన్, ప్లంబర్, పాకీపనిచేయువారు, వీధులను ఊడ్చేవారు, కూలీలు, మేస్త్రీ తాపీమేస్త్రీ తోటమాలి, రైతులను సూచించును.

లోహాలు, తోలు, కలప లకు సంబంధించిన డీలరులను సూచించును. చంద్రునితో కలసి సివిల్ ఇంజనీర్లు, బిల్డర్స్, సర్వేయర్లు, ఎక్స్‌రే టెక్నీషియన్ లను సూచించును. రవితో కలసి ప్రభుత్వ సంస్థలలో స్థానిక సంస్థలలో పనిచేయు వారిని, గురునితో కలసి రియల్ ఎస్టేట్ వ్యాపారస్థులు, గనుల యజమానులు, సైంటిఫిక్ లేబొరేటరీలలో పనిచేయువారు, బ్యాంకు సిబ్బంది, ప్రచారం చేయువారిని, బుధునితో కలసి నవలారచయితలు, కలపను కోయు వారు, శాస్త్రవేత్తలు, ఉపాధ్యాయులు, సెన్సార్ చేయువారు, రహస్య పరిశోధక సంస్థలలో పనిచేయువారలను సూచించును.

## ద్వాదశ లగ్నాలలో శని - ఫలితాలు

**మేషం లగ్నమైతే**

- మేషలగ్నమై లగ్నమున శనియున్నపుడు, చంద్రలగ్నము నుండి కేంద్రములలో కుజుడుకాని, రవి కాని యుంటే ఆ జాతకుడు విశేష ధనవంతుడు అగును, భోగభాగ్యములు కలుగును. లేకున్న సుఖహీనుడు అగును.
- 2 వ స్థానమున శనియున్న ధననష్టము, మరణభయం కలుగును.
- 3 వ స్థానమున శనియున్న తమ్ముళ్ళు ఉండరు.
- 4 వ స్థానమున శనియున్న తండ్రి సంపాదించిన భూమిని కోల్పోవును. తల్లికి అనారోగ్యం కలుగును. విద్యకు ఆటంకములు కలుగును.
- 5 వ స్థానమున శనియున్న సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానమున శనియున్న శత్రువులు కూడ మిత్రులవుతారు.
- 7 వ స్థానమున శనియున్న శుభప్రదమైన జీవితం కలుగును. కాని కళత్ర విచారము కలుగును.
- 8 వ స్థానమున శనియున్న కార్యమునకు అనుకూలత లేకపోవుట, ధననష్టము కలుగును.
- 9 వ స్థానమున శనియున్న తండ్రికి అనారోగ్యము, ధనసంపాదన కలుగును.
- 10 వ స్థానమున శనియున్న ధనలాభము కలుగును.
- 11 వ స్థానమున శనియున్న ధనసంపాదన కలుగును.
- 12 వ స్థానమున శనియున్న అంగవిహీనము కలుగును.

**వృషభం లగ్నమైతే**

- వృషభ లగ్నమై 1 వ స్థానములో శని వుంటే జాతకుడు ఎక్కువగా ధనము సంపాదించి, పేరు ప్రతిష్ఠలు సంపాదించును. బలహీనుడు.
- 2 వ స్థానములో శని వుంటే జాతకుడు ధనము అధికంగా లభించినను ధనము మాత్రము కూడబెట్టలేడు.
- 3 వ స్థానములో శనివుంటే జాతకునికి అపుడప్పుడు రోగాలు వస్తూ, తగ్గు చుండును.
- 4 వ స్థానములో శని వున్నట్లయితే జాతకునికి అధికంగా రాజయోగము వచ్చును.
- 5 స్థానములో శని వుంటే జాతకునికి సంతాన సుఖము ఉండదు. ఉద్యోగము, వాహనము, ధనము లభించును.
- 6 వ స్థానములో శని వుంటే దాయాదుల వలన ఆస్తి లభించును.
- 7 వ స్థానములో శని ఉంటే వివాహం వలన ఆస్తి లభించును.
- 8 వ స్థానములో శని వుంటే తన వద్ద వున్న ధనము అంతా చుట్టాలకు, స్నేహితుల కొరకు, ఖర్చు చేయును.
- 9 వ స్థానములో శనివుంటే జాతకునికి తండ్రి ప్రేమ తక్కువగా వుండి, తండ్రి సంపాదించిన ధనము ఎక్కువగా వచ్చును.
- 10 వ స్థానములో శని వున్నట్లయితే జాతకునికి వాహనం, అధికారం, ఉద్యోగము లభించును. ధనము సంపాదించి పేరు ప్రతిష్ఠలు పొందువాడు అవుతాడు.
- 11 వ స్థానములో శని వుంటే జాతకునికి విరోధులు, రోగాలు, అప్పులు ఎక్కువగా వుండును కాని అవమానము మాత్రం జరుగదు.
- 12 వ స్థానంలో శనియున్న ధనసంపాదన తక్కువ.

**మిథునం లగ్నమైతే :-**

- మిథున లగ్నమై లగ్నంలో శనియున్న అనారోగ్యము, కురూపి, చెడుస్నేహము, నిర్దయ కలుగును.
- 2 వ స్థానంలో శనియున్న తండ్రి సంపాదించిన ఆస్తి నష్టము, అనారోగ్యము, మరణ భయము కలుగును.

- 3 వ స్థానంలో శనియున్న సోదర నష్టం కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న చదువు లేకపోవుట, తల్లికి అనారోగ్యము, పూర్వుల ఆస్తి నష్టము, పురాతన గృహము లభించును.
- 5 వ స్థానంలో శనియున్న పూర్ణాయుర్దాయము, పుత్రశోకము కలుగును.
- 6 వ స్థానంలో శనియున్న సుఖము, దుఃఖము క్రమముగా కలుగును. లాభ, నష్టములు సమానంగా ఉండును.
- 7 వ స్థానంలో శనియున్న స్థూలశరీరము కల భార్య లభించును. అన్యస్త్రీ సాంగత్యం లభించును.
- 8 వ స్థానంలో శనియున్న తండ్రికి నష్టము, పూర్ణాయుర్దాయము కలుగును.
- 9 వ స్థానంలో శనియున్న తండ్రికి అనారోగ్యము, పిత్రార్జిత ధనము నష్టము కలుగును.
- 10 వ స్థానంలో శనియున్న ఆచారహీనత, సాధారణ జీవనము కలుగును.
- 11 వ స్థానంలో శనియున్న పిత్రార్జిత నష్టము, స్వార్జిత ధన వ్యయం, ధనార్జనకు విఘ్నము కలుగును.
- 12 వ స్థానంలో శనియున్న నీచస్నేహితులు, అనవసర ధనవ్యయం, శిక్షలు కలుగును.

కర్కాటక లగ్నమైతే :-

- కర్కాటకము లగ్నమై లగ్నములో శనియున్న అనారోగ్యము, దుష్ప్రవర్తన, నీచస్వభావం కలుగును.
- 2 వ స్థానంలో శనియున్న కుటుంబ సుఖము తక్కువ, ధనవ్యయము కలుగును.
- 3 వ స్థానంలో శనియున్న సోదర నష్టము కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న కొంతకాలం సుఖశాంతులు కలిగి తరువాత కష్టము కలుగును.
- 5 వ స్థానంలో శనియున్న సంతానము కలుగును.
- 6 వ స్థానంలో శనియున్న శత్రువుల వలన, అనారోగ్యము వలన చికాకులు కలుగును.
- 7 వ స్థానంలో శనియున్న అనారోగ్యం కలుగును.

- 8 వ స్థానంలో శనియున్న నష్టములు వాటిల్లును. ఋణం కలుగును.
- 9వ స్థానంలో శనియున్న తండ్రికి ఆపద, తండ్రి సంపాదించిన ఆస్తి నష్టమగును.
- 10 వ స్థానములో శనియున్న భార్యవలన దుఃఖము కలుగును.
- 11 వ స్థానములో శనియున్న సుఖము, ధనము కలుగును.
- 12 వ స్థానములో శనియున్న నీచులస్నేహము, ధనమంతా వ్యయమగుట కలుగును.

**సింహం లగ్నమైతే :-**

- సింహలగ్నమై లగ్నంలో శనియున్న మందబుద్ధి, అందవిహీనము, శరీర బాధలు కలుగును.
- 2 వ స్థానంలో అశాంతి, కళత్రముకు అనారోగ్యము, సంతానం వలన దుఃఖము, మరణభయము కలుగును.
- 3 వ స్థానంలో శనియున్న సోదర నష్టము, మంచిభార్య, ఋణబాధ కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న మాతృసౌఖ్యము, విద్య, స్వల్పంగా భూమి లభించును.
- 5 వ స్థానంలో శనియున్న సామాన్య జీవనం కలుగును.
- 6 వ స్థానంలో శనియున్న దాయాదుల ఆస్తి లభించును.
- 7 వ స్థానంలో శనియున్న స్థూలకాయురాలు భార్యగా వచ్చును. సుఖము, దుఃఖము రెండును కలుగును.
- 8 వ స్థానంలో శనియున్న అనారోగ్యం, ఋణబాధ కలుగును.
- 9 వ స్థానంలో శనియున్న భార్యవలన దుఃఖం కలుగును.
- 10 వ స్థానంలో శనియున్న ఆచారాలు పాటించనివాడు.
- 11 వ స్థానంలో శనియున్న భూమి, ధనము లభించును.
- 12 వ స్థానంలో శనియున్న కష్టములు, నష్టములు, బంధనయోగం కలుగును.

**కన్యలగ్నమైతే :-**

- కన్య లగ్నమై లగ్నమున శనియున్న సామాన్య జీవనము, అనారోగ్యము, బాధ కలుగును.
- 2 వ స్థానములో సుఖము, ధనము, కార్యసిద్ధి, సంతానం వలన విచారం కలుగును.

- 3 వ స్థానములో శనియున్న భూ, ధనలాభము, కార్యలాభము కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న సామాన్యవిద్య, తండ్రి సంపాదించిన ధనము లభించును.
- 5 వ స్థానంలో శనియున్న పుత్ర సంతానం తక్కువ, స్త్రీ సంతానం ఎక్కువ.
- 6 వ స్థానంలో శనియున్న సుఖహీనము, రోగబాధ, ఋణబాధలు కలుగును.
- 7 వ స్థానంలో శనియున్న కళత్ర విచారము కలుగును.
- 8 వ స్థానంలో శనియున్న సుఖహీనము, కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో శనియున్న పితృసుఖము తక్కువ. ఆస్తిని సంపాదించును.
- 10 వ స్థానంలో శనియున్న సామాన్యజీవనము, దురాచారములను పాటించును. సేవకావృత్తి వలన జీవనం కలుగును.
- 11 వ స్థానంలో శనియున్న సుఖము, ధనము, కార్యలాభము కలుగును.
- 12 వ స్థానంలో శనియున్న చెడు ప్రవర్తన, అనవసర ఖర్చులు కలుగును.

**తుల లగ్నమైతే :-**

- తులా లగ్నమై లగ్నంలో శనియున్న మందబుద్ధి కలుగును.
- 2 వ స్థానంలో శనియున్న ధనమును సంపాదించును, ఖర్చుపెట్టును.
- 3 వ స్థానంలో శనియున్న తమ్మునికి ఆపద కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న భూమి, ధనము లభించును.
- 5 వ స్థానంలో శనియున్న స్త్రీ సంతానం ఎక్కువ.
- 6 వ స్థానంలో శనియున్న ప్రయాణాలకు ధనవ్యయం అవుతుంది.
- 7 వ స్థానంలో శనియున్న కుటుంబ సభ్యుల వలన దుఃఖము, అశాంతి కలుగును.
- 8 వ స్థానంలో శనియున్న పిత్రార్జిత ధనమును కోల్పోవును.
- 9 వ స్థానంలో శనియున్న పితృసౌఖ్యము ఉండదు. పూర్వుల ఆస్తి ఉంటుంది.
- 10 వ స్థానంలో శనియున్న విద్య, ధనము, అధికారము లభించును. సుఖశాంతులు కలుగును.
- 11 వ స్థానంలో శనియున్న ధనలాభం, సంఘంలో గౌరవము, కుటుంబ సుఖము కలుగును.
- 12 వ స్థానంలో శనియున్న అనవసర ధనవ్యయము. నీచకార్యములు చేయును.

**వృశ్చికం లగ్నమైతే :-**

- వృశ్చికలగ్నమై లగ్నంలో శనియున్న అధికశ్రమ, ధనహీనత కలుగును.
- 2 వ స్థానంలో శనియున్న సంతానం వలన విచారం, ధనవ్యయము, దృష్టిలోపము కలుగును.
- 3 వ స్థానంలో శనియున్న ధనలాభం, ధనవ్యయములు కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న మాతృసౌఖ్యము, విద్య, భూమియును కలుగును.
- 5 వ స్థానంలో శనియున్న ధనలాభం, సంతాన విచారం కలుగును.
- 6 వ స్థానంలో శనియున్న బహుకష్టములు కలుగును.
- 7 వ స్థానంలో శనియున్న ద్వికళత్రములు కలుగును.
- 8 వ స్థానంలో శనియున్న సంపాదించిన ధనం కోల్పోవును.
- 9 వ స్థానంలో శనియున్న సదాచారము కలుగును.
- 10 వ స్థానంలో శనియున్న సుఖము, శాంతి, ఖ్యాతి, పూర్ణ ఆయుర్దాయ మును కలుగును.
- 11 వ స్థానంలో శనియున్న ఆరోగ్యం, విశేషధనం, శుభం కలుగును.
- 12 వ స్థానంలో శనియున్న ధనవ్యయం కలుగును.

**ధనుస్సు లగ్నమైతే :-**

- ధనుస్సు లగ్నమై లగ్నమున శనియున్న శరీర సుఖము తక్కువగా ఉండును.
- 2 వ స్థానంలో శని యున్న కష్టపడి సంపాదించును. శరీరశ్రమ కలుగును. ద్వికళత్రము కలుగును.
- 3 వ స్థానంలో శని ఉన్న ధైర్యము, పరాక్రమము, సుఖము, ధనము కలుగును.
- 4 వ స్థానంలో శని యున్న మాతృ సౌఖ్యము, భూమి, వాహనము కలుగును.
- 5 వ స్థానంలో శని యున్న సంతానం తక్కువ, అధికారం, ఉద్యోగం లభించును.
- 6 వ స్థానంలో శని యున్న ఆయుర్దాయము, కీర్తి, ధనహీనము కలుగును.
- 7 వ స్థానంలో శని యున్న సంసార సుఖం తక్కువ, అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానంలో శని యున్న ధనం పై ఆసక్తి ఎక్కువ, దురాశ, ధనహీనత కలుగును.
- 9 వ స్థానంలో శని యున్న కుటుంబ సుఖము తక్కువ.

- 10 వ స్థానంలో శని యున్న ఉద్యోగి. లేదా రైతు. ఆచారవంతుడు, సుఖజీవనుడు.
- 11 వ స్థానంలో శని యున్న ధనప్రాప్తి, సుఖశాంతులు కలుగును.
- 12 వ స్థానంలో శని యున్న కార్యహాని, ఋణములు కలుగును.

**మకరం లగ్నమైతే :-**

- మకర లగ్నమై లగ్నంలో శనియున్న ఉద్యోగంలో ఇబ్బందులు, సుఖహీనము, ఆతురత కలుగును.
- 2 వ స్థానంలో శనియున్న కుటుంబంలో సమస్యలు, ధనవ్యయము కలుగును.
- 3 వ స్థానమున శనియున్న దైవచింత, ఆయుర్దాయము కలుగును.
- 4 వ స్థానంలో శనియున్న అనారోగ్యము, ధనవ్యయము కలుగును.
- 5 వ స్థానంలో శనియున్న సంతానసుఖం ఉండదు.
- 6 వ స్థానంలో శనియున్న శత్రువులు, రోగములు, అప్పులు కలుగును.
- 7 వ స్థానంలో శనియున్న సంసారసుఖం తక్కువ.
- 8 వ స్థానంలో శనియున్న కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో శనియున్న ధనము, సుఖము కలుగును. పితృసౌఖ్యం ఉండదు.
- 10 వ స్థానంలో శనియున్న పేరు ప్రతిష్టలు, వాహనము, ముద్రాధికారం, సంఘంలో గౌరవం, సత్కారాలు కలుగును.
- 11 వ స్థానంలో శనియున్న భూలాభము, శాంతి కలుగును.
- 12 వ స్థానంలో శనియున్న పిత్రార్జితధనం నష్టమగును. ఇతరుల మెప్పుకోసం ధనవ్యయం చేయును.

**కుంభం లగ్నమైతే :-**

- కుంభ లగ్నమై లగ్నమందు శనియున్న సామాన్యజీవనం, అనారోగ్యము కలుగును.
- 2 వ స్థానమున ధనం ఖర్చగుట, యోగ హీనము, మారకము వంటివి జరుగును.
- 3 వ స్థానమున శనివున్న దుష్టస్వభావము, అనారోగ్యము కలుగును.

- 4 వ స్థానమున శనివున్న సుఖ జీవనము, విద్య, భూమి వలన లాభము కలుగును.
- 5 వ స్థానమున శనివున్న శని దశలో సుఖం, ధనం, శాంతి, సంతానం వలన సుఖం లేకపోవుట కలుగును.
- 6 వ స్థానమున శనివున్న యోగహీనము, శత్రువులు, రోగాలు, అప్పులు కలుగును.
- 7 వ స్థానమున శనివున్న అనారోగ్యము, భార్యకు అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానమున శనివున్న అష్టకష్టములు, శత్రువులు, రోగాలు, ఋణములు కలుగును.
- 9 వ స్థానమున శనివున్న సుఖం, ధనం, శాంతి, భూమి, కార్యసిద్ధిలతో పేరు ప్రతిష్టలు కలుగును.
- 10 వ స్థానమున శనివున్న భూమి, ధనం, కార్యసిద్ధిలతో కీర్తి యోగహీనము కలుగును.
- 11 వ స్థానమున శనివున్న సుఖం, ధనం, శాంతి, అన్యాయార్జనం కలుగును.
- 12 వ స్థానమున శనివున్న యోగహీనము, ధనం ఖర్చగుట వంటివి సంభవించును.
- కుంభలగ్నమునకు శని యే స్థానమునందున్నను మిశ్రమ ఫలము నిచ్చును. మారక స్థానముల యందును, షష్టాష్టవ్యయ స్థానములయందు ఉన్న యోగించక పోవుటయే కాక మారకమును గూడ చేయును.

**మీనం లగ్నమైతే :-**

- మీనము లగ్నమై లగ్నములో శనియున్న, ధనహీనము, సుఖహీనం కలుగును. లోభి యగును.
- 2 వ స్థానంలో శనియున్న ధనసంపాదన, ధనవ్యయము కలుగును.
- 3 వ స్థానంలో శనియున్న సంపూర్ణ ఆయుర్దాయము, ధనలాభము. కార్యసిద్ధి జరుగును.
- 4 వ స్థానంలో శనియున్న మాతృసౌఖ్యము తక్కువ, ధనము, భూలాభము కలుగును.
- 5 వ స్థానంలో శనియున్న సంతానము వలన బాధ కలుగును.
- 6 వ స్థానంలో శనియున్న అనారోగ్యము, ఆర్థిక యిబ్బందులు కలుగును.

- 7 వ స్థానంలో శనియున్న దంపతులకు ఆపద కలుగును.
- 8 వ స్థానంలో శనియున్న లాభము, నష్టము రెండును సమానంగా ఉండును.
- 9 వ స్థానంలో శనియున్న పితృ సుఖము తక్కువ, సాధారణ జీవనము కలుగును.
- 10 వ స్థానంలో శనియున్న లోభత్వం కలుగును.
- 11 వ స్థానంలో శనియున్న కుటుంబసుఖము, శాంతి కలుగును.
- 12 వ స్థానంలో శనియున్న పుణ్యక్షేత్రములకు వెళ్ళుట, అనవసర ఖర్చులు కలుగును.

## వివిధ భావాలలో శని - ఫలితాలు

- శని లగ్నంలో ఉంటే జాతకుడు అధికారం కలిగిఉంటాడు. సంఘంలో గుర్తింపు ఉంటుంది. ఆరాశి శనికి పాప, శత్రు క్షేత్రమయితే జాతకునకు అధికారం ఉండదు. కేవలం డాంబికునిగా ఉంటాడు. ఆర్థిక సమస్యలతో, అనారోగ్యంతో ఇబ్బందులు పడతాడు.
- శని ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు వ్యాపారరంగంలో నిపుణుడు. ముఖ్యంగా లోహ సంబంధమైన వ్యాపారంలో లాభం పొందుతాడు. వ్యసనాలకు బానిస అవుతాడు.
- శని తృతీయ భావంలో ఉంటే జాతకుడు సంఘంలో గుర్తింపు కలవాడు. నాయకుడు. అధికారుల గౌరవం పొందుతాడు.
- శని చతుర్థభావంలో ఉంటే జాతకుడు సంసార బాధ్యతలను స్వీకరించడు. అనేక ప్రాంతాలకు ప్రయాణిస్తూ ఉంటాడు. ఒంటరి జీవితానికి అలవాటు పడతాడు.
- శని పంచమభావంలో ఉంటే జాతకునకు పుత్రసంతానం ఉంటుంది.
- శని షష్టమ భావంలో ఉంటే జాతకునకు శత్రువులుంటారు. అయితే ఆ రాశి శనికి అశుభరాశి అయితే శత్రుభయం ఉంటుంది.
- శని సప్తమ భావంలో ఉంటే జాతకుడు స్త్రీ వ్యామోహం కలవాడు. బహుస్త్రీ సంపర్కము కలవాడు.
- శని అష్టమ భావంలో ఉంటే జాతకుడు ఆయుర్దాయం కలవాడు. అనేక ఇబ్బందులు కలుగుతాయి. కాని సోమరి. వృద్ధాప్యంలో మాత్రం సుఖ పడతాడు.

- శని నవమభావంలో ఉంటే జాతకుడు అధికారము కలిగి ఉంటాడు.
- శని దశమభావంలో ఉంటే జాతకుడు తెలివైనవాడు. సంపాదనాపరుడు. అధికారుల అభిమానం పొందుతాడు.
- శని ఏకాదశ భావంలో ఉంటే జాతకుడు ఆయుర్దాయం కలవాడు. ఉద్యోగం చేస్తాడు. ఇంద్రనీలం ద్వారా లాభం పొందుతాడు.
- శని ద్వాదశభావంలో ఉంటే జాతకుడు నీచులతో స్నేహం చేస్తాడు. అవసరమైన పనులను కూడా వాయిదా వేస్తుంటాడు.

**శని కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- జుట్టు రాలిపోతూ ఉంటుంది.
- ఇంటిలో పెంచుకుంటున్న జంతువులు (కుక్క, మేక, గేదె మొదలుగునవి) చనిపోతాయి.
- విషాద సంఘటనలు జరుగుతూ ఉంటాయి.
- అజీర్ణము వంటి రోగాలు కలుగుతాయి.

పై సంఘటనలలో ఏది జరిగినా శని చెడుఫలితాలను ఇస్తున్నాడని గ్రహించాలి. దానికి నివారణ క్రింది పరిహార క్రియలలో ఏదో ఒకటి శ్రద్ధగా చేయాలి.

**శని శాంతించుటకు చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు దంతధావనానికి వేపపుల్లను ఉపయోగించండి.
- ఒక మట్టిపాత్ర నిండా నువ్వులు పోసి, దానిని ఇంటి ఆవరణలో నైరుతి మూల పాతిపెట్టండి.
- ఇంటి ఆవరణలో నైరుతిమూల కలబంద వంటి పూలు పూయని మొక్కలను నాటండి.
- నీలమును ధరించండి.

## వివిధభావాలలో శని - పరిహార క్రియలు

**లగ్నంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 44 రోజులు పేద పిల్లలకు మినుపసున్నుండలు పంచండి.
- ఒక పాత్రలో 800 గ్రాముల నువ్వులనూనెను పోసి, దానిలో జాతకుని ముఖాన్ని చూచుకొని, తరువాత ఆనూనెను దానం చేయాలి.
- వరుసగా 44 రోజులు కాకులకు ఆహారం వేయండి.
- ఒక నల్లని వస్త్రంలో మినుములు, సోపుగింజలు, ఇనుములను కలిపి కట్టి, దానిని దానం చేయండి.

- పంచదార కలిపిన పాలను మర్రిచెట్టుకు పోయండి.
- ఒక నల్లని డబ్బాలో నల్లని కాటుక నుంచి, దానిని భూమిలో పాతండి.

**ద్వితీయ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 44 రోజులు దేవాలయమును దర్శించండి.
- పెరుగు, పాలు కలిపి తిలకంగా పెట్టుకోండి.
- వరుసగా 8 వారాలు పుట్టలో పాలు పోయండి.
- వరుసగా 17 రోజులు అనాథ పిల్లలకు పాలు పంచండి.

**తృతీయ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- కుక్కలను పెంచండి.
- మాంసాహారం తినవద్దు.
- ఇంటిలో చివర ఒక చీకటి గదిని నిర్మించండి.
- ముఖద్వారం గడపకు ఇనుపమేకు కొట్టండి.

**చతుర్థ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- కాకులకు ఆహారం వేయండి.
- గేదెలను పెంచండి.
- బావిలో పాలు పోయండి.
- భైరవుని కోవెలకు నువ్వులనూనె సమర్పించండి.

**పంచమ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- బంగారపు ఉంగరం లేదా గొలుసు ధరించండి.
- 44 రోజులు వరుసగా పిల్లలకు సాల్ట్‌బిస్కట్లు పంచండి.
- ఇంటిలో ఎల్లప్పుడు మినుములు ఉండునట్లు జాగ్రత్తపడండి.

**షష్ఠమ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి.
- పేదవాడికి చెప్పులు దానం చేయండి.
- కుక్కలును పెంచండి.
- పిల్లలకు 350 గ్రాముల ఖర్జూరాలు పంచండి.

**సప్తమ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు నల్లని ఆవుకు ఆహారం పెట్టండి.
- ఒక చిన్న కుండలో తేనెను పోసి, దానిని నిర్జన ప్రదేశంలో వదలి రండి.
- మద్యపానం చేయవద్దు, మాంసాహారము తినవద్దు.
- ఒక వేణువు (ఫ్లూట్)ను బెల్లంతో నింపి, దానిని నిర్జన ప్రదేశంలో పాతి పెట్టండి.

**అష్టమ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వెండి ఉంగరం ధరించండి.
- ఆంజనేయస్వామి గుడికి 800 గ్రాముల మినుములు సమర్పించండి.
- మద్యపానం చేయకండి.

**నవమ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు సాయిబాబా లేదా బ్రహ్మంగారి గుడికి వెళ్ళండి.
- 44రోజులు వరుసగా శనగలు పంచండి.
- ఇంటిపైన కలప, గడ్డి వంటి వాటిని ఉంచవద్దు.
- ప్రతిరోజు పవిత్ర నదిలో స్నానం చేయండి.

**దశమ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 44 రోజులు పిల్లలకు నువ్వులద్దిన జీడీలు పంచండి.
- వరుసగా 44 రోజులు పేదలకు శనగలు పంచండి.
- అంధులను ఆదరించండి.

**ఏకాదశ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఇంటి నుండి బయటకు వెళ్ళునపుడు కనీసం ఒక గ్లాసు మంచినీరు త్రాగి వెళ్ళండి.
- శివాలయముకు నువ్వుల నూనెను వరుసగా 26 రోజులు ఇవ్వండి.
- ప్రతిరోజు రొట్టెముక్కలను ఆవనూనెలో ముంచి కుక్కలకు లేదా కాకులకు వేయండి.

**ద్వాదశ భావంలో శని ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఇంటి చివర గదిని చీకటిగా ఉంచండి.
- వరుసగా 44 రోజులు వీధిపిల్లలకు, ముసలివారికి ఖర్జూరాలు పంచండి.

- మద్యపానం చేయకండి. మాంసాహారం తినకండి.
- సత్యమునే చెప్పండి.

# 134. శనిహోర

శనిహోరకు అధిపతి శని. శనివారం రోజు లేదా చంద్రుడు పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములో సంచరిస్తున్న కాలంలో శనిహోరలో శని ప్రభావం ఎక్కువగా వుంటుంది.

ధ్యానం చేయటానికి లేదా సన్యాసత్వం స్వీకరించడానికి, యోగులతో పరిచయం చేసుకోవటానికి శనిహోర అనుకూలసమయం.

క్రూరులతో సంబంధానికి శనిహోర పనికి వస్తుంది. బంగాళాదుంప, వేరుశనగ వంటి వాటిని నాటటానికి ఈ హోర అనుకూలమైనది.

నూనెలు, తోళ్ళుకు సంబంధించిన వ్యాపారాలు, పరిశ్రమలు ప్రారంభించుటకు శనిహోర లాభప్రదమైనది.

వెంకటేశ్వర స్వామిని ప్రార్థించుట శుభాన్ని కలుగజేస్తుంది.

**శనిహోర సమయం :-**

సాధారణంగా సూర్యోదయం, సూర్యాస్తమయ సమయం నుండి హోర సమయాన్ని లెక్కిస్తారు. హోరకాల ప్రమాణం ఒక గంట.

సూర్యోదయ, సూర్యాస్తమయ సమయం 6 గంటలుగా తీసుకొని క్రింద సమయాలు నిర్ణయించబడినవి.

| | పగలు | రాత్రి |
|---|---|---|
| ఆదివారం | 10-11, 5-6 | 12-1 |
| సోమవారం | 7-8, 2-3 | 9-10, 4-5 |
| మంగళవారం | 11-12 | 6-7, 1-2 |
| బుధవారం | 8-9, 3-4 | 10-11, 5-6 |
| గురువారం | 12-1 | 7-8, 2-3 |
| శుక్రవారం | 9-10, 4-5 | 11-12 |
| శనివారం | 6-7, 1-2 | 8-9, 3-4 |

# 135. ధారణం

## శనిగ్రహ దోష నివారణకు రత్నధారణ

ఉద్యోగ నష్టము, ఆర్థిక ఇబ్బందులు, కారాగారవాసము, శిక్షలు పడినవారు నీలమును ధరిస్తారు. ఎముకలు విరిగినవారు, పక్షవాతం, అంగవైకల్యం, దీర్ఘవ్యాధులున్నవారు నీలమును ధరించుట ఉత్తమము.

**నీలం :-**

శనికి ధరించవలసినది నీలం.

వెంకటేశ్వరస్వామిని పూజించి శనిగ్రహ మూలమంత్రంతో పూజిస్తూ శనిదానం జపము, హోమము చేయాలి. శనికి తైలాభిషేకము, హనుమంతునికి తైలాభిషేకము చేయాలి. సుందరకాండను 16 రోజులు పారాయణ చేసి తరువాత నీలమును ధరించాలి.

నీలమును ధరించలేనివారు బ్లూ టూర్మోలిన్, బ్లూజిర్కాన్, అమెథిస్ట్ వంటి ఉపరత్నములను ధరించవచ్చును.

పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర జన్మ నక్షత్రములుగా కలవారు, మకరం, కుంభం, రాశులు లగ్నంగా లేదా జన్మరాశులుగా గలవారు, శనిదశ జరుగుతున్న వారు శనికి చెందిన రత్నములను ధరించవచ్చును.

**శనిగ్రహ దోష నివారణకు రుద్రాక్ష ధారణ :-**

శనిగ్రహం అనుకూలంగా లేనివారు నవముఖ, చతుర్దముఖ రుద్రాక్షలను ధరించవచ్చును.

**నవముఖ రుద్రాక్ష :-**

దీనిని దుర్గాదేవి స్వరూపంగా చెపుతారు. 2. దీనిని ధరించుట వలన మృత్యుభయం తొలగుతుంది. 3. రుద్రాక్షయందు తొమ్మిది ధారలుంటాయి.

**చతుర్దశముఖ రుద్రాక్ష :-**

1. దీనిని శివుని నేత్ర స్వరూపంగా చెపుతారు.
2. దీనిని ధరించినవారికి కష్టములు ఆమడదూరంలో ఉంటాయి.
3. ఆయురారోగ్యములు కలుగుతాయి.
4. రుద్రాక్షయందు పదునాలుగు ధారలుంటాయి.

# శని గ్రహానుగ్రహం కోసం కవచం

ఒక రాగిరేకుకు ఇరువైపుల ఈ యంత్రమును చెక్కించాలి.

| | | |
|---|---|---|
| పన్నెండు | ఏడు | పదునాలుగు |
| పదమూడు | పదకొండు | తొమ్మిది |
| ఎనిమిది | పదిహేను | పది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |
| పదకొండు | ఆరు | పదమూడు |
| పన్నెండు | పది | ఎనిమిది |
| ఏడు | పదునాలుగు | తొమ్మిది |

| | | |
|---|---|---|
| పదకొండు | ఆరు | పదమూడు |
| పన్నెండు | పది | ఎనిమిది |
| ఏడు | పదునాలుగు | తొమ్మిది |
| పన్నెండు | ఏడు | నాలుగు |
| పదమూడు | పదకొండు | తొమ్మిది |
| ఎనిమిది | పదిహేను | పది |
| తొమ్మిది | నాలుగు | పదకొండు |
| పది | ఎనిమిది | ఆరు |
| ఐదు | పన్నెండు | ఏడు |

ఈ యంత్రమును "ఓం ప్రాం ప్రీం ప్రౌం సః శనైశ్చరాయ నమః" అను మంత్రమును 1,16,000 సార్లు జపిస్తూ పూజించాలి. తరువాత దీనిని లాకెట్‌గా మెడలో ధరించిన వ్యాపారం సక్రమంగా జరిగేలా, ఉద్యోగం లభించేలా చేస్తుంది.

## 136. దానం

## శని మహాదశలో చేయదగిన దానములు

1. శని మహాదశలో - శని అంతర్దశకు - నువ్వులు
2. శని మహాదశలో - రవి అంతర్దశకు - గుమ్మడికాయ మరియు కొద్దిగా బంగారము
3. శని మహాదశలో - చంద్ర అంతర్దశకు - శ్వేతవర్ణగోవు
4. శని మహాదశలో - కుజ అంతర్దశకు - దున్న
5. శని మహాదశలో - బుధ అంతర్దశకు - దున్నపోతు
6. శని మహాదశలో - గురు అంతర్దశకు - బంగారపు మేకప్రతిమ
7. శని మహాదశలో - శుక్ర అంతర్దశకు - నల్లమేక/ఇనుము/లవణం

8. శని మహాదశలో - రాహు అంతర్దశకు - నూనె/సీసం/నువ్వులు
9. శని మహాదశలో - కేతు అంతర్దశకు - తిలలు (సువర్ణం)

నిజ వస్తువులు/జీవాలు అసాధ్యమైనపుడు బంగారురేకుపై ప్రతిమాదానం

## నవగ్రహాల శని అంతర్దశల్లో చేయదగిన దానములు

ఇక్కడ నవగ్రహాలలో ప్రతీ గ్రహానికీ వచ్చే శని అంతర్దశల్లో చేయవలసిన దానాదులను గురించి ఇవ్వడం జరిగిందని గమనించాలి.

1. రవి మహాదశయందు శని అంతర్దశాకాలంలో - మేక
2. చంద్ర మహాదశయందు శని అంతర్దశాకాలంలో - దున్నపోతు
3. బుధ మహాదశయందు శని అంతర్దశాకాలంలో - దున్నపోతు
4. కుజ మహాదశయందు శని అంతర్దశాకాలంలో - నువ్వుల పిండి
5. గురు మహాదశయందు శని అంతర్దశాకాలంలో - నల్లమేక
6. శుక్ర మహాదశయందు శని అంతర్దశాకాలంలో - దున్నపోతు
7. శని మహాదశయందు శని అంతర్దశాకాలంలో - నువ్వులు
8. రాహు మహాదశయందు శని అంతర్దశాకాలంలో - నల్లమేక
9. కేతు మహాదశయందు శని అంతర్దశాకాలంలో - దున్నపోతు

ఆయా వస్తువులు లభ్యం కాకున్నచో, రేకుప్రతిమను దానం చేయవచ్చును.

## 137. పారాయణం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన శని గ్రహానుగ్రహం పొందవచ్చును.

## పారాయణ చేయదగిన స్తోత్రాలు

1. శని అష్టోత్తర శతనామస్తోత్రం / నామావళి
2. దశరథ ప్రోక్త శనిస్తోత్రం / శనిగ్రహ మంగళాష్టకం
3. శనికవచస్తోత్రం / పిప్పలాదకృత శనిస్తోత్రం
4. శనిస్తోత్ర / శ్లోక / మంత్రాలు పారాయణ

శని దోష నివృత్తికి శ్రీ మహాశివ సంబంధమైన ఆంజనేయ సంబంధమైన స్తోత్రాలు పారాయణ చేయదగినవి కొన్ని ఉదహరించి ఉన్నాము.

5. శివతాండవ స్తోత్రం / ఉమామహేశ్వర స్తోత్రం
6. దక్షిణామూర్తి స్తోత్రం / ఉమామహేశ్వర స్తోత్రం
7. దారిద్ర్య దహనస్తోత్రం / చంద్రశేఖరాష్టకం
8. కాలభైరవాష్టకం / చంద్రశేఖరాష్టకం

9. విశ్వనాథాష్టకం / రుద్రాష్టకం / శివాష్టకం
10. బిల్వాష్టకం / ప్రసన్నాంజనేయ స్తోత్రం
11. అర్ధనారీశ్వరస్తోత్రం / హనుమాన్ స్తోత్రం
12. మహామృత్యుంజయ మంత్రం / స్తోత్రం

## రామాయణ పారాయణ

★ శని మహాదశ జరుగుతూన్నంతకాలం (19సం॥)లో ఎప్పుడైనా సరే బాలకాండ 30 సర్గ పారాయణ. శ్రీకూర్మనాథ దర్శనం. నేరేడుపండు/నల్లద్రాక్ష నైవేద్యం.

1. **శని మహాదశలోని శని అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : యుద్ధకాండ 74 సర్గ
   నైవేద్యం : నల్లద్రాక్ష / నేరేడు
2. **శని మహాదశలోని రవి అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : కిష్కింధాకాండ 66 సర్గ
   నైవేద్యం : క్యారెట్ / చామదుంపలు
3. **శని మహాదశలోని చంద్ర అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : బాలకాండ 26 సర్గ
   నైవేద్యం : పాయసం / పంచదార
4. **శని మహాదశలోని కుజ అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : కిష్కింధాకాండ 51-52 సర్గలు
   నైవేద్యం :బెల్లం / కందిపప్పు పొంగలి.
5. **శని మహాదశలోని బుధ అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : సుందరకాండ 54 సర్గ
   నైవేద్యం : ఆకుపచ్చఅరటి/తాంబూలం.
6. **శని మహాదశలోని గురు అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : యుద్ధకాండ 1 సర్గ
   నైవేద్యం : పసుపుపచ్చని ఫలాలు.
7. **శని మహాదశలోని శుక్ర అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : సుందరకాండ 3 సర్గ
   నైవేద్యం : పటిక పంచదార గుళికలు
8. **శని మహాదశలోని రాహు అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : అరణ్యకాండ 41 సర్గ
   నైవేద్యం : ఎండుద్రాక్ష / తేనె

9. శని మహాదశలోని కేతు అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : కిష్కింధాకాండ 6 సర్గ
నైవేద్యం : ఖర్జూరం/కొబ్బరి.

# 138. సందర్శనం

శని గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన పుణ్యక్షేత్రాలను తరచు సందర్శించడం ఉత్తమం.

★ శనిదోష పరిహారార్థం అంజనేయుడు/పాండురంగస్వామి/సాయి/శ్రీకృష్ణ/ పంచభూతలింగ క్షేత్రాలు దర్శించవలసిందిగా చెబుతారు.

1. సప్తశని క్షేత్రాలు (శింగణాపూర్, తిరునల్లార్, పావ్‌గఢ్, రాక్షభవన్, విజయవాడ, మందపల్లి, నర్శింగోల్) దర్శనం.

2. చిత్తూరు జిల్లాలోని అరకొండలో అంజనేయుడు.

3. తూ.గో.జిల్లా సహాపురం/ముద్రాబాద వేణుగోపాలుడు.

4. ఉత్తప్రదేశ్ మధుర/బృందావన శ్రీకృష్ణుడు.

5. కర్నాటకలో ఉడుపి, కేరళలో గురువాయూర్ శ్రీకృష్ణుడు.

6. మహారాష్ట్రంలోని పండరిపురం/మనరాష్ట్రంలోని చిలకలపూడి (బందరు) వద్ద గల పాండురంగడు.

7. పంచారామాలు/పంచభూత లింగాలు/ద్వాదశ జ్యోతిర్లింగాలు/ఇతర మహిమాన్విత లింగ క్షేత్రాలు.

8. పాలకొల్లులోని క్షీర రామలింగేశ్వరాలయ ప్రాంగణంలో శని.

9. తూ.గో.జిల్లా అమరగిరి/పాండవుల మెట్ట (పెద్దాపురం) కొండపైన శని ఆలయం.
దశావతారాల్లో కూర్మావతార రీత్యా శ్రీకూర్మం సందర్శన కూడ.

# సప్త శనైశ్చర క్షేత్ర సందర్శన

**1. శింగణాపూర్:-** మహారాష్ట్రలోని శిరిడీ పుణ్యక్షేత్రం నుంచి 86 కి.మీ దూరంలో ఉంది. ఇది ప్రసిద్ధ శని క్షేత్రం. ఇక్కడ భక్తులే స్వయంగా పూజలు చేసుకోవచ్చు. స్వామి స్వయంభువు. ఈ క్షేత్రంలో దొంగతనాలుండవు. ఇళ్లకు తలుపులుండవు. ఇక్కడ అమావాస్యతో కూడిన శనివారం గొప్ప ఆరాధనా పూర్వకమైనది.

ఈ ప్రాంతంలో పూజారి లేదు. స్త్రీలు విగ్రహాన్ని తాకరాదు. ఇక్కడ కనీసం మూడు ప్రదక్షిణలైనా శక్తివంతమైనవి.

**2. మందపల్లి :-** మన రాష్ట్రంలోనే రాజమండ్రికి 50 కి.మీ (రాజమండ్రి నుండి అమలాపురం వెళ్ళేదారిలో) దూరంలో ఉంది. ఇక్కడ స్వామిని (శివలింగమూర్తిని) సాక్షాత్తు శనైశ్చరుడే ప్రతిష్ఠించాడని ప్రతీతి. మహర్షుల కాలంనుంచీ ఈ క్షేత్రం చాలా ప్రసిద్ధి చెందింది. స్వామివారిని మందేశ్వరుడు. అని కూడా అంటారు.

**3. నర్సింగోల్ :-** మన రాష్ట్రంలోనే ప్రకాశం జిల్లా ఒంగోలు దగ్గర సింగరాయ కొండకు చేరువలో నర్సింగోల్ అనే గ్రామంలో శనైశ్చరునికి ఆలయం ఉంది. అంతగా ప్రచారంలోకి రానప్పటికీ ఈ శని క్షేత్రం సందర్శనకు నెల్లూరు ప్రకాశం జిల్లాలనుంచి భక్తులు/గ్రహదోష నివృత్తిని కోరేవారు ప్రతి శనిత్రయోదశికి వస్తారు.

**4. విజయవాడ :-** కృష్ణాతీరాన వెలసిన విజయవాడలో తమిళనాడు తిరునల్లార్ క్షేత్రం మాదిరిగా శనైశ్చరస్వామిని దర్శింపవచ్చు. ఇక్కడ జ్యేష్ఠాదేవీ సహితంగా నెలకొని ఉన్న శనైశ్చరునికి 19 రోజుల దీక్షలు పూనిన భక్తులు అభిషేకాలు పూజలు నిర్వర్తిస్తుంటారు. శ్రావణమాసం శని ప్రీతికరం గనుక, ఈ మాసంలో శనికి హోమాదులు కూడ ఇక్కడ జరుపబడతాయి. తీర్థంగా నూనెనే ఇస్తారు.

**5. జాల్నా :-** మహారాష్ట్రలోని ఔరంగాబాద్ సమీపములో జాల్నా వద్ద రాక్షసభవన్ గ్రామంలో గోదావరినది ఒడ్డున శనిక్షేత్రమున్నది. ఒక రావిచెట్టు వద్ద హనుమాన్ విగ్రహం చెంతగల 3 శనివిగ్రహాలుండటం ఇక్కడే ప్రత్యేకత. ఈ విగ్రహాలకు చేసే అభిషేకతైలం గోదావరిలోనికి ప్రవహిస్తుంటుంది.

**6. పావగఢ్ :-** ప్రభావవంతమైన పురాతనమైన శని క్షేత్రం మన రాష్ట్రంలోనే హిందూ పురం తాలూకాలో పావగఢ్ వద్ద కలదు. ఇక్కడ ఒక్కరాత్రి నిద్ర చేసినా, అన్ని రకాల భూతప్రేతములు వదిలిపోగలవు. స్వామికి నిత్య అర్చనలతో పాటు రథోత్సవం కూడా గలదు. హిందూపూర్ నుంచి 50 కి.మీ. బస్సు సౌకర్యం కలదు. ఇది నవగ్రహాలు కొలువైన క్షేత్రం కూడా.

**7. వైదీశ్వరన్ కోయిల్ :-** తమిళనాడులోని కారైక్కాల్‌నుంచి 5కి.మీ దూరంలో గల ఈ వైదీశ్వరన్ కోయిల్ గురించి ఇదే గ్రంథంలో 'కుజదోష నివృత్తికోసం దర్శించదగ్గ ఆలయాలు' అనే చోట చూడగలరు.

ఇక్కడకు చేరువలో తిరునల్లార్ వద్ద గల శని విగ్రహం చాలా ప్రశస్తమైనది. ఇక్కడ దీపారాధన అనంతరం అన్నదానం చేయుట శ్రేయోదాయకం.

# 139. శనిగ్రహ అర్చనం

శనిగ్రహ దోషమున్న శనిగ్రహజపంను తగు సంఖ్యలో చేయాలి. శనిగ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| ౫ | ౬ | ౭ | ౧ | ౩ | ౨ | ౮ | ౯ | ౪ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౮ | ౯ | ౪ | ౫ | ౬ | ౭ | ౧ | ౩ | ౨ |
| ౧ | ౩ | ౨ | ౮ | ౯ | ౪ | ౫ | ౬ | ౭ |
| ౨ | ౧ | ౩ | ౭ | ౫ | ౬ | ౪ | ౮ | ౯ |
| ౭ | ౫ | ౬ | ౪ | ౮ | ౯ | ౨ | ౧ | ౩ |
| ౪ | ౮ | ౯ | ౨ | ౧ | ౩ | ౭ | ౫ | ౬ |
| ౩ | ౨ | ౧ | ౯ | ౪ | ౮ | ౬ | ౭ | ౫ |
| ౬ | ౭ | ౫ | ౩ | ౨ | ౧ | ౯ | ౪ | ౮ |
| ౯ | ౪ | ౮ | ౬ | ౭ | ౫ | ౩ | ౨ | ౧ |



## శని యంత్రము



# శనిగ్రహ మంత్ర జపము

## (జపసంఖ్య : 19 వేలు)

**మంత్రము :-**

అస్యశ్రీ శనిగ్రహ మహామంత్రస్య హిళింబి రుషిః శనైశ్చరగ్రహో దేవతా ఉష్ణిక్ ఛందః శనైశ్చర గ్రహప్రసాద సిద్ధ్యర్ధే శనిపీడా నివారణార్ధే శని మంత్ర జపే విని యోగః ॥

**కరన్యాసము :-**

ఓం శమగ్నిః - అంగుష్ఠాభ్యాం నమః
ఓం అగ్నిభిస్కరత్ - తర్జనీభ్యాం నమః
ఓం శం న స్తపతు - మధ్యమాభ్యాం నమః
ఓం శం వాతః - అనామికాభ్యాం నమః
ఓం వాత్వరపాః - కనిష్ఠికాభ్యాం నమః
ఓం అప శ్రిధః - కరతల కర పృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసము :-**

ఓం శమగ్నిః - హృదయాయ
ఓం అగ్నిభిస్కరత్ - శిరసేస్వాహా
ఓం శం న స్తపతు - శిఖాయైస్వాహా
ఓం శం వాతః - కవచాయ హుం
ఓం వాత్వరపాః - నేత్రత్రయాయ వౌషట్
ఓం అప శ్రిధః - అస్త్రాయఫట్

ఓం భూర్భు వస్సురోమితి దిగ్బంధః

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్ప యామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోప హార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్ప యామి.

**ధ్యానమ్ :-**

నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం
ఛాయామార్తాండ సంభూతం తం నమామిశనైశ్చరమ్ ॥

**అధిదేవత :-**

ఓం యమాయ సోమగ్ంసునుతయమాయ జుహుతాహవి:
యమగ్ం హమజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృత: ॥

**ప్రత్యధిదేవత (ప్రజాపతి) :-**

ఓం ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వాజాతాని పరితాబభూవ
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయగ్స్యామపతయో రయీణామ్ ॥

**మంత్రము :-**

శమగ్నిరగ్నిభిస్కర శ్చన్నస్తపతుసూర్య: । శంవాతోవాత్వరపా అవస్రిధ:
అధిదేవతా ప్రత్యధి సహిత శనై శ్చరగ్రహ స్సుప్రీత స్సు ప్రసన్నో వరదో భవతు ॥

**శనిగ్రహ మంత్రజపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు నీలంరంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై ఇనుములో చేసిన శనిప్రతిమను లేదా శని యంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేన ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరై: శర్కరేణ ఫలైస్సహా
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తత:॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజిన:।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభి:॥
మధువాతాఋుతాయ తే మధు క్షరంతి సింధవ:।
మాధ్వీ ర్నస్సం త్వోషధీ:। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజ:।
మధుద్యౌరస్తు న: పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యర:।
మాధ్వీర్గావో భవంతు న:। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాథిరగ్నిం
పరిమినోతి వజ్రేణ్ణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవ:
పరిగృహీతాస్తస్మాత్స్థేయానస్థేయ సోనోపహరతే త్రిసప్తాభి: పశుకామస్య॥

ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః।
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచమృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపము పైకి పంచలోకపాలకులను, అష్టదిక్పాలకులను ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు, ఆయా స్థానములలో ఒక తమలపాకును, వక్కను ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ వుండాలి.

**అధ పంచలోకపాలక పూజా :-**

హరి: ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయ స్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.

ఓం బ్రహ్మాదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.

ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదథే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః॥ ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

*గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.*

## దిక్పాలకులు

**ఇంద్రః :- (1-7-10 మం) :-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః॥ అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః :- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః :- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్‌ృతిః:- మోషుణః పరాపరా నిర్‌ఋతిర్దుర్హణావధీత్, పదీష్ట తృష్ణయాసహ॥
నిర్‌ృతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)

ఇమంమే వరుణ శృధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। ఆవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

కుభేరః :-

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాసుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।

సాదన్యం విదత్యగ్ం సభేయం పితృశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఈశానః :-

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

ఊర్ధ్వపురుషః :-

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వాయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం- 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవాన్నృక్షరా నివేశినీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాస్తు పురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుషు మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

# త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

బ్రహ్మ :-

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్‌స్వధితి ర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీ :-

సక్తుమివ తితఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః :- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరి :- గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా :-

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ధద్వితా॥
ఆదిత్ప్రత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతే దివా॥
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఏషోఉషా అపూర్వ్యావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గరుడః:-

సువర్ణో௨సి గరుత్మాన్ త్రివృత్తేశిరో గాయత్రం చక్షుస్సోమ

ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ

యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్గ్ం స్యంగాని ధిష్ణియా

శ్శఫా యజూగ్ంషినామ సువర్ణో௨సి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥

గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః:-

ధన్వనాగా ధన్వనా௨௨ జిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।

ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥

ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఇంద్రాగ్నీ:-(ఋ-10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।

గ్రాహిర్జ గ్రాహ యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥

ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్పతి: యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।

తమాహరామి నిర్ ఋతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥

నిర్పతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

(శతృఫలమ్) మన్యుః:-(ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తా వరుణశ్చ మన్యుః।

భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥

మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విశాఖా నక్షత్రమ్:-

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।

తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।

నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపా।
విషూచ శ్శత్రూ నపబాధమానా। అపక్షుధం నుదతా మరాతిమ్॥
విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥
మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

**సామవేదము :-**

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
నిహోతాసత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

**అధర్వణ వేదము :-**

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అధర్వణ వేదాయ నమః॥
అధర్వణ వేదమావాహయామి। పూజయామి॥

## ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

**దుర్గా :-** ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః।
స నః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గణపతి :- ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

క్షేత్రపాలకుడు:- క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనో మృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అభయంకరుడు:- యత ఇంద్ర భయా మహే తతో నో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః॥
ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥
తరువాత శనికి సంబంధించిన నక్షత్రములు, పుష్యమి అనూరాధ, ఉత్తరాభాద్రలను ఆహ్వానించాలి.

పుష్యమి :- (తిష్య అని మరొకపేరు):

బృహస్పతిః ప్రథమం జాయమానః తిష్యన్నక్షత్ర మభి సంబభూవ।
శ్రేష్ఠో దేవానాం పృతనాసుజిష్ణుః దిశోను సర్వా అభయన్నో అస్తు।
తిష్యః పురస్తాదుత మధ్యతో నః బృహస్పతి ర్నః పరిపాతు పశ్చాత్।
బాధేతాం ద్వేషో అభయం కృణుతామ్ సువీర్యస్య పతయస్స్యామ॥
పుష్య నక్షత్ర దేవతాం బృహస్పతిం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును వుంచి నమస్కరించాలి.

అనూరాధ :-

బుధ్నాస్మ హవ్యైర్నమసోపసద్య। మిత్రం దేవం మిత్రధేయన్నో అస్తు।
అనూరాధాన్ హవిషా వర్ధయంతః। శతం జీవేమ శరదస్సవీరాః।

చిత్రం నక్షత్ర ముదగాత్పురస్తాత్। అనూరాధా స ఇతి యద్వదంతి।
తన్మిత్ర ఏతి పథిభిర్దేవయానైః। హిరణ్యయైర్వితతైరంతరిక్షే॥
అనూరాధా నక్షత్ర దేవతాం మిత్రం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకులు, దానిపై వక్క, ఖర్జూరపండు, దక్షిణగా నాణెమును వుంచి నమస్కరించాలి.

**ఉత్తరాభాద్ర :-**

అహిర్బుధ్నియః ప్రథమాన ఏతి। శ్రేష్ఠో దేవానాముత మానుషాణామ్।
తం బ్రాహ్మణాస్సోమపాస్సోమ్యాసః। ప్రోష్ఠపదాసో అభిరక్షంతి సర్వే।
చత్వార ఏకమభికర్మదేవాః। ప్రోష్ఠపదా స ఇతి యాన్ వదంతి।
తే బుధ్నియం పరిషద్యగ్గ్ం స్తువంతః। అహిగ్ం రక్షంతి నమసోపసద్య॥
మంటపముపై తమలపాకు, దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును వుంచి నమస్కరించాలి.

**శనిః :- (ఋ-10 మం-9 సూ-4 మంత్రం)**

శమగ్ని రగ్నిభిరిత్యస్య మంత్రస్య ఇళింమిళి ఋషిః। శనైశ్చర గ్రహారాధనే వినియోగః॥

ధ్యానం:- చాపాసనో గృధ్ర రథస్సునీలః ప్రత్యఙ్ముఖః కాశ్యపజః ప్రతీచ్యామ్।
సశూల చాపేషు వరప్రదశ్చ సౌరాష్ట్రదేశే ప్రభవశ్చ శౌరిః॥
నీలద్యుతిర్నీల వపుః కిరీటీ గృధ్రస్థితి శ్చాపకరో ధనుష్మాన్।
చతుర్భుజ-స్సూర్యసుతః ప్రశాంత స్సచాస్తుమహ్యం వరమందగామీ॥
(పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.)

మంత్రం:- శమగ్ని రగ్ని భిస్కరచ్ఛన్నస్తపతు సూర్యః। శం వాతోవాత్వరపా అపస్రిధః॥
ఓం భూర్భువస్సువః॥ శనైశ్చరగ్రహేహాగచ్ఛ। శనైశ్చర గ్రహం, నీలవర్ణం, నీలగంధం, నీలపుష్పం, నీలమాల్యాంబరధరం, నీలఛత్రధ్వజ రథపతాకాది శోభితం, దివ్యరథ సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, చాపాసనస్థం, ప్రత్యఙ్ముఖం, గృధ్రరథం, చతుర్భుజం, శూలాయుధధరం, సౌరాష్ట్ర దేశాధిపతిం, వికారి సంవత్సర మార్గశిర్ష కృష్ణ నవమ్యాం రోహిణీ నక్షత్రజాతం, మకర కుంభరాశ్యధిపతిం,

మందవార ప్రయుక్తం, కిరీటినం, సుఖాసీనం, పత్నీపుత్ర పరివార సమేతం, గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్య గ్రహస్య పశ్చిమ దిగ్భాగే, ధనురాకార మండలే శనైశ్చరగ్రహ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అధిదేవత - యమః :- (ఋ-10 మం -14 సూ - 13 మంత్రం)**

**మంత్రం:-** యమాయ సోమగ్ం సునుత యమాయజుహుతాహవిః।

యమగ్ం హ యజ్ఞోగచ్ఛ త్యగ్ని దూతో అరంకృతః॥

శనైశ్చర గ్రహాధిదేవతాం యమం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం శనైశ్చర గ్రహస్య దక్షిణతః యమమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధిదేవత - ప్రజాపతిః :- (ఋ-10 మం - 121 సూ- 10 మంత్రం)**

**మంత్రం :-** ప్రజాపతేన త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ।

యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయగ్గ్ స్యామ పతయో రయీణామ్॥

శనైశ్చర గ్రహప్రత్యధి దేవతాం ప్రజాపతిం సాంగం సాయుధం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం శనైశ్చర గ్రహస్యోత్తరతః ప్రజాపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శనిగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

**నైవేద్యం:-** (పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంఘృతం సఫలం దేవగృహ్యతాం సర్వదేవతాః॥

ఓం భూర్భువస్సువః భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి।

తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం. "ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే॥

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥

5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।
యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్విభజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మాత్వం ప్రజాపతిః।
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽ ధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయనతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యో౽గ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యో౽పామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యో౽ముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

28. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

30. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।

ఆపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

32. యో౽ప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥

33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।

ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥

34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।

త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥

35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।

బ్రహ్మాధి పతిర్బ్రహ్మణో౽ధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥

36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥

37. తద్విప్రాసో విపన్యవో జాగృతాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥

38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।

ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శనిగ్రహ దేవతాభ్యోనమః। దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారం:-** శనిగ్రహ దేవతాభ్యో నమః। ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోలికామా రోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునః నీరాజనం:-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపో౽హం పాపకర్మా౽హం పాపాత్మా పాపసంభవః।

త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥

శనిగ్రహాదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోఽచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

ఉద్వాసన:- "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేవానాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

శనిగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటప ముతో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శ్రీ శనిగ్రహ దేవతా స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజచేసి, తరువాత తరువాత శనిగ్రహజపం చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటే "మమ" అని చెప్పాలి. యాజమానస్య అని చెప్పరాదు. ఒకరు మరొకరి కోసం జపం చేస్తుంటే యాజమానస్య అని చెప్పాలి. "మమ" అని చెప్పకూడదు.)

**శని గ్రహ జపం :-**

శమగ్నిభిరిత్యస్య మంత్రస్య। ఇళింమిళిఋషిః।

శనైశ్చరగ్రహో దేవతా। ఉష్ణిక్ఛందః।

యజమానస్య (మమ) అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత శనైశ్చర గ్రహ ప్రసాద సిద్ధ్యర్థే శనైశ్చర గ్రహ మూలమంత్రజపం కరిష్యే.

| కరన్యాసము :- | | హృదయాదిన్యాసము:- |
|---|---|---|
| శమగ్నిః | - అంగుష్ఠాభ్యాన్నమః | - హృదయాయ నమః |
| అగ్నిభిస్కరత్ | - తర్జనీభ్యాన్నమః | - శిరసే స్వాహో |
| శం నస్తపతు సూర్యః | - మధ్యమాభ్యాం నమః | - శిఖాయై వషట్ |
| శం వాతః | - అనామికాభ్యాం నమః | - కవచాయ హుం |
| వాత్వరపాః | - కనిష్ఠికాభ్యాం నమః | - నేత్రయాయ వౌషట్ |
| అపస్రిధః | - కరతలకర పృష్ఠాభ్యాం నమః | - అస్త్రాయఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానం :-**

చాపాసనో గృధ్రరథస్సునీలః ప్రత్యఙ్ముఖః కాశ్యపజః ప్రతీచ్యామ్
సశూల చాపేషు వరప్రదశ్చ సౌరాష్ట్రదేశే ప్రభవశ్చ శౌరిః॥

**మంత్రం :-**

శమగ్ని రగ్నిభిస్కరశ్చన్న స్తపతు సూర్యః।
శం వాతో వాత్వరపా అపస్రిధః॥

**అధిదేవత :-**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥

**ప్రత్యధిదేవత :-**

ప్రజాపతేన త్వదేతాన్యన్యో విశ్వాజాతానిపరితా బభూవ।

యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయగ్ గ్స్యామ పతయో రయీణామ్॥

(అని ఒకసారి చెప్పాలి. తరువాత "శమగ్ని ..... అపస్రిధః" అను మంత్రమును 19,000 సార్లు జపించాలి. తరువాత అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రాలను ఒకసారి చెప్పాలి. తరువాత)

"యజమానస్య (మమ) శనైశ్చర గ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు" ॥
(అని చెప్పి ఉద్ధరణితో నీళ్ళను పళ్ళెములో వదలాలి.)

**శనిగ్రహ మంత్ర తర్పణము :-**

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతి పూజ చేయాలి. (ఇచట సంకల్పంలో 'జలతర్పణం కరిష్యామి అని చెప్పుకోవాలి)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి. తర్పణము చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మన ముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

గ్రహముకు సంబంధించిన "ధ్యానము"ను ఏకాగ్రతగా స్మరించాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని శనిగ్రహ మంత్రమును చదవాలి. తరువాత "శనీశ్వర తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని తరువాత గ్రహ అధిదేవత మంత్రమును చదివి, "శనిగ్రహస్య అధిదేవతాః తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని తరువాత గ్రహ ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత "శనిగ్రహస్య ప్రత్యధిదేవతాః తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 190 సార్లు తర్పణము చేయాలి. మరల గ్రహ అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను చదవాలి. తరువాత "శనిగ్రహ ప్రసాదేనమమ ఆరోగ్యసిద్ధిరస్తు, సర్వాభీష్టసిద్ధి" అని నీటిని పళ్ళెములో ధారపోయాలి.

(జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు "మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ" స్థానంలో "యాజమానస్య" అని చెప్పాలి.)

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత, ప్రత్యధిదేవతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రములకు హోమం చేయాలి.

పుష్యమి : బృహస్పతయే స్వాహా, తిష్యాయ స్వాహా, బ్రహ్మ వర్చసాయ స్వాహా॥
అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత తిష్యాయై దం నమమ ॥
(తిష్యా=పుష్యమీ నక్షత్రం) (108 సార్లు)

అనూరాధ: మిత్రాయస్వాహా అనూరాధేభ్యస్వాహా । మిత్రధేయాయస్వాహా, అభిజిత్యైస్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత అనూరాధేభ్యః ఇదం న మమ॥ (108 సార్లు)

ఉత్తరాభాద్ర: అహయే బుధ్నియాయస్వాహా । ప్రోష్ఠ పదేభ్య స్వాహా, ప్రతిష్ఠాయై స్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత ఉత్తరాభాద్రయైదం న మమ॥ (108 సార్లు)
ప్రతి నక్షత్రమునకు 108 సార్లు హోమం చేయాలి.

తరువాత గ్రహముకు హోమం చేయాలి. గ్రహ మంత్రమును, దాని అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి జమ్మిపుల్లలు, ఆవునేయి, నువ్వులు హోమంలో వేయాలి. ఈ విధంగా 190 సార్లు శనిగ్రహ మూలమంత్రము, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత్, ప్రాయశ్చిత్తహోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము, ఆ గ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన, మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధన చేసి పెద్దల ఆశీర్వాదమును పొందాలి.

శనిగ్రహహోమంలో మార్జన 19సార్లు చేయాలి. కనీసం 19మందికి భోజనం పెట్టాలి.

# 140. స్మరణం

గ్రహజపం చేయలేనివారు, శనిగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

## శనైశ్చర మంత్రాలు

1. ఓం ఖ్రాం ఖ్రీం ఖ్రౌం సః శనయే నమః
2. ఓం హ్రాం హ్రాం హ్రాం హ్రీం సర్వ శత్రూన్ విద్రావయ విద్రావయ మార్తాండ సూనవే స్వాహా

3. ఓం హ్రీం శ్రీం నీలవర్ణాయ శాంతాయ సౌరయే క్రోం స్వాహా ।
4. ఓం శం శనయే నమః
5. ఓం ప్రాం ప్రీం ప్రౌం సః శనైశ్చరాయ నమః
6. ఓం ఐం హ్రీం శ్రీం శనైశ్చరాయ నమః
7. ఓం హ్రీం శ్రీం గ్రహచక్రవర్తినే శనైశ్చరాయ క్లీం ఐం సః స్వాహా ।
8. ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం క్లీం ఐం సౌః హ్రీం హ్రీం శనైశ్చరాయ నమః
9. ఓం హ్రీం నమః పంగుపాదాయ సూర్యసూనవేస్వాహా ।

## శనైశ్చర గాయత్రీ మంత్రాలు

1. ఓం నీలాంబరాయ విద్మహే సూర్య పుత్రాయ
   ధీమహి । తన్నో సౌరిః ప్రచోదయాత్ ॥
2. ఓం కాకధ్వజాయ విద్మహే ఖడ్గహస్తాయ ।
   ధీమహి । తన్నో మందః ప్రచోదయాత్ ॥
3. భగ భవ్యాయ విద్మహే మృత్యురూపాయ
   ధీ మహి । తన్నస్సౌరి ప్రచోదయాత్ ॥

## శనిదోష నివారాణార్థం యమధర్మరాజ మంత్రం

మంత్రం:- " ఓం క్రోం ఆం వై వవస్వతాయ ధర్మరాజాయ
భక్తానుగ్రహకృతే నమః"

విధానం:- " ఓం క్రోం హ్రీం హృదయాయ నమః
ఆం శిరసే స్వాహా
వైవస్వతాయ శిఖాయై వషట్
ధర్మరాజాయ కవచాయ హుం
భక్తానుగ్రహకృతే నేత్రత్రయాయ వౌషట్
నమః అస్త్రాయఫట్
ఇతి హృదయాది షడంగన్యాసము

కరన్యాసమ్:- ఓం క్రోం హ్రీం అంగుష్టాభ్యాం
ఆం వైం తర్జనీ భ్యాం నమః
వైవస్వతాయ మధ్య మాభ్యాం నమః
ధర్మరాజాయ అనామికాభ్యాం నమః
భక్తానుగ్రహకృతే కనిష్టాభ్యాం నమః
నమః కరతల కరపృష్టాభ్యాం నమః
ఇతి కరన్యాసః

ధ్యానమ్ :- పాథః సంయుత మేఘ సన్నిభతమః ప్రద్యోతనస్యాత్మజో
నృణాం పుణ్యశుభావహః స్వవపుషా పాపీయసాం
దుఃఖకృత్ శ్రీమద్దక్షిణదిక్పతిర్మహిషగో
భూషాభరాలంకృతో ధ్యేయః సంయమినీపతిః
పితృగణస్వామీ యమో దండభృత్ ।

(ఈ మంత్రమును ప్రతిరోజు 108సార్లు జపిస్తే సుఖశాంతులు లభిస్తాయి.)

## శనిమంత్రము (తాంత్రిక సంబంధితము)

ఓం అస్య శ్రీ శనైశ్చర మంత్రస్య । బ్రహ్మ ఋషిః । గాయత్రీ ఛందః । శనైశ్చరో దేవతా । శాం బీజం । శీం శక్తిః । శూం కీలకం । (మమ) శనిపీడా నివారణార్థే శనిమంత్ర జపే వినియోగః

**మూలమంత్రం :-**

"ఓం ప్రాం ప్రీం ప్రౌం సః శనైశ్చరాయ నమః"

**మంత్రగాయత్రి :**

"ఓం నీలాంబరాయ విద్మహే, సూర్యపుత్రాయ ధీమహి । తన్నో సౌరిః ప్రచోదయాత్"

జపసంఖ్య=19వేలు, రత్నము = ఇంద్రనీలం, హోమద్రవ్యం (సమిధలు) జమ్మి (శమీవృక్షం) ధాన్యము=నల్లనువ్వులనూనె.

పై మంత్రములను 45 రోజులలో 19వేలు పూర్తి చేయాలి. ప్రతిరోజు జపము చివరలో అధిదేవత, ప్రత్యధిదేవత శ్లోకములను చెప్పాలి. ఆ తర్వాత - "అధిదేవతా, ప్రత్యధిదేవతా సహిత శనైశ్చర గ్రహప్రసాదేన మమ (యజమానస్య) ప్రాణపీడా పరిహారో-స్తు" అని పలికి ఉద్ధరిణెతో నీళ్ళను పళ్ళెములో వదలాలి. ఇది జప విధానము. అట్లే హోమ విధానము ఇంతకుముందే చెప్పడం జరిగింది. అయితే అది వేదోక్తము. ఆ విధానము ననుసరించియే (అదే పద్ధతిలో) పై మంత్రములతో అన్ని కులముల వారూ పైన చెప్పిన జమ్మి సమిధలు (కర్రపుల్లలు) నల్లనువ్వులు, నువ్వుల నూనె, నేయి మొదలగువానితో హోమము చేసుకొన వచ్చును.

**అనుకూల సమయాలు :-**

శని అనుగ్రహం పొందాలనుకునేవారు శనిగ్రహజపం, హోమం చేసి సమారాధన చేయుట ఉత్తమము. ఆ విధంగా చేయలేనివారు శనికోసం సూచించిన

ఏ మంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది. అదేవిధంగా శనిస్తోత్రము చేయాలి.

శనికి అనుకూలమైనవారము శనివారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యంలో ఉన్న నక్షత్రాలు పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్రలున్న దినములు కూడ శనికి అనుకూలమైనవే. ద్వాదశి, అష్టమి, నవమి శనికి అనుకూలించు తిథులు. ముఖ్యంగా జ్యేష్ఠ శుక్ల ద్వాదశి, మార్గశిర శుక్ల అష్టమి, మార్గశిర కృష్ణనవమి ఉత్తమమైనవి. ఈ సమయాలలో ప్రత్యేకంగా శనిని పూజించుట శుభకరము.

స్వామి అయ్యప్ప జయంతిని భక్తి శ్రద్ధలతో జరిపిన శని అనుగ్రహిస్తాడు. శనీశ్వర వ్రతం, వెంకటేశ్వరవ్రతం జరిపిన శని అనుగ్రహంతో కష్టాలు తొలగుతాయి. పనులకు ఆటంకాలు కలగవు.

శనిని పూజించునపుడు దీపారాధనకు నల్లని రంగు వస్త్రంతో చేసిన వత్తిని వాడుట ఉత్తమం. పూజకు కట్టె పొంగలి, చిమ్మిరి ఉండలను ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలు, పేదవారికి నేరేడుపండ్లు, మినుములు, నువ్వులు, నూనె, గ్రుడ్లు, స్టీలు పాత్రలు వంటి శనికి సంబంధించిన ద్రవ్యములు దానం చేయాలి.

ప్రతిరోజు కూర్మపురాణం, వెంకటేశ్వర సహస్రనామావళి పఠించాలి.

## 141. ఆరాధనం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన శనిగ్రహానుగ్రహం పొందవచ్చును.

### శనైశ్చర గ్రహ అష్టోత్తర శతనామస్తోత్రమ్

శనైశ్చరాయ శాన్తాయ సర్వాభీష్టప్రదాయినే ।
శరణ్యాయ వరేణ్యాయ సర్వేశాయ నమోనమః ॥ 1

సౌమ్యాయ సురవన్ద్యాయ సురలోకవిహారిణే ।
సుఖాసనోపవిష్టాయ సున్దరాయ నమోనమః ॥ 2

ఘనాయ ఘనరూపాయ ఘనాభరణధారిణే ।
ఘనసారవిలేపాయ ఖద్యోతాయ నమో నమః ॥ 3

మన్దాయ మన్దచేష్టాయ మహనీయగుణాత్మనే ।
మర్త్యపావన పాదాయ మహేశాయ నమో నమః ॥ 4

ఛాయాపుత్రాయ శర్వాయ శరతూణీర ధారిణే ।

చరస్థిర స్వభావాయ చంచలాయ నమోనమః ॥ 5
నీలవర్ణాయ నిత్యాయ నీలాంజన నిభాయచ ।
నీలాంబర విభూషాయ నిశ్చలాయ నమోనమః ॥ 6
వేద్యాయ విధిరూపాయ విరోధాధారభూమయే
వేదాస్పద స్వభావాయ వజ్రదేహాయతే నమః ॥ 7
వైరాగ్యదాయ వీరాయ వీతరోగభయాయచ ।
విపత్పరంపరేశాయ విశ్వవంద్యాయతే నమః ॥ 8
గృధ్రవాహాయ గూఢాయ కూర్మాంగాయ కురూపిణే ।
కుత్సితాయ గుణాఢ్యాయ గోచరాయ నమోనమః ॥ 9
అవిద్యా మూలనాశాయ విద్యావిద్యా స్వరూపిణే
ఆయుష్యకారణాయా పదుద్ధర్త్రేచ నమోనమః ॥ 10
విష్ణుభక్తాయ వశినే వివిధాగమవేదినే ।
విధిస్తుత్యాయ వంద్యాయ విరూపాక్షాయతే నమః ॥ 11
వరిష్ఠాయ గరిష్ఠాయ వజ్రాంకుశధరాయ చ ।
వరదాభయహస్తాయ వామనాయ నమోనమః ॥ 12
జ్యేష్ఠాపత్నీసమేతాయ శ్రేష్ఠాయామితభాషిణే ।
కష్టౌఘనాశకాయార్య పుష్టిదాయ నమోనమః ॥ 13
స్తుత్యాయ స్తోత్రగమ్యాయ భక్తివశ్యాయ భానవే ।
భానుపుత్రాయ భవ్యాయ పావనాయ నమోనమః ॥ 14
ధనుర్మండలసంస్థాయ ధనదాయ ధనుష్మతే ।
తనుప్రకాశదేహాయ తామసాయ నమోనమః ॥ 15
అశేషజన వంద్యాయ విశేష ఫలదాయినే ।
వశీకృతజనేశాయ, పశూనాం పతయే నమః ॥ 16
ఖేచరాయ ఖగేశాయ ఘననీలాంబరాయ చ ।
కాఠిన్య మానసాయార్యగణ స్తుత్యాయతే నమః ॥ 17
నీలచ్ఛత్రాయ నిత్యాయ నిర్గుణాయ గుణాత్మనే ।
నిరామయాయ నింద్యాయ వందనీయాయతే నమః ॥ 18
ధీరాయ దివ్యదేహాయ దీనార్తిహరణాయ చ ।
దైన్యనాశకరాయ ఆర్యజనగణ్యాయతే నమోనమః ॥ 19
క్రూరాయ క్రూరచేష్టాయ కామక్రోధ ధరాయ చ ।
కళత్రపుత్ర శత్రుత్వ కారణాయ నమోనమః ॥ 20
పరిపోషిత భక్తాయ పరభీతి హరాయ చ ।
భక్తసంఘ మనోఽభీష్టఫలదాయ నమోనమః ॥ 21

ఇతి శన్యష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణం

# దశరథప్రోక్త శనైశ్చర స్తోత్రమ్

అస్య శ్రీశనైశ్చరస్తోత్ర మహామంత్రస్య కాశ్యప ఋషిః అనుష్టుప్ఛందః శనైశ్చరో దేవతా శం బీజం. వాం శక్తిః, యం కీలకం. మమ సకలపీడాపరిహారార్థే జపే వినియోగః

కరన్యాసము :-

| | | |
|---|---|---|
| శనైశ్చరాయ | - | అంగుష్ఠాభ్యాం నమః |
| మందగతయే | - | తర్జనీభ్యాం నమః |
| అధోక్షజాయ | - | మధ్యమాభ్యాం నమః |
| సూర్యపుత్రాయ | - | అనామికాభ్యాం |
| శుష్కోదరాయ | - | కనిష్ఠికాభ్యాం |
| ఛాయా సునందనాయ | - | కరతల కరపృష్ఠాభ్యాం నమః |
| శనైశ్చరాయ | - | హృదయాయ నమః |

హృదయన్యాసము :-

| | | |
|---|---|---|
| మందగతయే | - | శిరసే స్వాహా |
| అధోక్షజాయ | - | శిఖాయై వషట్ |
| సూర్యపుత్రాయ | - | కవచాయ హుం |
| శుష్కోదరాయ | - | నేత్రత్రయాయ వౌషట్ |
| ఛాయా సునందనాయ | - | అస్త్రాయఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :-

శనైశ్చరాయ శాంతాయ సర్వాభీష్ట ప్రదాయినే
ద్వాదశాష్టమజన్మస్థః ద్వితీయస్థాన ఏవచ
తత్తల్లగ్నస్థ దోషాంశ్చ సర్వాన్ హర మమప్రభో
నమోఽర్కపుత్రాయ శనైశ్చరాయ నీహారవర్ణాంజనమేచకాయ
త్ర్యంబకం యజామహేసు గంధిం పుష్టివర్ధనం, ఉర్వారుకమివబంధనాత్
మృత్యోర్ముక్షీయమామృతాత్ శంనోదేవీరభీష్టయ ఆపోభవంతు
పీతయేశంయోరభిస్రవంతునః.
శ్రుత్వా రహస్యం భవకామదస్త్వం ఫలప్రదో మే భవ సూర్యపుత్ర.
రఘువంశ ఇతిఖ్యాతే రాజాదశరథోఽ భవేత్

చక్రవర్తీ సవిజ్ఞేయః సప్తద్వీపాధిపస్తథా
కృత్తికాంతే శనౌ యాతే దైవజ్ఞైర్జ్ఞాపితో హిసః
రోహిణీం భేదయిత్వాతు శనిర్యాస్యతి సాంప్రతమ్
ఇత్థం శకట భేదేన సురాసుర భయంకరమ్
ద్వాదశాబ్దంతు దుర్భిక్షం భవిష్యతి సుదారుణమ్
దేశాశ్చ నగర గ్రామా భయఖేదసమన్వితాః
బ్రువన్తి సర్వలోకానాం క్షయమేతత్సనాతనమ్
ఏవముక్తస్తతో వాక్యం మంత్రిభి స్సహిపార్థివః
అనుకూలంజనం దృష్ట్వా పౌరజానపదాదికమ్
పప్రచ్ఛ ప్రయతో రాజా వసిష్ఠప్రముఖాన్ ఋషీన్
సమాధానం కిమస్యాస్త్రిబ్రువంతు మునిసత్తమాః

ఋషయ ఊచుః:-

శనైశ్చరేణ శకటే తస్మిన్ భిన్నే కుతః ప్రజాః
అయం యోర్వచసాధ్యస్తు బ్రహ్మారుద్రాదిభిస్తథా
అథ సంచింత్య మనసా సహసా పురుషర్షభః
సమాధాయ ధనుర్దివ్యం దివ్యాయుధ సమన్వితమ్
రథమారుహ్య వేగేనగతో నక్షత్రమండలమ్
సపాదయోజనం లక్షం సూర్యస్యోపరిసంస్థితమ్
రోహిణీం పృష్ఠతః స్థాప్య రాజా దశరథః స్థితః
రథేతు కాంచనే దివ్యే సర్వరత్న విభూషితే
హంసవర్ణహయై ర్యుక్తే మహామేరుసముచ్ఛ్రితే
దీప్యమానమహారత్న విచిత్ర ముకుటోజ్జ్వలే
బభ్రాజనతదాకాశే ద్వితీయ ఇవ భాస్కరః
ఆకర్ణ పూర్ణచాపేన సంహారాస్త్రమయోజయత్
కృత్తికాంతే శనిః స్థిత్వా ప్రావిశత్కిల రోహిణీం,
దృష్ట్వా దశరథం చాగ్రేతస్థౌ సభ్రుకుటీముఖమ్
సంహారాస్త్రం శని దృష్ట్వా సురాసురభయంకరం
సహసా తం భయాత్సౌరిః ఇదం వచనమబ్రవీత్
పౌరుషం తవ రాజేంద్ర వరం తాపభయంకరమ్
వరం బ్రూహిప్రదాస్యామి స్వేచ్ఛయా రఘునందన

దశరథ ఉవాచ :-

ప్రసాదం కురు మే సౌరే వరదోయదిమే స్థిత:
అద్యప్రభృతిమే రాష్ట్రే పీడాకార్యా న కస్యచిత్
రోహిణీంభేదయిత్వా తు నగంతవ్యం త్వయా శనే
సరితస్సాగ రాస్సర్వే యావచ్చంద్రార్క మేదినీ
ద్వాదశాబ్దం తు దుర్భిక్షం నకదాచిద్భవిష్యతి
యాచితంతుమయా సౌరే నాన్యదిచ్ఛామి తే త్వహమ్
ఏవమస్త్వితి సంప్రోక్తో వరం ప్రాదాత్తు శాశ్వతమ్
ప్రాప్య చైనం వరం రాజా కృతకృత్యో-భవత్తదా
ఇదం వరం తు సంప్రాప్య హృష్టరోమాస పార్థివ:
రథోత్తమే ధను: స్థాప్య భూత్వాచైవ కృతాంజలి:
ధ్యాత్వా సరస్వతీం దేవీం గణాధ్యక్షం సుపూజితమ్
రాజా దశరథ: స్తోత్రం సౌరే రిదమథాకరోత్
నమ: కృష్ణాయ నీలాయ శిఖిఖండనిభాయచ
నమో నిర్మాంసదేహాయ దీర్ఘశ్రుతిజటాయచ
నమో విశాలనేత్రాయ శుష్కోదర భయానక
నమ: పౌరుషగాత్రాయ స్థూలరోమాయ తే నమ:
నమో ఘోరాయ రౌద్రాయ భీషణాయ కరాళినే
నమో దీర్ఘాయ శుష్కాయ కాలదంష్ట్ర నమోస్తుతే
నమస్తే ఘోరరూపాయ దుర్నిరీక్ష్యాయ తే నమ:
నమస్తే సర్వభక్షాయ వలీముఖ నమోఽస్తుతే
సూర్యపుత్ర నమస్తేఽస్తు భాస్వరోఽ భయదాయినే
అధోదృష్టే నమస్తేఽస్తు సంవర్తక నమోస్తుతే
నమో మందగతే తుభ్యం నిష్ప్రభాయ నమోనమ:
తపసా జ్ఞానదేహాయ నిత్యయోగరతాయచ
జ్ఞానచక్షుర్నమస్తేఽస్తు కశ్యపాత్మజసూనవే
తుష్టో దదాసి రాజ్యం త్వంక్రుద్ధోహరసి తత్క్షణాత్
దేవాసురమనుష్యాశ్చ సిద్ధ విద్యాధరోరగా:
త్వయావలోకి తాస్సౌరేదైన్య మాశుప్రజంతి తే
బ్రహ్మాశక్రోయమశ్చైవ మునయస్సప్తతారకా:

రాజ్యభ్రష్టా: పతంతీహ తవదృష్ట్యావలోకితా:
త్వయావలోకితాస్తేఽపి నాశం యాంతి సమూలత:
ప్రసాదం కురుమేసౌరే!ప్రణత్వాహి త్వమర్థిత:
ఏవం స్తుత స్తదాసౌరీ!గ్రహరాజోమహాబల:
అబ్రవీచ్ఛశనిర్వాక్యం హృష్టరోమాసభాస్కర:
ప్రీతోఽస్మితవరాజేంద్రస్తోత్రేణానేన సంప్రతి
అదేయం వా వరంతుభ్యం ప్రీతోఽహం ప్రదదామి తే
త్వయా కృతం తు మత్స్తోత్రం య: పఠేదిహ మానవ:
ఏకకాలం ద్వికాలంవాపీడాంముంచామితస్యవై
మృత్యుస్థానగతోవాపి జన్మస్థానగతోఽపివా
య:పుమాన్శ్రద్ధయాయుక్త: శుచి: స్నాత్వాసమాహిత:
శమీపత్రైస్సమభ్యర్చ్య ప్రతిమాంలోహజామిమాం
మాషోదనంతిలైర్మిశ్రం దద్యాల్లోహం తు దక్షిణాం
కృష్ణాం గాం మహిషీం వస్త్రం మా ముద్దిశ్య ద్విజాతయే
మద్దినే తు విశేషేణ స్తోత్రేణానేన పూజయేత్
పూజయిత్వా జపేత్ స్తోత్రం భుక్త్వా చైవ కృతాఞ్జలి:
తస్యపీడాం నచైవాహం కరిష్యామి కదాచన
గోచరే జన్మలగ్నే వా దశాస్వంతర్దశాసు చ
రక్షామి సతతంతస్య పీడాభ్యో-న్యగ్రహేషుచ
అనేనైవప్రకారేణ పీడాముక్తం జగద్భవేత్
వరద్వయంయశ: ప్రాప్య రాజాదశరథస్త్విత:
మేనేకృతార్థమాత్మానం సమ్యక్ స్తుత్వా శనైశ్చరం
కోణశ్శనైశ్చరోమన్ద: ఛాయాహృదయనందన:
మార్తాండజ స్తథా సౌరి: పాతంగీగ్రహనాయక:
అబ్రాహ్మణ: క్రూరకర్మా నీలవస్త్రోఽంజనద్యుతి:
కృష్ణోధర్మానుజ:శాంత: శుష్కోదరవరప్రద:

ఫలశ్రుతి:-

షోడశైతాని నామాని య:పఠేచ్ఛదినేదినే
విషమస్థోఽపిభగవాన్ సుప్రీత స్తస్యజాయతే
మందవారేశుచి: స్నాత్వా మితాహారోజితేంద్రియ:
తద్వర్ణకుసుమైర్యుక్తం సర్వాంగంద్విజసత్తమ:

పూజయిత్వాన్న పానాద్యైస్తోత్రంయ: ప్రయత: పఠేత్
పుత్ర కామోలభేత్పుత్రం ధనకామో లభేద్ధనం
రాజ్యకామో లభేద్రాజ్యం జయార్థీవిజయీభవేత్
ఆయుష్కామోలభేదాయు: శ్రీకామ: శ్రియమాప్నుయాత్
యద్యదిచ్ఛతి తత్సర్వంభగవాన్ భక్తవత్సల:
చింతితాన్యపి కర్మాణి దదాతి చ నసంశయ:
శనినాత్వభ్యనుజ్ఞాత: స్వస్థానమగమన్నృప:
స్వస్థానం సంగతోగత్వా ప్రాప్తకామోఽభవత్తదా

ఇతి హేమాద్రౌ దశరథేన కృతం శనైశ్చర స్తోత్రం సంపూర్ణమ్

## మహాకాల శని మృత్యుంజయ స్తోత్రం

(ఇది శనైశ్చర సంతృప్తికర స్తోత్రం. శనిదోషకారిగా ఉన్నప్పుడు, శనిగ్రహ-దశ అంతర్దశలు అశుభకారిగా ఉన్నప్పుడు 108మార్లు జపించిన అపమృత్యుదోషంతో సహా ఆపదలన్నీ తొలగిపోగలవు.

నమ:కాల శరీరాయ కాలనున్నాయతే నమ:
కాలహేతో నమస్తుభ్యం కాలనందాయనై నమ: 1
అఖండ దండ మానాయ త్వనాద్యంతాయ నై నమ:
కాల దేవాయ కాలాయ కాలకాలాయతే నమ: ॥ 2
నిమేషాది మహాకల్ప కాలరూపం చ భైరవం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 3
దాతారం సర్వభవ్యానాం భక్తానాం అభయంకరం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 4
కర్తారం సర్వదు:ఖానాం దుష్టానాం భయవర్దనం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 5
హర్తారం గ్రహజాలానాం ఫలానా మధికారిణం
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 6
సర్వేషా మేవ భూతానాం సుఖదం శాంతమవ్యయం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 7
కారణం సుఖదు:ఖానాం భావా భావస్వరూపిణం
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 8

అకాల మృత్యుహరణం అపమృత్యు నివారణం
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 9
కాల రూపేణ సంసారం - భక్షయం తం మహాగ్రహం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 10
దుర్నిరీక్ష్య స్థూల రోమం భీషణం దీర్ఘలోచనం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 11
గ్రహాణాం గ్రహభూతానాం సర్వగ్రహ నివారణం ।
మృత్యుంజయం మహాకాలం నమస్యామి శనైశ్చరం ॥ 12
కాలస్య వశగాః సర్వే న కాలః కస్య చిద్వశః
తస్మాత్త్వాం కాలపురుష ప్రణతోస్మి శనైశ్చరం ॥ 13
కాలదేవం జగత్సర్వం కాల ఏవ విలీయతే ।
కాలరూపః స్వయం శంభుః కాలాత్మాగ్రహదేవతా ॥ 14
చండీశోద్ధుర ధాకిన్యాం క్రాంత శ్చండీశ ఉచ్యతే
విద్యుదా కలితో నద్యాం సమారూఢో రసాధిపః ॥ 15
చండీశః శుకసంయుక్తో జిహ్వయా లలితః పునః
క్షితిజ స్తామసీ శోభీ స్థిరాత్మా విద్యుతాయుతః ॥ 16

## పిప్పలాద ప్రోక్త శని స్తోత్రం

1. నమస్తే కోణ సంస్థాయ పింగళాయ నమోస్తుతే
నమస్తే బభ్రురూపాయ కృష్ణాయ చ నమోస్తుతే ॥
2. నమస్తే రౌద్రదేహాయ నమస్తే చాంతకాయచ
నమస్తే యమ సంజ్ఞాయ నమస్తే సౌరయే విభో ॥
3. నమస్తే మంద సంజ్ఞాయ శనైశ్చర నమోస్తుతే ।
ప్రసాదం కురు దేవేశ, దీనస్య ప్రణతస్య చ ॥

## పాండవాగ్రజుడైన ధర్మరాజుచే పారాయణ చేయబడిన భవిష్యపురాణమందలి శనిస్తోత్రం

ధ్యాత్వా గణపతిం రాజా ధర్మరాజో యుధిష్ఠిం
ధీరః శనైశ్చరస్యేమం చకారస్తవముత్తమమ్ ॥ 1
శిరోమే భాస్కరిః పాతు ఫాలం ఛాయాసుతో౽వతు
కోట రాక్షో దృశౌపాతు శిఖికంఠనిభః శ్రుతీ ॥ 2

ఘ్రాణం మే భీషణః పాతు ముఖం వలీముఖోవతు
స్కంధౌ సంవర్తకః పాతు భుజౌ మే భయదోవతు ॥ 3
సౌరిర్మే హృదయం పాతు నాభిం శనైశ్చరోవతు
గ్రహరాజః కటింపాతు సర్వతో రవి నందనః ॥ 4
పాదౌమందగతిః పాతు కృష్ణః పాత్వఖిలం వపుః
రక్షామేతుం పఠేన్నిత్యం సౌరే ర్నామ బలైర్యుతమ్ ॥ 5
సుఖీ పుత్రీ చిరాయుశ్చ స భవేన్నాత్ర సంశయః
ఓం సౌరిః శనైశ్చరః కృష్ణో నీలోత్పలనిభః శనిః ॥ 6
శుష్కోదరో విశాలాక్షో దుర్నిరీక్ష్యో విభీషణ
శితికంఠనిభో నీలశ్ఛాయా హృదయ నందనః ॥ 7
కాలదృష్టిః కోటరాక్షః స్థూలరోమా బలీముఖః
దీర్ఘో నిర్మాంసగాత్రస్తు శుష్కో ఘోరో భయానకః ॥ 8
నీలాంశుః క్రోధనో రౌద్రో దీర్ఘశ్మశ్రు జటాధరః
మందో మందగతిః ఖఙ్జోతృప్తః సంవర్తకో యమః॥ 9
గ్రహరాజః కరాలీ చ సూర్యపుత్రో రవిః శశీ
కుజో బుధః గురుః కావ్యోభానుజః సింహికాసుతః ॥ 10
కేతుర్దేవ పతి బాహ్రిః కృతాన్తో నైఋతస్తథా
శశీ మరుత్కుబేరశ్చ ఈశానః సుర ఆత్మభూః ॥ 11
విష్ణుర్హరో గణపతిః కుమారః కామ ఈశ్వరః
కర్తాహర్తా పాలయితా రాజ్యలుక్ రాజ్యదాయకః ॥ 12
ఛాయాసుతః శ్యామలాంగో ధనహర్తా ధనప్రదః
క్రూరో విధాతా చ సర్వకర్మవిరోధకః ॥ 13
తుష్టో రుష్టః కామరూపః కామదో రవినందనః
గ్రహపీడాహరః శాంతో నక్షత్రేశో గ్రహేశ్వరః ॥ 14
స్థిరాసనః స్థిరగతర్మహాకామో మహాబలః
మహాప్రభుః మహాకాలః కాలాత్మా కాలకాలకః ॥ 15
ఆదిత్య భయదాతా చ మృత్యురాదిత్య నందనః
శతభిషగ్రక్షదయితః త్రయోదశి తిథి ప్రియః ॥ 16
తిథ్యాత్మా చ తిర్థగణో నక్షత్రగుణనాయకః
యోగరాశిః ముహూర్తాత్మా కర్తాదినపతిః ప్రభు ॥ 17
శమీ పుష్ప (ష్య) ప్రియః శ్యామస్త్రైలోక్య భావదాయకః
నీలవాసాః క్రియాసింధు ర్నీలాంజన చయచ్ఛవిః ॥ 18

సర్వరోగహరో దేవః సిద్ధో దేవగణస్తుతః
అష్టోత్తరశతం నామ్నాం సౌరేశ్చాయా సుతస్యయః ॥ 19
పఠేన్నిత్యం తస్యపీడా సమస్తా నశ్యతి ధ్రువమ్
కృత్వా పూజాం పఠేన్మర్త్యో భక్తిమాన్యమం స్తవంసదా ॥ 20
విశేషతః శనిదినే పీడాతస్య వినశ్యతి
జన్మలగ్నే స్థితిర్వాపి గోచరే క్రూర రాశిగే ॥ 21
దశాసుభ గతే సౌరేస్తదాస్తవమిమం పఠేత్
పూజయేద్యః శని భక్త్యా శమీపుష్పాక్షతాంబరైః ॥ 22
విధాయ లోహప్రతిమాం నరో దుఃఖాద్విముచ్యతే
బాధా త్వన్య గ్రహాణాం చయః పఠేస్తస్య నశ్యతి ॥ 23
భీతో భయాద్విముచ్యేత బద్ధో ముచ్యేత బంధనాత్
రోగీ రోగాద్విముచ్యేత నరః స్తవమిమం పఠేత్ ॥ 24
పుత్రవాన్ధనవాన్ శ్రీమాన్జాయతే నాత్ర సంశయః ॥

శనికవచమ్ :-

శ్రీ శనైశ్చర కవచస్తోత్రమన్త్రస్య కశ్యపఋషిః అనుష్టుప్ ఛందః
శనైశ్చరో దేవతా శీం శక్తిః శూంకీలకం శనైశచర ప్రీత్యర్థం జపే వినియోగః ॥

ధ్యానమ్ :-

నీలాంబరో నీలవపుః కిరీటీ గృధస్థితస్త్రాసకరో ధనుష్మాన్
చతుర్భుజః సూర్యసుతః ప్రసన్నః సదామమ స్యాద్వరదః ప్రశాంతః
శృణుధ్వమృషయః సర్వే శనిపీడాహరం మహత్
కవచం శని రాజస్య సౌరే రదిమముత్తమమ్
కవచం దేవతావాసం వజ్ర పంజర సంజ్ఞకమ్
శనైశ్చర ప్రీతికరం సర్వసౌభాగ్యదాయకం
శిరః శనైశ్చరః పాతు ఫాలం మే సూర్యనందనః
నేత్రే ఛాయాత్మజః పాతుపాతు కర్ణే యమానుజః
నాసాం వైవస్వతః పాతు ముఖంమే భాస్కరిః సదా
స్నిగ్ధకంఠశ్చమే కంఠం భుజౌపాతు మహాభుజః
స్కంధౌ పాతు యమభ్రాతా కుక్షిం పాత్వసితస్తథా
నాభిం గ్రహ పతిః పాతుమందః పాతుకటిం తథా
పాదౌ మందగతిః పాతు సర్వాంగం పాతు పిప్పలః
అంగోపాంగాని సర్వాణి రక్షేత్ సూర్యసుతశ్చమే

న తస్య జాయతే పీడా ప్రీతో భవతి సూర్యజః
వ్యయజన్మద్వితీయస్థో మృత్యుస్థానగతోపివా
కలత్రస్థో గతోవాపి సుప్రీతస్తు సదా శనిః
అష్టమస్థే సూర్యసుతే వ్యయే జన్మద్వితోయగే
కవచం శనిదేవస్య యః పఠేత్ప్రయతః శుచిః
ఇత్యేతత్ కవచం దివ్యం సౌరేర్యన్నిర్మితం పురా
ద్వాదశాష్టమ జన్మస్థ దోషాన్నాశయతే సదా
జన్మలగ్నస్థితాన్ దోషాన్ సర్వాన్నాశయతే ప్రభుః ॥

గోచారంలో 1,2,8,12 స్థానాలలో శని ఉంటే, ప్రతిదినం ఈ స్తోత్రం చదివిన బాధలు తొలగుతాయి.

## శింగనాపురం శ్రీ శనీశ్వరస్వామి ఆలయంలో ఉదయం (4.30గం) సాయంత్రం (6.30) చేసే మరాఠీ ఆరతి

వందన తుజకరితో శనిదేవా
వందన తుజ కరితో
తుజ్యా నామాచా - చందలాగుదె
పాయితీర్థయాత్ర - నిత్యషఘడె
సాధూచరణే - మస్తక్ జడూదె
కాకులితీ తుజెయేతో - శనిదేవా ॥వందన॥
గోర్ గరీబాసీ-ఖాహోయూపిదె
సదాసుఖీ సమాదానీ - తయా అసూదె
హాల్ తయాంచే కధీ న సీదె
హి వినతీ తుజకరితో - శనిదేవా ॥వందన॥
సాధు సంత చ - ద్వేషనసావా
దేవచరణీ - దీహెఝిజావా
దయా, క్షమా, శాంతి - హ్యాయాసూద్యాయా ॥వందన॥
ప్రేమ భావే తుజ - నమితో శనిదేవా
దాసుదాసీ లాగే చరణా వర్ణన కరీతో తురుఝా మహిమా
ఎవడీ భిక్షా ఘాలీ ఆహ్మే భక్త జనాంచీ ఏ ఉదయా కరుణా
పదరతుజ పసరితో - శనిదేవా ॥
వందన తుజ కరితో శనిదేవా
వందన తుజ కరితో ॥

# 142. అభినందనం

క్రింది నామములతో శనిగ్రహయంత్రమును తరచు పూజించిన శనిగ్రహాను గ్రహం కలుగుతుంది.

## శనైశ్చర గ్రహ అష్టోత్తర శతనామావళి

**ప్రతినామమునకు "ఓం" అని చివర "నమః" అని చదువుకొనవలెను.**

ఓం శనైశ్చరాయ నమః
శాంతాయ
సర్వాభీష్టప్రదాయినే
శరణ్యాయ
వరేణ్యాయ
సర్వేశాయ
సౌమ్యాయ
సురవంద్యాయ
సురలోకవిహారిణే
సుఖాసనోపవిష్టాయ
సుందరాయ
ఘనాయ
ఘనరూపాయ
ఘనాభరణధారిణే
ఘనసారవిలేపాయ
ఖద్యోతాయ
మందాయ
మందచేష్టాయ
మహనీయగుణాత్మనే
మర్త్యపావనపాదాయ
మహేశాయ
ఛాయాపుత్రాయ
శర్వాయ
శరతూణీరధారిణే
చరస్థిరస్వభావాయ
చంచలాయ
నీలవర్ణాయ
నిత్యాయ
నీలాంజననిభాయ
నీలాంబరవిభూషాయ
నిశ్చలాయ
వేద్యాయ
విధిరూపాయ
విరోధాధారభూమయే
వేదాస్పదస్వభావాయ
వజ్రదేహాయ
వైరాగ్యదాయ
వీరాయ
వీతరోగభయాయ
విపత్పరంపరేశాయ
విశ్వవంద్యాయ
గృధ్రవాహనాయ
గూఢాయ
కూర్మాంగాయ
కురూపిణే
కుత్సితాయ
గుణాఢ్యాయ
గోచరాయ
అవిద్యామూలనాశాయ
విద్యావిద్యాస్వరూపిణే
ఆయుష్యకారణాయ
ఆపదుద్ధర్త్రే
విష్ణుభక్తాయ
వశినే
వివిధాగమవేదినే
విధిస్తుత్యాయ
వంద్యాయ
విరూపాక్షాయ
పరిష్ఠాయ
గరిష్ఠాయ
వజ్రాంకుశధరాయ
వరదాయ
అభయహస్తాయ
వామనాయ
జ్యేష్ఠాపత్నీసమేతాయ
శ్రేష్ఠాయ
అమితభాషిణే
కష్టౌఘనాశకాయ
ఆర్యపుష్టిదాయ
స్తుత్యాయ
స్తోత్రగమ్యాయ
భక్తివశ్యాయ
భానవే
భానుపుత్రాయ
భవ్యాయ
పావనాయ
ధనుర్మండలసంస్థాయ
ధనదాయ
ధనుష్మతే
తనుప్రకాశదేహాయ
తామసాయ
అశేషజనవంద్యాయ
విశేషఫలదాయినే

| | | |
|---|---|---|
| వశీకృతజనేశాయ | నిర్గుణాయ | ఆర్యజనగణ్యాయ |
| పశూనాంపతయే | గుణాత్మనే | క్రూరాయ |
| ఖేచరాయ | నిరామయాయ | క్రూరచేష్టాయ |
| ఖగేశాయ | నింద్యాయ | కామక్రోధకరాయ |
| ఘననీలాంబరాయ | వందనీయాయ | కళత్రపుత్రశత్రుత్వకారణాయ |
| కాఠిన్యమానసాయ | ధీరాయ | పరిపోషితభక్తాయ |
| ఆర్యగుణస్తుత్యాయ | దివ్యదేహాయ | పరభీతిహరాయ |
| నీలచ్ఛత్రాయ | దీనార్తిహరణాయ | భక్తసంఘమనోభీష్టఫలదాయ |
| నిత్యాయ | దైన్యనాశకరాయ | శ్రీమచ్ఛనైశ్చరాయ |

# 143. అభినుతి

క్రింద సూచించిన స్తోత్రములలోనిది ఒకదానిని నిత్యం పఠించిన శని గ్రహానుగ్రహం పొందవచ్చును.

## శనైశ్చర కవచస్తోత్రమ్

ఓమ్ అస్యశ్రీశనైశ్చర కవచస్తోత్ర మహామంత్రస్య కాశ్యపఋషిః, అనుష్టుప్ఛందః, శనైశ్చరో దేవతా, శం బీజం, వాం శక్తిః, యం కీలకం, మమ శనైశ్చరకృతపీడాపరిహారార్థే జపే వినియోగః, శాం అంగుష్ఠాభ్యాం నమః, శీం తర్జనీభ్యాం నమః, శౌంకనిష్ఠికాభ్యాం నమః, శః కర తలకర పృష్ఠాభ్యాం నమః ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సువరోమితి దిగ్బంధః,

**ధ్యానమ్ :-**

చతుర్భుజం శనిం దేవం చాపతూణీకృపాణకం ।
వరదం భీమ దంష్ట్రం చ నీలాంగం వరభూషణమ్ ॥ 1

నీలమాల్యానులేపం చ నీల రత్నైరలం కృతం ।
జ్వాలోర్ధ్వమకుటా భాసం నీలగృధ్రరథావహమ్ ॥ 2

మేరుప్రదక్షిణం కృత్వా సర్వలోకభయావహం ।
కృష్ణాంబరధరం దేవంద్విభుజంగృధ్రసంస్థితమ్ ॥ 3

సర్వపీడాహరం నౄణాంధ్యా యేద్గ్రహగణోత్తమం ।
శనైశ్చరశ్శిరోరక్షేమ్ముఖంభక్తార్తినాశనః ॥ 4

కర్ణౌ కృష్ణాంబరః పాతు నేత్రే సర్వభయంకరః ।
కృష్ణాంగో నాసికాంరక్షేత్ కర్ణౌ మేచ శిఖండిజః ॥ 5

భుజౌ మే సుభుజః పాతు హస్తౌ నీలోత్పలప్రభః ।
పాతు మే హృదయం కృష్ణః కుక్షిం శుష్కోదర స్తథా ॥ 6

కటిం మే వికట: పాతు ఊరూ మేఘోరరూపవాన్ ।
జానునీ పాతు దీర్ఘో మే జంఘే మే మంగళప్రద: ॥ 7
గుల్ఫౌగుణాకర: పాతు పాదౌ మే పంగుపాదక: ।
సర్వాణిచమమాంగాని పాతు భాస్కరనందన: ॥ 8
య ఇదం కవచం దివ్యం సర్వపీడాహరం నృణాం ।
పఠతి శ్రద్ధయా యుక్త: సర్వాన్ కామానవాప్నుయాత్ ॥ 9

ఇతి శ్రీ పాద్మపురాణే శనైశ్చరకవచ:

## 144. అభివందనం

శనిగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. శనిగ్రహదేవతను కీర్తించండి.

## కూర్మావతార స్తుతి

(దశావతారాలలో పరమాత్మాంశ శనిగ్రహము-కూర్మావతారం)

నామ స్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదానృహరే ॥
మంధానాచల ధారణ దేవాసుర పరిపాల విభో
కూర్మాకార శరీర నమో భక్తం తే పరిపాలయ మాం

## శనిగ్రహ మంగళాష్టకం

మంద: కృష్ణనిభస్తు పశ్చిమముఖ: సౌరాష్ట్ర ప: కాశ్యప:
స్వామీనక్రసుకుంభయోర్బుధసితౌ మిత్రే కుజేందూ ద్విషౌ
స్థానం పశ్చిమ దిక్ప్రజాపతియమౌ దేవౌ ధనుష్యాసనౌ
షట్త్రిస్థ శ్శుభ కృచ్చమీరవి సుత: కుర్యాత్సదామంగళం ॥

## శనిగ్రహస్తోత్ర కీర్తన

రచన : శ్రీముత్తుస్వామి దీక్షితార్

రాగం : యదుకుల కాంభోజి తాళం : ఆది

పల్లవి : దివాకర తనుజం - శనైశ్చరం ।
ధీరతరం సంతతం చింతయే-హం ॥దివా॥

అనుపల్లవి : భవాంబు నిధౌ నిమగ్న జనానాం
భయంకరం అతి క్రూర ఫలదం
భవానీశ కటాక్ష పాత్ర భూత
భక్తి మతాం - అతిశయ శుభ ఫలదం ॥ ॥దివా॥

చరణం 1 : కాలాంజన కాంతియుత దేహం
కాలసహోదరం - కాక వాహం
నీలాంశుక పుష్పమాలా వృతం
నీలరత్న భూషణాలంకృతం
మాలినీ వినుత గురుగుహముదితం ॥దివా॥

చరణం 2 : మకరకుంభరాశి నాథం - తిలతైల మిశ్రితాన్న దీప ప్రియం
దయాసుధాసాగరం నిర్భయం - కాలదండ పరిపీడిత జానుం
కామితార్థ ఫలదకామధేనుం - కాలచక్రభేద చిత్రభానుం-
కల్పిత ఛాయాదేవీసూనుం

## 145. యంత్రస్థాపనం

**శనిగ్రహానుగ్రహం కోసం :-**

ఒక రాగిరేకుకు ఇరువైపులా క్రింది యంత్రమును రాయించి పూజించాలి.

| | | |
|---|---|---|
| 12 | 7 | 14 |
| 13 | 11 | 9 |
| 8 | 15 | 10 |

| | | |
|---|---|---|
| 12 | 13 | 8 |
| 7 | 11 | 15 |
| 14 | 9 | 10 |

పై యంత్రమును "ఓం ప్రాం ప్రీం ప్రౌం సః శనైశ్చరాయ నమః" అను మూలమంత్రమును 19,000 సార్లు జపిస్తూ పూజించాలి.

**శనియంత్రం (భృగుసంహిత) :-**

ఈ యంత్రమును రాగిరేకుపై చెక్కించి దానిని "ఓం ప్రాం ప్రీం ప్రౌం సః శనైశ్చరాయ నమః" అను మంత్రమును 33000 సార్లు జపిస్తూ పూజించాలి. కార్యహాని జరగకుండా అనుకున్న పనులు నెరవేరుటకు ఈ యంత్రం ఉపయోగపడును.



# 146. ఏల్నాటి శని

గోచారంలో శని చంద్రలగ్నాత్తు 12, 1, 2 భావములలో తిరిగే కాలాన్ని ఏల్నాటి శని అంటారు. ఇది సుమారు 7 సంవత్సరముల 6 నెలలు వుంటుంది. అనగా ఒక్కొక్క రాశిలో 2 1/2 సం॥ చొప్పున 3 రాశులలో 7 1/2 సంవత్సరాలు వుంటుంది. సామాన్యంగా జాతకుని జీవిత కాలంలో ఏల్నాటిశని ప్రభావం మూడుసార్లు కలుగుతుంది.

**ప్రథమచార :-**

శని చంద్రునికి 12వ స్థానములో వున్నపుడు జాతకుని తల్లిదండ్రులకు, దగ్గర బంధువులకు నష్టములు కలుగును. ఈ కాలంలో శనికి కుజ సంబంధం ఏర్పడితే ఆపరేషన్ జరుగును. అధికవ్యయం కలుగును. శని రవి లేక రాహువు లేక 12వ స్థానాధిపతితో సంబంధం కలిగివుంటే జాతకుడు సన్యసిస్తాడు.

**ద్వితీయ చార :-**

శని చంద్రునితో కలసియుండి 3,7,10 భావములను చూస్తున్న సంసారములో బాధలు కలుగును. వృత్తికి ఆటంకాలు ఏర్పడును. అనారోగ్యము, బంధు వియోగము, అర్థిక నష్టం, బంధుమిత్ర వియోగం, ఆటంకాలు కలుగును.

**తృతీయ చార :-**

శని చంద్రునికి రెండవ స్థానంలో వుండి 4, 8, 11 భావములను చూస్తున్న ఆరోగ్యనష్టం, సుఖహీనం, అధికారనష్టం, ధనవ్యయం, ప్రాణభయం కలుగును.

పై ఫలితములు శని పాపి అయితే కలుగును. శనియోగకారకుడైతే శుభఫలములనే యిచ్చును.

| శని అష్టకష్టములనే కాదు అష్టైశ్వర్యములనుకూడా యిచ్చును. |
|---|

★ శనిచంద్రలగ్నాత్తు 4వ స్థానంలో వుంటే అర్ధాష్టమశని దోషము అంటారు.

★ శని చంద్ర లగ్నాత్తు 8వ స్థానంలో వుంటే అష్టమశని దోషం అంటారు.

# శనిదోష పరిహారక్రియలు

★ శనిమంత్రమును 190 సార్లు జపించండి.

★ ప్రతిదినము శివాలయముకు వెళ్ళి దైవదర్శనం చేయండి.

★ సాయిబాబా ధునిలో నవధాన్యములు వేయండి.

★ 40 రోజులు నవగ్రహ ప్రదక్షిణలు చేసి తరువాత శనికి తైలాభిషేకం చేయండి.

ఈ విధంగా వరుసగా తైలాభిషేకం చేయండి.

★ శనిత్రయోదశినాడు శనికి తైలాభిషేకం 3సార్లు చేయండి.

★ శనియొక్క ప్రత్యేక దేవాలయములకు వెళ్ళి అచట పూజలు చేయించండి.

ఇంకా అనేక పరిక్రియలున్నాయి. ఏది చేసినా ఉపశాంతి కలుగును.

**మనస్సును పవిత్రభావంతో నింపి, పరోపకారబుద్ధితో మెలగిన శనిదోష తీవ్రత తగ్గి, ఆయన శుభములను కలిగిస్తాడు.**

**శని దేవాలయమున్న ప్రదేశములు :-**

1. మందపల్లిలోని మందేశ్వరాలయం.
2. శింగణాపూర్‌లోని శని దేవాలయం.
3. పెద్దాపురం, అమరగిరి పాండవులమెట్టపైన శనైశ్చరాలయం.
4. పాలకొల్లులోని క్షీరా రామలింగేశ్వరుని దేవాలయంలో శనైశ్చరాలయం.
5. విజయవాడలోని శనైశ్చర దేవాలయం.



# 147. రాహువు - ఒక వీక్షణ

1. ఇతరనామాలు - అసుర, బహి, స్వర్భాను, తమస
2. లింగము - స్త్రీ గ్రహం నపుంసకగ్రహం
3. జాతి - మ్లేచ్ఛ జాతి
4. రంగు - నలుపు
5. తత్త్వము - .....
6. గ్రహస్వభావము - పాపగ్రహము
7. స్వభావము - క్రూరస్వభావం
8. గుణము - తమోగుణము
9. రుచులు - పులుపు
10. గ్రహోదయము - పృష్ఠ
11. జీవులు - .....
12. గ్రహస్థానము - పాములు తిరిగే ప్రాంతం
13. ఆధిపత్యదిక్కు - నైరుతి
14. జలభాగం - .....
15. ఆత్మాధికారకత్వం - కష్టము
16. పాలనశక్తులు - భటుడు
17. శరీర ధాతువు - .....
18. లోహధాతువు - సీసం
19. కుటుంబ సభ్యుడు - .....
20. గ్రహరూపవర్ణం - నలుపు
21. గ్రహపీడ - వీర్య సంబంధనష్టం
22. గ్రహవర్గం - శని
23. గృహభాగములు - ఉపయోగించని ప్రదేశాలు
24. కాల బలము - .....
25. దిగ్బలము - .....
26. ఆధిపత్యకాలము - .....
27. స్వక్షేత్రము - కుంభం
28. శత్రుక్షేత్రము - సింహం
29. మిత్రక్షేత్రము - తుల
30. విషమక్షేత్రము - .....
31. సమక్షేత్రము - మేషం

32. ఉచ్ఛరాశి - వృషభం
33. నీచరాశి - వృశ్చికం
34. మూల త్రికోణము - మిధునం
35. పరమ ఉచ్ఛ - వృషభం
36. పరమ నీచ - వృశ్చికం
37. మిత్ర గ్రహాలు - శుక్రుడు, శని
38. శత్రుగ్రహాలు - రవి, చంద్రుడు, కుజుడు
39. సమగ్రహాలు - బుధుడు, గురుడు
40. వ్యధా గ్రహము - .....
41. నైసర్గిక బలగ్రహము - .....
42. దిన చలనం - సుమారు 3 నిమిషాల 18 సెకన్లు
43. రాశిలో గ్రహం ఉండే కాలం - 1 1/2 సంవత్సరము
44. రాశిలో ఫలమిచ్చేభాగం - .....
45. గ్రహ ప్రకృతి - .....
46. ఋతువు - .....
47. దిగ్బలము - .....
48. సూచించు ఎత్తు - పొడవు
49. సూచింపబడే వయస్సు - 80 సంవత్సరాలు
50. సూచించు ప్రాంతాలు - ......
51. నివాస ప్రాంతం - స్మశానములు
52. సూచించబడే శరీరా వయవము - .....
53. సూచించే శరీర వ్యాధులు - వెక్కిళ్ళు, చిన్నప్రేగులు దెబ్బ తినుట, చర్మరోగము, క్షయ.
54. గోచారరీత్యా శుభస్థానములు - 3,6,11
55. గోచారరీత్యా అశుభస్థానములు - 1,2,4,5,7,8,9,10,12
56. గోచారరీత్యా వేధస్థానములు - 5,9,12
57. గ్రహదశా కాలము - 18 సంవత్సరములు
58. జీవన కారకత్వము - వ్యయకారకుడు
59. సంబంధించిన నక్షత్రములు - ఆరుద్ర, స్వాతి, శతభిషం
60. సూచించు వృక్షజాతి - పొదలు
61. సూచించు ధాన్యం - మినుములు
62. సూచించు పండ్లు - ఖర్జూర
63. సూచించు పక్షులు - .....
64. సూచించు జంతువులు - ఏనుగు, పాములు, అడవి ఎలుక
65. సూచించు ఇతర ద్రవ్యములు - ఆవాలు, గొడుగు

| | | | |
|---|---|---|---|
| | సంబంధించిన సమిధ | - | దూర్వ (గరిక) |
| 66. | సంబంధించిన మూలిక | - | చందనం |
| 67. | సూచించు వస్త్రము | - | ..... |
| 68. | దేవవర్ణము | - | శైవ |
| 69. | గ్రహగోత్రము | - | పైఠీనస |
| 70. | వేదములు | - | ..... |
| 71. | శుభత్వం | - | పూర్ణ పాపి |
| 72. | అవతారం | - | వరాహావతారము |
| 74. | గ్రహస్వరూపం | - | భయంకరమైన ముఖము కలిగి నాలుగు భుజాలు కలిగి కత్తి, కవచం, త్రిశూలం ధరించినవాడు. |
| 75. | గ్రహ స్వరూప వర్ణం | - | నల్లనివాడు |
| 76. | గ్రహారూఢ వాహనం | - | సింహం |
| 77. | పూజార్థం గ్రహ ప్రతిమకు వాడవలసినది | - | సీసం |
| 78. | గ్రహప్రీతికి నైవేద్యం | - | మాంసం కలిపిన అన్నము |
| 79. | అధిష్ఠాన దేవత | - | సరస్వతీదేవి |
| 80. | అధిదేవత | - | గోవు |
| 81. | ప్రత్యధిదేవత | - | సర్పము |
| 82. | గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు | - | సరస్వతీ పూజ |
| 83. | చేయవలసిన ప్రసాదము | - | గారెలు, మినుపసున్నుండలు |
| 84. | దోష నివారణకు దక్షిణ | - | లోహము |
| 85. | ప్రీతికరమైన తిథి | - | చైత్ర బహుళ ద్వాదశి |
| 86. | ఆచరించవలసిన వ్రతము | - | సరస్వతీ వ్రతం |
| 87. | పారాయణ చేయవలసిన పురాణాలు | - | వరాహపురాణం |
| 88. | పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి | - | రాహుగ్రహ అష్టోత్తర శతనామావళి |
| 89. | పారాయణ చేయవలసిన సహస్రనామావళి | - | లలితా సహస్రనామావళి |
| 90. | ఆచరించవలసిన దీక్ష | - | భవానిదీక్ష |
| 91. | ధరించవలసిన మాల | - | రుద్రాక్ష మాల |
| 92. | ధరించవలసిన రత్నము | - | గోమేధికము |
| 93. | ధరించవలసిన రుద్రాక్ష | - | అష్టముఖి |
| 94. | దర్శించవలసిన దేవాలయములు | - | సరస్వతీ, దుర్గాదేవి, సుబ్రహ్మణ్య స్వామి దేవాలయములు. |

95. చేయవలసిన పూజలు - సుబ్రహ్మణ్యస్వామి, దుర్గాపూజ
96. దానంచేయవలసిన ద్రవ్యములు - మినుములు, తేనె, ఎండుద్రాక్ష
97. గ్రహజప సంఖ్య - 18,000
98. హోమముకు వాడు సమిధ - గరిక
99. నవగ్రహమండపంలో గ్రహఆసనం - చేట ఆకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 7వ రాశి.
101. గ్రహసంఖ్య - 4
102. గ్రహం సూచించు వారం - గురువారం సాయంకాలం
103. శుభసమయం - మధ్యాహ్నసమయం 12 గంటలు
104. ప్రతినిధి గ్రహాలు - కుజ+శని, రవి+శని
105. గ్రహం బలంగా ఉంటే ఫలితం - .....
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - .....
107. తండ్రి - కశ్యప
108. తల్లి - సింహిక
109. భార్య - కరాళి
110. సూచించు లోహములు - సీసము
111. గ్రహప్రభావితుల మనఃస్థితి - కఠినం
112. భావకారకత్వం - విలాసం, భోగం
113. గ్రహదృష్టి - అధోముఖ
114. గ్రహమునకు గుర్తు - ☊
115. సంబంధించిన వృత్తి - ఎద్యుత్తు
116. గ్రహజన్మ సంవత్సరం - రాక్షస
117. జన్మమాసం - మాఘం
118. జన్మతిథి - కృష్ణ చతుర్దశి
119. జన్మనక్షత్రం - ఆశ్లేష
120. ఆధిపత్యం వహించుదేశం - బర్బర
121. గ్రహఋషి - వాసుదేవుడు
122. గ్రహ ఛందస్సు - గాయత్రి
123. పుట్టినవారం - శుక్రవారం

**సంబంధించిన వస్తువులు, పనులు:-** అడవి ఎలుక, ఏనుగు, గొడుగు, మినుములు, ఆవాలు, పాములు, గోమేధికము, దుర్గాపూజ.

# 148. పురాణాల పరంగా రాహువు

రాహువు నల్లని శరీర ధాతువు ఛాయ కలవాడు. భయంకరమైన ముఖము కలవాడు. నాలుగు భుజములు కలవాడు. కత్తి, త్రిశూలము, కవచము ధరించును. ఇతను వాహనముగా సింహమును అధిరోహించును. ఇతనికి అసుర, బహి, తమస, స్వర్భాను అను పేర్లు కలవు.

కశ్యపప్రజాపతి గొప్ప తపస్వి. ఒకనాడా మహర్షి తపోదీక్షలో ఉండగా, అతడి భార్య అయిన సింహిక విపరీతమైన తమకం పట్టజాలక, సంభోగకేళిని కోరింది. అది అసురసంధ్యవేళ. వేళగాని వేళ ఇట్టికోరిక తగదన్నాడు మహర్షి. సింహిక వినిపించుకోలేదు. చివరికామె కోరిక తీర్చక తప్పలేదాయనకు. కోరిక తీర్చి మరీ శపించాడామెను.

ఆ శాప కారణాన ఆమెకు పార్ధివనామ సంవత్సర భాద్రపద శుక్ల పూర్ణిమనాటి పూర్వాభాద్ర నక్షత్రమున రాహువు జన్మించాడు. దాదాపు శని ఇచ్చే ఫలితాలు రాహువు కూడ ఇస్తాడు.

రాహువు క్షీరసాగరమధనం అనంతరం అమృతపాన మహిమ వల్ల తల మొండెం వేరు చేయబడినప్పటికీ బ్రతికి, పాముశరీరంతో రూపొంది విష్ణువును ప్రార్థించి గ్రహమండలంలో స్థానం సంపాదించాడు. రాహువు ఆనాటినుంచి సూర్యచంద్రాదుల్ని గ్రహణం పేరిట పీడించసాగాడు.

# 149. జ్యోతిష్యశాస్త్రపరంగా రాహువు

**లక్షణాలు :-**

రాహువు స్త్రీ గ్రహము. ఇది నలుపురంగును, రత్నములలో గోమేధికమును సూచించును. అధిదేవత గౌరి. ఇది నైరుతి దిక్కును సూచించును. ఈ గ్రహసంఖ్య 2. పొడవైన వారిని, ముసలివారిని సూచించును. ఇతను తమోగుణ ప్రధానుడు బర్బరాదేశమును సూచించును.

రాహువు ఆరుద్ర, స్వాతి, శతభిషం నక్షత్రములకు అధిపతి. రాహుగ్రహదశ 18 సంవత్సరాలు. బుధ, శుక్ర, శని ఇతనికి స్నేహితులు. రవి, కుజ, చంద్ర, గురువులు శత్రువులు, బుధ, గురులు సములు.

**కారకత్వములు :-**

రాహువు పితామహుడు (తాత), వృద్ధాప్యము, శ్వాస, భాష, అసత్యము, భ్రమ, వాయువు, విచారము, మరకతము, జూదరి, కఫము, సంధ్యాసమయము, రాజ్యము, బయటప్రదేశం, గొడుగు పల్లకి, అపరిశుభ్రము, నులిపురుగులు, గుల్మరోగము. విమర్శ, అంటరానితనము, జూదము, గారడీ విద్య, పాములు,

విషము, విషముతో కూడిన మందులు, పుట్టలు, నాగపూజ, ఎడమచేతితో వ్రాయుట, నీచస్త్రీ సాంగత్యము, స్మశానము, దొంగతనము, భూతములు, వైద్యశాస్త్రమును సూచించును. నల్లులు, దోమలు, కీటకములు, గుడ్లగూబలును సూచించును. చర్మవ్యాధులు, గుండెనొప్పి, గుండెదడను సూచించును.

**రాహువు సూచించు విద్యలు :-**

రాహువు ఏగ్రహంతో సంబంధం కలిగిఉంటే ఆ గ్రహానికి సంబంధించిన విద్యలను సూచించును.

**రాహువు సూచించు వ్యాధులు :-**

రాహువు ఏగ్రహంతో కలిస్తే ఆ గ్రహానికి సంబంధించిన అవయము చెడిపోవుటకు సహాయం చేస్తాడు. ఆయాగ్రహాల రోగాలను కలిగించుటకు ప్రయత్నిస్తాడు. విషాహారం తినుట, పాముకాటు, తేలుకాటు, కుష్ఠు, కాన్సర్‌ను కలిగిస్తాడు.

**రాహువు సూచించు వృత్తి, వ్యాపారాలు :-**

రాహువు జైళ్ళు, క్రిమినల్ కోర్టులో ఉద్యోగస్థులును, ఎలక్ట్రిసిటీ, మోటారు, నిప్పు, గ్యాస్, ఇనుములకు సంబంధించిన పనులు చేయువారిని సూచించును.

రాహువు, శనిచే సూచించబడు వృత్తులను సూచించును.

## ద్వాదశలగ్నాలలో రాహువు - ఫలితాలు

**మేషం లగ్నమైతే :-**

- మేషలగ్నమై లగ్నమున రాహువున్న దుఃఖము, దుష్టస్వభావము, శరీరబాధలు ఏర్పడును.
- 2వ స్థానమున రాహువున్న, బుధునితో లేక శనితో కాని సంబంధం ఉంటే మరణభయం కలుగును.
- 3 వ స్థానమున రాహువున్న మొదట సుఖజీవనము కలుగును. తరువాత ఆర్థిక యిబ్బందులు, ఋణము కలుగును.
- 4 వ స్థానమున రాహువున్న తల్లి గురించిన ఆలోచనలు, మరణ భయము, సుఖహీనం, అశాంతి కలుగును.
- 5 వ స్థానమున రాహువున్న సంతానం వలన విచారం, నష్టము, ఆటంకములు కలుగును.

- 6 వ స్థానమున రాహువున్న దాయాదుల ఆస్తి లభించును.
- 7 వ స్థానమున రాహువున్న కుటుంబమున అశాంతి, ధననష్టము కలుగును.
- 8 వ స్థానమున రాహువున్న అనేక కష్టములు కలుగును.
- 9 వ స్థానమున రాహువున్న తండ్రికి అనారోగ్యం కలుగును.
- 10 వ స్థానమున రాహువున్న పుణ్యనది సందర్శన కలుగును.
- 11 వ స్థానమున రాహువున్న చెడుపనులు, ధనార్జన ఉంటుంది.
- 12 వ స్థానమున రాహువున్న వృధా ఖర్చు జరుగును.

**వృషభం లగ్నమైతే :-**

- వృషభము లగ్నమై, లగ్నంలో రాహువున్న మంచి రూపము, కీర్తి కలుగును.
- 2 వ స్థానమున రాహువున్న పిత్రార్జిత ఆస్తిని కోల్పోవును. పాపగ్రహయుతుడైన మరణభయం కలుగును.
- 3 వ స్థానమున రాహువున్న సోదరులకు ఆపద కలుగును.
- 4 వ స్థానమున రాహువున్న తల్లికి అనారోగ్యము, భూమిని కోల్పోవుట, సుఖహీనం కలుగును.
- 5 వ స్థానంలో రాహువున్న ధనము, సుఖము, సంతానం వలన విచారము కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న అనారోగ్యము, కష్టములు, అశాంతి కలుగును.
- 7 వ స్థానంలో రాహువున్న అనారోగ్యము, కళత్రమునకు బాధలు కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న అనారోగ్యము, కష్టములు, అశాంతి కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న బాలారిష్టము లేదా తండ్రికి ఆపద కలుగును.
- 10 వ స్థానంలో రాహువున్న పుణ్యక్షేత్రాల దర్శనం కలుగును.
- 11 వ స్థానంలో రాహువున్న ఉద్యోగం, వాహనం, అధికారం కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న చికాకులు, అవమానాలు , ధననష్టము కలుగును.

**మిధునం లగ్నమైతే :-**

- మిధునలగ్నమై లగ్నంలో రాహువున్న దీర్ఘమేహరోగం, బాధలు కలుగును.
- 2 వ స్థానంలో రాహువున్న ధననష్టము, అనారోగ్యం, అశాంతి, ప్రమాదం కలుగును.
- 3 వ స్థానంలో రాహువున్న ఉద్యోగం, సోదరులు, ధనలాభం కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న మాతృసౌఖ్యం, విద్య, వాహనం లభించును.
- 5 వ స్థానంలో రాహువున్న సుఖము, సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న సంసారసుఖం తక్కువ.

- 7 వ స్థానంలో రాహువున్న సంసారసుఖం తక్కువ. విధవా స్త్రీ సంగమం, అనారోగ్యం కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న అశుభ కార్యములు, ఆటంకములు, ఆర్థిక ఇబ్బందులు కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న బాల్యమున ప్రమాదములు, లేక తండ్రికి ఆపద.
- 10 వ స్థానంలో రాహువున్న పుణ్యక్షేత్ర సందర్శన చేస్తారు.
- 11 వ స్థానంలో రాహువున్న కుటుంబ సుఖము, కార్యసిద్ధి, దుష్టకార్యముల నిర్వహణ, ధనసంపాదన కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న నీచుల స్నేహం, వ్యసనములకు ధనవ్యయం, ధననష్టం కలుగును.

**కర్కాటకం లగ్నమైతే :-**

- కర్కాటక లగ్నమై లగ్నంలో రాహువున్న నిర్దయ, కఠినవాక్కు కలుగును.
- 2 వ స్థానంలో రాహువున్న ధనరాబడి ఉండదు.
- 3 వ స్థానంలో రాహువున్న భూ, ధనలాభము కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న తల్లికి అనారోగ్యం కలుగును. భూమి నశించును. వాహనయోగంను కోల్పోవును.
- 5 వ స్థానంలో రాహువున్న సంతాన నష్టం కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న అనారోగ్యబాధలు, అశాంతి కలుగును.
- 7 వ స్థానంలో రాహువున్న భార్యవలన దుఃఖము, శరీరబాధలు కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న అప్పులవలన బాధలు, కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న తండ్రికి అనారోగ్యం కలుగును.
- 10 వ స్థానంలో రాహువున్న భూమి, ధనం లభించును.
- 11 వ స్థానంలో రాహువున్న అధికారం కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న నీచస్నేహితులు లభిస్తారు. దుష్టకార్యములకు ధనవ్యయం అవుతుంది.

**సింహం లగ్నమైతే :-**

- సింహలగ్నమై లగ్నంలో రాహువున్న మోసకారితనం, సుఖహీనం, పట్టుదల కలుగును.
- 2 వ స్థానంలో రాహువున్న శరీరబాధ, ధనహీనము, కష్టము కలుగును.
- 3 వ స్థానంలో రాహువున్న భూమి, ధనము లభించును. కుటుంబ సుఖము కలుగును.

- 4 వ స్థానంలో రాహువున్న విద్యకు ఆటంకములు, మాతృసుఖము తక్కువ, భూవిక్రయం కలుగును.
- 5 వ స్థానంలో రాహువున్న సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న కార్యసిద్ధి, వారసత్వపు ఆస్తి లభించును.
- 7 వ స్థానంలో రాహువున్న కళత్రనష్టము, శరీరబాధ కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న రోగము, ఋణము కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న కుటుంబ సుఖము తక్కువ. ఆదాయం ఉంటుంది.
- 10 వ స్థానంలో రాహువున్న కుటుంబ సుఖము, శాంతి కలుగును.
- 11 వ స్థానంలో రాహువున్న కుటుంబ సుఖము, అన్యాయార్జిత ధనం ఉంటుంది.
- 12 వ స్థానంలో రాహువున్న పిత్రార్జిత ధనాన్ని వ్యయం చేయును.

**కన్య లగ్నమైతే :-**

- కన్యలగ్నమై లగ్నంలో రాహువున్న సుఖము, ధనము కలుగును.
- 2 వ స్థానంలో రాహువున్న ఆర్థిక ఇబ్బందులు కలుగును.
- 3 వ స్థానంలో రాహువున్న నీచవృత్తి వలన జీవనము, ధనార్జన, సుఖము కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న సుఖహీనము. రాహుదశలో తల్లి లేక తండ్రి వలన దుఃఖము కలుగును.
- 5 వ స్థానంలో రాహువున్న సంతాన నష్టము, ధనలాభము కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న జ్ఞాతుల వలన ఆస్తి లభించును.
- 7 వ స్థానంలో రాహువున్న శరీర బాధలు, భార్యవలన బాధలు కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న కష్టములు, ధనహీనత కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న సుఖము, ధనము, కార్యసిద్ధి, తండ్రికి సేవ కలుగును.
- 10 వ స్థానంలో రాహువున్న సామాన్యజీవనము, పుణ్యక్షేత్ర దర్శనం కలుగును.
- 11 వ స్థానంలో రాహువున్న ప్రయాణాలు, సామాన్య జీవనం కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న తండ్రి సంపాదించిన ధనం వ్యయమగును.

**తుల లగ్నమైతే :-**

- తులా లగ్నమై లగ్నంలో రాహువున్న అనారోగ్యము కలుగును.
- 2 వ స్థానంలో రాహువున్న భార్యకు అనారోగ్యం, సంతానం వలన దుఃఖము, ధన నష్టము కలుగును.

- 3 వ స్థానంలో రాహువున్న భూ, ధన లాభము కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న విద్యకు ఆటంకాలు, పూర్వుల ఆస్తి నష్టము కలుగును.
- 5 వ స్థానంలో రాహువున్న సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న భూలాభము, శతృజయము కలుగును.
- 7 వ స్థానంలో రాహువున్న భార్యకు అనారోగ్యం కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న దరిద్రము, కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న తండ్రికి అనారోగ్యం కలుగును.
- 10 వ స్థానంలో రాహువున్న ప్రయాణాలు, పుణ్యక్షేత్రములు దర్శించుట, సుఖము, ధనలాభం కలుగును.
- 11 వ స్థానంలో రాహువున్న సంఘంలో గౌరవం, కుటుంబంలో శాంతి, భూలాభము కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న నీచులతో సాన్నిహిత్యం, ధనవ్యయం కలుగును.

**వృశ్చికం లగ్నమైతే :-**

- వృశ్చికలగ్నమై లగ్నంలో రాహువున్న అపకీర్తి కలవాడు, గుర్తింపు లేనివాడు.
- 2 వ స్థానంలో రాహువున్న ధనార్జనము కలుగును.
- 3 వ స్థానంలో రాహువున్న విశేష భాగ్యములు కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న తల్లివలన బాధలు, విద్యకు ఆటంకాలు, ఋణములు కలుగును.
- 5 వ స్థానంలో రాహువున్న సంతాన నష్టం కలుగుతుంది.
- 6 వ స్థానంలో రాహువున్న జ్ఞాతుల ఆస్తి లభించును.
- 7 వ స్థానంలో రాహువున్న విశేషధనం, కళత్ర విచారం కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న కష్టములు, అశాంతి కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న భూ లాభం కలుగును.
- 10 వ స్థానంలో రాహువున్న ధన రాబడి కలుగును.
- 11 వ స్థానంలో రాహువున్న విశేష భాగ్యము, కీర్తి కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న నీచులు స్నేహితులు అవుతారు.

**ధనుస్సు లగ్నమైతే :-**

- ధనుస్సు లగ్నమై లగ్నములో రాహువున్న శరీర అనారోగ్యము, చపలత్వము కలుగును.
- 2 వ స్థానంలో రాహువు యున్న సుఖహీనము కలుగును.

- 3 వ స్థానంలో రాహువున్న పూర్ణాయుర్దాయము కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న విద్య, భూమి, మాతృ సుఖము తక్కువగా ఉండును.
- 5 వ స్థానంలో రాహువున్న సుఖము, శాంతి, సంతాననష్టము కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న కీర్తి, శత్రువృద్ధి, శత్రువులపై జయం కలుగును.
- 7 వ స్థానంలో రాహువున్న స్త్రీ సౌఖ్యము కలుగును.
- 8 వ స్థానంలో రాహువున్న శరీర బాధ, కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న పిత్రార్జితము లభించును. సంఘంలో గౌరవం, సుఖం కలుగును.
- 10 వ స్థానంలో రాహువున్న చిన్న చిన్న ప్రయాణాలు చేస్తారు.
- 11 వ స్థానంలో రాహువున్న నీచ కార్యాసక్తి, ధన సంపాదన ఉంటుంది.
- 12 వ స్థానంలో రాహువున్న కష్టములు, వృధావ్యయము కలుగును.

**మకరం లగ్నమైతే :-**

- మకర లగ్నమై లగ్నంలో రాహువున్న అనారోగ్యము, ధనవ్యయము, నీచ స్వభావము కలుగును.
- 2 వ స్థానంలో రాహువున్న ఆర్థిక యిబ్బందులు కలుగును.
- 3 వ స్థానంలో రాహువున్న భోగభాగ్యములు కలుగును.
- 4 వ స్థానంలో రాహువున్న విద్యకు ఆటంకాలు. తల్లికి అనారోగ్యము, భూమి అమ్మకట కలుగును.
- 5 వ స్థానంలో రాహువున్న పూర్ణాయుర్దాయము, చికాకులు, సంతానం వలన దుఃఖం కలుగును.
- 6 వ స్థానంలో రాహువున్న సుఖము, ధనము కలుగును. శత్రువుల వలన, ఋణముల వలన బాధలు కలుగును.
- 7 వ స్థానంలో రాహువున్న భార్యకు ప్రమాదం.
- 8 వ స్థానంలో రాహువున్న కష్టములు, ఆర్థిక యిబ్బందులు కలుగును.
- 9 వ స్థానంలో రాహువున్న తండ్రికి ప్రమాదం.
- 10 వ స్థానంలో రాహువున్న నిలకడలేనితనము, ఎక్కువ ప్రయాణాలు కలుగును.
- 11 వ స్థానంలో రాహువున్న నీచవృత్తి వలన జీవనము కలుగును.
- 12 వ స్థానంలో రాహువున్న నీచుల స్నేహం, దుష్టకార్యములకు ధనవ్యయం కలుగును.

కుంభం లగ్నమైతే :-

కుంభలగ్నమై లగ్నములో రాహువున్న శరీర బాధలు, మిత్రులు దూరమగుట, ధనవ్యయము కలుగును.

2 వ స్థానమున రాహువున్న అప్పుడప్పుడు అనారోగ్యము, ధనవ్యయము, అశాంతి కలుగును.

3 వ స్థానమున రాహువున్న దీర్ఘ ఆయుర్దాయము కలుగును. ధనలాభము కలుగును.

వ స్థానమున రాహువున్న సుఖజీవనం, సంఘంలో గుర్తింపు కలుగును.

వ స్థానమున రాహువున్న సుఖజీవనం, సంతానసుఖం లేకపోవుట గును.

స్థానమున రాహువున్న శత్రువుల వలన, అప్పుల వలన బాధలు కలుగును.

నమున రాహువున్న కుటుంబంలో అనారోగ్యములు కలిగి అశాంతి కలుగును.

నమున రాహువున్న అనారోగ్యం, ధనవ్యయము కలుగును.

నమున రాహువున్న పితృసుఖం వుండదు.

నమున రాహువున్న నీచవృత్తి ద్వారా జీవనం పొందును.

నమున రాహువున్న నీచకార్యాసక్తి, ధనరాబడి ఉంటుంది.

మున రాహువున్న నీచుల సాంగత్యం, వృధా ఖర్చు ఉంటుంది.

:-

మై లగ్నములో రాహువుఉన్న కఠినవాక్కు, అనారోగ్యము, డును.

రాహువు యున్న ధనార్జన, అనారోగ్యము, ధన వ్యయము కలుగును.

రాహువు యున్న విశేషధనలాభం, గౌరవం కలుగును.

రాహువు యున్న భూమి, వాహనము, కలుగును. మాతృ కలుగును.

హువు యున్న సంతాన సుఖము తక్కువగా కలుగును.

హువు యున్న ఆరోగ్యం, ఆనందం కలుగును.

యున్న భార్యవలన బాధలు, శరీర అనారోగ్యము కలుగును.

వు యున్న సుఖము తక్కువ. కార్యహాని, ఆర్థిక

- 9 వ స్థానంలో రాహువు యున్న కుటుంబంలో అశాంతి, పనులలో ఆటంకములు కలుగును.
- 10 వ స్థానంలో రాహువు యున్న చిన్న ప్రయాణాలు చేయును.
- 11 వ స్థానంలో రాహువు యున్న అన్యాయధనార్జన చేయును.
- 12 వ స్థానంలో రాహువు యున్న చెడు స్నేహితులు, అనవసర ఖర్చులు, ఆటంకములు, అవమానము కలుగును.

## వివిధ భావాలలో రాహువు - ఫలితాలు

- రాహువు లగ్నంలో ఉంటే జాతకుడు స్వేచ్ఛాజీవి. ఉమ్మడి కుటుంబంలో కలసి ఉండక స్వతంత్రంగా జీవిస్తాడు. ఎవరి మాట వినడు. పరస్త్రీలపై వ్యామోహం కలిగి ఉంటాడు. ధనాన్ని వ్యయం చేస్తాడు. సంతానంకు ప్రమాదం ఉంటుంది.
- రాహువు ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు పరులసొమ్మును అపహరించుటకు వెనుకాడడు. మద్యము లేదా మాంసముకు సంబంధించిన వృత్తులను చేపట్టును.
- రాహువు తృతీయ భావంలో ఉంటే జాతకుడు ఉన్నతస్థానంలో ఉంటాడు. కుటుంబంతో సుఖంగా జీవిస్తాడు.
- రాహువు చతుర్థ భావంలో ఉంటే జాతకుడు సాధారణ జీవితం గడుపుతాడు. గ్రామాలలో ఉండుటకు ఇష్టపడతాడు. ఇతరుల సహకారం ఉండదు.
- రాహువు పంచమ భావంలో ఉంటే జాతకునకు పుత్రసంతానం ఉంటుంది.
- రాహువు షష్టమ భావంలో ఉంటే జాతకునకు స్నేహితులు తక్కువగా ఉంటారు.
- రాహువు సప్తమ భావంలో ఉంటే జాతకుని భార్య నీచస్వభావం కలిగి ఉంటుంది. ఆమె ఆరోగ్యం కూడ తక్కువగా ఉంటుంది.
- రాహువు అష్టమ భావంలో ఉంటే జాతకుడు అవినీతి పనులు చేస్తాడు. దానివలన శత్రుభయం కలుగుతుంది. జూదగాడు.
- రాహువు నవమభాంలో ఉంటే జాతకుడు నీచకార్యాలు చేయుటకు ఇష్టపడతాడు. ఆర్థిక ఇబ్బందులు పడతాడు.
- రాహువు దశమభావంలో ఉంటే జాతకునకు అధికారం లభిస్తుంది. సంఘంలో గుర్తింపు కలుగుతుంది.
- రాహువు ఏకాదశభావంలో ఉంటే జాతకుడు కార్యసాధకుడు. అందరినీ ఆకర్షించు స్వభావం కలవాడు. విదేశాలలో కూడ గౌరవం పొందుతాడు.
- రాహువు ద్వాదశభావంలో ఉంటే జాతకుడు ఇతరులను విమర్శించువాడు. మోసం చేయుటకు వెనుదీయుడు. దుష్టస్వభావం కలవాడు.

**రాహువు కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- ✤ చేతిగోళ్ళు పుచ్చిపోవటం లేదా రాలిపోవటం జరుగుతుంది.
- ✤ "శ్వాస" సంబంధించిన ఇబ్బందులు కలుగుతాయి.

పై సంఘటనలలో ఏది జరిగినా రాహువు చెడుప్రభావం చూపుతున్నాడని గ్రహించాలి. రాహుశాంతికి క్రింది పరిహార క్రియలలో కనీసం ఒకటైనా శ్రద్ధగా చేయాలి.

**రాహువు శాంతించుటకు చేయవలసిన కార్యాలు :-**

- ✤ సమిష్టి కుటుంబంలో జీవించండి. ఒంటరిగా జీవించవద్దు.
- ✤ నిద్రించునపుడు తలవద్ద బార్లీగింజలు ఉంచి, మరునాటి ఉదయం వాటిని పేదలకు దానం చేయండి.
- ✤ మసూర్‌పప్పును స్వీపర్‌కు దానం చేయండి.
- ✤ వెండి పాత్రను దానం చేయండి.
- ✤ వ్యాపారంలో ఆటంకాలు వస్తుంటే వ్యాపారస్తుని బరువుతో సమానమైన బరువు గల బొగ్గులను నదిలో వేయండి.
- ✤ అనారోగ్యం ఏర్పడితే, రోగి బరువుకు సమానమైన గోధుమలు నదిలో వేయండి.
- ✤ ఇంటి ఆవరణలో నైరుతిదిశలో నల్లనువ్వులు పాతిపెట్టండి.
- ✤ ఏ వస్తువునైనా తక్కువధరకు వస్తుందికదా అని డూప్లికేటు కొనకండి.
- ✤ బావమరదులను ఆదరించండి.

## వివిధ భావాలలో రాహువు - పరిహార క్రియలు

**లగ్నంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ✤ ఒక రాగిపాత్రలో గోధుమలు, బెల్లం ఉంచి, ఆపాత్రను దానం చేయండి.
- ✤ ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి.
- ✤ ఒక వెండి బిళ్ళను మెడలో ధరించండి.
- ✤ నీలిరంగు వస్త్రాలను ధరించండి.

**ద్వితీయ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ✤ ఒక వెండిగోళిని ఎల్లప్పుడు మీవద్ద ఉంచుకోండి.
- ✤ తల్లిని గౌరవించండి. ప్రతిదినం ఆమెకు నమస్కరించి, ఆమె ఆశీర్వాదం తీసుకోండి.
- ✤ ఇంటిలో వాయవ్యదిశలో నీటితో నిండిన కుండను ఉంచండి.

**తృతీయ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ✤ చెవులకు బంగారపు రింగులు ధరించండి.

**చతుర్థ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వరుసగా 47 రోజులు పవిత్ర నదీస్నానం చేయండి.
- వెండి ఉంగరం ధరించండి.
- 400 గ్రా॥ల బాదం కాయలను ప్రవహించేనదిలో వేయండి.

**పంచమ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- వెండితో చేసిన వినాయకుని విగ్రహాన్ని ఇంటిలో ఉంచండి.
- గడపక్రింద వెండిరేకును పాతిపెట్టండి.
- వెండితో చేసిన ఏనుగును ఇంటిలో ఉంచండి.
- మద్యపానం మాంసాహారము వద్దు.

**షష్ఠమ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఒక నల్లని గాజుగోళీని లేదా సీసంగోళీని ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.
- నల్ల కుక్కను పెంచండి.
- 47 రోజులు వరుసగా ఒక నల్లని కుక్కకు చపాతీ పెట్టండి.
- సరస్వతీ దేవిని నీలిరంగుపూలతో పూజించండి.

**సప్తమ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- శనివారం ప్రవహించే నీటిలో కొబ్బరికాయను వేయండి. ఇలా వరుసగా 11 శనివారాలు వేయండి.
- ఇంటిలో ఒక వెండి ఇటుకను పాతిపెట్టండి.
- కుక్కను పెంచకండి.

**అష్టమ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఒక రాగినాణెమును నిప్పుల కొలిమిలో వేయండి.
- 47 రోజులు వరుసగా ప్రవహించే నీటిలో ఒక సీసపునాణెం వేయండి.
- ఒక చిన్న వెండిఘనమును ఎల్లప్పుడు మీవద్దనే ఉంచుకోండి.

**నవమ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఉమ్మడి కుటుంబంలో జీవించండి. విడిపోవద్దు.
- ప్రతిరోజు సాయిబాబా లేదా బ్రహ్మంగారి గుడికి వెళ్ళండి.
- ప్రతిరోజు కుంకుమను ధరించండి.
- బంగారపు ఉంగరం ధరించండి.
- కుక్కను పెంచండి.

**దశమ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిదినం ఆంజనేయస్వామి గుడికి వెళ్ళండి.
- ఎల్లప్పుడు తలపై టోపీని ధరించండి.
- ఇతరుల పట్ల వినయంగా ఉండండి.
- పాలు పొంగి పొయ్యిలో పడకుండా చేయండి.
- వరుసగా 11 శనివారాలు పేదపిల్లలకు మినుపసున్నుండలు పంచండి.

**ఏకాదశ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు కుంకుమబొట్టును ధరించండి.
- వరుసగా 11 గురువారాలు శనగలు పంచండి.
- శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామికి పసుపురంగు వస్త్రం సమర్పించండి.
- ప్రతిరోజు వెండిగ్లాసుతో నీరు త్రాగండి.
- "దుర్గాదేవి"కి 1100 గ్రాముల పసుపును సమర్పించండి.

**ద్వాదశ భావంలో రాహువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఆదాయంలో కొంతభాగం కుమార్తె గాని, చెల్లెలుకు గాని ఇస్తూండండి.
- సరస్వతీ దేవిని ఆరాధించండి.

## 150. ధారణం

**రాహుగ్రహ దోష నివారణకు రత్నధారణ :-**

విషకీటకముల వలన భయం, విషప్రయోగభయం కలవారు, రహస్య కార్యక్రమములు నిర్వహించువారు అనుబంధాలు పెరుగుటకు గోమేధికం ధరించవచ్చును. మోకాలినొప్పులు వరిబీజం, చర్మవ్యాధులు, శుక్లనష్టం కలవారు గోమేధికం ధరించుట ఉత్తమం.

**గోమేధికం :-**

రాహువుకు ధరించవలసినది గోమేధికం.

మినుములపై గోమేధికం వుంచి రాహుగ్రహ మంత్రము, సుబ్రహ్మణ్య మంత్రములను జపిస్తూ 18 రోజులు పూజించాలి. దుర్గాసూక్తము చదివి తరువాత గోమేధికం ధరించాలి.

గోమేధికం ధరించలేనివారు ఎగేట్‌ని ధరించవచ్చును.

ఆరుద్ర, స్వాతి, శతభిషం జన్మనక్షత్రములుగా కలవారు, రాహుదశ జరుగుతున్నవారు రాహువుకు సంబంధించిన రత్నములను ధరించవచ్చును.

**రాహుగ్రహ దోష నివారణకు రుద్రాక్షధారణ :-**

రాహుగ్రహ దోష నివారణకు నవముఖ రుద్రాక్షను ధరించవచ్చును.

**నవముఖ రుద్రాక్ష :-**

1. దీనిని దుర్గాదేవి స్వరూపంగా చెబుతారు.
2. దీనిని ధరించుట వలన మృత్యుభయం తొలగుతుంది.
3. రుద్రాక్షయందు తొమ్మిది ధారలుంటాయి.

## 151. దానం

## రాహు మహాదశలో చేయదగిన దానాలు

1. రాహు మహాదశలో రాహు అంతర్దశ - సర్పప్రతిమాదానం
2. రాహు మహాదశలో కేతు అంతర్దశ - నాగప్రతిమ
3. రాహు మహాదశలో రవి అంతర్దశ - తిలప్రతిమ
4. రాహు మహాదశలో చంద్ర అంతర్దశ - అగ్నిదేవప్రతిమ
5. రాహు మహాదశలో కుజ అంతర్దశ - నాగప్రతిమ
6. రాహు మహాదశలో బుధ అంతర్దశ - శ్రీమూర్తి ప్రతిమ
7. రాహు మహాదశలో గురు అంతర్దశ - బంగారు ప్రతిమ
8. రాహు మహాదశలో శుక్ర అంతర్దశ - దుర్గాప్రతిమ
9. రాహు మహాదశలో శని అంతర్దశ - నల్లమేక ప్రతిమ

## 152. పారాయణం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన రాహుగ్రహానుగ్రహం పొందవచ్చును.

## పారాయణ స్తోత్రాలు

★ రాహు గ్రహానికి సంబంధించి దుర్గాదేవిని పూజించడం, దుర్గా అవతారాలైన చండీ, కాళీ, గౌరీ మొ॥ క్షేత్రాల సందర్శన/స్తోత్రాలు చెప్పబడినవి.

1. శ్రీవిద్యాకవచం / నవదుర్గా స్తోత్రం / దేవీసూక్తం
2. చండీధ్యానం / దుర్గాస్తుతి/దుర్గా కవచం
3. శ్యామలాస్తోత్రం/దండకం/రాజరాజేశ్వరీ కవచం
4. అర్జున కృత దుర్గాస్తుతి/ధర్మరాజరాజేశ్వరీ కవచం

5. దేవీ అపరాధస్తోత్రం / భగవతీ స్తోత్రం
6. రాజరాజేశ్వరీ మాతృకాస్తవం / అర్గలా స్తోత్రం
7. దుర్గా సూక్తం / దుర్గా అష్టోత్తరం / దుర్గా స్తవం.
8. భ్రమరాంబాష్టకం / త్రిపురసుందర్యష్టకం
9. అష్టాదశపీఠ ప్రార్థన / దేవీ షట్కం
10. దేవీ నవరత్న మాలికాస్తోత్రం/దుర్గా ఆపదుద్ధార స్తోత్రం
11. రాహ్వష్టోత్తర శతనామావళి / మీనాక్షీ స్తోత్రం
12. రాహుగ్రహ కవచం / రాహుగ్రహ మంగళాష్టకం.

## రామాయణ పారాయణ

★ రాహుమహాదశ జరుగుతూన్నంతకాలం (18 సం॥)లో ఎప్పుడైనా సరే యుద్ధకాండ 75 సర్గపారాయణ, ఎండుద్రాక్ష నైవేద్యం జరిగించి రాహువును తృప్తి నొందించవచ్చును.

1. **రాహు మహాదశలో రాహు అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : యుద్ధకాండ 50 సర్గ
   నైవేద్యం : ఎండుద్రాక్ష/తేనె
2. **రాహు మహాదశలో కేతు అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : బాలకాండ 76 సర్గ
   నైవేద్యం : కొబ్బరికాయ/ఖర్జూరం
3. **రాహు మహాదశలో రవి అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : బాలకాండ 70 సర్గ
   నైవేద్యం : క్యారట్/చేమదుంపలు
4. **రాహు మహాదశలో చంద్ర అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : ఉత్తరకాండ 31 సర్గ
   నైవేద్యం : పాలు/పంచదార/పాయసం
5. **రాహు మహాదశలో కుజ అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : ఉత్తరకాండ 16 సర్గ
   నైవేద్యం : కందిపప్పు పొంగలి/ బెల్లం
6. **రాహు మహాదశలో బుధ అంతర్దశ జరుగుకాలమున**
   పారాయణ : యుద్ధకాండ 120 సర్గ
   నైవేద్యం : తాంబూలం/ఆకుపచ్చ అరటిపళ్ళు

7. రాహు మహాదశలో గురు అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : కిష్కింధాకాండ 26 సర్గ
నైవేద్యం : పసుపుపచ్చని ఫలాలు.
8. రాహు మహాదశలో శుక్ర అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : సుందరకాండ 65 సర్గ
నైవేద్యం : చామదుంపలు/పటికబెల్లం
9. రాహు మహాదశలో శని అంతర్దశ జరుగుకాలమున
పారాయణ : సుందరకాండ 47 సర్గ
నైవేద్యం : నల్లద్రాక్ష/నేరేడు.

## 153. సందర్శనం

గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన పుణ్యక్షేత్రాలను తరచు సందర్శించడం ఉత్తమం.

## దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు

1. అష్టాదశ శక్తి పీఠక్షేత్రాలు / కుమారస్వామి క్షేత్రాలు.
2. తమిళనాడులోని 6 సుబ్రహ్మణ్య క్షేత్రాలు.
3. సికింద్రాబాద్‌లోని ఉజ్జయిని మహంకాళి గుడి.
4. విజయనగరంలోని పైడితల్లి అమ్మవారు.
5. విశాఖపట్నం దగ్గర సింహాచలం వరాహనారసింహుడు.
6. విశాఖపట్నం దేవిపురం లలితాపరమేశ్వరి/దుర్గాలమ్మ
7. తూర్పుగోదావరి జిల్లా మురమళ్ల - భద్రకాళి.
8. తూర్పుగోదావరి జిల్లా ఉప్పలగుప్తం - బాలాత్రిపురసుందరి
9. పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లు - కనకదుర్గ
10. పశ్చిమగోదావరి జిల్లా చేబ్రోలు - కుమారస్వామి
11. పశ్చిమగోదావరి జిల్లా మండపాక - ఎల్లారమ్మవారు.
12. పశ్చిమగోదావరి జిల్లా జుత్తిగ - ఉమావాసుకి సోమేశ్వరస్వామి.
13. కృష్ణాజిల్లా విజయవాడ - కనకదుర్గాంబ.
14. కృష్ణాజిల్లా పెదకళ్లేపల్లి - దుర్గానాగేశ్వరస్వామి.

15. మెదక్ జిల్లా ఏడుపాయల జాతర - వనదుర్గాంబ.
16. ప్రకాశం జిల్లా భైరవకోన - త్రిముఖ దుర్గాంబ.
17. వరంగల్‌జిల్లా హన్మకొండ - భద్రకాళి.
18. కర్నూలుజిల్లా నంద్యాల - కాళికాంబ.
19. కర్నూలు జిల్లా ఓర్వకల్ - నాగేశ్వరస్వామి
20. కర్నూలు జిల్లా నందికొట్కూర్ - నాగేశ్వరస్వామి.
21. చిత్తూరుజిల్లా నాగలాపురం - వరాహస్వామి.
22. చిత్తూరుజిల్లా గిరింపేట - దుర్గాంబ.
23. నెల్లూరుజిల్లా జొన్నవాడ - కామాక్షితాయి.
24. నెల్లూరుజిల్లా వెంకటగిరి దరిబాలయపల్లె - కుమారస్వామి.
25. గుంటూరుజిల్లా చేజెర్ల - సుబ్రహ్మణ్యస్వామి.

**1.తిరునాగేశం:** ఈ పుణ్యస్థలం రాహుగ్రహదేవాలయపరంగా ప్రసిద్ధి పొంది ఉన్నది. రాహుదోషము గలవారు ఇక్కడ ఆవుపాలతో అభిషేకం చేసినచో పాలు నీలిరంగులోకి మారడం గొప్ప విశేషం. రాహుకాలంలో ఇక్కడ జరిగే పూజలు వర్ణింపనలవికాదు.

(పాలాభిషేకం రుసుము 50 రూ.లు) పూజలు జరిగే సమయాలు

| వారం | ఉదయం | సాయంత్రం |
|---|---|---|
| (శనివారం పూజలు ఈశ్వరునికి మాత్రమే) | | |
| ఆదివారం | 9-30 నుండి 11-30 | 4-30 నుండి 6-00 |
| సోమవారం | 7-30 నుండి 9-30 | 4-30 నుండి 5-30 |
| మంగళవారం | 9-30 నుండి 11-30 | 3-00 నుండి 4-30 |
| బుధవారం | 9-30 నుండి 12-00 | 1-30 నుండి 5-30 |
| గురువారం | 9-30 నుండి 11-30 | 1-30 నుండి 3-00 |
| శుక్రవారం | 10-30 నుండి 12-00 | 5-30 |

ఈ ఆలయంలో వినాయకుడు, పరాశరుడు, వశిష్ఠుడు, గౌతముడు, భగీరథుడు మొదలగువారు రాహువును ప్రార్థించి ఫలితములు పొందారని స్థల ఐతిహ్యం. కుంభకోణం నుండి 6కి.మీ దూరంలో ఉందీ ఆలయం.

**2. శ్రీవాంఛం:** ఇక్కడ యమధర్మరాజాలయం గలదు. జాతకచక్రంలో లగ్నాత్/ చంద్రాత్ పాపగ్రహాలు 8వ స్థానంలో ఉన్నవారికి ఇక్కడ ప్రత్యేక పూజలు. పూజలు రాహుకాలంలో జరుపుతారు. నిర్ణీత రుసుము చెల్లించాలి.

**3. శంకరన్ కోయిల్:** ఇక్కడ రాహుకేతు సర్పదోషనివారణల కొరకు పూజలు జరుగుతాయి. కుంభకోణం నుంచి ఇక్కడకు నేరుగా బస్సులున్నాయి.

# 154. రాహుగ్రహ అర్చనం

గ్రహదోషమున్న గ్రహజపంను తగు సంఖ్యలో చేయాలి. గ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౮ | ౯ | ౫ | ౬ | ౩ | ౭ | ౪ |
| ౩ | ౭ | ౪ | ౧ | ౨ | ౮ | ౯ | ౫ | ౬ |
| ౯ | ౫ | ౬ | ౩ | ౭ | ౪ | ౧ | ౨ | ౮ |
| ౨ | ౮ | ౧ | ౫ | ౬ | ౯ | ౭ | ౪ | ౩ |
| ౭ | ౪ | ౩ | ౨ | ౮ | ౧ | ౫ | ౬ | ౯ |
| ౫ | ౬ | ౯ | ౭ | ౪ | ౩ | ౨ | ౮ | ౧ |
| ౮ | ౧ | ౨ | ౬ | ౯ | ౫ | ౪ | ౩ | ౭ |
| ౪ | ౩ | ౭ | ౮ | ౧ | ౨ | ౬ | ౯ | ౫ |
| ౬ | ౯ | ౫ | ౪ | ౩ | ౭ | ౮ | ౧ | ౨ |



## రాహు యంత్రము



# రాహుగ్రహ మంత్రజపము

మంత్రము :-

కయానశ్చిత్ర ఇత్యస్య మంత్రస్య వామదేవఋషిః
రాహుగ్రహోదేవతా - గాయత్రీఛందః - అధిదేవతా
ప్రత్యధిదేవతా సహిత రాహుగ్రహ దేవతాప్రసాదసి
ద్ధ్యర్థం - రాహుగ్రహ మహాదేవతా మంత్రజపం కరిష్యే

కరన్యాసము :-

ఓం కయానః - అంగుష్ఠాభ్యాం నమః
చిత్రఆభువత్ - తర్జనీభ్యాం నమః
సఖా - అనామికాభ్యాం నమః
కయాశచిష్ఠయా - కనిష్ఠికాభ్యాం నమః
వృతా - కరతలకరపృష్ఠాభ్యాం నమః

కరన్యాసము :-

ఓం కయానః - హృదయాయ నమః
చిత్రఆభువత్ - శిరసేస్వాహా
ఊతీసదావృధః - శిఖాయైవషట్
సఖా - కవచాయహుం
కయాశచిష్ఠయా - నేత్రత్రయాయవౌషట్
వృతా - అస్త్రాయఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానమ్ :-

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం ।
సింహికాగర్భసంభూతం తం రాహుం ప్రణమ్యహమ్ ॥

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్ప యామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోప హార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

అధిదేవతా :-

ఓం అయంగౌః పృశ్నిరక్రమీద సనన్మాతరం పునః పితరంచ ప్రయం ధ్సువః ।·

**ప్రత్యధిదేవతా :-**

ఓం నమోస్తు సర్పేభ్యో యేకేచ పృథివీమను ।
యే అంతరిక్షే యేదివి తేభ్య స్సర్పేభ్యో నమః ॥

**వేద మంత్రము :-**

ఓం - కయానశ్చిత్ర ఆభూవదూతీ సదావధ స్సఖా కయా శచిష్ఠయావృతా।
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత రాహుగ్రహస్సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు॥

**రాహుగ్రహ మంత్రజపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా ఆచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు నల్లనిరంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై సీసంతో చేసిన రాహుప్రతిమను లేదా రాహు యంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేన ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
మధువాతాఋతాయ తే మధు క్షరంతి సింధవః।
మాధ్వీ ర్నస్సం త్వోషధీః। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః।
మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యరః।
మాధ్వీర్గావో భవంతు నః। తా శ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాత్స్థేయానస్థేయ సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః।

తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥
(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)
ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥
ఈ మంటపము పైకి పంచలోకపాలకులను, అష్టదిక్పాలకులను ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు, ఆయా స్థానములలో ఒక తమలపాకును, వక్కను ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ వుండాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరి: ఓమ్ - అచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయ స్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-
ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.
ఓం బ్రహ్మదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.
ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూఢమస్యపాంగ్ం సురే॥
సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివారీ సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.

ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
వోచేమ శంతమగ్ం హృదే॥

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః। ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

*గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.*

## దిక్పాలకులు

**ఇంద్రః:- (1-7-10 మం):-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః:- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః:- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిరృతిః:-** మూషుణః పరాపరా నిర్‌ఋతిర్దుర్హణావధీత్. పదీష్ట తృష్ణయాసహ॥
నిరృతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)**

ఇమంమే వరుణ శృధీ హావమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)**

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। అవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**కుభేరః :-**

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాసుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।
సాదన్యం విదత్యాగ్ం సభేయం పిత్రుశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఈశానః :-**

తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా పాయు రదబ్ధస్స్వస్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

**ఊర్ధ్వపురుషః :-**

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వాయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**పృథివీ :- (ఋ - 1 మం- 27 సూ - 15 మంత్రం)**

స్యోనా పృథివీ భవాన్వక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వాస్తు పురుషః :-**

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యాస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।
యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥
వాస్తుపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

# త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

బ్రహ్మ :-

బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీ :-

సక్తుమివ తితఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః :- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరీ :- గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా :-

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువదధద్వితా॥
అదిత్రృత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతే దివా॥
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
ఏషోఉషా అపూర్వ్యావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గరుడః :-

సువర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్స్తోమ

ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ

యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్ం స్యంగాని ధిష్ణియా

శ్శఫా యజూగ్ంషినామ సువర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥

గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః :-

ధన్వనాగా ధన్వనాఽఽజిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।

ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥

ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఇంద్రాగ్నీం :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।

గ్రాహిర్జ గ్రాహా యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥

ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్ఋతి : యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।

తమాహరామి నిర్ఋతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥

నిర్ఋతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

(శత్రుఫలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తా వరుణశ్చ మన్యుః।

భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥

మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**విశాఖా నక్షత్రమ్ :-**

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।

తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।

నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా వింద్రాగ్నీ భువనస్య గోపౌ।

విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥

విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।

ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

**సామవేదము :-**

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
నిహోతాసత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

**అథర్వణ వేదము :-**

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అథర్వణ వేదాయ నమః॥
అథర్వణ వేదమావాహయామి। పూజయామి॥

# ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

దుర్గా :- ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః।
సనః పర్ష దతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గణపతి :- ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

క్షేత్రపాలకుడు:- క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనోమృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అభయంకరుడు:- యత ఇంద్ర భయా మహేతతోనో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః॥
ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

| జాతకుని జన్మనక్షత్రమును ఆహ్వానించాలి. |
|---|

తరువాత రాహువు సంబంధించిన నక్షత్రములు ఆరుద్ర, స్వాతి, శతభిషంలను ఆహ్వానించాలి.

ఆర్ద్రా:-

ఆర్ద్రయా రుద్రః ప్రథమాన ఏతి శ్రేష్ఠో దేవానాం పతిరఘ్నియానామ్।
నక్షత్రమస్య హవిషా విధేమ। మానః ప్రజాగ్ం రీరిషన్మోతవీరాన్।
హేతి రుద్రస్య పరిణో వృణక్తు ఆర్ద్రా నక్షత్రం జుషతాగ్ం హవిర్నః।
ప్రముంచమానౌ దురితాని విశ్వా। అపాఘ శగ్ం సన్నుదతా మరాతిమ్॥ పూజయామి।
ఆర్ద్రా నక్షత్ర దేవతాం రుద్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి। మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును వుంచి నమస్కరించాలి.

**స్వాతి :-**

వాయుర్నక్షత్ర మభ్యేతి నిష్ట్యామ్। తిగ్మశృంగో వృషభో రోరువాణః।

సమీరయ న్భువనామాతరిశ్వా। అపద్వేషాగ్ంసి నుదతా మరాతీః।

తన్నోవాయు స్తదు నిష్ట్యాశృణోతు। తన్నక్షత్రం భూరిదా అస్తు మహ్యమ్।

తన్నో దేవాసో అనుజానంతు కామమ్। యథాతరేమ దురితాని విశ్వా॥

స్వాతీ నక్షత్ర దేవతాం వాయుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకులు దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును వుంచి నమస్కరించాలి.

**22. శతతారా (శతభిషం) :-**

క్షత్రస్య రాజావరుణోఽధిరాజః। నక్షత్రాణాగ్ం శతభిష గ్వసిష్ఠ

దేవేభ్యః కృణుతో దీర్ఘమాయుః। శతగ్ం సహస్రా భేషజాని ధత్తః।

యజ్ఞం నో రాజా వరుణ ఉపయాతు। తన్నో విశ్వే అభిసంయంతు దేవాః।

తన్నో నక్షత్రగ్ం శతభిషగ్జుషాణమ్। దీర్ఘమాయుః ప్రతిరద్భేషజాని॥

శతభిషఙ్నక్షత్ర దేవతాం వరుణం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకు, దానిపై వక్క, ఖర్జూరపండు, దక్షిణగా నాణెమును వుంచి నమస్కరించాలి.

**రాహుః :- (ఋ - 4 మం - 31 సూ - 1 మంత్రం)**

కయానశ్చిత్రేత్యస్య మంత్రస్య వామదేవ ఋషిః। రాహుగ్రహో దేవతా। గాయత్రీ ఛందః। (మమ) యజమానస్యాధి దేవతా ప్రత్యధి దేవతా సహిత రాహుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే రాహుగ్రహారాధనే వినియోగః॥

ధ్యానం:- పైఠీనసో బర్బరదేశ జాత శ్శూర్పాసన స్సింహగత స్వభావః।
యమ్యాననో నైరృత దిక్కరాళో వరప్రదశ్శూల చర్మఖడ్గః॥
నీలాంబరో నీలవపుః కిరీటీ కరాళవక్త్రః కరవాలశూలీ।
చతుర్భుజశ్చర్మధరశ్చ రాహుస్సింహాధిరూఢో వరదోఽస్తు మహ్యమ్॥

పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి దానిపై వక్క ఖర్జూరపండు, ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

మంత్రం :- ఓం కయానశ్చిత్ర ఆ భువదూతీసదావృధస్సఖా। కయా శ చిష్ఠయావృతా॥

ఓం భూర్భువస్సువః॥ రాహుగ్రహేహాగచ్ఛ। రాహుగ్రహం నీలవర్ణం నీలగంధం నీలవర్ణం నీలగంధం నీలపుష్పం నీలమాల్యాంబరధరం నీలచ్ఛత్రధ్వజరథ పతాకాది శోభితం దివ్యరథ సమారూఢం మేరుం అప్రదక్షిణీ కుర్వాణం సింహాసనం నైర్భుతముఖం శూర్పాసనస్థం చతుర్భుజం కరాళ వక్త్రం ఖడ్గచర్మ వరకరం పైఠీనసగోత్రం బర్బర దేశాధిపతిం రాక్షస సంవత్సర మాఘకృష్ణ చతుర్దశ్యాం ఆశ్రేషా నక్షత్రజాతం భృగువారే తులారాశి ప్రయుక్తం కిరీటినం సుఖాసీనం పుత్రపరివార సమేతం గ్రహమండలే ప్రవిష్ట మస్మిన్నధికరణే సూర్యగ్రహస్య నైర్భతి దిగ్భాగే శూర్పాకార మండలే రాహుగ్రహ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అధిదేవత - గాం :- (గోవు)

మంత్రం :- ఆయం గౌః పృశ్ని రక్రమీ దసనన్మాతరం పునః॥ పితరం చ ప్రియంత్సువః॥

రాహుగ్రహాధి దేవతాం గాం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తిం పుత్ర పరివార సమేతాం రాహుగ్రహస్య దక్షిణతః గామావాహయమి। స్థాపయామి। పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత రాహుగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

నైవేద్యం :- (పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంభృతం సఫలం దేవగృహ్యతాం సర్వదేవతాః॥

ఓం భూర్భువస్సువః భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి।

తాంబూలం సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం. "ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థాః అయనాయ విద్యతే॥

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమేవేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥

5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।
యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మ స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః।
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽ ధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యోఽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

21. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

23. యోఽపామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।

24. యోఽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

26. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥

27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

28. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
అపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥

30. యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

32. యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥

33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।
ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥

34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।
త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥

35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥

36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥

37. తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥

38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత రాహుగ్రహ దేవతాభ్యోనమః। దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

ఉపచారం:- రాహుగ్రహ దేవతాభ్యో నమః। ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోళికామా రోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

పునఃనీరాజనం:- (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

ప్రదక్షిణ నమస్కారం :- (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మా పాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యధాశరణం నాస్తి,
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యాభావేన రక్షరక్ష మహేశ్వర॥

రాహుగ్రహదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనాము నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోఽచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

ఉద్వాసన:- "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేఘానాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

రాహుగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటపములో కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శ్రీ రాహుగ్రహ దేవతా సుప్రీత సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజచేసి, తరువాత శనిగ్రహజపం చేసి, తరువాత రాహుగ్రహజపం చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటే "మమ" అని చెప్పాలి. యాజమానస్య అని చెప్పరాదు. ఒకరు మరొకరి కోసం జపం చేస్తుంటే యాజమానస్య అని చెప్పాలి. "మమ" అని చెప్పకూడదు.)

**రాహుగ్రహ జపం :-**

కయానశ్చిత్రేత్యస్య మంత్రస్య। వామదేవ ఋషిః।
రాహుగ్రహో దేవతా। గాయత్రీచ్ఛందః।

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత రాహుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థం రాహుగ్రహ మంత్ర జపం కరిష్యే. (అని నీళ్ళు ముట్టుకొని సంకల్పించాలి.)

**కరన్యాసము :**

| | | |
|---|---|---|
| కయానః | - | అంగుష్ఠాభ్యాన్నమః |
| చిత్ర ఆభువత్ | - | తర్జనీభ్యాన్నమః |
| ఊతీసదావృధః | - | మధ్యమాభ్యాన్నమః |
| సఖా | - | అనామికాభ్యాన్నమః |
| కయాశచిష్టయా | - | కనిష్ఠికాభ్యాన్నమః |
| వృతా | - | కరతల కరపృష్ఠాభ్యాన్నమః |

**హృదయాదిన్యాసము :**

| | | |
|---|---|---|
| కయానః | - | హృదయాయ నమః |
| చిత్ర ఆభువత్ | - | శిరసేస్వాహా |
| ఊతీసదావృధః | - | శిఖాయై వషట్ |
| సఖా | - | కవచాయ హుం |
| కయాశచిష్టయా | - | నేత్రత్రయాయ వౌషట్ |
| వృతా | - | అస్త్రాయ ఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

**ధ్యానం :**

సైంహికేయో బర్బర దేశజాతశ్శూర్పాసనస్సింహ గతస్వభావః।
యామ్యాననో నైఋతి దిక్కరాళో వరప్రదశ్శూల సచర్మఖడ్గః॥

**మంత్రం :**

కయానశ్చిత్ర ఆభువదూతీ సదావృధస్సఖా।
కయా సచిష్ఠయా వృతా॥

**అధిదేవత :**

ఆయంగౌః పృశ్నిరక్రమీ దసదన్మాతరం పునః।
పితరం చ ప్రియం త్సువః॥

**ప్రత్యధిదేవతా :-**

నమో అస్తు సర్పేభ్యో యేకేచ పృథివీ మను ।
యే అంతరిక్షేయేదివి తేభ్యస్సర్పేభ్యో నమః ॥

(అని చెప్పిన తర్వాత మంత్రాన్ని 18000 జపించి తర్వాత అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రాలను ఒకసారి చెప్పాలి. తరువాత

"యాజమానస్య (మమ) రాహుగ్రహప్రసాదేన

సర్వాభీష్టసిద్ధిరస్తు" అని చెప్పి ఉద్ధరిణితో నీళ్ళను పళ్ళెములో వదలాలి.

**రాహుగ్రహ మంత్ర తర్పణము :-**

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతిపూజ చేయాలి. (ఇచట సంకల్పంలో 'జలతర్పణం కరిష్యామి' అని చెప్పుకోవాలి.)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి. తర్పణము చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మనముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

రాహుగ్రహముకు సంబంధించిన "ధ్యానము"ను ఏకాగ్రతగా స్మరించాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని, రాహుగ్రహ మంత్రమును చదవాలి. తరువాత "రాహవే తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత "రాహుగ్రహస్య ప్రత్యధిదేవతా: తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 180సార్లు తర్పణము చేయాలి. మరల గ్రహ అధిదేవత, ప్రత్యధి దేవత మంత్రములను చదవాలి తరువాత

"రాహుగ్రహ ప్రసాదేనమమ ఆరోగ్యసిద్ధిరస్తు, సర్వాభీష్ట సిద్ధిరస్తు"

అని నీటిని పళ్ళెములో ధారపోయాలి.

(జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు "మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ" స్థానంలో "యాజమానస్య" అని చెప్పాలి.)

గ్రహహోమము :-

ముందుగా అధిదేవత, ప్రత్యధిదేవతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత ఆరుద్ర, స్వాతి, శతభిషం నక్షత్రములకు హోమం చేయాలి.

ఆర్ద్రా : రుద్రాయ స్వాహా । ఆర్ద్రాయై స్వాహా ॥

పిన్వమానాయై స్వాహా। పశుభ్య స్స్వాహా ॥

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత ఆర్ద్రాయైదం నమమ॥ (108 సార్లు)

స్వాతి : వాయవేస్వాహా। నిష్ట్యాయైస్వాహా। కామచారాయస్వాహా। అభిజిత్యై స్వాహా॥

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత స్వాతీయైదం నమమ॥ (108 సార్లు)

శతభిషం : వరుణాయ స్వాహా। శతభిషజే స్వాహా । భేషజేభ్యస్స్వాహా ॥

అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత శతభిషజే యైదం న మమ॥ (108 సార్లు)

ప్రతి నక్షత్రమునకు 108 సార్లు హోమం చేయాలి.

తరువాత రాహుగ్రహముకు హోమం చేయాలి. రాహు గ్రహ మంత్రమును దాని అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి గరిక, ఆవునేయి, మినుములు హోమంలో వేయాలి. ఈ విధంగా 180 సార్లు మూలమంత్రము, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను క్రమంగా చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత్, ప్రాయశ్చిత్తహోమం, పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మవిసర్జనము, ఆ గ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధనచేసి, పెద్దల ఆశీర్వాదమును పొందాలి. రాహుగ్రహ హోమంలో మార్జన 18సార్లు చేయాలి. కనీసం 18 మందికి భోజనం పెట్టాలి.

# 155. స్మరణం

గ్రహజపం చేయలేనివారు, రాహుగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు క్రింది వాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

## రాహుగ్రహ మంత్రములు

1. ఓం భ్రాం భ్రీం భ్రౌం రాహవే నమః
2. ఓం భ్రాం భ్రీం ఉత్తమాంగ భూషితాయ సురశత్రవే రాహవే నమః ।
3. ఓం ఐం హ్రీం శ్రీం క్లీం ఐం సౌః భ్రాం భ్రీం భ్రూం తమోగ్రహాయ నమః ।
5. ఓం ఐం హ్రీం రాహవే నమః
6. ఓం సాం సీం సౌం సః రాహవే నమః ।
7. క్రీం క్రీం హూం హూం టం ఉకధారిణే రాహవే రం హ్రీం శ్రీం భైం స్వాహా ।
8. ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం క్లీం రవీందు భీకరాయ భుజగేశాయ ఛాయా స్వరూపాయ స్వాహా ।
9. పైఠీనసో బర్బర దేశజాత శూర్పాసన స్సింహగతః స్వభావః
   యామ్యాననో నైర్ఋతి దిక్కరాలో వరప్రద శ్శూల సః చర్మ ఖడ్గః ॥

## రాహుగ్రహ గాయత్రీ మంత్రాలు

1. ఓం నాగధ్వజాయ విద్మహే । పద్మ హస్తాయ
   ధీమహి । తన్నో రాహుః ప్రచోదయాత్ ॥
2. సూకతంత్రాయ విద్మహే । పద్మహస్తాయ ధీమహి ।
   తన్నో రాహుః ప్రచోదయాత్ ॥
3. ఓం నాగధ్వజాయ విద్మహే । ఉగ్రరూపాయ ।
   ధీమహి । తన్నో రాహుః ప్రచోదయాత్ ॥
4. ఓం శిరో రూపాయ విద్మహే । అమృతేశాయ
   ధీమహి । తన్నో రాహుః ప్రచోదయాత్
5. ఓం భృగుపుత్రాయ విద్మహే । సైం హి కేయాయ ధీమహి
   తన్నో రాహుః ప్రచోదయాత్ ॥

**అనుకూల సమయాలు :-**

రాహువు అనుగ్రహం పొందాలనుకునేవారు రాహుగ్రహజపం, హోమం చేసి, సమారాధన చేయుట ఉత్తమం. ఆవిధంగా చేయలేనివారు రాహువుకోసం సూచించిన ఏ మంత్రమునైన ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది. అదే విధంగా రాహువు స్తోత్రం చేయాలి.

రాహువుకు అనుకూలమైన వారము గురువారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యంలోని నక్షత్రములు ఆరుద్ర, స్వాతి, శతభిషంలున్న దినములు కూడ

రాహువుకు అనుకూలమైనవే. ద్వాదశి, చతుర్దశి రాహువుకు అనుకూలించు తిధులు. ముఖ్యంగా చైత్ర బహుళ ద్వాదశి, మాఘ బహుళ చతుర్దశి రాహువుకు ఉత్తమమైన తిధులు. ఈ సమయాలలో ప్రత్యేకంగా రాహువును పూజించుట శుభకరము.

సరస్వతీపూజ, దుర్గాదేవిపూజ భక్తిశ్రద్ధలతో జరిపిన రాహువు అనుగ్రహిస్తాడు. గౌరీవ్రతం చేస్తే కార్యసిద్ధి జరుగుతుంది.

రాహువును పూజించినపుడు దీపారాధనకు తేనెరంగు వస్త్రమును వత్తిగా చేసి వాడుట, ఉత్తమము. పూజకు గారెలు, మినుపసున్నుండలు ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలు లేదా పేదవారికి మినుపసున్నుండలు, గారెలు, మినుములు, అవాలు, ఆవనూనె వంటి రాహువు సంబంధించిన ద్రవ్యములను దానం చేయాలి.

ప్రతిరోజు వరాహపురాణం, లలితసహస్రనామావళి పఠించాలి.

## 156. ఆరాధనం

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన రాహుగ్రహానుగ్రహం పొందవచ్చును.

## రాహుస్తోత్రమ్

రాహో కరాళవదన రవి చన్ద్రభయంకర
తమోరూప నమస్తుభ్యం ప్రసాదం కురుసర్వదా
సంప్రార్థ్యైవం గ్రహేశం తం స్తోత్రం యః ప్రయతః పఠేత్
రాహుః ప్రీతమనాస్తస్య చాష్టమ స్థానోஉపివా
విషాన్న జనితాభీతి ర్మహారోగస్య చింతితః
సర్వాన్కామానవాప్నోతి నష్టరాజ్యముపైతిచ
ఇతి తద్వచనం శ్రుత్వా స్తోత్రేణానేన సువ్రతః
స్తుత్వా గ్రహేశం స్వర్భానుం సర్వాన్కామానవాప్నుయాత్

ఫలశ్రుతి : ఏవం పఠేదనుదినం స్తవరాజమేవం
రాహుః ప్రసన్న హృదయోవిజేతేంద్రియోయః
ఆరోగ్యమాయురఖిలాంశ్చ మనోరథార్థాన్
సంప్రాప్నువంతి విషమాశ్చగ్రహాః ప్రసన్నాః

ఇతి రాహుస్తోత్రమ్ సంపూర్ణమ్

# రాహుగ్రహ అష్టోత్తర శతనామస్తోత్రం

శృణు నామాని రాహోశ్చ సైంహికేయో విధున్తుద: ।
సురశత్రు స్తమశ్చైవ ప్రాణిర్గార్గ్యాయణ స్తథా ॥ 1

సురాగుర్నీలజీ మూతసంకాశశ్చ చతుర్భుజ: ।
ఖడ్గఖేటకధారీ చ వరదాయకహస్తక: ॥ 2

శూలాయుధో మేఘవర్ణ: కృష్ణధ్వజపతాకవాన్ ।
దక్షిణాశాముఖరథ: తీక్ష్ణదంష్ట్రకర స్తథా ॥ 3

శూర్పాకారాసన స్థశ్చ గోమేధాభరణప్రియ: ।
మాషప్రియ: కాశ్యపర్షి నన్దనో భుజగేశ్వర: ॥ 4

ఉల్కాపాత యితా శూలనిధిప: కృష్ణసర్పరాట్ ।
విషజ్వాలా వృతాస్యోర్ధ శరీరోజాడవప్రద: ॥ 5

రవీన్దుభీకర శ్ఛాయాస్వరూపీ కఠినాంగక: ।
ద్విషచ్చక్రచ్ఛేదకోఽథ కరాలాస్యో భయంకర: ॥ 6

క్రూరకర్మా తమోరూప శ్శ్యామాత్మా నీలలోహిత: ।
కిరీటీ నీలవసన: శని సామన్తవర్త్మగ: ॥ 7

చండాలవర్ణోఽథాశ్వ్యర్క్షభవో మేషభవస్తథా ।
శనివత్ఫలదశ్శూలోఽపసవ్యగతిరేవ చ ॥ 8

ఉపరాగకరస్సూర్యేన్దుచ్ఛ విప్లోదకారక: ।
నీలపుష్ప విహారశ్చ గ్రహశ్రేష్ఠోఽష్టమగ్రహ: ॥ 9

కబన్ధమాత్రదేహాశ్చ యాతుధానకులోద్భవ: ।
గోవిన్దవరపాత్రం చ దేవజాతిప్రవిష్టక: ॥ 10

క్రూరో ఘోర శ్శనేర్మిత్రం శుక్రమిత్ర మగోచర: ।
మానే గంగాస్నానదాతా స్వగృహే ప్రబలాఢ్యక: ॥ 11

సద్గృహేఽన్యస్య బలధృ చ్చతుర్థేమాతృనాశక: ।
చన్ద్రయుక్తే తు చండాలజన్మసూచక ఏవ తు ॥ 12

జన్మసింహో రాజ్యదాతా మహాకాయస్తథైవచ ।
జన్మకర్తా విధురిపు: మత్తకాజ్ఞానదశ్చ స: ॥ 13

జన్మకన్యారాజ్యదాతా జన్మహానిద ఏవచ ।
నవమే పితృనాశశ్చ పంచమే శోకదాయక: ॥ 14

ద్యూనే కళత్ర హన్తా చ సప్తమే కలహప్రద: ।
షష్ఠే తు విత్తదాతా చ చతుర్థే వైరదాయక: ॥ 15

నవమే పాపదాతా చ దశమే శోకదాయకః ।
ఆదౌ యశః ప్రదాతా చ అంతేవైరప్రదాయకః ॥ 16
కాలాత్మా గోచరాచారో ధనే చాస్య కకుత్ప్రదః ।
పంచమే ధృషణాశృంగద స్స్వర్భామర్భలీ తథా ॥ 17
మహాసౌఖ్యప్రదాయీ చ చన్ద్రవైరీ చ శాశ్వతః ।
సూరశత్రుః పాపగ్రహః శామ్భవః పూజ్యక స్తథా ॥ 18
పాఠీనపూరణ శ్చాథ పైఠీనసకులోద్భవః
బలీభక్త రక్షశ్చ భీషణాకృతి రేవచ ।
దీర్ఘకృష్ణోఽశిరో విష్ణు చక్రారి ర్దేవదానవః
భక్తరక్షో రాహుమూర్తి స్సర్వాభీష్ట ఫలప్రదః ॥ 19

ఫలశ్రుతి :-

ఏతద్రాహు గ్రహస్యోక్తం నామ్నామష్టోత్తరం శతమ్ ॥ 20
శ్రద్ధయాయో జపేన్నిత్యం ముచ్యతే సర్వసంకటాత్ ।
సర్వసమ్పత్కరశ్చైవ సర్వాభీష్ట ప్రదాయకః ॥ 21

ఇతి రాహ్వష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణం

## రాహు ద్వాదశనామ స్తోత్రమ్

అస్య శ్రీరాహుస్తోత్ర మహామన్త్రస్య వామదేవ ఋషిః అనుష్టుప్ఛన్దః రాహుర్దేవతా రాహుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

కాశ్యప ఉవాచ :-

శృణ్వన్తు మునయస్సర్వే రాహుప్రీతికరం స్తవం ।
సర్వరోగప్రశమనం విషభీతిహరం పరం
సర్వసంపత్కరంచైవ గుహ్యం స్తోత్రమనుత్తమమ్ ।
ఆదరేణ ప్రవక్ష్యామి సావధానాశ్చ శృణుత
రాహుస్సూర్యరిపుశ్చైవ విషజ్వాలాధృతాననః
సుధాంశువైరిశ్శ్యామాత్మా విష్ణు చక్రాహితో బలీ
భుజగేశ స్తీక్ష్ణదంష్ట్ర క్రూరకర్మాగ్రహాధిపః

ఫలశ్రుతి :

ద్వాదశైతానినామాని నిత్యం యో నియతః పఠేత్
జప్త్వాతు ప్రతిమాం చైవ సీసజాం మాషసంస్థితామ్
నీలగన్ధాక్షతైః పుష్పైర్భక్త్యా సంపూజ్య యత్నతః ।

వహ్నిం మండలమానీయ దూర్వావ్నాజ్యాహుతీః క్రమాత్
తన్మంత్రేణైవ జుహుయాద్వ్యావదష్టోత్తరం శతమ్
హుత్వాచైవతు యోనిత్యం ప్రార్థయేద్గ్రహనాయకమ్॥

## రాహుస్తుతి

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం ।
సింహికాగర్భ సంభూతం రాహుం ప్రణమామ్యహం ॥
కరాళ వదనం ఖడ్గ చర్మశూల వరాన్వితం ।
నీలసింహాసనం ధ్యాయేత్ రాహుం తం చ ప్రశాంతయే ॥

## 157. అభినందనం

క్రింది నామములతో రాహుగ్రహ యంత్రమును తరచు పూజించిన రాహు గ్రహానుగ్రహం కలుగుతుంది.

**ధ్యానమ్ :-**

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం ।
సింహికాగర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ ॥

**ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః" అని చదువుకొనవలెను.**

| | | |
|---|---|---|
| ఓం రాహవే నమః | దక్షిణాశాముఖరథాయ | కఠినాంగకాయ |
| సైంహికేయాయ | తీక్ష్ణదంష్ట్రకరాయ | ద్విషత్‌చక్రచ్ఛేదకాయ |
| విధుంతుదాయ | శూర్పాకారాసనస్థాయ | కరాళాస్యాయ |
| సురశత్రవే | గోమేధాభరణ ప్రియాయ | భయంకరాయ |
| తమసే | మాషప్రియాయ 20 | క్రూరకర్మణే |
| ఫ్రాణినే | కాశ్యపర్షినందనాయ | తమోరూపాయ |
| గార్గ్యాయణాయ | భుజగేశ్వరాయ | శ్యామాత్మనే |
| సురాగవే | ఉల్కాపాతయిత్రే | నీలలోహితాయ |
| నీలజీమూతసంకాశాయ | శూలనిధిపాయ | కిరీటినే |
| చతుర్భుజాయ 10 | కృష్ణసర్పరాజే | నీలవసనాయ |
| ఖడ్గఖేటకధారిణే | విషజ్వాలావృతాస్యాయ | 40 |
| వరదాయకహస్తకాయ | అర్థశరీరాయ | శనిసామంతవర్త్మగాయ |
| శూలాయుధాయ | జాడవప్రదాయ | చండాలవర్ణాయ |
| మేఘవర్ణాయ | రవీందుభీకరాయ | అశ్వర్‌క్షభవాయ |
| కృష్ణధ్వజపతాకవతే | ఛాయాస్వరూపిణే 30 | మేషభవాయ |

శివిత్ఫలదాయ
శూలాయ
అపసవ్యగతయే
ఉపరాగకరాయ
సూర్యేందుచ్ఛ
విప్లోదకారకాయ
నీలపుష్ప విహారాయ 50
గ్రహశ్రేష్ఠాయ
అష్టమగ్రహాయ
కబంధమాత్రదేహాయ
యాతుధానకులోద్భవాయ
గోవిందవరపాత్రాయ
దేవజాతిప్రవిష్టకాయ
క్రూరాయ/ఘోరాయ
శనేఃమిత్రాయ
శుక్రమిత్రాయ 60
అగోచరాయ
మానేగంగాస్నానదాత్రే
స్వగృహేప్రబలాఢ్యకాయ
సద్గృహేఅన్యబలధృతే
చతుర్థేమాతృనాశనాయ
చన్ద్రయుక్తేచణ్డాలజన్మ
సూచకాయ
జన్మసింహాయరాజ్యదాత్రే
మహాకాయాయ
జన్మకర్త్రే
విధురిపవే 70
మత్తకాజ్ఞానదాయ
జన్మకన్యారాజ్యదాత్రే
జన్మహానిదాయ
నవమేపితృనాశనాయ
పంచమేశోకదాయకాయ
ద్యూనేకళత్రహంత్రే
సప్తమేకలహప్రదాయ
షష్ఠేవిత్తదాత్రే
చతుర్థేవైరదాకాయ
నవమేపాపదాత్రే 80
దశమేశోకదాయకాయ
ఆదౌయశఃప్రదాత్రే
అంతేవైరప్రదాయకాయ
కాలాత్మనే
గోచరాచారాయ
ధనే చాస్యకకుత్ప్రదాయ
పంచమేధృషణాశృంగదాయ
స్వర్భానవే
బలినే
మహాసౌఖ్యప్రదాయినే 90
చంద్రవైరిణే
శాశ్వతాయ
పాపగ్రహాయ
సూరశత్రవే
శాంభవాయ
పూజ్యకాయ
పాఠీనపూరణాయ
పైఠీనసకులోద్భవాయ
బలినే
భక్తరక్షాయ 100
భీషణాకృతయే
దీర్ఘకృష్ణాయ
అశిరసే
విష్ణుచక్రారయే
దేవదానవాయ
భక్తరక్షకాయ
రాహుమూర్తయే
సర్వాభీష్టఫలప్రదాయ 108

## 158. అభినుతి

గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి రాహుగ్రహదేవతను కీర్తించండి.

ధ్యానమ్ :-

ప్రణమామి సదా రాహుం సర్పాకారం కిరీటినం ।
సైంహికేయం కరాళాస్యం భక్తానామభయప్రదమ్, 1
రాహుం చతుర్భుజం చర్మ శూలఖడ్గవరాంగినం ।
కృష్ణాంబర ధరం నీలం కృష్ణగంధానులేపనమ్ ॥ 2
గోమేధిక విభూషం చ విచిత్రమకుటంఫణిం ।

కృష్ణసింహరథారూఢం మేరు చైవా ప్రదక్షిణమ్ ॥ 3
నీలాంబరశ్శిర: పాతు లలాటం లోకవందిత: ।
చక్షుషీ పాతు మే రాహు:శ్రోత్రేమే౽ర్ధశరీరవాన్ ॥ 4
నాసికాం మేకరాళాస్యశ్శూలపాణిర్ముఖం మమ ।
జిహ్వాం మే సింహికాసూను: కంఠం మే కష్టనాశన: ॥ 5
భుజంగేశో భుజౌ పాతునీలమాల్య: కరౌ మమ ।
పాతు వక్షౌ తమోమూర్తి:పాతు నాభిం విధుంతుద: ॥ 6
కటిం మే వికట: పాతు ఊరూ మే౽సుర పూజిత: ।
పాదౌ నీలాంబర: పాతు సర్వాంగం సింహికాసుత: ॥ 7

ఫలశ్రుతి :-

రాహో రిదంకవచమీప్సితవస్తుదం యో
భక్త్యా పఠ త్యనుదినం నియతశ్శుచిస్సన్
ప్రాప్నోతి కీర్తిమతులాంచ శ్రియంసమృద్ధి
మారోగ్య మాయుర్విజయావసిత ప్రసాదాత్ ॥

ఇతి పాద్మే మహాపురాణే రాహుకవచ:

# సర్పసూక్తమ్

అమీవహా వాస్తోష్పతే విశ్వారూపాణ్యా విశన్ ।
సఖాస్త్త శేవ ఏధిన:యదర్జున సారమే యదత: పిశంగ యచ్ఛసే ॥
వీవ భ్రాజంత ఋషయ ఉపస్రక్వేషు బప్సతోనిషు
స్వపస్తేనం రాయసార మేయ తస్కరం వాపునస్సర ॥
స్తోత్రాలావింద్రస్య రాయసికి మస్మాన్ దుచ్ఛు నాయసే
నిషుస్వపసస్తుమాతాసస్తు పితాసస్తు శ్వానస్తు విశ్పతి: ।
ససంతు సరేజ్ఞాతయ స్వస్త్యయమభితో జన:
య ఆస్తే యశ్చ చరతి యశ్చపశ్యతినో జన: ।
తేషాంసంహన్మో అక్షాణి యథేదంహర్మ్యంతథా ॥
సహస్రశృఙ్గో వృషభోయ స్సముద్రా దుదాచరత్ ।
తేనా సహస్యేనావయం నిజనానాస్స్వ పయామసి ॥
ప్రోష్ఠేశయావహ్యే శయానారీ ర్యాస్తల్పశీవరీ: ।
స్త్రియోయా: పుణ్యగన్ధాపాస్సర్వాస్స్వాపయామసి ॥

## సర్పసూక్తం పరిశిష్టమ్

స్వప్నస్స్వప్నాధికరణె సర్వం నిష్వాపయాపున: ।
ఆసూర్యమన్యాన్త్స్వాపయ ద్వ్యాఉ ఊల్షంజాగ్రియాదహమ్ ॥ 1
అజగరోనామ సర్పస్సర్పిరవిషో మహాన్ ।
తస్మిన్ని సర్పస్సుధిలస్తేనత్వా స్వాపయామసి 2
సర్పస్సర్పోర్పో అజగరస్సర్పిరవిషోమహాన్ ।
తస్యసర్పాత్సింధవస్త స్యగాథమశీమహి ॥ 3
కాళికో నామ సర్పోనవవనాగ సహస్రబలః ।
యమునహ్రదే హసోజాతో ఓఉ యోనారాయణవాహన: ॥ 4
యదికాళీక దూతస్య యది కాః కాళికా ద్భయాత్ ।
జన్మ భూమి మతిక్రాన్తో నిర్విషోయాతి కాళిక: ॥ 5
ఆయాహీన్ద్రపథిభిరీళితేభిర్య జ్ఞమిమంనో భాగధేయంజుష స్వ ।
తృప్తాంజహుర్మాతుల స్యేవయోషా భాగస్తే పైతృష్వసేయీ వపామివ ॥6
యశస్కరం బలవన్తం ప్రభుత్వన్త మేవరాజాధిపతిర్బభూవ ।
సంకీర్ణ నాగాశ్వపతిర్న రాణాంసుమంగల్యం సతతం దీర్ఘమాయుః ॥ 7
కర్కోటకో నామసర్పోయో దృష్టీవిష ఉచ్యతే ।
తస్య సర్పస్య సర్పత్వం తస్మై సర్పనమోస్తుతే ॥ 8
నమో అస్తుసర్పేభ్యోయే కేచపృథివీమను ।
యే అన్తరిక్షే యేదివితేభ్య సర్పేభ్యో నమః (కేచిత్పాఠః) ॥ 9
యాఇషవో యాతుధా నానాం యేవావనస్పతీగ్ం రను
యేవావటేషు శేరతె తేభ్యస్సర్పేభ్యో నమః ।
యేదోరోచ దినే యేవాసూర్య స్యరశ్మిషు ।
యేషామప్సుషదః కృతంతేభ్యస్సర్పేభ్యో నమః ।
నర్మదాయే నమః ప్రాతసః శ్మదాయై నమోనిశి
నమోస్తునర్మ దేతుభ్యంత్రాహిమాం విషసర్పద ।
సర్పాపసర్ప భద్రంతె దూర గచ్ఛ మహాయశా ।
జనమేజయస్య యాగాంతే ఆస్తీకవచనం శృణు ।
ఆస్తీకవ చనంశృత్వా యస్సర్పోన నివర్తతె ।
శతధాభిద్యతె మూర్ధా గిరిర్వజ్రహతో యథా ॥
అగస్త్యం మాధవంచైవ ముచికుందం మహామునిం ।

శ్యఫల్గమాస్తీకంచైవ పంచైతాన్స్మరేన్నిశి ॥
జరత్కారోజరత్కార్వ్యో అస్తికః పన్నమేవచ ।
అస్తికస్సత్య సంధోమాం పన్నగే భ్యోహిరక్షతు ।
పన్న గేభ్యోహి రక్షత్వ్యాం నమ ఇతి

## 159. అభివందనం

గ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. రాహు గ్రహదేవతను కీర్తించండి.

## వరాహావతార స్తుతి

భూచోరక హర పుణ్యమతే కృపోద్ధృత భూదేవిహారే
క్రోడాకార శరీర నమోభక్తం తే పరిపాలయమాం
నామస్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదాన్నహరే ॥
(దశావతారములలో వరాహావతారము పరమాత్మాంశ రాహు గ్రహము)

## రాహుమంగళాష్టకం

రాహుః సింహళ దేశపో నిబుబులితిః కృష్ణాంగ శూర్పాసనో
యః పైఠీనస గోత్రజోః సమి ద్దూర్వా ముఖం దక్షిణం ।
యస్సర్పః పశుదైవతోఖిలగతస్స్వాద్విశేషప్రదః
షట్త్రిష్ఠః శుభకృచ్చ సింహిక సుతః కుర్యాత్సదా మంగళమ్ ॥

## రాహుగ్రహ స్తోత్ర కీర్తన

### రచన : శ్రీముత్తు స్వామి దీక్షితులు

రాగం : రమామనోహరి తాళం : రూపక

పల్లవి : స్మరామ్యహం సదా రాహుం
సూర్యచంద్ర వీక్ష్యం - వికృత దేహం ॥స్మరా॥
అనుపల్లవి : సురాసురం రోగహరం సర్పాది భీతిహరం
శూర్పాసన సుఖకరం శూలాయుధ ధర కర్మం ॥స్మరా॥
చరణం : కరాళ వదనం కటినం కయానార్ల కరుణార్ద్రాపాంగం
చతుర్భుజం-ఖడ్గ ఖేటాది ధరణం - చర్మాది నీల వస్త్రం
గోమేధికా భరణం - శని శుక్ర
మిత్ర గురు గుహ సంతోష కరం ॥స్మరా॥

# 160. యంత్రస్థాపనం

రాహుగ్రహానుగ్రహం కోసం

ఒక రాగి రేకుపై ఈ క్రింది యంత్రమును రాయించి, దానిని పూజించాలి.

| | | |
|---|---|---|
| 13 | 8 | 15 |
| 14 | 12 | 10 |
| 9 | 16 | 11 |

పై యంత్రమును " ఓం భ్రాం భ్రీం భ్రౌం సః రాహవే నమః" అను మూలమంత్రమును 18,000 సార్లు జపిస్తూ పూజించాలి.

**రాహుగ్రహ దోష నివారణ యంత్రము (భృగుసంహిత) :-**

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై చెక్కించి, దానిని "ఓం క్రోం క్రీం హుం టుం టం టంకధారీ రాహవే రం హ్రీం శ్రీం భౌం స్వాహా" అను మంత్రమును 72,000 సార్లు జపంచేసి, ఆ యంత్రానికి ధారపోసి, దానిని సన్యాసికి దానం చేయాలి.



# 161. కేతువు - ఒక వీక్షణ

1. ఇతరనామాలు - అవల, శిఖి, ధూమ, ధ్వజ, మృత్యుపుత్ర
2. లింగము - పురుషగ్రహం / నపుంసకగ్రహం
3. జాతి - మ్లేచ్ఛజాతి
4. రంగు - చిత్రవర్ణము
5. తత్త్వము - వైరాగ్యము
6. గ్రహస్వభావము - పాపగ్రహము
7. స్వభావము - క్రూరస్వభావం
8. గుణము - తమోగుణము
9. రుచులు - ......
10. గ్రహోదయము - పృష్ఠ
11. జీవులు - .....
12. గ్రహస్థానము - పాములు తిరిగే ప్రాంతం
13. ఆధిపత్యదిక్కు - వాయవ్యం
14. జలభాగం - .....
15. ఆత్మాధికారకత్వం - మోక్షము
16. పాలనశక్తులు - భటుడు
17. శరీరధాతువు - .....
18. లోహధాతువు - ఇనుము
19. కుటుంబ సభ్యుడు - తాత
20. గ్రహరూపవర్ణం - ధూమవర్ణం
21. గ్రహపీడ - అతితెలివితేటలు
22. గ్రహవర్గం - గురు
23. గృహభాగములు - ఉపయోగించని ఖాళీ ప్రదేశం
24. కాల బలము - పగలు బలవంతుడు
25. దిగ్బలము - .....
26. ఆధిపత్యకాలము - .....
27. స్వక్షేత్రము - సింహం
28. శత్రుక్షేత్రము - కర్కాటకము
29. మిత్రక్షేత్రము - .....
30. విషమక్షేత్రము - .....

| | | | |
|---|---|---|---|
| 31. | సమక్షేత్రము | - | మీనం |
| 32. | ఉచ్చరాశి | - | వృశ్చికము |
| 33. | నీచరాశి | - | వృషభము |
| 34. | మూల త్రికోణము | - | కన్య |
| 35. | పరమ ఉచ్చ | - | ..... |
| 36. | పరమ నీచ | - | ..... |
| 37. | మిత్ర గ్రహాలు | - | రవి, చంద్రుడు, కుజుడు |
| 38. | శత్రుగ్రహాలు | - | శని, శుక్రుడు |
| 39. | సమగ్రహాలు | - | బుధుడు, గురుడు |
| 40. | వ్యధా గ్రహము | - | ..... |
| 41. | నైసర్గిక బలగ్రహము | - | ..... |
| 42. | దిన చలనం | - | సుమారు 3 నిమిషాల 18 సెకన్లు |
| 43. | రాశిలో గ్రహం ఉండే కాలం | - | 1 1/2 సంవత్సరం |
| 44. | రాశిలో ఫలమిచ్చేభాగం | - | ..... |
| 45. | గ్రహ ప్రకృతి | - | ..... |
| 46. | ఋతువు | - | ..... |
| 47. | దిగ్బలము | - | ..... |
| 48. | సూచించు ఎత్తు | - | పొట్టి |
| 49. | సూచింపబడే వయస్సు | - | వృద్ధులు |
| 50. | సూచించు ప్రాంతాలు | - | ..... |
| 51. | నివాస ప్రాంతం | - | గుహలు, బిలములు |
| 52. | సూచించబడే శరీరావయవములు | - | ...... |
| 53. | సూచించే శరీర వ్యాధులు | - | నులి పురుగులు, నత్తి, రక్తపోటు వింత వ్యాధులు |
| 54. | గోచారరీత్యా శుభస్థానములు | - | 3,6,11 |
| 55. | గోచారరీత్యా అశుభస్థానములు | - | 1,2,4,5,7,8,9,10,12 |
| 56. | గోచారరీత్యా వేధస్థానములు | - | 5,9,12 |
| 57. | గ్రహదశా కాలము | - | 7 సంవత్సరములు |
| 58. | జీవన కారకత్వము | - | మోక్ష కారకుడు |
| 59. | సంబంధించిన నక్షత్రాలు | - | అశ్వని, మఖ, మూల |
| 60. | సూచించు వృక్షజాతి | - | ముళ్ళున్న చెట్లు |

61. సూచించు ధాన్యం - ఉలవలు
62. సూచించు పండ్లు - సీతాఫలం
63. సూచించు పక్షులు - కోడి, రాబందు, గద్ద
64. సూచించు జంతువులు - కుక్క, పంది, గాడిద
65. సూచించు ఇతర ద్రవ్యములు - నువ్వులు
66. సంబంధించిన సమిధ - దర్భలు
67. సంబంధించిన మూలిక - తెల్ల జిల్లేడు, పిన్నేరువేరు
68. సూచించు వస్త్రము - .....
69. దేవవర్గము - వైష్ణవ
70. గ్రహగోత్రము - జైమినీ పైఠీనస
71. వేదములు - ......
72. శుభత్వం - పూర్ణపాపి
73. అవతారం - మీనావతారం
74. గ్రహస్వరూపం - రెండు భుజములు కలిగి, గద ధరించిన వాడు.
75. గ్రహ స్వరూప వర్ణం - బూడిద రంగు
76. గ్రహారూఢ వాహనం - గ్రద్ధ
77. పూజార్థం గ్రహ ప్రతిమకు వాడవలసినది - కంచు
78. గ్రహప్రీతికి నైవేద్యం - చిత్రాన్నం
79. అధిష్ఠాన దేవత - బ్రహ్మ
80. అధిదేవత - చిత్ర గుప్తుడు
81. ప్రత్యధిదేవత - బ్రహ్మ
82. గ్రహప్రీతికి చేయవలసిన పండుగలు - వినాయక చవితి
83. చేయవలసిన ప్రసాదము - కుడుములు, ఉలవ గుగ్గిళ్ళు
84. దోష నివారణకు దక్షిణ - మేక
85. ప్రీతికరమైన తిథి - చైత్రశుక్ల చవితి
86. ఆచరించవలసిన వ్రతము - పుత్రగణపతి వ్రతం
87. పారాయణ చేయవలసిన పురాణాలు - శ్రీ గణేశ పురాణం
88. పారాయణ చేయవలసిన అష్టోత్తర శతనామావళి - కేతుగ్రహ అష్టోత్తర శతనామావళి

89. పారాయణ చేయవలసిన సహస్రనామావళి - శ్రీ గణేశ సహస్ర నామావళి
90. ఆచరించవలనసిన దీక్ష - గణపతి దీక్ష
91. ధరించవలసిన మాల - రుద్రాక్షమాల
92. ధరించవలసిన రత్నము - వైఢూర్యము
93. ధరించవలసిన రుద్రాక్ష - నవముఖి
94. దర్శించవలసిన దేవాలయములు - గణపతి, సూర్యదేవాలయం
95. చేయవలసిన పూజలు - విఘ్నేశ్వరపూజ, సూర్య నమస్కారాలు
96. దానంచేయవలసిన ద్రవ్యములు - ఉలవలు, ఖర్జూరపండ్లు
97. గ్రహజప సంఖ్య - 7,000
98. హోమముకు వాడు సమిధ - దర్భ
99. నవగ్రహమండపంలో గ్రహఆసనం - జెండా ఆకారం
100. గ్రహదృష్టిని పొందు రాశిస్థానం - తానున్న రాశినుండి 7 వ రాశి
101. గ్రహసంఖ్య - 7
102. గ్రహం సూచించు వారం - ఆదివారం
103. శుభ సమయం - సూర్యోదయం
104. ప్రతినిధి గ్రహాలు - శుక్ర+శని (లేదా) చంద్ర+శని
105. గ్రహం బలంగా ఉంటే ఫలితం - ఆధ్యాత్మిక చింతన
106. గ్రహం బలహీనంగా ఉంటే ఫలితం - అతిభయం
107. తండ్రి - కశ్యప
108. తల్లి - సింహిక
109. భార్య - ధూమ్ర
110. సూచించు లోహములు - కంచు
111. గ్రహప్రభావితుల మనఃస్థితి - చంచల స్వభావం
112. భావకారకత్వం - మోక్షము
113. గ్రహదృష్టి - అథోదృష్టి
114. గ్రహమునకు గుర్తు - ☊
115. సంబంధించిన వృత్తి - ....
116. గ్రహజన్మ సంవత్సరం - పార్థివ
117. జన్మమాసం - ఫాల్గుణం
118. జన్మ తిథి - శుక్లపౌర్ణమి
119. జన్మ నక్షత్రం - అభిజిత్

120. అధిపత్యం వహించు దేశం - అంతర్వేది
121. గ్రహఋషి - మధుచ్ఛందః
122. గ్రహ ఛందస్సు - గాయత్రి
123. పుట్టినవారం - బుధవారం

**సంబంధించిన వస్తువులు, పనులు :-**

ఉలవలు, నువ్వులు, కోడి, కుక్క, పంది, రాబందులు, గాడిద, బల్లి, దర్భలు, వైఢూర్యము, సూర్యనమస్కారములు, అరటికాయ, చింతపండు, ఉల్లిపాయ, వెల్లుల్లి.

## 162. పురాణాల పరంగా కేతువు

కేతువు బూడిదరంగు కాంతితో మెరిసే శరీరము కలవాడు. రెండు చేతులను కలిగి ఉండును. గదను ధరించును. ఇతను గ్రద్దను వాహనముగా అధిరోహించును. ఇతనికి శిఖి, ధూమ, ధ్వజ, అవల అను పేర్లు కలవు.

బ్రహ్మకు, తాను సృష్టిస్తున్న అపారమైన జన సంఖ్య ఎలా తగ్గించాలా? అనే యోచన వచ్చి, మృత్యువు అనే కన్యను సృష్టించాడు. ఎక్కువైన జనసంఖ్యను ఆమె పరం చేసుకోమన్నాడు. తన పుట్టుకకు ఇదా పరమార్థం? అని ఆ కన్యక ఏడ్వగా, ఆమె కన్నీటితో అనేక వ్యాధులు ఉద్భవించాయి. తెల్లని పొగరూపమున వాటినుంచి కేతువు జనించాడు. కీలక నామ సంవత్సర మార్గశిర కృష్ణ అమావాస్య మంగళవారం రోజున మూలా నక్షత్రంలో కేతువు జననం జరిగింది. బ్రహ్మ ఆజ్ఞానువర్తియై కేతువు, ధూమకేతువై సంచరించసాగాడు. ఇలా ఉండగా, తల భాగం రాహువుగా మారినట్లే, మొండెము భాగమునకు పాము తల తగిలించి కేతువుగా నామకరణం చేశారు. ఇతడు కూడా విష్ణుభక్తుడే! గ్రహమండలంలో స్థానం సంపాదించిన కేతువు అంజలి ఘటిస్తూ వుంటాడాయనకు. కేతువు పత్ని చిత్రరేఖ. జ్యోతిశ్శాస్త్ర రీత్యా కేతువు కుజ ఫలితాలను, రాహువు శని ఫలితాలను ప్రతిబింబిస్తా డంటారు.

## 163. జ్యోతిష్యశాస్త్ర పరంగా కేతువు

**లక్షణాలు :-**

కేతువు పురుషగ్రహము. చిత్రమైన రంగును రత్నములలో వైఢూర్యము (పిల్లికన్నురాయి) ను సూచించును. మ్లేచ్ఛజాతికి చెందిన తమోగుణప్రధానమైన గ్రహము. ఈ గ్రహము సంఖ్య 4. అంతర్వేది ప్రాంతమును సూచించును.

కేతువు అశ్వని, మఖ, మూల నక్షత్రములకు అధిపతి. కేతుగ్రహదశ 7 సంవత్సరాలు. రవి, చంద్ర, కుజ, గురులు ఇతనికి మిత్రులు. బుధ, శుక్ర, శని, రాహువులు శత్రువులు. బుధ, గురులు సములు.

**కారకత్వములు :-**

కేతువు తాత (తల్లికి తండ్రి), శైవోపాసన, వేదాంతము, తపస్సు, మోక్షము, మంత్రశాస్త్రము, భక్తి, నదీస్నానం, మౌనవ్రతం, పుణ్యక్షేత్ర దర్శనం, మోసము, పరుల సొమ్ముతో ఆనందం, పరుల వాహనములు వాడుకొనుట, దత్తత, రాయి, ఆకలి లేకపోవుటను సూచించును. స్ఫోటకము, రక్తపోటు, చెముడు, నత్తి, దురదలు, గాస్, ఎసిడిటి, వికారములను సూచించును. కోడి, గ్రద్దలను సూచించును. స్నేహము, వైద్యము, జ్వరము, వ్రణములను సూచించును.

**కేతువు సూచించు విద్యలు :-**

కేతువు ఏ గ్రహంతో సంబంధం కలిగియుంటే ఆ గ్రహానికి సంబంధించిన విద్యలను సూచించును.

**కేతువు సూచించు వ్యాధులు :-**

కేతువు ఏ గ్రహంతో కలిస్తే ఆ గ్రహముకు సంబంధించిన అవయవము చెడిపోవునట్లు చేస్తాడు. రోగ నిర్ధారణ కానీయడు. దానివలన సరియైన చికిత్స చేయుటకు అవకాశం ఉండదు. ఇతను మృత్యుకారకుడు. అధికంగా భయపడుట, మతిస్థిమితం లేకపోవుట, రక్తపోటు, ఎలర్జీని సూచించును.

**కేతువు సూచించు వృత్తి వ్యాపారాలు :-**

కేతువు ఏదో ఒక సంస్థకు సంబంధించిన ఎగ్జిక్యూటివ్‌లను సూచించును.

కేతువు, కుజునిచే సూచించు వృత్తులను సూచించును.

## ద్వాదశ లగ్నాలలో కేతువు - ఫలితాలు

**మేషం లగ్నమైతే :-**

- మేషలగ్నమై లగ్నంలో కేతువున్న శరీరారోగ్యము, హాస్య ప్రియత్వం కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న ధననష్టము కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న సుఖము, ధనము, కీర్తి లభించును.
- 4 వ స్థానంలో కేతువున్న విద్యకు ఆటంకాలు, తల్లికి అనారోగ్యం, భూవిక్రయం కలుగును.

- 5 వ స్థానంలో కేతువున్న సంతానం వలన విచారం, ధనము, కార్యసిద్ధి జరుగును.
- 6 వ స్థానంలో కేతువున్న శత్రువుల భయము, ఋణబాధ కలుగును.
- 7 వ స్థానంలో కేతువున్న అనారోగ్యము, కళత్రవిచారం కలుగును.
- 8 వ స్థానంలో కేతువున్న అనారోగ్యము, ధననష్టము, చిక్కులు కలుగును.
- 9 వ స్థానంలో కేతువున్న పిత్రార్జితమును కోల్పోవుట, పితృసౌఖ్యము లేకపోవుట కలుగును.
- 10 వ స్థానంలో కేతువున్న పుణ్యక్షేత్ర సందర్శన చేయును.
- 11 వ స్థానంలో కేతువున్న చెడుపనులు, ధనార్జన కలుగును.
- 12 వ స్థానంలో కేతువున్న పుణ్యకార్యముల వలన ధనవ్యయము కలుగును.

**వృషభం లగ్నమైతే :-**

- వృషభ లగ్నమై లగ్నంలో కేతువున్న దైవపూజలు, ఆధ్యాత్మిక భావన, బలహీనత కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న అనారోగ్యము, సంతానం వలన దుఃఖము కలుగును.
- 3 వ స్థానములో కేతువున్న భూమి, ధనము, సుఖము లభించును.
- 4 వ స్థానంలో కేతువున్న మాతృసౌఖ్యము, భూమి, ధనము. శాంతి కలుగును.
- 5 వ స్థానంలో కేతువున్న సుఖదుఃఖాలు సమానంగా ఉంటాయి. సంతానం వలన దుఃఖం కలుగును.
- 6 వ స్థానంలో కేతువున్న సుఖము, ధనము, కార్యసిద్ధి కలుగును.
- 7 వ స్థానంలో కేతువున్న కళత్ర విచారము కలుగును.
- 8 వ స్థానంలో కేతువున్న ఋణబాధలు కలుగును.
- 9 వ స్థానంలో కేతువున్న తండ్రికి అనారోగ్యం, సామాన్య జీవనం కలుగును.
- 10 వ స్థానంలో కేతువున్న మంచి పనులు చేయును.
- 11 వ స్థానంలో కేతువున్న చెడుపనులు చేయును, ధనార్జన చేయును.
- 12 వ స్థానంలో కేతువున్న కార్యములకు ఆటంకములు వృథాశ్రమ, ధనవ్యయం, వైరాగ్యం, దైవభక్తి కలుగును.

**మిథునం లగ్నమైతే :-**

- మిథున లగ్నమై కేతువున్న శరీర సుఖము లేకపోవుట, మాయదారితనం ఉంటుంది.
- 2 వ స్థానములో కేతువున్న ఆధ్యాత్మిక చింతన, అనారోగ్యం, ధనహీనం కలుగును.

- ✤ 3 వ స్థానంలో కేతువున్న భూలాభము, ధనలాభము కలుగును.
- ✤ 4 వ స్థానంలో కేతువున్న మాతృసుఖం తక్కువ, పిత్రధనం వ్యయం అవుతుంది.
- ✤ 5 వ స్థానంలో కేతువున్న సంతాన సుఖం తక్కువ. సంతాన నష్టము కలుగుతుంది. రాబడి, ఖర్చు సమానంగా ఉంటుంది.
- ✤ 6 వ స్థానంలో కేతువున్న విరోధుల నుండి ధనం లభించును.
- ✤ 7 వ స్థానంలో కేతువున్న అనారోగ్యం, భార్యవలన అశాంతి కలుగును.
- ✤ 8 వ స్థానంలో కేతువున్న ఆటంకములు, ఆయాసం, ధనవ్యయం, ఋణవృద్ధి కలుగును.
- ✤ 9 వ స్థానంలో కేతువున్న పితృసుఖం తక్కువ.
- ✤ 10 వ స్థానంలో కేతువున్న తీర్థయాత్రలు చేయును.
- ✤ 11 వ స్థానంలో కేతువున్న చెడు ప్రవర్తన, ధనార్జన కలుగును.
- ✤ 12 వ స్థానంలో కేతువున్న సత్సంగము, ధననష్టము కలుగును.

**కర్కాటకం లగ్నమైతే :-**

- ✤ కర్కాటకం లగ్నమై కేతువున్న, బాలారిష్టములు కలుగును.
- ✤ 2 వ స్థానంలో అనారోగ్యము, ధనవ్యయం కలుగును.
- ✤ 3 వ స్థానంలో కేతువున్న సుఖము, ధనము, వితంతుసోదరి ఉంటుంది.
- ✤ 4 వ స్థానంలో కేతువున్న మాతృసుఖం తక్కువ. పూర్వుల ఆస్తి నష్టం.
- ✤ 5 వ స్థానంలో కేతువున్న సంతానం తక్కువగా ఉండును.
- ✤ 6 వ స్థానంలో కేతువున్న కష్టపడును. ఫలితమును అనుభవించును.
- ✤ 7 వ స్థానంలో కేతువున్న అనారోగ్యము, కళత్రనష్టము కలుగును.
- ✤ 8 వ స్థానంలో కేతువున్న కార్యములలో ఆటంకములు, ఋణవృద్ధి కలుగును.
- ✤ 9 వ స్థానంలో కేతువున్న ధనరాబడి ఎక్కువగా ఉండును.
- ✤ 10 వ స్థానంలో కేతువున్న కులాచారములను పాటించడు.
- ✤ 11 వ స్థానంలో కేతువున్న అవినీతిపరుడు, ధనార్జన చేయును.
- ✤ 12 వ స్థానంలో కేతువున్న దైవభక్తి, ఆధ్యాత్మిక భావన పెరుగును.

**సింహం లగ్నమైతే :-**

- ✤ సింహలగ్నమై లగ్నంలో కేతువున్న బాల్యమున బాలారిష్టములు కలుగును.
- ✤ 2 వ స్థానంలో శరీరబాధలు, ధనవ్యయం కలుగును.

- 3 వ స్థానంలో కేతువున్న భూమి, ధనము లభించును. కార్యసిద్ధి కలుగును.
- 4 వ స్థానంలో కేతువున్న విద్య, వాహనం, మాతృసౌఖ్యం లభించును.
- 5 వ స్థానంలో కేతువున్న సంతానసుఖం తక్కువ.
- 6 వ స్థానంలో కేతువున్న కష్టజీవనం.
- 7 వ స్థానంలో కేతువున్న సంసార సుఖం తక్కువ.
- 8 వ స్థానంలో కేతువున్న కష్టములు కలుగును.
- 9 వ స్థానంలో కేతువున్న ధనము, భూమి, సుఖము లభించును.
- 10 వ స్థానంలో కేతువున్న ఆచారములు పాటించడు.
- 11 స్థానంలో కేతువున్న ధనము, సుఖము, కీర్తి కలుగును.
- 12 వ స్థానంలో కేతువున్న దైవపూజలు, తీర్థయాత్రలు, మంచిపనులు చేయుదురు.

**కన్య లగ్నమైతే :-**

- కన్యలగ్నమై లగ్నములో కేతువు వున్న బాల్యం యందు ఈ దశ వచ్చినయెడల తప్పక బాలారిష్టములు కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న నష్టములు, ధనహీనం కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న భూమి లభించును.735736
- 4 వ స్థానంలో కేతువున్న సుఖం తక్కువ. అధికవ్యయం కలవాడు.
- 5 వ స్థానంలో కేతువున్న పుత్రసంతానం వల్ల నష్టపోవును. స్త్రీ సంతానం వలన సుఖపడువాడు అవుతాడు.
- 6 వ స్థానంలో కేతువున్న అధిక భూమి సంపాదించును.
- 7 వ స్థానంలో కేతువున్న అధికమైన మొండితనం గల భార్య లభించును. భార్య వలన సుఖం ఉండదు.
- 8 వ స్థానంలో కేతువున్న శత్రు, రోగ, ఋణాలు ఎక్కువగా ఉండి, ఎక్కువ కష్టపడతాడు.
- 9 వ స్థానంలో కేతువున్న పితృ సౌఖ్యము తక్కువ.
- 10 వ స్థానంలో కేతువున్న దేవ బ్రాహ్మణ భక్తి ఎక్కువగా ఉండి సత్కార్యాలు చేయును.
- 11 వ స్థానంలో కేతువున్న భూమి, ధనాన్ని సంపాదించును.
- 12 వ స్థానంలో పారమార్థిక చింత కలవాడు, అధిక ధనం ఖర్చు చేయును.

**తుల లగ్నమైతే :-**

- తులాలగ్నమై లగ్నంలో కేతువున్న బాల్యమందు బాలారిష్టములు కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న సంతానం లేకపోవుట, ధనహీనం కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న భూ, ధన లాభము కలుగును.
- 4 వ స్థానంలో కేతువున్న తల్లివలన దుఃఖము, విద్యకు ఆటంకములు, సామాన్య జీవనము కలుగును.
- 5 వ స్థానంలో కేతువున్న స్త్రీ సంతాన నష్టము కలుగును.
- 6 వ స్థానంలో కేతువున్న వివాదముల పరిష్కారం, ఆస్తిస్వాధీనత, సంతోషము కలుగును.
- 7 వ స్థానంలో కేతువున్న కుటుంబంలో అనారోగ్య సమస్యలు కలుగును.
- 8 వ స్థానంలో కేతువున్న కష్టములు, అశాంతి కలుగును.
- 9 వ స్థానంలో కేతువున్న తండ్రికి అనారోగ్యం కలుగును.
- 10 వ స్థానంలో కేతువున్న సుఖదుఃఖములు సమానంగా ఉంటాయి. ప్రయాణాలు చేస్తారు.
- 11 వ స్థానంలో కేతువున్న ధనలాభము, మనశ్శాంతి కలుగును.
- 12 వ స్థానంలో కేతువున్న దైవభక్తి, సత్కార్యములు, ధనవ్యయము కలుగును.

**వృశ్చికం లగ్నమైతే :-**

- వృశ్చికలగ్నమై లగ్నంలో కేతువున్న కష్టాలు కలుగును.
- 2 వ స్థానంలో ధనవ్యయమూ, సుఖహీనము కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న విశేష భూమి, ధన లాభము కలుగును.
- 4 వ స్థానంలో కేతువున్న పిత్రార్జిత ఆస్తి కోల్పోవుట జరుగును.
- 5 వ స్థానంలో కేతువున్న సంతాన సౌఖ్యము కలుగును.
- 6 వ స్థానంలో కేతువున్న విశేషభాగ్యము కలుగును.
- 7 వ స్థానంలో కేతువున్న కళత్ర విచారం, సంసారసుఖం తక్కువగా ఉండును.
- 8 వ స్థానంలో కేతువున్న శత్రువుల వలన, రోగముల వలన, ఋణముల వలన బాధలు కలుగును.
- 9 వ స్థానంలో కేతువున్న పితృసౌఖ్యహీనము లభించును.

- 10 వ స్థానంలో కేతువున్న లాభనష్టాలు రెండును కలుగుతాయి.
- 11 వ స్థానంలో కేతువున్న విశేషధనార్జనము కలుగును.
- 12 వ స్థానంలో కేతువున్న పారమార్థిక చింత, విశేష ధనవ్యయమును సంభవించును.

**ధనుస్సు లగ్నమైతే :-**

- ధనుస్సు లగ్నమై లగ్నంలో కేతువున్న పారమార్థిక చింత, క్రోధము, స్థిరచిత్తము కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న శరీరబాధ, ధనహీనము కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న సంపూర్ణ ఆయుర్దాయము, సుఖము కలుగును.
- 4 వ స్థానంలో కేతువున్న విద్యకు ఆటంకములు, కొద్దిగా భూమి, మాతృసుఖము లేకపోవుట లభించును.
- 5 వ స్థానంలో కేతువున్న సంతాన సుఖము ఉండదు.
- 6 వ స్థానంలో కేతువున్న తల్లివైపు బంధువులకు ఆపద కలుగును.
- 7 వ స్థానంలో కేతువున్న భార్యకు అనారోగ్యము కలుగును.
- 8 వ స్థానంలో కేతువున్న కష్టములు, శరీరబాధలు, ధననష్టము కలుగును.
- 9 వ స్థానంలో కేతువున్న పూర్ణ ఆయుర్దాయము కలుగును.
- 10 వ స్థానంలో కేతువున్న ఆచారములు పాటించని వాడు.
- 11 వ స్థానంలో కేతువున్న నీచమైన పనులు చేయును. ధనార్జన చేయును.
- 12 వ స్థానంలో కేతువున్న దైవభక్తి, విశేష ధనవ్యయము కలుగును.

**మకరం లగ్నమైతే :-**

- మకర లగ్నమై లగ్నమున కేతువున్న అనారోగ్యము కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న దైవభక్తి, ధనవ్యయం కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న ఆయుర్దాయము, ధనము కలుగును.
- 4 వ స్థానంలో కేతువున్న మాతృసౌఖ్యము, భూమి కలుగును.
- 5 వ స్థానంలో కేతువున్న సంతానము తక్కువ.
- 6 వ స్థానంలో కేతువున్న ఋణబాధలు కలుగును.
- 7 వ స్థానంలో కేతువున్న ధనవ్యయం, చికాకులు, కళత్రనష్టం కలుగును.
- 8 వ స్థానంలో కేతువున్న శత్రువుల వలన బాధలు, అనారోగ్యం కలుగును.

- 9 వ స్థానంలో కేతువున్న పితృసౌఖ్యము తక్కువ.
- 10 వ స్థానంలో కేతువున్న దైవభక్తి కలుగును.
- 11 వ స్థానంలో కేతువున్న ఆయుర్దాయము, భాగ్యము కలుగును.
- 12 వ స్థానంలో కేతువున్న దైవచింత, ధనవ్యయం కలుగును.

**కుంభం లగ్నమైతే :-**

- కుంభలగ్నమై లగ్నంలో కేతువున్న అనారోగ్యము, ధనవ్యయం, పుణ్యకార్యము లందాసక్తి కలుగును.
- 2 వ స్థానంలో కేతువున్న శ్రమ, ధనవ్యయం కలుగును.
- 3 వ స్థానంలో కేతువున్న దీర్ఘాయుర్దాయం కలుగును.
- 4 వ స్థానంలో కేతువున్న విద్యకు ఆటంకములు, తల్లి వలన దుఃఖము, భూవ్యయము కలుగును.
- 5 వ స్థానంలో కేతువున్న సంతాన సుఖం తక్కువ; స్త్రీ సంతానం ఉంటుంది.
- 6 వ స్థానంలో కేతువున్న దాయాదుల ఆస్తి లభించును.
- 7 వ స్థానంలో కేతువున్న భార్యకు అనారోగ్యము, అశాంతి కలుగును.
- 8 వ స్థానంలో కేతువున్న అప్పులు చేయును, సమస్యలు పెరుగును.
- 9 వ స్థానంలో కేతువున్న సుఖజీవనం, పితృసౌఖ్యం తక్కువ ఉంటుంది.
- 10 వ స్థానంలో కేతువున్న సుఖము, ధనము, సంఘంలో గుర్తింపు, గౌరవం కలుగును.
- 11 వ స్థానంలో కేతువున్న సుఖము, ధనార్జన కలుగును.
- 12 వ స్థానమున కేతువున్న దైవభక్తి పెరుగును. సత్కార్యములు చేయును. ధనవ్యయం అగును.

**మీనం లగ్నమైతే :-**

- మీనలగ్నమై లగ్నములో కేతువున్న పట్టుదల, దైవపూజలు, ఆధ్యాత్మిక పరమైన ఆలోచనలు కలుగును.
- 2 వ స్థానములో కేతువున్న అనారోగ్యము, ధననష్టము కలుగును.
- 3 వ స్థానములో కేతువున్న వితంతు సోదరి వలన ధనలాభము కలుగును.
- 4 వ స్థానములో కేతువున్న విద్యకు ఆటంకములు, తల్లివలన దుఃఖము, ధననష్టము కలుగును.

- 5 వ స్థానములో కేతువున్న సంతానం వలన దుఃఖము, కార్యసిద్ధి కలుగును.
- 6 వ స్థానములో కేతువున్న శత్రువులు, అనారోగ్యము, ఋణము కలుగును.
- 7 వ స్థానములో కేతువున్న అనారోగ్యము, కళత్ర విచారము కలుగును.
- 8 వ స్థానములో కేతువున్న దరిద్రము, కష్టములు, అశాంతి కలుగును.
- 9 వ స్థానములో కేతువున్న ధనలాభము, సుఖము కలుగును.
- 10 వ స్థానములో కేతువున్న దైవకార్యాలపై ఆసక్తి కలుగును.
- 11 వ స్థానములో కేతువున్న అన్యాయము, నీచకార్యాలు, ధనార్జన చేయును.
- 12 వ స్థానములో కేతువున్న తీర్థయాత్రలు, ధనవ్యయము చేయును.

## వివిధ భావాలలో కేతువు - ఫలితాలు

- కేతువు లగ్నంలో ఉంటే జాతకుడు చురుకైనవాడు. ఆచారాలను వ్యతిరేకిస్తాడు. మాతృసౌఖ్యం అనుభవించలేడు.
- కేతువు ద్వితీయ భావంలో ఉంటే జాతకుడు కుటుంబ బాధ్యతలను నిర్వహించడు. కఠినంగా మాట్లాడుతాడు. ఆలోచించక తొందరపడతాడు.
- కేతువు తృతీయ భావంలో ఉంటే జాతకుడు ధనవంతుడు. కోర్టుదావాలలో గెలుపు కలవాడు.
- కేతువు చతుర్థభావంలో ఉంటే జాతకునకు పిత్రార్జిత ధనం లభించదు. మాతృసౌఖ్యం కూడ తక్కువ.
- కేతువు పంచమ భావంలో ఉంటే జాతకునకు పుత్రుల వలన బాధలు కలుగుతాయి.
- కేతువు షష్టమ భావంలో ఉంటే జాతకుడు ఆరోగ్యవంతుడు. పశువులను కలిగి ఉంటాడు. తల్లివైపు బంధువులను దూరంగా ఉంచుతాడు.
- కేతువు సప్తమ భావంలో ఉంటే జాతకునకు ధననష్టం కలుగుతుంది. నీటివలన ప్రమాదం కలుగుతుంది.
- కేతువు అష్టమభావంలో ఉంటే జాతకునకు తల్లి దండ్రుల ప్రేమ తక్కువ. ఆకస్మిక ప్రమాదాలు ఏర్పడతాయి. దానివలన గాయాలు ఏర్పడుతాయి. నమ్మిన వారిని మోసగిస్తాడు.
- కేతువు నవమ భావంలో ఉంటే జాతకుడు ఆస్తిపరుడు. సుఖమైన జీవితం కలవాడు. నీచకార్యాలపై ఆసక్తి కలవాడు.

- కేతువు దశమ భావంలో ఉంటే జాతకుడు బహుస్త్రీలతో సంభోగిస్తాడు. అనారోగ్యం ఏర్పడుతుంది.
- కేతువు ఏకాదశ భావంలో ఉంటే జాతకుడు విద్యావంతుడు. ధనవంతుడు. విలాసవంతమైన జీవితం గడుపుతాడు. తన మాటలతో ఎదుటివారిని ఆకర్షించగలడు.
- కేతువు ద్వాదశభావంలో ఉంటే జాతకుడు ధనాన్ని వ్యయపరుస్తాడు. కంటి దోషం ఉంటుంది.

**కేతువు కోపగిస్తే జరిగే సంఘటనలు :-**

- బి.పి పెరుగుతుంది.
- వేదాంతధోరణి పెరుగుతుంది.
- ఆత్మహత్య చేసుకోవాలనే కోరిక కలుగుతుంది.
- తెలియని వ్యాధి కలుగుతుంది.
- నిస్పృహ, నిరాశ పెరిగిపోతూ ఉంటాయి.

పై సంఘటనలలో ఏది జరిగినా కేతువు చెడు ఫలితాలను ఇస్తున్నాడని గ్రహించాలి. దోషనివారణకు క్రింది పరిహార క్రియలను శ్రద్ధగా చేయాలి.

**కేతువు శాంతించుటకు చేయవలసిన పరిహార క్రియలు :-**

- గురువును పూజించండి.
- ప్రతిదినము గణపతిని ఆరాధించండి.
- వరుసగా 43 రోజులు పేదవారికి అరటిపళ్ళు పంచండి.
- నువ్వులను నదిలో వేయండి.
- ఆధ్యాత్మిక గ్రంథాలను చదువుతూ ఉండండి.
- వైఢూర్యమును ధరించండి.

## వివిధ భావాలలో కేతువు - పరిహారక్రియలు

**లగ్నంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఇతరులను గౌరవించండి.
- అబద్ధాలు చెప్పకండి.
- కుక్కను పెంచండి.
- ఎర్రని వస్త్రం ధరించండి. కనీసం ఎర్రని రుమాలును వాడండి.

**ద్వితీయ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- 31 రోజులు వరుసగా చిన్నపిల్లలకు నువ్వులు, బెల్లం కలిపిన ఉండలు పంచండి.
- ప్రతిరోజు కుంకుమను నుదుటిపై ధరించండి.
- గణపతి దేవాలయంకు పసుపును సమర్పించండి.

**తృతీయ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- సోదరులను ఆదరించండి.
- పంచదార కలిపిన పాలను ప్రవహించే నీటిలో పోయండి.
- ప్రతిరోజు కుంకుమను ధరించండి.
- గోధుమలను దానం చేయండి.
- వరుసగా 4 వారాలు పేదవారికి శనగలు పంచండి.

**చతుర్థ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- బంగారపు రింగులు కాని బంగారపు ఉంగరం కాని ధరించండి.
- వరుసగా 40 రోజులు ప్రవహించే నీటిలో పసుపు పచ్చని నిమ్మకాయ వేయండి.
- కుటుంబ పురోహితునికి పసుపు రంగు వస్త్రాలను ఇవ్వండి.
- గణపతి పూజ చేయండి.

**పంచమ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిదినం నుదుటిపై కుంకుమ ధరించండి.
- ప్రతి సోమవారం అన్నదానం చేయండి.
- 40 రోజులు వరుసగా ఒక రాగినాణెమును ప్రవహించే నీటిలో వేయండి.
- వరుసగా 13 ఆదివారాలు పేదపిల్లలకు గోధుమపిండి, బెల్లం కలిపిన ఉండలు పంచండి.
- ఆడపిల్లలకు బహుమతు లిస్తూండండి.
- గురువును సత్కరించండి.

**షష్ఠమ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ప్రతిరోజు కుంకుమపూవు కలిపిన పాలు త్రాగండి.
- ఇంటిలో పెట్టెలకు తాళాలు వేయకండి.
- గణపతికి పసుపురంగు వస్త్రాన్ని సమర్పించండి.
- గురువును సత్కరించండి.
- వరుసగా 40 రోజులు పేదపిల్లలకు శనగలు పంచండి.

**సప్తమ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- పెద్దలతో వినయంగా ప్రవర్తించండి.
- రోజుకొక నిమ్మకాయ చొప్పున వరుసగా 40 రోజులు 40 నిమ్మకాయలను ప్రవహించే నీటిలో వేయండి.
- గణపతిని ఆరాధించండి.

**అష్టమ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- కుక్కలను పెంచండి.
- నలుపు లేదా తెలుపు రంగు బ్లాంకెట్‌ను దేవాలయముకు ఇవ్వండి.
- గణపతి దేవాలయముకు పసుపు కుంకుమను సమర్పించండి.
- ప్రతిరోజు వినాయకుణ్ణి పసుపురంగు పూలతో పూజించండి.
- బంధుమిత్రులకు సహకరించండి.

**నవమ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- కుక్కలను పెంచండి.
- పెద్దలను గౌరవించండి.
- చెవులకు బంగారపు రింగులు ధరించండి.
- ప్రతిరోజు వినాయకుని గుడికి వెళ్ళండి.

**దశమ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఒక వెండి పాత్రలో తేనెపోసి, దానిని ఇంటిలో భద్రపరచండి.
- గణపతి పూజ చేయండి.
- కందులను దానం చేయండి.

**ఏకాదశ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- ఒక బంగారపు కడ్డీని కాల్చి, దానిని పాలలో ముంచి, ఆ పాలను త్రాగండి.
- నల్లకుక్కను పెంచండి.
- ప్రతిరోజు నుదుటిపై కుంకుమను ధరించండి.

**ద్వాదశ భావంలో కేతువు ఉంటే చేయవలసిన పరిహార క్రియలు :-**

- కుక్కలను పెంచండి.
- వరుసగా 4 వారాలు వినాయకునికి అరటిపండ్లు ప్రసాదంగా సమర్పించండి.
- ఉలవలను దానం చేయండి.

## 164. ధారణం

**కేతుగ్రహ దోష నివారణకు రత్నధారణ :-**

పనికి తగిన ఫలితం లేకపోయినా, సంతాన నష్టం కలిగినా, ప్రమోషన్ ఆగిపోయినా వైఢూర్యం ధరించవచ్చును. శరీరబాధలు, జ్వరం వచ్చినవారు వైఢూర్యం ధరించుట ఉత్తమము.

**వైఢూర్యము :-**

కేతువుకు ధరించవలసినది వైఢూర్యము.

ఉలవలపైన వైఢూర్యము నుంచి, గరికచిగుళ్ళతో కేతుగ్రహ మంత్రము, గణపతి మహామంత్రము జపిస్తూ 18 రోజులు పూజించాలి. దర్భలతో హోమం చేయాలి. ఉలవగుగ్గిళ్ళు, చిత్రాన్నము నైవేద్యము పెట్టాలి. తరువాత వైఢూర్యము ధరించాలి.

అశ్విని మఖ, మూల జన్మనక్షత్రములైనవారు, కేతుదశ జరుగుతున్నవారు వైఢూర్యమును ధరించవచ్చును.

**కేతుగ్రహ దోష నివారణకు రుద్రాక్ష ధారణ :-**

కేతుగ్రహ దోషనివారణకు అష్టముఖ రుద్రాక్షను ధరించవచ్చును.

**అష్టముఖ రుద్రాక్ష:-**

- దీనిని విఘ్నేశ్వరుని స్వరూపంగా చెబుతారు.
- దీనిని ధరించినవారు కార్యసాధకులవుతారు.
- శక్తి సామర్థ్యాలు పెరుగుతాయి.
- రుద్రాక్షయందు ఎనిమిది ధారలుంటాయి.

## 165. దానం

## కేతు మహాదశలో చేయుదగిన దానాలు

కేతు మహాదశ జరుగుతున్న సమయంలో ఎప్పుడైనా బంగారం-దానం ఇవ్వాలి. (యధాశక్తి)

1. కేతు మహాదశలో కేతు అంతర్దశ - శివపార్వతి ప్రతిమ
2. కేతు మహాదశలో శుక్ర అంతర్దశ - దుర్గా ప్రతిమ

3. కేతు మహాదశలో రాహు అంతర్దశ - గుమ్మడిపండు
4. కేతు మహాదశలో శని అంతర్దశ - గేదె
5. కేతు మహాదశలో రవి అంతర్దశ - మేక ప్రతిమ
6. కేతు మహాదశలో చంద్ర అంతర్దశ - వెండి గుర్రం
7. కేతు మహాదశలో బుధ అంతర్దశ - లేడి ప్రతిమ
8. కేతు మహాదశలో కుజ అంతర్దశ - నూనె కుండ
9. కేతు మహాదశలో గురు అంతర్దశ - తిలలు దానం

## 166. పారాయణం

క్రింది సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన కేతుగ్రహానుగ్రహం పొందవచ్చును.

## పారాయణ చేయదగిన స్తోత్రాలు

1. కేతు అష్టోత్తర శతనామావళి/శతనామ స్తోత్రం
2. గణేశ స్మరణం/గణేశాష్టకం/గణపతిసూక్తం
3. గణపతి అష్టోత్తర శతనామావళి
4. వినాయకవ్రతం / వినాయకస్తోత్రం/కేతుస్తోత్రం
5. కేతుకవచం/కేతుగ్రహమంగళాష్టకం/కీర్తన
6. కేతుధ్యానమ్/గణేశ ప్రాతః స్మరణం
7. గణేశ ద్వాదశనామస్తోత్రం/పంచరత్నస్తోత్రం
8. గణేవ స్తవ రాజం / సంకష్టహర గణేశ స్తోత్రం.

## రామాయణ పారాయణ

కేతు మహాదశ జరుగుతున్న సమయంలో ఎపుడైనా అయోధ్యకాండ 50 సర్గ పారాయణ.

1. కేతు మహాదశలో కేతు అంతర్దశా కాలమున
   పారాయణ : అయోధ్యకాండ 32 సర్గ
   నైవేద్యం : కొబ్బరికాయ / ఖర్జూరం.
2. కేతు మహాదశలో రవి అంతర్దశా కాలమున
   పారాయణ : బాలకాండ 110 సర్గ
   నైవేద్యం : చేమ/క్యారెట్

3. కేతు మహాదశలో కేతు అంతర్దశా కాలమున
పారాయణ : బాలకాండ 22 సర్గ
నైవేద్యం : పాలు/పాయసం
4. కేతు మహాదశలో బుధ అంతర్దశా కాలమున
పారాయణ : యుద్ధకాండ 129 సర్గ
నైవేద్యం : ఆకుపచ్చ అరటి/తాంబూలం
5. కేతు మహాదశలో గురు అంతర్దశా కాలమున
పారాయణ : యుద్ధకాండ 116 సర్గ
నైవేద్యం : పసుపురంగు పండ్లు
6. కేతు మహాదశలో శుక్ర అంతర్దశా కాలమున
పారాయణ : సుందరకాండ 65 సర్గ
నైవేద్యం : పటికబెల్లం/పంచదార
7. కేతు మహాదశలో రాహు అంతర్దశా కాలమున
పారాయణ : సుందరకాండ 65 సర్గ
నైవేద్యం : ఎండుద్రాక్ష / తేనె.
8. కేతు మహాదశలో శని అంతర్దశా కాలమున
పారాయణ : యుద్ధకాండ 58 సర్గ
నైవేద్యం : నల్లద్రాక్ష/నేరేడు.
9. కేతు మహాదశలో కుజ అంతర్దశా కాలమున
పారాయణ : అయోధ్యకాండ 100 సర్గ
నైవేద్యం : కందిపప్పు పొంగలి/బెల్లం.

## 167. సందర్శనం

## దర్శించదగిన క్షేత్రాలు

1. శ్రీకాకుళం జిల్లాలోని రాజాం (ఇప్పుడు విజయనగరం జిల్లా)లో విఘ్నేశ్వరుడు. (రామచంద్ర ప్రతిష్ఠ)
2. తమిళనాడులోని కంచిలో చిత్ర గుప్తాలయం.
3. తమిళనాడులోని శుచీంద్రంలో సాక్షి వినాయకుడు.
4. తమిళనాడులోని రామేశ్వరంలో సాక్షి వినాయకుడు.

5. తమిళనాడులోని కీళ్లపెరుపాళ్లెం దేవాలయం
6. మహారాష్ట్రలోని 8 వినాయక మూర్తులు.
7. కర్ణాటకలోని నంజన్‌గూడ్ వినాయక దర్శనం.
8. కర్ణాటకలోని 8 వినాయక మూర్తులు.
9. హైదరాబాద్ లాల్‌దర్వాజా వద్ద చిత్రగుప్తుడు.
10. కరీంనగర్ జిల్లా కాళేశ్వరం వద్ద మత్స్యావతారం
11. చిత్తూరు జిల్లా నాగులాపురం వద్ద మత్స్యావతారం
12. తూ.గో.జిల్లా పెద్దాపురం సూర్య దేవాలయం
13. తూ.గో.జిల్లా సర్పవరం - భావనారాయణుడు
14. తూ.గో.జిల్లా గొల్లలమామిడాడ - సూర్యాలయం
15. తూ:గో.జిల్లా మందపల్లిలో నాగేశ్వరస్వామి.
16. తూ.గో.జిల్లా అయినవిల్లి - వినాయకుడు.
17. తూ.గో.జిల్లా పులగుర్త - సిద్ధిగణపతి.
18. గుంటూరుజిల్లా తెనాలి వైకుంఠపురం - వేకంటేశ్వరుడు
19. గుంటూరుజిల్లా అమరావతి ధరణికోట - వినాయకుడు.
20. చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తిలో - కేతు/సర్పదోష పూజలు.
21. చిత్తూరుజిల్లా కాణిపాకం - సిద్ధిగణపతి.
22. చిత్తూరుజిల్లా నాగులాపరుం - మత్స్యావతారం
23. చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తి - పాతాళ విఘ్నేశ్వరుడు.

## దర్శించదగిన అష్ట వినాయక ఆలయాలు

1. లేహ్యాద్రి: శ్రీగిరిజాత్మక విఘ్నేశ్వర స్వామి. ఎత్తైన కొండ గుహలో దక్షిణ ముఖముగా మందిరము కలదు. గణేశ విగ్రహము ఎడమవైపు తొండముతో కలదు.
2. రంజాన్‌గావ్: శ్రీమహాగణపతి స్వామి. ఈ మందిరం తూర్పు దిశగా ఉన్నది. ఎంతో తేజస్సుగా ఉండే ఈ మందిరంలోని విగ్రహంపై ప్రతీ సంవత్సరంలో ఒక సమయంలో సూర్య కిరణాలు పడతాయి. ఈ క్షేత్రంలో పెద్ద విగ్రహం క్రింద ఒక విగ్రహం ఉన్నది. ఇదే మూల విరాట్టు. నాటి ముస్లిం దాడులకు భయపడిన పూజారులు మూల విగ్రహాన్ని దాచి ఉంచారు.

3. **మహాద్:** శ్రీ వరద వినాయకస్వామి. పూనా నుండి ముంబాయి వెళ్ళే దారిలో ఖోపోలి గ్రామమున మందిరము తూర్పు దిశగా ఉంటుంది. తొండము ఎడమవైపు తిరిగి వృద్ధి సిద్ధి కలదు. ఈ స్వామి 'గృత్సమద మహర్షి'చే ప్రతిష్టించబడటం విశేషం.

4. **పాలి:** శ్రీభల్లాలేశ్వర్ స్వామి. రాయఘడ్ జిల్లాలోని పాళీగ్రామములో తూర్పు దిశగా కలదు. దగ్గరలోనే ఉన్న ఉన్‌హెర్ అను స్థానములో వేడినీటి జల్లు ఎప్పుడూ పారుతూ ఉంటుంది. స్వామి స్వయంభువు ప్రతిరోజూ ఉదయం సూర్యుని కిరణాలు మూల విరాట్టుపై పడతాయి.

5. **మోరేగావ్:** కర్‌హానదీ తీరాన ఉత్తరాభిముఖాన ఉన్న ఈ మయూరేశ్వర స్వామి తలపై వజ్రాలు అమర్చబడినవి. "మోరయా గోసావీ" అనే భక్తుడు ఈ క్షేత్రంలో వసించి గణపతిని ఉపాసించడం వల్ల బ్రహ్మ కమండల తీర్థంలో స్వామి లభించడం వలన ఈ విగ్రహాన్ని 'చించ్వాడ' అనేచోట ప్రతిష్ఠించారు. మయూరేశ్వర గణపతి వాహనమైన మూషిక విగ్రహము అతి పెద్దది.

6. **ఓజర్:** శ్రీవిఘ్నేశ్వరస్వామి. జున్నార్ తాలూకాలో 'కూకుడి' నదీ తీరాన మందిరము తూర్పు ముఖముగా ఉన్నది. విగ్రహము ఎడమవైపు తొండముతో కలదు.

7. **సిద్ధిటేక్:** అహ్మద్ నగర్‌జిల్లా (పూనా దగ్గర) సిద్ధివినాయక స్వామి, గోందా తాలూకాలోని భీమానది ఒడ్డున ఈ పురాతన మందిరము కలదు. ఇక్కడ గణేశ విగ్రహములో తొండము కుడివైపు కలదు. స్వామి స్వయంభువ.

8. **థేవూర్:** శ్రీచింతామణి విఘ్నేశ్వర స్వామి (ములీ-ముఠా) నదీ తీరాన ఉత్తరాభిముఖంగా ఈ మూర్తిలో ఎడమవైపు తొండముతో తూర్పుదిశగా ఉన్నది. ఈ చింతామణి గణపతి బ్రహ్మదేవుని ప్రతిష్ఠ. ఇక్కడొక భక్తునికి విఘ్నేశ్వరుడు వ్యాఘ్ర (పులి) రూపంలో దర్శనమిచ్చాడని స్థల మహాత్మ్యంలో ఉంది.



# 168. కేతుగ్రహ అర్చనం

కేతుగ్రహదోషమున్న కేతు గ్రహజపంను తగు సంఖ్యలో చేయాలి. కేతుగ్రహహోమం చేయించుట ఉత్తమమైనదని ఆర్యోక్తి.

| ౩ | ౪ | ౯ | ౨ | ౮ | ౭ | ౧ | ౬ | ౫ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౮ | ౭ | ౧ | ౬ | ౫ | ౩ | ౪ | ౯ |
| ౧ | ౬ | ౫ | ౩ | ౪ | ౯ | ౨ | ౮ | ౭ |
| ౮ | ౭ | ౨ | ౬ | ౫ | ౧ | ౪ | ౯ | ౩ |
| ౬ | ౫ | ౧ | ౪ | ౯ | ౩ | ౮ | ౭ | ౨ |
| ౪ | ౯ | ౩ | ౮ | ౭ | ౨ | ౬ | ౫ | ౧ |
| ౫ | ౧ | ౬ | ౯ | ౩ | ౪ | ౭ | ౨ | ౮ |
| ౯ | ౩ | ౪ | ౭ | ౨ | ౮ | ౫ | ౧ | ౬ |
| ౭ | ౨ | ౮ | ౫ | ౧ | ౬ | ౯ | ౩ | ౪ |



## కేతు యంత్రము



# కేతుగ్రహ జపము

కేతుం కృణ్వన్నిత్యస్య మంత్రస్య మధుచ్ఛంద ఋషిః, కేతుగ్రహో (గణో) దేవతా, గాయత్రీచ్ఛందః, యజమానస్య (మ) అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత కేతుగ్రహ (గణ) మూలమంత్ర జపే వినియోగః.

**కరన్యాసము :-**

ఓం కేతుం కృణ్వన్న - అంగుష్ఠాభ్యాం నమః
ఓం కేతవే - తర్జనీభ్యాం నమః
ఓం పేశోమర్యా - మధ్యమాభ్యాం నమః
ఓం అపశసే - అనామికాభ్యాం నమః
ఓం సముషద్భిః - కనిష్ఠికాభ్యాం నమః
ఓం అజాయథాః - కరతల కరపృష్ఠాభ్యా నమః

**అంగన్యాసము :-**

ఓం కేతుం కృణ్వన్న - హృదయాయ నమః
ఓం కేతవే - శిరసే స్వాహా
ఓం పేశోమర్యా - శిఖాయై వషట్
ఓం అపశసే - కవచాయ హుం
ఓం సముషద్భిః - నేత్రత్రయాయ వౌషట్
ఓం అజాయథాః - అస్త్రాయ ఫట్
భూర్భువసువరోమితి దిగ్బంధః

**ధ్యానమ్ :-**

పలాశపుష్ప సంకాశం తారకాగ్రహమస్తకం ।
రౌద్రం రుద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్ ॥

లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి. యం వాయ్వాత్మనే ధూపమాఘ్రాపయామి. వం అమృతాత్మనే అమృతోపహార నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే సర్వోపచారాన్సమర్పయామి.

**అధిదేవత : (చిత్రగుప్తుడు) :**

ఓం సచిత్రచిత్రం చితయంత మస్మే చిత్రక్షత్ర చిత్రతమం వయోధాం।
చంద్రంరయిం పురువీరం బృహంతం చంద్రచంద్రాభి ర్గృణతే యువస్వ ॥

**ప్రత్యధి దేవత : (బ్రహ్మ)**

ఓం బ్రహ్మాదేవానాం పదవీ : కవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణాం శ్యేనో గృధ్రాణాగ్స్వధితి ర్వనానాగ్ం సోమః పవిత్ర మత్యేతిరేభన్.

**కేతుగ్రహ జపం చేసే విధానము :-**

ముందుగా నవగ్రహహోమంలో చేసిన విధంగా అచమ్య-కేశవనామాలు, ప్రాణాయామ, భూతోచ్చాటనము, సంకల్పము, గణాధిపతిపూజ, కలశస్థాపనము, పుణ్యాహవాచనమును నిర్వర్తించాలి. తరువాత మంటపమును ఏర్పరచాలి.

**మంటపము ఏర్పరచు విధం :-**

బియ్యమును నలుచదరంగా పరవాలి. దానిపై బియ్యంతో నిండిన ఒక రాగిపాత్రను ఉంచాలి. దానిపై ఒకమీటరు నలుపు తెలుపు మిశ్రమపు రంగు వస్త్రమును మడిచి ఉంచాలి. దానిపై కంచుతో చేసిన కేతువుప్రతిమను లేదా కేతుయంత్రమును ఉంచాలి. (వస్త్రం బదులుగా తమలపాకును కూడా ఉంచవచ్చును.) "తదంగత్వేన ప్రతిమాశోధనాదికం కరిష్యే" అని సంకల్పం చెప్పి, తర్వాత మంత్ర సహితంగా ఆ ప్రతిమారాధన చేయాలి.

శ్లో॥ దధి సర్పిర్మధుక్షీరైః శర్కరేణ ఫలైస్సహ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః॥

మంత్రం: ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియం।
భవావాజస్య సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।
సురభినో ముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥
శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥
మధువాతాఋుతాయ తే మధు క్షరంతి సింధవః।
మాధ్వీ ర్నస్సం త్వోషధీః। మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః।
మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః।
మాధ్వీర్గావో భవంతు నః। తా శ్శర్కరా అభవవ్ తచ్ఛర్కరాభిరగ్నిం
పరిమినోతి వజ్రేణై వాస్మై పశూన్పరి గృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాస్తస్మాత్ఛ్రేయాన్స్థేయ సోనోపహరతే త్రిసప్తాభిః పశుకామస్య॥
ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే।
యోవశ్శివ తమో రసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః।
తస్మా అరంగ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥
ఇతి పంచామృతేన శుద్ధోదకేన చ అభిషించ్య॥

(అని చెప్పుచూ యంత్రములను పంచామృతములతోను, మంచినీటితోను కడుగవలెను/ అభిషేకించవలెను.)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥
గణాధిపతి మావాహయామి స్థాపయామి। పూజయామి॥

ఈ మంటపము పైకి పంచలోక పాలకులను అష్టదిక్పాలకులను, ఉపగ్రహాది దేవతలను ఆహ్వానించాలి. ఆయా పాలకులను, దేవతలను ఆహ్వానిస్తూ మంత్రాలు చదువుతున్నప్పుడు ఆయా స్థానములలో ఒక తమలపాకును పక్కను ఒక ఖర్జూరపండును, దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరిస్తూ ఉంచాలి.

**అథ పంచలోకపాలక పూజా :-**

హరి: ఓమ్ - ఆచమ్య - కేశవాయస్వాహా. నారాయణాయస్వాహా - మాధవాయస్వాహా. గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ నవగ్రహార్చనాంగ గణపత్యాది పంచలోకపాలక పూజాం, ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం చ కరిష్యే-

1. ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవస్తమం।
   జ్యేష్టరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి. పూజయామి.
2. ఓం బ్రహ్మదేవానాం పదవీః - కవీనామృషిర్వి - ప్రాణాం మహిషో మృగాణాం।
   శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలకమావాహయామి. స్థాపయామి. పూజయామి.
3. ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం।
   సమూఢమస్యపాంగ్ం సురే॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి. పూజయామి.
4. ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే।
   వోచేమ శంతమగ్ం హృదే॥
   సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలక మావాహయామి. స్థాపయామి. పూజయామి.

5. ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ।
అష్టాపదీ జనపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥

సాంగం సాయుధాం సవాహనాం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతాం 'గౌరీం' లోకపాలికా మావాహయామి. స్థాపయామి. పూజయామి.

గణేశాది పంచలోక పాలక దేవతాభ్యో నమః। ధ్యాయామి. ఆవాహయామి. రత్న సింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. అర్ఘ్యం సమర్పయామి. ఆచమ నీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. వస్త్రం సమర్పయామి. యజ్ఞోపవీతం సమర్పయామి. గంధం సమర్పయామి. అక్షతాన్ సమర్ప యామి. పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి. దీపం దర్శయామి. నైవేద్యం సమర్పయామి. తాంబూలం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి.

గణేశాది పంచలోకపాలక దేవతా ప్రసాద సిద్ధిరస్తు.

## దిక్పాలకులు

**ఇంద్రః :- (1-7-10 మం) :-**

ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః॥
ఇంద్రం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అగ్నిః :- (ఋ-1మం-12 సూ - 1 మంత్రం)**

అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥
అగ్నిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**యమః :- (ఋ-10మం-14 సూ - 13 మంత్రం)**

యమాయ సోమగ్ం సునుత యమాయ జుహుతాహవిః।
యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృతః॥
యమం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**నిర్ఋతిః-** మొఘుణః పరాపరా నిర్ఋతిర్దుర్హణావధీత్। పదీష్ట తృష్ణయాసహ॥
నిర్ఋతిం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**వరుణః :- (ఋ-1 మం - 25 సూ - 19 మంత్రం)**

ఇమంమే వరుణ శృధీ హవమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే॥
వరుణం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాయుః :- (ఋ - 8 మం - 26 సూ - 21 మంత్రం)

తవవాయ వృతస్పతేత్వ ష్టర్జామాతరద్భుత। అవాంస్యా వృణీమహే॥
వాయుం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

కుభేరః :-

సోమోధేనుగ్ం సోమో అర్వంత మాసుగ్ం సోమోవీరం కర్మణ్యం దదాతు।

సాదన్యం విదత్యగ్ం సభేయం పిత్రుశ్రవణం యోదదా శదస్మై॥
కుభేరం లోకపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఈశానః :-
తమీశానం జగతస్తస్థుషస్పతి ధియం జిన్వమవసేహూమహే వయమ్।
పూషానో యథావేద సామ సద్వృధే రక్షితా సాయు రదబ్ధస్వ స్తయే॥
ఈశానం లోకపాలక మావాహయామి.

ఊర్ధ్వపురుషః :-

ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా।
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వాయామహే॥
ఊర్ధ్వపురుష మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

పృథివీ :- (ఋ - 1 మం- 27 సూ - 15 మంత్రం)

స్యోనా పృథివీ భవానృక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథాః॥
పృథివీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

వాస్తు పురుషః :-

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ థ్స్వావేశో అనమీవో భవా నః।

యత్త్వే మహేప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదేశం చతుష్పదే॥

వాస్తుపురుషు మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

# త్రిమూర్తులు- (సతీసమేతంగా) ఇతర దేవతలు

బ్రహ్మ:-

బ్రహ్మాదేవానాం పదవీ: కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం।
శ్యేనో గృధ్రాణాగ్స్వధి తిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్।

సరస్వతీ :-

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥
సరస్వతీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విష్ణువు :- (1 మం - 22 సూ - 17 మంత్రం)

ఇదం విష్ణుర్విచక్రమే త్రిధానిదధే పదం। సమూఢమస్యపాగ్ం సురే॥
విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

లక్ష్మీ:-

సక్తుమివ తితఉనా పునంతో యత్రధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి॥
లక్ష్మీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

రుద్రః:- (ఋ-1 మం - 43 సూ - 1 మంత్రం)

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వో చేమశం తమగ్ం హృదే॥
రుద్రమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గౌరీ:- గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥
గౌరీమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అశ్వనీ దేవతా :-

క్రాణా శిశుర్మహీనాం హిన్వన్నృతస్య దీధితిమ్। విశ్వాపరిప్రియా భువద ధద్వితా॥
ఆదిత్ప్రత్నస్య రేతసో జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయదిధ్యతె దివా॥
అశ్వనీ దేవతామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఏషోఉషా అపూర్వావ్యుచ్ఛతి ప్రియాదివః। స్తుషేవా మశ్వినా బృహత్॥
అశ్వనీ దేవతా మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

గరుడః :-

సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తేశిరోగాయత్రం చక్షుస్సామ

ఆత్మాసామ తే తనూర్వామదేవ్యం బృహద్ర థంతరే పక్షౌ

యజ్ఞాయ యజ్ఞియం పుచ్ఛం ఛందాగ్‌ం స్యంగాని ధిష్ణియా

శ్శఫా యజూగ్‌ంషినామ సుపర్ణోఽసి గరుత్మాన్ దివంగచ్ఛ సువః పత॥

గరుడ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ధన్వంతరిః :-

ధన్వనాగా ధన్వనాఽఽ జిం జయేమ ధన్వనాతీవ్రాస్సమదో జయేమ।

ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ॥

ధన్వంతరి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

ఇంద్రాగ్నీం :- (ఋ- 10 మండలం-165 సూక్తం - 1వ మంత్రం)

ముంచామి త్వా హవిషా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।

గ్రాహిర్జ గ్రాహ యదివైత దేవం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్॥

ఇంద్రాగ్నీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

నిర్రృతి: యది క్షితాయు ర్యదివాపరేతో యది మృత్యో రంతికం నీత ఏవ।

తమాహరామి నిరృతే రుపస్థాదస్పార్ష మేనం శతశారదాయ॥

నిర్రృతిమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

(శత్రుఫలమ్) మన్యుః :- (ఋ - 10 మం -84 సూ - 7 మంత్రం)

సంసృష్టం ధన ముభయం। సమాకృత మస్మభ్యం ధత్తా వరుణశ్చ మన్యుః।

భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతామ్॥

మన్యుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

విశాఖా నక్షత్రమ్ :-

దూరమస్మచ్ఛత్రవోయంతు భీతాః। తదింద్రాగ్నీ కృణుతాం త ద్విశాఖే।

తన్నో దేవా అనుమదంతు యజ్ఞమ్। పశ్చా త్పురస్తా దభయన్నో అస్తు।

నక్షత్రాణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా విన్ద్రాగ్నీ భువనస్య గోపౌ।

విషూచ శ్శత్రూ నపబాధమానౌ। అపక్షుధం నుదతా మరాతిమ్॥

విశాఖా నక్షత్ర మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**మృత్యుంజయ త్ర్యంబకః :-**

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥
మృత్యుంజయ త్ర్యంబకమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ఋగ్వేదము :-**

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం।
హోతారం రత్నధాతమం॥ ప్రాగ్ద్వారే ఋగ్వేదాయనమః॥
ఋగ్వేద మావాహయామి। పూజయామి॥

**యజుర్వేదము :-**

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయ వస్థ దేవోవస్సవితా ప్రార్పయతు
శ్రేష్ఠతమాయ కర్మణే॥ దక్షిణ ద్వారే యజుర్వేదాయ నమః
యజుర్వేద మావాహయామి। పూజయామి॥

**సామవేదము :-**

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే।
నిహోతానత్సి బర్హిషి॥ పశ్చిమ ద్వారే సామవేదాయ నమః
సామవేద మావాహయామి। పూజయామి॥

**అథర్వణ వేదము :-**

శన్నోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః॥
ఉత్తర ద్వారే అథర్వణ వేదాయ నమః॥
అథర్వణ వేదమావాహయామి। పూజయామి॥

## ఉపగ్రహములు (వేదోక్త మంత్రాలు)

**దుర్గా :-** ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీ యతో నిదహాతి వేదః।
సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః॥
ఓం భూర్భువస్సువః॥ దుర్గామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**గణపతి :-** ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్॥
ఓం భూర్భువస్సువః॥ గణపతి మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**క్షేత్రపాలకుడు:-** క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనో మృడాతీదృశే॥
క్షేత్రపాలక మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**అభయంకరుడు:-** యత ఇంద్ర భయా మహేతతో నో అభయం కృధి।
మఘవన్ ఛగ్ధిత వతన్న ఊతయే విద్విషో విమృధోజహి॥
స్వస్తి దావిశస్పతిర్వృత్రహా విమృధో వశీ
వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః॥
ఓం భూర్భువస్సువః॥ అభయం కరమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

| జాతకుని జన్మనక్షత్రమును ఆహ్వానించాలి. |
|---|

తరువాత కేతువుకు సంబంధించిన నక్షత్రములు మఖ, మూల, అశ్వని లను ఆహ్వానించాలి.

**8. మఖ :-**

ఉపహూతాః పితరో యే మఘాసు। మనోజవస్సుకృత స్సుకృత్యాః।
తేనో నక్షత్రే హవ మాగమిష్ఠాః। స్వధాభిర్యజ్ఞం ప్రయత జుషతాం।
యే అగ్నిదగ్ధా యేఽ నగ్నిదగ్ధాః। యే అములోకం పితరః క్షియంతి।
యాగ్ంశ్చ విద్మ యాగ్ం ఉచన ప్రవిద్మ। మఘాసు యజ్ఞగ్ం సుకృతం జుషతాం॥
మఖానక్షత్ర దేవతాం పితౄణామావాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకు, వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఒక నాణెమును ఉంచి నమస్కరించాలి.

**మూల :-**

మూలం ప్రభాం వీరవతీం విదేయ। పరాచ్యేతు నిర్‌ఋతిః పరాచా।
గోభిర్న నక్షత్రం పశుభిస్సమక్తమ్। అహర్భూయాద్యజమానాయ మహ్యమ్।
అహర్నోఽద్య సువితే దధాతు। మూలం నక్షత్రమితి యద్వదంతి।
పరాచీం వాచా నిర్‌ఋతిం నుదామి। శివం ప్రజాయై శివమస్తు మహ్యమ్॥
మూలా నక్షత్రదేవతాం అసురం ఆవాహయామి। స్థాపయామి। పూజయామి॥
మంటపంపై తమలపాకులు, దానిపై వక్క, ఖర్జూరపండు దక్షిణగా నాణెమును ఉంచి నమస్కరించాలి.

అశ్వనీ :-

తదశ్వినా వశ్వయు జోపయాతామ్। శుభం గమిష్ఠౌ సుయమేభి రశ్వైః॥
స్వం నక్షత్రగ్ం హవిషా యజంతౌ। మధ్వా సంపృక్తౌ యజుషా సమక్తౌ॥
యౌదేవా నాం భిషజౌ హవ్యవాహౌ। విశ్వస్యదూతా వమృతస్య గోపౌ।
తౌ నక్షత్రం జుజుషాణోపయాతామ్। నమోఽశ్విభ్యాం కృణుమోఽశ్వయుగ్భ్యామ్॥
అశ్వనీ నక్షత్ర దేవతే అశ్వినావాహయామి। స్థాపయామి। పూజయామి॥

మంటపంపై తమలపాకు దానిపై వక్క, ఖర్జూరపండు, దక్షిణగా ఉంచి నమస్కరించాలి.

(ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనిన తరువాత మంటపంపై తమలపాకును ఉంచి, దానిపై వక్క, ఖర్జూరపండు, నాణెమును ఉంచి నమస్కరించాలి.)

**కేతుః :- (ఋ - 1 మం - 6 సూ - 3 మంత్రం)**

కేతుం కృణ్వన్నిత్యస్య మంత్రస్య మధుచ్ఛంద ఋషిః। కేతుగ్రహోదేవతా। గాయత్రీ ఛ్ఛందః। (మమ) యజమానస్యాధి దేవతా ప్రత్యధి దేవతా సహితగణా॥ కేతుగణ ప్రసాద సిద్ధ్యర్థే కేతుగణారాధనే వినియోగః॥

**ధ్యానం:-** ధ్వజాసనో జైమిని గోత్రజోఽంతర్వేదేషు విచిత్ర వర్ణః।
యామ్యాననో వాయుదిశి ప్రఖడ్గశ్చర్మాసిభిశ్చాప్త సంతశ్చకేతుః॥
ధూమ్రో ద్విబాహుర్వరదో గదాభృద్గృధ్రాసనస్థో వికృతాననశ్చ।
కిరీట కేయూర విభూషితాంగస్సదాస్తు మే కేతు గణః ప్రశాంతః॥

(కేతుగ్రహమునకు ఎనమండ్రుగురు పుత్రులు, పరివారము కూడ కేతు గ్రహ సములు. వీరందరూ కేతువు వలెనే శుభాశుభములిస్తారు. అందుచే ఒక్క కేతుగ్రహము అనిగాక, కేతుగణమని పెద్దలు విధించారు.)

**మంత్రం :-** ఓం కేతుం కృణ్వన్న కేతవేపేశో మర్యా అపేశసే। సముష ద్భిరజాయథాః॥ ఓం భూర్భువస్సువః॥ కేతుగణేహాగచ్ఛ। కేతుగణం చిత్రవర్ణం చిత్రగంధం చిత్రపుష్పం చిత్రమాల్యాంబరధరం చిత్రచ్ఛత్ర ధ్వజ రథ పతాకాది శోభితం దివ్యరథ సమారూఢం మేరుం అప్రదక్షిణీ కుర్వాణం ధ్వజాసనస్థం దక్షిణాభిముఖం అంతర్వేది దేశాధిపతిం ద్విబాహుం గదాధరం జైమినసగోత్రం పార్థివ సంవత్సర ఫాల్గుణ శుక్ల పౌర్ణమాస్యామభి జిన్నక్షత్రజాతం సౌమ్యావారే

మిథునరాశి ప్రయుక్తం సింహాసనాసీనం గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్య వాయువ్య దిగ్భాగే ధ్వజాకార మండలే కేతుగణ మావాహయామి। స్థాపయామి। పూజయామి।

**అధిదేవత - చిత్రగుప్తః :-**

**మంత్రం :-** సచిత్ర చిత్రం చితయంతమస్మే చిత్రక్షత్ర చిత్రతమం వయోధామ్।
చంద్రం రయిం పురువీరం బృహంతం చంద్ర చంద్రాభి ర్గృణుతే యువస్వ॥

కేతుగణాధి దేవతాం చిత్రగుప్తం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం కేతుగణస్య దక్షిణతః చిత్రగుప్త మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

**ప్రత్యధిదేవత - బ్రహ్మ:-**

**మంత్రం :-** బ్రహ్మాదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషోమృగాణామ్।
శ్యేనో గృధ్రాణాగ్‌ం స్వధితి ర్వనానాగ్‌ం సోమః పవిత్ర మత్యేతి రేభన్॥

కేతుగణ ప్రత్యధి దేవతాం బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం కేతుగణస్యోత్తరతః బ్రహ్మాణామావాహయామి। స్థాపయామి। పూజయామి॥

## పూజ

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత కేతుగ్రహ దేవతాభ్యోనమః. ఆవాహనం సమర్పయామి। ఆసనం సమర్పయామి। పాద్యం సమర్పయామి। అర్ఘ్యం సమర్పయామి। ఆచమనం సమర్పయామి। పంచామృత స్నానం సమర్పయామి। వస్త్రం సమర్పయామి। యజ్ఞోపవీతం సమర్పయామి। గంధం సమర్పయామి। అక్షతాన్ సమర్ప యామి। పుష్పం సమర్పయామి। ధూపమాఘ్రాపయామి। దీపం దర్శయామి।

**నైవేద్యం :- (పండ్లు, కొబ్బరికాయ, వండిన వంటకములు మొ)**

"నైవేద్యంషడ్రసోపేతం భక్ష్యభోజ్యం చతుర్విధమ్।
సంఘృతం సఫలం దేవగృహ్యాతాం సర్వదేవతాః॥

ఓం భూర్భువస్సువః భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు। అమృతోపస్తరణమసి। మహానైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మహానైవేద్యం సమర్పయామి। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి। పాదప్రక్షాళనం సమర్పయామి। నైవేద్యానంతరం శుద్ధాచ మనీయం సమర్పయామి। తాంబూలం

సమర్పయామి। స్వర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి। కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి।

## మంత్రపుష్పమ్

(చేతిలో (దోసిటలో) పువ్వులు పట్టుకొని నమస్కారం చేస్తూ ఈ మంత్రాలను చదవాలి.)

ఓం, "ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే॥

1. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4. నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥

5. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః।
యచ్చకించిజ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా॥

6. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః।
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వశమ్భువమ్॥

7. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి॥

8. జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సన్నిభమ్॥

9. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్।
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

10. సోఽగ్రభుగ్విభజన్తిష్ఠ న్నాహార మజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా॥

11. సన్తాపయతి స్వందేహమాపాద తలమస్తకః।
తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥

12. నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

13. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే।
నమో వయం వైశ్రవణాయ కుర్మహే।

15. ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం।
ఓం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు॥

16. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మాత్వం ప్రజాపతిః
త్వం తదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

17. ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥

18. యోఽపాం పుష్పంవేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।
చంద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి॥ య ఏవం వేద॥

19. యోఽపామాయతనంవేద। ఆయనతనవాన్భవతి॥
అగ్నిర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

20. యో౽గ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి।
అపోవా అగ్నేరాయతనం ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥
21. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి
వాయుర్వా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥
22. యోవాయో రాయతనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై వాయోరాయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥
23. యో౽పామాయతనంవేద। ఆయతనవాన్భవతి।
అసౌవై తప న్నపామాయతనం। ఆయతనవాన్భవతి।
24. యో౽ముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥
25. యశ్చన్ద్రమస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపో వైచన్ద్రమస ఆయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥
26. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
నక్షత్రాణి వా అపా మాయతనం। ఆయతనవాన్భవతి॥
27. యో నక్షత్రాణామాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై నక్షత్రాణామాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥
28. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
పర్జన్యోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥
29. యః పర్జన్యస్యాయ తనంవేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద॥
30. యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి।
సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి॥

31. యస్సంవత్సరస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।
ఆపోవై సంవత్సరస్యాయతనమ్। ఆయతనవాన్భవతి॥ య ఏవం వేద॥

32. యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవ తిష్ఠతి॥

33. కిం తద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కిం పరాయణం।
ఏకో యద్ధారయద్దేవః। రేజతీ రోదసీ ఉభే॥

34. వాతాద్విష్ణోర్బల మాహుః। అక్షరా దీప్తిరుచ్యతే।
త్రిపదాద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమమ్॥

35. ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం।
బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్॥

36. తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥

37. తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥

38. నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

39. ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగలం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥

అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత కేతుగ్రహ దేవతాభ్యోనమః। దివ్యశ్రీ సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి। (చేతిలోని పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.)

**ఉపచారంః-** కేతుగ్రహ దేవతాభ్యో నమః। ఛత్రం ధారయామి। చామరం వీజయామి। నృత్యం దర్శయామి। గీతం శ్రావయామి। వాద్యం ఘోషయామి। ఆందోళికామారోహయామి। సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార పూజాన్ సమర్పయామి. (పూలను వేసి నమస్కరించాలి.)

**పునః నీరాజనం :-** (హారతిని వెలిగించి ఏదేని మంగళహారతి శ్లోకం/ పాట చెప్పాలి.)

**ప్రదక్షిణ నమస్కారం :-** (చేతిలోనికి పూలు తీసికొని నిలబడి కుడిచేతి వైపుగా ప్రదక్షిణము చేస్తూ క్రింది మంత్రాన్ని చదవాలి.)

"యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే।
పాపోऽహం పాపకర్మాऽహం పాపాత్మా పాపసంభవ॥
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల। అన్యధాశరణం నాస్తి
త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥

కేతుగ్రహదేవతాభ్యో నమః- ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పూలను మంటప దేవతలపై వేసి నమస్కరించాలి.) సాష్టాంగ నమస్కారా న్సమర్పయామి॥ (సాష్టాంగ నమస్కారం చేయాలి.)

"కోటిజన్మ కృతం పాపం నశ్యతే నాత్ర సంశయః।
దివ్యరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః।
పాదోదకంచ నిర్మాల్యం మస్తకేయస్య సోऽచ్యుతః।
సర్వదేవతాభ్యో పాదోదకం పావనం శుభమ్॥

(పూజించిన నీటిని అరచేతిలో పోసుకొని త్రాగాలి. మంటపము మీది పువ్వులను తలలో లేక చెవి సందులో నుంచుకోవాలి.)

ఉద్వాసన:- "యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః।
తాని ధర్మాని ప్రథమా న్యాసన్।
తేవానాకం మహిమానస్సచంతే।
యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥

కేతుగ్రహ దేవతాభ్యో నమః యథాస్థానం ప్రతిష్ఠాపయామి। (మంటప ములో- కొంచం పైకి ఎత్తి క్రింద పెట్టవలెను.)

ఆవాహనం న జనామి। నజానామి విసర్జనం।
పూజావిధిం న జానామి। క్షమస్వ పరమేశ్వర॥
యశ్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి క్షమస్వ పరమేశ్వరః॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరః।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత శ్రీ కేతుగ్రహ దేవతా స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవన్తు॥ న్యూనా తిరిక్తం సర్వం సగుణం కుర్వన్తు॥

ఆచమానము, భూతోచ్చాటనము, సంకల్పము, గణపతిపూజ చేసి తరువాత కేతుగ్రహజపము చేయాలి.

(జాతకుడు స్వయంగా జపం చేసుకుంటుంటే "మమ" అని చెప్పాలి. యాజమానస్య అని చెప్పకూడదు. ఒకరు మరొకరికోసం జపం చేస్తుంటే "యాజమానస్య" అని చెప్పాలి. మమ అని చెప్పకూడదు.

**కేతుగ్రహజపం :-**

కేతుం కృణ్వన్నిత్యస్య మంత్రస్య। మధుచ్ఛంద ఋషిః।
కేతు గ్రహోదేవతా। గాయత్రీచ్ఛందః॥

మమ అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత కేతుగ్రహ ప్రసాదసిద్ధ్యర్థే కేతుగ్రహ మంత్రజపం కరిష్యే.

**కరన్యాసము :-**

| | | |
|---|---|---|
| కేతుం కృణ్వన్ | - | అంగుష్ఠాభ్యాన్నమః |
| కేతవే | - | తర్జనీభ్యాన్నమః |
| పేశోమర్యా | - | మధ్యమాభ్యాన్నమః |
| అపేశసే | - | అనామికాభ్యాన్నమః |
| సముషద్భిః | - | కనిష్ఠికాభ్యాన్నమః |
| అజాయథాః | - | కరతల కరపృష్ఠాభ్యాన్నమః |

**హృదయాదిన్యాసము :-**

| | | |
|---|---|---|
| కేతుం కృణ్వన్ | - | హృదయాయనమః |
| కేతవే | - | శిరసేస్వాహా |
| పేశోమర్యా | - | శిఖాయై వషట్ |
| అపేశసే | - | కవచాయ హుం |
| సముషద్భిః | - | నేత్రత్రయాయ వౌషట్ |
| అజాయథాః | - | అస్త్రాయఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానం :-**

ధ్వజాసనో జైమిని గోత్రజోఽంతర్వేదేషు దేశేషు విచిత్ర వర్ణః।
యామ్యాననో వాయుదిశి ప్రఖడ్గశ్చర్మాసిభిశ్చాప్తనుతశ్చ కేతుః॥

**మంత్రం :**

కేతుం కృణ్వన్నకేతవే పేశోమర్యా అపేశసే।
సముషద్భిరజాయథాః॥

**అధిదేవత :**

సచిత్ర చిత్రం చితయంతమస్మే చిత్ర క్షత్ర చిత్ర తమం వయోధామ్।
చంద్రం రయిం పురువీరం బృహంతం చంద్ర చంద్రాభిర్గృణతే యువస్వ॥

**ప్రత్యధిదేవతా :-**

బ్రహ్మాదేవానాం పదవీః కవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్ ।
శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్ ॥

(అని చెప్పిన తర్వాత మూల మంత్రమును 7000 జపించి ఆ తర్వాత అధిదేవతా ప్రత్యధిదేవతా మంత్రములను ఒకసారి చెప్పాలి. తరువాత "యాజమానస్య (మమ) కేతుగ్రహ ప్రసాదేన సర్వాభీష్ట సిద్ధిరస్తు" అని చెప్పి ఉద్ధరిణితో నీళ్ళను పళ్ళెములో వదలాలి.

**కేతుగ్రహ మంత్ర తర్పణము :-**

ముందుగా సంకల్పము, భూతోచ్చాటన, ప్రాణాయామము, గణపతిపూజ చేయాలి. (ఇచట సంకల్పంలో 'జలతర్పణం కరిష్యామి' అని చెప్పుకోవాలి.)

తరువాత గ్రహమంత్రమును తర్పణం చేయాలి. తర్పణము చేయుటకు ఒక పాత్రలో పరిశుద్ధ జలమును తీసుకొని, దానిలో ఒక ఉద్ధరిణిని ఉంచుకోవాలి. అలాగే మనముందు ఒక పరిశుద్ధ పళ్ళెమును నీటిని వదలటానికి వీలుగా ఉంచుకోవాలి.

గ్రహముకు సంబంధించిన "ధ్యానము"ను ఏకాగ్రతగా స్మరించాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని, కేతుగ్రహ మంత్రమును చదవాలి. తరువాత కేతవే తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని తరువాత కేతుగ్రహ అధిదేవత మంత్రమును చదివి, "కేతుగ్రహస్య అధిదేవతాః తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత ఉద్ధరిణిలోకి నీటిని తీసుకొని ప్రత్యధిదేవత మంత్రమును చదవాలి. తరువాత "కేతుగ్రహస్య ప్రత్యధిదేవతాః తర్పయామి నమః" అని నీటిని పళ్ళెములో వదలాలి.

తరువాత మంత్రమును 70సార్లు తర్పణము చేయాలి. మరల గ్రహ అధిదేవత, ప్రత్యధి దేవత మంత్రములను చదవాలి తరువాత

"కేతుగ్రహ ప్రసాదేనమమ ఆరోగ్యసిద్ధిరస్తు," సర్వాభీష్ట సిద్ధిరస్తు" అని నీటిని పళ్ళెములో ధారపోయాలి.

(జాతకుడు స్వయంగా మంత్రాలు చదువుతున్నపుడు "మమ" చెప్పుకోవాలి. ఇతరులు చదువుతున్నపుడు "మమ" స్థానంలో "యాజమానస్య" అని చెప్పాలి.)

**గ్రహహోమము :-**

ముందుగా అధిదేవత, ప్రత్యధిదేవతా సహితంగా జన్మనక్షత్రముకు హోమం చేయాలి. తరువాత అశ్విని, మఖ, మూల నక్షత్రములకు హోమం చేయాలి.

**మూల :** ప్రజాపతయేస్వాహా। మూలాయస్వాహా। అద్భ్యస్వాహా ।
అషాఢాభ్యస్వాహా । సముద్రాయస్వాహా। కామాయస్వాహా । అభిజిత్యైస్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత మూలాయైదం న మమ॥ (108 సార్లు)

**మఖ :** పితృభ్య స్వాహా । మఖాభ్యస్వాహా । నఖాభ్య స్వాహా ।
గదాభ్య స్వాహా । అరుంధతీభ్యస్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత మఖాభ్యఃయేదం న మమ॥ (108 సార్లు)

**అశ్వనీ :** అశ్విభ్యాగ్ంస్వాహా। అశ్వయుగ్భ్యాగ్ంస్వాహా । శ్రోత్రాయస్వాహా। శ్రుత్యైస్వాహా ॥
అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత అశ్వయుగ్భ్యాగ్ం ఇదం న మమ॥(108 సార్లు)
ప్రతి నక్షత్రమునకు 108 సార్లు హోమం చేయాలి.

తరువాత కేతు గ్రహముకు హోమం చేయాలి. కేతు గ్రహ మంత్రమును దాని అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను వరుసగా చదవాలి. "స్వాహా" అనిన ప్రతిసారి గరిక, ఆవునేయి, మినుములు హోమంలో వేయాలి. ఈ విధంగా మూలమంత్రము, అధిదేవత, ప్రత్యధిదేవత మంత్రములను క్రమంగా 70 సార్లు చదువుతూ హోమం చేయాలి.

తరువాత ఉపగ్రహములు, దిక్పాలకులు, పంచలోకపాలకులు ఇతర దేవతలకు హోమము, జయాదిహోమం, స్విష్టకృత్, ప్రాయశ్చిత్తహోమం,

పూర్ణాహుతి, వసోర్ధారా, మార్జనము, బ్రహ్మావిసర్జనము, ఆ గ్రహముకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయుట, గ్రహాది దేవతల ఉద్వాసన, మంటపదానం, ఆశీర్వాదం అను క్రియలను క్రమంగా నిర్వహించాలి.

తరువాత సమారాధనచేసి, పెద్దల ఆశీర్వాదమును పొందాలి. కేతుగ్రహ హోమంలో మార్జన 7సార్లు చేయాలి. కనీసం 7గురికి భోజనం పెట్టాలి.

## 169. స్మరణం

గ్రహజపం చేయలేనివారు, కేతుగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు క్రిందివాటిలో ఏ మంత్రమునైనా ఏకాగ్రతగా ప్రతిరోజు స్మరించాలి.

## కేతు గ్రహ మంత్రాలు

1. ఓం ప్రాం ప్రీం ప్రౌం సః కేతవే నమః
2. ఓం హ్రీం క్రూం క్రూరరూపిణే కేతవే ఐం సౌః స్వాహా
3. ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః క్రాం క్రీం క్రూం కేతు గణాయ నమః
4. ఓం ఐం హ్రీం శ్రీం క్లీం సింహికా సంభవాయ శత్రునాశాయ ధూం ధూం ధూమరూపాయ స్వాహా.
5. ఓం కం కేతవే నమః
6. ఓం ఐం హ్రీం క్రైం కేతవే నమః
7. ఓం క్రూం హ్రాం క్రైం కేతవే నమః
8. ఓం హ్రీం శ్రీం వరవరద ద్రాం ద్రీం వరప్రదాయ మహా మాయా మయాయ ఐం క్రోం కేతవే నమః

కేతువు దోష పరిహార నిమిత్తం "ఓం గం గణపతయే నమః"

## కేతు గాయత్రీ మంత్రాలు

1. చిత్రవర్ణాయ విద్మహే - శరభ రూపాయ ।
   ధీమహి - తన్నః కేతుః ప్రచోదయాత్ ॥
2. పద్మపుత్రయాయ విద్మహే - అమృతేశాయ ।
   ధీమహి - తన్నః కేతుః ప్రచోదయాత్ ॥
3. ధూమ్ర వర్ణాయ విద్మహే - వికృతాననాయ ।
   ధీమహి - తన్నః కేతుః ప్రచోదయాత్ ॥
4. అశ్వధ్వజాయ విద్మహే - శూలహస్తాయ ।
   ధీమహి - తన్నః కేతుః ప్రచోదయాత్ ॥

**అనుకూల సమయాలు :-**

కేతువు అనుగ్రహం పొందాలనుకునేవారు కేతుగ్రహజపం, హోమం చేసి, సమారాధన చేయుట ఉత్తమము. ఆ విధంగా చేయలేనివారు కేతువుకోసం సూచించిన ఏ మంత్రమునైనా ప్రతిదినం ఏకాగ్రతగా జపించుట మంచిది అదేవిధంగా కేతువును స్తోత్రము చేయాలి.

కేతువుకు అనుకూలమైన వారము ఆదివారము. అదేవిధంగా ఆయన ఆధిపత్యం వహించే నక్షత్రాలు అశ్విని, మఖ, మూలలున్న దినములు కూడ అనుకూలమైనవే. చవితి, పౌర్ణమి కేతువుకు అనుకూలమైన తిథులు. ముఖ్యంగా చైత్ర శుక్ల చవితి, ఫాల్గుణ శుక్ల పౌర్ణమి ఉత్తమమైన తిథులు. ఈ సమయాలలో ప్రత్యేకంగా కేతువును పూజించుట శుభకరము.

వినాయక చవితి పండుగ భక్తిశ్రద్ధలతో చేసిన కేతువు అనుగ్రహిస్తాడు. పుత్రగణపతి వ్రతం జరిపిన సంతానం కలుగుతుంది.

కేతువును పూజించునపుడు దీపారాధనకు తెలుపులేదా బూడిదరంగు వస్త్రముతో చేసిన పత్తిని వాడుట మంచిది. పూజకు పులిహోర, కుడుములు, ఉలవగుగ్గిళ్ళను ప్రసాదంగా వినియోగించాలి.

పూజలు చేయలేనివారు వీధిబాలలకు, పేదవారికి కొబ్బరికాయలు, ఉలవలు, నువ్వులు, అరటికాయలు, చింతపండు, ఉల్లిపాయలు, వెల్లుల్లి వంటి కేతువుకు సంబంధించిన ద్రవ్యములు దానం చేయాలి.

ప్రతిరోజు శ్రీ గణేశపురాణం, శ్రీగణేశ సహస్ర నామావళి పఠించాలి.

## 170. ఆరాధనం

క్రింది సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన కేతు గ్రహానుగ్రహం పొందవచ్చును.

## కేతుగ్రహ అష్టోత్తర నామస్తోత్రమ్

"శృణునామాని జప్యాని కేతోరథమహామతే,
కేతుస్స్థూల శిరాశ్చైవ శిరోమాత్రో ధ్వజాకృతిః
నవగ్రహయుతస్సింహికాసురీ గర్భసమ్భవః
మహాభీతి కరశ్చి త్రవర్ణో వైపిఙ్గలాక్షకః

ఫలధూమ్రకసంకాశ్యః తీక్ష్ణదంష్ట్రో మహోరగః
రక్తనేత్ర శ్చిత్ర కారీ తీవ్రకోపో మహాసురః
పాపకంఠః క్రోధనిధిః ఛాయాగ్రహ విశేషకః
అన్త్యగ్రహో మహాశీర్షో సూర్యారిః పుష్పవద్గ్రహీ
వరహస్తో గదాపాణిః చిత్ర శుభ్ర రథస్తథా
చిత్ర ధ్వజపతాకశ్చ ఘోరశ్చిత్రరథశ్శిఖీ
కులుత్థ భక్షకశ్చైవ వైడూర్యాభరణ స్తథా
ఉత్పాతజనక శ్శుక్రమిత్రో మన్దసఖస్తథా
శిఖినేవాపకశ్చైవాన్తర్వేదీశ్వర ఏవ చ
జైమినేర్గోత్రజశ్చిత్ర గుప్తాత్మా దక్షిణాముఖః
ముకున్ద వరపాత్రం చ మహాసురకులోద్భవః
ఘనవర్ణో లమ్బదేవో మృత్యుపుత్ర స్తథైవ చ
ఉత్పాతరూపధారీ చాదృశ్యః కాలాగ్ని సన్నిభః
నృపీడోగ్రహకారీ చ సర్వోపద్రవకారకః
చిత్రప్రసూతో హ్యానలస్సర్వ వ్యాధివినాశకః
అపసవ్యప్రచారీ చ నవమే పాపదాయకః
పంచమే శోకదశ్చోపరాగగోచర ఏవచ
అపి పూరుషకర్మా చ తురీయే తు సుఖప్రదః
తృతీయే వైరదః పాపగ్రహశ్చ స్ఫోటకారకః
ప్రాణనాథః పంచమేతు శ్రమకారక ఏవచ
ద్వితీయే స్ఫుటవాగ్దాతా విషాకులితవక్త్రకః
కామరూపీ సింహదన్తస్సత్యేప్యనృత వానపి
చతుర్థే మాతృనాశశ్చ నవమే పితృనాశకః
అన్త్యే వైర ప్రదశ్చైవ సుతానన్దనబన్ధకః
సర్పాక్షిజాతోఽనంగశ్చ కర్మరాశ్యుద్భవ స్తథా
ఉపాన్తే కీర్తిదశ్చైవసప్తమే కలహప్రదః
అష్టమే వ్యాధికర్తాచ ధనే బహుసుఖప్రదః
జననేరోగదశ్చోర్ధ్వమూర్ధజో గ్రహనాయకః ॥
పాపదృష్టిః ఖేచరశ్చ శామ్భవోఽశేషపూజితః
శాశ్వతశ్చ నటశ్చైవ శుభాశుభఫలప్రదః

ధూమ్రశ్చైవ సుధాపాయీహ్యజితో భక్తవత్సలః
సింహాసనః కేతుమూర్తీరవీన్దు ద్యుతినాశకః
అమరః పీడకోఽమర్త్యో విష్ణుదృష్టోఽసురేశ్వరః
భక్తరక్షోఽథ విచిత్ర కపోలస్యన్దన స్తుతః
విచిత్ర ఫలదాయీ చ భక్తాభీష్టఫలప్రదః"

ఫలశ్రుతి :-

యోభక్త్యేదం జపత్కేతు నామ్నామష్టోత్తరం శతమ్
స తు కేతోః ప్రసాదేన సర్వాభీష్టం సమ్నాప్నుయాత్

కేతు స్తుతి :-

పలాశ పుష్పసంకాశం - తారకాగ్రహ మస్తకం
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం - కేతుంతం ప్రణమామ్యహం
ధూమ్ర వర్ణం ద్విబాహుంచ - కేతుంచ వికృతాననం
గృధ్రాసన గతం నిత్యం - ధ్యాయేత్ సర్వఫలాప్తయే ॥

## 171. అభినందనం

క్రింది నామములతో కేతు గ్రహయంత్రమును తరచు పూజించిన కేతుగ్రహానుగ్రహం కలుగుతుంది.

## కేతు అష్టోత్తర శతనామావళి

ధ్యానము :-

శ్లో॥ పలాశపుష్ప సంకాశం తారకాగ్రహమస్తకం ।
రౌద్రం రుద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్ ॥

ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర 'నమః' అని చదువుకొనవలెను.

| | | |
|---|---|---|
| ఓం కేతవే నమః | మహాభీతికరాయ | చిత్రకారిణే |
| స్థూలశిరసే | చిత్రవర్ణాయ | తీవ్రకోపాయ |
| శిరోమాత్రాయ | పింగళక్షకాయ | మహాసురాయ |
| ధ్వజాకృతయే | ఫలధూమ్రకసంకాశాయ 10 | పాపకంఠాయ |
| నవగ్రహయుతాయ | తీక్ష్ణదంష్ట్రాయ | క్రోధనిధయే |
| సింహికాసురీ గర్భసంభూతాయ | మహోరగాయ | ఛాయాగ్రహవిశేషకాయ |
| | రక్తనేత్రాయ | అంత్యగ్రహాయ 20 |

మహాశీర్షాయ
సూర్యారయే
పుష్పవద్గ్రహిణే
వరహస్తాయ
గదాపాణయే
చిత్రశుభ్రరథాయ
చిత్రధ్వజపతాకాయ
ఘోరాయ
చిత్రరథాయ
శిఖినే 30
కుళుత్థభక్షకాయ
వైడూర్యాభరణాయ
ఉత్పాతజనకాయ
శుక్రమిత్రాయ
మందసఖాయ
శిఖినేనాపకాయ
అంతర్వేదీశ్వరాయ
జైమినేఃగోత్రజాయ
చిత్రగుప్తాత్మనే
దక్షిణాముఖాయ 40
ముకుందవరపాత్రాయ
మహాసురకులోద్భవాయ
ఘనవర్ణాయ
లంబదేవాయ
మృత్యుపుత్రాయ
ఉత్పాతరూపధారిణే
అదృశ్యాయ
కాలాగ్నిసన్నిభాయ
నృపీటాయ
గ్రహకారిణే 50
సర్వోపద్రవకారకాయ
చిత్రప్రసూతాయ
అనలాయ
సర్వవ్యాధి వినాశకాయ
అపసవ్యప్రచారిణే
నవమేపాపదాయకాయ
పంచమేశోకదాయ
ఉపరాగగోచరాయ
పూరుషకర్మణే
తురీయేతుసుఖప్రదాయ
తృతీయేవైరదాయ 61
పాపగ్రహాయ
స్ఫోటకారకాయ
ప్రాణనాథాయ
పంచమేతుశ్రమకారకాయ
ద్వితీయేస్ఫుటవాగ్దాత్రే
విషాకులితవక్త్రకాయ
కామరూపిణే
సింహదంతాయ
సత్యేప్యనృతవతే 70
చతుర్థేమాతృనాశాయ
నవమేపితృనాశకాయ
అంతేవైరప్రదాయ
సుతానందనబంధకాయ
సర్పాక్షిజాతాయ
అనంగాయ
కర్మరాశ్యుద్భవాయ
ఉపాంతేకీర్తిదాయ
సప్తమేకలహప్రదాయ
అష్టమేవ్యాధికర్త్రే 80
ధనేబహుసుఖప్రదాయ
జననేరోగదాయ
ఊర్ధ్వమూర్ధజాయ
గ్రహనాయకాయ
పాపదృష్టయే
ఖేచరాయ
శాంభవాయ
అశేషపూజితాయ
శాశ్వతాయ
నటాయ 90
శుభాశుభఫలప్రదాయ
ధూమ్రాయ
సుధాపాయినే
అజితాయ
భక్తవత్సలాయ
సింహాసనాయ
కేతుమూర్తయే
రవీందుద్యుతినాశకాయ
అమరాయ
పీడకాయ 100
అమర్త్యాయ
విష్ణుదృష్టాయ
అసురేశ్వరాయ
భక్తరక్షకాయ
విచిత్రకపోలస్యందనాయ
విచిత్రఫలదాయినే
స్తుతాయ
భక్తాభీష్టఫలప్రదాయ 108

# 172. అభినుతి

క్రింద సూచించిన స్తోత్రములలో ఏదో ఒక దానిని నిత్యం పఠించిన కేతుగ్రహానుగ్రహం పొందవచ్చును.

## కేతుగ్రహ కవచ స్తోత్రమ్

అస్య శ్రీకేతుకవచస్తోత్ర మహామంత్రస్య పురందరఋషిః, అనుష్టుప్ఛందః కేతుర్దేవతా, మమ కేతుగ్రహప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః, రామిత్యాదిషడం గహృదయాదిన్యాసః, భూర్భువస్సువరోమితిదిగ్బన్ధః

**ధ్యానమ్:-**

ధూమ్రవర్ణం ధ్వజా కారం ద్విభుజం వరదాంగదం ।
చిత్రాంబరధరం కేతుంచిత్రగంధాను లేపనమ్, 1
వైడూర్యాభరణం చైవ వైడూర్య మకుటం ఫణిం ।
చిత్రంకఫాధికరసం మేరుం చైవాప్రదక్షిణమ్ ॥ 2
కేతు కరాళవదనం చిత్రవర్ణం కిరీటినం ।
ప్రణమామి సదాదేవం ధ్వజాకారం గ్రహేశ్వరమ్ ॥ 3
చిత్రవర్ణశ్శిరః పాతుఫాలం మే ధూమ్రవర్ణకః ।
పాతు నేత్రేపింగలాక్షః శ్రుతీమే రక్తలోచనః ॥ 4
ఘ్రాణం పాతు సువర్ణాభో ద్విభుజం సింహికాసుతః ।
పాతు కంఠం చ మే కేతుః స్కంధౌ పాతు గ్రహాధిపః ॥ 5
బాహూపాతు సుర శ్రేష్ఠః కుక్షిం పాతు మహోరగః ।
సింహాసనః కటింపాతు మధ్యం పాతు మహాసురః ॥ 6
ఊరూ పాతు మహాశీర్షో జానునీచ ప్రకోపనః ।
పాతు పాదౌ చ మే రౌద్రః సర్వాంగం రవిమర్దకః ॥ 7

**ఫలశ్రుతి :-**

ఇదంచకవచం దివ్యం సర్వరోగ వినాశనం ।
సర్వ దుఃఖవినాశం చ సత్యమేతన్నసంశయః ॥ 8

ఇతి పాద్మ పురాణే కేతుకవచ స్సంపూర్ణః

# 173. అభివందనం

కేతుగ్రహానుగ్రహం కోసం క్రింద సూచించిన వాటిని ప్రతిదినం పఠించండి. కేతుగ్రహదేవతను కీర్తించండి.

## కేతుదోష నివృత్తికి మీనావతారస్తుతి

వేదోద్ధార విచారమతే సోమకదానవ సంహరణే
మీనాకార శరీరనమో భక్తం తే పరిపాలయమాం
నామస్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదానృహరే
(దశావతారములలో మీనావతారము పరమాత్మాంశ కేతు గ్రహము)

## కేతు గ్రహ మంగళాష్టకం

కేతుర్జైమిని గోత్రజః కుశ సమిద్వాయవ్యకోణేస్థితః
చిత్రాంక ధ్వజ లాంఛనోహి భగవాన్యో దక్షిణాశా ముఖః
బ్రహ్మాచైవతు చిత్రగుప్త అధిపః ప్రత్యాధి దేవస్సదా
షట్ త్రింస్థః శుభకృచ్చ బర్బరపతిః కుర్యాత్ సదా మంగళం ॥

## కేతుగ్రహ కీర్తన

రచన : శ్రీముత్తుస్వామి దీక్షితులు

తాళం : రూపకం

రాగం : చామరం

పల్లవి : మహాసురం కేతు మహం
భజామి ఛాయాగ్రహ వరం

అనుపల్లవి : మహావిచిత్ర మకుటధరం మంగళ వస్త్రాది ధరం
నరపీఠ స్థితం సుఖం నవగ్రహ యుతం సఖం ॥మహావీర॥

చరణం : కేతుం కృణ్వాన్ మంత్రిణం క్రోధనిధి జైమినం
కుళుత్థాది భక్షణం కోణ ధ్వజ పతాకినం
గురుగుహ చామర భరణం - గుణదోష జితాచరణం
గ్రహణాది కార్యకారణం - గ్రహాపసవ్య సంచారిణం ॥ ॥మహా॥

# 174. కేతుగ్రహదోష నివారణకు ప్రత్యేక స్తోత్రాలు

## గణేశ స్తుతి



శ్లో॥ తారేశ విబుధాః కళంకమనిశం సంత్యజ్య సర్వాః కళాస్సం
గృహ్యాత్మను మోద భారమతులం గచ్ఛంతి యద్వత్తథా।
శ్రీమన్మూషక వాహన స్తుతి లసత్పద్యేషు హృద్యేషు నో దోషా
శ్చే ద్విబుధా విసృజ్య సుగుణాన్ గృహ్ణంతు మోదంతు భోః ॥

శ్లో॥ బాలార్క కోటి ద్యుతి మప్రమేయం
బాలేందు రేఖా కలితోత్త మాంగం ॥
భ్రమత్ ద్విరేఫావృత గండ భాగం
భజే భవానీ తనయం గణేశం ॥

## శ్రీ విఘ్నేశ్వర దండకం

శ్రీ పార్వతీపుత్ర లోక త్రయీస్తోత్రసత్పుణ్యచారిత్ర భద్రేభవక్త్రా మహాకాయ కాత్యాయనీనాథ సంజాతస్వామి శివా, సిద్ధ విఘ్నేశ నీ పాదపద్మంబులున్ నీదు కంఠంబు నీ బొజ్జనీమోము నీ మౌళి బాలేందుఖండంబు నీనాల్గు హస్తంబులు న్నీ కరాళంబు నీ పెద్ద వక్త్రంబు దంతంబు నీవామహస్తంబు లంబోదరంబున్ సదామూష కాశ్వంబు నీ మందహాసంబు నీ చిన్నితుండంబు నీ గుజ్జు రూపంబు నీ శూర్పకర్ణంబు నీ నాగయజ్ఞోపవీతంబు నీ దివ్యరూపంబు దర్శించి హర్షించి సంప్రీతి మ్రొక్కంగ శ్రీగంధము స్గుంకుమం బక్షతల్లాజులున్ పంచకంబుల్ తగన్ మల్లెలు న్మొల్లలు న్మంచిచేమంతులున్ దెల్లగన్నేరులున్ మంకెనల్ పొన్నలున్ పువ్వులు న్మంచిదూర్వంబులన్దెచ్చి శాస్త్రోక్తరీతిన్ సమర్పించి పూజించి సాష్టాంగమున్ చేసి విఘ్నేశ్వరా నీకు టెంకాయ పొన్నంటిపండ్లున్ మరిన్మంచివా

విక్షుఖం దంబులు గ్రేగుబం ధ్లప్పుడాల్ వడల్ నేయిబూరెల్ మరిం గోధు మప్పంబులున్ వడల్ పున్గులున్బూరెలు న్గారెలున్ చొక్కమౌ జల్మిడిన్ బెల్లము న్దేనియుం జున్ను బాలాజ్యమున్నాను బియ్యంబు నామ్రంబు బిల్వంబు మేల్ బంగరున్ బళ్లె మందుంచి నైవేద్యమున్ బంచనీరాజనంబుల్ నమస్కారముల్, చేసి విఘ్నేశ్వరా నిన్ను పూజింపకే యన్యదైవంబులన్ బ్రార్థనల్సేయుటల్ కాంచనం బొల్లకే నిన్ను దాగోరుచందంబుగాదె మహాదేవ యో భక్తమందార యోసుందరాకార యోభాగ్యగంభీర యోదేవచూడామణీ లోకరక్షామణీ బంధుచింతామణీ స్వామి నిన్నెంచ నేనెంతవాడ న్నన్నిప్పుచేబట్టి సుశ్రేయునింజేసి శ్రీమంతుగాజూచి హృత్పద్మ సింహాసనా రూఢతన్నిల్పి కాపాడుటేకాదు నిన్గొల్చి ప్రార్థించు భక్తాళికిం గొంగు బంగారమై కంటికిన్ రెప్పవై బుద్ధియు న్విద్యయు న్వాడియున్ బుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్ గల్గగా చేసి పోషించుమంటిన్ గృపన్ గావుమంటిన్ మహాత్మా యిదే వందనంబుల్ గణేశా నమస్తే నమస్తే నమస్తే నమః ॥

## 175. యంత్రస్థాపనం

కేతు గ్రహానుగ్రహం కోసం

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై రాయించి, దానిని పూజించాలి.

| | | |
|---|---|---|
| 14 | 9 | 16 |
| 15 | 13 | 11 |
| 10 | 17 | 12 |

పై యంత్రమును "ఓం స్రాం స్రీం స్రౌం సః కేతవేనమః" అను మంత్రమును 7,000 సార్లు జపించి పూజించాలి.

**కేతుగ్రహ దోష నివారణకు (భృగు సంహింత) :-**

ఈ క్రింది యంత్రమును రాగిరేకుపై రాయించి "ఓం హ్రీం క్రూం క్రూర రూపిణే కేతవే ఐం సౌః స్వాహా అను మంత్రమును 28,000 సార్లు జపం చేసి యంత్రానికి ధారపోసి దానిని సన్యాసికి దానం చేయాలి






## మీ జీవితంలో అశుభ ఫలితాల తీవ్రత తగ్గించేది
## ఈ సమగ్ర నవగ్రహ అనుగ్రహము

విశ్వచక్రాన్ని పాలించి, మానవుల సమస్త దైహిక- మానసిక హావ భావాలపైన ప్రభావాన్ని చూపే నవగ్రహాల గురించి మొట్ట మొదటిసారిగా తెలుగులో సమగ్రంగానుసుబోధకంగాను ఒక "బృహత్ప్రయత్నం"గా వెలువరిస్తున్న విస్తృత పుస్తకరాజం ఇది!

దీనిలో.....

- రాశి- నక్షత్ర- గ్రహ- దిక్ బలాలు
- గ్రహ గుణగణాలు- కారకత్వాలు
- స్వభావాలు- శక్తులు- శత్రుమిత్రత్వాలు
- గ్రహవీక్షణాలు- దృష్టులు
- ద్వాదశ లగ్నభావాలు- మహాదశలు
- ధనయోగాలు
- ఆరోగ్య అంశాలు
- విద్య, వివాహ- సంతాన విషయాల్లో గ్రహాల ప్రభావాలు
- నవగ్రహాలకు ఆరాధన
- నవగ్రహాలకు రుద్రాభిషేకం
- నవగ్రహాలకు మూలికలు
- నవగ్రహాలకు దానాలు
- నవగ్రహదోషాలు- పరిహారాలు (రెమెడీస్)
- లాల్‌కితాబ్ ప్రకారం గ్రహాలు
- నవగ్రహాలకు జప-హోమ- మంత్ర- తంత్రాలు
- నవగ్రహ అర్చన- యంత్రాలు
- నవగ్రహానుగ్రహానికి క్షేత్ర సందర్శన

......ఇలా వివరిస్తూ పోతే ఇందులో స్పృశించని అంశంలేదు. వివరించని విషయం లేదు. ఈ ఒక్క పుస్తకం మీవద్ద వుంటే దాదాపు ముఖ్య జ్యోతిష గ్రంథాలలు ఓ వంద మీ ఇంట ఉన్నట్లే!

ఏ సందేహం తీరాలన్నా ఈ గ్రంథాన్ని సంప్రదిస్తే మీకు మీ సందేహ నివృత్తి తథ్యమన్నట్లే!